వడసి మహితాంధ్రసాహిత్య పరిషదధి ప
తిత్వమును బూని భారతీదేవి నెపుడు
ప్రీతి నర్చించి 'డాగ్దరు' బిరుదమలర
విజయవాడాన్వయపుఁ గీర్తి విస్తరిల్లు
రీతి వర్ధిల్లు 'గోపాలరెడ్డి నృపతి
ఈ కృతికిఁ గోరినంతనే యాదృతరము
పీఠిక రచించి యొసఁగెను. విశ్వమయుని
భాసుర కటాక్షముల కెప్డు పాత్రులైన
వారికి దె మత్కృతజ్ఞతా వావదూక
విమలవాక్సుమ హార మర్పించినాఁడ
చంద్రునకు నూలుపోగన్న చందమొప్ప.

ఈ సందర్భమున మఱియొక విశేషము విన్నవించుకొనుచున్నాఁడను.

సుమారు 20 దినముల క్రిందట డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు తమవద్ద కప్పుడపుడే తెచ్చియిచ్చిన తెలుఁగు రాజతరంగిణి నొకదానిని నాకుఁ జూపిరి. అయ్యది కేవలము వచనరూపమున నున్నది. క్రీ. శ. 1906 లో ముద్రింపఁబడినది. రచయిత పోలవర సంస్థానాధిపతి శ్రీ కొచ్చర్లకోట రామచంద్ర వెంకటకృష్ణరావు బహదరు బి. ఏ, గారు. అదియును ఏఁడు (7) తరంగముల యాంధ్రీకృతి పరిమితితోడనే యున్నది. 70 సంవత్సరముల క్రిందటనే (నా పుట్టుకకుముందు నొక సంవత్సరము క్రిందటనే) కల్హణ మహాకవి కృతికి సంక్షిప్తాంధ్ర వచనానువాద కృతి వెలువడినది యని నా కిప్పుడు తెలియుట కెంతేని యాశ్చర్యపడితిని. మిగుల నానందించితిని. కల్హణకవి కీర్తి వల్లీమతల్లి తెలుఁగుఁ బూఁతోఁటలో నుల్లసిల్లి సుమనోమనో వినోదము గల్గించునేని ధన్యుఁడ నయ్యెదను.

మఱియును, శ్రీరంజితపండితుఁడు (క్రీ. శే. శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ పండితుని బావ గారు) రాజతరంగిణి నాంగ్లభాషయందు సంపూర్ణముగ (అష్టమతరంగము గూడ) ననువదించి యున్నారు. ఆ యనువాదము, ఒక్కొక శ్లోకమునకు సంఖ్యాక్రమము ననుసరించి రచించిన యాంగ్ల తాత్పర్యరూపముతో నున్నది. శ్రీ రంజితపండితుఁడు (R. S. Pandit) సంస్కృతాంగ్లభాషలందు 'గొప్ప విద్వాంసుఁడు. అని వారి యనువాదము స్ఫుటీకరించుచున్నది. ఇంకను నాంగ్లానువాదముల పరిపూర్ణము లున్నవని తెలియుచున్నది. R, S. Pandit చేసిన యనువాదము సర్వ విషయ సంపూర్ణమై యున్నది. కల్హణ కవిరాజు కీర్తిచంద్రిక దేశకాలనియతి లేక యెల్లపుడు నెల్లదేశముల వెలుఁగు నిచ్చునదనుటకు సందియములేదు.

## అగ్నిపురాణము

శ్లో॥ నరత్వం దుర్లభం లోకే విద్యాతత్ర సుదుర్లభా
కవిత్వం దుర్లభం తత్ర శక్తిస్తత్ర సుదుర్లభా॥

ఓమ్. తత్. సత్.

సుకవిరాడ్విధేయుఁడు,
స్వయంపాకుల వేంకటరమణశర్మ.

## గణపతి స్తుతి

ఉ॥ మత్కవితా స్రవంతి బుధ
మానస సీమల విండి మోద సం
పత్కృషి మూల మౌట కిథ
వత్తు పదాబ్జము లాశ్రయింతు: "దీ
వ్యత్కృపఁ జూడు; మంచు" విజ
యంబు ఘటింపు: మటంచు నెమ్మదిన్
దత్కమనీయవుం గనుల
దాగెడు చిర్నగవున్ భజించెదన్.

## సరస్వతీ స్తుతి

ఉ॥ పల్లవపాణి! భారతి! య
భంగుర నిర్మల భక్తి భావ సం
ఫుల్ల మదీయ హృత్కమల
పుం జిఱు గద్దియఁ జేర్చి విన్న నే
నెల్లపుడున్ భజింతుఁ. గృప
యేర్పడ మత్కవితా విపంచికన్
బల్లవితం బొనర్చి రస
వత్కవన క్వణమున్ సృజింపుమా.

## పరదేవతా స్తవము

సీ॥ సర్వ సర్వంసహా చక్ర నిర్వాహక
భూరి తేజంబుతోఁ బొదలు వాని
ప్రాణముల్ సొగయించు బహు వస్తు సృష్టి వి
దానమై కానంగ రాని వాని
వక్త్రంబు వక్షంబు వామాంగ భాగము
స్త్రీ పరం బొనరించి చెలఁగు వాని
మనుజాళి యొనరించు మంచి చెడ్డలకు ని
ష్పక్ష పాత ఫలంబుఁ బంచు వాని

గీ॥ గండశిలలను విసరుచుఁ గాలి వహ్ని
నుమియుచును జీవనీయంబు నొసఁగు వాని
వాఙ్మనస గోచరము గాక వరలు వాని
నా పరాత్పరు సద్భక్తి నాత్మఁ గొలుతు.

## సుకవి ప్రశంస

గీ॥ సంస్కృతాంధ్ర మహాకవి సాహితీ సు
ధా ధునీ రంగ దుత్తుంగ తర తరంగ
సంగి, నా మానపు హంస; సారెసారె
కమ్మహాత్ముల నెల్లర నభినుతింతు.

## అనువక్త

గీ॥ పావన శ్రీ స్వయంపాక వంశ వార్ధి
చంద్రు 'శ్రీ వేంకటప్పార్య' జనకు విబుధు
మాత వేంకలక్ష్మ్యంబ, మాన్య శీల
నిత్యము భజింతు సద్భక్తి నెమ్మనమున.

క॥ విద్వన్మహాకవీంద్ర ల
స ద్వాణీ ద్వయ కవిత్వ సంచారుఁడ, సం
వి ద్వేద్య 'శ్రీ మాతృ' ప
ద ద్వంద్వ సరోజ మధు సుధా జీవనుఁడన్.

శా॥ భారద్వాజ పవిత్ర గోత్ర మహితా
పస్తంబ సత్పుత్రుఁడన్
శ్రీ రమ్యోజ్జ్వల శేష భూమిధర సు
క్షేత్ర ప్రభు శ్రీ కటా
క్షారూఢోభయ సాహితీ సుకవి తా
వ్యాహార సౌరభ్య సం
భారుండన్, గవిరాడ్విధేయుఁడఁ బ్రజా
బంధు ప్రబంధ జ్ఞుఁడన్.

కం॥ వేంకట నాథాద్వయపద
పంకేరుహ సక్త చిత్త బంభరుఁడను నే
'వేంకటరమణ' కవిని క్షే
మంకర కల్యాణ కవీంద్ర మహితాదరుఁడన్.

యస్. ఏ. ఆర్. శర్మ

# రత్నపీఠిక

## (భారతదేశ చరిత్ర)

శ్రీ మహనీయ భారత ధ
    రిత్రికిఁ బావనతన్ ఘటించు శ్రీ
రామ చరిత్ర యన్ సుమధు
    ర స్పృహణీయ సుధా తరంగిణిన్
క్షేమ విధాయి భారత వి
    శిష్ట చరిత్ర మధు స్రవంతికన్
ప్రేమముతోడ నిత్యము ము
    నింగి తరింత్రు భవాబ్ధి మానవుల్. 1

శ్రుతి మూలం బగు సర్వ ధర్మముఁ దప
    శ్శుద్ధాత్ము లౌ తాపసుల్
స్మృతులన్ గూర్చిరి; అద్ది సర్వ జనతా
    క్షేమంకరం బౌట నై
యితిహాసంబుల సంతరించిరి తగన్
    హేరాళమై యొప్పఁగా:
మతిమంతుల్ గమనింతు రిట్టి భరత
    క్ష్మా భవ్య చారిత్రమున్. 2

వైదికము లౌకికం బైన వ్యవహృతులకె
చరిత మను పేరు చెల్లును చర్చ సేయ;
అదియు మౌనీంద్ర కృతి నితిహాసమయ్యె
అట్టి యితిహాసమే చరిత్రాగమంబు: 3

చరితము చారిత్రంబును
చరిత్రమును శీలమును విచక్షణు లెంతో
యరసి సమార్థము లవి: రా
యరిత్ర తుల్యము చరిత్ర మగు నిష్పత్తిన్. 4

మది నూహింపఁగ రాని సంస్కృత వచో
    మాధుర్య మాహాత్మ్యముల్
పదిలంబై తనరార రత్న విలస
    న్మంజూష యా వ్యాకృతిన్.

కొదవ లేకుండ మునిత్రయం బొనరిచెన్
గుప్తార్థముల్ దెల్ప న
య్యదియే దిక్కు. చరిత్ర మన్ పదము వ్యా
ఖ్యానింప నొండే దిఁకన్? 5

కావున నడవడి సాధన
మే వివరింపఁగఁ జరిత్ర మెందేనియు. వి
ద్యా విభవ ప్రతిభా సం
భావిత మతు లైన వారు భావింతు రిటుల్. 6

భారత భూమి పున్నెముల
పంటపొలం. బటుగాన, నార్ష వి
ద్యా రుచిర స్వభావులు మ
హర్షులు సద్గుణ సౌరభాఢ్య క
ల్హారములై దనర్చు నితి
హాసములన్ రచియించినారు సం
సార మహార్ణవో త్తరణ
సాధన నౌకలుగాఁ బ్రజాళికిన్. 7

కల్హణకవీంద్రుఁ డార్ష సంస్కార సరణిఁ
దప్పనీకుండ బహు విధాధారములను
పేకరించి రచించెఁ గాశ్మీర రాజ
చక్ర చారిత్ర గాథల సక్రమముగ; 8

అలఘు ఖ్యాతినిఁ గన్న యా విజయసిం
హాఖ్యుండు పంద్రెండు వం
దల క్రీస్త్వబ్దపు వేళ విద్యలకుఁ గేం
ద్రం బైన కాశ్మీర మం
డల రాజ్యంబును నేలె. నా ప్రభుని దం
డన్ చంపకాఖ్యుండు మం
త్రులలో ముఖ్యుఁడు నయ్యెఁ గాంచెఁ గవిచం
ద్రున్ గల్హణున్ సత్సుతున్; 9

కాశ్మీరము

శ్రీ విలాసాల సౌధంబు చెన్ను మీఱు
శారదకు లాస్య భవనంబు, సౌఖశాయ
నికము, గాశ్మీర వసుధ వర్ణింపఁ దరమె?
ప్రకృతి కాంతా లలామ దర్పణము చూవె. 10

హైమవతికి సపత్ని యౌ నమరధుని. స
రస్వతి, వితస్త, మొదలౌ తరంగిణులును
అద్రిరాజును దృశ్యంబు లౌచునుండఁ
దనరుఁ గాశ్మీర మిల స్వర్గధామ మనఁగ: 11

దివ్య మగు కుంకుమపుఁ బువ్వు భవ్యరత్న
కంబళంబులు, పీతాంబరంబు లున్ని
శాల్వలును, గమ్మఁదనపు ద్రాక్షయును బుట్టు
తావు, కాశ్మీర మాశారదకును తావు: 12

ఆకసము దాకు శారదా హర్మ్యములును
స్వర్గ దుర్లభ మైన ద్రాక్షయును, రుచిర
కుంకుమము తేనె సోనలు గురియు తుహిన
వారియుఁ బ్రజాళి సొమ్ము కాశ్మీరమందు 13

కలకండ పెళ్ళల తళుకుల గ్రేణించు
హిమ ఖండములతోడ నెనకమెనఁగి
తులలేని కలిమి సొంపులు గలయట్టి కుం
కుమ ఘుమంఘుమలు దిక్కులకు నెఱపి
ఘనసార రస మెంత దనిపించు మంచు సో
నల జలంబుల మహానంద మొసఁగి
ముక్కారుఁ బండెడు మురిపంపుఁ గేదార
ముల సస్యముల మహామోదము గూర్చి
రకరకంబుల ద్రాక్ష లరంటు లాది
తోఁటలయుఁ బూలతోఁటల సీటు గల్గి
శారదావాస మౌచుఁ గాశ్మీర మొప్పు,
భూతల స్వర్గ మది, దానిఁ బోలు నేది? 14

"తెనె ధారలో యమృతంపు దివ్య ఝురులో"
యనఁగ జాల్వారుచుండు నీహార కుల్య
లద్భుతంబుగఁ గాశ్మీరమందు. శివుని
మామగారి మహాభాగ్య మహిమ మలర 15

రత్నగర్భయె యీ జగత్త్రయమునందు
శ్రేష్ఠ మందుఁ గుబేరది క్సీమ మహిత:
మందు గౌరీగురుండు హిమాద్రి ఘనుఁడు
సారతర మింక నందుఁ గాశ్మీరవసుధ. 16

## గ్రంథావతరణము

ఈ కాశ్మీరము భారతీయధరః బ్రా
    హ్మీమూర్తి కాణాచియై
నాక శ్రీ దలపింపఁజేయుఁగదః "గో
    నందాదు లద్దాని న
స్తోకోత్సాహముతోడ నేలిరిః జగ
    త్పూజ్యుండు కృష్ణుండు, సు
శ్లోకుల్ పాండవు లుండి రట్టి తఱి
    నా చొప్పెందుఁ గాన న్దగున్. 17

ద్వాపరాంతంబున న్భారతంబు నడచె.
ననుట యంగీకృతంబు గాదని మనీషి
కల్హణుం డొక శాస్త్ర సంస్కారరీతిఁ
జూపె. నదియు విమర్శ వస్తువు దలంప. 18

అల బృహత్సంహితాకారుఁ డగు వరాహ
మిహిరు 'నక్షత్ర చారంబు' మితినిఁ గలియు
గాది నార్నూర్లు నేఁబది యందుఁ మీఁద
నబ్దములు మూఁడుఁ గడచిన యట్టి వేళ; 19

ధార్తరాష్ట్రులు పాండవుల్ ధరణికొఱకు
పోరితము సల్పి రారణభూమిఁ బడిన
వారిలో నొక్కఁ డల్ల కాశ్మీర భర్త
యయ్యె గోనందుఁ. డిట్లు కల్హణుఁడు దెల్పె. 20

ఆదిగోనందుని చరిత్ర మాది గాఁగ
సకల రాజన్య చరితముల్ సంతరించి
కడపటన్ గూర్చెఁ గవిరాజు కల్హణ కవి
విజయసింహావి చరితంబు విస్తృతముగ 21

అంతమాత్రంబె గాక యీ యఖిల భార
తావనినె గాక యాయాయి దీవులందు
వెలసి యుండిన చారిత్ర విషయములను
వింతలను రాజతరంగిణి వెల్లడించు. 22

# శ్రీ రాజతరంగిణి

## దాని ప్రాశస్త్యము

వేద వేదాంగ శాస్త్ర కోవిదులు సుకవి.
సార్వభౌములు సాహిత్య సరస గాన
నృత్య బహు శిల్ప సత్కళా నిధులు దీనఁ
గలరు: వారల చరితంబు కర్ణ హితము. 23

ఆ యన్నపూర్ణ షడ్రస
భూయిష్ఠము ప్రజకు నమృత భోజన మిడఁగా
యీ యుద్గ్రంథము నవరస
భూయిష్ఠము భవ్య మమృత భోజన మొసఁగున్. 24

ఈ కబ్బంబు మహార్హ వస్తు గుణ భూ
యిష్ఠం బపూర్వార్థ: మ
స్తోకోల్లాసము, సాహితీ పటిమయున్
సూక్ష్మేక్షికా శక్తియున్

లోక జ్ఞానము ధర్మ బుద్ధియును గ
ల్గున్ దీన: లోభంబు చా
ర్వాకత్వంబును గ్రూరతా ద్యవగుణ
వ్రాతంబు దూరం బగున్. 25

రాజతరంగిణిన్ గలుగు
రమ్య తరంగములందుఁ గల్హణుం
డా జగ దేక దంపతుల
నవ్యయ రూపుల నాద్య పద్య వి
భ్రాజితు లౌనటుల్ పరమ
భక్తి నుతించె నుమామహేశులన్
ధీ జడిమన్ హరించు నవి
తేజ మొసంగుఁ బఠించువారికిన్. 26

ఒకచోట శృంగార ముప్పొంగు చుండును.
ఒకచోట వీర ముద్వేల మగును.
ఒకచోట నద్భుతం బురవడించుచు నుండు.
నొకచోట రౌద్ర మత్యుజ్జ్వలమగు.

నొకచోఁ గరుణరసం బోడిగిల్లుచు నుండు
నొకచోట హాస్యంబు నుబుకుచుండు
నొకచో భయానకం బుప్పరంబును దాఁకు.
నొకచోట బీభత్స ముబ్బతిల్లు.

శాంత రస మంతటను లోన జాలు వాఱి
యల సరస్వతి వోలె నిశ్చలత నొందు.
ఇట్లు నవరసములకుఁ బుట్టిల్లుగాఁగ
నొప్పు నీకృతి మహిమంబుఁ జెప్పఁదరమె? 27

నవ్య గుణ యుక్తమైనట్టి నారికేళ
పాక రుచి, యిందు కదళికా పాక రుచియు
ద్రాక్ష పాకంబు చవియును రసపిపాసు
వులకుఁ బ్రత్యక్షమౌ మది పులకరింప. 28

కల్హణ మహాకవి

సరస సంస్కృత సాహితీ సౌరభంబు
రాజుల చరిత్ర యను మహారామ సీమ
నుండి నల్గడ సత్కవీంద్రుండు కల్హ
ణుండు నిండించె గంధవాహుండువోలె. 29

జంగమ స్థావర ప్రాణి సముదయమున
గుప్తమౌ భావములఁ గూర్చి గుణవికాస
రక్తి గల్గించు మౌక్తిక సూక్తు లలర
కవిత సెప్పెను కవిరాజు కల్హణుండు. 30

ప్రవిమల సంస్కృత వాఙ్మయ
సువిస్తృత వ్యాకరణ విశుద్ధోదార
శ్రవణ సుభగ ప్రయోగ
వ్యవహారుఁడు కల్హణుఁడు మహాకవి వసుధన్ 31

విధి విలాసంబుచేఁ గల్గు వింతలెల్లఁ
బ్రకృతియందలి బహువిధోపమలతోడఁ
గూర్చి పఠితల మనసులం గోర్కెలుబ్బఁ
గబ్బము రచించె కల్హణ కవివరుండు. 32

కలకంఠముల రావముల కల్మిని హరించు
      పలుతెఱుంగుల గ్రుల్కు పల్కు లొకట.
కంఠీరవ ధ్వనిఁ గుంఠీభవింపఁగఁ
      జేయు వాక్ప్రౌఢి వైచిత్రి యొకట.
కులకాంత మదిలోని గుప్త భావము దెల్పు
      చందంబు గల పల్కు చదురు లొకట.
విధివిలాసముల వైవిధ్యంబు ప్రకృతి సం
      గతి నొందఁ జేయు సంగతులు నొకట;

గలుగఁ బఠితల డెందముల్ పులకరింపఁ
జేయు నవరస భావముల్ చిప్పిలంగఁ
జిక్కఁదన మొప్పు బహువిధ శిల్ప మడరఁ
గూర్చెఁ గల్హణకవి కావ్య కోశ మిందు 33

ఆ కవి పట్టి నట్టి కల
      మందున వాలిన రత్నరాశి య
స్తోక విచిత్ర వాఙ్మయపు
      సొన్నపుఁ గుడ్యములందు శాశ్వత
శ్రీకముగాఁ దనర్చును జ
      రిత్రలయందును మేలు బంతియై.
లోకమెఱుంగుఁగాక మది
      లోచనమున్ దగ విప్పి నేర్పునన్ 34

మొగమోటం బిసుమంత లేక చరిత్రం
      బున్ వ్రాయువా రెందఱుం
డ్రు గణింపన్? మఱి యందునన్ సుకవితా
      రోచిష్ణు మార్గంబునన్
దగ జారిత్రము వ్రాయఁగల్గు కవిస
      ర్దారుల్ గనన్ లెక్క కీ
జగమం దెందఱు? కల్హణుం డుభయమున్
      సాధించె నీ సత్కృతిన్. 35

# ఉభయ (కవి, కావ్యముల)

## ప్రశంసలు

కార్పణ్యాటవిఁ గాల్చు దావము జగ
త్కల్యాణకృ న్మార్గమున్
జేర్పం జాలిన యాన సాధనము రా
శీభూత సాహిత్యపున్
దీర్పుల్ నేర్పెడు న్యాయ మందిరము వ
ర్ణింపంగ శక్యంబె? మే
ల్యార్యా రాజతరంగిణిన్ సుకవి మా
ర్గున్ గోవిదున్ గ్హ్లణున్. 36

ఆ కవి సార్వభౌముని య
నర్గళ వాఙ్మయ చిత్ర సూక్తు ల
స్తోకము. అందు నీ ప్రకృతి
సుందరి సొంపు తటిల్లతాభమౌ.
లౌకిక పారలౌకిక ఫ
ల ప్రభవామృత సత్కవిత్వ ధా
రా కమనీయ క్హ్లణుని
రాజతరంగిణిఁ దెల్ప శక్యమే! 37

మందుల బృహస్పతులఁ జేయు మహిమ నొప్పు
కావ్య శిల్పంబుఁ జూపెను గ్హ్లణకవి.
అమ్మహాకవి ప్రతిభ సూర్యాంశుమాల
యౌను. రాకా సుధాంశుని యాతపంబు
నౌను: నొక్కొకచోట మహాసిధార
యౌను. దెలుపంగ నెవ్వని కగును దరము? 38

మున్నెన్నఁడు నిట్టి కృతిన్
గన్నది విన్నదియు లేదు. క్హ్లణ కవిరా
ణ్ణెన్నఁగ నెట్టి తపస్వియొ!
పున్నెము గట్టుకొని కృతినిఁ బుడమి వెలార్చెన్. 39

# 43

## కొన్ని విశేషములు

తొలకరి మెఱుపుం దీఁగల
వలెఁ గల్హణు కృతిని రాజ వంశ చరిత్రం
బులు కొన్ని యొప్పుచుందును.
విలసిల్లెడుఁ గొన్ని మేరు వింధ్యములవలెన్. 40

ఇఁకఁ గొన్ని వాసనలు లే
క, కనులకున్ దళుకుఁ జూపి కమరెడు కుసుమ
ప్రకరంబుల గతిఁ దోఁచుచుఁ
గుకవి రచనలకును దోడగుచు నుండు నిటన్ 41

మనమునఁ గ్రోధంబు జుగు
ప్సను బుట్టఁగఁ జేయుఁ గొన్ని వాకొనని మా
కొనఁ గానివి; యైనను గ
ల్హణ కవి క్షమతోడఁ జెప్పె నార్యుండౌరా! 42

అన్నిటికి విధి విలాసం
బెన్నఁ దగిన దంచు నా కవీంద్రుఁడు ప్రతిభన్
గన్నన్ జక్కఁగ విప్పి ప్ర
సన్నుండై వెల్గెఁ బ్రకృతి సాక్షాత్కృతిమై 43

దైవిక మైన చిక్కులకుఁ
దాల్మిని వీడక ధర్మ మార్గ సం
భావనతోడఁ గార్యముల
పట్టును బాయని వాని కెన్నడేన్
దైవము తోడ్పడున్; విధి వి
ధాన మదట్టులఁ గానిచో. యశ
శ్శ్రీ విభవంబు గల్గుటది
సిద్ధము; తెల్పెఁ గవీంద్రుఁ డీకృతిన్ 44

పాపుల దుశ్చరిత్ర మను
పంకము డొంకలఁ ద్రోయుచున్ జగ
ద్వ్యాపక మైన సజ్జనుల
యద్భుత గాథలతో నగాధమై

దీపిత నవ్య భావ మణి
        దీప్తుల పూర మవారి నింపుచున్
ప్రాపయి తేజరిల్లునది
        రాజతరంగిణి యెల్లవారికిన్ 45

రాజకీయంబులే గాదు; రమ్యములగు
న్యాయవుం దీర్పులే గాదు, నవ్యములగు
నగర నిర్మాణములె గాదు; నాణ్యమైన
సేతుబంధనములె గాదు; చిత్ర చిత్ర
దేవతాయతనంబులు దివ్యములగు
బౌద్ధుల విహారములును నభ్రంకషంబు
లైన సౌధాల వరుసలు, నద్భుతంబు
లై ప్రసూనాస్త్రునకును నాయతనములయి
నందనారామ సౌందర్య మందు కొన్న
సుందరారామములును బల్సొగసు మీఱ
వీనులకుఁ గన్నులకుఁ గడు విందొనర్చు
మెప్పు నొందిన యట్టి కాశ్మీర వసుధ
బింబితం బయ్యె మణిదర్పణంబుఁ బోలు
భవ్య రాజతరంగిణీ కావ్యసరణి;
మఱియు నెన్నెన్నొ ప్రకృతిలో మాటువడిన
యద్భుత విశేషములఁ గాన నగును నిందు గీ. మా. (46-49)

పాలక పాల్యవర్గముల
        పద్ధతు లెట్టివి యైన నీధరన్
శ్రీ లలనా కటాక్షముల
        చెల్వపు వెన్నెల గాయు; నట్టి భూ
పాలుర స చ్చరిత్రములు
        పాపు లొనర్చిన క్రూర నీచ కృ
త్యాలును వర్ణితంబు లిట
        దర్పణ మియ్యది వానిఁ గన్గొనన్; 50

ప్రజల దుర్ణయమును ఱేఁడు, రాజు దుర్న
యమును బ్రజలును బోకార్చ నతికఠోర
నిరశన వ్రతము లొనర్చి నెగ్గి యుండు
ఘట్టముల యద్భుతం బిందుఁ గానవచ్చు 51

సాహస కార్యులై యపయ
      శంబు యంశంబును గాంచినారు ని
ర్వాహకు లిందుఁ గొందఱు నృ
      పాలురు; కొందఱు ధర్మ పాలనో
త్సాహ నితాంత శాంత గుణ
      సంభృత పావన చిత్త వృత్తులై
దేహము నొడ్డి ధైర్యమున
      దేవు ననుగ్రహ మొంది రెంతయున్. 52

ఎంతెంతో క్రూరత "రా
జ్యాంతే నరకం ధ్రువ మ్మ"టను సూక్తికి దృ
ష్టాంతములు గాఁదగిన దు
ర్దాంతులు గల రిందు ఘోర రాక్షసులు నృపుల్. 53

ఆభిచారిక క్రియా ప్రయోగంబున
నన్న తమ్ముఁ దమ్ముఁ డన్న, నట్లె
తండ్రి సుతుని, సుతుఁడు తండ్రినిఁ జంపించి
రకట! క్రూర రాక్షసాపశదులు! 54

రాజులు రాజ బంధువులు
      రాణులు రాజ కుమారు లార్య సా
మాజిక మంత్రివర్యులు ను
      మాపతి మాపతి ముఖ్య దేవతా
పూజ లొనర్చుచుండి రట;
      భూరి మణి స్ఫుర దాలయ ప్రభా
భాజనమై నభస్థలము
      భాసిల నచ్చర లాడు రంగమై. 55

దేవతలవలనఁ బని గొని
యీవసుధన్ బ్రజకుఁ బరమ హిత మొనరింపన్
గా, వలఁతు లగుచు నొప్పిన
భూవిభుల చరిత్ర మిందుఁ బుష్పిత మయ్యెన్. 56

వేద వేదాంగ శాస్త్ర సంవేది సత్క
లా నవోదయ శిల్పి కల్హణ కవీంద్రుఁ
డ మ్మహాకవి శిల్పంబునందుఁ బ్రకృతి
దృశ్యముల లోని మర్మంబు దేటపడును. 57

నవ రసంబుల పుట్టిల్లు. నాగరికత
పూచి వాసించు నామని పూలతోఁట.
ధర్మ దేవత రత్న సౌధమ్ము; సకల
కళల కాశ్రయ మీకృతి కల్పలతిక. 58

## — వి జ్ఞ ప్తి —

ఫణిపతి వాగ్విభూతివలె
భావ గభీరము రమ్య వస్తు పూ
రణము చరిత్ర రాజ మిది
రాజతరంగిణి సత్కవీంద్రు క
ల్హణు కృతి సంస్కృతాంబునిధి
యందలి రత్నము; తెల్గుతల్లి భూ
షణముగ గద్య పద్యముల
సంగతి యేర్పడ సంతరించితిన్. 59

రాజతరంగిణీ మహిత
రంగ దభంగ తరంగ మాలికా
భ్రాజిత రమ్య వస్తు గుణ
రత్న మరీచులఁ గల్హణుండు నీ
రాజన మిచ్చినాఁడు కవి
రాజు సుపర్వుల వాణి; కమ్మహా
తేజముఁ గన్ను లద్దుకొని
తెల్గు సరస్వతి కార తిచ్చితిన్. 60

ఆ వెలుఁగు బాట మెలఁగు ప్ర
జావళి కిహ పర సుఖముల యాంతర్యము మే
ధా విభవము విద్యా వి
ద్యావిజ్ఞత లగును; గరతలామలకంబుల్. 61

షడ్రసంబుల వెలివేయు చవులఁ గూర్చు
నవరసంబుల కిది మహానస మటంచుఁ
దలఁపఁదగు; నీతరంగిణి తరఁగలందు
బుధులు రాయంచలై కాంత్రు భూరిసుఖము 62

ఓమ్ తత్ సత్.

—స్వయంపాకుల వేంకటరమణశర్మ.



శ్రీ పరదేవతాయై నమః

# రాజతరంగిణి

( మహాకవి కల్హణుని కృతికి ఆంధ్రీకృతి )

## ప్రథమ తరంగము

## మంగళాచరణము

శ్రీ మీఱన్ ఫణిరాట్ఫణామణి మరీచిస్తోమ నీరాజితుం
డై ముక్తిప్రదుఁడౌచు భక్తులకు నీహారాద్రికన్యా తపః
కాముండై సకలార్థ కల్పకమునై కామారియై పొల్చునా
వామార్ధాంగ కళత్రుఁ గొల్చెద నమోవాకంబుల న్నిత్యమున్.

సీ॥ ఫాలంబు వహ్నిశిఖాలాంఛితంబు వ
క్షంబహీనోల్లసత్కంచుకంబు
శ్రవణయుగ్మము సదాసంక్రీడ దభిరామ
కుండలిమండన మండితంబు
కమనీయ కంఠ ప్రకాశంబు జలధిజ
చ్ఛాయానిభంబౌట సమత నెగడు
వామదక్షిణ భాగ రామణీయకమున
నర్ధనారీశ్వరాహ్వాయము గాంచి

గీ॥ అనవరతసర్వమంగళాహ్లాది యగుచు
శాశ్వతైశ్వర్య నిరవధిస్థాన మగుచు
వరలు నానందమయ పరబ్రహ్మ మిలకు
సకల సంపత్సమృద్ధి యొసంగుఁగాత.

## సుకవి ప్రశంస

గీ॥ సరసగంభీర వాక్సుధా సారహారి
సుకవి యొక్కండు వంద్యుఁడౌ సకలజగతిఁ
దనకు నొరులకు నాచంద్ర తారకముగ
వెలయు సత్కీర్తి కాయంబుఁ గలుగఁజేసి.

గీ॥ కడు నతిక్రాంతమైనట్టి కాలమహిమ
కరము ప్రత్యక్ష దృష్టంబుగా నొనర్పఁ
జతురతర వస్తునిర్మాణచణుఁడు సుకవి
బ్రహ్మ దక్క మఱెవ్వండు వసుధఁ గలఁడు ?

గీ॥ సర్వ సంవేద్య భావ విస్తార మహిమ
ప్రతిభ యను దివ్యనేత్రంబు పటిమవలనఁ
గవి కనుంగొను నయ్యది గలుగదేని
కవి యనుచుఁ బిల్వ నన్యమౌ గమక మెద్ది ?

# గ్రంథప్రశంస

ఈ రాజ తరంగిణి యందలి కథాసందర్భమే మిగుల విరివియైనది. తదనుగుణముగఁ గావ్య వైచిత్రియు మిక్కుటముగ నుండెనేని పాఠకులకు వెగటు పుట్టించునని యట్లు రచింపలేదు. కాని, ఇందలి కవితా కళాకౌశలము సహృదయ హృదయంబుల నానంద రసతరంగ డోలామాలికల నోలలాడింపఁ జాలియున్నది.

# గ్రంథరచనా ప్రసక్తి

పూర్వకవి కృతమగు నితివృత్తమును గైకొని కల్హణ మహాకవి 'రాజ తరంగిణి, రచించి నంతమాత్రమున నీ గ్రంథ ప్రయోజనము నెఱుంగక సజ్జనులు తమ వైముఖ్యమును వెల్లడింతురా? రాగద్వేషముల దప్పులకు నెట్టి భూతార్థంబుల యథాస్థితముగను మనోజ్ఞముగను దెల్పు మధుర వాగ్విలాసము గల సుకవిగదా! సదా శ్లాఘనీయుఁడు.

ప్రాచీనులు గొందఱు మూర్ధాభిషిక్తుల యుదంతము నప్పటికప్పుడు వారు దెలిసికొనిన తెఱంగున వెల్లడించిరి. తఱువాత నర్వాచీనులును ఆ విషయము నట్లే తమగ్రంథములయందుఁ బొందుపఱచిరి. ఇట్లుసేయుట యంత నేర్పుగాదు. 'రాజతరంగిణి' యను నీకృతి నిర్దుష్టముగను సప్రమాణముగను రచింపఁబడినదగుటచే 'కల్హణుని' యుద్యమము కరము శ్లాఘాపాత్ర మగుచున్నది.

## చరిత్రరచయితలు (పూర్వులు)

తొల్లి పెక్కురు గ్రంథకర్తలు రాజోదంతములను దమతమ గ్రంథములందుఁ బెక్కు తెఱఁగుల వ్రాసిరి. అందు 'సువ్రతుఁడు' రాజకథావళి కాశ్రయమైన గ్రంథ బాహుళ్యమును సంక్షేపించుచు రాజవృత్తాంతములను విచ్ఛిన్నములఁ గావించెను. సువ్రతుఁ డక్కాలమున నెట్లో ప్రఖ్యాతి వడసెను. కాని, వైదుష్య దోషమున నతని భారతి వక్తవ్యాంశమునఁ గుంఠితమైన దనవచ్చును.

సరసకవితా ధురీణుఁడగు 'క్షేమేంద్రుఁడు' సయితము తన కృతులందుఁ గవిత్వవైభవమును వెలయించెనేగాని నిర్దుష్టముగ నొక్క రాజోదంతము నైన వక్కాణింపకుండుట యెంతయుఁ జింతనీయము.

## కల్హణుని రచన

ప్రకృతమునఁ గల్హణుఁడన్నవో ప్రాచీన నృపతుల ప్రతిష్ఠకుఁ జిహ్నములగు వస్తు శాసనములను శాస్త్రములను ప్రాశస్త్య పట్టములను బరిశీలించియు రాజకథాశ్రయములగు పండిత ప్రకాండుల గ్రంథములఁ బరిశోధించియు నీ రాజతరంగిణిని రచియించెను.

రాజవంశ పారంపర్య విచ్యుతి కావుటంజేసి యజ్ఞాతులగు నేఁబది యిద్దఱు నృపతులలో 'గోనందుఁడు' మున్నగు నల్వుర నృపాలురను 'నీలముని' విరచితమగు గ్రంథమునుండి యాకల్హణ కవీంద్రుఁడు గైకొనెను.

మఱియుఁ బాశుపత మహావ్రత నిష్ఠాగరిష్ఠుఁడగు 'హేలరాజు' అనుద్విజన్ముఁడు ద్వాదశసహస్ర సంఖ్యాకములగు శ్లోకములచే నృపాలుర చరితమును సంగ్రహింపఁగా 'పూర్వమిహిరుఁడు' అనుపండితుఁడు తద్గ్రంథమునుండి 'అశోకుఁడు' మున్నగువారిని 'లవుఁడు' మొదలగువారిని నెనమండుగురు పార్థివులను దనకబ్బమునందుఁ బ్రకటించెను. ఈపూర్వమిహిరుఁడు మఱియొకచోట 'శ్రీచ్ఛవిల్లాకరుఁడు' తెల్పియుండిన 'యశోకుఁడు' మొదలు 'అభిమన్యుని' వరకుఁగల యేవురు రాజులను అజ్ఞాతులగు నేఁబది యిర్వురు నరపతులలోఁ జేర్చి యుండెను.

## గ్రంథవస్తు ప్రశంస

నానావిధ కథా వీచికల కాలవాలమగు నీరాజతరంగిణీ మహౌషధము పుక్కి- దేశకాలముల యానుకూల్య ప్రాతికూల్యములంబట్టి రాజచూడామణుల యుల్లాసహ్రాసములకు స్ఫోరకమగుచున్నది.

ఉ॥ జీవుల జీవితం బతివి
చిత్రము, బుద్బుదతుల్యమంచుమే
ధావిభవుల్ రసజ్ఞులు ము
దంబున నీకృతిరాట్తరంగిణీ
భావ సుధారసంబుఁ జవిఁ
బట్టుచు, శాంతరస ప్రమోదపుం
దీవికి జీవనౌక విను
తింగను నట్లు నయింత్రు నేర్పునన్.

జీవుల జీవితవిలసితము బుద్బుదముంబోలె క్షణభంగురమని యెఱింగిన విచక్షణులు సుధారస విష్యందమును గ్రేణించు నీతరంగిణి యందలి మూర్ధాభిషిక్తమగు శాంతరసమును దనివిదీరఁ గ్రోలి యమందానందము ననుభవింతురుగాక.

## ఇతివృత్తము_ కాశ్మీరదేశపుఁబుట్టుక

పూర్వకాలమున 'సతి' అను సరోవరం బొకటి విరాజిల్లెను. కల్పాంతారంభమునుండి యాఱు మన్వంతరములు సతీసరస్సునందలి జలమంతయు హిమాద్రి గర్భంబునఁ జేరి పోవుటచే నాకొలను పుడమిగా మాఱెను. పిమ్మట నీవైవస్వత మన్వంతరమునఁ గశ్యప ప్రజాపతి ద్రుహిణో

పేంద్ర రుద్రాది దేవతా గణము నవతరింపఁజేసి తత్సరోవరాంతర్గతుఁడగు 'జలోద్భవుండు' అను రక్కసుని సమయింపఁజేసి యచ్చోటఁ గన్నుల విందగు 'కాశ్మీర' మండలమును నిర్మించి తన శిల్ప సౌష్ఠవమునకు మఱింత వన్నెదెచ్చెను.

## కాశ్మీరము

ప్రకృతిసౌందర్య విరాజమానమగు కాశ్మీర మాకాలమున నాగాధినేత యగు 'నీలుని' పాలన మున నత్యంతము విరాజిల్లెను. అచ్చోట 'వితస్తానది' యందలి సలిలధారా నిష్యందము 'నీల నృపా లుఁడు ధరించు నాతపత్రదండచ్ఛాయ ననుకరించుచుఁ గన్నుల పండుగొనర్చు చుండును.

మఱియు నచ్చట 'హైమవతి' సైతము గుహోన్ముఖియు గజరాజ ముఖాపీత పయోవిస్తా రయు నగుటంజేసి 'వితస్తా' సారూప్యము నొందినదో! యన నొప్పారుచుఁ దననైసర్గిక లావణ్యమును విడువకున్నది.

నానావిధ చిరత్నరత్నములచే విరాజిల్లుచు శంఖపద్మాదుల కునికి పట్టై భాసిల్లు కాశ్మీరము నవ నిధి నిధానమగు ధనదుని 'యలకా' పురమువలె నుండు ననఁ జిత్రమేమున్నది? మఱియు నీపురలక్ష్మి శైల ప్రాకార కైతవమునఁ దన భుజములను జాచి నాగాంతకునివలన వెఱఁగంది శరణుఁజొచ్చిన నాగకుటుంబముల నాదరించుచున్నదనుట మిగుల ప్రశంసనీయము. కాశ్మీరమునందలి 'పాపసూద నము' అనుతీర్థమునందు దారురూపముననున్న యుమాపతిని సేవించువారికిఁ గైవల్యలక్ష్మి కరతలా మలక మగుట నిక్కము.

కాశ్మీర జన్మస్థానమగు మంచుకొండయందలి నిర్జల ప్రదేశమున 'సంధ్యాదేవి' జలాత్మత నొందియుండుటఁ జూడ నచ్చటి పుణ్యపాపముల కలిమిలేములకు నయ్యదియె గొప్ప తార్కాణగా నెఱుంగవచ్చును. మఱియు నటఁ గొండొకచో హుతభుగ్భూగర్భమునుండి వెలువడిన హవ్యవాహనుఁ డత్యుజ్జ్వల జ్వాలామాలికలనెడు బాహు సందోహములచే నచ్చటి యాయజూకులు వేల్చు హవిర్భాగ ముల నత్యాదరంబునఁ గైకొనుచుండును.

రంగారు గంగాతరంగిణి యొక్క యుద్భేదముచేఁ బావనమై తనరారు నమ్మంచు కొండ యందేకదేశమగు 'భేదగిరి' యొక్క శృంగమున నతి మనోజ్ఞమైయున్న కొలనిలో 'భారతీదేవియు' మిక్కిలి కోర్కెతోఁదా నంచరూపునఁ గానవచ్చుట కడుంగడు నరిదియగు విశేషము గదా!

ఇఁక నాదేశమునందు శంకరుని యావాస ప్రాసాదమగు 'నందిక్షేత్రమునందు' వేల్పులు సదాశివు నర్చించునపుడు చిలికిన చందన బిందువులు నేటికినిఁ బ్రేక్షకుల కక్షి గోచరమవుచు నపరి మితానందమును గలిగించుచున్నవి.

అచ్చటి 'శారదాదేవిని' సేవించినవారికి నదూరమున నున్న 'మధుమతి' యను తరంగిణి 'వలె సుకవి రసనాగ్ర నర్తకియగు వాణియు వశవర్తిని యగుచుండును. ప్రాచీనులగు 'చక్రభృత్తు విజయేశుఁడు' 'ఆదికేశవుఁడు' 'ఈశానుఁడు' నను భూపాలురచే లాలిత యగు నీ కాశ్మీర వసుంధర' యందుఁ దీర్థరహితమైన ప్రదేశ మెచ్చటను గాన రాకుండెనన నింకఁ దన్మహత్త్వము వేఱుగాఁ గొండాడ వలయునా?

కాశ్మీర భూపాలురకుఁ బుణ్యబలముచే విజయము గలుగుచుండుటంజేసి శస్త్రాస్త్రబలము నిరుపయోగమయ్యెను. వీరవరులగు యోధులు పనిలేనివారైరి. తద్వాస్తవ్యులు పాపమునకుఁ దక్క మఱియే కారణముననుభీతి నొందరు. ఇఁక నాదేశమునందలి తరంగిణులన్నియు సుతీర పరిశోభితములై చలికాలమునందు సోష్మస్నాన గృహములవలె నొప్పారుచు, మొసళ్ళు మొదలగు యాదోనికరంబులకు నాకరంబులు గాక నిరుప్రదవములై యాదేశ వాసులకుఁ గొల్పు ముదము నభివర్ణింప ననుభవరసికుఁడగు సుకవి గాక యన్యుండు వలంతి గానోపఁడు. మఱియొక విచిత్రమగు విశేషమేమన కాశ్మీర ప్రకృతి శిల్పమున నసాధారణ కౌశలమును జూపిన తన తండ్రియగు విధాత యాశయము నెఱింగి జనకుని గౌరవించుటకో యనఁ జండకిరణుఁడు మండు వేసఁగి యందును నాదేశమునఁ దన తీవ్రతను జూపకుండును. పెక్కువచింపనేల!

గీ॥ ఆకసము దాఁకు శారదా హర్మ్యములును
స్వర్గ దుర్లభమైన ద్రాక్షయును రుచిర
కుంకుమముఁ దేనెసోనలు గురియు తుహిన
వారియుఁ బ్రజాళి సొమ్ము కాశ్మీరమందు.

రత్నగర్భయె యీజగత్త్రియము నందు
శ్రేష్ఠ; మందుఁ గుబేర దిక్స్రీమ మహిత
మందు గౌరీ గురుండు హిమాద్రి ఘనుఁడు;
సారతర మింకనందుఁ గాశ్మీర వసుధ.

కాశ్మీర మండల రమావైభవము నెంత వర్ణించినను దనివియుండునా? కావునఁ బ్రసక్తమగు పూర్వరాజన్యుల కథా కథనమునఁ బాల్గొందము. కలియుగమునఁ గౌరవ కౌంతేయులకు సమకాలికుఁ 'గోనందుని' వరకుఁ గల మూర్ధాభిషిక్తు లేఁబది యిర్వురును స్మృతిపథారూఢులుగాక పోవుట మిగుల విచారాస్పదముగదా! తత్కారణ మొకింత విమర్శింతము.

## కవితా కళ - తత్ప్రశంస

నిక్కము నరయవలసినచో నక్కాలమునందలి భూభుజు లైహికవిషయములం దవిలి దురాచారపరులై తమ కీర్తిమూర్తుల నాచంద్రతారకముగ ధరాతలమున నెలకొల్పఁగల కవిబ్రహ్మల నారాధింపకుండిరని వక్కాణింపఁ దగియున్నది.

గీ॥ కీర్తికాయంబును సృజించు గేయగుణుల
సత్కవిబ్రహ్మలను స్వరాష్ట్రింబు లందు
నిలుపనేరని నృపతుల నింద్యజీవ
నంబు నిజముగ నరక మనంగరాదె!

చం॥ అరయఁ జతుస్సముద్ర రశనాఢ్య వసుంధర యే యుదాత్త భూ
వర పటు బాహుకల్పవనిఁ బాయక హాయిగ ఛాయలోన భీ
తి రహితయై సుఖించెనొ! యతీతుల వారల నిల్పఁబెట్టె నీ
వరకృప, కావ్య శిల్పమ! భవన్మహిమంబున కేను దాసుఁడన్॥

చం॥ అలఘు మదేభకుంభశయనాంఘ్రి సరోజులు రాజులెందఱో
వెలఁదులు మేడలన్ బగటి వెన్నెలలై దనరార సంపదల్
చెలఁగ సుఖింపరే! సుకవి శిల్పమ! స్వప్నమునందు నేని వా
రలఁ గనమేల? నీ కనికరంబది లేక జగంబె యంధమౌ;

[సాగరమేఖలావలయితమైన సర్వసర్వంసహామతల్లి యే రాజచూడామణుల భుజవనతరుచ్ఛాయలందు సుఖశయనయయ్యెనో యట్టి రాజచంద్రుల సాంద్రయశశ్శారదచంద్రికలు కడలెల్లఁ బిండి యారవోసినట్లు మెండుగ నిండికొని యుండుటకు హేతువెద్ది?]

[పఱియు మదకుంభి కుంభ విన్యస్తపాదులై పదార్వన్నె పసిండిమేడలందుఁ బగటి వెన్నెలలో! యన భాసిల్లు తమ యన్నుమిన్నల తోడ వన్నెగన్న రాజన్యవరేణ్యు లెందఱు సాటిలేని విన్నాణముననుసిరి చెలువముననను దులఁదూగి యుండలేదు? అట్టి వారి నీ లోకమున లోకము కలయంద్రైనను నాకశింతకుఁ దెచ్చుకొను భాగ్యము నొందకున్నదే! ఇందుకుఁ గతంబెద్ది?]

మధుమయ ఫణుతులకు మార్గదర్శకులగు మహాకవులచే నుపాస్యమానమగు నో కావ్యకలాశిల్పమా! నీ యాదరానాదరణములే సర్వమునకు నిదాన మనఁ జెల్లును. నీకుఁ బరశ్శత నమోవాకములు. నీ మహిమ నాశ్రయింపని రాజమండలి కాలోక మేలోకమున నైనను దుర్లభమే గదా! రాజాలోకము గాంచనిచో జగ మంధప్రాయమగుటయం దబ్బురమేమి? ప్రకృత మనుసరింతము.

## కల్హణుఁడు - భారతకాలము

భారతేతివృత్తము ద్వాపరయుగాంతమున నడచె నన్నవార్తచేఁ గొందఱు విమోహితులై కలియుగమున 'గోనందాది నృపాలురు' (2268) రెండువేల యిన్నూటయరువదియెనిమిదిసంవత్సరములు గాశ్మీరమును బాలించిరని మిధ్యాభూతమగు కాలసంఖ్య వెల్లడించిరి. ఇట్లొనర్చినను ఆయా సమయములందుఁ బాలకులుగా నున్న భూపతుల యేలుబడిని గడచినట్టి కవికాలము మాత్రమే గణింపఁబడినది. కాని, శేషించిన కాలము యొక్క ప్రస్తావనయే లేదు. ఈ విషయమున నిర్ణయింపఁ దగినది యొకింత పరిశీలింపఁదగును.

కలియుగమున నాఱువందలయేబఁదిమూఁడు (653) సంవత్సరములు గడచిన పిమ్మట కౌరవ పాండవుల యితి వృత్తమా రబ్ధమయ్యెను. ఇప్పటికి (కల్హణుని కాలమునకు) (24) యిరువదినాలుగవ లౌకికాబ్దము (అనఁగా, (4224) నాలుగువేల యిన్నూట యిరువదినాలుగవ కలియుగాబ్దము) గడచుచున్నది. ఇంతదనుకఁ గడచిన శక సంవత్సరములు (కాశ్మీరమునఁ బ్రచారములోనున్న శకమునకు చెందిన సంవత్సరములు) (1070) ఒకవేయిడెబ్బది అని గణింపఁబడినవి. ప్రాయికముగ 'గోనంద' భూపాలుని పాలనము మొదలుకొని నేటివరకు (కల్హణునికాలము క్రీ. శ (1148) పదునొకండువందల నలుబదియెనిమిది ప్రాంతము వరకు) (2330) రెండువేలమూఁడువందలముప్పది హాయనముల కాలమయ్యెనని చెప్పఁదగును. ఇట్లు పరిశీలింపఁగా నజ్ఞాతులయిన యా యేఁబది యిర్వుర నృపతులకాలము (1266) (పండ్రెండు వందల యఱువది యాఱేండ్లు) అని యెఱుంగవచ్చును.

మఱియు నొక నక్షత్రమునుండి కొండొక నక్షత్రమునకు మరీచ్యాది సప్తర్షిమండలము చరించుటకు నొక్క శతాబ్దియగుచున్నది. ఈ సప్తర్షిచారమును బృహత్సంహితాకారుఁడగు వరాహమిహిరుఁడు చక్కఁగ నిరూపించియున్నాఁడు. అతని సిద్ధాంతము ననుసరించి చూడఁగా, సప్తర్షి వర్గము మఘానక్షత్ర గతమైనప్పుడు యుధిష్ఠిరుఁడు పుడమినిఁ బాలించెనని తెలియుచున్నది. ఆయుధిష్ఠిరుని పాలనము తర్వాత (2526) (రెండువేల యేనూట యిరువదియాఱు) సంవత్సరములు గడవఁగా శకకాల మేర్పడెనని నిర్ణయింప వీలగుచున్నది. ఇఁకఁ బ్రస్తుతపగునది కాశ్మీర నరేంద్రుఁడగు గోనందుని యుదంతము.

## గోనందుఁడు-1

కన్నుల పండుగైన 'కైలాస' ప్రకాశమనెడు దరహాస చంద్రికతోడను ఉప్పొంగు నుత్తుంగ తరంగములుగల గంగా ప్రవాహమను దుకూలముతోడను నొప్పారు నట్టి యుత్తర దిగంగన ప్రభూత ప్రతాప శోభియగు నీ గోనందుని నత్యాదరమున సేవించెను. మఱియు వసుంధరాదేవి ఫణిపతి విషాశ్లేషమువలని భీతిచేతనో యన రూపాంతరము నొంది గారుత్మత మణిమండితమైన యీ గోనందుని భుజాదండమున సుస్థితినిఁ గాంచి సుఖించెను.

ఈ గోనందుఁడు తన బంధువగు జరాసంధుఁడు శ్రీకృష్ణుని జయించుటకుఁ దన్ను బాసటగా రమ్మని పిలువ నంపఁగా, వాహినీ శతంబులతోడ బయలుదేరి కంసారియున్న మధురాపురిని సంపూర్ణముగ నరికట్టివైచెను. అప్పుడు కాళిందీ తీర పరిసరమునందు స్కంధావారము నేర్పఱచి తనయోధవరుల యశోవిలాసము నచ్చటి యాదవాంగనల ముగ్ధహసితంబులతో మేళగింపఁ జేయుచు యాదవబలమును జెల్లచెదరు గావించెను. అందుకు హలాయుధుఁడు గనలి పటాపంచలయిన యాదవ సేనను గూర్చికొని గోనందుని యుద్ధతి నెదుర్కొనెను. అంతట గోనంద లాంగలధ్వజు లిర్వురు పెక్కు తెఱంగులఁ బోరఁజొచ్చిరి. పరస్పరము జయశ్రీ వరింప నహమహమికతోఁ బెనగుచున్న యీ శూర శిఖామణులందు విజయము గాంచు వాఁడెవఁడగునో, యన్న సందియమున నిరీక్షించుచు నట్టె నిలిచియున్న జయలక్ష్మికేల నలరారుచుండిన విజయమాల మ్లానము గాఁదొడంగెను. ఇట్లుండ నెట్టకేలకుఁ గొంత తడవునకు విడుగరలేని బెడిదంపు టడిదంపు వ్రేటులకుఁ గడుంగడు బడలి గోనంద మేదినీ కాంతుఁడు రణస్థలిని వీరశయనము నొందెను. సీరపాణియు జయశ్రీ పరిష్వంగమున నత్యంతము సంతసించెను.

## దామోదరుఁడు

సుక్షత్రియుఁడగు గోనందుఁ డిట్లు వీరవరేణ్యుల కర్హమగు సుగతి నొందఁగా నతని తనూజాతుఁడైన 'దామోదరుఁడు' కాశ్మీర వసుంధరా భారమును వహించెను. సకల భోగ్యపదార్థ సముదయముచే సమృద్ధమై ప్రాజ్యమగు నట్టి రాజ్యము నేలుచున్నను దామోదర ధరారమణుఁడు యాదవకృతమగు పితృవధపరాభవము పలుమాఱు దలంపునకు వచ్చుచుండుటంజేసి లేశమైనను సుఖంబులేకయుండెను. గురు తిరస్కారము అభిమాన ధనులగు రాచవారిని సుఖపడనిచ్చునా?

అంత కొంత కాలమునకు సింధు సమీపవర్తులగు గాంధారులు స్వయంవరము నాయత్త పఱచి యాదవుల నాహ్వానించిన వార్త దామోదరుఁ డాకర్ణించి తన పగఁ దీర్చికొనుటకయ్యది యద నుగా నెంచి బాహుదండముల దర్పకండూతి మెండగుచుండ నత్యంత సంరంభముతోడఁ దనవాహినీ వారమును నచ్చటి కనతి దూరముననున్న యాదవానీకమును మార్కొ_న ముదల యిడెను.

అప్పుడు చతురంగబల నితాంత సంక్షుభితమగు పుడమినుండి రేగిన ధూళిపటలముచే నభస్ స్థలము నూతన భూతలముగ మాఱెను. క్రమక్రమముగ నిరువాగులవారికి సంకుల సమరము జరుగు చుండ నచ్చటి స్వయంవరపు వేడుక సన్నగిల్లెను; కాని, యాకసంబున బారులు దీరియున్న యచ్చర మచ్చెకంటులకు వీరవరుల యెడ స్వయంవరేచ్ఛ యుత్క_ట మగుచుండెను.

ఇత్తెఱంగున వీరుఁడగు దామోదరుఁడు వృష్ణిసైన్యముతోడఁ బోరి పోరి రిపు బలము తన సేనను జుట్టుముట్టఁ దుదకు శ్రీకృష్ణ చక్రానల కీలలకు గుఱియై దివంగతుఁడయ్యెను. పాపము, ఈ దామోదర ధరాపాలుని ధర్మపత్ని 'యశోవతి' యను నామె. ఈమె యాతరుణమున నంతర్వ త్నియై యుండెను. ఈ సంగతి యదుకులోద్వహుఁడగు వాసుదేవుఁ డెఱింగి యారాజ్యమునందామెను బ్రాహ్మణులచే నభిషిక్తను గావించెను.

## యశోవతి

ఇట్లు దామోదరునిఁ గడతేర్చియు వాని రాజ్యమున 'యశోవతిని' పాలయిత్రినిఁ గావించి నందుకు యాదవ వీరులలోఁ గొందఱింకను నసూయాగ్రస్తమానసులై యుండ శ్రీకృష్ణుఁడు వారి నందఱనుగూర్చి 'వీరులగు యాదవులారా! మీరిట్లీసు నొందుట పాడి గాదు. కాశ్మీరదేశమును బాలించు రాజు శివాంశ సంభూతుఁడు. అతని పత్ని పార్వతియంశమున నొప్పారును. ఆదేశపు నృపతి యొక వేళ దుష్టుఁడైనను వానిని భూతికాముఁడగు సజ్జనుఁడు సర్వవిధముల నవమానింపరాదు.'' అను పౌరాణి కోదంతమును మీరు మఱవకుఁడు అని ప్రబోధించి వారినెట్టకేలకు స్వస్థ చిత్తులనుగాఁ జేసెను.

లోకమున స్త్రీ జనమును దమ భోగ్యవస్తువుగాఁ దలఁచు కుత్సిత హృదయులు పురుషులెందఱు లేరు? కాని, యిటఁ గాశ్మీరమునఁ బ్రజలందఱును బ్రజామాతయగు యశోవతిని తమపాలిటి దేవతనుగాఁ జూచుచుండిరి.

గీ॥ దేశ కుల గౌరవంబులఁ దీర్చి దిద్దు
వారు కుల దేవతలు స్త్రీలు; వారి నకట!
పురుషులొక భోగ్యవస్తువువోలెఁ గనుట
యెంత లజ్జాకరమొ వచియింపఁ గలమొ?

అంతఁ గొంతకాలమునకు నిండు చూలాలగు యశోవతి ''సంగరానలమున దగ్ధమైన వంశ వృక్షము నూతనాంకూరమును గనినదా!'' యన దివ్యలక్షణోపేతుఁడగు కుమార రత్నమును బడ సెను. భూసుర శ్రేష్ఠు లాబాలకునికి జాతకర్మతోడనే రాజ్యాభిషేకాది విధుల నిర్వర్తించి పితామహుని నామధేయమున నాతనిఁ బేర్కొ_నిరి.

## రెండవ గోనందుఁడు

బాలుఁడగు నీ గోనందుఁడు బాలచంద్రునివలె దినదినప్రవర్ధమానుఁడగుచు నూతన రాజ కళలతో నొప్పారుచు దాదులు (ఒక దాది పాలువోసి పెంచునది రెండవ ధాత్రి సర్వసంపద్విషయములఁ బరిశీలించి యొసఁగునదియు, అను నియమములఁ బాటించువారు) కడు గారాబముతోఁ బెంచుచుండఁ దన శైశవక్రీడలచేఁ బ్రజల కమందానందముఁ గొల్పుచుండెను. రాజభక్తిగల యమాత్యులీతనిఁ గంటిని ఱెప్పవలె సర్వవిధములఁ గాపాడుచు నీ రాకొమరుఁడు పార్శ్వవర్తులను గాంచి యనిమిత్తహాస మొనర్చినను నయ్యది యతని యవంధ్యానుగ్రహముగఁ బ్రకటించి వారికి భూషణాంబరాదుల నొసఁగుచుండిరి.

అధికారులెవ్వరైన నెప్పుడేని యీ యర్భకుని యవ్యక్తమధురభాషణ మెఱుఁగఁజాలక భావానుగుణముగఁ గార్యమును జక్కఁబెట్టకుండినచో నందులకు వారెంతో యపరాధము నొనర్చినవారు వోలె మిగుల విచారపడుచుందురు. ఈ రాచబిడ్డ జనకుని సింహాసనము నధిష్ఠించినపుడు పాదములు వ్రేలుచుండుటచేఁ బాదపీఠికిమాత్ర మితని యడుగుఁదమ్ముల స్పర్శమువలని సుఖమనుభవింపని కొఱంత దీరదయ్యెను. సింహాసనము నధిరోహించి యున్నపుడు వింజామరముల వీవనలకుఁ జలించు సుంద రములగు కాకపక్షములతోడ నొప్పారు నీ బాలుని సమక్షమున నమాత్యపుంగవులు ప్రజలు మనవి సేయు ధర్మసంశయముల నాలకించుచుందురు.

ఇట్లు చిన్నారి చిఱుఁ బ్రాయంపు టాటలతోడఁ గొమరు మిగిలియున్న యీ బాలభూపాలుఁడు తత్కాలమునఁ బొసఁగిన కౌరవ పాండవుల పోరునందు నిరుతెగలవారిచే సహాయుఁడుగా నాహ్వానింపఁ బడనివాఁడయ్యెను. అన్నింటికి దైవముగదా॥ కారణము.

ఇఁక నీ గోనందునకుఁ దఱువాత ముప్పదియేవురు (35) మహీపాలురామ్నాయభంగ మొదవుటంజేసి విస్మృతి సాగరమున మునిఁగిపోయిరి. వారి వృత్తంబెట్టిదో యెఱుకపడదుగదా॥ వారి నామములైనను వినుట కవకాశము లేకపోయినది.

## లవుఁడు

తఱువాతఁ బ్రసక్తిగల భూకాంతుఁడు 'లవుఁడు' అనువాఁడు. ఇతఁడు వసుమతికిఁ దిలకాయ మానుఁడై యశోవసన యగు జయశ్రీకి నత్యంతము ప్రేమభాజనుఁడై జగమునంతను మేల్కొల్పు నట్టి తన గంభీర సేనా నినాదముచే వైరివీరులను విచిత్రముగ దీర్ఘనిద్రాపరవశులను గావించెను మఱియు నీతఁడు రంగారు రత్నాల భవనము లెనుబదినాల్గులక్షలుగల 'లోలోరము' అను నొక రమ ణీయ నగరమును నిర్మింపఁజేసి 'లేదారి' యను నదియొక్క పరిసర ప్రదేశమున 'లేవారము' అను నగ్రహారమును భూసురసమితికి నుపాయనముగా నొసఁగి నుతికెక్కిన శౌర్య రమావిభవమునఁ బ్రజల మనంబులఁ జూరగొని పుడమియందుఁ దన కీర్తిమూర్తిని నిల్పెను.

## కుశుఁడు

ఈ లవుని పుత్త్రుఁడు 'కుశుఁడు' అనువాఁడు. ఇతఁడు కుశేశయాక్షుఁడై యొప్పారెను. ఈతఁడును దండ్రికి నెనయై 'కురుహారము' అను నగ్రహారము నొసఁగినట్లు దెలియుచున్నది.

## ఖగేంద్రుఁడు

పిమ్మట కుశుని సుతుఁడైన 'ఖగేంద్రుఁడు' శౌర్యఖనియై దనరారి తన శత్రువులైన నాగులకు నంతకసన్నిభుఁడై ధరాభారమును వహించెను. ఈ పార్థివుఁడు 'ఖాగి' 'ఖోనమూషము' అను విఖ్యాతాగ్రహారముల నొసఁగిన నెఱదాతయై హరహాసితసితములైన స్వకీయ పావన కృత్యములచేఁ బుణ్యశ్లోకుఁడై యుత్తమలోకమును గడించెను.

## సురేంద్రుఁడు

ఖగేంద్రుని తనూజుఁడు సురేంద్ర ధరాపాలుఁడు. ఇతఁడు నిరుపమమహిమోపేతుఁడై యాశ్చర్యకరములగు తన చర్యలచేఁ దనరాష్ట్రమునఁ బాపకర్మయను మాటకుఁ జోటీయక వేల్పుల ఱేఁడు దనకు నీడుగాఁడని యనిపించెను. సురపతి 'శతమన్యువు' గదా! ఈ సురేంద్రుఁడు 'శాంతమన్యువు' దేవేంద్రుఁడు గోత్రభేది - ఈతఁడు గోత్రపాలకుఁడు. ఇఁకఁ దౌల్యమీ యిరువురకెట్లు గుదురును?

ఈ సురేంద్రుఁడు 'దరద్దేశము'నుపకఠంకమున 'సౌరకము' అను పుటభేదనమును నిర్మింపఁజేసి యచ్చట 'నరేంద్రభవనము' అనుపేర నొక విహారమును (బౌద్ధమఠమును) గట్టించి పుణ్యకార్యాచరణమునఁ దనివి నొందనివాఁడు కావునఁ దన మండలమునందును 'సౌరసము' అను పేరుగల మఱియొక రమణీయ విహారమును నిర్మింపఁజేసెను.

## గోధరుడు

ఈ రీతి నితఁడు పెక్కు సత్కార్యములొనర్చి యఖండ విఖ్యాతి గడించియుఁ దుదకు సంతానవిహీనుఁడై కాలగతి నొందుటవలన వంశాంతరసంభూతుఁడయిన గోధరుఁడు' అనువాఁడీతని రాష్ట్రమునకుఁ బాలకుఁడుగా నేర్పడెను. ఈ 'గోధరుఁడును' నౌదార్యగుణభూషణుఁడై 'గోధరాహస్తిశాల' యను నగ్రహారముచే ద్విజన్ముల సన్మానించెను.

## సువర్ణాఖ్యుఁడు

గోధరుని కుమారుఁడు 'సువర్ణాఖ్యుఁడు'. ఈతఁడు 'సువర్ణమణి' యను కుల్యను 'కరాళము' అను ప్రదేశమున నెలకొల్పి యర్థిసార్థముల సువర్ణదానమునఁ దన్పి తననామము నన్వర్థము గావించిన సుకృతి.

## జనకుఁడు

ఈ సువర్ణుని కుమారుఁడు 'జనకుఁడు' అనువాఁడు. ఇతఁడు ప్రజారంజన తత్పరుఁడై 'జాలోరము' అనుపేర విహారశోభితమగు నగ్రహారము నెలకొల్పెను.

## శచీనరుఁడు.

జనకుని సుతుఁడు 'శచీనరుఁడు'. ఇతఁడు క్షితికి 'శచీపతి' యనఁబరఁగి యమోఘశాసనుఁడగుచు 'శమాంగాస' 'శనారము'లను రాజాగ్రహారములకుఁ గర్తయై కుమారులఁ బడయకయే త్రిదివము గాంచెను.

## అశోకుఁడు

తఱువాత నీశచీనరునకుఁ బ్రపితృవ్యజుఁడును 'శకుని' యను రాజుయొక్క మునిమనుమఁడు నైన 'అశోకుఁడు' అను నరపతి కాశ్మీర భూధవుండయ్యెను.

ఈ యశోకభూపతి యఘవిదూరుఁడు. 'జిన' శాసనమును కడుంగడుఁ బ్రపత్తితో నాదరించు వాఁడు. కావుననే జిన చిహ్నముగా 'శుష్కలేత్రము' 'వితస్తాత్రము' అను ప్రదేశములను జైనస్తూప సమూహములచే నింపెను. మఱియు 'ధర్మారణ్య విహారము' నందలి 'వితస్తాత్ర'పురమున నీతనిచేఁ గట్టింపఁబడిన చైత్య శిఖరము ప్రేక్షకుల నయనములకుఁ గానరానంతటి యౌన్నత్యవిభవమున శోభిల్లుచుండును.

ఇఁక సిరికాటపట్లనఁ జెల్లు తొంబదియాఱులక్షల యావాస భవనములచే విలసిల్లుచుండిన 'శ్రీనగరి'యని నుతికెక్కిన గొప్ప నగరరాజమీ యశోకరాజన్యుఁడే వెలయించెను.

ఇంతియకాక నిష్కల్మష హృదయుఁడగు నీరాజు సుధా నిర్మలమగు విజయేశుని జీర్ణ ప్రాకారమును దుర్భేద్యమగునట్లశ్మనిర్మితము గావించెను. వెండియు దూరీకృతాలస్యుఁడగు నీతఁడు విజయేశుని సభయందును, తత్సమీపముననుదనపేర రెండు ప్రాసాదములను గట్టించెను. కడపటఁ దన దేశము తుచ్ఛులగు మ్లేచ్ఛులచే నావరింపఁబడుచుండ వారిని సమయింప నీ యశోకుఁడు మహేశ్వర ధ్యానవిష్ఠాగరిష్ఠుఁడై మహా తపంబొనరించి తత్ఫలంబుగా 'జలౌకుఁడు' అను పుత్త్రరత్నమును బడసెను.

## జలౌకుఁడు

అశోకుని యనంతరము భూలోక సురనాయకుఁడనఁబరఁగిన 'జలౌకుఁడు' వాసికెక్క గావించిన మేల్మికర్జంబులు పెక్కు గలవు. అవి యన్నియు నద్భుతావహములు. బ్రహ్మాండమండలము నంతను యశస్సుధాలేపనమున వినిర్మల మొనర్చిన యీ కీర్తి మూర్తియొక్క దివ్యప్రభావ భవ్య చారిత్రము నిలింపులకు నయితము శ్రుతి గోచరమగుచు నాశ్చర్యమును బోధింప నాచార్యకంబు వహించుచుండును. ఇతఁడు కోట్లకొలఁది ద్రవిణమును వినియోగించి 'కోటివేధి' హేమ సాధక రసమును బడసియుండుటచే బ్రహ్మాండ రంధ్రావకాశమునంతను సువర్ణమయమొనర్చి నీ రంధ్రము గావించు దిట్ట యయ్యెననుట విస్మయకరమగు విశేషము గదా!

ఒకానొక తరుణమున నీజలౌకుఁడు నాగసరోవరాంతరముఁజొచ్చి యందలి జలంబును స్తంభింపఁజేసి యచ్చటి పాఁపలేజవరాండ్ర లావణ్యమునకును దన తారుణ్యమునకును నెయ్యంబుఁ గూర్చి సుఖాంబుధిఁ దేలెను. ఆ కాలమున బ్రఖ్యాతిఁగని వాదమునఁ బ్రాబల్యము గడించిన బౌద్ధుల నెల్లర దన విజ్ఞాన గరిమచే నణఁచివేసి యవధూతత్వము నాశ్రయించిన సిద్ధుఁడొకఁడీతేనికి జ్ఞానోపదేష్ట యగుట యీతని భాగ్యవిశేషమనవచ్చును.

ఇంకఁ బ్రతి గ్రామమునందును స్వారికై యుపయుక్తములగు నుత్తమాశ్వములు నితనికి ననేకములు గలవు. కాని, గ్రామములంజూడ నేగునపుడీతనియెడ నత్యంత భక్తి విశ్వాస స్నేహము లతో మెలఁగు నాగవంశజుఁడొకఁడీపుడమితేని నెల్లపుడు నందలంబున స్వీయులచే మోయించుచుండెను. గర్వోన్నతినిఁ బొందిన మహమ్మదీయులను బ్రభూత విక్రముఁడగు నీతఁడు జైత్రయాత్రల యందణఁచి వేసి పుడమిపై విజయ నినాదమును నల్గడల మాఱ్మ్రోగించెను. మండలమందు వ్యాపించిన మ్లేచ్ఛ వర్గము నీరీతిఁ దఱిమి వేయుటచే వారు విడిచిపెట్టిపోయిన తావు నచ్చటి జనులిప్పుడును 'ఉజ్ఝటడింబము' అను నామమునఁ బిలుచుచున్నారు.

ఇట్లు దండయాత్ర కనురూపఫలమైన 'కన్యకుబ్జాది' ధాత్రీతలమును గైవసముఁ జేసికొని తన దేశమందంతటను జాతుర్వర్ణ్యపద్ధతిఁ జక్కఁగ నేర్పఱచి ధర్మవ్యవహారజ్ఞులగు కోశవిదులను నియమించియు రాష్ట్రాభివృద్ధి కనుగుణమగు వ్యాపార ధనాదుల పెంపులేక సామాన్య దేశమువలెఁ దన రాష్ట్రమున్నదని యెఱింగి మేధావియగు నీతఁడు ధర్మాధ్యక్షుఁడు, ధన్యాధ్యక్షుఁడు, కోశాధ్యక్షుఁడు, సేనా పతి, దూత, పురోహితుఁడు, దైవజ్ఞుఁడు నను సప్తప్రకృతులతోఁగూడ ధర్మబద్ధములగు పదునెనిమిది కర్మస్థానముల నెలకొల్పి "తొల్లిటియుధిష్ఠిరుని ప్రజాపాలనధర్మమిట్టిది" అని ప్రజలకు వెల్లడించి రాజ్యశ్రీ పరిపూర్ణప్రేమకుఁ బాత్రుఁడయ్యెను.

ఈ నరపతి యౌదార్యగుణ భూషితుఁడగుటచే విక్రమోపార్జితమగు ద్రవ్యమును ధర్మ కార్యము లకు వినియోగించుచు విద్వదవతంసములకు 'వారవాలము' మున్నగు నగ్రహారముల నొసంగి ద్వారాది ప్రదేశములందుఁ దన రాణియగు 'ఈశానదేవి'చే సప్తమాతృకలను జిత్రింపఁజేసి తన నిరుపమాన మైన దైవభక్తిని నిరూపించెను. కావుననే యీ ధరిత్రీవిభుండు వ్యాసాంతేవాసివలన నంది పురాణ మును విని నందీశ్వరునియెడ స్పర్ధతో 'సోదరా'ది తీర్థసేవ యనుదినమొనర్చుచు 'శ్రీనగరి'యందు 'జ్యేష్ఠేశ్వరుని' ప్రతిష్ఠ గావించియుఁ దీర్థసేవ లేకున్న నందీశ స్పర్ధ కుదురదనియు భావించి యుండెను.

ఒకనాఁడితఁడు కార్యాంతరవ్యగ్రతవలన నిత్యకృత్యములను జాల దవ్వులందున్న 'సోదర తీర్థమున' నాచరింప లేమికి నెమ్మనంబున మిగుల వగచుచుండ నత్తరుణమున నిర్జలంబగు తత్ప్రాంతంబున నాకస్మికముగ వారిపూర మొదయించెను. ఆ నీరము వన్నె చవి మున్నగు గుణము లచే సోదరతీర్థజలమును, కరము సరిపోలియుండుటంజేసి తానా తీర్థమున స్నానవిధి నిర్వర్తించి యతఁడు పూనిన నందీశస్పర్ధ పర్యాప్తి నొందినట్లు తలంచి సంతృప్తి వడసెను.

మఱియు నొకానొకప్పుడు పరీక్షార్థ మితఁడు గర్భవివరముగల స్వర్ణభృంగారమును మూతినిఁ గప్పిపుచ్చి సోదరతీర్థాభ్యంతరమున విడువఁగా నయ్యది సార్ధ దివసద్వయమునకు శ్రీనగరియందలి తీర్థమునఁ గడుంగడు నచ్చెరువుగఁ బైకిఁ బొడసూపుటచేఁ దొల్లిఁటి తన సందియ మంతయుఁ దొలంచు కొనియె. "ఇట్టి యాశ్చర్యకరమగు ప్రభావమును గనుపఱచిన యతఁడా నందీశుఁడేగాని మఱెవ్వరును గారు. అతఁడే భోగముల ననుభవింప నిట నవతరించి యుండును. లేకున్న నీపగిది దృష్టాదృష్టక్రియా నిష్పత్తి గలుగుటెట్లు?" అని ఈ ఱేఁడు దనలోఁ బరిశీలించుకొనెను.

కొండొక దినమున నీ వేఁడు విజయేశ్వరుని దర్శించుటకుఁ బోవుచుండ నొక పడఁతి మధ్యే మార్గమున నీ నరనాథుని నన్నమడుగఁగా, "ఈ యమ్మ యథేష్టమృష్టాన్నమున సంతుష్టి వడయునట్లు గావింపుఁడు" అని తన పరివారమునకు నానతి యొసఁగెను. అంత నాయింతి యబ్బురముగ వికృతాకారయై తనకుఁగల నరమాంసమునందలి కోర్కెని వెల్లడించెను. జలౌకుఁడు ప్రాణిహింసను బొత్తిగ నొల్లనివాఁడగుటచే "నామేని పొలసు భుజింపుము". అని యమ్మగువ నర్థించెను. అవ్వికృతాకారయు నా రాజచంద్రునిఁ గాంచి "పుడమిఱేఁడా! నీవు మహాత్ముఁడవు. నీకుఁ బ్రాణులయెడఁగల కారుణ్యము సాటిలేనిది. ఇట్టి నీ యహింసావ్రతనిష్ఠ నీ యుత్తమ సత్త్వగుణమును జెప్పక చెప్పుచున్నది. దీన నీవు బోధి సత్త్వుడవైతివి". అని వచించెను. అందులకు జలౌకమహారాజు "అమ్మా! నీవెవరవు? నన్ను బోధిసత్త్వుఁడవని యంటివి. నిక్కముగ నేను మహేశ్వరభక్తుఁడను. బౌద్ధభాషయెట్టిదో తెలియని వాఁడను. నీవు నన్ను నిట్లు పేర్కొననేల?" అని బదులు పల్కెను.

అంతట నమ్మత్తకాశిని "ఓ రాజా! సర్వ లోకేశ్వరుఁడయిన భగవానుఁడు మొదలు సామాన్య జనునివరకుఁ బరికించినయెడల హింసాకృత్యము నెఱుఁగక ప్రశాంత వర్తనులై విగత క్లేశులైనవారు మిక్కిలి తక్కువగ నున్నారు. అట్టివారందఱును బోధిసత్త్వులనఁ బరఁగుదురు. నీవును నట్టి ధర్మాత్ముఁడవని యెఱింగితిని. బోధిసత్త్వులెల్లరు సాపరాధులయెడను గినుక వహింపరు, మిగుల యోరిమితోఁ బరోపకార పరాయణులగుచుందురు. మఱియు వీరు తమ నిష్కళంక విజ్ఞానమును దమకు మాత్రమె మోక్షసాధనముగ నెంచక యయ్యది విశ్వమునందలి విశ్వమానవ శ్రేయోవిధాయిగ నొనర్ప సదా కృషి సల్పు పావనచారిత్రులు. ఇంక నా యాగమన ప్రయోజనము నాలింపుము.

మేము లోకాలోకపర్వత పార్శ్వములనుండు తమోధిష్ఠాన దేవతలము. మా పేరు 'కృత్తికలు' అని జగద్విదితము. తొల్లి విహారస్థానములఁ గావింపబడిన తూర్యరావముచే నీకు నిద్రాభంగము గలుగఁ గుపితచిత్తుఁడవైన నీవు కూళల ప్రోత్సాహమున విహారంబులఁ గూలఁ ద్రోయించితివి. ఆకతంబున బౌద్ధులెల్ల మిగులఁ గ్రుద్ధులై నన్ను ధ్యానించి నిన్ను నిర్మూలింపఁ బ్రార్థించిరి. నేను వారికోర్కెఁ దీర్ప నీ యాకారంబుతోడ నత్వరముగ వచ్చుచుండ దారి నడుమ బోధిసత్త్వులు నన్నుఁ గాంచి "ఓ కల్యాణి నీవు పోవుపని మే మెఱుఁగుదుము. కాని మహాశాక్యుఁడగు నమ్మహీకాంతునిఁ గాఱింప నీకు శక్యముగాదు. అతనింగాంచిన నీకు దమోనాశంబగును. ఖలప్రేరణముచే విహారోన్మూలన మొనర్చిన యాభూధవునికి "నీ పసిండిరాసుల వినియోగించి మరల రమ్యతరములగు విహారముల నిర్మింపఁజేయుము. ఇయ్యదియ నీకును నిన్నుఁబ్రేరించిన వారికిని బ్రాయశ్చిత్తము. దీన నీకు విహారచ్ఛేదనమునఁ బొడమిన కలుషము నశించును" అని మా మాటగా నెఱింగింపుము. అనుచు నన్ను బ్రబోధించిరి, నేను నిన్నుఁజూచి నీ సత్త్వసంపదను గైతవమున నిట్లు పరీక్షించి నీదు మహాప్రభావమును దెలిసికొని ధుతకలుషనై కృతార్థతనొందితిని, నీకు సదా శుభ పరంపరలు గలుగుఁగాక. నేఁ బోయివత్తును. అని యాకృత్తిక పల్కెను.

అంత క్షమాకాంతుఁ డీ వృత్తాంతము నాలించుటచే నత్యంతము సంతసించి యక్కాంతా రత్నము చెప్పినట్లు తప్పక రమణీయతర విహారము నిర్మింపఁజేయుదు". అని ప్రతిన యొనర్పఁ కృత్యాదేవియు హర్షోత్ఫుల్లనయన యగుచుఁ దిరోధానమొందెను, ఆవల జలౌకుఁడు తననగరంబు

జేరుటయె తడవుగ 'కృత్యాశ్రమము' ఒకటి కల్పించి యచ్చోట విహారమును నిర్మింపఁజేసి యా తావు ననే తమో రహితయగు కృత్యాదేవినిఁ బ్రతిష్ఠింపఁజేసెను.

తఱువాత నీ పార్థివుఁడు 'నంది క్షేత్రమునందు' ఒక సుందర ప్రాసాదమును గట్టించి యచ్చట నుమాధవుని నిస్తుల రత్ననిచయమున నర్చించి 'చీరమోచనము' అను తీర్థాంతరాళమున బ్రహ్మాసనాసీనుఁడై మేను చలింపకుండునట్లు ధ్యానైకతానమనస్కుఁడగుచుఁ బెక్కు రాత్రులత్యంత దీక్షతోడఁ బాశుపత తపశ్చర్య సల్పి తుదకుఁ జిరకాలమునకుఁ 'గనకవాహిని' యను నదివలనఁ దనకు గల నందీశ స్పర్ధయందలి యుత్కంఠను నెట్టకేలకుఁ గుంఠితము గావించుకొనెను.

ఈ భూకాంతుఁడు పుణ్య కర్మాచరణ పరతంత్రుఁడు. కావున నీతని శీలము వర్ణనాతీతముఁ ఈశ్వరుని నృత్త గీతోత్సవము ప్రసక్తమయ్యెనేని హర్ష పారవశ్యమున నర్తన మొనరింపఁగలయట్టి తన యంతఃపుర వనితాశతమును శంకర కైంకర్యమొనర్పఁ బురికొల్పుచుండును. జలౌకుఁడిట్లు గుణ ఖనియై రాజ్య రమా వైభవముఁ జిరకాలమనుభవించి కడపటఁ దన యర్ధాంగితోడ 'చీరమోచనము' అను తీర్థమున గిరిజాపతి సాయుజ్యముఁ బడసెను.

## దామోదరుఁడు

జలౌకుఁడు సంతానరహితుఁడై కాలధర్మము నొందుటవలన నశోకవంశజుఁడో లేక యన్యవంశమున జనించినవాఁడో యగునట్టి 'దామోదరుఁడు' అను ధరిత్రీధవుఁడు కాశ్మీరమున కొడయఁడయ్యెను. సిరిపెంపునను దేజోవిభవమునను మహోన్నతింగనిన యీ మహేశ్వరభక్తశిఖామణి యద్భుతచరిత్రము లోకమున నిప్పటికిని జనుల శ్రుతి పథంబుల నలంకరించుచునే యున్నది.

ఈశ్వరానుగ్రహ పాత్రుఁడును సచ్చరిత్రము నత్యంత మాదరించువాఁడును నగు నీ నరనాథుని నేస్తము ప్రశస్తమనియెంచి కుబేరుఁడు బద్ధానురాగుఁడై మెలఁగెను. గుహ్యకులితని యానతినిఁ గుబేరునాజ్ఞవలె నడఁకువతోఁ దలఁదాల్చి చేయుచుందురు. ఆ కారణమున నితఁడు వారిచే 'గుడము' అను ప్రదేశమున సేతువును గట్టించి 'దామోదరసూదమున' తాను బ్రత్యేకముగ నిర్మింపఁజేసిన పురమునకు నీ సేతువుమూలమున వారిపూరము నడపింపఁ బ్రయత్నించెను. "శ్రేయాంసి బహు విఘ్నాని" అను నార్యోక్తి ననుసరించి లోకోత్తరమగు హితము నేదేని చేయఁదలఁచిన యున్నతాత్మునకుఁ బ్రత్యూహములు సంభవించుట సాజమైయున్నది. మర్త్యుల సుకృతము పరిమితముగదా:

చం॥ వరగుణ శోభితాత్ములగు
వారు సముత్కట దీక్షతో వసుం
ధరకు మహోన్నతంబగు హి
తం బొనరింపఁగఁబూన విఘ్నముల్
పొరిపొరి వెంబడించుఁ బెను
భూతములట్లు; యిసీ, నిమిత్తమిం
దరయఁగఁ మందభాగ్యులగు
నట్టి ప్రజల్ గద నిక్కువంబుగన్॥

పాపము! పవిత్ర చరిత్రుఁడగు దామోదరునకుఁ గలిగిన కష్టము వారింపఁ దగినది. ఏమన? ఇతఁడు దాఁదలఁచినట్లు తనమండలమునం దంతటను నాజ్ఞానువర్తులగు యక్షులచే జలోపద్రవములు గలుగకుండునట్లు దీర్ఘములయిన యశ్మమయ సేతువులను నిర్మింపఁజేయఁగడఁగు కాలముననే ఘోరమగు బ్రాహ్మణశాపమునకు గుఱియయ్యెను. దాయాదులు మున్నగువారిచే నాక్రమింపఁబడిన రాజ్యము మరల గైవసము చేసికొనవచ్చును, కాని తపస్తేజో విరాజమానులగు ద్విజుల తిరస్కారకారణమునఁ గోల్పోయిన సంపద తిరిగి పొందఁదరముగాదు.

గీ॥ పగతురకు లోఁబడిన సిరిఁ బటువట్టి
కైవసము చేసికొనుట శక్యంబె యగును;
తాపసుల రూక్షవాక్కునఁ దరలిపోవు
సంపదను నిల్వఁబెట్టంగఁజాలు నెవఁడు?

అత్యుగ్ర తేజస్కులగు మహర్షుల తపోవిభూతి సాధుశీలుఁడగు దామోదరుని ప్రాభవమును సైతము తారుమాఱుచేయుట చింతనీయము.

ఇందుకుఁగల కారణమిట్లు వర్ణింపఁబడినది. ఈ ధాత్రీవల్లభు డొకనాఁడు శ్రాద్ధ కర్మ నాచరించుటకు స్నానముఁ జేయఁబోవుచుండ నాకొన్న బాడబులు కొందఱు, ఈ నరేంద్రుని "నీవు స్నానము చేయుటకుఁ బూర్వమే మా కోగిరముఁ బెట్టింపుము" అని యడిగిరి. ఇతఁడా బ్రాహ్మణుల మాటనంతగాఁ బాటింపక 'వితస్తా'నది యందు స్నానమునకై త్వరపడెను. ఆ ద్విజులు తమతపః ప్రభావమున నా స్రవంతి నీ నరేంద్రుని యెట్టయెదుటఁ బొడకట్టఁజేసి "ఇదిగో నది నీ యెదురనే యున్నది. మమ్మిఁక మృష్టాన్న సంతుష్టులను జేయుము" అని యనిరి.

అప్పుడు దామోదరుఁడిదంతయు వీరి మాయాశక్తిచే గల్పిత మైనదని యెఱింగి వారితో "ఓ విప్రవరులారా! నేనిప్పుడు స్నానము చేయక మీకు భోజనముఁ బెట్టింపనొల్లను, "సర్పింపుఁడు" (తొలఁగుఁడు) అని పలికెను. అందుల కాబ్రాహ్మణులు క్రోధోద్రిక్తులై "మామాట సరకు సేయక "సర్పింపుఁడు" అని యంటివి, కావున, నీవు వెంటనే సర్పరూపమును బొందుము. అని శపించిరి. బుభుక్షితులై మీఁదుమిక్కిలి క్రోధపరవశులై యున్నవారికి యుక్తాయుక్తములు స్ఫురింపవు.

పిమ్మట దామోదరుఁడు బాడబులను వేడుకొన వారును బ్రసన్నులై "రాజా! నీవు రామాయణము సాకల్యముగ నొక్క పగటిపూటయందే వింటివేని నీకు శాపవిముక్తి యగును". అని పల్కుచు వెడలిపోయిరి. ఏమయిననేమి? దామోదరుని విధి విపరీతమైనది. అతఁడు దామోదర సూదాంతరమునఁ బెనుపిపాసచేఁ బీడితుఁడై పరువిడుచు శాపోష్మశ్వాసలచే నెగయుపొగతోడ నిప్పుడును బ్రజల చూడ్కులకుఁ గానవచ్చుచునే యున్నాఁడు.

## హుష్క, జుష్క, కనిష్కులు

దామోదరుఁడు శాపగ్రస్తుఁడైన తఱువాత 'హుష్కుఁడు' 'జుష్కుఁడు' 'కనిష్కుఁడు' అను వారు ముువ్వురు తమతమ నామధేయములతో మూడు నగరములను నిర్మింపఁజేసి కాశ్మీరరాష్ట్రము నేలిరి. అందు జుష్కుఁడు 'జుష్కపురము'నేగాక 'జయస్వామిపురమును' నొక విహారమును గూడఁ గట్టించెను.

వీరు ముప్వురు రాజులు తురుష్కవంశ సంజాతు లయినను బుణ్యకార్యముల నాచరించుచు 'శుష్కలేత్రా'ది దేశములందుఁ జైత్యములను మఠములను గొన్నింటిని నిర్మింపఁజేసిరి. ఈ తురుష్క ప్రభువులు పాలించు రాజ్యమునందుఁ గాశ్మీరమండల మా కాలమున నూర్జితతేజస్కులగు బౌద్ధ సన్యాసులకుఁ దఱచుగ నావాసాద్యనుభోగభాజనమై తనరారెను.

భూలోకమున నహింసాధర్మమును నెలకొల్పుటకై భగవదంశమున నవతరించిన 'శాక్య సింహుఁడు' ఈ తుష్కరాజుల కాలమునకుఁ బూర్వము నూటయేబఁది సంవత్సరములక్రిందట నిర్యాణము నొందియుండెను.

## శ్రీ నాగార్జునుఁడు

ఈ తురుష్కులకుఁ బిమ్మటనో లేక వీరికాలముననో బోధిసత్త్వుఁడైన 'శ్రీ నాగార్జునుఁడును' కాశ్మీరమున కధినేత యయ్యెను. ఇతఁడు 'షడర్హద్వన' సంశ్రయి యయ్యెను.

## అభిమన్యుఁడు

నాగార్జునుని యనంతరము రెండవశతమన్యుఁడన, జెల్లు 'నభిమన్యుఁడు' అను ఱేఁడు కాశ్మీర వసుమతినిఁ బరిపాలించుచు నిష్కంటకుఁడై 'కంటకోత్సము' అను నగ్రహారమును విద్వత్తల్లజుల కొసఁగి యమేయవైభవోపేతమయిన 'అభిమన్యునామక నగరమును' నొండు గట్టించి యచట స్వనామాంకిత మయిన చంద్రశేఖరాలయమును బ్రతిష్ఠింపఁజేసెను.

ఈ నరేంద్రుఁ డాకాలమున నరుదుగ సంభవవమగుచున్న 'పతంజలి మహాభాష్యమును' 'చంద్రాచార్యుఁడు' మున్నగు పండితులవలనఁ బడసి యుద్ధానిని ఆ విద్వాంసులు రచించిన కొండొక వ్యాకృతినిఁ దనదేశమునఁ బ్రచార మొనరింపఁ జేసెను.

ఈ తరుణముననే బోధిసత్త్వుఁడగు నాగార్జుననిచే సురక్షితులై దేశమునం దెల్లెడలఁ బ్రబలిన బౌద్ధులు - ఆగమవిద్వేషులై తమవాద నైపుణిచేఁ బండిత ప్రకాండుల నందఱ నోడించి నీల పురాణోక్తక్రియాకలాపమును విచ్ఛిన్నము గావించిరి. ఈ విధముగఁ గాశ్మీరమున బలికర్మాదులకు విచ్ఛేదము పొసఁగి క్రమక్రమముగ నాచారవిప్లవ మేర్పడెను. నాగులాసమయము గమనించి బౌద్ధ బాధకై రాష్ట్రమునఁ బ్రభూతహిమవర్షమును గురిపించుటఁజేసి జనక్షయ మగుచుండెను. అప్పటి హిమ సంహతి పాతము నోర్వఁజాలక యీ రాజన్యుఁడు ప్రతిసంవత్సరమునను శీతకాలమున నాఱుమాసములు 'ద్వారాభిసారము' మున్నగు ప్రదేశములందు వసించుచుండెను.

ఇట్లుండఁగాఁ గొంతకాలమునకు నచ్చటచ్చట బలిహోమాది విధానమును విడువక సక్రమముగ నిర్వర్తించుచుండిన ద్విజోత్తములు గొందఱు తమ యమోఘ మహిమచే నాగమద్వేషులగు బౌద్ధులను యమసదనమున కనిపిరి, వారిలో నొక్కరుఁడు కశ్యపగోత్రోద్భవుఁడగు 'చంద్రదేవుఁడు' అను బ్రాహ్మణ పుంగవుఁడు గాశ్మీరదేశమును దనమహిమచే నెల్లపుడు గాపాడుచుండు నాగాధీశ్వరుని 'నీలుని' గుఱించి యుజ్జ్వలమగు తపం బొనరింపఁగా, నీలుఁడాబాడబశ్రేష్ఠునకుఁ బ్రత్యక్షమై యీద్విజన్ముఁడు గోరినరీతిఁ దుహినవిప్లవమును నివారించుచు మరల స్వీయపురాణవిధి నాతని కుపదేశించి **తిరోహితుఁడయ్యెను.**

మొదట 'నొకచంద్రదేవు(డు' గాశ్మీరమునకు సంభవించిన యక్షవిప్లవమును అణచివేసెను. ఇపుడీరెండవ 'చంద్రదేవు(డు' భిక్షువిప్లవము నీతెఱంగునఁ బోకార్చి కాశ్మీరమును యథాస్థితికిఁ దెచ్చెను. ఎప్పుడు సత్కర్మముల ప్రాభవమే దేశమునకు శాంతిభద్రములఁ జేకూర్చును.

## మూ(డవ - గోనందు(డు

అభిమన్యువునకుఁ దఱువాత మూ(డవ గోనందు(డు రాష్ట్రపతియై నాగుల నుద్దేశించి మొదటినుండియు జరుపుచుండెడి యాత్ర యాగము మొదలగు నీలపురాణోక్త విధానముల నన్నింటిని యథావిధిగ జరిపించుచు నుండుటవలనఁ గాశ్మీరమునం దంతటను భిక్షుల యలజడి హిమబాధయు సంపూర్ణముగ నుపశమించెను.

లోకమున నాయాదేశపుఁబ్రజలుజేసికొనిన పున్నెముల పంటలో యన మహోన్నతాశయులై పొల్చు కొందఱు మహీభుజులు తమతమదేశములు ధర్మవిచ్యుతిచేఁ గరముత్సన్నత నొంది యుండఁ దమ పావనతమ మగు పరిపాలనావిధానమున మరల ధర్మవృక్షమును పుష్పపల్లవయుత శాఖా భరితము గావించి పునరుద్ధరించుచుందురు. ఇట్టి పార్థివోత్తములను రాజ్యలక్ష్మి తద్వంశపరంపరానుయాయి నియై విడువక యుండును. వీరియేలుబడిని(జెన్నారిన వసుంధర 'రాజన్వతి' యను పేరఁ బ్రఖ్యాతి గాంచును. ఇఁక సర్వదా ప్రజాపీడనపరులై కితవులగు మహీపతులు సాన్వయముగ వినాశము నొందుట తప్పదు.

గీ॥ ప్రజల భాగ్యరాశిఁ బండించు కాపులై
యప్పుడపుడు పుణ్యు లైన పురుషు
లవతరించి జీర్ణమై పోయినవి పున
రుద్ధరించి యశము నొందుచుంద్రు.

కం॥ ప్రజలను బీడించెడు భూ
భుజు(డు కులంబుడిపి దాను బొరయు నిరయమున్
ప్రజలకు హితముం గూర్చుచు
నజరామరకీర్తికాయు(డౌ నత(డవనిన్,

ఈ రీతినిఁ బ్రతిలక్షణము రాజోదంతములందు లక్షిత మగుచున్నది. కావునఁ బ్రాజ్ఞు లీదేశమునందలి భవిష్యద్భూమిపాలకుల శుభాశుభముల నిట్లే యెఱుంగవచ్చును.

గోనందు(డిట్లు తనదేశమునకు నూతన వికాసమును మరల నొకమాఱు గల్పించి యైహికముఁ బాసెను.

## ప్రవర సేను(డు

పిమ్మట తద్వంశ్యులు 'ప్రవరసేన' ప్రభృతులు సుకర్మాచరణశీలు రగుచుఁ గాశ్మీరమును జిరకాల మేలిరి. రఘువంశమునకు రఘుమహారాజువలె నీదేశమును బాలించిన 'గోనంద'

వంశజులలోఁ బ్రథముఁడుగాఁ నీతఁడు వన్నె కెక్కినవాఁడు. ఈరాజు కాశ్యపిని ముప్పది యైదేండ్లు పాలించెను.

## విభీషణుఁడు

తఱువాత నేఁబదిరైదు హాయనములు, ఆఱుమాసముల పరిమితి గల కాలము గోనందనుని నందనుఁడు 'విభీషణుఁడు.' అనువాఁడు గాశ్మీరమునకు నాయకుఁడయ్యెను.

## ఇంద్రజిద్రావణులు

అటుపై ఇంద్రజిద్రావణులు పాలకులయిరి. వీరిరువురును దండ్రికొమరులు. వీరిలోఁ గ్రమముగఁ దండ్రియగు నింద్రజిత్తు ముప్పదియైదేండ్లు నాఱునెలలును, రావణుఁడు ముప్పది యబ్దంబులును రాజ్యం జేసిరి. రావణుఁడు 'వటేశ్వరుఁడు' అని ప్రసిద్ధి నొందిన శివలింగమును జతుశ్శాలా మఠాంతర్భాగమునఁ బ్రతిష్ఠించి యత్యంతనియతితో నర్చించుచు 'వటేశ్వర' కైంకర్యమునకుఁ దన కాశ్మీరైశ్వర్యము నంతను నొసంగిన నెఱదాత. వటేశ్వరలింగమందుఁ జూపట్టు బిందురేఖాచ్ఛవి నయనానందకరమై భావి శుభార్థ సూచన సేయుచున్నట్లు కాన్పించును.

## రెండవ విభీషణుఁడు

రావణునియనంతర మతనిసూనుఁడు విభీషణుఁడు ముప్పదియైదేండ్లు నాఱునెలలుఁ గాశ్మీరమును బాలించెను.

## నరుఁడు

ఆవల నీ రెండవ విభీషణుని కొమరుఁడు 'నరుఁడు' అనుధరణీకాంతుఁడు రాజాసన మధిష్ఠించెను. ఈతని మహత్త్వమును గిన్నరులు కీర్తించుచుండుటంజేసి కొఁదఱు 'కిన్నరుఁడు' అను నామాంతర మితఁడు వడసెను. ఈ ధరాధిపతి స్వతస్సిద్ధమగు సదాచారసంపన్నత గలవాఁడైనను బ్రజాభాగ్య విపర్యయమున విషయలౌల్యదోషమునకు గుఱియై క్రమముగ మహానర్థ పరంపరకుఁ గారణమగు దొసఁగుల నొనర్చెను.

'కిన్నర' గ్రామమునందలి యొక విహారమునం దొకానొక బౌద్ధభిక్షువు వసించుచుండెను. ఆతఁడు తన యోగబలమున నీ పుడమిఱేని ప్రేయసి యగునొకకాంత నపహరించెను. ఆ కారణమున నీనరపతి క్రోధమూర్ఛితుఁడై తనరాష్ట్రమునందలి విహారములనెల్ల భస్మావశేషములఁ గావించి విహారములకై యొసఁగఁబడిన గ్రామములను భూసురపరమొనర్చెను.

మఱియు విమ్మహీజాని యానతిని వితస్తా సైకత సీమయందు నిర్మింపఁబడిన నగర మొండు గలదు. అత్యంతవైశాల్యము గలిగి విచిత్రాలంకరణములచేఁ జేతంబుల నుల్లసిల్లఁజేయు రాచబాటలు, సమస్తవస్తుసమృద్ధములైన యాపణంబులు, బాటసారుల కనుగవలను బలుమాఱు తమ క్కుఱు నాకర్షించునట్టి యెడతెగని నౌకాయానములతోడఁ దనరారు తరంగిణులును, సుపక్వఫలభరిత

తరునికరంబులతోడను సుగంధబంధుర వికచనానాసూన వితానోల్లాసిత లతాసంతానంబులతోడను నభిరామంబులగు నారామంబులును, గల యప్పీఁడు నామాంతరమునఁ బరఁగిన యావేల్పుల ప్రోలనియే చెప్పఁదగును. దిగ్విజయోపార్జితవిత్తసంపత్తిచే నానగరము విత్తేశ్వరుని యలకాపురినిఁ జాలకన సేయుచుండును.

ఈ రమణీయనగరమునకుఁ జెందిన యొక యుద్యానవనమున వినిర్మల మధురతర వారి పూర పరిశోభిత మగునొకసరోవరము గలదు. అయ్యది 'సుశ్రవసుండు' అను నాగవంశ్యున కావాసభూమి.

ఒకనాఁడు తరుణవయస్కుఁడు 'విశాఖుఁడు' అనునొక పుడమివేల్పు దూరాధ్వగమనమునఁ గడుంగడు బడలి ఛాయార్థియై మధ్యందిన సమయంబున కాకాసారంబుతీరంబుఁ జేరి యందలి శీతల తరుచ్ఛాయ నొప్పారు భూతలమున సుఖాసీనుఁడై కొలఁకుతరగలపైఁ దూఁగాడి వచ్చు సమీరకుమారుని వీవనలచే మార్గాయాసము నపనయించుకొని మెల్లఁగాఁ గొలనిలోని చల్లని జలము నాచమించి తాఁదెచ్చి కొన్న సక్తువును భుజింప నుద్యమించెను.

విశాఖుఁడు సక్తువును దనపాణియం దుంచుకొనుచున్నపు డచ్చటి కనతిదూరమునుండి వెలువడిన నూపురధ్వని యాతని శ్రుతిపథము నంటెను. ఆ కొలని గట్టున నడయాడుచున్న యంచలా యందెలమ్రోఁతను ముందే యాలించి యాదెసఁ బరికించుచుండుట నతఁడు గాంచుచుండఁగనే నీలచేలము లను ధరించిన యిర్వురు కన్యారత్నము లొక మంజుమంజరీమంజులమగు నికుంజమునుండి యితనికడ కరుదెంచిరి. ఆ మోహనాంగుల ధవళాపాంగముల విలసిల్లునతిసూక్ష్మములైన కాటుకరేఖలు వారు ధరించిన పద్మరాగమణిమండితములగు తాటంకములనుండి ప్రసరించుచుఁ గెందామరల మృణాళ లీలలను దలఁపించుచుండెను. మందమారుతాందోళితములై సౌందర్యపతాకాపల్లవములో యన నొప్పారు నా నారీమణుల చారుదృగంచలములు వారి యంసభాగముల సోయగమునకు మఱింత సొంపు గూర్చుచుండెను.

ఈరీతి నొప్పారునాచారులోచనలు ఆ కొలనిగట్టుననుండు పొదలోని తంబకాయలను దినుచుఁ దనచెంతకు రాఁగా 'విశాఖుఁడు' వారిని గారాబమునఁ జూచుచు సారెకు వ్రీడాజితుఁడై భోజనప్రయత్న మును మాని తనలోఁదానిట్లు దలపోసెను. "అకటా! కష్టము వాటిల్లినది. ఇట్టి యభిరామాకృతు లెక్కడ? వీరుతినునాహార మెక్కడ? వీరికి సక్తువు నొసంగెదను. గాక" అని కరుణార్ద్రహృద యుఁడై తనసక్తువు నావామనేత్రల కిచ్చి తినుండని వేడికొనెను,

పిదప సరస్సులోని స్వచ్ఛమగు శీతలాంబువును దొన్నెలతోడఁ గైకొని వచ్చి వారికిఁ బానీయముగ నర్పించెను. ఇట్లు ఆకలిదప్పు లుపశమించుటచే సుఖోపవిష్టలై యున్న యాతలిరుఁ బోండ్ల నాద్విజోత్తముఁడు తాళవృంతమందానిలమున నలసటఁ బాపుచు నిట్లు ప్రశ్నించెను.

"ఓ కల్యాణులారా! నాపూర్వపుణ్యములచే మిమ్ముఁ జూడఁ గంటిని. విప్రసులభమగు చాపల్యమున మీవిషయ మొకింత యడుగఁ గోర్కి యైనది. లావణ్యసీమలగు మీయాకృతు లేజాతి

అదిగో! ఆవృక్షమూలము నాశ్రయించి వ్రతనియతి ననుష్ఠించుచున్నవాఁ డొకసన్న్యాసి. అతఁడే యీప్రాంతమున కంతకును సస్యపాలకుఁడు. వానివలననే మేమిట్లు తిననన్నము లేక కాందిశీకులమై యుంటిమి. హేతు వేమన? క్రొత్తగ ఫలించిన ఫలాదికమును మాంత్రికులు ముందుగ భుజించిన తఱువాతనే నాగులు భక్షింతురు. ఇయ్యది మాసామయికము. ఈవ్రతి భుజించుట లేదు. ఆకారణమున మేము సరియగు నాహారము లేక వంత నొందుచున్నారము. ఈవ్రతి యియ్యెడ క్షేత్రపాలకుఁ డగుచుండుటచే నిచ్చట నతిసమృద్ధమగు ఫలసంపదను మేము కన్నులారఁ గాంచియుఁ బిపాసువులగు ప్రేతలు నదీజలమునువలె ననుభవింపఁ జాలకున్నాము.

మాదారిద్ర్యవిధ మిట్టిది, కావున నోద్విజపుంగవా! ఈ నైష్ఠికునికి సమయభ్రంశముఁ గావించి మాకుఁ దగినయోగిరముఁ గల్పించి పున్నెము గట్టుకొమ్ము. మేమును నుపకర్తలయెడఁ జూపదగ్గ కృతజ్ఞతను దప్పక పాటించి యుందుము.' అని సుశ్రవసుఁడు తమ యుదంతము నంతను దెలిపెను.

విశాఖుఁడును వారివృత్తాంతము సావధానుఁడై విని సుశ్రవసునితో "అట్లే నా శక్తికొలఁది మీ కార్యమునఁ బ్రయత్నింతును". అని పల్కి దృఢమైన పూన్కితోడ నా సస్యపాలకుని వంచించు నుపాయమును బగలు రేలు నాలోచింపసాగెను.

ఇట్లుండ నావ్రతి యొకనాఁడు క్షేత్రమునకు వెలుపలనున్న తనకుటీరమున నన్నము వండుట నెఱింగి విశాఖుఁడు నిగూఢముగ నందుఁబ్రవేశించి యాతనియన్నపుఁ బాత్రయందుఁ గ్రొత్తధాన్యపు టన్నము నొకింత యుంచి పోయెను. ఆ యతియు నయ్యాహారము నట్లే భుజించెను. నాగపతి తన సమయనియమము నెఱవేఱుటవలన మిగుల సంతసించి వెంటనే భీకరకరకాసారమును వర్షించుచు సర్వతస్సమృద్ధమగు ఫలసంపదను యథేష్టముగఁ దనవారితోడ ననుభవించుచుఁ దమయకించనత్వమును బోఁగొట్టుకొనెను.

పిదప మఱునాఁడే సుశ్రవసుఁడు దనకు మహోపకారమొనరించిన యవ్విప్రవరుఁడు సరస్త్రీరాభ్యర్ణగతుఁడై యుండ వానిని దన నివాసమునకుఁ గొనిపోయి యచ్చటఁ దనకుమారీరత్నముల నాతనికి సముచితసపర్యలు సేయున ట్లాదేశించి ప్రతిదినము నమర్త్యసులభములగు భోగములచే నాద్విజన్ము నెంతయు సంతోషపెట్టుచుండెను.

విశాఖుఁడచ్చోట నిట్లు కొంతకాలము గడపి నిజనివాసమునకుఁ బోఁగోరి యచ్చటివారి నందఱ వీడ్కొనుతరుణమున మున్ను సుశ్రవసుఁడు తాను గోరినవరము నిచ్చెద నని ప్రతిన యొనర్చి యుండెను గాన నతనితనయను జంద్రలేఖ నొసంగుమని యాతని నర్థించెను.

సుశ్రవసుఁడును దనకాబాడబునితోడి బాంధవ్యసంబంధము సరిగాదని యెఱింగియుఁ గృతజ్ఞతాగుణమునకు వశంవదుఁడై తనకుమారినిఁ బుష్కలంబగు ధనంబుతోడ నొసఁగి యతనిని వీడ్కొల్పెను.

ఇట్లాద్విజవతంసము చంద్రలేఖాశ్రీ వైభవమునఁ దనరారుచు నరపురమున కేతెంచి యచ్చట నానావిధ నిత్యోత్సవములతోడఁ జిరకాలము సుఖముగఁ గడపెను. చంద్రలేఖయుఁ బతియె

దైవతముగఁ దలంచుచు సదాచార సౌశీల్యాది సద్గుణ నిధానమనఁ బేరొందిన పరార్థ్యశ్రీ సముపేతమై విశాఖుని నానందాంబుధిఁ దేల్చుచుండెను.

ఒకప్పుడు చంద్రలేఖ సౌధోపరిభాగమున నుండఁగాఁ దనగృహప్రాంగణమునకు వెలుపల నెండఁబోసినధాన్యము నచ్చట నడయాడు గుఱ్ఱమొకటి తిననారంభించెను దానినివారించుటకై భృత్తులను బిలుచుచు సౌధాగ్రమునుండి మంజు మంజీర శింజితముతోడ వేవేగ దిగువకుఁ జనుదెంచుచుండుటచే జారిన శీర్షాంశుకమును నొకకేలఁ బట్టుకొని రెండవ పాణిపంకజమున నాహాయమును స్వయముగఁ బ్రహరించెను.

ఆవ్రేటు దిని యాయశ్వము భోజ్యమును మాని యటనుండి పోయెను. కాని వింత యేమన దాని శరీరమున నాగాంగన హస్తస్పర్శమువలన సౌవర్ణ పాణిముద్ర యొకటి యేర్పడెను.

అంతకు మునుపే కాశ్మీరపతి 'నరుఁడు, చంద్రలేఖయొక్క రూపరేఖాదులను చారులవలన వినియున్నవాఁడగుటచే ద్విజపత్ని యనియు శంకింపక యంకురించిన స్మరవికారమునకు లొంగియుండెను. క్రమముగ మిక్కుటమైన మాన్మథోన్మాదంబునఁ బెరుగిడుచున్న యానరుని యంతఃకరణ వారణము అపవాదభయ మనెడు నంకుశమును సరకు సేయకపోయెను. ఇట్లు ద్వృత్తమైన రాగానల విప్లవమునఁ బడియున్న యీనరపతిని నప్పటి యీహయవృత్తాంతము సుడిగాడ్పువలె బెట్టిదంపుటిడుమకు గుఱిచేసి యుండుననన్న వింత యేముండును?

ఈరీతి విలుప్తధైర్యుఁడైన యీ భూజాని హయకాయమునందు సరళాంగుళిశోభమానమై చూపట్టు నానాగయువతి కాంచన కరాంకముచే శశాంకునిచే సముద్రుండునుబోలె నతిక్రాంతమర్యాదుఁడై తుదకు వ్రీడాశృంఖలముల విడిపించుకొని తనమనమునందలివలపు నాంతరంగికులగు చారుల మూలమున నాసాధ్వి కెఱుకపఱచి యమ్మానిని డెందము నత్యంతము కలఁత పెట్టెను, తేజఃపుంజము నంధకారము డాయుట గలదా! కాశ్మీరపతి తనయుపాయములెల్ల విఫలములైనను నంతతోఁబోక సిగ్గుమాలి తుదకుఁ దనకోరిక నెఱవేర్పుమని యాపుడమివేల్పును నయిత మడిగెను, "గారాంధులకుఁ ద్రపయు బుద్ధియు శూన్యము" అని చెప్పుట కింతకంటె వేఱు దృష్టాంతము వలయునా?

విశాఖుఁడు నరపతికామాంధ్యమును నిందించుచు నతనిఁ బెక్కువిధములఁ దిరస్కరించి తూలనాడి పంపెను. ధూర్తుఁడగు నాఱేఁడు మఱింత దృప్తుఁడై 'బలాత్కారమునఁ జంద్రలేఖను బట్టితెండు' అని తన సైనికుల నియోగించెను. చెట్టు చెడుకాలమునకుఁ గుక్కమూతిపిందెలు పుట్టు ననుట కిట్టిది దార్కాణగాఁ గైకొనవచ్చును.

అంత రాజునానతిని సైనికులు విశాఖుని గృహపురోభాగమును ముట్టడించి యుండఁ జూచుము! అపాయుఁడు సేయునది లేక వేఱొక యిఱుకు బాటను గూఢముగ జాయతోఁగూడ నెట్లో యిల్లు విడిచి సత్వరముగ నాగపతినికేతనమునకుఁబోయి తనకుఁబాటిల్లిన కీడాతనికిఁ దెల్పెను.

ఈ వృత్తాంతము నాలించిన పాఁపఱేఁడగు సుశ్రవసుఁడు పుత్రికా పరాభవజనితమగు నాపరాని కోపావేశమున నిట్టూర్పులు వుచ్చుచుఁ దోడనే సరోవరము వెల్వడి తన మాయాబలమునఁ

గాటుకవంటి కాదంబినీ కదంబములను సృజించెను. అవి కల్పాంత భైరవంబుగ గర్జిల్లుచుఁ గడలెల్ల నంధకారబంధురముఁ గావించి యగ్నికణముల వర్షించి నరుని నతని నగరముతోడ వైశ్వానరుని యాహారముగా నొనర్చెను.

ఆ సమయమున దగ్ధములయిన ప్రాణులనుండి స్రవించుచున్న వసాస్నేహములతోడఁ బ్రవహించు వితస్తానది మయూరీచంద్రకములచే నంకితమైనట్లొప్పారెను. అట్టి భయంకరోపద్రవమునఁ జక్రధర ప్రాంతమునకు శరణార్థులై వికావికలుగ బర్వులిడెడు నానా జంతు సంతానములు, సహస్రముల కొలఁది యా విలయాగ్నియందు శలభములమాడ్కి నొక్క ముహూర్తమున రూపఱి పోయెను. తొల్లి 'మధుకైటభులు' అను రక్కసులను జక్రి తెగటార్చినప్పుడు వారి మేదస్సు తనయూరుభాగముల వఱకు మాత్రమే సోఁకియుండెను. ఇప్పుడు కాలిపోయిన ప్రాణుల మేదోవసాదికము చక్రధరుని సర్వాంగములయందు ననులిప్తమైనట్లయ్యెను.

మఱియు నత్తరుణమున సుశ్రవసుని సోదరి 'రమణి'యను నాగవనిత యద్రిగహ్వరము నుండి సోదరునికి సాహాయ్యముసేయ బయలుదేరివచ్చుచు మార్గమునందొక్క యోజనమున కెక్కువగు దూరమందె తన సోదరుని కార్యము ఫలవంతమయ్యెనని యెఱింగియుఁ దనివి నొందక యశ్మరాసుల నచ్చటి గ్రామములపై మిక్కుటముగఁ బడవైచెను. ఆ కారణమున నైదు యోజనముల పరిమితిగల జానపదోర్వి ఖిలమై యిప్పటికిని 'రమణ్యాటవి' అను నామమునఁ బిలువఁబడుచున్నది. అందలి గండశిలలు చూచిన విస్మయమగుచుండును, సుశ్రవసుండును నిట్టి ఘోర మారణక్రియఁ దాను గావించి నందుకు నెంతయుఁ బశ్చాత్తప్తుఁడె లోకనిందవలనిభీతిచే నిర్విణ్ణుఁడై మఱునాఁడుదయముననే వెడలిపోయి యచటికి దవ్వులనున్న యొక పర్వతమునందుఁ బాలకడలివలె నతి ధవళమై చెల్వొందు వేఱొండు కొలఁకు నిర్మించుకొనె. అమరేశ్వరుని దర్శింప యాత్రసేయు జనుల కామనోహరకాసారము ఈ కాలమునను గానవచ్చుచునే యుండును. మఱియు నీ నాగాధిపతియొక్క యనుగ్రహమువలన ద్విజన్ముఁడగు విశాఖుఁడును నాగరూపము నొందుటంజేసి 'జామాతృసరస్సు' అను మఱియొక కొలను గూడ నచ్చోటనే ప్రఖ్యాతమయ్యెను.

విమర్శించి చూచినచో ప్రజాపాలన వ్యాజమున నిట్టి పుడమిఱేండ్లు కొంద ఱాకస్మికముగ నిశ్శంకముగఁ దనను దనవారిని సమూలముగ నిర్మూలించు చుందురని విదిత మగుచున్నది.

గీ॥ ప్రజలఁ బాలించు నెపమునఁ బ్రభువు లగుచు
గొంద ఱున్నటులుండి సంకోచ మేమి
లేక యంతక సదృశులై లోకమునకు
హాని గలిగించుచు నశింతు రక్లై తారు.

ఔరా! సర్వతోదగ్ధ మగు నరుని నగరమును ఎండిన బిలముగా నున్న యా'నాగసరస్సు'ను 'చక్రధరో'పకంఠమున నిప్పుడును జనులు గాంచుచు నందుకు హేతుభూత మగునీకథను స్మరించు చుందురు. రాజులందుఁ జూపట్టు నిట్టి హేయమైన రాగ దోషము అల్పబుద్ధులగు వారికంత గొప్ప తప్పుగా గోచరింపదు. కాని ప్రకృతమునఁ గాశ్మీరపతి రాగదోషమునం జేసి యెక్కుడను నిదివఱ వ్యాతికిని సంభవింపని మహానర్థము దనకును దన ప్రజలకును వాటిల్లుట మఱువరానిది.

కావున సతీమతల్లులకును దేవతలకును సద్బ్రాహ్మణులకును నవహాసము గావింపరాదు. వారిలో నేయొకరి యల్కయైనను ముల్లోకములకుఁ దీరని మహాతంకము కల్గింపఁ జాలియుండును.

కం॥ సతులకు సద్విజులకు దే
వతలకుఁ గోపంబు పుట్టు పాడు పనులచే
హితము చెడుఁ దీవ్రకష్ట
స్థితు లేర్పడుఁ దనకు నెల్లదేశంబునకున్॥

ఈ నరపతి ముప్పది తొమ్మిది వత్సరములుఁ దొమ్మిది నెలలును విశాలమగు కాశ్మీరము నను భవించి తనదుష్టచేష్టలవలనఁ గడకిట్టి దుర్గతి నొందెను. రమణీయతర ప్రాకారాట్టాలకాదులచేఁ గనువిందొనరించుచుండిన యీకాశ్మీరపతి కిన్నరపుర మొక్కత్రుటిలో గంధర్వనగరమువంటి దగుట విస్మయ విచారముల కాస్పద మగువిషయముగదా!

## సిద్ధుఁడు

కర్మగతి గహనమైనది. అది మిగుల విచిత్రమైనదియు నగుచున్నది. కాశ్మీరధవుఁడగు నరునకు నొక్క సుతుఁడు మాత్రమే యుండెను, ఆతనిపేరు 'సిద్ధుఁడు', జనకునిదుశ్చర్యచే వాటిల్లిన అమ్మహోపద్రవమున నతఁడు లీనము గాకపోవుట యతని భాగధేయబల మనవలయును. ఆ విప త్కాలమున నతనిధాత్రి వాని నెత్తి 'విజయక్షేత్రమునకుఁ' బ్రాణములతోడఁ గొనిపోఁ గల్గెను. కావున నతఁడు గాశ్మీరపతి యయ్యెను.

సిద్ధుఁడు రాజైన తర్వాత నట్లు సర్వవిధముల నష్టమైన రాష్ట్రమున నతఁడు కార్చిచ్చుచేఁ గాలియున్న కొండయందు ఘనబృందమువలె మరల నొకింత చైతన్యము నంకురింపఁజేసెను. విస్మయ కరమగు తండ్రి యితివృత్తము విశుద్ధబుద్ధి యగునీసిద్ధునకు "సంసార మసారమైనది." యను గుణ పాఠమును గఱపెను. ఇతఁడు రాజ్యభోగముల ననుభవించుచున్నను పాపమాలిన్య మితని నంట లేకపోయెను. హ్రదాదులందుఁ బ్రతిఫలించి నంత మాత్రమున సూర్యచంద్రులు పంకసంకీర్ణులు గారు గదా! మఱియు దర్పజ్వరోష్మచే నభిభూతులైన రాజు లెందఱు లేరు? గుణవంతుఁడైన యీతఁడు మాత్రమట్టివాఁడు గాక తనకుండు ధనకనకమణివాహనాదులఁ దృణమువలె గణించుచు ఖండేందు మండనుని యర్చలకై యఖండమండనముల నర్పించుచు సర్వదా సుధాకరకలామౌళి సేవలచేఁ బ్రొద్దు పుచ్చుచుండెడివాఁడు.

ఇట్టిధరిత్రీవల్లభుఁడు ధర్మపథము నణుమాత్రమేని దొలఁగక యఱువది యబ్దంబులు గాశ్మీ రముఁ బాలించి పార్థివశరీరముతోడనే సన్నిహితనిజానుచరులతోఁ గూడి యాబాలేందుశేఖరుని లోకముఁ జేరఁగల్గెను.

ఇట్టి సంఘటనము విమర్శకుల మనస్సు నత్యంత మాకర్షించుచున్నది. అవ్యవహితులగు తండ్రి కొమరుల యేలుబడి నుండిన దేశమునందు నెంత విషమ మగు నాంతర్య మేర్పడెనో దెలిసి

కొంటిమి. నరునియందు నుండిన ప్రజలు శోచనీయావస్థ నొందిరి. అతనిసుతుని యాశ్రయమునఁ బెంపొందిన ప్రజలు భువనస్పృహణీయమైన మహోన్నతిం గనిరిగదా! ''యథారాజా తథాప్రజా'' యన్న లోకోక్తి యిట నెంతేని సంగతమైనది.

కూపయంత్రపునఁ దగుల్కొన్న తృణనికర మధోగతి నొందుచున్నది. అయ్యది పుష్పా శ్రయి యయినచో వేల్పుల నౌదలలపై నత్తుకొని యుండును, ఇట్లే మానవుఁడు దా నెవరి నాశ్రయించి యుండునో వారొందెడు నీచోచ్చగతుల నొందవలసి యుండును.

మ॥ ధరపై నాశ్రితుఁ డాశ్రయోపచితనిం
దం గాని, సర్వప్రజా
దర పాత్రం బగు కీర్తి నేని గను; స
త్యం బెట్లనన్, గూపయం
త్ర రయంబందునఁ జిక్కినట్టి తృణసూ
త్రం బౌ నధోగామి; య
ట్ల రయన్ బువ్వుల నాశ్రయించి సురశీ
ర్షామోదియై యొప్పదే?

కావున సదాశ్రయమునకై మున్ముందు జాగరూకత వహించుట పాడి యగును. ఈరీతి నబ్బురముగ సిద్ధుఁడు మర్త్య శరీరముతోడ సిద్ధుఁడగుటంజేసి సిద్ధసాధ్యాదిఖేచరులు దమహర్షమును వెల్లడించుచుఁ బెద్దతడవు పటహనినాదము గావించిరి.

## ఉత్పలాక్ష హిరణ్యాక్షులు - హిరణ్యకుల వసుకులులు

సిద్ధునియనంతరముపై నతనితనయుఁడు ఉత్పలాక్షుఁ డన్వర్థనామధేయుఁడు రాజయ్యెను. ఇతఁడు ముప్పది సంవత్సరములు ఆఱునెలలును రాజ్యమేలెను. ఇతనియనంతరము వీనికుమారుఁడు 'హిరణ్యాక్షుఁడు' ముప్పదియేఁడబ్దంబులు నేఁడునెలలును వసుమతినిఁ బాలించెను. హిరణ్యాక్షునకుఁ దర్వాత నతని పుత్రుఁడు 'హిరణ్యకులుఁడును' నతని పౌత్రుఁడు 'వసుకులుఁడు' ననువారు ప్రత్యేకముగ నఱువదేసి సమంబులు కాశ్మీర వసుంధరను పరిపాలించిరి, హిరణ్యకుఁడు 'హిరణోత్స్యము'నకు నిర్మాత యయ్యెను. ఇట్టి తరుణమునఁ గాశ్మీర మంతకంతకు మ్లేచ్ఛగణాకీర్ణ మగుచుండెను.

## మిహిరకులుఁడు

వసుకులుని యనంతర మతనితనూజుఁడు 'మిహిరకులుఁడు' కాశ్మీరపతి యయ్యెను. నిక్కముగ నక్కాలమున నుత్తరదిశ యామ్యదిశాజిగీష గలదై తా ననన్యాదృశుఁడైన యొక యంతకునిఁ బతిగా వరించెనో! యన్నట్లుండెను. ఈభూపాలబేతాళుఁడు తనసేనావ్యూహములతోడ శాత్రవనికరమును జుట్టుముట్టి పరిమార్చునపుడు అచ్చో నేర్పడు పీనుంగులప్రోవుల భుజించుటకై

కుతుకంబునఁ బర్వెడి వచ్చుకాకులు గ్రద్దలు మొదలగు శకునినికరంబు చితనిచెంగట మూగుచుండె డివి. ప్రజలట్టిభీకర దృశ్యమును జూచి యత్యంతభయభ్రాంతులై యీరాజు సాన్నిధ్య మెట్టిది గదా! యని యడలుచుఁ జింతతోఁ గుములుచుండిరి. ప్రాణిహింసాపరుఁడును ఘోరాకృతియు నగునీతఁడు పగలు రేయి అనునియమము లేక తనవిలాసభవనములందు సయితము పెక్కుజీవులను హింసించు చుండువాఁడు. ఈ నృశంసునకు నెల్లపుడు ప్రాణిహింసయే యొక క్రీడగానేర్పడెను. కావుననే బాలుర యెడఁ గారుణ్యము అబలలయెడ ననుకంపయుఁ బెద్దలయెడ గౌరవమును బ్రజలయెడ నెనరును అనునవి యితనియం దేకోశమునను గాన్పింపకుండె నన నిఁకఁ జెప్పఁదగినదేమున్నది?

ఒకప్పుడు మిహిరకులుఁడు తనదేవేరి ధరించిన సుందరమగు సింహళదేశపుఁగంచుకమునందు నాదేశపురాజుయొక్క హైమ పాదాంకముఁ గన్గొని మండిపడుచుఁ గంచుకిని రావించి యాసంగతిని గుఱించి యడిగెను. అతఁడు "సింహళదేశమున నిష్పన్నమైన చేలములు ఆదేశపు నరేంద్రుని పాద ముద్రచే నంకితములై వెలువడుచుండును." అని వచించెను. మిహిరుఁడామాట విని తోఁకఁద్రొక్కిన కోడెత్రాచువలె దుర్నిరీక్షుఁడై "వెంటనే సింహళముపై దండయాత్ర సాగింపుఁడు." అని సేనాపతుల కానతి యొసంగెను.

అపుడు సమరకుతూహలమున విజృంభించుచతురంగబలము దక్షిణాంబుధిఁ జేరెను. అచ్చోట నడగొండలో యన నొప్పెడు మిహిరుని సైన్యమునందలి మత్తేభములయొక్క మదాంబుపూరవాహిని తోడ సంగమించిన యాదక్షిణసాగరుఁడు యమునాశ్లేషజనితమైన నితాంతసంతోషము ననుభవించెను.

అట్టితఱి లంకయందు నక్తంచరసందోహము సౌధోపరిభాగములఁ జేరి దవ్వులందున్న మిహిరకులుని సేనాసముదయమును గాంచి "మరల రాఘవుండు తమ పట్టణంబు ముట్టడింప సైన్య సన్నాహముతోడ వచ్చుచున్నాఁడేమో" అని భయకంపితమగుచుండెను. కొంత తడవున కిరువాగుల వారును ఘోరసమరమునకుఁ దలపడిరి. కాశ్మీరపతి మొక్కవోని పూనికతోఁ జిరకాలము పోరి పోరి తుదకు సింహళేంద్రుని నోడించి తనప్రేయసి కంచుకమునందలి పాదముద్ర గాంచుటచేఁ గలిగిన క్రోధాగ్నినిఁ జల్లార్చుకొని మార్తాండబింబచిహ్నిత మగు 'యముషదేవము' అను వస్త్రవిశేషమును గైకొని తనయనుగ్రహమునకుఁబాత్రుఁడైన వేఱొక రాజును సింహళమునకు నధినేతగ నియమించెను.

మిహిరకులుఁడు సింహళరాజును జయించి దాటినదుమ నున్న చోళ, కర్ణాట, లాట, ముఖ్య దేశముల భూపాలురు, అతనియాగమనవార్తామాత్రమున సామాన్యగజములు గంధసింధురము యొక్క గంధము సోకినంతన చెల్లచెదరై పరుగులిడునట్లు పేరెము వాఱి మూలమూలల నొదిగికొని యతఁడు తమనగరములను గడచిపోయిన తఱువాత శృంగభంగము నొంది విన్నఁదనముతోఁ దమప్రోలనున్న నగరప్రాసాదలక్ష్మినిఁ గాంచి మఱింతతలలువంచుకొనిరి.

అట్లాయాదేశములరాజులను దనకరిగాపులఁ గావించుచుఁ గాశ్మీరభూధవుఁడు తనరాజధాని ద్వారము దగ్గఱకు వచ్చెను. ఆసమయమున నచ్చట నొకయేనుఁగొక మహాగర్తమునఁ దలక్రిందుగఁ బడి మహాభయమున బిగ్గరగ నఱచుచుండ నది యాలించి సంతోషభరమున మేనఁ బులక లంకురింప

నట్టియానందమును బొందుమారనుభవింపఁగోరి యానికృష్టుఁడు శతసంఖ్యాకములగు గజముల నారీతి శ్వభ్రములందుఁ బడఁద్రోయించి వానియార్తధ్వని వినుచుఁ బరమానందము నొందెను.

ఈమిహిరకులుని క్రూరకార్యము లిట్టివి పెక్కు గలవు. 'మిహిరకులుఁడు' 'రాజు' అను పదము లితని నాశ్రయించి యపవిత్రము లైనవి. పాపులస్పృశించుటవలన దేహము దూషిత మగును. అట్లే పాపవర్తనుల వృత్తాంతమును జెప్పినను వాక్కు దుష్టమగును. కావున నితఁడొనర్చిన యితర నృశంసకార్యములఁ జెప్పఁ దగదని విరమించుట మేలు.

వింతచైదముల నొనర్చు ప్రాకృతమానసుల ప్రవర్తన మేరి కర్థ మగును? ఇట్టి దుర్బుద్ధి యగుమిహిరుఁడు పేర్వడయవలయు నని కాఁబోలు శ్రీనగరియందు 'మిహిరేశ్వరుని' బ్రతిష్ఠింపఁజేసి 'హోలడ'యందు 'మిహిరపురము' అను గొప్ప నగరమును నిర్మింపఁజేసెను. గాంధారదేశపు బ్రాహ్మణులు శీలమున నీ మిహిరునకు సాటి యగుదురని నుడువవలయును.

ఆశావకాశముల నంధతమసాక్రాంతముల నొనర్చు నూతనజలదాగమమునకు నెమళ్ళు పింఛముల విప్పి యతికుతూహలమున నృత్యము సేయును. నిర్మలాకాశభాసుర మగు శారదసమయమున నంచగమి యెంతయు సంతసించును. ఇట్లే దాతకును బ్రతిగ్రహీతకును గుణములందు సామ్యముండినఁగాని యొకరియెడ నొకరికిఁ బ్రీతి యేర్పడదు.

ఉ॥ కారుమొగుళ్ళఁ జీఁకటులు
గ్రమ్మెడు కాలము కేకిసంఘమున్
భూరి వినిర్మలత్వమునఁ
[illegible] యంచ[illegible]
గూరిమిఁ దప్పు. సపగిదిఁ
గుంభిని దాతలు నర్థు లొండొరుల్
దోరపుఁబ్రీతి నొప్పుటకుఁ
దుల్య రుచిత్వమె హేతు వయ్యెడున్.

మిహిరునకు గాంధార ద్విజులకు నిట్టి తౌల్యమేదో యున్నదని నిక్కముగఁ జెప్పవచ్చును. భూలోకభైరవుఁ డనఁజెల్లు నిమ్మిహిరకులుఁడు డెబ్బది వత్సరములు రాజ్యభోగముల ననుభవించి తుదకు మహావ్యాధులచే నత్యంతము బాధితుఁడై యగ్నియందుఁ జొచ్చి యాత్మహత్య గావించుకొనెను. రతని తనుత్యాగ సమయమున నాకసమునుండి యశరీరవాణి "ఆహా! మూఁడుకోట్ల జీవులను వధించిన యీనృశంసునకుఁ గడపట స్వకీయాత్మయందును గారుణ్యము శూన్య మయ్యెఁగదా!" యని యనుట వినవచ్చెను.

కొంద ఱితని చరిత్రవిషయమున నిట్లు చెప్పుచున్నారు. "అపవిత్రాచారులగు దారదులు, భౌట్టులు, మ్లేచ్ఛులును గాశ్మీరదేశము నాక్రమించి ధర్మవిచ్యుతి గావింప మొదలిడినపు డీమిహిరకులుఁడు

వారి నందఱిని సకుటుంబముగ రూపుమాపి మరల ధర్మమును బ్రవర్తింపఁజేయుచుఁ దా నొనర్చిన మారణకృత్యమునందలి తననిష్కరుణతాదోషమును వొలఁగించుకొనుటకు దారుణతపం బాచరించి తుదకు స్వశరీరదాహమునఁ బ్రాయశ్చిత్త మాచరింపసంకల్పించినవాఁడై ముందుగా 'విజయేశ్వరము' నందు గాంధారదేశీయులగు ద్విజన్ములకు వేయి యగ్రహారముల నొసఁగెను, పిమ్మట కత్తులు బాకులు మున్నగువానిచే నిబిడమై మండెడు తప్తాయః ఫలకమునం దతిసాహసముతో నుఱికి తనువును బాసెను.'' ఇయ్యది కొందఱ మతము.

ఒకప్పుడు నాగపతి క్రుద్ధుఁడై మిహిరునినగరమును దహింప, నట్టియవకాశమున 'ఖశులు' ప్రబలప్రాభవము నొంద నుద్యోగింపఁగా వారియున్మూలనకాలమునఁ బూర్వోక్తమగు నతనివృత్తాంతము జరిగి యుండె ననియుఁ బురుషసింహుఁడగు నీమిహిరునిక్రౌర్య మవిగర్హితమైనదనియు మఱికొందఱు నుడువుచున్నారు.

మఱియు నీమహీపతి 'చంద్రకుల్య' యనుపేరఁ బ్రఖ్యాతి నొందిననదిని దనరాష్ట్రమునకుఁ గొనివచ్చునపుడు మార్గమధ్యమున నొకమహాశిల యడ్డుపడి యంతరాయ మొనర్చెను. ఇతఁడెంత ప్రయత్నించినను నక్కడనుండి యాశిలను బెకలింప నలవి గాకపోవుటచే నందేదేని మాహాత్మ్య ముండునని మహాతపం బొనర్చి దేవతల మెప్పింప వారును నీతనికి స్వప్నమందు గోచరించి ''ఓరాజా! మహాబలశాలియు బ్రహ్మచారియు నైన యక్షుఁడొకఁడీశిల నాశ్రయించి యున్నాఁడు. సాధ్వి యగు యోషామణి యీశిలను స్పృశించెనేని యందలి యక్షుఁడు నీయత్నమును నిరోధింపఁ జాలకుండును.'' అని ప్రబోధించిరి.

అంతనీమిహిరకులుఁ డాయా కులాంగనలు శిలను దాఁకునట్లు నియోగింప నెల్లవారు నట్లు గావించిరి. కాని, ఫలము లేక పోయెను. చివరకు 'చంద్రవతి' యను నొక కుమ్మరి వెలఁదుక యాశాతినిఁదాఁకినతోడనే యచ్చెరువుగ నాపెద్దబండ కదలి యయ్యేటినీటియురవడికి లొంగిపోయెను.

అంతట నిమ్మిహిరుఁడు వింతయగు నీచర్యకుఁ బ్రచండక్రోధోద్రిక్తుఁడై తనదేశమునందలి స్త్రీలు మహాపరాధ మొనర్చిరని తలంచుచుఁ బతిసుతభ్రాతృసమేతలగు మూఁడుకోట్ల కులాంగనలను గృపాత్రపలు దవ్వులం ద్రోలి తనకరవాలమున కెర యొనర్చి తుదకుఁ దాను మున్ను దెల్పినతీరున నతిసాహస మొనరించి యసువులఁ బాసెను. ఈరీతి మఱికొందఱమతమున నతనిచరితము వెల్లడి యైనది.

ఏది యెట్లున్ననేమి? సర్వమును బరికింప సహేతుక మైనను ఇతఁడొనరించిన యింతటి ఘోరమైన ప్రాణిహింస చాల నింద్యమనుట కెట్టిసందియమును లేదు. ఇంతక్రూరుఁడగురాజు నాకాలపుఁబ్రజలెల్లరు నేకమై సమయింపకపోవుటఁ జూడఁ బ్రాణిహింసాపరాయణులైన దేవతలే నృశంసుఁడగు మిహిరకులుని రక్షించి యుందురని తోఁచుచున్నది. ''పాపీ చిరాయు స్సుకృతీ గతాయుః'' అనిగదా యార్యోక్తి!

## బ కుఁ డు

ఎట్టకేలకుఁ బ్రజలు చేసికొన్న పుణ్యము చిరకాలమున కీమిహిరునిమృతిరూపమున ఫలింపఁగా సదాచారసంపన్నుఁడైన యితని కుమారుని 'బకుఁడు' అనువానినిఁ బౌరులు రాజ్యాభిషిక్తునిఁ గావించిరి. బకుఁడు సగుణములు గలవాఁడైనను నతని జనకుని యాధిపత్యమున ననుభూతచరమగు భయాతిరేకమును నిప్పుడును నతనిసాన్నిధ్యమునఁ బ్రజలు గన్పఱచుచునే యుండిరి. కలావిలాసభాసురమైనను సౌధము శ్మశాన నిర్మితమైనచో నివసించుటకు భీతి, పుట్టించునుగదా!

మిహిరుఁ డత్యంతసంతాపదాయకుఁడైనను అతనిసుతుఁ డీబకుఁడు మాత్రము మండు వేసంగి కడపట శ్యామజీమూతమునుండి వెలువడు తొలకరివానవోలెఁ బ్రజలకు నత్యాహ్లాదము నొసఁగుచుండెను. ఇతనికాలమునఁ బ్రజలు లోకాంతరమునుండి ధర్మమవతరించినదా! యని దలఁచుచుండిరి. దీర్ఘప్రవాసము నొందిన 'అభయ' దానరూపమగు ధర్మము మరలఁ గాశ్మీరమునఁ గుదురుకొనినది. బకభూపతి 'బకశ్వభ్రమున' 'బకేశుని' 'బకవతి' యనునదిని నెలకొల్పి తనయపూర్వ శ్రీవైభవమును సూచింపఁగల 'లవణోత్సము' అను నగరమును గూడ నిర్మింపఁజేసెను. ఇతఁడు అఱువది మూఁడు సంవత్సరములు పదుమూఁడు దినములు రాజ్యభారమును వహించెను.

అనంతరము ఒకనాఁడు 'భట్టా'భిద యనునొక యోగేశ్వరి ప్రదోషసమయమునఁ గమనీయాకృతితో మనోహరమధురసల్లాపములచే నీతనిడెందము నాకర్షించి "యాగోత్సవమాహాత్మ్యముఁ జూతువు రమ్ము" అని యాహ్వానించెను. బకుఁడును ఆయమ్మ యాహ్వానమును హర్షపూర్వకముగ సమ్మతించి యామెను వీడ్కొనెను.

మఱునాఁడుదయముననే సకుటుంబపరివారముగ యాగోత్సవమును సేవింప నియమిత ప్రదేశమునకుఁబోవ నచ్చోట సిద్ధముగ నున్న యాయోగేశ్వరి ఈకాశ్మీర ధవునిఁ దానుపాసించుదేవీచక్రమునకు నుపహారముగ సమర్పించెను. పిమ్మట నాయోగేశ్వరి తన పూనిన క్రియాదీక్ష నెఱవేఱుటచే యోగసిద్ధయై యెంతయు నాశ్చర్యకరముగఁ దృటిలో గగనతలమున మెఱయుచుఁ బోయెను. ఆయోగేశ్వరి వ్యోమతలము నాక్రమించుటను సూచించునట్టి యామె మోఁకాటి ముద్రలజంట యచ్చటి ఱాతిపలకపై నిప్పుడును (కల్హణుని కాలమునను) గానవచ్చుచునే యున్నది. మఱియు 'భేరీమఠమండలి' 'శతకపాలేశుఁడు' 'మాతృచక్రము' ఆయోగేశ్వరిజానుముద్రలచే నంకితమగు శిలయు నిప్పుడును గానుపించుచు నీవృత్తాంతమును దలంపునకుఁ దెచ్చుచుండును.

## క్షి తి నం దుఁ డు

బకుఁడీరీతి పుత్రపౌత్రోపేతుఁడై కాలగతి నొందినను దేవ్యనుగ్రహమున నతనివంశాంకూరముగ నొక్క 'క్షితినందుఁడు' మాత్రము మిగులుటచే నతఁడు రాజై గాశ్మీరమును ముప్పది యబ్దంబు లేలెను.

## వసునందుఁడు

తదుపరి క్షితినందునిసుతుఁడు 'వసునందుఁడు' ఏఁబదిరెండు హాయనములు రెండు నెలలును గాశ్మీరపతి యయ్యెను. ఇతఁడు'కామతంత్రమును' రచించినట్లు ప్రతీతి గలదు.

## నరుఁడు - అక్షుఁడు

వసునందునియనంతరము తత్తనూజాతుఁడు 'నరుఁడు' అనువాఁడును నరునితఱువాత నతనియాత్మజుఁడు 'అక్షుఁడు'ను ప్రత్యేక మఱువదేసి వర్షంబులు పాలకులైరి. అక్షుఁడు తననామమున 'అక్షవాలము' అనునొక గ్రామమును నిర్మింపఁజేసెను.

## గోపాదిత్యుఁడు

అక్షునితర్వాత నతనితనయుఁడు 'గోపాదిత్యుఁడు' కాశ్మీరమును మఱికొన్ని దీవులను సైతము పాలించుచు వర్ణాశ్రమాది ధర్మములయెడ బద్ధాదరుఁడై యాదర్శభూతమైన తనయేలుబడిని గృతయుగోదయారంభకుఁ డీతఁడనఁ బేర్వడసెను.

ఈగోపాదిత్యుఁడు 'గోపాద్రియందు' జ్యేష్ఠేశ్వరుని' ప్రతిష్ఠ గావించి యార్యదేశజులగు బ్రాహ్మణుల రావించి వారికి 'గోపాగ్రహారముల' నొసఁగెను. ఇతఁడొసఁగిన యితరములయిన యగ్రహారములు 'ఖోల' 'భాగికము' 'హాస్త్రిగ్రామకము.' 'స్కందపురము' 'శమాంగాసము' అనునవి. వీనిలో 'శమాంగాసము' అనునది చాల ముఖ్యమైనది. 'భూక్షీరవాటిక'యందు వసించుబ్రాహ్మణులు లశునభక్షకులౌటచేత వారి నాప్రదేశమునుండి వెడలనంపి 'ఖాసట'యందుండఁ బనిచి పుణ్యభూముల నుండి యితరులగు బ్రాహ్మణులఁ బిలిపించి వారినిఁ బావనములైన 'వశ్చికాద్యగ్రహారములందు స్థిరవాసులుగ నొనర్చెను.

ఈభూపాలుఁ డహింసాధర్మనిరతుఁడు కావునఁ బశుహింస జరుగునని యజ్ఞక్రియల నాచరింపఁడయ్యెను. అయినను నితఁడుత్తమ లోకపాలకుఁడని యాకాలపుఁ బ్రజలచేఁ గరము శ్లాఘింపఁబడుచు నఱువదియేండ్లు నాఱుదినములును గాశ్మీరమును బాలించి తాఁజేసిన పున్నెముల పంట నను భవించుటకై యుత్తమలోకముల కేగెను.

## గోకర్ణుఁడు

అటుపిమ్మట గోపాదిత్యునికుమారుఁడు 'గోకర్ణుఁడు' రాజై 'గోకర్ణేశ్వర'ప్రతిష్ఠఁ గావించెను ఈతఁ డేఁబదియేఁడు వత్సరములు పదునొకండు నెలలు రాష్ట్రపతియై పాలించెను.

## నరేంద్రాదిత్యుఁడు

పిమ్మట నీతనికొమరుఁడు నరేంద్రాదిత్యుఁడు రాష్ట్రపాలకుఁడయ్యెను. ఈతనికి 'ఖింఖిలుఁడు' అనునామాంతరము గలదు. ఈతఁడు 'భూతేశ్వరాలయ' ప్రతిష్ఠ గావించి విశ్రాంతి

భవనములఁ గట్టించి దివ్యానుగ్రహము వడసిన 'ఉగ్రుఁడు' అను నొకసిద్ధునిఁ దనగురువుగాఁ జేసికొని మాతృచక్రమునకు ఉగ్రేశునకును బ్రత్యేకముగ భవనముల నిర్మింపఁజేసెను. ఇట్లీరాజు పెక్కు సత్కార్యముల నాచరించి ముప్పదియాఱు వత్సరములు మూఁడు నెలలు పది దినములును బుడమినిఁ బాలించి యూర్ధ్వలోకముల నొందెను.

## యు ధి ష్ఠి రుఁ డు

అనంతరము నరేంద్రాదిత్యుని యాత్మజుఁడు 'యుధిష్ఠిరుఁడు' కాశ్మీరపతి యయ్యెను. ఇతని కన్నులు చాలఁ జిన్నవగుటచే లోకులీతని 'నంధయుధిష్ఠిరుఁడు' అని చెప్పుకొనుచు నుండిరి. ఈభూపతి కొలఁది కాలము మాత్రము రాజ్యము నప్రమత్తతతోఁ బాలించుచుఁ బూర్వభూపాల పద్ధతి ననుగమించె నన్నఖ్యాతి వడసెను. కాని దురదృష్టమునఁ గ్రమముగఁ గొంతకాలమునకు రాజ్యసంప దల యభివృద్ధిచే దృప్తుఁడై కర్తవ్యాకర్తవ్యములయెడ విపరీతమతి యయ్యెను.

అనుగ్రాహ్యుల ననుగ్రహింపక పోవుటయు ధీమంతుల కాశ్రయ మీయకుండుటయుఁ దనకు నచ్చిక యేర్పడ నుపచారముసేయు స్వామిభక్తులగు భృత్యులయెడ నెనరు సూపకుండుటయు మున్నగు చెడ్డలక్షణములు గ్రమముగ నీతనికిఁ బట్టువడినవి. అట్టికారణమున దుర్బుద్ధిసుబుద్ధులయెడ నేకవిధమున మెలఁగుచుండిన యీనృపాలుని యండ నుండ నేవగించుకొని విజ్ఞానధనులగు కోవిదు లాశ్రయాంతరము వెదకికొనిరి.

రాజనీతిరహస్యమును బరికించినచో నంతటను సమదృష్టిత్వ మనునది యోగిపుంగవుల యెడ ననర్ఘమైన గుణరత్నమై భాసిల్లుచుండును. కాని, అట్టిసమదృష్టిత్వము నరపతులకుండుట గొప్ప తప్పు. అయ్యది వారియపయశోవృక్షమును ఫలింపఁజేయు మహాదోహద మనవచ్చును.

కం॥ అంతట సమదృష్టిత్వము
చింతింపఁగ యోగులందె చెలువొందును; భూ
కాంతులగు లౌకికులకు ని
తాంతం బపకీర్తిదోహదం బగు నదియే.

వినష్టమతి యగు నీకాశ్మీరపతి స్త్రీవశంవదుఁడై ధూర్తులగు విటులకు నేస్తకాఁడయ్యెను. ఇఁక బుద్ధిజాడ్యమునకు లోటేమి యుండును? అట్టివాఁడగుటవలన విటులు గుణములను దోషములుగను దోషములను గుణములుగను గ్రహించునట్లు తమనేర్పుపెంపున లెస్సగ నుపదేశించిరి. ఈయంధ యుధిష్ఠిరునివాణి సజ్జనుల కొక్క క్షణమాత్రమేని వినసహింపరానిదయ్యెను. ఇతఁడు విటబృంద ములు మూగి వచించు నీచకథలను గర్ణపేయముగ నాలకించుచు నతిదీర్ఘములగు నర్మసల్లాపములతోడఁ గాలక్షేపము సేయుచు రాజకార్యములందు నాదరమును బూర్తిగ విడనాడి రాజనోచితములుగాని క్రీడలయందుఁ బాల్గొనుచు నుండుటచే నితనిపాలనము ప్రజలకు భయావహమయ్యెను.

విపరీతమతి యగునీభూపతి తన యెదురనున్న గుణహీనుని గుణవంతునిగ మెచ్చుకొనును. పరోక్షమున వానినే దూఱుచుండును. ఇట్టి చపలబుద్ధి కావుననే యితఁడు స్వామిభక్తి పరాయణులగు మంత్రులు భృత్యులు మొదలగు నాశ్రితులయందఱియుపేక్షకుఁ బాత్రుఁడయ్యెను. ఆకారణమున నచిర కాలముననే యితనిరాజ్యస్థితి తార్మాఱగుచునుండ ద్రోహబుద్ధులగు నితని మంత్రులు గొంద ఱీ యవకాశమును బలపఱచుకొని రాజాజ్ఞలను సంకోచపఱచుచు యథేష్టముగఁ జరించుచుండుటచే సమీప దేశవర్తులగు భూపాలురు గాశ్మీర రాజ్యాంగ దౌర్బల్యమునకు సంతసించి రాష్ట్రాక్రమణమునకు సన్నాహము సలుపుచుండిరి. తదనుయాయులగు వారు పెక్కురు సామంతరాజులు రాజ్యామిషమునకై సంబరపడుచు శ్యేనసందోహమువోలె నానాదిశావకాశములనుండి బయలుదేరి సాయపడుచుండిరి.

ఇట్టివైరి సన్నాహము నెట్లో యీయంధయుధిష్ఠిరుఁడు దెలిసికొని యితికర్తవ్యతామూఢుఁడు గావున వెలఁగొంది యంత్రచ్యుతమగు మహాశిలను శిల్పకారుఁడు స్వయముగ యథాస్థానమున నిల్ప నేరనియట్లు యప్పటి తన దుస్థితినిఁ జక్కఁజేసికొనుట కశక్తుఁడయ్యెను.

చిరకాల మవినీతుఁడై రాజ్యతంత్రమునెడ దనయులసతను జూపుచుండిన యీ యుధిష్ఠిరునకు నట్టికాలమున రాజ్యస్థితిహేతుభూతమగు నుపాయము స్ఫురింపకపోవుట సాజమేకదా! పోనీ; మంత్రులు గలరను కొందమన్న వారును నీరాజునెడ ద్రోహచింత సేయుచుండిన వారగుటచే 'యితని నెట్లేనిచక్కఁబఱచితిమేని మనపూర్వపుటపరాధములను స్మరించి నిక్కముగ మనల నున్మూలించును.' అను తలంపుతో నట్టితరుణమున "సామోపాయముచితము" అను నీ నృపతి మాటలను నిరాకరించిరి.

పిమ్మట శాత్రవులు సేనాసందోహములతోడ నేతెంచి యుధిష్ఠిరుని రాజధానిని నలువైపుల నరికట్టి పౌరులయాక్రందమును దమ సమరభేరీ నినాదమున లీనము గావించిరి. అప్పటి సమరసన్నాహమునఁ గాశ్మీరరాజధానియందలి భవనవలభీభాగములన్నియు వైరివాహినులయందలి మదపుటేనుఁగు సంఘాతములపై దీపించుకేతువ్రాతముల సాంద్రచ్ఛాయచేఁ బ్రభాకరప్రభ యించుకేనియు సోఁకకుండునట్లు నిరోధింపఁబడుటంజేసి నిబిడతమోవృతములై మిగుల భీతిఁ గొల్పుచుండెను.

అంత శాత్రవభూపాలురు గొంత తడవు సమరారంభమునకుఁ గడంగక "ప్రాణముల దక్కించుకొన నిచ్ఛగలదేని వెంటనే ప్రోలు వీడి పొమ్ము" అని దెలుప యుధిష్ఠిరుఁడు చేయునది లేక సర్వసంపదలను వదలుకొని నగరమునందలి రాజమార్గమునఁ బోవుచుండెను. అసూర్యంపశ్యలగు నతనియంతిపురపుటంగనలు పతి ననుసరించుచు ధూళిధూసరితగాత్రలై హిమపాతమున వెలవెల పోవుమెట్ట దామరలం దలపించుదీనాననంబులతోడఁ జూపఱకు మిక్కిలి దయనీయలగుచుండిరి. ఆ రాజ దంపతులఁ గాంచుచుండిన స్వామిభక్తిపరులు గొందఱు పౌరులు శోకవేగమున సారెకుఁబొరలివచ్చు బాష్పకణంబులనెడు లాజనిచయంబున రాజమార్గము నింపుచుఁ దమయత్యంతసంతాపమును వెల్లడించిరి.

ఇట్లు కాశ్మీరపతి రాజ్యభ్రష్టుఁడై పలాయితుఁడు కాఁగా వైరినరపతు లెల్లరు నతని వనితా కోశపరివారాదికమును నున్నతగిరి శిఖరమునుండి విగళితమైన మహీరుహముయొక్క ఫలపల్లవవల్లీ విభవమును గండశైలములు వడయురీతి నాక్రమించిరి. యుధిష్ఠిరుఁడును బ్రకృతిరమణీయంబులగు శైల

పథములంబట్టి పోవుచు సాంద్రశీతలమహీరుహచ్ఛాయలఁ గొంతతడవు గూర్చుండి యలసటం బాపి కొనుచు రాజ్యచ్యుతివలనఁ గలిగిన దుఃఖమును సైతము కొంత విస్మరింపఁ గల్గెను. కాని, నడుమ నడుమ పావురులు గావించుపూత్కారములు కర్ణంబులకు ములుకులువోలె సోఁకుటచే మరలఁ దనపరాభవమును దలఁచి తలఁచి యచటి పర్వత శిఖరములనుండి దిగువకు దొరలు నిర్ఝరవారిపూరము దనకు నీడు గాదనిపించునటుల నగాధముం జొచ్చు నెమ్మనంబుతోడ నధోముఖుఁడై చూపఱకుఁ గడుంగడు దయనీయుఁడగుచుండెను.

ఇఁకఁ గాశ్మీరపతి ననుసరించుచున్న పట్టపుదేవేరి యితరలగు శుద్ధాంత కాంతామణులు నానావిధ తృణలతా వితానములనుండి వెలువడు నెత్తావులతోడ నుగ్రములయిన పెనుకానలఁ గ్రుమ్మరుచుఁ బర్వతశిఖరంబులనుండి మహావేగంబున శిలాతలంబుల బ్రద్దలుసేయుచుఁ బిచ్ఛిలంబుగఁ బ్రవహించు సెలయేళ్ళం దాటుచు మిగుల గ్లాని నొంది బిసకిసలయసామ్యమునఁ దనరారు తమ తనువల్లుల నెట్టకేలకు వల్లభుని యుత్సంగ భాగమునఁ జేర్చి దుర్గతి జనితమగు సంతాపభరము నాపుకొనఁ జాలక మూర్ఛిల్లిరి,

కొంతతడవునకు నెట్లో రాజమహిళలు మూర్ఛనుండి తేఱి పరిసర పర్వతతటముం జేరి యంతకంతకు దవ్వయిపోవుచున్న కాశ్మీరమండలమును ఱెప్పవాల్పక పెద్దయుంబ్రొద్దు చూచిచూచి తుదకు హతాశలై తమ వీడ్కోలుం దెల్పు ప్రసూనాంజలుల నాదెసకుం జల్లిరి. అక్కటా! హత భాగధేయలగు వారి నచ్చోట నూరడించుటకై గిరికందరములందలి శకుంతసంతానములు సైతము కులాయంబులనుండి రయంబున వెలువడి విస్తృతములగు తమపక్షమూలములచే మహీతలమును గప్పుచు చంచుపుటంబుల వంచి సావేగంబున నాక్రందించి తమయనుతాపంబును వెల్లడించెను. సుఖానుభవము లేని సామాన్యజనులు సైతము స్వదేశ విరహజాతంబగు ఖేదమును సహింపలేకుందురు. ఇఁక రాజకాంతలు శత్రుతిరస్కారమునఁ దమదేశమును ద్యజించి పోవునపుడు వారికిఁ గల్గుసంతాపభరమును గూర్చి చెప్పవలసినదేమున్నది?

మఱియు యుధిష్ఠిరునిపత్నులు పలుమాఱు జాఱిపడుచున్నశిరోవకుంఠనములను నురస్థ్సలములందించుక బంధించి సుదూరమైన తమదేశమువంక మరలమరల తిరిగితిరిగి చూచుచుఁ జింతాప్రవాహము నాపుకొనలేక మూర్తీభవించిన కారుణ్యరసాధిదేవతలో యన, మౌళివిన్యస్తహస్తలై పెద్దయెలుంగున నాక్రోశింపఁదొడంగిరి. అప్పటివారికన్నీరొక సెలయేఱునా జాలువాఱెను.

ఈ తీరునఁ గాశ్మీరపతి యుధిష్ఠిరుఁడు తన మహిళామతల్లులతోడఁ బడరాని యిడుమలఁ బడుచుఁ జివరకు "మిత్రమాపది జానీయాత్" అను నార్యోక్తిని స్మరించుకొని చిరకాలమునుండి తనకత్యంతప్రేమాస్పదులును సుహృద్వరేణ్యులును నైన మహీపాలురకడ నెట్లో యాత్మరక్షణముం జేపి కొనఁగోరి పత్నీసహితుఁడై మెల్లఁగ దేశాంతరముం జేరెను.

అచ్చటిమిత్రులెల్లరు నెప్పటివలె నిర్వ్యాజప్రేమను జూపుచు నతిగౌరవముతో నెట్టిలోపంబును లేకుండ నా యాయి యుపచారములఁ బదింబదిగ నొనరఁజేయుచుఁ బ్రేమపూరితములైన మధురము వచనములచే రాజ్యభ్రంశమునం గస్గినయుధిష్ఠిరుని వర్ణింపరానిసంతసము నొందించుచు నలరించు చుండిరి.

శ్రీ శ్రీ శ్రీ

ఇది కాశ్మీరికమహామాత్యశ్రీ చణ్పకప్రభు సూను 'కల్హణ మహాకవి' ప్రణీతమగు 'రాజతరంగిణి' యను
సంస్కృత మహాకావ్యమునకు, అనువాదరూపమును స్వయంపాకాన్వయ భారద్వాజ గోత్రజ
శ్రీ, వేంకటలక్ష్మ్యంబా వేంకటప్పార్య తనూజ, పరదేవతానుగ్రహ సముపార్జిత ధనుకవితా
సాహితీవికాస, వ్యాకరణవిద్యాప్రవీణ, విద్వత్కవిశేఖర, మహాకవి, ఆయుర్వేద
విశారద, జరుగుమల్లాభిజన, సింహపురనివాసి, వేంకటరమణకవిచే
విరచితమునగు, ఆంధ్రరాజతరంగిణి, అను చంపూ
మహాప్రబంధమునందు సర్వంబును
ప్రథమ తరంగము

ఓం తత్ సత్.



శ్రీ పరదేవతాయై నమః

# రాజతరంగిణి

(మహాకవి కల్హణుని కృతికి ఆంధ్రీకృతి)

## ద్వితీయ తరంగము

## మంగళాచరణము

మ॥ అజగోశృంగపు టగ్రభాగములు నవ్యంబైన కోదండమున్
గజమర్త్యార్ధ విభక్తదేహముల విఘ్నధ్వంసిఁ గల్పించి, య
క్కజమై యెప్పెడి యిట్టి రూపఘటనల్ గాంక్షించి వామాంగజా
ని జగన్మంగళ మూర్తి యయ్యె నిటులే నిత్యంబతండోముతన్॥

## యుధిష్ఠిరుఁడు

కాశ్మీరక్షమాపతి యుధిష్ఠిరుఁ డారీతి సుహృద్రాజ్యములందు జాయలతోడ నాత్మరక్షణము గావించుకొనుచు మరల శాత్రవులం దఱిమి తనరాష్ట్రమును స్వాధీనపఱచుకొన నుద్యోగింపలేదు. జరాభారము, సాధువులశాంతిప్రబోధమును, వానియుదాసీనతకు హేతువులయ్యెను. క్రమముగ నతడింద్రియముల వశపఱచుకొని వినయోదాత్తుఁడై రాజ్యము నేలునభిలాషతోఁగూడఁ బంచేంద్రియజన్య సుఖానుభవమును సయితము మఱచిపోయి తాపసనిర్విశేషవర్తనుఁడగుచుఁ దనజీవితశేషమును గడపెను.

"కొంతకాలము గడచినపిమ్మట యుధిష్ఠిరుఁడు మరల నిజరాజ్యమును బడయఁగోరి యట నట దిమ్మరుచు జతనములు సల్పుచుండ నతనిమంత్రు లయ్యది తెలిసికొని యతనిబంధించుకొని వచ్చి 'దుర్గాగలిక' యందుంచిరి" అని కొందఱు నుడువుచున్నారు. ఎట్లయినను మరల యుధిష్ఠిరుఁడు రాజ్యము పరిపాలించుట కవకాశము గలుగలేదు.

అంతట నతనిమంత్రులు వేఱొక దిక్కునుండి 'విక్రమాదిత్యభూపాలుని' జ్ఞాతి 'ప్రతాపాదిత్యుఁడ'నువానినిఁ దీసికొని వచ్చి కాశ్మీరమునకుఁ బాలకునిగా నేర్పఱచుకొనిరి. పైఁదెల్పిన విక్రమాదిత్యుఁడు శకులకు వైరియైన విక్రమాదిత్యుఁడు అనుభ్రాంతితో నీ విషయమునఁ గొందఱు "యుధిష్ఠిరుని రాజ్యచ్యుతి యాదిగాఁ గొంతకాలము కాశ్మీరమండలము ప్రకృతివర్గముయొక్క పరస్పరభేదభావములకు లోనై 'హర్షుఁడు' మున్నగు నరపాలుర యేలుఁబడి నుండెను" అని, వేఱొక తీరున విసంవాది యగు వృత్తాంతమును వృథా లిఖించిరి. ఆ విషయ మంత యక్కఱ యగునది గాదు.

## ప్రతాపాదిత్యుఁడు

ప్రతాపాదిత్యుఁడు వంశానుగతమైన రాజ్యమునందుఁ జూపువట్టి యాదరాభిమానములతోడ నూతనముగఁ బ్రాపించిన కాశ్మీర వసుంధరను ఇంగితజ్ఞుఁడైన పతి నవోఢ యగు వధువునుంబోలె సానురాగమున లాలించుచు ముప్పది రెండేండ్లు రాజ్యసుఖ మనుభవించెను.

## జలౌకుఁడు

ఆవల ప్రతాపాదిత్యుని కుమారుఁడు 'జలౌకుఁడు'ను నాదిత్యునకు సాటియై వెలుఁగు విధువ ద్రాకాసుధాకరునివలెఁ దనతండ్రి యేలినంత కాలము దానును నూర్జితముగఁ గాశ్మీరము నేలి పుణ్య లోకము నార్జించెను.

## తుంజీనుఁడు

జలౌకునికొమరుఁడు 'తుంజీనుఁడు'. ఈతఁడు గాశ్మీరమునకుఁ నధిపతి యయ్యెను. ఇతని ధర్మపత్ని 'వాక్పుష్ట' దివ్యమహిమోపేత. దేవియు దేవరవోలె నొప్పిన యీ రాజదంపతులచే నాఁటి కాశ్మీరమండలము సురధునీ సుధాకరులచేఁ జెన్నొందు ధూర్జటిజటాజూటమువలెఁ బవిత్రతమమై విలసిల్లెను. వీరు 'తుంగేశ్వరము' అను హరావాసమును 'కతికా'భిధానమగు నొక నగరమును గట్టించిరి.

"మఱియు నీ రాజదంపతులు 'మడవ' రాజ్యములోని యొకభాగము భీషణాతపమువారికి గుఱి యగుచుండ నచ్చోటఁ దారు స్వయముగ వృక్షాంకురముల నాఁటఁగా నవి వెంటనే ఫలపల్లవశాఖా శోభితములై వర్ధిల్లె" నని ప్రతీతి యొకటి గలదు. వివిధవర్ణముల మనోహరమైన వీరి యాధిపత్య మునఁ బెనుపొందిన యీ మండలము మింఁచుఁదీవలతోఁ గాఱుమబ్బుతోఁ గూడినయింద్రచాపమువలె రాజిల్లెను. లోకమున నాట్యకళను సర్వజనప్రేక్షణీయమగురీతిని రచించి వ్యాసునియంశావతారమని విఖ్యాతి నొందిన 'చందకుఁడు' అను మహాకవి తుంజీనునిసమకాలికుఁడై యుండెను.

ఈ తుంజీనుఁడు ప్రజారంజనతత్పరుఁడై ధరాపాలనము సేయుచుండుకాలమున నొకప్పుడు రాజదంపతుల ప్రభావమాహాత్మ్యమును బరీక్షించుటకో యన దైవికముగఁ దుహినోపద్రవ మొకటి భాద్రపద మాసమున నాకస్మికముగ సంభవించెను. విశ్వ విశ్వక్షయాద్యుక్తుఁడగు కాలుని కరాళాట్ట హాసమువంటి యమ్మహాహిమపాతమున ఫలోన్ముఖములై శారద శాలిసస్య శ్యామలములై కనువిందొన రించుచుండిన కేదారక్షేత్రము లన్నియుఁ బ్రజల జీవితాశతోడ నొక్కనాఁడు సాంతముగ మునిఁగి పోవుటచే ఘోరదుర్భిక్షవిప్లవము వాటిల్లెను.

అంతటఁ దినన్నము లేక గుంపులు గుంపులుగ మూఁగి యాఁకటిమంటచే మలమలమాడి కృశించి నశించెడు ప్రజలచే నాకులమైన తుంజీనునిదేశము భయంకరమగు నరకప్రాకారమువలె దృక్కుల కతిదుస్పృహ మయ్యెను. ఆ కాటకమున నాఁకటిమంటచే నన్నాతురులై స్వోదర పూరణ

మాత్ర పరాయణు లగుచు దెసలెల్లఁ దిరుగుచున్న జనులు సతీప్రీతిని సుతవాత్సల్యమును పితృగౌరవ మును నువ్వెత్తుగ మఱచిపోయిరి.

సాధారణమానవులసంగతి యటుండ నాగరశ్రీమంతులు సయితము బుభుక్షాపీడితులై లజ్జాభిమానములఁ ద్యజించి యాత్మీయకులోన్నతిఁ దలఁపక యోగిరమునకై పలుతెఱంగుల యత్నింప మొదలిడిరి. ఆహారము లేక క్షీణించుచుఁ గంఠగత ప్రాణుఁడై యన్నమడుగుసుతునకుఁ దండ్రి యొక కబళము నైన నీక తన యుదరము నెట్లో భరించు కొనమొదలిడెను. అట్లే కుమారుఁడు బుభుక్షితుఁడగు వృద్ధజనకునకుఁ బెట్టక తనపొట్టను మాత్రము నింపుకొన నుద్యోగించెను. "బుభుక్షితం నప్రతిభాతికించిత్" అనువచన మియ్యెడ లక్షిత మగుచున్నది.

ఆహారము దొరకనికతంబున జనులు ప్రేవులు నెమ్ములును మిగులుగాఁ గలిగి బీభత్సమును గొల్పు తమదేహములందు నభిమానమును విడువక యెట్లేని జీవింపఁ గోరి భోజ్యార్థులై యొండొరులు ప్రేత బృందమువలెఁ బెనగులాడఁ దొడఁగిరి. తుదకు నొక్కొక్కఁడును క్షుద్బాధచే వెఱ్ఱివానివలె వదరుచు వికృతవదనములతోడ దిక్కులం బరికించుచు నాత్మరక్షణమునకై కానవచ్చినజీవినిఁ గబళింపఁ బూనుచుండెను.

ప్రాణుల కతిదుస్సహంబగు నిట్టి భయంకరోపప్లవమునఁ 'దుంజీనమహీధవుం డొక్కఁడే కరుణారసార్ద్రహృదయుఁ డగుచు రత్నౌషధివలె భాసిల్లు తనదర్శనమాత్రమున దీనులయలక్ష్మీక్లమ మును నివారింపఁగల్గెను. అతఁడు పత్నీసహితుఁడై తనధనకోశముల నన్నింటినే గాక సచివాదుల సంచితార్థముల సహితము వ్యయించి దేశాంతరములనుండి ధాన్యరాసులను దెప్పించి యడవులం దును శ్మశాన వాటికలందును రథ్యలందును గేహములు మున్నగు నెల్లతావులందును బవలు రేలు అనుభేదము లేకుండ క్షుత్పీడితులగు నందఱ నన్నదానమున రక్షించుచుండెను. ఈరీతిఁ జాలకాలము తనసర్వస్వమును వినియోగించినను హిమానీ పీడదొలఁగకుండుటచేఁ గడకు నిశ్శేషితధనసంచయుఁడై తనపుడమి యన్నవిహీన మగుటకుఁ గడు వగచుచు నొకనాఁటిరేయి తనజాయం గాంచి యిట్లనియె.

"దేవీ! నిక్కముగ మనమొనర్చిన యొకానొక గొప్పయపచారమున నిరపరాధులగు మన ప్రజల కిట్టి దుస్తరమగు మహావిపత్తు వాటిల్లినది. నాపాలనమున నున్న వసుంధర యిట్లు ఘోర క్షామమునకు గుఱియై పేరాకటం గుందు ప్రజలు దారసుతాది బంధుజనమును విడిచి దిక్కులేక కట్టె దుట మొఱ వెట్టుకొనుచుండఁ జూచుచుఁ జూచుచు నశక్తతను వెల్లడింపవలసి వచ్చెఁగదా! ఇట్టి యధన్య జీవనుఁడ నగు నేనున్ననేమి? లేకున్ననేమి? నాజీవితము కేవలము నింద్యమైనది. ఏదో యొకరీతి నింతవఱకు క్షామపీడచే నసువులు విడువకుండ జనులఁ గాపాడఁగల్గితిని, కాలదౌరాత్మ్యమునంజేసి వసుమతి యెడతెగని క్షామ మనెడు పెనుభూతము వాతఁ బడినది, రాష్ట్రమునందలి నానావిధమైన ధన సంపద యంతయుఁ బ్రజలకై వినియోగింపఁబడెను గదా! ఇఁకఁ జేయఁదగునదేమి! ఇట్టి విపత్సా గరమున మునిఁగియున్న ప్రజానీకము నుద్ధరించుటెట్లు? ప్రజలగతిఁ బరికింపుము. దుర్దినప్రాచుర్యమున నినాలోకము లేక లోకము కాలరాత్రిపరంపరం బడినట్లు తల్లడిల్లుచున్నది.

మఱియుఁ గడవరాని హిమసంపాతముచే నిరుద్ధములయిన పర్వత మార్గంబులఁ జిక్కియున్న జనసమూహము బద్ధద్వారములగు కులాయంబుల నుండువిహంగకులమువలెఁ బ్రాణసంశయావస్థ నొందియున్నది. శూరులును బ్రతిభాశాలురును విద్యావంతులును నైన మహాజనులు గాలవైపరీత్యమున నెందుకుం గొరగానివారై యున్నారు.

క. శూరులు మతిమంతులు వి
ద్యారాధనపరులుఁ గాలదౌరాత్మ్యముచే
దూరీకృత యోగ్యత గల
వారై రకటకట విధి యవార్యంబు సుమీ॥

క్ష్మాతలమున నిప్పుడేదిశలు కాంచన సుమకుట్మలములచే నలంకృతములు గాకుండును? సౌజన్యామృతమును వర్షించు సేవ్యులగు మహాపురుషులు తిలకింపని మండల మేది యుండును? రుచిరములగు సుచిరోపచారములచేఁ బొగడిక గన్న వదాన్యు లాశ్రయింపని మార్గము లెవ్వి? అట్టియుత్తమ చారిత్రులందఱు నేయేపట్టుల నాశ్రయించిరో! అక్కటా! వారిలోఁ గాలమోహితులగుచు నీవాటిల్లిన దుర్భిక్ష నిరయమునం బడి నిహ్నుతగుణులైన వారుమాత్ర మీయవసరమున నిట నున్నారు!

తమరాష్ట్రమునఁ గరము నిర్వృతిం జెందుచున్న పౌరులను దనపుత్రులనుబోలెఁ గన్గొని సంతసించు పృథ్వీపాలురే ధన్యజీవనులగుదురు. అట్టివారుగదా! రాత్రులందు సుఖముగ శయనింపఁ గల్గుదురు. విపన్మహోదధియందు మునుఁగుప్రజలను గట్టుఁ జేర్చునుపాయముం గానని నావంటివానిని నాశ్రయించిన రాజనామము కళంకితమగుట గాక యింకేముండును?

ఉ. ఆనరపాలశేఖరుల
యంచిత భాగ్యమె భాగ్య మమ్మహీ
జానులె ధన్యు లెవ్వరు ప్ర
జల్ దమబిడ్డలుగాఁ దలంచుచున్
మానుగ వారు సర్వశుభ
మండనులై పొలుపొందఁ జూచి యెం
తేని ముదంబుతోడ గమి
యించెదరో సుఖసుప్తులన్ నిశల్

ఇప్పుడీనాప్రజలు పడుచున్న దుర్గతిం జూచుచు నోర్వఁజాలను. కావున నాతనువు జ్వాలనునకర్పించి సుఖంబుండెద.'' అని పల్కుచుఁ గారుణ్యాతిరేకమునఁ బొంగెడు శోకము నాపుకొనలేక తల్పమునం బడి వదన మాచ్ఛాదించుకొని నిశ్శబ్దముగ విలపింపసాగెను. అపుడు నివాతస్తిమితములగు దివ్వెలు కౌతుకమున నుద్గ్రీవములైనవో యనినట్లుండెను.

అంతట 'వాక్పుష్టాదేవి' పతిం జూచుచు "మహీవల్లభా! ప్రజలదుష్కృతముచే నీకిట్టి మతి విపర్యయము గల్గెను కాఁబోలు! లేకున్న నిట్లు ధీరు జనోచితమగు కర్మంబునకుఁ గడంగుట పొసఁగునా? లోకమున వాటిల్లిన యసాధ్యములగు నిడుమలను బోకార్చు ప్రాభవము లేకుండిన యెడల మహా పురుషుల సత్త్వమునకు వేఱొక గుర్తేమున్నది? సత్యవ్రతులగు భూపాలుర శాసనముల నుల్లంఘించుటకు బ్రహ్మదేవుఁడెంతటి వాఁడు? ఇఁక వరాకతుల్యుఁడగు యముని మహత్త్వ మెట్టిది?

"స్త్రీలకుఁ బతిభక్తియు నమాత్యులకు బ్రభువునెడ ద్రోహచింత లేకుండుటయు రాజులకు సర్వదా ప్రజాపాలనతత్పరత్వమును మహావ్రతములు" అనఁ బరగుచున్నవి. నియత వ్రతాచరణ పరాయణత్వమునఁ బ్రవర్తించు మీకేమియుఁ గొఱంత గలుగదు. ఇఁక మన ప్రజకు బుభుక్షాపీడ యుండదు. నామాట దబ్బర గాదు." అని యనుచు 'వాక్పుష్టాదేవి' యత్యంత సంరంభముతోడ దేవతాధ్యాన పరయై యుండెను,

అప్పటి యాశ్చర్య మేమన? ఆకస్మికముగ మండలమునందంతటను నింటింట మింట నుండి మృత కపోత వ్రాతము పడి యుండెను, మఱునాఁడు ప్రత్యూషముననే తుంజీనుఁ డావింత వీక్షించి చింతను మాని తనుత్యాగోద్యోగమును విరమించెను. రాష్ట్రమునందలి జను లనుదినము నూతనముగ నుపలబ్ధములగు పావురములఁ దినుచు జీవనము గడపుచుండిరి,

సత్యమును విమర్శించి తెలియునెడలఁ బరోపకారిణియు మహాసాధ్వియు నైన "వాక్పుష్టాదేవి" తన మహిమచే వేఱొక యాహారమునే సృజించియుండును. పావురములచేఁ దన ప్రజల యాఁకటిబాధ దీర్చె ననుట చెల్లనేరదు. నిర్వ్యాజ ప్రాణికారుణ్యగుణమండనులగు నారాజదంపతులు హింసాసాధ్యమైన ధర్మకార్యమున కుద్యోగింతురా?

పిమ్మట వాక్పుష్టాదేవి సేయుసత్కృత్యములచేతను భూకాంతుని చింతోష్మవలనను మంచుబాధ యుడిగి యాకసము వినిర్మల మయ్యెను, లోకబాంధవుని యాలోకమున సస్యాదికము వర్ధిల్లెను. దుర్భిక్షదోషము నిశ్శేషముగ నంతరించెను. పతివ్రతాతిలకమగు వాక్పుష్ట ఐశ్వర్యసంపన్నములగు 'కతీముషము' 'రాముషము' అనునగ్రహారములను ద్విజన్ముల కొసఁగెను.

తుంజీనుఁడును ముప్పది యాఱేండ్లు కాశ్మీరము నేలి సద్గతిం బడసెను. ఇఁక భర్తృవిరహజ్వరార్త యయిన వాక్పుష్ట జ్వలనజ్వాల యనెడు తామర సెజ్జయందుఁ బరుండి పతియంతికమును జేరెను. ఆయమ్మ పతి ననుగమించిన స్థానము "వాక్పుష్టాటవి" అని నేఁడును బ్రజచేఁ బేర్కొనఁ బడుచున్నది. మఱియుఁ జారుచారిత్రయగు వాక్పుష్టాదేవి గట్టించిన గొప్పసత్ర మొండు గలదు. ఆయాబాటసారులు పెక్కు రిక్కాలమునను నాసత్రమునందు విడిపి యాహారపానీయములఁ దీర్చికొని విశ్రాంతిఁ బడయుచు నున్నారు.

శిల్పసౌష్ఠవమునఁ బ్రకర్షమును గోరుచున్న విధాత యారాజదంపతులను గుణాతిశయమున మించునట్టి యపత్యమును సృజింప శక్యము గాదని నిశ్చయించి యుండును, కావుననే వీరికి సంతతి నొసంగుటకు విముఖుఁడయ్యెను.

శిల్పవైచిత్ర్య చాతురీ ధురీణుఁడైన నలువ చెఱకుగడను సుధారస మాధుర్యమును మఱపించు నట్టి యొకానొక ఫలవిశేషమును (ఖాద్యవిశేషమునుగా) సృజింపఁగల్గెను, కాని దానినుండి తతోధిక గుణాఢ్య మగుఫలముత్పన్న మగుట లేదుగదా: మఱియు దానం గల్గిన వెన్ను అట్టి గుణము లేనిది యగుటే గాక చెఱకురుచినిఁ జెఱచుచున్నది. ఇది విధిసృష్టిలోఁ గలవింత.

చ. సరస పదార్థసార సువి
చారచణుండు విధాత బాపురే:
ధరణి మధు ద్రవోద్గమ ని
ధానముగాఁ జెఱకున్ సృజించి యం
దురుగుణ సత్ఫలోద్గతికి
నూహలు సల్పెనె, గాని తృప్తిలే
కరయఁడు సుంత తన్మధురి
మాఢ్యసుధారస మింకి పోవుటన్.

వాక్పుష్ట తనయపచారమువలన రాష్ట్రమునకుఁ దీరని దుర్దిన ప్రాచుర్యము సంభవించిన దనియు నందువలన దేశము దుస్తరంబగు దుర్భిక్షమునకు లోనయ్యె ననియుఁ దలపోసి యందుకుఁ బ్రాయశ్చిత్తముగఁ దనశరీరము నగ్నిసాత్కృత మొనర్చెనని కొందఱనుచున్నారు.

## విజయుఁడు

తుంజీనునకు సంతతి లేకపోవుటవలన నతనకిఁ దఱువాత నన్య రాజన్య వంశజుఁడగు 'విజయుఁడ'నువాఁడు గాశ్మీరపతియయ్యెను. ఇతఁడు 'విజయేశ్వరమునకుఁ' జుట్టును నొక రమణీయ నగరమును నిర్మింపఁజేసెను. ఈవిజయుఁ డెనిమిదేండ్లుమాత్రము పుడమి నేలెను.

## జయేంద్రుఁడు

అనంతరము విజయుని సుతుఁడు ఆజానుబాహుఁడు 'జయేంద్రుఁడు' పుడమిఱేఁడయ్యెను. జయేంద్రుఁడు తన భుజాస్తంభమున జయశ్రీభవ్యమూర్తిని స్థిరమైన తనయశోదుకూలమును జుట్టి కర మలంకరించుచుఁ బృథ్వీభారమును వహించెను. ఈ జయేంద్రుని మంత్రి 'సంధిమతి' యను నతఁడు ప్రతిభావంతులందగ్రగణ్యుఁడు. శివభక్తులందు మేటి. ఈ మంత్రి యుదంత మద్భుతావహము.

మేధావియగు నీ యమాత్యపుంగవుని నెట్టులేని పదభ్రష్టునిఁ గావించినఁ గాని తమ చైద ములు సాగవని తలఁచి విటులు తమ యుక్తివైచిత్ర్యమున సంధిమతిపై రాజునకు ద్వేషము పుట్టునట్లొ నర్చిరి. భూవల్లభులను మత్తేభముల కర్ణచాపల్యమును బోఁగొట్టఁ జాలిన యుపాయం బేదియు లేదుగదా!

విటాదుల కపటవచనములకు లోనైన 'జయేంద్రుఁడు' సంధిమతిపైఁ గినిసి యతనిని మంత్రి పదవినుండి దొలఁగించి యతని సర్వస్వమును హరించి యావజ్జీవ దారిద్ర్యము ననుభవించు నట్లొనరించెను.

వేసవి వేడిమివంటి భూపతియల్కచే శోషించు సంధిమతిని రాజపురుషు లెవ్వరును మాటల చేతనైనను నూఱడింపకపోయిరి. రాజాధికృతులగు పురుషులు తచ్చిత్తానువర్తులై మెలఁగుచు సత్య మైన వక్తవ్యాంశమును రాజు గంభీరముగ వినునంతలోనఁ దాము మున్ముందు సత్యమును మఱుఁగు పడఁజేయు ననువాదకులై ప్రతిధ్వనింతురు. అట్టివారి విషయమును వర్ణించుటయుఁ దప్పుగాఁ దోఁచెడిని.

శివభక్తాగ్రణి యగు సంధిమతి తనకు నిర్నిమిత్తముగ సంభవించిన రాజవిరోధ దారిద్ర్య ములం దలంచి చింతింపలేదు. సరిగదా! మీఁదుమిక్కిలి తన హరసేవాపరాయణత్వమునకు వాటిల్లిన గొప్ప యంతరాయములు సమసి పోయినట్లు భావించుచు సంతుష్టాంతరంగుఁడయ్యెను.

అటుపిమ్మటఁ గొంతకాలమునకుఁ గాఁగలయట్టి విధివిధానమాహాత్మ్యమువలన నింటింటను "భావికాలమున నీరాష్ట్రము సంధిమతి యధీనమగును" అను వదంతి యొకటి యస్పష్టముగ బయలు దేరెను. ఈవిషయమును జయేంద్రుఁ డాప్తులవలన నెఱింగి "యప్రేరితముగ నిట్టివాక్కు వెలువడుట యసంభవము," అని నిశ్చయించి రాజ్యచ్యుతి గల్గునేమో యని భయపడుచు వెంటనే సంధిమతినిఁ గారాగారమునం దుంచెను,

పాపము! సంధిమతిని శృంఖలాబద్ధునిఁజేసి కారాగారనియుక్తులగు రాజభటు లోర్వరాని భయంకర బాధలు వెట్టుచుండ నతఁడు శివధ్యానపరుఁడై బాధలు సహించుచుఁ గృశించుచుఁ బది వర్ష ములు గడపెను. అప్పటికి విజయేంద్రునికిఁ గాలావధియు సమీపించెను.

ఆసన్నమృత్యువగు జయేంద్రుఁడు పుత్రహీనుఁడగుట వలనను వ్యాధిబాధవలనను నంత రంగమున నితాంతముగ వంత నొందుచు నహర్నిశము లోన జ్వలించుచున్న సంధిమతి యందలి విద్వేషమును బోఁగొట్టుకొను నుపాయముఁ గానక తుదకు వానినిఁ దెగటార్చుటయె తత్ప్రతిక్రియగా నెంచెను.

లోకమునం దవశ్యంభావి యగు నర్థమును బామరు లేయుపాయమున నిరోధింపఁ జూతురో! యట్టియుపాయమే యాకార్యమునకు దైవసంకల్పితమగు ప్రబల సాధనముగ నేర్పడుచున్నది. కాలి యున్న యంగారరాశియందు నగ్నికణములు గొలఁదిగఁ బైకి దీపించుచుండ నద్దానిని మానవుఁడు సాంతముగ నార్పఁబూనినపుడు విధి యందుకు విరుద్ధముగ నయ్యంగారచయమును బ్రజ్వలింపఁ జేయఁ దలఁచెనేని యగ్నినిర్వాపమునకై కడఁగు నాపురుషునకుఁ జెంగట నున్న నేతికుండయందు నుదకకుంభభ్రాంతినిఁ గల్పించి దాని నాయగ్నిపైఁ గ్రుమ్మరింపఁజేయును.

గీ॥ పామరులు దప్పి పోనట్టి భావికార్య
మేయుపాయంబుచేఁ గప్పివేయ నుండ్రొ!
దానినే దైవ మౌర! సాధనము గాఁగఁ
జేసికొనుచు నిజార్థ సంసిద్ధిఁ జూపు.

ఉ॥ కాలెడు నింగలంబుల ని
కాయమునం దిసుమంత పైఁబయిన్
గ్రాలెడు నగ్ని నార్పఁగ నొ
కండు గడంగిన, దైవ మందుకున్
జాల విరోధియేని తన
సన్నిధి నుండెడు నేతికుండఁ దా
జాలిశుఁడై భ్రమించి యుద
ఘాండముగాఁ బయిఁ గ్రుమ్మరించెడున్.

కావున విధివిధానము దురవగాహము విచిత్రతమమునై యుండును. అవ్విధమున ద్వేష పూరితుఁడైన జయేంద్రుఁడు క్రూరులగు వధక్రియాధికారుల రావించి "సంధిమతిని వెంటనే కొఱత వేయింపుఁడ"ని యానతి నొసంగెను. వారును శివభక్తుఁడగు సంధిమతి నట్లు కావించిరి. ఆవార్త విని రోగార్తుఁడైన జయేంద్రుఁడు తన హృదయమున నాటియున్న శోకశంకువును బహిర్గతము గావించుకొనెను. కాని వెంటనే యసువులనుఁగూడఁ బాసెను. ఈనరపతి ముప్పది యేండ్లు రాజ్య భారము వహించి సంతతి లేకయే కడకీర్తిఁ గాలగతి నొందుటంజేసి కాశ్మీరవసుంధర కొన్ని దినములు పతిరహితయై యుండెను.

పిదప సంధిమతి యాతీరున వ్యాపాదితుఁడైన వార్తను 'ఈశానుఁడు' అను నతని గురువు విని వశి యయ్యును జింతచే వివశహృదయుఁడయ్యెను. సజ్జనులకు, అసార మగు సంసారము శిరీషకుసుమమువలె సులువుగను సుఖముగను విడువఁ దగినదే యగును. అయినను అట్టిసంసారమున మనీషులగు వారికి దిరిసెనపుఁబువ్వుయొక్క తొడిమవలె భూతదయ యెప్పుడు నెడందఁ బాయకుండును.

చం॥ దిరిసెనపూవువోలె జగ
తిన్ క్షణభంగురమైన సంస్కృతిన్
దొఱఁగుటకై మనీషు లెదఁ
దుష్టి వహించెద రైన వారి సు
స్థిర మగునట్టి భూతదయ
దివ్యనిదర్శనమై ప్రజాళి కీ
ధరను దదీయ వృంతము వి
ధంబున నిల్చుఁ జిరంబు చిత్రమై

ఈవిషయ మిట్టిది. కావున నీశానుఁడు శ్మశానమునకుఁ బోయి యక్కడ దిక్కులేని యట్లు శూలమూలమున బద్ధమై తగుల్కొని శుష్కించుచుఁ దోడేళ్ళు మున్నగునవి లాగుచున్నను గదలని సంధిమతియొక్క యస్థిమాత్రావశిష్ట మగు కళేబరమును గాంచి "అయ్యో! వత్సా! యిట్టి నీదుర్గతినిఁ గాంచుటకా! నేనింకను బ్రతికియుంటిని?" అని పెక్కువిధముల దుఃఖింప మొదలిడెను.

అప్పుడు వాయుపూరిత మైన కపాల రంధ్రమునుండి వెలువడుచున్న నాదముచే సంధిమతి తన దురవస్థం గాంచి దుఃఖించుచున్న గురువు ననుసరించి తానును శోకించుచుండె నన్నట్లు గన్పట్టెను. శిరస్సునందు శీర్ణమై ధూళిధూసర మైన కచభారముచేఁ జుట్టఁబడియున్న పాదములు గల సంధిమతి యస్థిపంజరమును నీశానుఁడు మెల్లఁగఁగైకొని భక్షించుటకై వెంటనంటు దోడేళ్ళగుంపును దఱిమి వేయుచు నంత్యక్రియ లొనర్చుటకై కొంత దూరము దీసికొని పోయి యట నుంచెను, మఱియు నతఁడు శిష్యునికంకాళమును మఱియొకమాఱు పరికించి చూడ ఫాలభాగమున నున్న విధిలిపి యతనికిఁ గానిపించెను.

అందు "యావజ్జీవదారిద్ర్యము. పదిసంవత్సరములు బంధనము, కొఱత వేయుటవలన మరణము మరల రాజ్యప్రాప్తియుఁ గల్గును". అనునర్థము గల శ్లోకముండుటఁ గాంచి చదివికొని యోగవిదుఁడగు నయ్యీశానుఁడు తనలో "మరల రాజ్యప్రాప్తి" యను విషయము దక్క మిగిలిన దంతయు దృష్టచరమేగదా! "రాజ్యప్రాప్తి" అనుమాట యేమగునో గమనింపఁ దగును". అని యతికౌతుకసంభ్రమోపేతుఁడగుచు "ఈయర్థ మెట్లు ఘటిల్లును?" అని శంకించుచు "విధిశక్తి యచింత్యము". అని తనకుఁ దా సమాధానము చెప్పికొనెను.

లోకమునఁ బెక్కురు పారతంత్ర్యమునకు లోనై యాయాకార్యములం బొల్గొని దైవ నిర్ణయమును బట్టుదలతో నన్మూలింప దృఢప్రయత్నము సల్పుచుందురు. కాని, విచిత్రమగు దైవ గతి నెదుర్కొనుట కెవ్వరికిఁ దరమగును? అట్లు వారెంత యత్నించినను యద్భుతమగు విధిబలము యొక్క మహాత్మ్యమువలనఁ గాఁగల వివిధకార్యసిద్ధి నిర్నిరోధముగఁ దప్పక ఘటిల్లుచునే యుండును.

శా॥ లోకంబం దుచితజ్ఞతన్ మెలఁగు నా
    లోకంబు లోపింప నా
యాకార్యంబు లడంప దాస్యపరతం
    త్రాత్మల్ సదా, కొంద ఱ
స్తోకోత్సాహముతోఁ గడంగెదరు; పో!
    చోద్యంబుగా దైవమా
పోకల్ డీకొని తత్ఫలం బొసఁగి చూ
    పున్ స్వీయమాహాత్మ్యమున్.

'మణిపూర' పురమునందు 'బభ్రువాహనుని'చే నిహతుఁడైన పార్థుని నాశ్చర్యనిధి యగు విధి నాగకన్యా ప్రభావమున మరల బ్రతికించెను. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రమున మాతృ

గర్భమునందే సర్వతోదగ్ధమైన పరీక్షితుని శ్రీకృష్ణునియసామాన్యప్రభావము పునరుజ్జీవింపఁజేసెను. రక్కసులచే బాఁది గావింపఁబడిన కచుఁడును గరుడునిచే భక్షింపఁబడిన నాగులును దైవప్రాగల్భ్యమునం గాక మఱేకారణమునఁ బునరుజ్జీవితులైరి?

సీ॥ 'మణిపూరపురి'ఁ బోర మరణించి పార్థుండు
ఫణికన్యమహిమ జీవనముఁ గాంచె
కఱకురక్కసులచేఁ గచుఁడు భస్మంబయ్యు
గురుపుత్రికతమునఁ గోలుకొనియె
ద్రౌణిబాణాగ్నిచే దగ్ధమౌ గర్భంబు
శ్రీకృష్ణకృపఁ బునర్జీవి యయ్యె
గారుడోదరవహ్నిఁ గాలి నాగవనంబు
జీమూతవాహనుచేఁ జిగిర్చె.

గీ॥ విధివిలాసంబు నిఖిల మీవిధము జగతి
బలవదఘటనఘటన ప్రభావశోభి
దైవ బలమున్న పౌరుషదర్పమునకు
నిలువ నీడయె లేదు. వర్ణింపనేల?

అని యిట్లాతఁడు దలపోసి భవిష్యదర్థసిద్ధినిఁ జూడఁ బూని యాశ్మశానమునందె కృతావాసుఁడై శిష్యుని కంకాళమును గాపాడుచుండెను.

నడికిరేయి కావచ్చినది. ఈశానుఁడు విచిత్రమగు విధివిధానమును బరికింపఁ గోరి నిర్నిద్రుఁడై యుండి కొంతతడవునకుఁ గమ్మని దివ్య ధూపసౌరభము నాఘ్రాణించెను. అటుతరువాత దండాకారముగఁ గూర్చి కట్టుటవలనఁ గదలికచేతను వఱిపిడిచేతను నుచ్ఛందముగ ధ్వనించు తాళముల చప్పుడును గంటలయొక్క టాంకృతులును చండమైన డమరునినాదమును వీనులకు సోఁకుటఁజేసి యీశానుఁడు మఱింత కుతుకముతోడ గమనించుచుండెను.

అత్తఱి రుద్రభూమియందుఁ దేజఃపరివేషాంతరమున లీలగా మెఱయుచున్న యోగినులు కొందఱు అతని నయనములకుఁ గానవచ్చిరి. పిమ్మట నయ్యోగినులు సంభ్రమముతోడ నాకంకాళమును శ్మశానభూమికిఁ గొనిపోవుటఁ జూచి యీశానుఁ డులికిపడి ఖడ్గధారియై తానును గొంతదూరము పోయి యొకచెట్టుచాటున నుండి వారు సేయునది గాంచుచుండెను.

అంత నాయోగినులు లెస్సగ మద్యపానము చేసి కామప్రేరితలై సంభోగసుఖము వాంఛించుచుఁ దగిననరుఁడు దొరకమింజేసి యాకంకాళము నట్లు గైకొని తమనడుమనుంచి సర్వాంగములను యథోచితముగ సంధించి తమయంగములం దొక్కొక్కటి యందుంచి యెక్కడనుండియో యొక పుంలింగమును దెచ్చి యాకంకాళమును సర్వాంగసమన్వితముగ నొనర్చిరి.

అవల దేహాంతరమును బడయక కాశ్మీరనగరమునఁ బ్రేతయై తిరుగుచున్న సంధిమతి జీవ శక్తిని యోగినీగణము తమ యోగమహిమచే నాకర్షించి యాకంకాళమునఁ బ్రతిష్ఠింప వెంటనే గాఢ నిద్రనుండి మేల్కాంచినతెఱంగున సంధిమతి సజీవుఁడయ్యెను.

యోగినులు బునర్జీవితుఁడగు సంధిమతిని దివ్యములైన యంగలేపనాదులచేత మనోహ రాకారునిగ భూషించిరి. మఱియు నతనితోడ నయ్యోగినీచక్రము యథేష్టముగ రతిపారవశ్యమునఁ దేలుచుండెను.

ఈశానుఁడును "యోగినులు దారు ప్రసాదించిన శరీరమును నిశావసానమున నపహరించి సంధిమతిని మరలఁ గంకాళమాత్రావశిష్టునిగఁ జేయుదురేమో!" యను శంకచేఁ జకితుఁడై ధైర్యము తోడ బిగ్గరగ నఱచుచు సంధిమతినిఁ గాపాడుటకై యయ్యోగినీసార్థమున్న తావునకు సత్వరముగ రాఁగా నాయాయోగినులందఱు వెంటనే యంతర్ధానము నొంది "ఓ యీశానా! నీవు భయపడ నక్కఱ లేదు. మే మితనిని వలచి బ్రతికించితిమి. కావున నితని తనుహానినిఁగోరము. మఱియు మా వర ప్రభావమున దివ్యాంగసంధితుఁడగు నీసంధిమతి యార్యధుర్యుఁ డగుచున్నాఁడు. పుడమిపై నితఁడిఁక 'ఆర్యరాజు' అనునామమునఁ బ్రఖ్యాతి వహించును" అనిపల్కిరి.

అనంతరము దివ్యాంబర సుమమాల్యానులేపనధారియు దివ్యభూషణభూషితుఁడును నైన సంధిమతి పూర్వస్మృతిం బడసి వినమ్రుఁడగుచు గురువునకు సాష్టాంగదండప్రణామ మొనరింప నీశా నుండును స్వప్నమునందైనను దుర్లభమనఁదగు శిష్యుని దివ్యాంగమును గాఢముగ నాలింగనము చేసికొనెను. అప్పుడు వారలకుఁగల్గిన యానందమునకు మేరలేకపోయెను.

అంతట గురుశిష్యు లిరువురును దమ వినిర్మల వివేకముతోడ "సంసారమసారమైనదియు విచిత్రమైనదియు నగునని తలంచుచు నొకరితో నొకరావిషయమును జక్కఁగఁ జర్చించుకొనిరి. ఇంతలో సుప్రభాతమయ్యెను. అప్పటికప్పుడే సంధిమతి జీవించినవార్త నగరవాస్తవ్యులెల్లరును దెలిసికొని యాబాలవృద్ధముగ నమాత్యులతోఁగూడఁ బితృవనమునకేతెంచి దివ్యాంగ వైభవోపేతుఁడగు సంధిమతినిఁజూచి "ఇతఁడా సంధిమతి కాఁడు" అని భ్రమించి వాదింపసాగిరి. సంధిమతియు వారెల్ల రును దన్ను బాగుగ గుర్తించుటకు వారువేయు వివిధ ప్రత్యేక ప్రశ్నలకు సదుత్తరంబుల నొసంగి "తాను దొల్లింటి సంధిమతియే" యని వారు చక్కఁగ గుర్తించునట్లొనర్చెను. పౌరులందఱు పర మానందభరితులై "కాశ్మీరభర్తవుగమ్ము" అని యైకకంఠ్యమున సంధిమతినిఁ బ్రార్థించిరి.

## ఆర్యరాజు (సంధిమతి)

సంధిమతికి రాజ్యరమ వహింప నిష్టములేదు. ఐనను గాశ్మీర మరాజకమగుటంజేసియుఁ బౌరులెల్లఁ దన్నుఁ బ్రార్థించుటవలనను దన గురువర్యుఁడగు 'నీశాను'ని యానతియు నట్టిదగుటవలనను నెట్టకేలకు నందుకియ్యకొనవలసివచ్చెను:

పిమ్మట పౌరజనులు దివ్యాకృతిరేదీప్యమానుఁడైన సంధిమతిని నభిరామమైన యొక యారామోపాంతమునకుఁ గొనిపోయి యచ్చోట మంగళతూర్యారావములు కడలెల్లమార్మ్రోగుచుండ

పావనతీర్థజలంబుల బ్రాహ్మణశ్రేష్ఠులచే నభిషిక్తుఁగావించిరి. క్రొత్తఁగ రాజగునప్పు డనుష్ఠింపఁదగు నాచారము ననుభవశాలియగు సంధిమతికి నెవ్వరును బోధింపనవసరము లేకపోయెను. మఱియు నతఁడు నూతన రాజోచితములగు నాచారములెల్ల పొల్లులేకుండ నిర్వర్తింపఁగల్గెను. అతఁడు రాజోచితములగు నుడుపులు మున్నగునవి ధరించి చతురంగబలముతోడ వీఁడు ప్రవేశించునప్పుడు పౌరులెల్లరు సౌధోపరిభాగములనుండి దీవనలతోడ లాజవర్షమును గురిపించిరి.

సత్త్వగుణోజ్జ్వలుఁడైన యార్యరాజు రాచగద్దియనెక్కి పుడమిఁ బాలింపసాగెను. అప్పుడు దైవమానుషకృతములగు నిడుములు ప్రజల దగ్గర నేరవయ్యెను. శాంతిదాంతులచేఁ దేజరిల్లు నార్యరాజుడెందమును పావనములగు వనస్థలులు పర్వతనితంబభూములును నాకర్షింపఁగల్గెను గాని నితంబినుల కా యోగ్యత గలుగదయ్యెను. అడవియందలి పలురెలంగుల కమ్మని తావిజల్లులతోడను గర్పూరధూప వాసనలతోడను విరాజిల్లు నాశ్రమములయందలి తాపసకుంజముల కరస్పర్శమున నతఁడపరిమితానందము నొందుచుండువాఁడు.

మఱియు నార్యరాజు మొట్టమొదటఁ బూజానిర్మాల్యముం దుడిచి, యభిషేకించినతోడనే కన్పట్టు విజయేశ్వరుని నిరాడంబరమూర్తినిఁ గాంచి యానందించుచు నీశ్వరాలయపు సోపానములం గడుగునప్పు డచ్చటి జలకణంబులతోడ మిశ్రితమై వీచునట్టి మారుతము సోఁకెనేని యానందాతిశయమున మైమఱచుచు శయనించియున్నపుడును శివలింగపీఠమునుండి దొరలు నభిషేక కుంభమునందలి మంజుల జలపాతనిస్వనము నాలించుచు నప్పటి ప్రమోదవిశేషమున వీణాక్వణమునుసైత మేవగించుచు నుండువాఁడు. ఇట్టి మాహేశ్వరభక్తచూడామణి కావుననే యతఁడహరహము 'భూతేశ' 'వర్ధమానేశ' విజయేశ్వరుల దర్శింపక రాజకార్యంబుల నించుకేని పాల్గొనకుండెను.

విభూతి రుద్రాక్ష జటాజూటములచే నంకితులైన సంయమివరులతో నిండియుండు నార్యరాజు సభ శోభాయమానమగు మాహేశ్వరసమితింబోలి యుండెను. ప్రత్యహము శివలింగసహస్రమును బ్రతిష్ఠింపవలయునన్న యతని ప్రతిన యెప్పుడును దప్పిపోకుండుట గొండాడఁదగ్గ విషయముగదా!

"ప్రమాదోఽధీమతామపి" అనుసూక్తిననుసరించి యార్యరాజు జరుపవలసిన సహస్రశివలింగ ప్రతిష్ఠ యెప్పుడైన నొకప్పుడు జరుగదేని భృత్యులు శివలింగ సహస్రములతోడ నొప్పారునట్టి శిలలం జెక్కి తత్పూరణముఁ గావించుచుండెడివారు. వారు ప్రతిష్ఠించిన పరశ్శతంబులగు శిలామయ శివలింగ మూర్తులీరోజునను నంతటఁ గానవచ్చుచున్నవి,

కోనేళ్ళు మున్నగు ప్రదేశములందు నార్యరాజుచే శివలింగవ్యాజమున నుంపఁబడిన తామర బీజములు ప్రఫుల్లపుండరీక రూపములనుదాల్చిన యతని పూర్వపుణ్యఫల విశేషములో యన నొప్పారుచుండెను. నదులయందలి జలమధ్యభాగములందును బ్రతిష్ఠితములైన బహుసంఖ్యాకములగు శివలింగములచే నాయాతరంగిణులన్నియును బెక్కునర్మదానదులవలెఁ దనరారుటఁ జూచియే తీరవలయును. అతఁడొనర్చిన శివలింగప్రతిష్ఠలందుఁ బ్రత్యేకముగ నొక్కొక్కచోట నొక్కొక్క గొప్ప గ్రామమును బ్రాహ్మణ సమితికిఁ గానుకగా నొసంగెను. వాని భోగమంతయుఁ గాలవశమున నంతర్ధానమొంది నేఁడేమియుఁ గాన్పింపకున్నది.

ఆర్యరాజుపాలనమునఁ బెనుపొందిన కాశ్మీరభూమియం దెచ్చోటఁ జూచినను మహా హర్మ్యములే. ఎచ్చోటఁ గాంచినను నత్యున్నతములైన శివలింగ స్తోమములే. ఎందుఁగనుగొన్నను దివ్యములైన మహానందిమూర్తులే. ఏభాగమును బరికించినను ముక్కంటియొక్క త్రిశూల చిహ్నములేయై కన్నుఁగవను దన్పుచుండెను.

మఱియు నతఁడు 'ఖేద' 'భీమాదేవి' మున్నగు ప్రదేశములందుఁ బెక్కు హర్మ్యములను గట్టించి వానియందు మఠములను నానావిధములగు విగ్రహములను శివలింగములను నెలకొల్పెను. అంతియకాక యతఁడు ఏశ్మశానమునఁ దన శరీరము యోగినీచక్రముచే సంధింపఁబడెనో యాతావున 'సంధీశ్వరాలయమును' గట్టించి యందుఁ దన గురుని నామధేయమున 'ఈశానేశ్వరుని' నయితము ప్రతిష్ఠింపఁజేసెను. స్వయముగ నుద్భవించెడు పావనతమ శివలింగములతోడను బుణ్యక్షేత్రముల తోడను నలరారుచున్న కాశ్మీరమును భక్తివిభూషితుఁడును బ్రాజ్ఞుఁడునునగు నార్యరాజొక్కండె చక్కఁగ ననుభవించిన సారవిదుండని యనిపించుకొనెను.

మఱియు శివభక్తాగ్రేసరుఁడగు నయ్యార్యరాజు వసంతసమయమున వనభూములందలి సెలయేళ్ళం గ్రుంకులిడి శివలింగములకుఁ బుష్పార్చనోత్సవంబులం జరిపించుచు ముల్లోకములందు దుర్లభమై తన మండలమందు మాత్రమత్యంత సుఖదాయి యగుచున్న వేసవిసమయమందు వనాంతము లందు హిమలింగముల నర్చించుచు నొకప్పుడు విరియఁబూచిన తామరపూలచే నాశావకాశంబులఁ గప్పు చున్న పుష్కరిణీతటంబుల నాశ్రయించి యర్ధేందుమౌళిని ధ్యానించుచు నగస్త్యోదయముచే వినిర్మల జలోపేతములై విప్పారిన నల్లకలువలచే నుల్లసిల్లు కోనేళ్ళయందు స్నానమాచరించి శర్వాణీవల్లభుని శరత్కాలార్చనలం దనుపుచు, నమోఘంబులగు మాఘమాసపు రాత్రులందు నాయా తపోధనులతోడఁ గూడి జాగరోత్సవముల శంకర కైంకర్యమొనర్చుచు నమూల్యమగు కాలమునం దృటియైనను వృథా సేయక నిరుపమంబైన మాహేశ్వరభక్తిపారవశ్యమున మెలఁగుచుండెను. సుకృతియగు నార్యరాజీ తీరునఁ దన యద్భుత భాగధేయప్రభావమునఁ బడసినరాజ్యమును సాటిలేని తన పావనవర్తనమున ఫలవంతముసేయుచు నలువదియేండ్లు పరిపాలించెను.

ఇట్లు సదా శమవ్యసనియై రాజ్యకార్యములను సరిగాఁ జూడకుండిన యీ యార్యరాజు పాలనమునెడఁ బ్రకృతివర్గము తమ యసంతృప్తి వెల్లడించుచు రాజ్యభారమును వహింపఁదగిన మఱి యొక నరనాథు నన్వేషించుచుండిరి. ఆతరుణమున యుధిష్ఠిరుని మునిమనుమఁడైన రాజపుత్రుఁడు 'గోపాదిత్యుఁడు' అనునతఁడు గాంధారపతి సంరక్షణమునఁ బెనుపొంది కాశ్మీరమును స్వాయత్తము చేసికొను సమయము వేచియున్నట్లు కాశ్మీరసచివులకుఁ దెలియవచ్చెను. అయినను 'గోపాదిత్యుఁడు' తన యాశయమును ఫలిం[redacted]జేసికొనలేక గాంధారదేశమునందే యుండి యమోఘములైన దివ్యలక్ష ణములుగల 'మేఘవాహను[redacted]ను తనూజుని మాత్రము వడసెను. ఆ మేఘవాహనుఁడు దినదిన ప్రవర్ధమానుఁడై తొలిజవ్వనమునఁ గళాపూర్ణుఁడై చెన్నుమీఱెను. అట్టితఱి వైష్ణవాన్వయ సంభూతుఁ డైన ప్రాగ్జ్యోతిషేశ్వరుఁడు కన్యాస్వయంవరముఁ బ్రకటింపఁ దండ్రియానతిచే నచ్చటికేగెను.

ప్రాగ్జ్యోతిషేంద్రుఁడు 'నరకుఁడు' వరుణదేవుని మెప్పించి వరుణచ్ఛత్రమును బడసియుండెను. దానిఛాయ చక్రవర్తికాఁదగిన వానికిఁదక్క మఱియెవ్వనికి సోఁకకుండును. స్వయంవర కాలమునఁ బ్రాగ్జ్యోతిషాధిపుని కుమారి 'యమృతప్రభ' చక్రవర్తిలక్షణాంచితుఁడైన మేఘవాహనుని వరించి రాజు లందఱి సమక్షమునఁ దండ్రియొక్క వరుణాతపత్రముచేతను వరపుష్పమాలికచేతను మేఘవాహను నలంకరించెను.

ఈ కారణమున విజ్ఞులగు జనులెల్లరు వేసవిగాడ్పుచే భావికాలమున నంబువాహమునకుఁ గల్గు నభివృద్ధివలె మేఘవాహనునకు భవిష్యత్కాలమున నవశ్యంభావియగు నభ్యున్నతి గల్గునని యూహింపఁగల్గిరి. స్వయంవరానంతరము మేఘవాహనుఁడు ధనకనకమణివాహనాది నానావిధైశ్వ ర్యముతోడను గన్యారత్నముతోడను దనతండ్రి నికటమునకు జనుదెంచియుండెను.

ఇట్లుండ నింతకుమునుపే తగిన రాజును దమరాజ్యపాలనమునకై యన్వేషించుచుండిన కాశ్మీర మంత్రివర్గము మేఘవాహనునివృత్తాంతమును దెలిసికొని "యతఁడు తమ మండలమునకుఁ దగిన ప్రభువు గాఁగలఁడ"ని నిర్ణయించుకొనిరి. అందువలన వారు "వంశపారంపర్యమున ననుభ వింపఁదగిన నీరాజ్యమును స్వీకరించి ప్రజలనేలుము" అని మేఘవాహను నాహ్వానించిరి.

ఆర్యరాజును దనదేశము సచివవర్గముయొక్క విభిన్నాశయమునకు గుఱియయినదని యెఱిఁగి యందుకుఁ బ్రతీకారమొనర్ప దక్షతగలవాఁడయ్యు మిన్నకుండెను. శాంతిధనుఁడగు నతఁడు రాజ్యమునే త్యజింపఁ దలఁచియుండుట యతని యుదాసీనతకుఁగారణము.

మఱియు నతఁడిట్లు దనలో నాలోచించెను. "నిజమాలోచింప భూతభావనుఁడగు పర మేశ్వరుఁడు నాయెడ సంప్రీతుఁడయ్యెనని తోఁచుచున్నది. కావుననే యాత్మసిద్ధికిఁదీరని యంతరాయము లైన లౌకిక కృత్యములతోడి సంబంధములేకుండ నన్ననుగ్రహింపనెంచి యున్నాఁడు. నేనున్ దైవకృపవలనఁ గడవఁదగిన కార్యభార మధికముగనుండ సోమరితనముననుండు వర్షాకాలపుఁ బాంథుని వలె నిద్రాసమ్మోహితుఁడనుగాక మేల్కాంటిని. నేను రాజ్యమును బాలించుకాలముననే నాయెడ విరక్తయై పణ్యకాంతవలె మఱియొకని వరింపఁబూనిన రాజ్యలక్ష్మిని బలాత్కారమునఁ విడువవలసి నట్లయ్యెఁగదా!" యని నాకు లజ్జసైతము గలుగకుండుటయు నా అదృష్ట విశేషమనవలయును. ఈ రాజ్యరంగమున రాజపాత్రధారినై చాలకాలము నటునివలె నెట్లో నాకార్యభారమును వహించితిని. ఇంతదనుకఁ బ్రేక్షకులగు ప్రజలు నేఁజేసికొన్న పున్నెమువలన వైరస్యము నొందక యున్నారు. మఱియు నెల్లపుడు రాజ్యశ్రీ యెడలను సంపదల యెడలను వైముఖ్యమును బొందుచుండిన నేను నద్దానిని వదలుకొనవలసినట్టి తరుణమున "నింత డంబములు పల్కి రణమునం బిరికితనముం జూపు వానిమాడ్కిఁ జిత్తమునందుఁ దల్లడపాటు నొందకయుంటిని. ఇయ్యదియు నొక గొప్ప సుకృత విశేషమే యనఁ జెల్లును".

అనుచు నీరీతిఁ బెక్కుతెఱంగులఁ నార్యరాజు తనలోఁ బెద్దతడవు చింతించెను. వెంటనే యతఁడు నరేమును దర్శించుటకుఁ గుతూహలపడుచు మనోరాజ్యములను బెక్కుసృజించు నొకానొక

యకించనునివలె ముదితుఁడగుచు మఱునాఁడమాత్యులను ప్రజలనందఱను సమావేశపఱచి యాపేరోల గంబునకుఁ దనరాజ్యమును సురక్షితమగు నొక న్యాసమువలె నర్పించెను.

ఆర్యరాజీరీతిఁ దనకుఁదాఁగోరి రాజ్యమును త్యజించుటచే నాసభయందలి సభ్యులు మరల నతఁడే కాశ్మీరమును బరిపాలింపఁ గలందులకు నెంతో ప్రయత్నించిరి, కాని ఫలము లేకపోయెను. ముక్తకంచుకుఁడగు సర్పరాజు మరల నాకుబుసమును ధరించునట్లొనర్ప నేరికిఁ దరమగును?

తదనంతర మా శివభాగవతశిరోమణి ప్రతిదినము దానర్చించు శివలింగమును మాత్రము గైకొని తెల్లని వలువలు ధరించి యుష్ణీషమును వర్జించి పాదచారియై యుత్తరదిక్కుఁబట్టి పోవుచుండఁ దమయొడయుండును దపసియునగు నార్యరాజు నెడబాటును సహింపక పౌరులెల్లరు భక్తితోడ నతని పాదములందుఁ దమ చూడ్కులు నిల్పి యతనివెంటఁజనుచుఁ జింతాభరము నాపుకొనలేక నిశ్శబ్దముగ వేఁడి కన్నీటిని విడువసాగిరి.

ఆర్యరాజిట్లు రెండు క్రోశములదూరము పోయి యొక తరుమూలమునఁ గూర్చుండి బాష్ప ధారలతోడఁ దన కట్టెదుర నిలిచియున్న ప్రజలనందఱను బ్రత్యేకముగఁ బెక్కువిధముల నూరడించి మరలి పురమునకుఁ బొండని వారినిఁ బ్రార్థించెను. అంతట మరలఁ బయనము సాగించి పర్వత మూల భాగముల నొకింత యాలసించుచు నతికష్టముగఁ గ్రమముగఁ దన్ను వెన్నంటు ప్రజాసందోహమును వీడుకొల్పి యుపరితన మార్గములందు మితపరికరుఁడై పోసాగెను. ఆర్యరాజుయొక్క యప్పటి వైఖరి నిజస్థానమునుండి వనభూముల సలిలమయంబొనర్చి యలఁతి జలముతోడ నుపరితనభాగముం జేరఁ బ్రవహించు మహానదముయొక్క తౌల్యమును సంపాదించునదియై యుండెను.

అటు పిమ్మటఁ బట్టరాని శోకముతోడను బాష్పనిరుద్ధములగు కంఠస్వరములతోడను దన్ను వెన్నంటుచున్న పరిమిత పరివారమును సైతము పెక్కువిధముల సన్మానించి యూరడించుచు వారిలో నొక్కరినిఁగూడఁ దనతో రాకుండునట్లు వారల మరలమరల నర్థించుచు నార్యరాజెట్టకేలకు వారిని వీడ్కొనఁగల్గెను.

అతఁడు దన్ననుసరించు వారినెల్లర నట్లువీడ్కొల్పి మౌళిభాగములం దేజరిల్లు మణిగణముచే నద్రిగుహాగేహములం దీపింపఁజేయుచుఁ దాము గట్టికొన్న భూర్జత్వచంబులనంటి యించుక మర్మర ధ్వనితోడ మెల్లఁగా వీచుచున్న చల్లనిమందమారుతముచే హాయిగ నిదురించెడు బాటసారులగు సిద్ధులకు విశ్రామభూమియై గహనమై పొల్చు వనాంతమును దా నేకాకియై ప్రవేశించెను.

అమ్మహారణ్యమున నతఁడొక కొలనిగట్టుఁజేరి ప్రకృతిరమణీయమైయున్న యచ్చటి తరు చ్ఛాయ యందాసీనుఁడై సాయంకాలము కాఁగానే విశాలపర్ణపుటంబుల సలిలంబుఁ దెచ్చి యుంచికొనెను. మఱియు పరిశుభ్రమగు చిగురుటాకు జొంపములచే మృదుతల్పముఁ గల్పించుకొని యందొత్తిగిలెను. అచటి కనతిదూరమున వనపాలురచే వేణుగానముతో మిశ్రితమై మృదంగధ్వని ననుకరించు సెలయేళ్ళ జలపాతముల కలగంభీర నినాదము శ్రావ్యముగ వీనులకు విందుసేయుచుండ నపూర్వసుఖ మతఁ డనుభవింపఁగల్గెను.

వెండియు, శృంగాగ్రములందుఁ దళుకుతళుకుమనుచున్న పర్వతశ్రేణియొకటి యతని కందోయిని మాటిమాటికి నాకర్షించెను. వాని కమనీయములయిన కటకభాగములం గని పచ్చికబయళ్ళ యందుఁ జక్కఁగఁ బూచియున్న మాధవీలతా మండపములందుఁజేరి చల్లఁగవీతెంచు గంధవహుని యామోదమునంది ముదితలై కునికిపాట్లు పడుచున్న గోపాంగనల నతఁడు గనుంగొనెను. ఈప్రకృతి రమణీయ దృశ్యము శ్రాంతుఁడై యున్న యార్యరాజును సుఖనిద్ర నొంద జేసెను.

ఇట్లారేయి సుఖనిద్ర నొందిన యార్యరాజు వేఁకువ కాఁగానే యయ్యడవియందుఁ బటహధ్వని తోడఁ బ్రతిభటత్వము వహించుచున్న మదపుటేనుఁగుఁల ఘీంకారములను బెద్దకక్కెరల రుతంబును బలు మారు వినుచు బాగుగ మేల్కాంచి రేయిగడచినట్లు దెలిసికొని యరుణోదయంబునవే సమీపవర్తియగు కాసారంబున స్నానవిధిందీర్చి పూర్వసంధ్యోపాసనమును యథావిధి నిర్వర్తించెను.

పిమ్మట నతఁడు గమనోన్ముఖుఁడై యిదివఱకుఁ దనకు సుపరిచితమైయున్న నందిక్షేత్రము నం దాశివభక్తాగ్రణి జటాజూటమును జక్కఁగ బంధించి భస్మపుండ్రముల దిద్దిరుద్రాక్షమాలల ధరించి యజ్ఞసూత్రధారియై యచ్చటి వృద్ధతాపసులు దన్నునసన్యగ్రహంబుగ నవలోకించుచుండ జగదీశ్వరుఁడైన మహేశ్వరు సన్నిధిని భక్తిపారవశ్యముతోడ నిలువఁబడియెను. అప్పటి యాతని భక్తితన్మయత్వ మప్పటికప్పుడే యతని కభిమతార్థసిద్ధి గలుగఁజేయునదిగాఁ గాన్పించెను.

ఆర్యరాజిట్లు పాశుపతవ్రత నిష్ఠాపరాయణుఁడగుచుఁ బ్రతిదినము కరమున భిక్షాకపాలంబుఁ బట్టి ముని నిలయంబులకు భిక్షార్థము దిరుగునప్పుడు తాపసాంగన లతిసంభ్రమంబున భిక్షాదానముసేయ నుద్యుక్తలగుచుండు నంతలోనే సుపక్వఫలములును ప్రఫుల్ల ప్రసూనములును నప్రయత్నముగ వృక్షములనుండి రాలి యతని భిక్షాపాత్రను నింపుచుండెను. ఈరీతి నార్యరాజు వైరాగ్యదశయందు సైతము పరప్రార్థనాలాఘవము నెఱుంగకయె యయత్నసిద్ధమగుచున్న సాత్విక వృత్తితోడ సదా సదాశివధ్యాన నిరతుండై కాలము గడపఁదొడంగెను.

శ్రీ శ్రీ శ్రీ

ఇది కాశ్మీరికమహామాత్యశ్రీ చణ్పకప్రభు సూను 'కల్హణ మహాకవి' ప్రణీతమగు 'రాజతరంగిణి' యను సంస్కృత మహాకావ్యమునకు, అనువాదరూపమును స్వయంపాకాన్వయ భారద్వాజ గోత్రజ శ్రీ, వేంకటలక్ష్మ్యంబా వేంకటప్పార్య తనూజ, పరదేవతానుగ్రహ సముపాత్తో భయకవితా సాహితీవికాస, వ్యాకరణవిద్యాప్రవీణ, విద్వత్కవిశేఖర, మహాకవి, ఆయుర్వేద విశారద, జరుగుమల్యభిజన, సింహపురనివాసి, వేంకటరమణశర్మచే విరచితమునగు, ఆంధ్రరాజతరంగిణి, అను చంపూ మహాప్రబంధమునందు సర్వంబును

**ద్వితీయ తరంగము**

ఓం తత్, సత్

శ్రీ పరదేవతాయైనమః

# రాజతరంగిణి

(మహాకవి కల్హణుని కృతికి ఆంధ్రీకృతి)

## తృతీయ తరంగము

## మంగళాచరణము

సీ॥ నిటలంబునందు వహ్నినిఁ బూనఁగానేల?
నీరేజనయన! నీనేత్రయుగళి
నలరారు భవ్యతరాలంకరణ మైన
కాటుక యద్దానఁ గలుగుకతన.
గజచర్మమును గట్టఁగా నేల? కంజాక్షి!
మత్తేభకుంభసంభవముక్తలైన
ముత్యాలు నీదగు మురువైన పాలిండ్ల
వెలలేని నగలౌచు వెలయుకతన.

గీ॥ అనుచు వపురర్ధ సంధానమున నహీన
ఘటన వలదను సర్వమంగళకు నిల్చె
యుక్తియుక్త్యోత్తరంబును నొసఁగి యెసఁగు
భవుఁడు మిముఁ బ్రోచు సకల శుభంబు లొసఁగి.

## మేఘవాహనుఁడు

ఆర్యరాజట్లు కాశ్మీరప్రాభవమును విడిచిపుచ్చి తాపసవృత్తి గైకొనఁగాఁ గాశ్మీరదేశపుఁ బ్రజలు మంత్రులతోడఁ గూడి గాంధారదేశమునకుఁ బోయి లోకసన్నుతి పాత్రుఁడై యున్న 'మేఘవాహనునిఁ' దోడ్కొని వచ్చి యత్యంతానురాగముతోడ శుభముహూర్తమునం దతనినిఁ దమరాజ్యమునఁ బట్టాభిషిక్తునిఁ గావించిరి. ప్రజారంజనపరుఁడైన మేఘవాహనుని యవ్యాజానురాగమును జనులు గ్రమక్రమముగ క్షాళితమగు దుకూలముయొక్క ధావళ్యమునువలెఁ దెలిసికొనఁ గలిగిరి. సదా ప్రాణికారుణ్యమును గనుపఱచుచుండు బోధిసత్త్వుల చారుచర్యను సయితము తనయుత్తమ చరిత్రచే మీఱునట్లు నడచుకొను మేఘవాహనుని గణ్యగుణంబులను నెఱిఁగి యతని పట్టాభిషేకకాలమునందె యధికారివర్గము "రాష్ట్రమునం దెవ్వరు నిఁకమీఁదట జీవహింస చేయకుండవలయును" అని రాజాజ్ఞగా నల్గడలఁ జాటింపు వేయించిరి. ఈరీతి మేఘవాహనుఁడు తనరాజ్యమునందు జంతువధ యను మాట లేకుండఁ జేసి సైనికులు మున్నగువారినిఁ దనకోశమునందలి ధనమును వలసినంత వెచ్చించి యకల్మషజీవనులనుగాఁ జేయుచుండెను.

మఱియు మేఘవాహనుఁడు హింసాకృత్యమును ద్వేషించుటయందు బుద్ధదేవుని సాటియై రాజ్యమునందంతటను సోమయాజులు మున్నగువారు ఘృతపశువులతోడను పిష్టపశువులతోడను క్రతువులు భూతబలులు మున్నగువిధానములను నిర్వర్తించునట్లు కట్టడ గావించుచు 'మేఘవనము' అనునగ్రహారమును 'మయుష్ఠగ్రామమున' 'మేఘమఠమును' పుణ్యకార్యముల కునికిపట్టుగ వెలయించెను.

రాణియగు 'నమృతప్రభ' దేశీయులగు భిక్షువులకు సుఖావాసముగ నుండుటకై 'యమృత ప్రభావనము' అను గొప్పరమణీయవిహారమును నిర్మింపఁజేసెను. ఒకప్పు డమృతప్రభయొక్క తండ్రి యగు 'ప్రాగ్జోతిషేశ్వరునికి' గురువు 'లో' యనునతఁడు దేశాంతరమునుండి కాశ్మీరమునకు వచ్చెను. ఆగురువును అతనిభాషయందు 'స్తుంప' యని యందురు. అతఁడు కాశ్మీరమున 'లోస్తుంప' అనుస్తూపమును నెలకొల్పెను.

'యూకదేవి' అను నామమునఁ బరఁగిన రాజపత్ని 'నడవనము'నందు నాశ్చర్యకరమగు నొక విహారమును సపత్నియందలి స్పర్ధతోడఁ గట్టించి యందర్ధభాగమును శిక్షాచారసమన్వితులగు భిక్షువులకు నివాసస్థానముగ నొసఁగి మిగిలిన సగమునందు గర్హ్యవర్తనులై యున్న గేస్తులను పత్నీ పుత్రపశుసమేతులుగ నుండ నియమించెను.

మేఘవాహనుని మఱియొక ప్రేయసి 'ఇంద్రదేవి' యనునామె ఇంద్రదేవీభవనమును జతు శ్శాలముతో నొప్పెడు నొక గొప్పవిహారమును నొకస్తూపమును సైతము వెలయింపఁజేసెను. ఇట్లే 'ఖాదనా' 'సమ్మా' ప్రభృతి రాజపత్నులు పెక్కురు తమ తమ నామంబులు వన్నెకెక్కునట్లు మనో హర విహారములను నెలకొల్పి విఖ్యాతి నొందిరి.

మేఘవాహనుఁ డర్వాచీన నరపతి యయ్యు ప్రాచీనులగు పార్థివోత్తములప్రఖ్యాతోదంతము లను తనపావనతర చరితముచే నించుక కొంచె పఱుపఁ గలమేటి యయ్యెను.

ఒకప్పుడు మేఘవాహనుఁడు పురబహిర్భాగమున నొక్కచో విహరించుచుండ నచ్చటి కతి దూరమునుండి 'అదిగో, దొంగ దొంగ' యను నట్టి యొక గొప్ప యాక్రందన మాతనివీనులకు సోఁకెను. తోడనే యతఁడు "ఎవఁడక్కడ? దొంగనుబట్టి బంధింపుఁడు." అని యల్కతోఁ బల్కెను. వెంటనే యయ్యాక్రందము సమసిపోయెను. దొంగయలికిడి యందెచ్చటను గాన్పింపలేదు.

అంత రెండుమూఁడు రోజుల కావల రాజు విహారస్థానమున నుండఁగా నప్పు డతని కడకు దివ్యతేజోవిరాజమానలగు నిర్వురు ముప్వురు తలిరుఁబోండ్లు వచ్చి మేఘవాహనుని శరణు వేడిరి. దయాళువగు నాపుడమిఱేఁడు వారి నభయదాన పూర్వకముగ నోదార్చెను. ఆసీమంతినులును దమ సీమంతములం దంజలి పుటంబులు ఘటించి "కరుణానిధి వైన యోదేవా! అచింత్య మహిమాఢ్యుఁడ వగు నీవు పుడమి నేలుచుండ నేయొక్కనికేని పరులవలన భయము గలుగ నెట్లు? మాయార్తిహేతువు నాలింపుము. మాపతులు నాగులు. వారు కాలజీమూతరూపము దాల్చి యాకసము గప్పివేయ నిక్కడి కృషీవలులు "బాగుగఁ బండియున్న వరిపైరంతయు నిప్పుడకాండముగ వాటిల్లబోవు వడిగండ్ల వానచే

నేలపాలు గానున్నదే దైవమా! ఏమి సేయుదుము?' అని కలఁత నొందెడు నెమ్మనంబులతో భయాతిశయమునఁ "చోరులు చోరులు" అని యఱచిరి. ఆయార్తధ్వనికి నీవు కినిసి "చోరులు బంధింపఁబడుదురుగాక" అని మదల యిడి నంతమాత్రమున నాక్షణముననే యానాగులు పాశబద్ధులై మింట నుండి నేలపైఁ గూలిరి. ఈ హేతువున మేము శరణు వేడుచున్నాము. పతిభిక్ష యొసఁగి మమ్ముఁ గృపఁ జూడుము. అని వేఁడుకొనిరి.

మేఘవాహనుఁ డమ్మత్తకాశినుల వేడికో లాలకించి ప్రసాదగుణ నిర్మలమైన తనమోముఁ దమ్మిపై జిఱునగవు దళ్కొత్తుచుండ "బంధములనుండి నాగులు విముక్తి నొందుదురుగాక" అని నుడివెను. వెంటనే యానాగు లెల్లరును విగళితబంధనులై వేవేగ మేఘవాహనుని కడకుఁ బఱతెంచి యతని యడగుఁదమ్ముల కెఱఁగి జాయలతోడఁ దమ నెలవులకుం బోయిరి.

ఇట్లు మేఘవాహనుఁడు నిర్వ్యాజ ధర్మచర్యా ధుర్యుండగుచుఁ దానే గాక యితరులగు రాజన్యులందఱును నహింసావ్రతమును జక్కఁగఁ బాటించునట్లు చేయఁగోరి ముమ్మందు వారల లోఁబఱచుకొనుటకై దిగ్విజయసన్నద్ధుఁ డయ్యెను. సాధారణముగ యుద్ధము లన్నఁ బ్రజలకు భయము పుట్టుచుండునుగదా! అహింసానిరతుండయిన మేఘవాహనుని సమరసన్నాహము జనులకు భీతి గొల్పునది గాక స్పృహణీయమై యుండెను. అట్లతఁడు దిగ్విజయమునకై బయలుదేరి హింసాదీక్షితులైన భూపాలురను దననిరుపమాన ప్రభావమున లోఁబఱచుకొని తనవ్రతము వారికి ననుష్ఠేయ మగునట్లాదేశించి యాయాదేశములందలి ప్రజలు దన్ను నిష్కళంక మూర్తినిఁగాఁ గొనియాడుచుండ నొకింత విశ్రాంతి నొందుటకై యర్ణవాభ్యర్ణముఁ జేరెను.

ఆ కాశ్యపీనాథుఁడు పారావారతీరమునందలి తాళీవనచ్ఛాయలందుఁ దనసైనికసన్నాహము తోడ విడిసి విశ్రాంతి వడయుచు ద్వీపాంతరములసైతము వశపఱచుకొనుటకుఁ గుతూహలియై తదుపాయమును దనలో నాలోచింపుచుండెను. అట్టితఱి సాగరతీరోపాంతసీమయందలి వనమునుండి "అకటా! మేఘవాహనుఁడు పరిపాలించు రాజ్యమునందును నే నిట్లన్యాయ్యముగఁ జంపఁబడుచున్నానే యిఁక నాకు దిక్కెవ్వరు?" అనునొక యార్తస్వర మాతనిచెవి సోఁకెను. ఆయార్తనాదము తప్తాయశ్శూలమువలె నతనియెడందఁ బిట్టుగ నాటి కరము గాయపఱుప నతఁడు కడు సత్వరముగ నయ్యాక్రందనము పొడమిన తావునకుఁ దనతోడఁ జనుదెంచుచున్న వరుణాతపత్రముతోఁగూడఁ బోయెను.

అచ్చోట నొకచండికాలయము గలదు. దానికి నెదురుగ నొక శబరసేనాని యొక మనుష్యుని ముఖమును దిగువకు నదిమిపట్టి చంపఁబూని యుండుట గనుంగొని వానిని సమీపించి "ఓరీ తులువా! యింతటిపాపకార్యమునకుఁ బూనితివేల?" అని గర్జించుచుఁ బలుక నాకిరాతపతి యులికిపడి వణఁకుచు నిట్లనియె. "దేవా! నాశిశువు వ్యాధి బాధితుఁడై మరణింప నున్నాఁడు. నేను నాదేవతలను వేడికొన వారు "నీవు చండికకు నరు నొక్కని బలిగా నిత్తువేని నీకొమరుఁడు జీవించును." అని యనుగ్రహించిరి. కావున నిట్లు సేయుచుంటిని. ఇప్పుడీకార్యమున కాటంకము గల్గెనేని నాపుత్త్రుఁ డొక ముహూర్తమేని జీవింపఁడు. వానిబ్రతుకే మాబ్రతుకుగా నెంచు మాకుటుంబమువార మెల్లర మసువులఁ గోల్పోవలసినవార మగుదుము. దయామయా! పెనుకానయందు దొరకిన దిక్కులేని యీతనియెడ

నీకింతటి కనికర ముండుటయు ననేకులప్రాణములకు నాధార మగుచున్న నాశిశువు జీవితమునం దంతయుపేక్ష గల్గుటయు పాడి యగునా? కరుణింపుము." అని మనవి చేసికొనెను.

పుళిందసేనాని యొనర్చిన విన్నపమును దీనమూర్తియగు నావధ్యుని పేదచూపులును మేఘవాహనుని డెందము నత్యంత మస్వస్థత నొందించెను. అంతట మహాత్ముఁడగు నమ్మహీజాని "పుళిందా! భయపడకుము. నీవన్నట్లు బహుబాంధవుఁడవైన నీ కొమరుని దిక్కులేని యీవధ్యుని నేనే స్వయముగఁ గాపాడుదును. ఇదే నాయుత్తమాంగము నీచండికకు నుపహారముగా నొసఁగుచున్నాను. జంకులేక నాశీర్షమున నీకరవాలమును బ్రయోగింపుము. ఈయిర్వురను బ్రతుకుదురు. అని పల్కెను. ఆయద్భుతవచనామృతమునకు రాజుయొక్క చిత్తోదాత్తతకును బుళిందుఁ డెంతయు విస్మితుఁడై మేన గగుర్పాటు పుట్ట "మహారాజా! సహజకారుణ్య పరవశుఁడవైన నీవీవిషయమున నొకింత పొరఁబడుచున్నావు. త్రైలోక్య జీవితమును గొని యైనను గాపాడఁదగినది నీభవ్యకాయము, అయ్యది విశ్వంభరాభారభరణక్షమ మైనదిగదా! అట్టిదానిపై నింతటి యుపేక్షఁ బూనఁదగునా? లోకమున భూభుజులు ప్రాణతృష్ణచే సతీసుతబాంధవులను ధర్మార్థములను గీర్తిమానములను సయిత ముజ్జగింతురు.

కం॥ బ్రతుకునకై కొందఱు భూ
పతు లిపిరో! బంధుహితులఁ బత్నిసుతుల న
ర్థతతిని ధర్మము మానము
నితరం బింకేల? ప్రోవ నెంచరు వసుధన్

కావునఁ బ్రజారంజనపరుండ వగు నోమహీవల్లభా! ప్రసన్నుఁడవు గమ్ము. ఈ యొక్క వధ్యునియెడ నంతటి కనికరము మానుము. నీవు సుఖముగ నుందువేని నాశిశువు నీప్రజ లెల్లరును సుఖముందురు. అని ప్రార్థించుచుండ మేఘవాహనుఁ డింక నాలసించుట కిష్టపడక చండికకుఁ దన శరీరము నర్పింప నిశ్చయించి దంతకాంతు లనెడి పూజాద్రవ్య సముదాయముచేఁ జండిక నర్చించుచున్న వాఁడువోలె నాకిరాతపతితో "ఓరీ జాల్ముఁడా! సదాచార మనెడు సుధారసపుటాస్వాదము మీవంటి యాటవిక జంతువుల కెట్లు తెలియును? నిర్జలంబులగు నెడారుల నివసించువారికిఁ బావనం బగు జాహ్నవీ మజ్జనంబువలనఁ గలుగు నానంద మెఱుక పడకుండుట సాజము.

కం॥ విమల సదాచారం బను
నమృతపుఁజవి నెఱుఁగఁ దరమె యాటవికునకున్
సుమనస్తటినీ స్నాన సు
ఖము మరువాసికి నెఱుంగఁగాఁ దర మెటులో?

ఇట్టి నామనోభీష్టము నడ్డుపెట్ట నీవెవ్వఁడవు? ఇంక మాఱువల్కకుము. నీవు నామీఁది కరుణచే నన్నుఁ బ్రహరింపఁ జాలవేని ఇదిగో! నాకుఁ గృపాణము లేదా? నేనే దీనితో నాకార్యము నెఱవేర్తును." అని వచింపుచుఁ దనఖడ్గమును గోశమునుండి వెలికిఁ దీసి తన తనువును జండికకు స్వయముగ సమర్పింపఁ దలఁచి మస్తకమును ఛేదించుటకై కరవాలమును బైకెత్తెను.

అపుడు వెంటనే యొక దివ్యాకృతి శీర్షముపైకి వంగుచున్న కృపాణసహిత మగు నతని హస్తమును బట్టుకొని కత్తిదెబ్బకు బదులు తలపై దివ్యసుమములను జల్లెను. మేఘవాహనుఁ డంత

మెల్లగఁ దలపై కెత్తి తనయెదుర నున్న యా దివ్యా కృతినిఁ గాంచెను. కాని యచ్చోట నార్తుఁడైన యావధ్యుఁడుగాని సుతాసహితుఁడగు కిరాతుఁడుగాని గాన్పింపరైరి. అందుచే విస్మయంపడుచున్న యమ్మహారాజును దివ్యపురుషుఁడు గాంచి "కరుణానిధి వగునో నరనాథా! నేను వరుణుఁడను. భూలోక చంద్రుఁడవైన నీవు నీ సత్త్వగుణప్రభావమున నా హృదయమును పరవశము గావించితివి. నీపై విరాజమానమగుచున్న యీఛత్రము మహామహిమాఢ్యము. రసాతలమునకుఁ దిలకాయమానమై యుండెడిది.

తొల్లి మహాబలుఁడయిన భౌముఁ డీగొడుగును వరించి కొనిపోయెను. ఇప్పుడు నీకియ్యది ప్రాప్తం బయినది. ఈయాతపత్రము లేకుండుటంజేసి నా ప్రజలకు మాటిమాటికిఁ బ్రాణహారములగును పద్రవములు గలుగుచున్నవి. నిన్నర్థించి దీనిఁ గొనిపోవు నభిలాషతో మున్ముందు నీయౌదార్యమును బరీక్షింపఁగోరి యిట్టి మాయను గల్పించితిని. నీవంశమునఁ బ్రాచీనుఁడగు వసుకులుని తనూజుఁడు 'మిహిరకులుఁడు' అనువాఁడు మిక్కుటముగఁ బ్రాణిహింసఁ గావించెను. నీవిప్పుడు వానిమహాపాపమునకుఁ దగురీతి నబ్బురమైన యహింసావ్రతరూపమగు ప్రాయశ్చిత్తము నాచరించుచున్నట్లు గన్పట్టుచున్నావు. కృప లేక మూఁడుకోట్ల ప్రాణులను జిత్రవధ కావించిన యా'మిహిరకులుండును' కరుణారససాగరుండవగు నీవును నొక్క మహావంశమున జననమందితిరి. మీయిర్వుర జననంబులు విశ్వంభరాభరణంబునకుఁ దగిన శేషాహియొక్క పడగలందు భయవాంఛలను గలిగించుచుండు విషోద్గార రత్నౌఘములను, తేజఃపూరముచే దిశలెల్ల దీపింపఁజేయు జ్వలనునివలనఁ బుట్టువు నొంది చీఁకటి వెలుంగుల నొనఁగుచుండు ధూమజాల జ్వాలామాలికలను, మఱియు, మొగులు గమిచే నినాలోకము లేని వానకాలపుదినమున నలసటను నాప్యాయనమును గలిగింపఁజాలు సంతాపాసారములను బోలి కరము విచిత్రములై యున్నవి." అనుచుఁ దనను గీర్తించుచున్న యాయాదోనాథుని మేఘవాహనుఁ డడఁకువతోడ వినమ్రుఁడగుచు బద్ధాంజలియై ఛత్రముతోడను స్తోత్రముతోడను సముచితముగఁ నర్చించెను.

ఇట్లు మేఘవాహనుఁడు దా నర్పించిన యాతపవారణమును సంప్రీతితోఁ గైకొన్న వరుణదేవునితో నిట్టు లనియెను, "లోకమునఁ గల్పద్రుమములను సత్పురుషులగు నెఱదాతలతోడ సమానముగఁ బోల్పఁ గూడదు. దేవతరువులు కోరిన వారికోర్కెలను మాత్రము దీర్చుచుండును. సజ్జనులగు వదాన్యు లర్థులకు వలసిన యర్థంబులను స్వయముగఁ గనిపెట్టి యీఁదలంతురు.

మ॥ అతిదైన్యంబునఁ జుట్టునుం దిరుగు చా
యారీతులన్ వేడినన్
గతి గల్పించెడు కల్పభూజములతోఁ
గన్నంత నే కోరకే
హితచర్యావ్రతదీక్ష నర్థులను భూ
యిష్ఠంబుగా వాంఛిత
ప్రతతిం దీర్చుచుఁ దన్పు సజ్జనులఁ బో
ల్పన్ రాదు నిక్కంబుగన్.

ఆపన్నులఁ గాపాడుటకు నీవంటి పూజనీయుఁ డీగొడుగు నడుగుటంజేసి నాకిప్పు డియ్యది పుణ్యముచే పణ్యమైన యనర్ఘవస్తువుగా నేర్పడెను. మఱియు వితరణశాలి గౌరవార్హులగు నర్థులను

సమ్మాన విశేష పురస్సరముగఁ బూర్ణకాములను జేయుచుండును. మహీరుహముసయితము ఛాయార్థు లకుఁ దనచల్లని నీడచే విశ్రాంతి నొసంగి మధుర ఫలముల వారిచేఁ దనివి నొందించుచున్నది.

గీ॥ ధర్మపరతంత్రులైన వదాన్యు లెపుడు
పూర్ణకాముల నొనరింత్రు పూజ్యులైన
యర్థులను: భూరుహంబులు నట్లె నీడ
నొసఁగి భవ్యఫలంబుల నూరడించు;

కావున నోదేవా! యుదాత్త మగు నీయౌదార్యగుణముచేఁ బ్రేరితుఁడగు నీయీసేవకుఁడు నిన్నొక వరమును వేడుచున్నాఁడు. భవత్ప్రసాదమున నీపుడమియెల్ల నాకధీనమైనది. ద్వీపాంతర జిగీషువునైన నాకు కడలిని లంఘించు నుపాయ ముపదేశింప వేడుచున్నాను. అని యర్థించిన యమ్మ హీపతికి నయ్యపాంపతి "రాజా! నీవెపుడు సాగరమును దాటఁ గోరుదువో నే నప్పుడు మున్నీటి యందలి నీటి నంతను స్తంభింపఁజేయుదును. పిమ్మట నీకార్యమును జక్కఁజేసికొనవచ్చును." అని యనుగ్రహింప మేఘవాహనుఁడు మహాప్రసాదము అని సంతసించుచుండఁగనే వరుణదేవుఁడు వరుణ చ్ఛత్రముతోఁ దిరోధానము నొందెను.

అటుపిమ్మట మరునాడు విస్మయానందముల నొందుచున్న తననానావిధసైన్యముతోడ వరుణమహిమచే స్తంభితమైన దక్షిణాంభోనిధిని ననాయాసముగ దాటి గుణరత్నాకరుఁడగు మేఘ వాహనుఁ డారత్నాకరమునందు నానారత్నముల కాకరమై యున్న 'రోహణము' అనుగిరి నారోహిం చెను. అచ్చటి తాళీవన చ్ఛాయలందు సేనాసమేతుఁడై మార్గాయాసమును దీర్చుకొనుచున్న కాశ్మీరధవుని వార్త చారులవలన నెఱిఁగి లంకాధిపుఁడగు 'విభీషణుఁడు' ప్రీతితోడ నతనియంతికమునకు సపరివార ముగ నేగుదెంచెను.

అచ్చోట నపుడానరనక్తంచరసార్వభౌములకుఁ గల్గిన ప్రథమసమావేశమున వందిమాగధు లకును శ్రుతచరముగాని వారి యొండొరుల తొలియాలాపనైపుణి కడుంగడు నాశ్చర్యము గల్గించెను. ఆవల రాక్షసేశ్వరుఁడు భూసతీతిలకమైన యమ్మేఘవాహనుని నిజప్రాసాదమునకుఁ గొనిపోయి మానుష దుర్లభమగు వివిధైశ్వర్యవిభవమున నమ్మహీపతికి నుపచారము లొనరింపఁజేసెను. అంతియకాక యగ్రములందు స్థిరమైన వినమ్రతను సూచించుచున్న రక్కసుల శీర్షచిత్రములతో నొప్పారు పెక్కు పతాకంబులఁ బుడమిఱేనికి విభీషణుఁ డుడుగరగా నొసంగెను.

మఱియుఁ గాశ్మీరపతి యానతి నామోదించుచుఁ దదాదిగఁ దమకుఁ గల 'పిశితాశనులు' అను నన్వర్థనామమును గేవల రూఢశబ్దముగఁ జేయునట్లు ప్రతిన యొనర్చెను. పారావారముయొక్క పారము నుండి ప్రాప్తమయిన యాపతాకలు గాశ్మీరమునం దిప్పుడును రాజుల యాత్రోత్సవములందు 'పార ధ్వజములు' అనుపేరఁ బరఁగుచుఁ గన్గొనఁబడుచునే యున్నవి.

ఈరీతి మేఘవాహనుఁడు పొలసుదిండ్ల కొలమునందుసైతము అహింసాబీజమును నాటి కృతకృత్యుండగుచు స్వీయమండలమునకు నేతెంచెను. అప్పటినుండియు హింసానిషేధరూప మగు

నతనియాజ్ఞ 'సుగ్రీవాజ్ఞ'యై దేశమునం దంతటఁ బ్రజల కవశ్యాచరణీయమై వర్ధిల్లెను. ప్రజలకు మాత్రమని చెప్ప నేల? ఆ సార్వభౌముని రాజ్యమందు సింహములు మొదలగు భీకర సత్త్వంబులును, ఆకసంబునఁ బర్విడుశ్యేనములు మున్నగు విహంగములును, నీటియందుఁ బిల్లచేఁపలను మ్రింగు జల జంతువులును రాజాజ్ఞ నుల్లంఘింపలేకపోయెను.

ఈ విధముగ మేఘవాహనుఁడు తనయాదేశము దేశమునందలి ప్రాణి సముదాయమునకెల్ల శిరోధార్య మగుచుండఁ జక్కఁగఁ బ్రజాపాలనము సేయుచుఁ గొంతకాలమును నయింపఁగా, నొక్క నాఁడు ఒకానొక విప్రుఁడు రోగార్తుఁడయిన తన పుత్రునిఁ దీసికొని శోకాకులితస్వాంతుఁడై రాజద్వారము నకు వచ్చి యచ్చటఁ బెద్దగ నాక్రందింపఁ దొడఁగెను. రాజాద్విజన్ముని కడకు వచ్చి కారణ మడుగ నతఁడు "సార్వభౌమా! నాయీసుతుఁడు తీవ్రజ్వరార్తుఁడై యున్నాడు. నాకు వీఁడొక్కఁడె కొమరుఁడు. దుర్గకుఁ బశుబలినిచ్చినఁ గాని వీఁడు జీవింపఁడు. ఈ తరుణమున నీయానతిచొప్పున నహింసాధర్మ మును విడునకుందునేని యీ విపత్సముద్రమునుండి వీనిని గట్టునఁ జేర్చునుపాయము వేఱొండు నాకు స్ఫురింపకున్నది. బ్రాహ్మణునిప్రాణములకుఁ బశుప్రాణములకును నెంతటి యాంతర్యముండునో వర్ణా శ్రమధర్మనిర్ణేతవగు నీవ యీవిషయమున నిర్ణయముఁ గావింపఁ దగుదువు." అని పల్కి భూమిం జూచుచు "అయ్యో! తల్లీ! బ్రాహ్మణప్రాణములు గాపాడుటకై తపమాచరించుచున్నవారినిసైతము వధించిన మహోదారులగు మహీపాలురు నిన్నేలి యుండిరిగదా? అట్టివారిలో నొక్కరును నిప్పుడు గాన్పింపకుండుటకు మాదురదృష్టము మూలము గాక మఱేమున్నది?" అనుచు శోకరూక్షాక్షరముల సాక్షే పముగ బాడబుఁడు వాపోవుచుండెను.

ఆపన్న శరణ్యుఁడగు నప్పుడమిఱేఁడప్పుడు, పెద్దతడవు తనడెందమున నిట్లు విచారించెను. "నేను మొదటఁ బ్రాణిహింస గావింపఁగూడదని సమయము గావించి యుంటిని. ఇప్పుడీబాడబునికొఱకై నాయొనర్చినట్టి యహింసావ్రతసంబంధమైన ప్రతిన భగ్నమగుటకు సమ్మతించుట కర్జమా? లేక నా మూలమున నీద్విజునిసుతుఁడు మృతిఁబొందెనేని యద్దానిని సహించి యుండుట మేలా? ముందు నూయి వెనుక గోయి యన్నట్లు ఏది యొనర్చినను మిగుల ననర్థదాయకమగు మహాపాపము ఘటిల్లును. కావున నేనేమి సేయుటకుఁ దోఁచకున్నది. ఈ సంశయమున భ్రాంత మగుచున్న నామానసము సింధు సంగమమునందుఁ బెద్దసుడిలోఁ బడిన కుసుమమును బోలి యేయొక్క పక్షమును గాని యాశ్రయించు టకు సమర్థము గాకున్నది.

గీ॥ సింధుసంగమమందు విచిత్ర మైన
సుడిఁ దగుల్కొని తిరిగెడు సుమము వోలె
సంశయంబునఁ బడుమానసం బదొక్క
పక్షమును బట్టనేరక భ్రాంత మగును:

అని యిట్లు దలపోసి మరల నతఁడు తనలో "అగుఁగాక దుర్గకు నాదేహమునే యుపాయ నముగ నర్పించి నాయహింసావ్రతప్రతిజ్ఞను నీబ్రాహ్మణునిపుత్రుని గాపాడెదను" అని తుదకు నిర్ణ

యించుకొని బాడబుని గాంచి "ఆర్యా! నీకు తేపు తప్పక ప్రియ మాచరింతును. పొమ్ము" అని యాతని నటనుండి పంపించెను. తఱువాత నాఁటేయి రాజునకు స్వప్నమందు దుర్గాదేవి యగపడి యాత్మహత్యఁ జేసికొనవలదని యాజ్ఞాపించి యాబ్రాహ్మణకుమారుని స్వస్థునిగా నొనర్చెను.

ఇట్టివిషయములతోడ నొప్పుచున్న మేఘవాహనుని చరిత్రము ప్రాచీనము కాకున్నను సామాన్య జనులకు నిది సంభావ్యముగఁ దోఁచకుండుటను దలంచి మేము సిగ్గుపడుచున్నాము. అయి నప్పటికిని గొఱంత లేదు. రచనా నిర్విశేషముగ సంప్రదాయసిద్ధమయిన మార్గమునఁ జనువారికి శ్రోతలచిత్తము ననుసరించుటతోఁ బనిలేదు. ఈ చక్రవర్తి గాశ్మీరమును ముప్పదినాలుగు (34) ఆబ్దంబులు పాలించి యస్తమింపఁగా నప్పుడు కాశ్మీర మండల మంతయు నినాలోకమును గోల్పోయి నటు గన్పట్టెను.

గీ॥ ఆర్షపద్ధతి నున్నదున్నట్లు దెలుపు
సుకవి వాక్యంబులందు నమ్మకము లేక
జడమతులు ప్రేలుదురు. వారి చవుల ననుస
రించి సుకవి రచించునే యించుకేని?

## శ్రేష్ఠసేనుఁడు

పిదప మేఘవాహనుని కుమారుఁడు 'శ్రేష్ఠసేనుఁడు' కాశ్మీరమునకుఁ బ్రభువయ్యెను. ఇతనిని బ్రజలు 'తుంజీనుఁడు' అనియు 'ప్రవరసేనుఁడు' అనియును బేర్కొనిరి. ఈ శ్రేష్ఠసేనుని భుజాస్తంభ మును గృపాణ మెప్పుడు నెడఁబాయక యుండెడిది. భువనలక్ష్మి వానికృపాణ మనెడి మణిదర్పణమునం దతికుతూహలముతోఁ జేరి యుండెనో యన్నట్లు గన్పట్టు చుండెను.

ఈఱేఁడు మొదటఁ బ్రవరేశ్వరుని యాలయమును మాతృచక్రముతోడఁ గట్టించి ప్రాచీన రాజధానియందు బహువిధములైన పావనప్రతిష్ఠలఁ గావించెను. మఱియు నితఁడు తనవశమున నున్న వసుంధరను దనదుగృహాంగణమువగిది నతి జాగరూకతతో రక్షింపుచుఁ బ్రవరేశ్వరుని యుపచార విధికిఁ ద్రిగర్తోర్వి నంతయు నొసఁగి తనకాలమునందలి రాజులెల్లరు కేదారమాత్రప్రభువులగుచుఁ దనకు లొంగి యుండఁ గృపాణపై ధరాతలమును ముప్పదివత్సరములు(30) అమోఘముగఁ బరిపా లించెను.

## హిరణ్యతోరమాణులు

'శ్రేష్ఠసేనుని (ప్రవరసేనుని) యనంతరము తదీయతనూజులు 'హిరణ్య తోరమాణులు' ఇర్వురును సామ్రాజ్య యౌవరాజ్య పదవుల స్వీకరించి కాశ్మీరమును బాలింపఁదొడంగిరి.

ఇట్లుండ నొకప్పుడు రాజకల్పితములగు నాణెము లింపితము గానివి విస్తృతముగఁ బ్రచా రము నందుండ యువరాజగు తోరమాణుఁడు వానిని నిషేధించి తాను 'దీనారములు' అనునాణెములను రాష్ట్రమునం దంతట స్వనామాంకితములనుగా వ్యాప్తి నొందించెను. రాజగు హిరణ్యకుఁ డావిషయము నెఱింగి "వీఁడు నన్నవమానించి తానొక రాజువలె నిట్టికార్య మొనరించెఁగా!" అని మనంబునఁ గినుక నూని తోరమాణుని నతనిపత్నితోడఁ గారాగారమున నుంచెను.

తోరమాణుఁడు చెఱసాలయందుఁ జాలకాలముండుటచేఁ గష్టమున కలవాటుపడి యుండెను. ఆతనిపత్ని యిక్ష్వాకువంశజుఁడైన 'వజ్రేంద్రుని' తనూజ, ఆమె యాకాలమున నాపన్నసత్త్వగా నుండెను. క్రమముగ నామెకుఁ గాన్పు సమయము సమీపింపఁ దోరమాణుఁడు లోన లజ్జాచకితుఁడగుచు నెట్టకేలకుఁ దనపత్ని నొక కుమ్మరియింట సుఖప్రసవము నొందుటకై యుండ నియోగించెను. ఆ యమయు నట్లే యొక కులాలగృహమున నుండి యచ్చోటఁ గుమారునిఁ గనెను.

ఆ బాలుఁడు గుమ్మరివానియింటఁ గులాలాంగనకు మురిపెపుఁగొమరుఁడై కోకిలశాబకము వాయసకులాలయమునందువోలెఁ గ్రమముగ నభివృద్ధి నొందుచుండెను. ఆ రాచబిడ్డ నిజజనయిత్రికినిఁ దన్నుఁ గాపాడుచున్న కుమ్మరివెలఁదుకకును రత్నగర్భకును భుజంగికిని నడుమపడ్డ ప్రచ్ఛన్ననిధివలె విదితుఁడై యొప్పారుచుండెను. రాజపత్ని నియోగము నొంది కులాలవనిత యారాజకుమారుని నతనిపితామహుఁడగు 'ప్రవరసేనుని' పేరఁ బేర్కొనెను.

ఆ రాకుమారుఁడు ప్రవరసేనుఁడు సహవాసులైన సామాన్యబాలురస్నేహము నొల్లక తేజస్వులగు రాజపుత్రుల మైత్రినే కాంక్షించుచుండెను. తామరపువ్వు నీటఁ బుట్టునదయ్యును దూరస్థుఁడగు మిత్రుని మైత్రినే యెల్లపుడు వాంఛించుట ప్రత్యక్షనిదర్శనముగ నున్నదిగదా!

గీ॥ విమల తేజస్కులై యొప్పు విజ్ఞు లెవ్వ
 ర్దర్శులగు వారి మైత్రినే యభిలషింత్రు.
 జలమునం బుట్టు కమలముల్ చాల దవ్వు
 లందుఁ గలమిత్రు మైత్రికై యాసపడవె.

కులీనులును శూరులును విద్యావంతులును నగు దారకులతోడనే యెల్లపుడు మెలఁగుచుఁ గ్రీడించుచుండు నారాచపట్టిని జనులు చూచుచు విస్మయము నొందుచుండిరి. ప్రవరసేనుఁ డుదారతేజస్సముపేతుఁడు. కావున నడవియందలి లేఁబ్రాయపు మృగములు గొదమ సింగంబునువలె బాలకులెల్లరును నాటలాడు నపుడు తమసంఘమున కతనిని రాజుగా నెన్నుకొనిరి. ఆ బాలరాజును గ్రీడలయందు వారివారికిఁ దగినయట్టు బహుమతుల నొసంగి యనుగ్రహించుచు నందఱను వశపఱచుకొని రాజోచితముగాని యాచారమున నించుకేనియుఁ బాల్గొనకుండెను. కుంభకారులు కుండలు మున్నగునవి సేయుటకు మంటినిఁ దెచ్చి యిచ్చినప్పుడు ప్రవరసేనుఁడు మృత్తిక గైకొని దానఁ బెక్కుశివలింగములఁ జేయుచుండెడివాఁడు. యిట్లే యెల్లపుడును బెక్కు వింతలగు పనులు చేయుచు నుండునాప్రవరసేనుఁ డొకనాఁడు బాలకులతోఁ గ్రీడించుచుండ 'జయేంద్రుఁడు' అతనిని సాదరముగఁ జూచుచు నచ్చోట గొంతకాలము నిలువఁబడెను.

అంతట నచ్చటిబాలకులు గొందఱు ప్రవరసేను నుద్దేశించి "నిన్నభినందించుచు నచ్చట నిలువఁబడి యున్న యానూతనవ్యక్తినిఁ జూడుము. అతఁడు 'జయేంద్రుఁడు,'" అని యా బాలకునికిఁ దెల్పిరి. జయేంద్రుఁడును నించుక దగ్గిఱి రాజపుత్రునకు సహజముగ నుండఁదగిన యుదారగుణము

తోడఁ దనవైపు చూచుచున్న యాబాలుని సత్త్వాతిరేకమును గనిపెట్టి "ఇతఁడు సాధారణకులోత్పన్నుఁడు గాఁడ"ని యూహించుచుఁ బోలికనుబట్టి తనభాగినేయునిఁగా శంకించెను.

అంతట జయేంద్రుఁడు తాను శంకించుచున్న విషయమునందలి తత్త్వ మెఱుంగఁ గుతూహలపడుచుఁ బ్రవరసేనునితోడ నతఁడుండు గృహమునకుఁ బోయెను. అంచతఁడు తనసోదరి యుండుట గనుంగొని మఱింత యౌత్సుక్యభరితుఁడయ్యెను. అప్పు డచ్చోట నాకస్మికముగ నట్టియవస్థయందు నొండొరులం గనుఁగొనుచున్న యాసోదరుఁడును నా సోదరియు దైన్యాతిభూమి నొందుటచే బొడముచున్న వారి వేడినిట్టూర్పులం గలపి బాష్పపూర మత్యుష్ణముగ వెల్వడసాగెను.

ఆ రాజపుత్రుఁడపుడు కులాంగనానీతం గాంచి "జననీ! వీరిదువురెవ్వరు? అని యడిగెను. ఆ కులాల సీమంతినియు "వత్సా! ఆయమ్మ నీతల్లి, ఆయయ్య నీ మేనమామ" అని యతనికి బదులు సెప్పుచు నతనితండ్రి యు దంతమును గూడ సంగ్రహముగ నెఱుకపఱిచెను. ఆ విషయము నాలకించిన ప్రవరసేనుఁ డప్పటికప్పుడే నెమ్మనమున నత్యంతము కుములుచుఁ బ్రబలమైన కోపావేశమునఁ బ్రతిక్రియోద్యమము నాలోచింపుచుండ జయేంద్రుఁ డతనిని నెమ్మదిగ నోదార్చి యతని జతనమున కది తరుణము గాదని ప్రబోధించి తనకార్యశేషమును నిర్వర్తించుటకై యటనుండి వెడలి పోయెను.

తోరమాణుఁడు తనసోదరు నెదిరించుటకై చెఱయందుండియే విగూఢముగఁ దగుసన్నాహమును సల్పుచుండ రాజగు హిరణ్యుఁడును యాదృచ్ఛికముగఁ దనతమ్ముని఼ఁ గారాగారమునుండి విడిపించెను. కాని, తోరమాణుఁడు పిమ్మట నచిరకాలముననే కాలధర్మము నొందెను.

అట్టితఱిఁ దోరమాణునిపత్ని దోదూయమానమానసయై భర్త్రుసహగమనము సేయఁ బూనియుండఁ గుమారుఁ డామె నతికష్టముగ నివారించి దానును నిర్వేదమున నలమటించుచుఁ దీర్థయాత్రలు సేయ నుద్యుక్తుండై దేశాంతరములకుఁ బయన మయ్యెను, ఈసమయముననే హిరణ్యుఁడును సంతానహీనుఁడై కాలగతి నొందెను. హిరణ్యుఁడు కాశ్మీరమును ముప్పది సంవత్సరములు రెండు మాసములు పాలించెను. కాశ్మీరము ప్రభువిరహిత మయ్యెను.

## హర్షుఁడు - విక్రమాదిత్యుఁడు

ఆకాలమున హర్షుండను నామాంతరమున సుప్రసిద్ధుఁడై యేకచ్ఛత్రాధిపతి యైన 'విక్రమాదిత్యుఁడు' అనుచక్రవర్తి 'యుజ్జయిని' రాజధానిగాఁ జేసికొని పుడమి నేలుచుండెను. అద్భుత భాగధేయ సంపన్నుండయిన యతనియెడ శ్రీదేవి బద్ధాదరయై వెన్నుని నాల్గుబాహులను సాగరమును ద్యజించి యతనియొద్దనే స్థిరనివాసము సేయుచుండెను. హర్షుని సంపద యతఁడు గుణనిధి యగుటకు నుపకరణమయ్యెను. ఆసార్వభౌముని సన్మానమును బడసిన గుణవంతుల వంశాంకూరము లీకాలమునందును శ్రీమంతులలో నగ్రగణ్యులై యున్నారు. హర్షుఁడు మ్లేచ్ఛోన్మూలనమునకై యవతరింపఁబోవు విష్ణుదేవునకుఁ గొంతకుఁగొంత బరువు తీరునట్లు తాను మున్ముందు 'శకుల'ఁ బ్రకటముగ నిర్మూలించి గుణవదాశ్రయుఁడై యెల్లరకును దనయాస్థానమున సులభముగఁ బ్రవేశ మొసఁగుచుండుటంజేసి యతని కీర్తిలత నానాదిగంతములకు నిరాటంకముగఁ బ్రాఁకుచుండెను.

ఉ॥ సిరిమూలంబున సద్గుణోదయ యశ
     శ్శ్రీ మించి సర్వప్రజా
దరముం గాంచి, తనర్చువారి సుచరి
     త్రం బొంగదా! యివ్వసుం
ధర శ్రీమంతులకెల్ల నెక్కటి శుభా
     దర్శం బ దెల్లప్పుడున్
స్థిర మారీతినిఁ గొంద జీవ్వుడును గీ
     ర్తి జ్యోత్స్నఁ జెన్నొందరే;

ఇట్లుండ 'మాతృగుప్తుఁడు' అను నొకమహాకవి శ్రీహర్షుని మహోత్కర్షమును బలుమాఱు విని యాతని దర్శింప నొకనాఁడు తదీయ మగు నాస్థానమున కరుదెంచెను. అయ్యాస్థానియందు రత్న సింహాసనస్థితుఁ డై యున్న చక్రవర్తిని మాతృగుప్తుఁడు సవిశేషముగఁ గన్గొని యతని గంభీరాకృతియు ననుభావాతిశయమును నిదివరకుఁ దాఁ జూచియున్న రాజన్యులయం దెవ్వరియెడను గాన్పింప కుండు టకుఁ గర మాశ్చర్యపడుచుఁ దనలో నిట్లాలోచించెను.

"గుణిప్రియుఁడైన యీ రాజన్యుని నాసుకృతవిశేషమునఁ గన్గొంటిని. ఈరాజు మూలమున నితనికిఁ బూర్వులైన రాజు లెల్లరును గుణోత్కర్షము నొందఁ గలరనుట నిక్కము, ఈ నరపతి యాస్థానమున నున్నపుడు శాస్త్రపారగులు కవులు తత్త్వజ్ఞులగు పండితులు గౌరవాదరములను బడ యుటకై యంజలి మోడ్పుల నొనరింప కుండుటఁ జూడ, వైదగ్ధ్య వంధ్యముగాని యీతనిశేముషి కులాంగనవలె నిసర్గగంభీర మగు నీరాజచూడామణి సదాశయము నావిష్కరించుచున్నదనుటకు సంది యము లేదు, ఖలాలాపములను విషమువలె ద్వేషించుచు యుక్తాయుక్తజ్ఞాన విచక్షణుఁడైన యిమ్మహా రాజు తన నాశ్రయించిన వారి యోగ్యతల ననుసరించి స్వయముగఁ దరతమభావముల నెఱుంగుచు వారివారి నాయారీతుల సంభావించుచుండును. కావుననే యీ సార్వభౌమునికడనుండి యేయొక్క మహాశయుఁడును నతృప్తివలన నిట్టూర్పు పుచ్చుచు మరలిపోవువాఁడు లేకుండెను. జ్ఞానలవదుర్వి దగ్ధులగు పండితంమన్యులతోఁబాటు తమ్ముఁ సాటిగఁ బరిగణింపక తనవివేకదృష్టితోఁ జక్కఁగఁ బరి కింపఁ గలవాఁడగుటచే నీసమ్రాట్టును నాశ్రయించు గుణవంతులగు విద్వత్తల్లజులు జీవన్మృతి తుల్య మగు దైన్య మెట్టిదో యెఱుఁగక తమవైదుష్యమును సార్థకము గావించుకొనుచుందురు,

కం॥ గుణపక్షపాతి విద్వ
జ్జన వర్ధనుఁ డౌచుఁ బూర్వ జనపతులకు వ
న్నెను దెచ్చువాని భూమీ
శునిఁ బ్రజ వడయున్ స్వ పూర్వ సుకృతముపేర్మిన్

గీ॥ తత్త్వవేత్తలు వివిధశాస్త్రప్రవీణు
లైన కవిరాజులకు నించుకంత యేని

గానమునం గౌరవంబునం గొఱంత గలుగ
నీక యేలుటయే గద హితము పతికి.

కం॥ కులకాంతవోలె మృదు మం
జుల వైఖరి భావములను సూచించెడు ని
ర్మల బుద్ధి గలిగినం గద
యలఘు యశంబును గనంగ నగు మనుజునకున్.

కం॥ యుక్తాయుక్తము లెఱుఁగెడు
శక్తి గలిగి ఖలవచఃప్రసక్తి నుడిగినన్
రక్తిన్ భజింత్రు సుగుణా
సక్తుఁ బ్రభుని లోకులెల్ల సమ్యగ్భక్తిన్॥

గీ॥ క్షుద్ర విద్యానిపుణులను సుగుణనిధుల
నొక్కరీతినిఁ జూచుట యక్కటకట!
గులకఱాలను రత్నాలఁ గూర్చు టగును.
భవ్య మతులకు నదియె జీవన్మరణము.

ఉత్సాహవర్ధనుఁడును నాశ్రితుల యభీష్టమును బాగుగ గుర్తింపఁగల నేర్పరియు నైన యీఱేని కొలువునందు స్వామిభక్తి పరాయణులైన యమాత్యులు భృత్యులు మున్నగువా రప్రమత్తులై మెలఁగుచుందురు. బూటకపు మాటలు పల్కువారు గాని పరస్పర మనాప్తవచనములను అశ్లీలపుఁ బల్కులను బ్రయోగించువారు గాని, ఇతరుల కొసంగు ప్రవేశమును సహింపనివారుగాని యీభూజాని యోలగమునందుఁ గలికమునకేని గాన్పింప కుండుట పొగడఁదగిన విషయము. కావుననే యీచక్రవర్తి యొక్క దాక్షిణ్యము హిమాద్రియందలి హిమవిక్రయమువంటిది గాక యప్పటికప్పుడు ఫలవంతమగు చుండు నని తోఁచుచున్నది.

మఱియుఁ దనయిచ్చవచ్చునట్లు నడచుకొనువారికిని ఆత్మస్తుతిపరాయణులకును సర్వజ్ఞంమన్యులకును నితఁ డత్యంత విముఖుఁ డగునట్లు గాన్పించుచున్నాఁడు.

మ॥ చిరకీర్తి ప్రియులైన పార్థివులకున్
జత్తంబులం దోఁచుఁ ద
మ్మరలేకుండ భజించు నాశ్రితుల కా
ర్యక్లేశముల్ వారియం
తరముల్; కావున వారు వారికడఁ ద
త్తద్యోగ్య సత్కార వి
స్తరమున్ గాంతురు; వీడిపో వెపుడుఁ ద
త్సంబంధ బాంధవ్యముల్.

గీ॥ సేవలోఁ గల్గు కష్టంబుఁ జిత్తమందుఁ
గానలేనట్టి నృపతికిఁ గనికరంబుఁ
గలుగఁ జేయుట నీహార ఖండములను
మంచుకొండపయిన్ విక్రయించు టగును.

గీ॥ నృపతి తనకొల్వునన్ బూటకపు యశంబుఁ
గన్నవారల నాప్తులుగాఁగఁ గలహ
పరుల మంత్రులుగాఁగ దబ్బరలు వల్కు
వారలను దీర్పరులుగ నిల్పంగరాదు.

గీ॥ ఒరుల చేరిక మదిలోన నోర్వలేని
వారి, నశ్లీలములు వల్కువారి, నౌకరి
నౌకరు మర్మంబు లేర్చు నర్మోక్తు లాడు
వారిని నృపుండు దరిఁ జేర్పఁగోరఁ దగదు.

గీ॥ ఇంగితానుగుణంబుగ నెదుట నిచ్చ
కంబు లాడుచు వందిమాగధులవోలెఁ
బొగడుచును సర్వము నెఱుంగు ప్రోడలట్లు
మెలఁగు వారిని దరిఁ జేర్ప మేలు గాదు.

కం॥ గుణవంతుల కాశ్రయుఁడౌ
జనపతికడ నల్పమతులు చాడీలను జె
ప్పినఁ జెల్లవు; సజ్జన మై
త్రినిఁ జెఱుపఁగఁ దరమె బ్రహ్మదేవునకైనన్.

కం॥ స్థిరమతిని గుణజ్ఞునిఁ బా
పరహితు గంభీరు భూమిపాలునిఁ "దమభా
గ్యరమావిశేష" మని సు
స్థిర భక్తి భజించుచుంద్రు సేవకు లెలమిన్.

కావున గంభీర హృదయుఁడును గుణజ్ఞుఁడును స్థిరబుద్ధియు నగు నీనరేంద్రుఁడు నాకవశ్యమాశ్రయింపఁదగినవాఁడుగాఁ దోఁచుచున్నది. యితని నాశ్రయించిన తరువాతఁ దొల్లింటివలె మరల నాయారాజాస్థానములం ద్రిమ్మరుచు ధన మార్జించి జీవింపవలసిన యట్టి యక్కఱయు నట్టిక్లేశమును గలుగకుండు నని నాకు నచ్చిక యగుచున్నది." అని యిట్లు మాతృగుప్తుండు పెక్కువిధములఁ బెద్దతడ వాలోచించి తాను గ్రొత్తగ వచ్చిన వాఁడుగావున నూరక గమనించుచుండెనే గాని యప్పటి యారాజసభను దనమాటలనేరిమిచే రంజింపఁజేయలేదు. విద్వద్గోష్ఠులందును బాల్గొనలేదు.

గీ॥ నూతనాగతుఁడౌ సుజనుండు రాజ
సభలలోఁ గోవిదుల గోష్ఠి జరుగు నపుడు
వేగిరంపడి ప్రతిభను వెల్లడింప
రాదు తన కందుఁ జొరవ దొరకు వఱకును.

గీ॥ తిన్నఁదనమున స్వగుణముల్ దేటపఱచి
ప్రభువు తనయెడ సుముఖుఁడౌ పట్టు దెలిసి
యదను గనిపెట్టి బుద్ధిసంపదను సుకవి
నృపతి కొల్వునఁ జూపుట నేర్పు సుమ్ము.

మాతృగుప్తుఁ డిట్లు రాజాస్థానమునకు వచ్చుచు నచ్చట వినయ మార్దవాది గుణములతోడ మెలంగుచు నుండ సార్వభౌముఁ డగునాహర్షుఁ డతని చారుచర్యను గమనించి తనలో "ఈవైదేశికుఁ డెవ్వరో! ఈతఁడు సామాన్యగుణవంతులలోఁ జేర్పఁదగిన వాఁడుగఁ గన్పడుట లేదు. ఈతని యుదాత్తమైన సహజ గాంభీర్యము ఈతఁ డత్యంత సత్క్రియాభాజనుఁడని చెప్పక చెప్పుచున్నది. కానిమ్ము. ఇంకను గొంత కాలము పరీక్షింపవలయును" అని యనుకొని మాతృగుప్తుని బుద్ధియొక్క యాంతర్యమును దెలియఁగోరి యతనికి సామాన్యమగు నెట్టి సత్క్రియగాని సేయక మిన్నకుండెను.

ప్రతిభాశాలి యగుమాతృగుప్తుండు సామాన్య సత్కారముననైనను దన్నాదరింపకుండిన యమ్మహీపతి నన్యథా తలంపక రాజు తన నుదాత్తాశయముతోడ స్వీకరింప నున్నాఁడని భావించుచు నధికప్రీతితోడ రాజు నాస్థానముఁ గొల్చుచుండెను.

ఇట్లు క్రమాభివృద్ధితోడ నమ్మహాకవి తనయాస్థానమున వర్తించుచుండుట యన్నరనాథున కాత్మీయ శరీరముమాడ్కి నుద్వేగజనకంబు గాకుండుటయె గాక నాతిదీర్ఘముగను నాత్యల్పముగను దనకడ మెలంగుచున్న యమ్మాతృగుప్త స్థితి యారాజునకు శరద్రాత్రివోలె వేడుకను గల్పించి ప్రసన్నతాహేతు వగుచుండెను.

కం॥ సరసుఁ డగు నృపతి కొల్వున
వరుసగఁ బెంపొందు కొలువు వరఫలసిద్ధిన్
బరువై తోపదు గద నిజ
శరీర భారంబుపలె నిజంబు గ్రహింపన్.

కం॥ హితచరితుని నృపచంద్రునిఁ
జతురమతుల్ భృత్యవరులు శారద నిశయ
ట్లతిచిరము గాని యత్య
ల్పత లేని మితస్థితులను భజియింతు రొగిన్॥

మరియు నమ్మహాకవి యాగర్భదాస్యమున జీవించు చేటులయొక్కయు నాత్మశరీర విక్రేతలగు దౌవారికులయొక్కయు నిచ్చకములాడు విటులయొక్కయు మోసపుమాటలను దనవీనులందు సోఁకనీక రాజదాసీజనమును రాజద్విష్టులగు నీచులను సమీపింపక యోగ్యకాలము నెఱింగి రాజాంతికమును జేరుచుండెను. ఱేఁడు ప్రసన్నాలాపకుతూహలియై తనవాక్యములం దెపుడైన ననవధానత నొందెనేని అటునిటు వోక వెంటనంటు ఛాయాగ్రహమువోలె నీసుతోఁ బ్రతిస్పర్ధియై భాషింపక యడఁకువతో నరనాథుని చిత్తానువర్తియై యుండును.

ఇంకను మాతృగుప్తమహాకవి దుష్టస్వభావు లయిన రాజపుత్రులుగాని, రాజనిందకులును ఖలజీవనులు నగు నితరులుగాని కపటమైన యాదరముతో హితోపదేష్టలవలెఁ దన్నుఁ జేరి "ప్రతిదినము నీవీభూపతి నిట్లు స్థిర మైన మూఢ విశ్వాసమున నశ్హాడుచు సేవించుచుంటివే గాని దీన నీకు నించుకేని ఫల ముండదు. తుద కాశాభంగమున నలమటింతువు" అని నుడువు నప్పుడు వారిమాటలను బెడచెవిం బెట్టి ద్విగుణీకృతోత్సాహుఁడై రాజాస్థానమును గొల్చుచునే యుండెను. మఱియు నాస్థానము నందలి సదస్యుల యుత్కర్షమును బ్రసంగ వశమున నభినందించుచు హృదయంగమముగఁ దనవిద్యా కౌశలిని వెల్లడించి వారి నెల్లర సంతోషపెట్టుచు నుండెను.

కం॥ ఇతరులకుం గల ఘనత ను
చితగతి మెచ్చుచును సభ్యచిత్తములను స
న్నుత చతురవచన రచనా
ప్రతిభన్ మెప్పించు వాఁడె పడయు శుభములన్.

ఇమ్మాడ్కి మాతృగుప్తుఁడు హర్షు నాస్థానమును గనిపెట్టుకొని యనిర్విణ్ణుఁడై యాఱు ఋతువుల కాలమును గడపెను.

అవల నొకనాఁడు విక్రమాదిత్యుఁడు బహిర్విహారమునకై పోయి యుండ నచ్చట నొక్కచో చిక్కియున్న యంగములతోడను ధూళిచే ధూసరితమై చినిగి యున్న చేలముతోడను నిరుపేదయై కన్పడు నమ్మహాకవిని హర్షుఁడు చూచి చూచి తనలో నిట్లు విచారించెను. "బాంధవులను వదలి యనన్యశరణ్యుఁడై యాశ్రయించిన గుణవంతుఁ డగు నీవైదేశికుని మనోదార్ఢ్యమును బరీక్షింపఁ గోరి యెంత యాయాసపెట్టితిని? అకటా! యెంత కష్ట మాచరించితిని! వసంతుఁడు ఆకు రాలుటచే నెండు మోడువలెఁ గాన్పించు పాదపమును బల్లవింపఁ జేయునట్లు శీతవాతాతపములఁ జివుకుచున్న యిమ్మహాపురుషుని నే నింకను నుచితాలంకారశోభితునిగాఁ జేయకుంటినిఁగదా! ఇతఁడు చిరకాలమునుండి యనుభవించెడు గ్లానికిఁ దగిన భేషజమును ఇతని నిర్వేదమును బోఁగొట్టు వినోదమును నితనియలయికను దొలఁగించు విశ్రాంతిని సమకూర్చుటకు సంపన్నుఁడు గాక మఱెవ్వఁడు సమర్థుఁ డగును? మూఢమతినై నే నీవిజ్ఞానియెడఁ బ్రయోగించిన తీవ్ర పరీక్ష నింతకాల మీరీతి నోర్చి యున్న యీధీరవతంసమునకు జింతామణి నొసంగఁ గలుగుదునా? లేక యమృత మీనేర్తునా? వ్యర్థముగ నీమహాశయు నాయాసపెట్టితిని; ఊరక యనుదినమును నత్యంతప్రీతితోడ నాయాస్థానమును గనిపెట్టికొని యెంతేని శ్రమనొంది యున్న యీసుగుణఖనిని నే నిప్పు డెట్టి యర్హసత్కారమున నాదరింపవలయును? ఋణవిముక్తుండ నెట్లు కాఁగలను?" అని పెద్దప్రొద్దు చింతించుచున్న యప్పార్థివేంద్రునకు మాతృగుప్తుని సమ్మానించు విధమొక్కటియు స్ఫురింపక పోయెను. ఆకారణమున విక్రమాదిత్యుఁ డట్లే కొంత కాలము గడపవలసి వచ్చెను.

మ॥ తినఁగా నన్నము కట్టఁగా వలువయున్
దేహంబుఁ గాపాడఁగా
నను వైనట్టి గృహంబు నౌషధపు సా
హాయ్యంబు విశ్రాంతియున్

దపభృత్యాళికి నుండెనో తుదకు నే
తన్మాత్రమున్ లేదొః యీం
వనిశం బారపి వాని నెల్లను విభుం
డంతంతఁ దీర్పం దగున్.

గీ॥ శీత వాతాతపంబులఁ జిక్కి పోవు
భవ్యవృషమం డనెడు పాదపమును తేఁడు
నవ్య దివ్య వసంతుఁడై నాటె మడర
మనుచుటం గదఃఫల సమృద్ధిని గడించు.

కొంతకాలము గడచినది. ఇంతలో హేమంత కాల మాసన్న మైనది. అప్పుడు నీహార బిందు సందోహముతో వీచు చలిగాడ్పులు ప్రాణుల శరీరములను కంపములతోఁ జీల్చు నవివోలె భయావహము లయ్యెను. దిశ లెల్ల శీతబాధ భరింపలేక నీల నిచోళములను ధరించి యున్నట్లు గన్పట్టు చుండెను. లోకబాంధవుఁడు సయితము చలివలన బాధ పడలేక బడబాగ్ని సన్నిధినిఁ దదుపశాంతిఁ బడయ నభిలషించి సాగరమును సత్వరముగఁ బ్రవేశించు చుండెనోః యనఁ బగళ్ళు కుఱుచ లగు చుండెను.

గీ॥ దట్ట మగు మంచు చీకట్లు దందడింప
నీలి రంగు దుకూలంపు మేలు గొప్పె
నలు ధరించిరొః దిక్కాంత లెలమి ననఁగ
నొప్పె హేమంత ఋతుకాల మప్పు డచట.

గీ॥ కఱకుఁ జలిగాడ్పు కోఁతల గాసి నొంద
లేక భానుండు కడలిలో దూఁకి బాధ
బంపు టగ్గినిఁ జేరంగఁ బర్వు లిడెనొః
యనఁగ హేమంతపు దినంబు లలఁతి వయ్యె.

ఇట్లుండ నొకనాఁడు నానావిధ దీపములతో నలరారుచుఁ జలి పుట్టకుండుట కై యుంపఁబడిన విచిత్రములగు హసంతికలతోడ భాసిల్లు హర్మ్యమునందు హర్షనరేంద్రుఁడు నిద్రించుచు నిశీథ సమయమున దైవికముగ మేల్కొని యుండఁ బరుషములగు గొప్ప ఘాంకృతులతో సౌధోపరి భాగమునందలి తనపడక గదిలోని కించుక వీచుచున్న హేమంత పవనమువలన నచ్చటి దీప శిఖలు గంపించుచు మిణుకుమిణుకు లాడుచుండుటం గాంచి వానినిఁ జక్కఁగ వెలిగింపఁ జేయుట కై వెలుపల నున్న యామికు లగు భృత్యుల నుద్దేశించి "యెవఁడక్కడ నున్నవాఁడు" అని స్ఫుటముగఁ బలికెను. ఆనడికి రేయి గాఢనిద్ర నొంది యుండుటచే నెవ్వరును బలుకరైరి.

కాని, వెలుపలి కక్ష్యాంతరమునుండి "నేను మాతృగుప్తుఁడను, ఇక్కడ నున్నాను." అను వాక్యములు మాత్రము తేని చెవికి వినవచ్చెను. తోడనే నృపతి "లోనఁ బ్రవేశింపుము" అని యనుజ్ఞ నొసంగెను. మాతృగుప్తుఁడు సంతత లక్ష్మీసాన్నిధ్యమున నత్యంత రమణీయమై యున్న రాజ

హర్మ్యములోనికిఁ చక్రవర్తి పిలుపుచే నెవ్వరి యనుమతి నొంద నవసరము లేకుండ బిరబిర పోయి భూమీశున కగపడెను, విక్రమాదిత్యుఁడు మాతృగుప్తునిఁ గాంచి "దివ్వెలు చక్కఁగ వెలుఁగు నట్లు సవరింపుము." అని పలుకఁగా నట్లే యతఁడు నేర్పుతో నాపనిఁ దీర్చి యక్కడనుండి తనయున్నతావు నకు యియాసుపై యుండఁ జక్రవర్తి యతనిని "క్షణకాల ముండుము" అని కోరెను, అందులకు మాతృగుప్తుఁడు "రా జేల నన్నుండు మనెను: ఏమి చెప్పఁ దలంచెనో గదా!" అని తలఁచుచుఁ జలి వలనఁ బుట్టుచున్న కంపము భయముచే ద్విగుణీకృత మగుచుండ తేని కభిముఖముగఁ గొలది దూర మునఁ గూర్చుండెను.

అంత భూకాంతుఁడు మాతృగుప్తునిఁ జూచి "రేయి యింక నెంత మిగిలి యున్నది?" అని ప్రశ్నించెను, అందు కతఁడు వెంటనే "దేవా! ఇంకను రాత్రిశేషము ఒకటిన్నర జాముున్నది," అని బదులు పల్కెను. ఆమాట విని మహీవల్లభుఁడు "రాత్రిశేషమును నీవెట్లు చక్కఁగ నిర్ణయింప గల్గి తివి?" అని మరలఁ బ్రశ్నించెను, మాతృగుప్తుఁ డయ్యది తనకుఁ దగిన యవకాశముగ నిర్ణయించు కొని తనదురవస్థను దెల్పి తన్మూలమున నాశనుగాని, దైన్యమునుగాని పోఁగొట్టుకొనఁ బూని వెంటనే యాశువుగ నొక్క శ్లోకమును రచించి దాన నాతేని కిట్లు విన్నవించెను.

"నరనాథా! అన్నాఁకట నవయుచుండుటచే క్షామకంఠుండనై చలిబాధచే మాషశిమివలె వలిగొని తిమ్మురు లెత్తుచున్న మేనితోడను వ్రణితములై పగుళ్ళు వారిన పెదవులతోడను జింతాసాగరమున మునుంగుచు నివురు గప్పిన నిప్పును మెల్లమెల్లఁగ నూఁదుచు నిముసములు లెక్కవెట్టుకొనుచున్న నన్ను నిద్ర యవమానిత యగు ప్రేయసివలె వదలిపెట్టి యెటకో చాల దవ్వున కేగినది. శర్వరి మాత్రము సత్పాత్రప్రతిపాదిత యగు వసుధవలె క్షీణింపక నన్నుఁ గనిపెట్టుకొని యున్నది." అని యాకవిచంద్రుఁడు మనవి చేసెను.

మ॥ చలిచే మాష శలాటు తుల్య మయి మే
    న్జాలన్ గగుర్పొంద, వ్యా
కులతాబ్ధిన్ బడి యోష్ఠముల్ పగులఁగన్
    క్షుత్క్షామ కంఠుండనై
నులి నిప్పూఁదెడు నన్ను నిద్ర విడిచెన్
    దూరంబుగా నల్గి పై
దలివోలెన్; నిశ వీడి పోఁదుగదు! స
    త్పాత్రార్పితోర్వీస్థితిన్.

విక్రమాదిత్యుఁ డీవాక్యము లాలించి కవిచంద్రుఁడగు మాతృగుప్తుని పరిశ్రమమును సాధు వాదములచే నభినందించి యతని నతని నివాసమునకుఁ బంపి తనలో నిట్లు తలపోసెను. "గుణవంతుఁ డగు నిమ్మహాకవి ఖిన్నచేతస్కుఁడై దుఃఖపూరితము లగు వచనములు వల్కుచుండ విని యిప్పటికిని స్వస్థుండనై యున్నాఁడను. నాజన్మ మెంతయు గర్హ్యముగదా!

కం॥ గుణవంతుని ఖిన్న మన
స్కునిఁ జూచుచు నతఁడు దెల్పు కుందును వినుచున్,

ధనవంతుఁ డూరకుండిన
మనుజత్వమె యదియు నతఁడు మనుజుఁడె తలఁపన్.

ఎవఁడో యొక సాధారణ జనుఁడు పల్కినట్లు నిరర్థకములయిన సాధు వాదములను నుడివి యుంటిని. నాహృదయము నెఱుంగని యిమ్మహాకవి లోలోన మిక్కిలి పరితాపము నొందు ననుట నిక్కము. ఈ కవిరాజున కెట్టిసత్కారముఁ జేయఁదగునో! చిరకాలమునుండియు నాలోచించుచున్నను నిప్పటికిని సరియగు కర్తవ్యము దోఁపకున్నది." అని యనుకొనుచు నించుక తడవట్లె ప్రశాంతముగ ధ్యానించి "అగుఁగాక. కవితల్లజుఁ డతఁ డిప్పు డిపుడే రచించిన శ్లోకమునఁ దనయాశయమును వెల్లడించినట్లే యున్నది. ఆవిషయ మిప్పుడు స్మృతిపథము నంటుచున్నది. కాశ్మీరమండల మిపుడు రాజరహితముగ నున్నదిగదా! ఆమండలమును పెక్కండ్రు నృపతు లహమహమికతో ప్రార్థించుచున్నారు వారికోరికను నిరాకరించి పాత్రుఁడయిన మాతృగుప్తునకే యొసంగెదనుగాక" అని యిట్లు నేర్పుతోడ నిశ్చయించెను.

పిమ్మట నారాత్రియందే హర్షచక్రవర్తి నిగూఢముగ దూతలను రావించి "మీరు సత్వరముగఁ గాశ్మీరమున కేగి యచ్చటి మంత్రివర్గమునకు రాజశాసనము గైకొని వచ్చిన మాతృగుప్తుని నిశ్శంకముగ మీరాజ్యమున కధినేతను గావింపుఁడు" అని నే నాదేశించితి నని చెప్పరండు" అని యాజ్ఞాపించి పంపెను. దూతలు వెంటనే రాజాజ్ఞను శిరసావహించి కాశ్మీరమునకుఁ బయనము సాగించిరి. విక్రమాదిత్యుఁడప్పుడే తాను శాసన మొకటి వ్రాయించి కృతకృత్యుఁడై రాత్రిశేషమును సుఖముగఁ గడపెను.

మాతృగుప్తుఁడును దా నారేయి రాజసాన్నిధ్యమును బాసి యిట్లు పర్యాలోచించెను "నృపతితోడ నాయొనర్చిన సంలాపముగూడ నిష్ఫల మైనదిగదా! చిరకాలమునుండి యూరక నేను వహించుచున్న యాశ యను మహాభార మిప్పుడు దప్పి పోయినది. చేయఁదగినది చేసితిని. ఇప్పటికి సంశయము తీరినది. ఆశాపిశాచ మంతర్ధాన మొందినది. కావున నిఁక సుఖముగఁ జరింపఁగలను. నాకేల యింతటి మతిభ్రమ పుట్టవలయును? జనప్రవాదమువలన నీరాజు సేవ్యుఁడని తలంచి గతానుగతికుఁడ నైతిని.

ఆ. వె॥ సేవ్యుఁడౌ నితండు సేవ్యుఁడు గాఁ డీతఁ
డనుచు బుద్ధిమంతుఁ డాశ్రితుండు
తెలిసికొని భజించు: దెలియక మెలఁగు గ
తానుగతికుఁ డిలఁ బ్రయాసపడఁడె?

గాలిమేపరు లగుపాములు భోగులు, అనియు, గానము సేయు తేంట్లను దఱిమికొట్టు నట్టి యేనుఁగులు విస్తీర్ణకర్ణము లనియు, లోన వేడిమియను పెనువికారము నిండి యుండు జమ్మిచెట్టును 'శమి' అనియును లోకమున జనము నిరాటంకముగఁ బ్రలపించుచున్నదిగదా! ఇట్లే లోకముచే సర్వము విపర్యాసిత మొనర్పఁబడుచున్నది యని విదిత మైనది,

మ॥ పవనాహారులు భోగు లంచు, మధుప
వ్రాతంబు గానంబు సే

యు విరోధించుచుఁ బాటఁ ద్రోలు కరులున్
వ్యాకోచ విస్తీర్ణ క
ర్ణ విశేషంబు లటంచు నంత రవలా
క్రాంత ద్రుమంబున్ 'శమీ'
ప్రవరం బం చిటు స్వేచ్ఛఁ బల్కుటమ న
ర్వం బయ్యెఁ దార్మా ణిలన్.

కాని ఈచక్రవర్తి యెడ నిట్లు భావింప రాదని నాయంతరాత్మ ప్రబోధించుచున్నది. ఏలయన? ఈనరనాథుని యనభిగమ్యత్వ మిందేమి గలదు? ఈసమ్రాట్టు నాశ్రయించినవా రనేకులు లక్ష్మీకటాక్ష భాజనులై యున్నారుగదా! ఇందు శ్రేయఃప్రతిబంధక మైన నాదు దురదృష్టమే నిందింపఁ దగినది. కాని, నిష్కళంక త్యాగి యైన యిమ్మహీపాలుని దోష మేమున్నది?

గీ॥ నిష్కళంకుండు నెఱదాత నెమ్మనమున
నాశ్రితుల కోర్కె లరయమి యదియుఁ దలఁప
నట్టి వారల జన్మజన్మార్జితంపుఁ
బాప దౌర్భాగ్య మారూపుఁ బడయు టగును.

రత్నాకరుఁడు మహోజ్జ్వలము లగు రత్నములతోఁ గూడిన కల్లోల పరంపరను బైకి విసరుచుండ సమీరము వానినిఁ దటము సేరనీకుండ మరలగొట్టుచున్నది. ఇట్టి సంఘటన మాలోచింపఁగా నయ్యది యనుభవించువారి దౌర్భాగ్యమూలక మనవలయును. గాని సాగరుని వదాన్యతాభంజక మగునని చెప్పఁదగునా?

మ॥ రహిమీఱన్ రుచిరంపు రత్నలహరుల్
రత్నాకరుం డల్ల ధూ
ర్వహుఁ డౌనట్టి సమీరుచే విసరుఁ దీ
ర ప్రాంతమున్ జేరలే
క హతాశన్ జనుటద్ది యర్థుల యభా
గ్యం; బంతమాత్రాన ని
మ్మహిఁ దద్భవ్య వదాన్యతాగుణము స
మ్మాన్యంబు గాకుండునే?

పరికింపఁగా సామాన్య ఫలప్రాప్తికై లోభపడువారు రాజోపజీవుల నాశ్రయింపఁదగును. కాని చిరకాలపరిక్లేశముచే ఫలము నొసఁగువారగు ప్రభువులను గొల్వఁజనదు. పశుపతి పాదమూలమును గనిపెట్టుకొని యుండువారికి బూఁది తప్ప వేఱొండు వెంటనే లభింపదు. పశుపతి వాహనమగు నంది నాశ్రయించువారికిఁ దాత్కాలికముగఁ బసిఁడి ప్రాప్త మగుచున్నది. కాని వారికట్టి సుదినములు శాశ్వతము లని తలంపరాదు.

గీ॥ అవని నుత్తాన ఫలలుబ్ధు లైనవారు
బహువిధ క్లేశముల భంగపడి నృపాళి
నాశ్రయించుటకంటె మేలగును గొంత
యచటి రాజోపజీవుల యాశ్రయంబు.

చం॥ భృశతర భక్తి భావమునఁ
బెక్కు విధంబుల మ్రొక్కి వేడుచున్
బశుపతి పాదమూలమును
బట్టిన బూఁది లభించు వేగ; త
ద్వశ మగు నంది పాదముల
వ్రాలిన నప్పటి కప్ప నిత్యమున్
వశమగుఁగా పసిండి; యిటు
వంటిది లోకము తీరు చూడఁగన్ ॥

పోనీ, రాజు నాయెడ నింతటి యౌదాసీన్యము పూనుటకు నేనెప్పుడేని యేదేని యపచారము గావించితినా; యని నేనెంత యాలోచించినను నట్టి దేదియు నే నొనరించి యుండలేదని నాయంతరంగము దృఢవిశ్వాసమును గనపఱచుచున్నది. ఈవిషయ మిట్లుండనిమ్ము.

నేను మఱి యెవ్వరివలనను దొలుత నిక్కడ సత్కరింపఁ బడ నైతిని. సామాన్యముగ మొదట నితరుల సమ్మానముఁ బడసినవాఁడే గతానుగతికుఁడగు ప్రభువును జేరినప్పుడు, అతని సత్కారమునకుఁ బాత్రుఁడగుచుండును. రత్నాకరమునందుఁ బెక్కు వస్తువు లగణితములై యున్నవిగదా! వానిని జలధరములు జలముతోడ స్వీకరించి మరల వర్షించునప్పుడు తరంగ బాహువులను జాచి యాజలకణములను బ్రీతితోడఁ గైకొనుచుఁ బిమ్మట నాజలకణములనే రత్నాకరుఁడు మౌక్తికములుగను రత్నములుగను లోకులకు వ్యక్తీకరించును. ఇట్లే తొలుతఁ దఱచుగా నితరుల యాదరమునకుఁ బాత్రుఁడైన వాఁ డల్పుఁడైనను బ్రభుసత్కార భాజనుఁ డగుచుండును.

మ॥ తనయందే గణనంబు నొంద కెపుడున్
దార్మాణుగాఁ బొర్లు కం
కణముల్ గొంచు ఘనుల్ నుతించి విడువన్
గా, వానినే యూర్మి బా
హు నికాయంబున వార్ధి గైకొనుచు ము
క్తోద్యన్మణుల్ గాఁగఁ జూ
పు; నొరుల్ మెచ్చిన యల్పునే న్దఱచుగన్
బూజింత్రుగా భూపతుల్.

ఈరీతిని మాతృగుప్తుఁడు చాలకాల మాలోచించి సేవ్యుఁడగు విక్రమాదిత్యునియెడ నిరాదరుఁ డయ్యెను. లోకమున ఖిన్నమతి యైనవాఁడు తత్త్వజ్ఞుఁడైనను బుద్ధివిపర్యయము నొందుట సాజముగదా!

గీ॥ చింత యనుపీఁకటి యెడందఁ జేరునేని
సుగుణములు గానరా వెట్టిచోట నైనఁ
జింత నొందిన తత్త్వజ్ఞ శేముషియును
బడయుఁగద! తీవ్రతరమౌ విపర్యయంబు.

అనంతరము ప్రభాత సమయము కాఁగానే విక్రమాదిత్యభూపాలుఁడు కొలువు దీరి కంచుకిని "మాతృగుప్తుని వెంటనే యిటకు రావింపుము" అని యాదేశించెను. తోడనే ప్రతీహారు లనేకులు వేగిరపు పోయి యావార్త మాతృగుప్తున కెఱుకపఱచి తమతోడనే యా కవిశేఖరునిఁ గొని వచ్చి రాజుసన్నిధినిఁ జేర్చిరి. మాతృగుప్తుఁ డాశారహితుఁడువోలెఁ గన్పట్టుచు రాజాంతికము చేరి కృత ప్రణాముఁడై యుండెను. గంభీరహృదయుఁడైన యప్పార్థివోత్తముఁడు "భ్రూసంజ్ఞతోడనే లేఖాధి కారిని నిదివఱకే యాయత్త పఱచి యున్న లేఖను మాతృగుప్తున కొసంగుము" అని యాజ్ఞాపించి యతఁ డట్లు సేయ, మాతృగుప్తుని వీక్షించుచు "ఆర్య! కాశ్మీరదేశము నెఱుంగుదువుగదా! నీవచ్చ టికిఁ బోయి నీకిచ్చిన యీ శాసన పత్రమును గాశ్మీరదేశాధికారులకు సమర్పింపుము. దీని నెవ్వరును దారినడుమఁ జదువరాదు. అట్టివాఁడు నాయానతి మీఱినవాఁడును, అస్మద్దేహశాపితుఁడును నగును- కావున నీ విషయము నీవొకప్పుడును మఱచిపోరాదు." అనుచు మహోదారముగఁ బల్కెను. మాతృ గుప్తుఁడు రాజుయొక్క యాశయము దెలియనివాఁడు గావున నమ్మేదినీకాంతుని యానతినిఁ బైఁబడిన దహనజ్వాలనుగాఁ దలంచి గళవళించెను. కాని, రత్నాంకురప్రభగా భావింప లేకపోయెను.

గీ॥ హితకరంబగు విభు నాజ్ఞ నెఱుఁగ లేక
క్లేశకర మంచు ముందె శంకించు వాఁడు
మణికిరణమాల పైఁబడ మనసు చెదరి
దహనకీల యటంచును దలఁచువాఁడె.

ఏమైన నేమి? మాతృగుప్తుఁడు "దేవరయానతిచొప్పున మెలఁగెదను" అని పల్కి యమ్మహా రాజును వీడ్కొని కాశ్మీరమునకుఁ బయన మయ్యెను. విక్రమాదిత్యుఁడు గరువము లేనివాఁడై తొల్లింటి వలె నాప్తులతో నాయాయిరీతుల సంలాపము జరుపుచుండెను.

అట్లు రాజునానతి పత్రముఁ గైకొని దారిబత్తెము నైనను బడయక బడుగు మేనితోడ దారి నడచుచున్న మాతృగుప్తునిఁ జుట్టపక్కములు లేనివానినిఁ గాంచి సామాన్యజను లాతనిపై జాలి పుట్టఁగా రాజును బెక్కుతెఱంగుల నాడికొనిరి. "ఔరా! ఏమి యీనరేశ్వరుని యత్కించన విధాయిత్వము! సాధారణ జనుఁడు సేయఁదగ్గ యొకానొక బంటుపనియందు గ్లేశపడఁ దగని వానిని గౌరవార్హుని నియో గించుటఁజూడఁ జాల వింతగ నున్నది.

పగలురేలును బేరాసచేఁ గ్లేశము నోర్చి తన్ను సేవించుచున్న యితనిని నిక్కముగ గ్లేశానుభవమునకుఁ దగినట్టి వానిని గానే దలంచియున్న రాజెంతయు నవిదగ్ధుఁ డనఁదగి యున్నాఁడు లోకమున సేవకుండు ప్రభుపు నను గ్రహమును బడయఁగోరి యధిక మగు శ్రమ కోర్చి సేవించుచు

నుండగా, ప్రభు వసంతరజ్ఞుఁ డగునేని ఆ సేవకుఁ డట్టిపనికే యష్టుఁడని తలంచుచుండును. శేషుఁడు నాగాంతకునివలనిభయము లేకుండ సుఖింపఁ గోరి మురారికిఁ దాను పాన్పయి సేవింప నా పురుషోత్తముఁడు శేషుని క్లేశసహిష్ణుతను గ్రహించి మహా శ్రమదాయకమై నిరవధికమైన విశ్వంభరాభారమును వహింప నతనిని నియోగించెను. కావుననే సుఖార్థి యయిన శేషుఁడు సుఖమును గోల్పోవలసి వచ్చెను.

మ॥ ఆరయన్ భోగపరుండు శేషుఁడును సౌ
ఖ్యంబున్ గరుత్మద్భయ
స్ఫురితుండై దనుజారి పాన్పగుచుఁ గో
ల్పోయెన్గదా ! యింక నా
హరి తత్క్లేశ సహిష్ణుత న్గని కటా !
యంతున్ గనన్ రాని యీ
ధరణీ భారము మోపె వాని తలపై
ధర్మం బిదిన్లో కలిన్.

ఈ మాతృగుప్తుఁడు రాజానుగ్రహమునకుఁ బాత్రు లయిన గుణవంతులలో నెల్లఁ దాను మిన్నయగుదు నని భావించి బద్ధాదరమున హర్షచక్రవర్తినిఁ గొల్చి యుండెను. ఇట్టి గుణవత్తముని నీరీతి భృత్యకార్యముల నియోగించుచు ననాదరించిన రాజునకంటె ననింగితజ్ఞుఁడగు వాఁడు వేఱొకఁ డుండఁడు.

లోకమున నెమలి యింద్రాయుధముతోఁ గూడిన మేఘునిఁ గాంచి "ఈతఁడు నానాద్యుతి మత్పదార్థ రసికుఁడుగ నున్నాఁడు, కావుననే యసారమైన శక్రధనువునం దింత ప్రీతినిఁ జూపుచున్నాఁడు ఇట్టివాఁ డిఁక నాపింఛమును గాంచినచోఁ గర మానందించుచు నాకెట్టి ప్రియమును గావింపకుండును?" అని తలంచి హర్షముతోఁ దనబర్హమును జక్కఁగ విప్పి నాట్యము సేయుచుండును. పాపము! అట్టి మయూరమునకు నీటిబొట్టు మాత్ర మొసఁగు జలదునికంటె వేఱొక శూన్యహృదయుఁడు లేఁడుగదా!

మ॥ "తన నానాద్యుతిమత్పదార్థరుచి ను
ద్ఘాటించి యింద్రాయుధం
బును బ్రీతిం గను నీఘనుండు నను ద
న్పుంగాదె" యం చాత్మలీ
లను నృత్యంబును జూపు బర్హిపయి నీ
ళ్ళం జల్లి గర్జించి ముం
చు; నతండే విషదుం డొరుండు గలఁడే
శూన్యాశయుం డమ్మెయిన్.

ఇట్లు జనులు వారివారికిఁ దోఁచినట్లు తమలోఁ దా మనుకొనుచుండిరి. మాతృగుప్తుఁడు మాత్రము నిర్దైన్యుం డగుచుఁ దనదారినిఁ బోవుచుండెను. భవిష్య దర్థ మాహాత్మ్యమునంజేసి కొం

యొక వికల్ప మేదియు నతని మదిం జొరదయ్యెను. మాతృగుప్తుఁడు మార్గమధ్యమున నొకచోటఁ దా నొక్క గొప్పమేడ నెక్కి సముద్రము నుల్లంఘించినట్లు కల గాంచెను.

ఒకచోట నడచు నప్పుడు పాము పడగపై ఖంజరీట ముండుటను బ్రత్యక్షముగఁ గన్గొనెను. ఇట్లే యంతంతన పలుమాఱు గానవచ్చుచున్న శుభోదర్క సూచకము లగు పెక్కు శకునములను జూచి చూచి యతఁడు చేయూఁత నొందినవానివలె మార్గాయాసము నెఱుంగక పయనము సేయుచుఁ దాను శాస్త్రకోవిదుఁడు గానఁ దనలో నిట్లు తలంచెను.

''ఈశుభసూచకము లగు నిమిత్తములంబట్టి యేఁగొనిపోవు రాజశాసనము నాకు శుభావహమగు ననుటకు సందియము లేదు. కాశ్మీరముననేఁ బడయు ఫలము కొలఁది పాటి దైనను నత్యద్భుతమగు నాదేశ మాహాత్మ్యమున నయ్యదియే యితరములగు మహాఫలములను సహితము మీఱఁజాలి యుండును.'' అని యిట్లు తలపోయుచుఁ బోవుచున్న మాతృగుప్తునికి గమనక్లేశము గలిగింపని విని ర్మల మార్గములందు నాతిథేయ వ్రత నిరతులైన గేస్తు లడుగడుగునను నతిథి సత్కారము నాచరించు చుండిరి.

అతఁడు క్రమక్రమముగ దారి నడచి కాశ్మీరము సమీపించెను. అచ్చోట మొదట నతఁడు చలించుచున్న నానావిధ వృక్షలతాదులచే నిండి పచ్చిక బయళ్ళచే నొప్పారినదై మంగళ్య దధిపాత్ర ముం బోలి యున్న సీహారాద్రిని దర్శించెను:

తఱువాత సర్జరస స్యంద సుభగములై గంగాశీకరములతోడఁ గూడిన మందమారుతము మాతృగుప్తుని పాలనము నొందనున్న కాశ్మీర భూభాగమునుండి వీతెంచి యాతనిఁ బ్రత్యుత్థానమున సమ్మానించెను.

అంత నా కవిరాజు 'క్రమావర్తము' అనుపేరఁ బ్రసిద్ధి నొందిన ప్రదేశమున యోధుల హెచ్చరికకై యేర్పఱుపఁబడిన 'కాంబువనము' అను వాద్యస్థానము చేరెను. అయ్యది నేఁడు 'శూర పురమునందు' నెలకొల్పఁబడి యున్నది. మాతృగుప్తుఁడు నానాజనపదములకుఁ గూడలి యగుచున్న యట్టి ప్రదేశమునఁ గాశ్మీర ప్రకృతివర్గ మేదో యొక కారణమున సమావేశమై యున్నట్లు విని తన పూర్వవేషమున నచ్చటికిఁ బోవుట సమంజసము గాదని తలంచి తెల్లని వలువలను ధరించి తనతెచ్చిన రాజశాసనమును గాశ్మీరామాత్యులకు నర్పింప వారున్న తావునకుఁ బోయెను.

అతఁ డట్లు పోవునపుడు శుభశకునంబు లొకటి వెంట నొకటి గలుగు చుండుటను గాంచు చుండిన బాటసారులు కొందఱు వానిఫల మేమగునో చూడఁగోరి యమ్మాతృగుప్తు ననుసరించి పోయిరి. పిదప దౌవారికులు విక్రమాదిత్యుఁడు పంపిన దూత వచ్చెనన్న వార్త దెలిసికొని యవిలంబితముగ నవ్వార్తను మంత్రివర్గమున కెఱుక పఱచిరి.

అంత మంత్రులు మాతృగుప్తుని సాదరముగ స్వాగతము పలికి ''రండు, ప్రవేశింపుఁడు'' అని పల్కుచు లోనికిఁ దీసికొని పోయి సత్కారవిశేషముల గారవించి యుత్తమాసన మలంకరింపఁ గోరిరి. సముచితాసనోపవిశిష్టుఁడైన మాతృగుప్తుని మంత్రులు, ఉజ్జయినీ వల్లభుని యానతి యేమని యడిగిరి.

అంత నతఁడు తాఁ దెచ్చిన రాజశాసనమును మెల్లఁగ వారి కొసఁగుచు నొకింత లజ్జపడిన వాఁడువలె మిన్నకుండెను. అమాత్యులు రాజశాసనమును గైకొని ప్రణతి సల్పి విశిష్టస్థలమునం దంద ఱును జేరి లేఖలోని విషయమును జదివికొని మాతృగుప్తునికడ కరుదెంచి వినయాన్వితు లగుచు "మాతృగుప్తుఁడు" అను శ్లాఘ్యనామము మిమ్మాశ్రయించి యలంకృత మయిన దని దెలిసికొను చున్నాము." అని పలికిరి. అంతటనతఁడును గంభీరముగఁ జిఱునగవుతోడ "అట్లే యగును." అని బదులు పల్కెను.

## మాతృగుప్తుని పట్టాభిషేకము

అటు పిమ్మట వెంటనే రాజ్యాభిషేక సంభార మంతయు నాయత్తపఱుపఁబడెనా? యను నధికారుల వచనము విని నంతనే యంతకుఁ బూర్వమే యా యావివిధవస్తుసంభారము నంతను సంసిద్ధపఱచి యున్నవా రందఱును "సర్వము సమాయత్తమై యున్నది." అని కౌతుకముతోడ నుడి విరి. నేనువెంటనే బహుళజనాకీర్ణంబయిన యాప్రదేశము, ఉత్తాల కల్లోలమాలా కోలాహల సమాకుల మైన జలనిధికి సాటియై యలరారుచుండెను. అప్పు డమాత్యవర్గము మాతృగుప్తుని సౌవర్ణపీఠిపైఁ బ్రాఙ్ముఖోపవిష్టునిఁ గావించి నానా పుణ్య నదనదీ జలంబుల నభిషేకించుచుండ వింధ్య తట సదృశం బైన యతని వక్షస్థలమునుండి సశబ్దముగ దొరలుచుండిన యభిషేకాంబుధార రేవాస్రోతస్సు ననుక రించుచుండెను.

అట్లు మాతృగుప్తుఁడు పట్టాభిషేక శుభాభ్యంగ స్నానము జరిగినపిదప మంచిగంధపు మైపూఁత నంది సర్వాంగ సమలంకృత బహువిధ భూషణుండై రమణీయతర రత్న భాసుర మగు రాజాసనము నధిష్ఠించెను. అట్టితఱి ప్రజ లమ్మహారాజును దగ్గరి యివ్విధముగ సవినయముగ మనవి యొనర్చిరి.

"దేవా! విక్రమాదిత్య చక్రవర్తి స్వయముగ నీదేశముఁ బాలింప మాచేఁ బ్రార్థితుఁడై తత్స దృశుఁడ వగు నిన్నుఁ దనకు మాఱుగ నిర్దేశించి పంపుట మాభాగ్య విశేషము. కావున నీవృథివి నేలి కొనుము. పురాతన కాలమునుండియు నిమ్మహారాజ్యమును బాలించు పార్థివోత్తములు తమ వదాన్యత్వ సంపదచేఁ బెక్కుమండలముల నీవిగా నొసంగి యుండిరి గాని, యొకప్పుడును నితరులచే నిమ్మండ లము దానముగా నొసఁగఁబడి యుండలేదు. లోకమునందుఁ దమతమ కర్మసంస్కార విశేషమున జన్మముల నొందువారికి మాతాపితలు కారణ మగుచున్నట్లు ఇతరులు రాజుల రాజ్యప్రవృత్తియందుఁ గారణ మగుచుందురు.

కం॥ తమతమ కర్మంబులఁ బ్రా  
ప్త మయిన జన్మమునకు న్నితరులున్ బలె మూ  
లముగా నుందురు నృపు రా  
జ్యము సాగన్ గొంద ఱుర్విఁ జతురతరమతుల్.

విషయ మిట్టిది. కావున నన్యుని గుఱించి "నేను త్వదీయుండను." అని తమరు వచింప నక్కఱ లేదు. సర్వాధికారసముల్లసితు లగు దేవరవారు ప్రాజ్య మగు నీరాజ్యముఁ బాలించుచుండిన

లాఘవదోష మనునది మన కేరికిని సంక్రమింపకుండును.'' అని యిట్లు ప్రజలు తథ్యమునే వచించి నను మాతృగుప్తమహీపాలుఁడు తనస్వామి యగు విక్రమాదిత్యుని సత్కృయను స్మరించుచు స్మితాననుఁడై యొక క్షణకాల మూరకుండి యావల నూతన రాజ్యలాభసమయమున నాచరింపఁ దగు నూర్జితము లగు సీవులచే నాదినమును శుభోల్బణముగ సుదినము గావించి యానాఁ డచ్చోటనే గడపెను.

మఱునాఁడు సచివులు నగరప్రవేశము సేయఁ దన్నుఁ బ్రార్థించుచుండ మున్ముందు రాజ్యప్రదాత యగు విక్రమాదిత్యునకు విచిత్రములగు నుడుగరలను సమర్పించుటకై దూతలను బంపెను. అట్లొనర్చియు మరల నతఁడు దేశౌన్నత్యము ననుసరించి తనపంపిన యయ్యుపాయనములు తన ప్రభువుతోడి స్పర్ధను వెల్లడించునేమోః యని శంకించుచుఁ దాఁ గావించిన పనికి నొకింత లజ్జపడి సాపరాధునివలెఁ దన్ను భావించుచుఁ బిమ్మట మఱికొందఱ భృత్యుల రావించి విక్రమాదిత్యునకుఁ దనసేవ తలంపునకు వచ్చునట్లు కొలఁది విలువగల కానుకలను సైతము పంపించెను.

మాతృగుప్తుఁ డంత మాత్రము తోఁ దనివి నొందలేదు. తనప్రభు వగు విక్రమాదిత్యుని యసామాన్య గుణములను దలంచి తలంచి కనుదోయి బాష్పపూరంబు నిండుచుండ స్వయముగ నొక శ్లోకమును రచించి దూత కొసంగి పంపుచుఁ దన్మూలమునఁ దనకృతజ్ఞత నిట్లు తెలుపుకొనెను

''సార్వభౌమా ! గంభీర హృదయుఁడ వగు నీవు నీయింగితమును నాకృతిచే నెంతమాత్రము ప్రదర్శింప కుందువు. నీ ప్రభావాతిశయము నించుకేని పొగడుట కిష్టపడవు. ఈవియెడ నుద్దేశమున్నదైనను గాన్పింపవు. కాని నీకడ నుండువా రాయా సత్ఫలములఁ బడయుచు నీయనుగ్రహము నిరుపమాన మని యెంచుచు నమందానందము ననుభవించుచున్నారు. ఇట్టి నీఘనౌదార్యముయొక్క సామ్యకలను నిశ్శబ్దముగ జీవనదాత యగు నాఘనుఁడొక్కఁడే పొందఁ గలుగుచున్నాఁడు.

ఉ॥ ఆకృతిచే రవంతయు మ
 హత్త్వముఁ జూపవు; త్యాగవాంఛ యే
దో గనుపింప వాత్మనుతి
 యోర్వ వొకింతయు; సత్ఫలంబె యెం
తో కృపఁ గూర్తు వోగుణమ
 హోదధి! జీవనమున్ గటుధ్వనుల్
లేక యొసంగి సుంతయు జ
 లింపవు; సవ్యఘనుండ వీ విలన్.

ఈరీతి మాతృగుప్తమహీపతి విక్రమాదిత్యసార్వభౌమునకుఁ దన కృతజ్ఞతా స్ఫోరక మగు లేఖ నంపి దిశ లెల్ల నిండి యుండు నానావిధ సేనానికురుంబముతోడఁ గూడి యత్యంత వైభవమునఁ బురము ప్రవేశించి వంశక్రమాగత మైన వసుంధరనుబోలె నయసమ్మతముగఁ బ్రజారంజన తత్పరుఁడై పాలింపఁదొడఁగెను. ఉచితజ్ఞతతో నున్నతాత్ముఁడైన మాతృగుప్తునికిఁ బౌరుషమునెడను త్యాగమునందును వాంఛ యాచకునికివలెఁ బరిమితమైనది గాక పోయెను

ఆ॥ యాచకునకు వోలె యౌచితీ గుణ భాసు
రునకు వసుమతీశ్వరునకు దాన
మందుఁ బౌరుషంబునందుఁ బరిమితేచ్ఛ
యుండ దిఁదియె వారి కుండు పోల్కి.

మరియు నతఁడు త్యాగబుద్ధితోడ సమృద్ధ దక్షిణోపేతము లగు జన్నములను జేయ సమకట్టి పశుబంధము దలంపునకు వచ్చుటచేఁ గారుణ్య పూరిత హృదయుఁ డయ్యెను. అంతటఁ దనరాష్ట్రమునం దంతటను నహింసాధర్మ మందఱకు ననుష్ఠేయ మని యాజ్ఞాపించి రాష్ట్రమునందలి ప్రజలు దైన్య మనుభవింపకుండునట్లు బంగారము మున్నగునది యథార్హముగ నొసంగి వారెల్లరు సాత్త్వికాహారులై మెలఁగుటకుఁగాను గరంభమును సేవించునట్లు ముదల నిడెను. రాజాజ్ఞను బ్రజ లెల్లరును గుతూహలమున మౌళిం దాల్చి యానందముతోఁ బెరుగు పెలపిండిని భుజించుచు సాత్త్వికవర్తనముతో మెలఁగుచుండిరి.

కష్టమనునది యాత్మీయానుభవపూర్వకముగఁ జక్కఁగ నెఱిఁగి యున్నవాఁడు వివేచనా నిపుణుఁడును వదాన్యుఁడును నైన మాతృగుప్తమహీవల్లభుఁడు అర్థిసార్థముల కోర్కెలను దీర్చుచు మనీషిరత్నముల స్వయముగ జేరఁదీసి వారినెల్ల లక్ష్మీవిలాసపౌరభభరితులనుగా నొనర్చుచు సుధాప్రసన్నమగు తనకీర్తి వెన్నెలచే విక్రమాదిత్యుని సైతము మిగులుచుండెను.

ఇట్లుండ నొకప్పుడు 'భర్తృమేంఠుఁడు' అను నొకకవి నూతన విధమున రచించిన 'హయగ్రీవవధము' అను తనగ్రంథమును మాతృగుప్తమహీంద్రునకుఁ జూపెను. అతఁడు నాగ్రంథమును సాంతముగఁ బరిశోధించునంతవఱకు నొకబ్బమునెడఁ దనయాశయము వెల్లడింపక పోయెను. మాతృగుప్తుఁడు స్వయముగ మహాకవి యగుటచే నందలిగుణదోషములను జక్కఁగఁ బరిశీలించి తుద కాగ్రంథమునకుఁ దనసంపూర్ణాంగీకారమును జూపుచు నాగ్రంథలావణ్యము దేనికేని యంటిపోవు నను భయము చేతనోః యనఁ గబ్బము దిగువఁ బసిఁడి పళ్ళెము నుంచి రచయితను బహువిధసత్కారముల నాదరించెను.

భర్తృమేంఠుఁడును కవీంద్రుఁడగు మాతృగుప్తమహీధవుఁడు తనగ్రంథమును శ్లాఘించుటయె గొప్ప బహుమతియై యుండ నిఁక నతఁడు తనను ధనాదులు విరివిగ నొసఁగి సత్కరించుట తనభాగధేయ విశేష మని భావించి మాతృగుప్తుని సరళోదారహృదయమును బెక్కు తెఱంగుల శ్లాఘించెను.

మాతృగుప్తమేదినీకాంతుఁడు 'మాతృగుప్తస్వామి' అనుపేర 'మధుసూదనుని' ప్రతిష్ఠింపఁజేసి తత్సేవకై యనేకగ్రామముల నొసఁగెను. ఆగ్రామములు కాలక్రమమున 'మమ్మఁడు' అనువాఁడు తన దేవాలయమునకై సంగ్రహించెను. ఈరీతిని మాతృగుప్తుఁడు సంప్రాప్తమగు రాజ్యశ్రీవైభవమునఁ దనవిజ్ఞానమును దిశలెల్ల వ్యాపింపఁజేయుచుఁ గాశ్మీర వసుంధరను నాలుగబ్దములు తొమ్మిది నెలలు నొకదినమును బాలించెను.

## తీర్థయాత్రలకేగిన ప్రవరసేనుఁడు

ఇట్టి తరుణమున నంజనాదేవి సుతుఁడగు ప్రవరసేనుఁడు తీర్థసేవచేఁ దనపితృవర్గమును దరింపఁజేసి తనదేశముపై నితరప్రార్థివుఁడు పెత్తనము వహించుట శ్రుతి పరంపరనుండి గ్రహించి యుపచితక్రోధుఁ డయ్యెను. నిశాసమయమునందుఁ జెట్ల కొమ్మలయందును. నాకులందును నిండుకొని యున్న మంచునీరు పగటియందు నహిమకర తాపమున నణఁగి పోవునట్లు ప్రవరసేనునికిఁ గల పితృశోకము నూతనోదితమగు క్రోధంపువెట్టచే నంతర్హితమై పోయెను.

అంత నతఁడు శ్రీపర్వతముం జేరి పాశుపతవ్రత వేషధారి యగు "అశ్వపాదుఁడు" అను నొక సిద్ధుని సన్నిధి కరిగెను. ఆసిద్ధుఁడు ప్రవరసేనునకుఁ గందమూలముల యోగిర మొసంగి ప్రవరసేను నుద్దేశించి ఓయీ, నీవు తొలిజన్మంబున సిద్ధుఁడనై యున్న నన్ను కార్యసాధకుఁడవై యాశ్రయించి యుంటివి. నేను నీకోర్కె యెట్టిది? అని నిన్నుఁ బ్రశ్నింప నీవు నీకుఁ గల రాజ్యాభిలాషమును వెల్లడించితివి. అంత నేను నీకోర్కె సఫలము కావించుటకుఁ బ్రయత్నించి యుండ నుమాపతి నాకుఁ బ్రసన్నుఁడై "నిన్నాశ్రయించినవాఁడు నాభక్తుఁడు. సిద్ధతుల్యుఁడు. యతని యభిలాషము నతని వేఱొక జన్మమందు నీడేర్తును" అని నన్నాదేశించెను. కావున భగవానుఁడగు నంబికారమణుఁడు నీకు దర్శన మొసంగి నీవాంఛితము నీడేర్పఁగలఁడు." అని తోడన యంతర్ధాన మొందెను.

అంతటఁ బ్రవరసేనుఁడు సామ్రాజ్య కామియై యొక్క సంవత్సరము మహాదేవునిఁ దపశ్చర్యచే నారాధించెను. అయ్యాదిదేవుఁడు సిద్ధుని వేడికోలుం దలంచి వ్రతివేషమునఁ బ్రవరసేనునకు గాన్పించి 'ఏమి కోరుచుంటివి?' అని యడుగ నతఁడు "జగము నంతను గైవసము చేసికొనఁగల సార్వభౌమపదవి నాశించుచున్నాను" అని వేడెను. అందుల కమ్మాయావ్రతి ప్రవరసేనుని హృదయసారముఁ దెలియఁ గోరి "ఏమీ! మోక్షలక్ష్మినిఁ గోరక భంగుర మగు రాజభోగమును వరించితివా?" అని యాక్షేప పూర్వకముగఁ బల్కెను.

ప్రవరసేనుఁ డమ్మాయామస్కరి వాక్యము లాలించి నిన్న వ్రతివేషమున సాక్షాత్కరించిన మృత్యుంజయునిఁగా భావించి యిట్లు వల్కితిని. ఓహో నీవు జగద్గురుఁడగు పరమేశ్వరుఁడవు కావు కాఁబోలు! మహాత్ములు తమ్ము భక్తులు స్వల్ప మగు నర్థ మర్థించినను దమంతటఁ దామే మహత్తర మగు ఫలమును బ్రసాదింతురు. వదాన్యవతంసుఁ డగు నప్పరమేశ్వరుఁడు దన్యా పీడితుఁడైన 'యుపమన్యువు' పయస్సు నర్థింప నతనికిఁ బాలకడలినే చూపియుండెనుగదా! వాస్తవముగఁ గైవల్య ప్రాప్తి కాసపడుచు నిశ్చలమై యున్న నాడెందము నాయభిజనమునకుఁ గల్గిన యవమానమును సహింపలేక యరుంతుద మగు వ్యథకు లోనైన నన్ను వికలపెట్టుచుండుట నీవు గ్రహింపకుంటివి." అని యడఁకువతో నుడివెను.

గీ॥ అర్థు లల్పంబుఁ గోర మహాత్ము లెప్పు
డధికమే ప్రీతిఁ గూర్చెద; రది యెటన్న?
భక్తుఁడు పయస్సు వేడ పిపాసఁ జెంది
యవ్వదాన్యుఁడు శివుఁడు క్షీరాబ్ధిఁ జూపె.

ఇమ్మాటలకు జగదీశ్వరుఁడు ప్రవరసేనునియెడ నెంతయుఁ బ్రీతుండై నిజరూపమున నతనికి సాక్షాత్కరించి మరల నతనితో "వత్సా! నీభావము పరీక్షింపఁ గోరి ఇట్లంటిని. నీవు కోరిన వరము నిచ్చితిని. రాజ్య సౌఖ్యములం దవిలి యుండు నీవు కడపట నాసాయుజ్యమును బొందుటకు నాయానతిచే నశ్వపాదుఁడు సరియగు తరుణమున నిన్నుఁ బ్రబోధింపఁగలఁడు". అని యనుగ్రహించి యంతర్ధానము నొందెను.

అనంతరము ప్రవరసేనుఁ డయ్యపూర్వమైన మహేశ్వరానుగ్రహమును దలంచి మేరలేని యానందము ననుభవించుచు వ్రతపారణము సల్పి యశ్వపాదుని సాన్నిధ్యమునకుఁ జనుదెంచి సర్వమును దెల్పి యతనిని వీడ్కొని యభిమత మగు తనభూమికి నేతెంచెను. ఆసంగతి నెఱింగి కాశ్మీరామాత్యులు ప్రవరసేనునికడకు వచ్చి కాశ్మీరరాజ్యవృత్తాంతము నంతయుఁ దెల్పి మాతృగుప్తు నెదుర్కొనం బురికొల్పిరి. ప్రవరసేనుఁడు మంత్రు లట్లు పల్కుట సరిగాదని మందలించుచు నుత్పత్తిఁడగు విక్రమాదిత్యుని పీచ మణఁచవలయు ననెడి భావముతో సచివులతో నిట్లనెను.

క్లేశసహిష్ణువు గాని సామాన్యునిమీఁది కుఱికిన నేమి ప్రయోజనము? సామాన్య వైరిబృందము నణఁచివేయు పరాక్రమము గల శూరవరుల జయింపఁగోరుట శ్లాఘ్యమగు విషయము. కావున మాతృగుప్తునిపై నాకెట్టి కిన్కయు లేదు. ఉద్రిక్తుఁడై యున్న విక్రమాదిత్యునిఁ బరిమార్చుటయె నా తలంపు.

లోకమునఁ బ్రకృతినిఁ దిలకించినచో విచిత్ర మగుచుండును. పద్మషండము ప్రసన్న మగు సుధాకరోదయము నీసడించుచున్నది. ఇట్టి సందర్భమున నిజముగఁ దమ్మిపూలకు జాబిల్లి దక్క మఱెవ్వఁడు పగతుఁడు? కాని మత్తేభములు కమలాకరముం జేరి సారసముల మొదలంటఁ బెఱికి నులిమి వేయుచున్నవి. అట్టి దంతావళముల నిష్ఠుర దంతములను రేవెలుంగు తనదీప్తిచే ఓఁటలు వారఁజేయుచున్నాఁడు. ఇదెట్టి న్యాయము? వింత యగు నీవిషయమందలి రహస్య మేమన? ఉన్నతాత్ములగు రాజు లెప్పుడును దమ సామర్థ్యమును వెల్లడించుటకు సామాన్యులతోడ స్పర్ధ వహింపక వారిని లోఁగొనుచున్న వీరవరులపైఁ దమయల్కను వ్యక్తపఱచి పగ సాధించుచున్నారు.

ఉ॥ తా నుదయింప నెమ్మొగము
  దామర దీనత మోడ్చు పద్మినిన్
బూని మదేభముల్ నులిమి
  పుచ్చుట మెచ్చక యబ్జవైరి య
య్యేనుఁగు దంతముల్ పగుల
  నేయును బాదహతిన్; విచిత్ర ము
త్తానబలుల్ మదోన్నతులఁ
  దాఁకి కదా! పగఁ దీర్చు కొంద్రిలన్.

అని ప్రగల్భముగఁ బల్కి వారిని వీడ్కొల్పి త్రిగర్త దేశమునకుఁ బోయెను. అచ్చటి భూమిపాలుర ననాయాసముగ జయించి తన జిగీషకు విషయమైన దేశమును జేరఁ బ్రవరసేనుఁడు పయనము సేయుచుండు తరుణముననే మధ్యేమార్గమున విక్రమాదిత్య నరేంద్రుఁడు కాలధర్మము నొందె నన్న

వార్త వినెను. అందులకుఁ బ్రవరసేనుఁడు పుట్టిమునిఁగిన చందానఁ జింతా దోదూయమాన మానసుండై నిట్టూర్పులు వుచ్చుచు నాదినము స్నాన మైనఁ జేయక పోయెను. ఆహారము మానెను. నిద్దుర త్యజించెను వితాకు నొందినవానిమాడ్కి నవనతాననుండై యుండెను.

అటుపిమ్మట మఱునాఁడు ప్రవరసేనుఁడు కాశ్మీరపతియై యున్న మాతృగుప్తుఁడు రాజ్యమును జేయ నొల్లక యామండలమునుండి బయలుదేరి యనతిదూరమునందు నిలిచి యున్న వృత్తాంతము నాలించి "తనవారు మాతృగుప్త నగరనిష్కాసితునిఁ గావించి యుందురేమో" యని సందేహించుచు మితపరివారముతోడ మాతృగుప్తుని చెంతకుఁ బోయి యతనిని గారవించి సుఖాసీనుం జేసి "రాజ్యము నుజ్జగింపఁ గతమేమి?" అని యడఁకువతోడఁ బ్రశ్నించెను.

మాతృగుప్తుఁ డొక్కక్షణ మూరకుండి వేఁడి నిట్టూర్చు వుచ్చి నవ్వి ప్రవరసేనునితో "రాజా! యెవనివలన నేను భూపతి నైతినో యట్టి సుకృతి సుగతి నొందెను. ఇఁక నాకు రాజ్యము తోడఁ బని యేమున్నది? శిల యగు సూర్యకాంతము సయితము సూర్యపాదములు తనపై సోఁకినంత కాలము జ్వలించుచు దిశలను దీపింపఁ జేయును. అట్లు గాకున్న నించుకేని వెలుంగదుగదా!" అని బదులు వల్కెను.

గీ॥ అరుణ కిరణ ప్రభా మాల శిరమునందు
సోఁకు నెందాక నందాక సూర్యకాంత
మణులు నాశలు దేదీప్యమాన మగుచు
వరలుఁ దద్విరహంబున నిరులఁ గుములు.

ఇమ్మాటలకుఁ బ్రవరసేనుఁడు "ఆర్యా! నీకెవ రపకృతిఁ గావించిరి? ఎవరికిఁ బ్రత్యపకారము సేయఁ గోరి గతించిన యాభూపతికై యిట్లు వ్యాకులపడుచున్నావు?" అని మరల మాతృగుప్తు నడిగెను. ఈ ప్రశ్నలకుఁ గోప స్మితము లొక్కుమ్మడి నధరపల్లవముపై నటించుచుండ మాతృగుప్తుఁడు ప్రత్యుత్తర మిట్లొసంగెను.

"నాకపకృతి సేయ సాహసించునట్టి బలాధికుఁ డొక్కండును లేఁడు. నన్ను మాననీయునిగ నొనర్చిన యాసార్వభౌముని మహోదారమగు యత్నము బూఁదియందలివేలిమి వంటిది గాఁజాలదు. ఊషరమునందలి బీజావాపముం బోలదు, తమ కొనర్చిన యుపకారమును మఱవక కృతజ్ఞతా గుణ వశంవదులై యుండువారు తమయుపకర్తలు వోవు నుత్తమమార్గమును ననుగమించుచున్నారు, చైతన్యము లేని జడపదార్థములందుఁగూడ నీపద్ధతి ప్రత్యక్షదృష్ట మగుచున్నదిగదా! ఎట్లన? సూర్య కాంతము తపనుఁ డస్తమించినపుడు కాంతివిహీన మగుచున్నది, అట్లే చంద్రకాంతము చంద్రుఁడు కలాక్షీణత నొందు నప్పుడు తానును గాంతిగ్లానిఁ బడయుచునే యున్నది. కావున నాయకమణియై వెలిఁగిన యానృపాలశేఖరుఁడు దివంగతుఁ డగుటచేఁ దద్వియోగమున నంధకారితమై యున్న పుడమినిఁ జూచుటకు నైతము భీతి నొందుచున్నాను. ఇఁక నాకు భోగసంబంధమునఁ బ్రసక్తి యెక్కడిది? నే నిప్పుడ పావనమైన వారాణసిక్షేత్రమునకుం బోయి ద్విజజనోచిత మైన సర్వసన్యాసము నొనర్చి శమసుఖ మనుభవింప నభిలషించుచున్నాను.

కం॥ అనవద్య చరితు సుపక
ర్తను దలఁపనివాని కగు హితం బది భస్మం
బున వేల్చు నేయి యూషర
మునఁ జల్లిన యట్టిబీజమును నగు నరయన్.

ఉ॥ చేసిన మేలు నెల్లపుడు
చిత్తమునందు స్మరించుచున్ సద
భ్యాస కృతజ్ఞతాగుణ వ
శాత్ము లుపక్రియఁ జేసినట్టి యా
భాసుర మూర్తు లేపదవిఁ
బట్టుదురో. యటులే చరింతు; రీ
వాసి నచేతనంబులును
బాయక యుండుట చిత్రమౌ సుమీ.

గీ॥ సూర్యుఁ డస్తంగతుం డైన సూర్యకాంత
మస్తమించిన చందాన నణఁగి యుండు.
చంద్రుఁడు కలాక్షయంబున సన్నగిల్ల
చంద్రకాంతంబు గతియు నాచంద మగును.

అనిత్తియౌచిత్యోల్బణముగఁ బల్కు నమ్మాటలకు ధీరుఁ డగు ప్రవరసేనుఁడు విస్మితుఁడై మరలఁ దాను మాతృగుప్తు నుద్దేశించి యుచితముగ నిట్లు వల్కెను. "పుడమిఱేఁడా! కృతజ్ఞులు ధర్మతత్పరులును నగు మిమువంటి పావనచరిత్రులం బడసి యలరుచున్న యివ్వసుంధరాదేవి రత్నగర్భ యను తననామమును నిక్కముగ నన్వర్థముఁ జేసికొనుచున్నది.

గీ॥ అసదృశం బైన విశ్వంభరాఖ్య, వసుధ
యనెడు నామంబు, రత్నగర్భాభిధాన
మిమ్మహీదేవికిం జెల్లు సుమ్ము. ధన్యు
లుపకృతిజ్ఞులు నెఱదాత లుందురేని;

కృతజ్ఞత యనెడు రాజమార్గము భవాదృశుల సంచారమునఁ దేఁట పడనిచోఁ జిరకాలము చీడువడి ఖిలీభూతమై యుండు ననుటకు సందియ మేమున్నది? జగము జడప్రాయమై యుండ నిన్ను యథార్థముగ సంభావించిన మేధావి యగు నమ్మహీపాలునికంటె శ్లాఘనీయుఁడును నాంతర్యవిదుఁడును నగువాఁడు మఱి యెవ్వఁడు గలఁడు.?

సామాన్య లోకవృత్తమున మఱియొక విషయము గోచరించుచున్నది. అధముఁడగు మానవుఁడు సజ్జనుఁడగు మహోదారునివలన నుపకృతినిఁ బడసి తఱుచుగా దృప్తుఁడగును. అట్టివాఁ డుపకర్త నుద్దేశించి తనలో నిట్లు తలపోయును "ఇప్పటి నాయదృష్టమువలన నిట్టి సంపద వడసితిని. కాని, వీనివలన నాకియ్యది ప్రాప్తింపలేదు. అట్లుకాకున్నచో నితఁ డింతకు మునుపే నాకేల యొసఁగి యుండ

లేదు.? లేదా! ఇతనికి నావలన నెఱవేఱవలసిన స్వార్థ మేదేని యుండవచ్చును. అట్లు గానిచో! దైన్య మనుభవించు తనబంధువులు పెక్కుం డ్రుండ వారిని విడిచి నన్నేల గౌరవింపవలయును? ఇదియును గానిచో, రంధ్రాన్వేషణపరుఁడను గావున నే నెట్టి లోపములను గల్పించి వెల్లడింతునో! యన్న భీతి నిట్లొనర్చి యుండును. లేకుండిన లుబ్ధుఁడైన యితఁ డింతటి సంపదను నాపర మెట్లు సేయును?'' అని పరిపరివిధముల, దలపోయుచుండును.

సీ॥ నా పున్నెములపంట యీపాక మొందెను.
కాకున్న ముందేల గలుగ దితని
కీత్యాగబుద్ధి? యింతేల? ఏదో స్వార్థ
మాసించి యీపని చేసియుండు.
కానిచోఁ జుట్టముల్ దీనులై యుండగఁ
బోషింపఁ దేల దుర్బుద్ధి యితఁడు?
మద్భయంబుననె సన్మానించె నన్నిట్లు;
లేకున్న నీలోభిలీల లిట్టి

గీ॥ వౌనోకో! యని యుపకృతి నవసరమునఁ
బడసి దుర్జాతుఁ డాత్మ ప్రభావ మెంచి
కొలత లేని కృతజ్ఞతా గుణమునకుఁ ది
లాంజలి యొసంగు మరుభూమి యగు నెడంద.

ఇఁకఁ బుణ్యతమంబులును నుదాత్త గుణ భూషితంబులు నైన సహృదయ క్షేత్రంబుల యందు నాటఁబడిన సత్క్రియాంకూరము పెక్కు చిగురుఁగొమ్మలతోఁ బెంపొంది పొల్పారుచుండును.

గీ॥ అనుపమోదాత్త గుణ గణ్యు లగు మహాత్ము
లందు నాటిన సత్క్రియ యలఁతి మొలక
యయ్యు శతకల్పశాఖియై యద్భుతముగ
విశ్వ కల్యాణ మూలమై వెలయు చుండు.

ఆర్యా! నీవు మహామణివలెఁ దత్త్వజ్ఞులచేఁ బరీక్షింపఁబడి సత్పురుషుల సత్కారాభినంద నముల నందుకొన్న గుణవదవతంసమవు. కావున మాయందఱ నను గ్రహింపుము. మాప్రార్థన నియ్యకొని నరేంద్రపదవిని స్వీకరింపుము. 'గుణవత్పక్షపాతి' యను ఖ్యాతి నాకును లోకమునఁ గలుగ నిమ్ము. పూర్వ మానరేంద్రుఁ డీభూమి నీకొసఁగి యుండెను. ఇప్పుడు నేనును నీకే యర్పించుచున్నాను నీవు మరల నొకమా ఱీభూతధాత్రిపైఁ గనికర ముంచి యేలికొనుము.'' అని యిట్లవ్యాజౌదార్యమును జాటుచున్న ప్రవరసేనుని వచనములు విని మాతృగుప్తుఁడు స్మితవదనుఁడై మెల్లఁగ నతని కిట్లు బదులు పల్కెను.

"ఏయక్షరములు లేక వక్తవ్యాంశమున నొక్కమాత్రైనను వెలువడ నేరదో; ఒకమాఁ తొకతీరున ముఖమునుండి వెలువడియున్న యయ్యక్షర పంక్తిని మఱియొక విధముగ మార్చుకొని స్వార్థపరత్వము వెల్లడించుట మర్యాదోల్లంఘనము గాక మఱేమగును.

ఉ॥ అక్షరముల్ సమస్త విష
యంబులఁ దెల్పఁగఁ జాలి యుండియున్
రక్షిత భావ రత్న నిక
రంబులుగాఁ దనరారు నవ్వి: య
య్యక్షర పంక్తి భోగ పరు
లొచు యథేచ్ఛము మార్పరాదు; స
త్పక్షపు మేర మీఱుట శు
భం బని యెంచరు నీతికోవిదుల్.

కావున నే నిప్పు డొసంగు సమాధాన మించుక పరుషమై యుండవచ్చును. నిష్కపటమైన నీబుజుభావము నీ వార్యుఁడ వని విశదపఱచుచున్నది. లోకమునందుఁ బ్రతివాఁడును మొట్టమొదట నితరునియెడ లాఘవమునే స్మరించుచుండును. ఇట్లే మన మిరువురము నొండొరుల యాశయములను దొలుతఁ జక్కఁగ నెఱుంగక డెందములందు విభిన్నములగు భావములు గలిగి యుంటిమి. ఇప్పుడు మన హృదయములు దేటపడినవి.

గీ॥ లోకు లెల్లరు దఱచుగ లోకులందు
లాఘవమ్మునె ప్రాగ్దశలం దలంత్రు;
కొంత కాలంబు జరుగుచున్నంతఁ దామె
తన్మహత్త్వంబు దెలిసి సంతసము గాంత్రు.

కావున నిఁక నెట్టి సందియము నుండదు. నావంటివాఁడు మరల రాష్ట్రమును గైకొని యైశ్వర్యానుభవకామియై యౌచితీ విధానమును దుడిచి వేయుట కర్జమా? నేను భోగాభిలాషినై యావిక్ర మాదిత్యుని యసాధారణ మైన యౌదార్య మహిమను సాధారణ మైనదానిఁగా నొనరించుట గొప్ప దప్పిదముగదా! ఒకవేళ నేను రాజ్య సుఖ మనుభవింప వాంఛ గలవాఁడనై రాజ్యాభిమానము విడువక యుందునేని నన్నెవరు నిరోధించి యుండరు, అట్టి విషయ మొక్కండును లేదు. ఎట్టిప్రత్యుపకృతినిఁ బడయక నాకై యమ్మానవ నాథుఁ డొనరించినట్టి మహోపకారము నాశరీరమున జీర్ణించి యెల్లపుడు రక్తనాళములయం దెడతెగక ప్రవహించుచుండవలయు ననునదే నానిశ్చయము.

మఱియు నే నమ్మహీధవు వెనువెంట ననుగమించి యతఁడు పాత్రాపాత్ర వివేచనాచణుఁడైన నెఱదాత యన్న ఖ్యాతి జగమున వెల్లి విరియునట్లు మెలఁగవలయుట కర్తవ్యమై యుండెను. అయ్యది నామదదృష్టమున జరుగలేదు. ఇఁక నతఁడు కీర్తిశేషుఁడై యుండ భోగముల నైనఁ బరిత్యజించి కాలము గడపుట నాచేయఁదగిన కనీసపువిధి యని తలంచుచున్నాను." అని యారీతిఁ బల్కి మాతృగుప్తుఁడు మఱేమియు ననక యూరకుండెను.

అంత ప్రవరసేనుఁడు మాతృగుప్తుని మనోనిశ్చయ మనివార్య మగు టెఱింగి యిఁక నీతనిని రాజ్య పరిగ్రహణమునకై బలవంతపెట్టుట ఫలవంతము గాదని భావించుచు మాతృగుప్తుని దిక్కుమొగంబై "అన్నాయైన నీజీవించినంత కాలము కాశ్మీర సంపద నీయదియే కాని నేనెంతమాత్ర మద్దానిని స్పృశింప నొల్లను. అని ప్రతిజ్ఞాపూర్వకముగఁబల్కెను.

పిమ్మట సుకృతి యగు నమ్మాతృగుప్తుఁడు వారాణసికిఁ బోయి యటఁ గాషాయ వసనము మొదలగు కర్మంది చిహ్నముల సంగ్రహించుకొని సర్వసన్యాసము నొనర్చి యతిరాజన్యుఁ డయ్యెను.

## ప్రవరసేనుఁడు

కాశ్మీరాధిపత్యమును బూనిన ప్రవరసేనుఁడును కాశ్మీర రాష్ట్రమున వచ్చు వరుంబడి నంతను నెప్పటికప్పుడు దృఢ నిశ్చయముతోడ మాతృగుప్తున కనుపుచుండెను. భిక్షామాత్రజీవనుఁ డగు మాతృగుప్తుఁడు హాతముతోఁ దన్నుఁ జేరుచున్న యాలక్ష్మీవిభవము నంతను నర్థిసార్థంబులకు విరివిగ నొసంగుచుఁ బెక్కు పవిత్రకార్యంబులకై వినియోగించుచుండెను. ఆరీతి నతఁడు పదిసంవత్సరంబులు గడపి జీవితావధి నొందెను.

చిత్తము నాకర్షించు నీవృత్తాంతమునందు రమణీయమై గమనింపఁదగియున్న విషయ మేమన? ఒండొరులయెడ నభిమానముతో మెలఁగుచుఁ బరస్పర మౌచితీ వికాసశోభితులై తనరారిన యీ మువ్వురు పుణ్యపురుషుల వృత్తాంతము త్రిపథగాపానీయముమాడ్కిఁ గడుంగడు స్పృహణీయమై యున్నది.

ప్రవరసేనుఁడు రాజధర్మమును నిర్వహించుచు పుడమితేండ్లనెల్లఁ దనకు లోఁబఱచుకొనుటచే బెనుపొందుచుండిన యతని కీ ్ర్తి దిక్చక్రమును నిరాటంకముగ నల్లిబిల్లుకొనుచుండెను. అతని ప్రతాప తపనుఁడు కుంభసంభవునివలె నిపీతాంభోనిధియు లంఘితోర్వీధరుండును నయి భువనములను బ్రసన్నములుగ నొనర్పఁ గలిగెను. మఱియుఁ బ్రవరసేనమహారాజు చమూనిచయము వైరికాంతల వదనముల నెండుచున్న తమాలపత్రములు గలవిగను దాళీదలశూన్యములుగను జేయఁగల్గెను. గంగాలింగన సుఖమునం దేలు పూర్వసాగరునికి ప్రవరసేనుని వాహినియందలి మత్తేభములు తమ దానధారా ప్రవాహముచే నూతన కాళిందీ సంగమమును గల్పించి కరము సమ్మోదమును ఘటింపఁజేసెను. అంతమాత్రమే కాక దిక్తటముల నాక్రమింపఁ గలట్టి తనయనీక పటలముతోఁ బశ్చిమసముద్రముదనుకఁ బోయి యచ్చటి సౌరాష్ట్రులను వికావికలుగఁ దఱిమితఱిమి తనప్రతాపపటిమను మెఱయింపఁ జేసిన మహావీరుఁడగు ప్రవరసేనుఁడు పృథివీనాథులందఱియందును యశఃకామియై రాగద్వేష వర్జిత మైన తనధర్మవిజయమును నెల్లయెడలను జేగీయమాన మొనర్చెను.

వెండియు నతఁడు 'శిలాదిత్యుడు' అను నామాంతరము గల 'విక్రమాదిత్య' సుతుని 'ప్రతాపశీలుని' శత్రురాజు లతనిరాజ్యమునుండి తఱిమి వేయ వారి నందఱ నోడించి వంశక్రమాగత మైన యతని రాజ్యమున కతనినే యధిపతిని గావించెను. పూర్వ మొక్కప్పుడు తమవారి సింహాసనము శాత్రవులచే నపహృతమై విక్రమాదిత్యుని వసతియందుఁ జేరియుండ నద్దానిని మరలఁ దన నగరమునకుఁ జేర్పించెను.

## తృతీయ తరంగము

మఱియు 'ముమ్మడి' యనెడి భూపతి ప్రవరసేను నెదుర్కొని యేడుమార్లోడిపోయి యేవో కొన్ని కారణములం దెల్పుచుఁ దాను జయింపఁ బడిన ట్లొప్పుదల మూపక పోయెను. ప్రవరసేనుఁ డోర్పుతో వానిని మన్నించెను. కాని యెనిమిదవమాఱును నతఁ డట్లే తనయోటమి నొప్పక కారణాంతరము నెమకుచు వదరుచుండఁ బ్రవరసేనుఁడు క్రోధ మూర్ఛితుండై "ఛీ! నింద్య నుః నీ క్షుద్రపశువును బంధింపుఁడు" అని తనయోధుల కానతి యిడెను. అందులకు ముమ్మడి "వీరవరేణ్యా! నేను పశువును. కావున వధ్యుఁడను గాను కరుణించి యభయ మొసంగుము." అని యడఁకువతో నెమలివలె నతని సభాంతరమున నాట మొనరించెను.

పవరసేన మహీజాని ముమ్మడి యొనర్చిన మయూర నృత్యమును నెమలికేకలను కని విని యతని నొక నట్టువుగా గణించుచు నతనికి నభయ దాన పూర్వకముగ నటజనోచిత మైన పారితోషిక మొసంగి పంపెను.

ప్రవరసేనుఁ డీరీతి సకల దిగ్విజయ సముపేతుఁడై యొకప్పుడు తన పితామహునిచే నిర్మింపఁ జేయఁబడిన నగరమునందు వసించుచుఁ దానును దనపేర నొక గొప్ప పుటభేదనమును గట్టింప మిక్కిలి కుతూహలపడి యందుకై దివ్యలగ్నమును దగినక్షేత్రమును గనిపెట్టుటకు నొకనాటి నడిరేయి వీరసంచారము సేయ బయలుదేరెను.

వీరవరేణ్యుఁడైన ప్రవరసేనుఁ డీరీతి నర్ధరాత్రమున నేకాకియై పోవుచుండ నతని వక్షో భాగమున నలంకృతమై జాజ్వల్యమాన మగుచున్న రత్నహారమునందుఁ బ్రతిఫలించిన తారకానికరము అతఁడు రక్షార్థమై యుంచుకొను నట్టి సర్షపముల విభ్రమమును దలఁపించుచుండెను,

అట్లతఁడు చాల దూరము పోయి పోయి తుద కొక శ్మశానముచెంతఁ జేరెను. అచ్చోట చితాగ్ని లెస్సగ మండుచుండుటచే నావెలుఁగున శ్మశాన సమీపమున నున్న యేటియొడ్డునందు భయంకర మగు చెట్లచా లొకటి విశదముగఁ గానవచ్చుచుండెను. ప్రవరసేనుఁ డాతావునకుం జనఁగా నక్కడ నాయేటి యావలిగట్టునం దొక పెనుభూతము ప్రతాపశాలి యైన యాభూకాంతున కభిముఖముగ బొబ్బరించుచు నిడుదలైన తనబాహువులను పైకిఁ జాచి యాతనిపై నుఱుక నుద్యోగించు చున్నట్లు కననయ్యెను. జ్వలించుచున్న యమ్మహాభూతము యొక్క దృక్పాతము లతనిమేనిపై సోఁకుటంజేసి పింగళవర్ణము నొందిన యమ్మహీభృన్మణి యుల్కాదీప్తులచేఁ దేజరిల్లు కులపర్వతమును బోలి యుండెను.

అనంతర మాపెనుభూతము ప్రవరసేనుని జడిపించుటకై భూనభోంతరాళము మాఱుమ్రోఁగునట్లు భయానక మగు బొబ్బరింత పెట్టెను. ఆ బెట్టిదమైన యులివున కించుకేని భీతి నొందక ధైర్యముతో నున్న యానేలఱేనిఁ గాంచి యారక్కసుఁ డట్టహాస మొనర్చి యుచ్చైస్స్వరమున నిట్లు నుడివెను, "మానవనాథా! భూరిసత్త్వాఢ్యులయిన విక్రమాదిత్య, శూద్రకుల నిర్వురను విడిచిపెట్టి ధైర్యలక్ష్మి నిన్ను మనసార వరించినది. నీధైర్యము మఱి యెవ్వరియందును గానను, నీకోర్కె యీడేరనున్నది. ఈసేతువుపైఁగా నాదరికి రమ్మ" అని యనుచు నారక్కసుఁ డమ్మహానది ప్రవాహముపై నతిదీర్ఘమగు తనజానువు నావలి గట్టు సేరున ట్లడ్డముగఁ జాచి వింత యగు సేతువు నొకటి కల్పించెను. ప్రవరసేనుఁ డద్దానిని రాక్షస శరీర పరికల్పిత మైన సేతువునుగాఁ దెలిసికొని వీరవరేణ్యుఁడు

గావున జంకు లేక వరనుండి బాకును దీసి యాభూతముయొక్క. యంగమునందు సోపాన పంక్తి యేర్పడునట్లు కరవాలముచే గాట్లు వెట్టి తన్మూలమున నాస్రవంతిని దాఁటెను. అతఁడట్లు నదిని దాఁటిన చోటు 'ఛురికాబిలము' అని నేఁడును బేర్కొనఁబడుచున్నది.

అంతట నా భూతము తనకుఁ బార్శ్వవర్తియై యున్న యాక్ష్మాపాలునితో "రాజా! నీవు ఱేపు ఱేపకడ నేను పాతనముచే నిర్దేశించు ప్రదేశమున నగరనిర్మితికిఁ బునాది వేయుము. ఆ సమయమే నీజతనమునకు దివ్యశుభలగ్నము." అని లగ్నాది నిర్ణయమును దేటపఱచి మఱుఁగు వడి పోయెను.

మఱునాఁడు ప్రవరసేనుఁ డుదయముననే లేచి 'శారికాదేవికిని,' 'అట్టుడు' అనుయక్షునకు నధిష్ఠానమై యున్న 'శారీటకము' అను గ్రామమునందు బేతాళుఁడు పడవేసిన సూత్రమును గన్గొని మహానందము నొంది తొట్టతొలుత నచ్చోట నత్యంత భక్తితోడఁ బ్రవరేశ్వరునిఁ బ్రతిష్ఠింపఁ బ్రయత్నము సల్పుచుండ 'జయస్వామి' తనకుఁ దానే ప్రతిష్ఠా పీఠమునందలి యంత్రమును భేదించుకొని యందుపవిష్టుం డయ్యెను. అ రీతి నక్కడ నుద్భవించినట్టి యా విగ్రహమును బేతాళునిచే నావేదిత మయిన శుభలగ్నమును జక్కఁగ గుర్తింపఁగల్గు 'జయుఁడు' అను శిల్పియొక్క నామమునఁ బ్రవరసేనమహీపాఁడు ప్రఖ్యాత మొనర్చెను. అచ్చటఁ బ్రఖ్యాతిఁ గన్న 'వినాయక భీమస్వామి' ఱేని భక్తికి మెచ్చి తా నిదివఱకుఁ బశ్చిమాభిముఖుఁడై యుండినను నగరమునకు శుభపరంపరఁ గూర్ప స్వయముగనే తూరుపు మోము వెట్టినవాఁ డయ్యెను.

మఱియు 'పంచజినేంద్రుఁడు' అను నతఁడు శ్రీ శబ్దలాంఛిత మైన 'సద్భావశ్రీ' మున్నగు దేవీచక్ర పంచకమును బ్రతిష్ఠించి వితస్తానదియందు నబ్బుర మైన యొక గొప్ప నౌకాసేతువు నిర్మింపఁజేసెను. అది మొదలుకొనియే యట్టి సేతుకల్పనము లోకమున ఖ్యాత మయి యున్నది. ప్రవరసేనుని మాతులుఁడు 'జయేంద్రుఁడును' నచ్చోట 'శ్రీ జయేంద్రవిహారమును' నిర్మింపఁజేసి యందొక గొప్ప బుద్ధవిగ్రహమును బ్రతిష్ఠించి కృతకృత్యుఁ డయ్యెను. ప్రవరసేనుని మంత్రి 'మోరాకుఁడు' అనువాఁడు సింహళము మున్నగు దీవులకు నధినేతయై ప్రవరసేన మహారాజు నగర నిర్మాణమునకై కనిపెట్టిన యాప్రదేశమునందే యాత్మనామాంకితముగ నద్భుత మగు నొక మహాభవనమును గట్టించెను.

మొదట వితస్తానది దక్షిణతీరమునందె నగరము నిర్మితమై క్రమముగ నానావస్తు గణాకీర్ణము లయినయాపణంబులతోడ నిండి శ్రీసతికి విహారస్థానములనఁ దగు ముప్పది యాఱు లక్షల మహాభవనముల నెనసి యమరావతి నడకించుచున్నట్లు భాసిల్లెను. వసంతాగమసమయమునను గ్రీష్మాంతమునను నంబర చుంబియయిన యానగరసౌధశ్రేణి నారోహించినవారికిఁ బుడమి యంతయుఁ బువ్వులు పూచినట్లును, సృష్టిచే స్నిగ్ధ మైనట్లును గాన్పించుచుఁ గనువిం దొనరించుచుండును.

మఱియు నా నగరపు వీధులందును విశాలము లయిన క్రీడావిలాసహర్మ్యముల పురోభాగములందును మనోజ్ఞములైన సింధుసంగమములతోడ నొప్పారు పావనములగు పెక్కుకుల్యలు విరాజిల్లుచుండును. అట్టి దృశ్యము భూతలమున మఱి యొకటి యెందుఁగానవచ్చును.? మధ్యేనగరమున వింతగఁ గాన్పించు నచ్చటి యత్యున్నతమైన క్రీడా పర్వతము నెక్కిచూచినచో సర్వతోదృష్ట మగుచుండు నాపురలక్ష్మి స్వర్గపదమునుండి కన్గొనఁబడినట్లు చెప్పఁదరము గాని యానందమును గొల్పునది యగుచుండును. ఇట్టి వైచిత్ర్యము వేఱొకచోటఁ గానలేము.

వెండియుఁ మండు వేసంగియందు నానగరవాస్తవ్యులు తమ ఘనప్రాంగణములయెదురఁ గలకండపెళ్ళలవంటి పెద్దపెద్ద మంచుగడ్డలతోడ జాల్వారుచుండు వితస్తానదియందలి చల్లనిపానీయము నుగ్రోలి యనుభవించెడు నపార సుఖమును మఱి యెందేని యెవ్వరేని యనుభవింపనేరరన్నచో నత్యుక్తి గానేరదు.

గీ॥ అవ్వితస్తామృతాంబువు హాయి గొల్పు
మంచుకలకండపెళ్ళ లమ్మకము లేక
సౌధములచెంత మండు వేసవి పగళ్ళ
దొరకుఁ గాశ్మీరముననె గేస్తులకునెల్ల.

ఆ నగరమునఁ గట్టించిన దేవాలయములకై రాజ సమర్పిత మైన కోశరాశి యింత యని చెప్పవలను పడదు. కాని యాకోశరాశిచే సముద్రవసన యగు వసుంధర నంతను వేయిమార్లైనను గొనవచ్చును.

ఈరీతి సాటిలేని విన్నాణమునఁ దనరారు నమ్మహానగరమున వసించుచుఁ బ్రవరసేనుఁడు కాశ్మీర సామ్రాజ్య రమ ననన్యాదృశములగు పెక్కుతెఱంగుల లాలించుచు నఱువదేండ్లు గడపెను. అప్పటి ప్రవరసేనమహారాజు జరాపరిష్వంగము నెనపి యుండుటచేఁ బలితములైన ముంగురులు త్రిశూల ముద్రాంకిత మైన యతని లలాటముపై వ్యాపించి యుండుటను జూడ ముక్కంటి యను భ్రాంతిచేఁ దదుత్తమాంగమును నధిరోహించిన గంగానదియొక్క సలిలవిలాస మయ్యది గానోపు నని తలంపఁదగి యుండెను.

ఇట్టి తరుణమున ముక్కంటియానతిచొప్పున 'నశ్వపాదుఁడు' తనకడ కాక్షణముననే యరుదెంచియున్న కాశ్మీరదేశీయుఁడగు బ్రాహ్మణుని 'జయంతుఁడు' అనువానినిఁ గాంచి యోయీ! పాంథుఁడా! డస్సియున్నాడవు. నీవు దేశాంతరమునకుఁ బోయి సాధింపలేని నీకోర్కె కాశ్మీరమునందు సులువుగ నీడేర్చుకొనఁగలవు. కావున నాదెల్పెడుపని వినుము. "నీవు వెంటనే యీలేఖను దీసికొని పోయి కాశ్మీరపతి యగు ప్రవరసేనున కొసఁగవలయును," అని పల్కి యాబాడబునకు నొక లేఖ నిచ్చెను. జయంతుఁ డాలోచించి "మార్గాయాసమున ఖిన్నుండనై యున్న నేను వెంటనే యంత దూరము వోఁజాలను" అని మాఱు వల్కెను. అశ్వపాదుఁడు "సరే కానిమ్ము, నీవు ద్విజుఁడవు కపాలి నగు నాచే స్పృశింపఁబడితివిగదా! ఆకొలనిలో స్నానము సేయుము" అని యనుచు నప్పాఱునిఁ జెంత నున్న కొలనిలోనికిఁ ద్రోసెను. అంత జయంతుఁడు, అక్కడ కన్నులు దెఱచి చూడఁ దాను గాశ్మీరమున నుండుటయు ప్రవరసేనుని శివార్చనమునకై భృత్యులు నదీజలమును గొనిపోవుటయందు వ్యగ్రులై యుండుటయుఁ గన్గొని విస్మయాంబుధి మునుంగుచుఁ దనను నరపతి కెఱుక పఱుపఁదలంచి యెట్టి సంకోచము నొందక నదినుండి జలకలశములతోడఁ బోవుచున్న తేనిభృత్యులలో నొకనిం గనిపెట్టి యతని జలభాండమునందుఁ దనచేత నున్న యాలేఖను సూటిగ విసరివైచెను. ప్రవరసేననరేంద్రుఁడు ప్రవరేశ్వరునకు నభిషేకము సేయునప్పుడు, ఆజలకలశమునుండి లేఖ పడుటం గాంచి యతఁ డాలేఖఁ జదివించి జయంతునిఁ దనకడకు రావించెను.

"కర్తవ్య మనుష్ఠింపఁబడినది, ఈవి మొదలగు సద్ధర్మములు విరివిగ నాచరింప బడినవి.

భోగములు లెస్సగ ననుభవింపఁబడినవి. ఇఁక నీవు చేయందగ్గ దేమున్నది? కావున రాజ్యమును విడిచి రమ్ము. పరమేశ్వరసాన్నిధ్యముఁ జేరుము'' అని జయంతుఁడు దెచ్చిన లేఖలో నున్న విషయమును బాగుగ నాలోచించి తొల్లి భవానీపతి యనుగ్రహించి యున్న యశ్వపాదుని ప్రబోధ మిది యని గుర్తించినవాఁడై జయంతుని నతనియభీష్టమునకంటె నెక్కువగ సత్కరించి పంపెను.

అంత నాధరాకాంతుఁ డాలయములోనికిఁ బోయి యశ్మమయమగు నాశివప్రాసాదమును భేదించుకొని మింటి కెగసెను. ఆవినిర్మలాకాశమున ద్వితీయసూర్యోదయము నా నొప్పారుచు కైలాసతిలక యగు నుత్తరదిశంగూర్చి వాయువేగమునఁ జనుచున్న యమ్మానవనాథు భవ్యమూర్తినిఁ బ్రజ లెల్లఁ దమదెందములందు భయ శోక విస్మయానందములు ముప్పిరి గొనుచుండ ఱెప్ప వాల్పక చూడ సాగిరి.

రాజన్య వరేణ్యుఁ డయిన ప్రవరసేనుఁడు భువనైశ్వర్యమును సమగ్రముగ ననుభవించి యీరీతిఁ దుదకుఁ దనపార్థివశరీరముతోడనే గిరిజాపతి సమితిఁ జేరెను. ఆమ్మికాంతుని సిద్ధిక్షేత్ర మయిన ప్రవరేశ్వరుని యశ్మమయ ప్రాసాదము నతఁడు భేదించుకొని పోవుటచే నందేర్పడిన ద్వారము స్వర్గద్వారమునకుఁ బ్రతిభట మగుచు నిప్పుడును గన్గొనఁబడుచునే యున్నది. ఈయద్భుతతోదంతమునకు హేతు వయిన జయంతుఁడును నవ్వసుమతీశునిచే నొసంగఁ బడిన యపరిమిత మైన సంపదను విత సేయక స్వనామాంకితములయిన యగ్రహారము మొదలగు ధర్మవిధులకు వినియోగించుచుఁ జరితార్థుఁ డయ్యెను.

## యుధిష్ఠిరుఁడు

ప్రవరసేనునకు రత్నప్రభాదేవియందుఁ గలిగిన కొమరుఁ డొక్కఁడు గలఁడు. అతనిపేరు ''యుధిష్ఠిరుఁడు' అతఁడు తనకుఁ గ్రమప్రాప్త మయిన రాజపీఠము నధిష్ఠించి తొమ్మిది నెలలు తక్కువగ నలువదేండ్లు పుడమి నేలెను. ఇతనికి మంత్రులు పెక్కు రుండిరి. అందు సర్వరత్నుఁడు, జయుఁడు, స్కందగుప్తుఁడు ననువారు విహార చైత్యాదులను నెలకొల్పి విస్తృత యశము నార్జించిరి. జయేంద్రుని సుతుఁడు వజ్రేంద్రుఁడును నీయుధిష్ఠిరుని మంత్రులలో నొకఁడు. అతఁడును చైత్యాదిసిద్ధుల నెనసిన 'భవత్సేద' మను నొకగ్రామమును స్తుతిపాత్రముగ నిర్మింపఁ జేసెను. మఱియు నితనికి ముఖ్యులైన మంత్రులు 'కుమారసేనుఁడు' మున్నగువా రనేకములయిన సత్కార్యము లాచరించి దిశాయోషల ముఖ పంకేరుహములందుఁ గీర్తిచందనముం జిల్కి నవీన చిత్రకలారాధకు లని పొగడ్త నొందిరి.

## నరేంద్రాదిత్యుఁడు

యుధిష్ఠిరునకుఁ బద్మావతివలనఁ గలిగిన సుతుఁడు 'నరేంద్రాదిత్యుఁడు' అనువాఁ డొక్కఁడె యుండెను; ఇతనికి 'లంఖనుఁడు అను నామాంతరము గలదు. ఈనరేంద్రాదిత్యుని రాజ్ఞి 'విమలప్రభ' యను నామె, ఇతని మంత్రులు వజ్రేంద్రుని పుత్రులు. 'వజ్ర, కనకులు' అనునారు వీరు చారు చర్యాపరు లనివిఖ్యాతి నొందిరి. ఈనరేంద్రాదిత్యుఁడు తనయాస్థానియందు నడచి యున్న లిఖితప్రణాళిక నంతయు శాశ్వతముగ రక్షింపఁబడుటకై ప్రత్యేకముగ నొక యధికారస్థానము నేర్పఱచెను. ఇతఁడు పదుమూఁడేండ్లు రాజ్యము నేలి దివంగతుఁ డయ్యెను.

## రణాదిత్యుఁడు

నరేంద్రాదిత్యుని యనంతరము తదీయ సోదరుఁడు రణాదిత్యుఁడు ధరాపాలకుఁ డయ్యెను. ప్రజ లితనిని తుంజీనుఁడనియుఁ బేర్కొనుచుండిరి. రణాదిత్యుని యుత్తమాంగము జగద్విలక్షణ మైన శంఖముద్రచే నంకితమై యుండుటంజేసి యపూర్వముగఁ జంద్ర బింబాంతర్గత మైయున్న భాస్కరుని కాంతి విశేషమును వహించుచున్నదో యన్న ట్లొప్పారుచుండెను. రణాదిత్యుని శాతాసిధార యనెడు ధారాధరము శాత్రవకంఠసీమ లనెడు నడవులపై వ్రాలంగనే వారి పడతుల నయనకుండములు జల భరితంబు లగుచుండెడివి. మఱియు నతని కృపాణము ప్రాణులకై యాసపడినపుడు రిపుబలమునఁ గబంధములు మాత్రము దానిమ్రోల నృత్యము సేయుచుండును. ఇంక రణాదిత్యుని ప్రతాపాగ్ని ప్రభావము వర్ణనాతీతము. అయ్యది యగ్ని యయ్యు శత్రు నారీ నయనములందు జలతరంగములను వారి భవనములయందుఁ దృణాంకురములను బెనుచుచుండుట వింత యగు విషయము గదా! విష్ణుమూర్తి మాయాశక్తి పుడమిపై నవతరించి 'రణారంభ' యను నభిధానముతోడ దివ్యాకృతి యగు రణాదిత్యునకుఁ బ్రేయసి యయ్యెను; ఆదేవియొక్క మాహాత్మ్యము నిరుపమానము.

ఈ కాశ్మీరపతినిగుఱించి యొక గాథ గలదు. ఈ రణాదిత్యుఁడు తొలిజన్మమునం దొక ద్యూతకారుఁడుగ నుండెను. అతఁ డొకప్పుడు కితవులకుఁ దనసర్వస్వము నోడి యోర్వరాని నిర్వేదమున కగ్గమై తుదకుఁ దనతనువును ద్యజింపఁ బూనెను. అట్లయ్యు నతఁడు "జీవన్భద్రాణిపశ్యతి" అను సూక్తి ననుసరించి "మరల నేదేని యదృష్టవిశేషము గనవచ్చునేమో" యని కొండొక తడవు ఆలోచింప సాగెను. జూదరులు వేఁగాలము డగ్గఱుచున్నను స్వార్థసాధనము నన్వేషించుటయందు నుపేక్ష వహింపకుండుట సాజముగదా!

అంత నతఁడు జీవితముపై నాశ వదలుకొనినవాఁడు గావున కట్టకడపట వింధ్యాటవియం దవంధ్య దర్శనయై యున్న 'భ్రమరవాసిని' యను మహాదేవి నెట్టులేని దర్శించి వరముఁ బడయ వలయు నని నిశ్చయించుకొనెను. భ్రమరవాసిని యున్న తావుం జేర యత్నించుట యసిధారావ్రత చర్య వంటిది. ఆదేవియుండు స్థాన మైదు యోజనముల మేరయం దుండఁగనే శూలములవంటి పుచ్ఛములు గల పెద్దకణుదురీఁగలు గొప్ప తెంట్లగములు బయలుదేరి దేవి దర్శనమునకై యేగుదెంచు వాని దేహము తూట్లు పడునట్లు విదారించును. ఇట్లుండ నాదేవి దర్శనము గోరుట మృగతృష్ణయందుఁ బిపాస నడఁచ యించుకొనఁ నుద్యోగించుటగదా! అయినను నాజూదరి మతిమంతుఁడు కావున నాదేవిని సేవింపఁ బోవుచుఁ దనలో "ఎప్పుడో యొకప్పు డీశరీరము పరిత్యాజ్యమేగదా! ఇఁక నీభ్రమరములఁ గడచి పోవు టెట్లు?" అని చింతించుచు "నూరకుండుట పాడి గాదు." అని తలపోసి మొదట నొక యాయసకవచమును ధరించి దానిపై మహిషచర్మమును గప్పికొని యాచర్మముపై నావుపేడతో మెదిపిన మంటిని దట్టముగఁ బూసి పయనము సాగించెను.

ఆజూదరి యిట్లు మహాసాహసోపేత మగు నిశ్చయముతోఁ బోవుచున్నపుడు ఎండవేఁడిమిచే వాని మేనిపైని దళమైన మట్టిపూఁత బాగుగ నెండి పోయెను. అందువలన నతఁడు సంచారి యగు పెద్ద లోష్టమువలెఁ గన్పట్టెను. అతఁడు జీవితాశను వదలుకొనినట్లే సరళ మైన సరణినిఁ గూడ మాని

చిమ్మచీకట్లు గ్రమ్మి యున్న భయంకర మైన యొక గుహను బ్రవేశింపఁ దోడనే యచ్చోట మృత్యు భీకర రావము ననుసరించుచున్న పక్షధ్వనులతోడఁ జెవులు చిల్లులు వోఁజేయుచు భయానకమైన భ్రమర మండలి రేగి గుహనంతయు నావరించెను.

ఆభ్రమరపటలి యాతనిమేనిపై నెండి యున్న మట్టిపూఁతను ఱెక్కలచేఁ గొట్టుటవలన దుమ్ము రేగి వానికన్నులందు నిండుటచే నాతేఁటిగములు గన్నులు దెఱవఁ జాలక తెగువదారి యగు నా జూదరిని మరల మరలఁ గొటుటకుఁ దెగింప లేక పోయెను. అయినను వరుసలు వరుసలుగఁ గ్రొత్త క్రొత్త తుమ్మెద తుటుములు గుహలోనుండి బయలుదేరి వానిపైఁ బడుచు మట్టిపూఁతను వీడఁగొట్టు చుండెను.

ఇట్లాతఁడు గుహలో మూఁడామడల దవ్వు పోవునప్పటికి నతని మట్టిమైమఱువు నాబెట్టిదపుఁ దుమ్మెదగుంపు లువ్వెత్తుగాఁ బడఁగొట్టెను. ఇఁక నతనిమేన మహిషచర్మపుఁ గవ్పొకటి యున్నదిగదా! మత్తిల్లిన యాకోదమతేంట్లు దానిని భేదించుటకై యతిరభసముగ నతనిపైఁ బడుటకు మొదలు పెట్టెను అప్పుడు చట చట, మను బెడిదంపు టులివు లేర్పడ సాగెను, వానినెల్ల సరకు సేయక యాధీర శిఖా మణి నాల్గవ యోజనమునందు సగము గడచు నప్పటికి శంకుపుచ్ఛము లగు నాతేంట్లు వానిపైని మహి షచర్మమును పొడిపొడి గావించి క్రమముగ నినుపకవచమును భేదింప దొరకొనుటచే రణత్కార మొకటి యతని వీనులం బడుచుండెను. దాన నతఁ డాగండు తుమ్మెదలు తనయాయసకవచమును గూడఁ బగులఁగొట్టుటకు మొదలిడినవని యెఱింగి యతివేగమునఁ బరుగిడసాగెను. ఏమైననేమి? ఆభ యంకర చంచరీక చయ మనివార్య మగుటచేఁ గడకు నతని యినుపకవచమును సయితము తుత్తని యలుగఁ జేసి వైచెను. కాని వానిధైర్య కవచమును మాత్రము ఛేదించుట వానికిఁ దరము గాలేదు. ఆపదలందు ధైర్యమును వీడ కుండుట యుత్తమ లక్షణముగదా!

అట్లు ధైర్యమాత్రకవచుఁ డగు నతఁడు తెగువతో మఱికొంత దవ్వు పోఁగా నిఁక నతనికి గంతవ్యమైన దేవీధామము రెండు క్రోశములు మాత్ర ముండెను. అప్పటికిని వజ్రసార మైన యతని ధైర్య కవచము నాఘోర బంభర శ్రేణి విదారింవ లేకపోవుట మిగులఁ బ్రశంసార్హమగు సంగతి. కాని, యా మృత్యుభటు లగు తేంట్లు వాని యొడలి మాంసమును కండరములను సైతము పైకి లాగి వేయు చుండెను. అయిననేమి? ఆధీర వరేణ్యుఁడు దేవీదర్శనమునం దభంగుర మైన యభిలాషము గల వాఁడు కావున ద్విగుణీకృత సాహసముతో నతివేగముగఁ బేరెము వాఱుచు తేంట్ల తుటుములను మాటి మాటికిఁ జేతులతోఁ బాఱఁద్రోలుచు ననుక్షణము గన్నులను బాణిపుటముచేఁ గప్పి కాపాడుకొనుచు నెట్టకేలకు 'భ్రమరవాసినీదేవి' యాలయమును సమీపింపఁగల్గెను. అప్పటి కాధీరవతంసముని మేన ప్రేవులు నెమ్ములు మాత్రమే మిగిలియుండెను. భృంగసంపాతముగూడ నుపశమించెను. భవితవ్యత బలవత్తర మైనది, కావున నతఁ డసువులకు మాత్ర మెడగాలేదు. "న సాహస మనారుహ్య నరో భద్రాణి పశ్యతి." అను నార్య వచన మిట బాగుగ లక్షిత మైనది.

అనంతర మాకార్యవిదుఁడు దివ్యప్రకాశ మొకటి పొడకట్టుటచేఁ గందోయి మెల్లఁగ దెఱచి నల్గడల సారింప భ్రమరవాసిని భవ్యమూర్తి చక్షుర్గోచర మయ్యెను. తోడనే యతడుఁ వచ్చుచుం

బోవుచున్న కొనయూపిరితో నతికష్టముగ నమ్మహాదేవిని డాసి సంజ్ఞాహీనుఁడై యాయమ్మ యడుగుఁ దమ్ములపై నట్లే వాలెను.

ఆదేవియు నతని తెగువను గార్యాభినివేశమును లోనఁ బ్రశంసించి యతనిపైఁ గనికరము జూపుచు నతని నభిరామాకృతినిఁ జేయుటకై తనపాణిచే స్పృశించెను. పీయూషవర్షియైన యమ్మహాదేవి దివ్యపాణి స్పర్శచే నాధీర వరేణ్యుఁడు వెంటనే తొల్లింటికంటె నధికతరమైన స్వాస్థ్యముం బడసి మరల నొకమాఱు నల్గడలఁ బాఱఁజూచెను. మొట్టమొదట దేవీసన్నిధానమును బ్రవేశించిన వెంటనే సింహాసనాసీనయు ఘోరాకారయు నగు భ్రమరవాసినిం గాంచి యుండిన యతని కీమారు కాన వచ్చిన యాదేవి దివ్యాకృతి చాల విపర్యయము నొంది కానవచ్చుటచే నతఁడు విస్మయ పరవశుఁడయ్యెను.

ఇప్పుడాదేవి యుద్యానలతావాస మైన యొక సరసీతీరమునందుఁ దామరరేకులం బోని నిడుద కందోయియు దొండపండువంటి కెమ్మోవియుఁ దుమ్మెదఱెక్కల సొబగును దులకాడు నెఱికురులును, 'అస్తి నాస్తి' విచికిత్సం గల్పించుచున్న నెన్నడుమును శరద్రాకా సుధాకర బింబమును బుజ్జగించు నెమ్మోమును గలిగి దివ్య మంగళాకృతితోడ సర్వదేవతాస్వరూపిణి నా నొప్పారెను.

మఱియు నవ కుసుమ ప్రలోభనీయ మైన యౌవనము పీన స్తన ద్వయి యనెడు నంజలిం ఘటించి ముక్తాహార రూప మగు పూజాద్రవ్యము నర్పించి మహార్హము లయిన కాంతిసుమములచే నమ్మహాదేవి యంగవల్లి నర్చించుచున్న ట్లుండెను. లాక్షారస రంజితములైన భ్రమరవాసిని యొక్క పాదములు, ఆదేవి మోముఁ జందురుఁడు దమకుఁ గానరాకుండ వలుద యగు పాలిండ్ల యుత్సేధము అడ్డము వచ్చుటచేఁ దద్దర్శనాభిలాషమువలనఁ గృచ్ఛ చారిత్వముఁ జూపుచు ననుదినము తప మాచరించు చున్నట్లు గన్పట్టు చుండెను

ఈ చందమున నిర్జన ప్రదేశమునఁ గాన్పించిన యాభ్రమరవాసిని యొక్క మోహనాకృతిని ఱెప్పవాల్పక చూచుచు వరార్థియై వచ్చిన యాసాహసికుఁడు అపు డాదేవి లావణ్యమునకు భ్రమసి యాత్మీయ యౌవనమున నూర్జితుండై యవారితచర్యుఁ డగుచున్న కామదేవునకు విధేయుఁడయ్యెను. సమీపించుటకేని వీలుగాని యాదేవి యొక్క ప్రగల్భాకృతి తద్రూప లావణ్య మాధురీ పూరమున లీనమై యుండుటంజేసి యాకితవునకు భ్రమరవాసిని యొకానొక యచ్చరమచ్చెకంటిగా గోచరించెను. కాని, దేవి యని మదికిఁ దట్టలేదు.

అంత నాదేవి వానిం జూచి "ఓయీ! సౌమ్యా! నీవు మార్గమునఁ బెద్దతడవు మిగుల నలసట వడితివి. డెందమును బాగుగఁ గుదురు పఱచుకొని యుచిత మైన వరమును వేడికొనుము," అని కృపతో మృదు మధురముగ వచించెను. అందుల కతఁడు "నీ దర్శనము వలననే నాశ్రమ శమించి నది. కాని నీవు దేవివిగా నాకుఁ గన్పడకున్నావు. కావున నీవు వర మెట్లీఁగలవు?" అని యనెను.

అమ్మాటలకు "నేను దేవి నైన నేమి? కాకున్న నేమి? నీయభీప్సితము నీడేర్పంజాలుదును. వరము వేడుము" అని ప్రతిజ్ఞా పూర్వకముగఁ బల్కెను. ఆసాహసికుఁ డాయమ్మ చేసిన ప్రతిన నాధారముగఁ జేసికొని దూరోత్క్రాంత మర్యాదుఁడై తుదకుఁ దనకుఁ గల సంగమాభిలాషను వెల్లడించెను.

అందు కాదేవి "ఓరీ దుర్బుద్ధీ! ఇట్టి యనుచిత మైన కోర్కె నడుగ నెట్లు సాహసించితివి? వేఱొండు వరము వేడుము. నేను భ్రమరవాసిని ననియే యెఱుంగుము." అని నుడివెను. అంతట నతఁ డామెను దేవినిఁగా మరల గుర్తింపఁగల్గియుఁ గోరిన కోర్కె నుపసంహరించుకొనలేక యాభ్రమరవాసినితో "నీవు దేవివే కావచ్చును. లేక కాంతవే కావచ్చును. నీయాకృతి భయానక మైన నగుఁ గాక. లేదా మనోజ్ఞమైన నగుఁగాత. ఇంతకు మునుపు నాకెట్లగపడితివో యిప్పుడును నట్లే నాకన్నులకుఁ గానవచ్చుచుంటివి. నీవు నీవాణిని సూనృతము గావింపఁ దలంచినచోఁ నావాంఛితమును మన్నింపుము. నామనము వేఱొండు వరింపకున్నది." అని జంకు లేక తనమనోనిశ్చయమును వెల్లడించెను. జన్మాంతర నిబంధన మగు సంస్కారము నెవ రడ్డగింపఁగలరు? ప్రాణులయం దేవాసన మొట్టమొదట గాఢముగ నేర్పడియుండునో! అయ్యది తిలసంస్కారమువలె వారినిఁ గడపటివఱకు విడువకుండును గదా!

గీ॥ ప్రాణులం దెట్టి వాసనా బలము తొలుత
దృఢపడి నిలిచనమై యుండుఁ దిలలయందు
దిట్టముగఁ దోఁచు వాసెన కట్టువోలె:
నది సడలి పోదు పర్యంత మందు గాని.

ఆరీతి నాకితవుఁడు తన్నుఁ గోర భ్రమరవాసిని యతని డెందమునందలి దృఢనిశ్చయము నెఱింగి తద్భావానుగుణముగ నతని నుద్దేశించి "ఓరీ! క్రూరసంకల్పుఁడా! మర్త్యు లెవ్వరును దివ్యమూర్తిని స్పృశింప నుత్సహింపరు. నీకోర్కె మఱియొక జన్మమున ఫలింపఁగలదు. కావునఁ బొమ్ము" అని నుడువుచు నదృశ్య మయ్యెను.

అంతట నాజూదరియు "ఆగామి జన్మంబున నాదేవితోడసంబంధము వడసి సకలైశ్వర్య సంపన్నుఁడను. గాఁగలను" అని తలంచుచు వెంటనే ప్రయాగకుఁ బోయి యందలి వటభూరుహము యొక్క యగ్రము నధిష్ఠించి యందుండి దిగువ కుఱికి యసువులఁ బాసెను.

ఆ జూదరియె తఱువాతి పుట్టువునందుఁ బ్రసక్తుఁడై యున్న రణాదిత్యుఁడుగ జనించెను. ఆభ్రమరవాసినియె రణాదిత్యుని పత్ని యగు 'రణారంభ' యయివది. రణారంభ మర్త్య జన్మము నొంది యున్నను నాయమకు జన్మాంతర స్మృతి గలదు.

చోలదేశపు రాజగు రతిసేనుఁడు సాగరునిఁ బూజించుచున్నప్పుడు తరంగముల నడుమ రత్నమాలికవలెఁ దేజరిల్లుచుఁ గాన్పించిన యాభ్రమరవాసిని 'రణారంభ' యనుపేరఁ బరఁగి బాల్యంబాదిగ దివ్యవాణిచే నలరారుచు, క్రమముగఁ బ్రణయ కుసుమమునకుఁ గమ్మనెత్తావిం గల్పించు యౌవనముచే నలంకృత యయ్యెను. రతిసేనుఁడు పాణిగ్రహణోచిత వయస్క యగు నామెను దివ్యార్హనుగా భావించి పెక్కండ్రు రాజులు తన్నర్థించుచున్నను నామె నెవ్వరికి నొసఁగఁ డయ్యెను. కడపట రణాదిత్యనృపాలుఁడు తనకుఁగాఁ గన్య నర్థించి రమ్మని తనయమాత్యుని రతిసేనునికడకు నంపెను. అయ్యమాత్యుఁ డట్లే రతిసేనునికడకు వచ్చి తనయొడయని యాశయమును దెల్పి యర్థించెను. కాని రతిసేనుఁడు బదులు వల్కక యూరకుండెను. రణారంభ రతిసేనుని భావమును గనిపెట్టి "రణాదిత్యుని కొఱకై నేను పుడమి నవతరించితిని. కావున నతనివరించుట శ్రేష్ఠము" అని స్వయముగఁ దండ్రికిఁ దెలిపెను.

రతిసేనుఁ డందుల కంగీకరించి తోడనే యామెను దనసఖుఁడైన 'కులూతభూపతి' యొక్క కుటుంబమును జేర్చెను. రణాదిత్యుఁడు నాతిదూరముగాని 'కులూత' దేశమునకుం బోయి యతికుతూహలము తోడ నానాతిఁ బరిణయము సేసికొని తన శుద్ధాంత కాంతలకెల్ల నామెను నధిదేవతనుగా నొనర్చెను. రణారంభ మహారాజ్ఞి యయ్యు మర్త్యసంస్పర్శము వలని భీతిచే రణాదిత్యునిఁ దనమాయా ప్రాభవమున మోహపెట్టుచు నొకప్పుడును నతనిఁ దాఁకకుండ మెలఁగుచుండెను. ఆదేవి తనరూపమునకు సాటి యయిన యొక యందగత్తె యగు వెలఁదుకను దనమాయచేఁ గల్పించి రాత్రులందు పెజ్జయందుఁ జేర్చి తాను భ్రమరరూపమును ధాల్చి వెలుపలఁ జరింపఁ దొడఁగెను.

రణాదిత్యుఁ డిట్లు కాలమును గడపుచు శివభక్తుఁడై తనపేరను తనదేవియొక్క పేరను బరఁగునట్లు రెండు దేవాలయములనుఁ బ్రతిష్ఠింపఁ జేయుటకు సన్నాహపడి యుండఁ బ్రతిష్ఠ జరుపుటకుఁ బూర్వదినమున దేశాంతరమునుండి వచ్చిన దైవజ్ఞుఁ డొకఁడు రాజును సమీపించి "నీవు ప్రతిష్ఠింపఁ దలఁచిన శివలింగములు మంచివి కావు. పరీక్షింపుము." అని వాదించుచుఁ బల్కెను.

తేఁ డాదైవజ్ఞుని మాటను బరీక్షింపఁగోరి శివలింగములను భేదించి చూడ వానిలోపలఁ గప్పలును జిన్నచిన్న శిలాశకలములును గానవచ్చుటంజేసి యామౌహూర్తికుని మాట విశ్వసనీయ మని యెంచుచుఁ తనజతనమున కంతరాయము వాటిల్లె నని మిగుల విచారించుచు నితికర్తవ్యతా విమూఢుఁడై యుండ దివ్యదృష్టి గల యతని దేవి రణారంభ యమ్మహీధవుఁ గాంచి "నరనాథా! వినుము. ఇంత మాత్రమునకుఁ జింతింపఁ బని లేదు. తొల్లి పార్వతీ పరిణయ సమయమున విధాత పురోధసుని పదము నలంకరించినవాఁడై పూజాభాజనమునుండి యర్చనీయుఁ డయిన తనదేవుని వెలుపలికిఁ దీసెను. శంకరుఁ డావిష్ణుప్రతిమను వీక్షించి శివలింగ విరహిత మైన యీకేవల వైష్ణవ శక్తిరూపము శూన్య ముగఁ గన్పట్టుచున్న దని యెంచి వివాహోత్సవమున కాహ్వానింపఁబడిన సురాసురవర్గము తనకుఁ గానుకలుగాఁ దెచ్చి సమర్పించి యున్నట్టి రత్ననికరమును దాను స్వయముగఁ జూర్ణీకరించి యారత్నాల పొడిని భువనవందిత మగు నొకలింగమును జేసి యావిష్ణుప్రతిమను నాశివలింగమును నర్చించెను. అప్పటినుండి నలువయు ననుదిన మావిష్ణుప్రతిమతోడ నాశివలింగము నర్చించుచుండెను.

అటుపిమ్మటఁ గొంత కాలమునకుఁ బౌలస్త్యుఁడు విధి నర్థించి యామూర్తిద్వయమును లంకకుఁ గొని పోయి యథావిధిగఁ జాలకాలము పూజించెను. రావణ వధానంతరము హిమవన్నగౌకసు లగు వానరు లామూర్తి ద్వయమును లంకాపురినుండి తెచ్చి తమ నిసర్గ చాపల్యముతోడ విహరించుచు నట్టి కుతూహలము శమించిన తఱువాత నాదేవమూర్తులను నుత్తర మానస సరస్సున వదలి వేసిరి. నే నింతకు మున్నే యాదేవమూర్తుల నమ్మానస సరోవరమునుండి సేకరించుటకు నిపుణులగు శిల్పు లను నియోగించితిని. ఇపుడు నిశ్చితమై యున్న ముహూర్తమునకు ముందే జేపకడ నామూర్తిద్వయ మును గాంతువు. ఎట్టి విచారము లేక యాశుభలగ్నమున వానినిఁ బ్రతిష్ఠింపవచ్చును." అని యాదర మేదురముగఁ బల్కి యారణారంభ తా నొంటిగ విజన మగు శుద్ధాంత మందిరమునకుఁ బోయి యచ్చోట ఖేచరు లగు సిద్ధులను స్మరించెను. స్మరణమాత్రముననే సిద్ధులు గొందఱు నిగూఢముగ నాదేవికడ కరుదెంచి యామెయానతి చొప్పున మానససరస్సునందలి యాదేవప్రతిమలను గైకొని మనోవేగమున మరలి వచ్చి యామూర్తి ద్వయమును నృపమందిరమున నుంచిరి.

అంత మఱునాఁ డుదయమున నరపతి మందిరమునందు దివ్య ప్రసూనాలంకృతు లయి యున్న యాహరనారాయణులను దర్శింప నతికౌతుకముతోడ జను లర్బుదముల కొలఁది తండోప తండములుగ నేతెంచి కన్నులార వీక్షించి విస్మయానందపరవశు లైరి.

అందుమీఁదటఁ బ్రతిష్ఠాలగ్న మాసన్నమైనతోడనే రణాదిత్యుఁడు మహేశ్వరభక్తుఁడు గావునఁ దాను మొదట రణేశ్వరుని బలిపీఠమునఁ బ్రతిష్ఠింపఁ బూనునంత లోనే రణారంభయొక్క మహిమవలన రణస్వామి తనంతటఁ దా నాబలిపీఠమును భేదించుకొని యంత్రమధ్యమున నుపవిష్టుఁ డయ్యెను. రణారంభయు నాస్వామి మహిమను బరీక్షింపఁ గోరి ధనమును మాత్రము భక్తులకు నీఁబూనఁగా రణస్వామి తానే భక్తుల కనేకము లయిన గ్రామముల నొసఁగి తనస్వయంభూత్వమును మఱింత విశదపఱచెను. ఈ విషయమున వేఱొక జనప్రవాదముగలదు.

బ్రహ్మనామకుఁ డగు సిద్ధుఁ డొకఁడు ప్రచ్ఛన్నరూపమున నచ్చట జలము దెచ్చు భృత్యుఁ డుగ నుండుట యాదేవి గనిపెట్టి యాతనికిఁ దత్ప్రతిష్ఠాకార్యమును నెఱవేర్పు మని సన్న యొనర్ప నప్పు డతఁడు తత్ప్రత్యభిజ్ఞచే రణేశ్వరుని ప్రతిష్ఠ ప్రత్యక్షముగ నొనర్చి తత్‌క్షణమే రణస్వామి ప్రతిష్ఠను గుప్తముగ నాచరించి పోయెను. ఆకారణమున జనులు ప్రత్యక్ష దృష్టము గాని 'రణస్వామి' ప్రతిష్ఠ విషయమై యాదేవుఁడే స్వయముగఁ బీఠయంత్రమున నావిర్భవించె నని భావింపఁ దొడఁగిరి. ఇట్టిప్రవాద మిప్పుడును గొందఱు నమ్ముచునే యున్నారు.

పిమ్మట రణారంభ బ్రహ్మవి ద్వరేణ్యుఁడును బ్రహ్మతుల్యుఁడును నగు 'నాబ్రహ్మనామక' సిద్ధునిఁ బుడమిపై జనులెల్ల నెల్లపుడు శ్లాఘించునట్లు వైభవోన్నత మైన బ్రహ్మమండపమును నిర్మింపఁ జేసెను. తఱువాత నాదంపతులు ప్రద్యుమ్నగిరి శిఖరముపై 'రణారంభస్వామిని' 'రణారంభా దేవుని' ప్రతిష్ఠించి యచ్చటనే పాశుపతవ్రతుల కొక మఠమును గూడఁగట్టించిరి.

మఱియు రణాదిత్యుఁడు 'సింహరోత్సికా' గ్రామమున' 'రణపురస్వామి' యభిధానమున నల్దెసలఁ జేర్వడసిన మార్తండుని నెలకొల్పి వ్యాధి బాధితు లచిరకాలముననే నిరుపద్రవముగ రోగ నిర్ముక్తు లగుటకును నతివిశాలము లయిన చక్కని యారోగ్యశాలలను నయిత మేర్పఱచెను. రణాదిత్యుని పత్ని 'యమృతప్రభ' యను నామె రణేశ్వరుని దక్షిణపార్శ్వమునందుఁ దానును నమృతేశ్వరుని ప్రతిష్ఠ సల్పెను. మఱియు నామె మేఘవాహనభూపతి సతి యగు 'ఖిన్న' యను పేరు గల రాణి తొల్లి కట్టించి యుండిన విహారమునందుఁ దా నొక చక్కని బౌద్ధ విగ్రహమును గూడ నెల కొల్పెను.

ఇట్లు రణాదిత్యుఁడు దనయెడ నత్యంతానురక్తితోడను గృపాతిరేకమునను మెలఁగు చుండుటంజేసి దేవియగు రణారంభ వానియున్నతిం గోరిన పాతాలలోక సిద్ధినిఁ గలుగఁ జేయఁగల 'హాటకేశ్వర' మహామంత్రమును నొకనాఁ డారాజున కుపదేశించెను. రణాదిత్యుఁడును నట్లే యామంత్ర సిద్ధిం బడసి నిరుపమానైశ్వర్యము ననుభవింపఁ గల్గెను. ఆనృపవరేణ్యుఁడు 'ఇష్టికాపథమునందు' ఘోర మయిన తపం బొనర్చి పిమ్మట 'నందిశిల' కేగి యచ్చట నతికుతూహలమునఁ బెక్కు వత్సరము

లేకతాన మానసమున మంత్రమును జపించి యెట్టకేలకుఁ దత్సిద్ధిని సాధించెను. అతఁడు దనకుఁ బొడ కట్టుచుండిన స్వప్నములవలనను శుభ నిమిత్తములవలనను మంత్రసిద్ధి గలిగినట్లు దృఢముగ విశ్వ యించి తఱువాతఁ 'చంద్రభాగా' తీరమును జేరి యందలిజలమును భేదించుకొని 'నముచి' యొక్క పాతాల బిలమును జొచ్చెను. ఆబిలముయొక్క ద్వార మస్లే మయ్యేఁడు దివసములు మాౘత వదల యుండుటచే రణాదిత్యుఁడు తొలుతఁ దన్మూలమునఁ బాతాళముం బ్రవేశించి పిమ్మట, దనపౌరుల నా నాగ లోకమునకుఁ గొనిపోయి వారికిని లావణ్య సీమలగు నచ్చటి పాఁపలేజవరాండ్ర కౌగిలింతల భాగ్యము నబ్బఁజేసెను.

ఈ విధముగ రణాదిత్య భూపాలుఁడు మున్నూరేండ్లు (300) పుడమిని బాలించి పిమ్మటఁ దనయనుయాయులతోఁ గూడి శ్లాఘనీయ మైన మోక్షసామ్రాజ్యమునకు సాటి యనఁదగు నాగలోకై శ్వర్యమును స్థిరముగ ననుభవింప బలిసద్మముం జేరెను.

విష్ణుశక్తిస్వరూపిణి యయిన యమ్మహాదేవి రణారంభయుఁ బుడమిపైఁ దనపవి దీరుటచేఁ దనయావాస మగు శ్వేతద్వీపమును బ్రవేశించెను. వసుమతిపై వెలసియున్న పెక్కు రాజవంశములలో రెండుమాత్రము విశిష్ట ఖ్యాతి గడించెను. ఆ యిరురాచ వంగడములందును ఇర్వురు రాజులు ప్రజా వాత్సల్యమును జూరఁగొనిరి. అందు మొదట రఘువంశమునందలి రామభూపాలునియొక్క ప్రజలును దఱువాత గోనందవంశజుఁడయిన రణాదిత్యునియొక్క ప్రజలును దమతమ పాలకులతోడ లోకాంతర సౌఖ్యమును నయిత మనుభవించుటయందు భాగస్వామ్యము నొంది రనుట కరము నుతింపఁదగ్గ విషయముగదా!

## విక్రమాదిత్యుఁడు

తఱువాత రణాదిత్యుని సూనుఁడు విక్రమాదిత్యుఁడు కాశ్మీర మహీధవుఁ డయ్యెను. ఆ విక్రమాదిత్యుఁడు విక్రమాక్రాంత దిగ్వలయుఁడై త్రివిక్రమ పరాక్రముఁ డని పేర్వడసి 42 (నలువది రెండేండ్లు) ధరిత్రి నేలెను. ఈరాజునకు 'బ్రహ్మ' 'గులూనుఁడు' అను నిరువురు మంత్రు లుండిరి. బ్రహ్మాభిదుఁ డగు మంత్రి బ్రహ్మమఠమును గులూనుఁడు అను సచివుఁడు తన వల్లభ యగు 'రత్నా వళి' పేర నొక విహారమును వెలయించిరి.

## బాలాదిత్యుఁడు

విక్రమాదిత్యుని తనయుఁడు బాలాదిత్యుఁడు తండ్రియనంతరము రాచటికపు గద్దియ నలం కరించెను. ఊర్జిత బలోపేతుఁ డయిన యీబాలాదిత్యుని ప్రతాపము వైరి నివహమును దపింపఁజేయు నదై లవణార్ణవమును బీల్చివేయుటచే దప్పి గొన్నదివోలెఁ గన్నీట నిండియున్న వైరికాంతల మోముల నాశ్రయింపఁ దొడంగెను, బాలాదిత్యుఁడు దిగ్విజయము సేసినప్పు డగాధము లయిన శాత్రువుల దెంద ములందలి యంతును గనుగొన్న కొలగట్టో యన నతఁడు పూర్వ వారిధియందు నిల్పి యున్న జయ స్తంభము లీనాఁడును గనుగొనఁబడుచునే యున్నవి.

మఱియు నితఁడు తనప్రభావముచేత 'వంకాల'ములను జయించి యచ్చోటఁ గాశ్మీరీయులకు 'కాలంబి' అను గొప్ప విశ్రాంతి భవనమును గట్టించెను. మడవరాజ్యమునందుఁ గాశ్మీరదేశపు బ్రాహ్మణులకు ధనసమృద్ధ మైన 'ఖేడరము' అను నొక యగ్రహారమును వెలయించెను. బింబాధర యగు నితని రాణి 'బింబాదేవి' ప్రజల యరిష్టములఁ బోకార్పఁగల బింబేశ్వరుని 'అరిష్టోత్సాదనము' అను ప్రదేశమునందుఁ బ్రతిష్ఠించెను. ఈరాజు ననుజన్ములు ముప్వురును నగ్రజుని కడ నమాత్యులుగా నుండిరి. వారు 'శంఖ' 'శత్రుఘ్న' 'మాలవ' అను నామములు గలవారు. క్రమముగ వారు మఠమును దేవాలయమును, సేతువును గట్టించిరి.

బాలాదిత్య మహీపాలునకు లావణ్య విభ్రమ సీమయు శృంగార రసాబ్ధి కౌముదియు నయిన 'యనంగలేఖ' యను నొక్క కుమారీరత్న ముండెను. ఆరాకొమరిత తండ్రిచెంత నున్నపు డచ్చోటు నకు నవశ్య విశ్వసనీయ వచనుం డగు దైవజ్ఞుఁ డొకఁడు వచ్చి శుభలక్షణాంచిత యయిన యాబాలేందురేఖం గాంచి నరపతి నుద్దేశించి "పార్థివోత్తమా! నీజామాత జగతీభోగ భాజనుఁ డగును, గోనందాన్వయజుల సామ్రాజ్య నేతృత్వము నీతోడ ముగియునుసుమా!" అని స్పష్టముగఁ దెల్పెను. బాలాదిత్యుఁ డప్పటి కామాటల కూరకుండి యావల సుదీర్ఘముగ నాలోచించి దుహితయొక్క సంతతికి సామ్రాజ్యము సంక్రమించుటకు నొల్లని వాఁడై యెట్టులేని తనపురుషకారమున దైవమును జయింప వలయు నన్న తలంపుతో తదనుగుణమైన దృఢ యత్నము సేయ సమకట్టెను.

ఇట్టి తలంపుతో బాలాదిత్యుఁడు "రాజన్య వంశమున జనింపని వానికి నాతనయ నొసంగిన యెడల నామె సామ్రాజ్యాపహారిణి కాఁజాలదు. కాన నట్లొనర్తునుగాక" అని తనలో నిర్ణయించుకొని రాజపుత్రుల కెవ్వరికినిఁ దనకుమారి నొసంగక తనయుద్యోగులలో నశ్వఘాసాధికారిగ నున్న కాయస్థ వంశజుని 'దుర్లభవర్ధనుఁడు' అనువానినిఁ దనయల్లునిఁగా నిశ్చయించెను. అట్లు నిర్ణయించుటకు దుర్లభ వర్ధనుని యసమాన రూప వైభవ మొక్కటి రాజున కాధారభూత మగు హేతువుగ దొరకినది.

గీ॥ దైవమును బౌరుషంబున దాట నెంచు
వాఁడు హాస్యాస్పదుం డట్టివాఁడు మఱియు
గట్టి యూఁతను గడలినిఁ గాలి నడచఁ
గడపఁ గడఁగెడు మూఢుఁడౌఁగద దలంప!

'కర్కోటక నాగుఁడు' సుస్నాత యయి యున్న దుర్లభవర్ధనుని మాతను బొందుటవలన నతఁడు జనించెను. ఆదుర్లభవర్ధనుఁడు రాజ్యముకొఱకై పుడమియందుఁ బుట్టె నని రాజున కెట్లు దెలియును?

లోకమున నెవఁడు తనకుఁ దానే "తత్త్వజ్ఞుఁడను నేను" అని తలంచుచు విధి చోదిత మైన భవిష్యదర్థమునకు విరుద్ధముగ దురాగ్రహముతో నపాత్రుఁ డగు వాని నడ్డముంచి సంతసించు చుండునో! విధి యాతత్త్వజ్ఞంమన్యుని జయింపఁగోరి యుండుటవలననో! యన, జరుగ నున్నట్టి యాకార్యము నయోగ్యుఁడని నిర్ణయింపఁబడిన వాని మూలముననే కరము శుభోదర్కము గావించి తనవిజయమును జాటుకొనును.

మఱియు గ్రహపతి యస్తమించు నపుడు దనకు సాటియయిన గ్రహములయందు మచ్చరముఁ బూని వాని నంగీకరింపక విసదృశుఁడగు ధూమధ్వజుఁడు పాత్రుఁడని నమ్మి యతనియందుఁ దనతేజము నుంచి దైవ గతి నెఱుఁగక ప్రశాంతి నొందుచు హాస్యాస్పదుఁ డగుచున్నాఁడు. నిజముగ ధూమధ్వజుఁ డగు నగ్నిమాట యటుండ వానివలనఁ బుట్టి వానివశమై యున్న చిఱుత దివ్వెలు గూడ లోకు లాగ్రహపతిని రాత్రులందు మఱచి పోవుటకుఁ గారణ మగుట యెంతయు జంతనీయముగదా! విధి వివిధవిలాసములు వర్ణింపఁ దర మేరి కగును?

ఉ॥ పండితమాను లాగ్రహపుఁ<br>
  బాటున యోగ్యు నయోగ్యుఁ గాఁగ ను<br>
ద్దండత నిశ్చయించినను<br>
  దైవము చక్కఁగఁ జూచునేని యా<br>
ఖండల వైభవోన్నతుఁడు<br>
  గా నతఁ డౌ; నటు వారి గర్వపుం<br>
గొండలు గూలి పోవు; విధి<br>
  గొప్పతనంబు వచింప శక్యమే.

శా॥ ఔరా! ఆగ్రహరాజు మచ్చరము! దో<br>
  షారంభ వేళన్ స్వ తే<br>
జో రాశి న్దనవారిఁ గాదనుచుఁ జి<br>
  చ్చున్ జేర్చు; దైవం బెఱుం<br>
గీరంగున్! శిఖి మాట యేల? రవి నిం<br>
  తింతైన ధూమధ్వజా<br>
కారాలే మఱపించు; నౌ! విషమ సాం<br>
  గత్యంబు నవ్వింపదే?

విధిబలమున దుర్లభవర్ధనుఁడు బాలాదిత్యునకు నల్లుఁడై భాగ్యానుగామి యగుచున్న దొడ్డ బుద్ధితో నయోచితముగ మెలఁగుచు లోకమున కంతకును దర్శనీయుఁ డగుచుండెను. అంత మామ యగు బాలాదిత్యుఁడు ప్రజ్ఞాప్రాభవశాలి యయిన దుర్లభవర్ధనుని 'ప్రజ్ఞాదిత్యుఁడు' అను బిరుదనామమునఁ బ్రథ నొందఁజేసి మెల్లఁగా నతనినిఁ గుబేరుని కెన యగు సంపన్నునిఁగా నొనర్చెను.

ఈరీతి నుండఁగా నైశ్వర్య తారుణ్యాది మదముననుం, తనతల్లిదండ్రుల ప్రేమాతిభూమి నొందిన దగుటవలనను, నారాజపుత్రి పతియెడఁ జూపఁ దగు నాదరాభిమానములం జూపక గరువమున మెలంగఁ జొచ్చెను. అంతమాత్రమే కాదు, స్వైరుణుల సంగాతము భోగములు యువకుల సమక్షమునఁ జరించుట అటుపై జనకునిగృహమున నివాసము తదుపరి పతియొక్క మార్దవమును నేర్పడుటంజేసి యయ్యనంగలేఖ శీలము క్రమముగ మ్లానమై పోవుట తటస్థించెను.

ఇట్లు గొన్నాళ్ళు గడవ 'ఖంఖుఁడు' అను మంత్రి యనుదిన మనంగలేఖను బలుమాఱు చూచుట కలవాటు పడుటచే మెల్లఁగా నామె యంతరంగమునం దాశ్రయము సంపాదించుకొనెను. పిమ్మట నా యుద్వృత్తచారిణి గొంత కాలము గూఢ మగు ప్రేమ సుఖమును బాగుగ ననుభవింప నభ్యాసపడి క్రమముగ లజ్జాభయముల విదలించి దినదినాభివృద్ధి నొందెడు ప్రాగల్భ్యముతోడఁ దుదకు ఖంఖునితోఁ గూడి జారసుఖ పారవశ్యమును ననుభవింప నారంభించెను. ఆమంత్రియు నంతిపురపుఁ బరివారమును దగిన యీవివలనను గారవము జూపుటవలనను వశపఱచుకొని యంతిపురమునందు యథేష్టముగ నాయనంగలేఖతో విహరించుచుండెను.

అంతఃపుర జనైకవేద్యమై యతిగూఢముగ భ్రంశము నొందుచున్న యనంగలేఖ శీలమును ధీమంతుఁడగు దుర్లభవర్ధనుఁడు తనయెడ నారాజపుత్రికకు నుదయించు చుండిన వైరాగ్య చిహ్నములం గమనించి యామెచెడునడతను గనిపెట్టఁగల్గెను.

లోకమునఁ బ్రాయికముగఁ బ్రేమ విక్రీత చేతస్కలగు కులటలు దౌశ్శీల్య మనెడు పిశాచముచేఁ బట్టువడి తమ మానసిక వికారమును బహిర్గతము గావించుచునే యుందురు. వామవర్తన లగు నాపుంశ్చలు లేకాంత ప్రదేశమునఁ జెలికత్తెల నడుమఁ జేరి చిఱునగవుఁ జిందు మోముతో మెలఁగుచు మగఁడు గానవచ్చినచో నప్పటికప్పుడే మోమున వైవర్ణ్యమును వెల్లడింతురు. ఉన్నటులుండి యకాండముగ లేచి చిఱునగవు వాతెరపై నడయాడించుచు నాయాదారులఁ గాంచుచుందురు. మగఁడు కినుక నొందె నేని గన్నుఁగవ వంకరగ సారించి గడ్డమును కనుబొమలను ముడివడఁజేసి తన్నతఁడు మిగుల నవమానించినతీరున నటించుటయు మగనిడెందమునకుఁ గుందు వాటిల్లినట్లు తెలిసెనేని మందహాస మిశ్రితము లైన చూడ్కులఁ గనఁబఱచుటయు రంకుటాండ్రకు నుగ్గుఁబాలతో నలవడిన నేరిమి పెంపులు.

మఱియు స్వైరిణులు మగని మేల్మి గుణములను గాని యతని కెన యగు మఱియొక సుకృతియొక్క పొగడఁదగు నడవడినిఁ గాని వినినప్పుడు విరాకువడుచుఁ జెడ్డనడత గలవారినిఁ బొగడినపుడు విన నుబలాటపడుచు నుండుటయె గాక పతి రతిప్రీతిమై గుతూహలముఁ జూపుచుండఁ దా నది యెఱుఁగనట్లు చెలికత్తెలచెంతఁ జేరి పెద్ద తడవు ముచ్చటల నెఱపుచుండుదురు. ఒకవేళ నట్టి కేళీవిలాసము పొసఁగినను గపటపునిద్ర మొదలగు పెక్కుతీరుల నేర్పుతోఁ దమవైముఖ్యమును వెల్లడించి భర్తను విరక్తహృదయునిఁ జేయుచుందురు. బంధకీజనమునకు నిట్టినేర్పులు సహజములై యుండును.

## బంధకీలక్షణములు

ఉ॥ జారునిరాకచేఁ గులట
చాల ముదంబును గాంచు; భర్త దా
నూఱుచుఁ గారముల్ వెత ము
నుంగును. వానినిమెచ్చు; వీని మా
టే రుచి సేయ; దా యువ హృ
ద్భీతుని చెంగటఁ బ్రేమ లీలలన్.
గూరిమిఁజూపు; వాధుకడఁ
గుందుచు డిందుచు నుండు నెప్పుడున్.

చం॥ అకట నికామ కామ వశ
యైకదః పాంసుల జారభర్తకై
తికమక చెందుచున్ పథముఁ
దీయని చూపుల వేచి చూచుఁ; దా
సకియల నర్మగోష్ఠులను
సారెకు మోమున మూగు వెన్నెలల్
ప్రకటన సేయుచున్ దనదు
పాండితిఁ జూపి నటించు నేపునన్.

మ॥ పతి గోపింపఁ బరాభవానల పరి
ష్వంగంబునన్ దప్తయై
యతిరోషంబునఁ జీఁకటుల్ మొగముపై
నట్టాడుచుండంగఁ బె
న్వేతతో బంధకి భ్రూలతల్ చిబుకమున్
దృక్కోణముల్ ద్రిప్పుచున్
మతి నేమో దలపోయు మాన్మథపు టు
న్మాదంబు గారింపఁగన్.

సీ॥ రతికేళి కోర్కెమై పతి యుండుట యెఱింగి
సకియలతో నప్రసక్తమైన
సల్లాప మెడలేక సల్పుచునే యుండు:
నొకవేళ దుర్విధి యుత్సహించి
యాపొందుకై కొంత యవకాశ మొసఁగిన
విరసయై హర్షంబు వీడియుండి
తల్పంగతుని ధవు దాఁకంగ మాటాడఁ
దక్కి కైతవపు నిద్రను మునుంగు.

గీ॥ ముద్దిడఁగ భగ్నకంఠియై మోము ముడుచుఁ:
గౌఁగిలింతకు నోర్వక గాసిఁజెందు;
వలపునకు నమ్ముడైన పాంసుల నటించు
నిటుల దౌశ్శీల్యపుఁ బిశాచి యేచి యాడ్వ.

కం॥ పతి కప్రియంబుఁ బల్కుము
దిత యగుఁ; దత్తుల్యగుణవిఁ దెల్పంగ విష
జ్ఞతఁ బొరయుఁ; దద్విపక్షుని
హితునిగఁ దలపోయుఁ గులట యెంత పతివ్రతయో!

దుర్లభవర్ధనుఁ డారీతి నిజపత్ని దౌరాత్మ్యము నెఱింగి లోన నుదయించి పెనువొందుచున్న చింతాజ్వలనమున శోషితగాత్రుఁడగుచు నొకనాటిరేయి నకస్మాత్తుగ నంతఃపురమును బ్రవేశించెను. అందు ఖంఖునితోడ దల్పమునందు నిద్రించుచున్న యనంగలేఖను గాంచెను. ఇఁక నాతనితల గిఱ్ఱునఁ దిరిగెను. అతఁడా జారయుమళమును గనుగొనఁ బాలక యుండిపడి వారిరువురను మృత్యుదేవతకు బలి వెట్టనమకట్టి వెంటనే కరాళమగు తన కరవాలమును వరనుండి దూసి వారిఁ బ్రహరింపఁ బైకెత్తెను. కాని యాశ్చర్యకారి యగు దైవ చర్య యతనిసంకల్పము నొప్పలేదు.

అప్పు డతఁ డేదో విమర్శించుచు నట్టియత్నము నుపసంహరించియు మరల మన్యుభరము నాపుకొనలేక పోవుటంజేసి వారినిఁ బలుమాఱు ప్రహరించి ప్రహరించి నివృత్తుఁ డైనట్లు తనను భావించెను. అప్పు డావిధముగ నతని నెమ్మనమున రేగిన కోపావేశ సాగరపు సంక్షోభము విమర్శ మనెడు చెలియలికట్ట యడ్డంకిచే నెట్టకేలకుఁ గొంత శమించెను.

అమ్మహాత్మునకు నతిపరంపర నొనర్పవలయు. భరింపరాని యీర్ష్యావిషవిషూచికలను నెవఁడు లోలోపలనే జీర్ణింపఁజేయుచున్నాడో! వానికంటె జితేంద్రియులం దుత్తముఁడుగ భావింపఁదగిన వాఁ డుండఁడు.

ఉ॥ క్షుభములు డిందఁగా విష వి
షూచికవోలె మనస్సు నెంతొ సం
క్షుభిత మొనర్చు నీర్ష్యను ద్రి
శుద్ధిగ లోన నణంచి, సద్యశో
విభవము నొందువారలె వి
వేకులు; వారె జితేంద్రియుల్ జగ
త్ప్రభుని కటాక్ష సంపదకుఁ
బాత్రులు; వారికి మానమస్కృతుల్.

కావున దుర్లభవర్ధనుఁ డటనుండి యించుక దొలంగి చని ఏకాంతమున నిట్లు విచారించెను. “ఔరా! విచ్చలవిడి రాగానువర్తనులై యెట్టిపాపమునేని యొడిగట్టుకొను తెగువ గల యిట్టికుల టలే పురుషులను విమర్శవిదూరులుగఁ జేసి యధఃపతనము నొందించుచున్నారు. లోకమునం దుండు నింద్రియోపభోగ్యము లగు పదార్థములలో స్త్రీరూప మైన యింద్రియార్థముగూడ నొకటియై యున్నది. అట్టి యింద్రియార్థము నెడ జితేంద్రియులకు స్థానము గూడదు. ప్రకృతి చపల లగు స్త్రీలను బట్టు పట్టి నియమింపఁగల సమర్థుఁడు జగమున నెవ్వఁడునులేఁడు. ఒకవేళ నెవ్వఁడేని యట్లు నియ మింపఁ జూచెనుబో అందువలన నతఁడు సత్పురుషులు స్మరింపఁ దగ్గ ఘన కార్యమాచరించినవాఁడు కాఁగలఁడా? మఱియుఁ దుచ్ఛ సుఖాభాస మూలమగు స్త్రీరూప మైన యొక్క యింద్రియార్థమునకై మను సంతతివా రైన పురుషులుగూడ వీధులందుఁ ద్రిమ్మరు ఘునకములై యగుచు రాగాభిమాన ములతోడఁ బోరాడుటకంటెఁ బ్రబలతరమగు నవమానము వేఱొకటి పుడమియం దుండదు.

అదియుఁ గాక సత్వ చైతన్యవంతు లగువారికి వామనేత్రలయెడ మమకార మెక్కడిది? అట్టి మమకారము వారికి స్వదేహములయెడనే యనుపపన్నమై యుండ నితరులైనవారియెడ నుండు ననుట యెట్లు పొసఁగును? ఇప్పుడు నాకింతటి మానసోద్వేగమును గలిగించిన యీపాంసుల యవశ్య వధార్హ యని నే దలంచి తెగించిన యెడల నంతమాత్రమున నాయుద్వేగశాఖికి మూల మయి యున్న యంతర్గత మగు రాగ మేకారణమున విస్మృత మగును.?

రాగ మహీరుహము యొక్క వేళ్ళు పాతాళలోకముల నేఁడింటిని వ్యాపించి సుస్థిరములై యుండును. వానికి క్షేత్రభూత మైన ద్వేషమును మాపు మాపినచో నావృక్షము నున్మూలించుట కరము సుకర మగును. కావున ద్వేష మనునదే జగమున నెవరికేని దుర్ధర్ష మగుచున్నది. ఆద్వేషము నేవివేకి జయింపఁగలఁడో యతఁడు తదుత్తరక్షణమునసే రాగ మను శత్రువును వేరు లేకుండఁ బోకార్ప వలంతి యగును. విమర్శ దృష్టితో నేవిషయమును గనుగొన్న వివేకి రాగరోగముచేఁ పీడితు లైన వారికి “మొదట నీసుం జయించినచో రాగ మనునది తనంతటఁ దాఁ దిక్కులేక దిక్కులు బట్టి పలాయనమై పోవును.” అను హితోపదేశ రూపమగు నౌషధము నొసంగవలయును

గీ॥ రాగ సంరంభ వివశాంతరంగు లైన
నరులకు వివేక సుధ సుంత దొరక దెపుడు.
వార లారాగ వికృతు లవ్వారి గాఁగ
నలుగుచుందు రధఃపతనంబు నొంది:

గీ॥ ఇంద్రియార్థంబు లితరంబు లెట్లు జగతి
సర్వ సామాన్యములొ! యట్లె సారసాక్షు
లనుట పాడియె పామరులట్లు? దాన
నింద్రియ విజేతలల్క వహింపకుంద్రు.

గీ॥ చంచలయువలెఁ బ్రకృతి చంచలలు వామ
లట్టి వారల నట్టాక నదిమి పట్టఁ
దరమె? కేవల మంతమాత్రాన సుజన
గణ్య మైనట్టి గుణము దుర్ఘటము చూవె.

చం॥ పర సుఖ దాయి మానవ భ
వం బది వమ్మయి పోవ, నింద్రియా
ర్థ రస పిపాసఁ బెక్కు రొక
తన్విని గోరుచు మాన మేచి కు
ర్కురములువోలెఁ బోరుదురు
రోఁత గణింపక, యింతకంటె దు
ర్భర మవమాన మున్నదె? న
రత్వము సార్థక మౌనె యిట్టులన్?

గీ॥ కాము జాలంటులకు గుఱి గాని గొప్ప
మనము గలవారలకుఁ దమ తనువు పైన
నే జనింపదు మమకార; మింక నెట్లు
గలుగు నేణాక్షులం దది కలలనేని?

గీ॥ సప్తపాతాళముల నంటి సాగి సాగి
దిట్టపడినట్టి మూలానఁ దేజరిల్లు
రాగ భూజంబుఁ బెకలింపరాదు; దాని
జన్మహేతువు ద్వేషమున్ జంపకున్న:

కం॥ ద్వేషము దుర్ధర్షం బది
దోషములను బెంచు; దాని ద్రుంచిన విద్యా
భూషణుల మదికిఁ గామం
బీషత్తున్ నామమాత్ర మేని దగులునే?

గీ॥ రాగ మను వది యొక మహారోగ, మట్టి
దానికిందగు మందు డెందాన నీర్ష్యఁ
జేర నీకుండుటే, ఇటు సేయ నదియు
నణఁగు నాశాంతమునఁ బలాయన మొనర్చి.

ఈరీతి దుర్లభవర్ధనుఁడు లెస్సగ విమర్శించుకొని యొక కమ్మ గైకొని దానిపై "నీవు అవశ్యముగ వధ్యుఁ డవైనను నిన్నుఁ జంపక విడిచితిని. కావునఁ దత్కారణమును యావజ్జీవము మఱవక బ్రతుకుము." అని లిఖించి వెంటనే యచ్చోటు వాసి యేరికిఁ గనఁబడకుండఁ దనభవనమునకుఁ బోయెను.

పిమ్మటఁ గొంత తడవునకు 'ఖంఖుఁడు' మేల్కాంచి తనవలువపైఁ బడియున్న పత్రికను గాంచి యందలి వర్ణపంక్తిని మెల్లఁగఁ జదివికొని భయకంపితుఁడై సత్వరముగ నత్తావును వదలి తనలో "ఔరా! మనుష్యమాత్రున కిట్టి యోర్పుండునా? దాక్షిణ్యమునఁజేసి ప్రాణదాత యయిన యిమ్మహానుభావునకు నే నెట్టి యుపక్రియఁ గావింపఁగలను? అని పరిపరివిధములఁ దలపోసెను.

అది మొదలు ఖంఖుని నెమ్మనమునఁ "ప్రాణ దాత యగు దుర్లభవర్ధనునికి నెట్లుపకృతి సేయఁ గల్గుదునోగదా! యను చింత మెండగుటఁజేసి రేయి పవలు నతనికి నిద్దుర పట్టక పోయెను. కాని, యనంగలేఖా విరహము నాధారము చేసికొన్న యనంగుని యంపజడి కగ్గమై యతఁ డొకప్పుడును జాగరావస్థ ననుభవింపలేదు. అంత మాత్రమే గాక తొలిబాముదు జరిగిన వృత్తాంతమును వలె నమ్మంత్రి యనంగలేఖా నామ రూపాదికమును మఱచి పోయినవాఁ డయ్యెను.

ఇట్లుండ నృపశిరోరత్నమై వెల్గుచుండిన యాబాలాదిత్యుఁడు కాశ్మీరము నారీతి ముప్పది యాఱేండ్లకుఁ బైనెనిమిది నెలలు పాలించి యాతరుణమునఁ బుణ్యలోకము నార్జించెను. బాలాదిత్యునకుఁ బుత్రసంతతి గలిగి నష్టమయ్యెను. తఱువాత పుత్రసంతానమేమిఁ బడయకయే వంశశేషమై యున్న యాతఁడును విహాము బాసెను. ఈకారణమున నప్పటి దాఁగోనందువిన సంతతి తొలుతఁ గమలములు

దంతావళములచే భగ్నములై యుండ నటుపైఁ బైఁబడిన నూతన జల ప్రవాహపుఁబరవడిచే బిస కాండము లెల్లనుత్పాటితములై పోవ వెలవెలఁ బాఱుచుండు తామరలతవలె నతిదీనత నొందెను.

అట్టి సమయమున బాలాదిత్యుని యల్లుఁడగు దుర్లభవర్ధనుఁడు కాశ్మీరాధిపత్యమును గ్రహింప దలపి యుండెను. కాని, ప్రధానామాత్యుఁడు వైమనస్యము వహించి యందు కాటంకమును గల్గించెను. ఐనను 'ఖంఖుఁడు' తనకృతజ్ఞతను ఫలింపఁ జేసికొనువాఁడై మిక్కిలి పూనికతో ముఖ్యమంత్రి దెల్పు కారణములను దనప్రతిభాబలమున నణఁచివేసి రాజజామాత యగు నాదుర్లభవర్ధనుని శుభ ముహూర్తమున బంగరుకలశముల యందలి పావన తీర్థములచే యథావిధి నభిషేకించి రాజ్యపట్టమున నలంకరించి యెట్టకేలకుఁ గృతకృత్యుఁడు గాఁగల్గెను.

ఇట్లు కార్కోటక నాగవంశజుఁ డయినదుర్లభవర్ధనుఁడు గాశ్మీరపతియై రాజమకుటమునఁ గూర్పఁబడియున్న ముక్తామణుల కాంతిశ్రేణి యనెడి ఫణాంకురాశిచే నంకితము లయిన భుజాస్తంభము లందు వసుంధరను వహించుచుఁ దనయెడ సంప్రీతి నొంది యున్న జ్ఞాతి యగు ఫణీంద్రుని యుత్ఫుల్ల దృక్పల్లవ ప్రసారము నందినవాఁ డయ్యెను. కావుననే ప్రకాశించుచున్న బంగరు తామర పూల మాలలచే నలరారెడు దివ్యాంగము గలవాఁడుగ నతఁడు మఱింత శోభిల్లెను.

పావన మైన గోనంద భూభుజుని వంశమునుండి విగళిత మైన కాశ్మీర వసుమతి యత్యంత పవిత్ర మైన కార్కోటక నాగకులమున సుస్థితిం గాంచి చిరపరిచిత మైన విశాల స్వర్గ మార్గమునుండి పతనము నొంది జగదీశ్వరుఁ డగు బాలేందు కలామౌళియొక్క జటాజూటము నాశ్రయించిన జాహ్నవీ తటినికి సాటియై కడుం గడు విరాజిల్లెను.

శ్రీ శ్రీ శ్రీ

ఇది కాశ్మీరికమహామాత్యశ్రీ చణ్పకప్రభు సూను 'కల్హణ మహాకవి' ప్రణీతమగు 'రాజతరంగిణి' యను
సంస్కృత మహాకావ్యమునకు, అనువాదరూపమును స్వయంపాకాన్వయ భారద్వాజ గోత్రజ
శ్రీ. వేంకటలక్ష్మ్యంబా వేంకటప్పార్య తనూజ, పరదేవతానుగ్రహ సముపాత్తోభయకవితా
సాహితీవికాస, వ్యాకరణవిద్యాప్రవీణ, విద్వత్కవిశేఖర, మహాకవి, ఆయుర్వేద
విశారద, జరుగుమల్ల్యభిజన, సింహపురనివాసి, వేంకటరమణశర్మచే
విరచితమును నగు, ఆంధ్రరాజతరంగిణి, అను చంపూ
మహాప్రబంధమునందు సర్వంబును
తృతీయ తరంగము.

ఓం తత్, సత్



శ్రీ పరదేవతాయనమః

# రాజతరంగిణి

(మహాకవి కల్హణుని కృతికి ఆంధ్రీకృతి)

## చతుర్థ తరంగము

## మంగళాచరణము

మ॥ కుటిల శ్యామల మైన వేణిలత చూ
డ్కుల్ దన్పు నొందించుచున్
జటలం బొల్చు నహీను చానయొ యనన్
సామేన నొప్పారుచున్
స్ఫుట మౌచుండఁగ నొప్పు హైమవతి న
ప్పూఁబోణి నెల్లప్పుడున్
దృటియే న్బాయని భవ్యమూర్తి శుభముల్
దీపింప మ మ్మోముతన్.

### దుర్లభవర్ధనుఁడు

ఆరీతి దుర్లభవర్ధనుఁ డొక వంశమునుండి యె రాజకన్య రత్నగర్భను సైతము పడసిన వాఁడై రత్నములకును సుతరత్నములకును భాజనుఁ డయ్యెను. అశ్శీలతా దోషమునఁ బతియొక్క కిన్కకుఁ బాత్రమైన యనంగలేఖయుఁ బిమ్మట మగనికి సాటి యైనసౌభాగ్య గౌరవముల నెనసి 'యనంగభవనము' అను నొక విహారమును నిర్మింపఁజేసెను.

ఈ రాజదంపతులకు 'మల్హాణుఁడు' అను నొక కొమరుఁడు గల్గెను. ఒకనాఁడు దైవజ్ఞుఁ డొకఁడు వచ్చి యాబాలుని యాయుః ప్రమాణ మత్యల్ప మని నుడువ నామల్హాణుఁడు విచారించుచుఁ దన చిఱుఁబ్రాయమునందె మల్హాణస్వామి ప్రతిష్ఠ గావించెను. దుర్లభవర్ధనుఁడు 'విశోకానది' యావలి తీరమున నుండు 'చంద్ర' గ్రామమును అర్హత గల ద్విజపుంగవులకు నొసఁగి 'శ్రీనగరియందు' 'దుర్లభస్వామి అనుపేర విష్ణువు బ్రతిష్ఠింపఁజేసి కృతార్థుఁ డయ్యెను. ఇతఁడు ముప్పదియాఱేండ్లు వసుమతి నేలి మర్త్యతనువును బాసెను.

## దుర్లభక ప్రతాపాదిత్యుఁడు

అనంతరము దుర్లభవర్ధనునకు ననంగదేవియందుఁ గలిగిన తనయుఁడు 'దుర్లభకుఁడు' మహీధవుఁ డయ్యెను. అతఁడు బాలాదిత్యునకు దౌహిత్రుఁడు గావునఁ దల్లి యగు ననంగలేఖ మాతామహునకుఁ బుత్రతుల్యుఁ డయిన 'దుర్లభకుని' తద్వంశానుగత మగుచున్న 'ప్రతాపాదిత్యుఁడు' అను నామమున సయితము పేర్కొనెను. ఈదుర్లభకప్రతాపాదిత్యుని కొలువున 'హనుమన్నామకుఁడు' అను నొక యమాత్యుఁ డుండెను. అతఁ డలకాపతివలన నపరిమిత మగు ధనమును బడసి యాధన సంపదను ధర్మకార్యములకు విరివిగ వినియోగించుచు ననేకము లయిన యగ్రహారముల నేర్పఱచి మిగుల సుకృతి యయ్యెను.

దుర్లభకుఁడు ప్రతాపతపనునిచే నరాతివ్రాతమును దపింపఁజేసి యమరావతికి దీటయిన "ప్రతాపపురము" అను నొక గొప్ప నగరమును గట్టించెను. ఆకాలమున నానాదేశములనుండి వణిక్సంఘము వాణిజ్యము సేయుటకుఁ గాశ్మీరమునకు వచ్చుచుండుట యలవాటుగ నుండెను. వారిలో 'నోణుఁడు' అను పేరుగల 'రౌహీత'దేశపు (ఇప్పుడు 'ఢిల్లీ' సమీపముననున్న (Rohtak) అనునది) వణిజుఁ డొకఁడు కాశ్మీరమునఁ గొంతకాలము వసించెను. ఆవణిజ్మణి రౌహీత దేశోద్భవము లగు ద్విజన్ములకుఁ బావనతమ మైన మఠమును దననామమునఁ బరఁగునట్లు నిర్మింపఁ జేసిన పుణ్య చరితుఁడు.

ఒకానొకప్పుడు 'దుర్లభక' మహీపతి యాసార్థవాహుని నాదరముతో రాజభవనమునకు నాహ్వానించి యతనికి నిజభవనమున నృపోచితము లగు నుపచారములను జేయించి యానాఁ డంతయు నతనిఁ దనభవనమునందె నిలిపెను. మఱునాఁడుదయమున రాజు ప్రీతితో "ఇచ్చటి వాసము నీకు సుఖకరముగ నుండెనా?" యని యతని నడుగ నాబేహారి "రేయి దివ్వెల కటుధూపముచేఁ గొంత తల నొప్పి గల్గెను." అని మనవిఁజేసి నరపతిని వీడ్కొని నిజమందిరమునకుఁ బోయెను.

కొంత కాలము గడచిన తఱువాత నొకనాఁ డావణిజుఁడును నరనాథునిఁ దనమందిరమున కతిథిగా రమ్మని ప్రీతితో వేడికొనఁ బుడమిఱేఁ డందుల కియ్యకొని యతని భవనమునకుఁ బోయెను. అచ్చోట రాత్రియందు వెలుఁగుచున్న మణిదీపముల నానేలఱేఁడు గాంచి తాను విలాసి యగుటంజేసి యాబేహారి సాటిలేని విభవమునకు విసుమయము నొంది రెండు మూఁడు దినము లచ్చటనే తగిన గౌర వాదరములఁ బడయుచు నుండెను. అట్టి తరుణమున నొకప్పుడు రాజు రాకాచంద్రనిభానన యగు వర్తకుని ప్రేయసి 'శ్రీనరేంద్రప్రభ' ను గాంచుట తటస్థించెను.

పూర్ణ కలశములవంటి పాలిండ్లును పీనము లయిన యూరుకటి భాగములును గలిగిన యవ్విలాసిని పుష్పధ్వునియొక్కయు నాహర్మ్యముయొక్కయు మూర్తీభవించిన మంగళవిభ్రమము వోలె నొప్పారుచుండెను. విజన మైన యాభవనమున నిశ్శంకముగ విహరించుచుండిన యమ్మోహనాకృతినిఁ దిలకించిన యమ్మహీధవునకు నెమ్మనమున ననురాగ మంకురించెను. ఆరీతి నరేంద్రప్రభయుఁ జెలికత్తె లాకాశ్యపీనాథునిఁ జూపఁగా మోముఁదమ్మి నొకింత యోరఁగాఁ బెట్టి యాకర్ణాయత మయిన

తన కన్నుఁగవతోడ నట్టి యాతని స్పృహణీయాకృతిని నవలోకించి తొలి జన్మపుఁ బ్రేమ బంధము నకో, లేక మదనుని నియోగమునంజేసియో, వెంటనే యమ్మహీకాంతుని యెడఁ బక్షపాతము నొందిన డెందము గలదయ్యెను.

అంత నరేంద్రుఁ డలబ్ధస్పర్శుఁ డయినను నొక్క క్షణములో నాసౌందర్యసుధాలహరి తనయస్థిసారమునుగూడ నంటెనో యన్నట్లు దనలోఁ దా భావించుచుండెను. ఆవిలాసవతియు నొక్క క్షణము హర్మ్య స్తంభముల చాటున దాఁగి యాననచంద్రునిఁ బ్రక్కకు సారించి సానురాగముగ నప్పార్థివుని మాటిమాటికిఁ జూడ సాగెను.

ఇవ్విధముగ నాసుందరాంగి తనమానసమును హరింప నమ్మేదినీశ్వరుఁ డాపాటి సందర్భముతో నాతావును విడిచి విచారకుటిలము లయిన పేదచూపులతో మెల్లఁగ దనరాజభవనం జేరి యచ్చట నహర్నిశము తదాకార ధ్యానమున నవహిత మగుచున్న నయన యుగళి గలవాఁ డగుటవలన నతని తనువును నవరోధ కాంతలయెడ నతనిప్రేమయుఁగ్రమముగఁ దానవము నొంద సాగెను.

పిమ్మట నొకనాఁ డమ్మహీజాని యొంటిమైనుండి తనలో దీర్ఘముగ నిట్లాలోచించెను. "శోచ్య మగు నాదీనస్థితి నిందిత మగుచున్నది. ఎంత కష్టము! ఇప్పుడు నామానసోద్యానమున నశుభావహ మైన రాగమను విషద్రుమము బాగుగ రూఢమూల మయి యున్నది. ఔరా! ఏమి యీరాగము యొక్క వ్యాపార కౌశలము? ఇయ్యది చిత్తమును స్వాయత్తము చేసి వివేకాది సుహృద్వర్గమును దూరముగ శత్రుకోటినివలెఁ బాఱఁ ద్రోలినది. కులీనతాభంగమునకు వెఱచువాఁడను భూపాలుఁడను నగు నేన్ను దుస్సహమును సదాచార విపర్యయ కారణమును నైన యీరాగ మనెడు పెనుభూత మేల పట్టుకొనవలయును?

మఱియు రాజే పరదారాపహర్త యగునేని ఇఁకఁ బ్రజాబాహుళ్యమున విజృంభించు నధర్మ విప్లవమును మాన్ప నెవ్వరి తరమగును? కంచెయే చేను మేయఁగడఁగినచో వేఱు దిక్కేముండును?" అని వివిధముగ విమర్శించుకొనుచున్న యమ్మానవనాథుఁడు సాధుసేవ్య మగు ధర్మపద్ధతిని మనోహారిణి యగు నాహరిణనయనను సయితము మనమునుండి యెడబాటు నొందింపలేక పోయెను.

గీ॥ రమ్య ఫల భావ సుమముల రమణ నెసఁగు
మానసోద్యాన సీమ నెంచేని తుచ్ఛ
మైన కామంబు విషవృక్ష మంకురించు
టది మహానర్థకంబు నింద్యంబు మిగుల.

ఉ॥ శీలము పండఁగా హృదయ
సీమను దీర్చు వివేక ముఖ్య మి
త్రాళిని స్వీయ వైరుల ర
యంబున చప్పులఁ బట్టిపోవఁగాఁ
ద్రోలుచుఁ జిత్తముం గెలిచి
దుర్దమ మౌఁ గద రాగవైరి! త

శ్లీలలు కాలపాశముల
లీలతె చక్కఁగఁ బోల్చి చూచినన్.

కం॥ భూలలనామణి వేలం
జాలు నృపాలుండు సాధుచరితుం డవనిన్
గౌపీనము నోము శుభా
వాల సదాచార తరువుఁ బడఁగొట్టు నొకో.

గీ॥ కంచెయే చేను మేసిన కరణి నృపతి
ప్రజల దారాదుల హరింపఁ బాలుపడిన
రాజ నామంబు 'నేతిబీర'కు సమంబు
గాదె! యిఁక నీతిఁ గాపాడఁ గలుగు నెవఁడు?

ఈరీతిఁ బ్రకట మైన కామవేదన ననుభవించుచు జీవితావధికి సన్నిహితుఁడుగా నున్న యీభూపాలుని వృత్తమును వణిక్పుంగవుఁ డెట్లో తెలిసికొని రాజుదగ్గఱకు వచ్చి యేకాంతమున నతనిని గూర్చి యిట్లు పల్కెను. "వివేకులు క్లిష్టము లయిన ధర్మసంశయములనెడ నెవరి యాశ్రయమునకై వేచియుందురో? అట్టివారికిఁ గూడ నేతాదృశ దశలయందుఁ గర్తవ్యమునెడ నియమహాని గలుగుచుండుట వినుచునే యున్నాము. యశోహాని లేకుండుటకై దేహమునేని యుపేక్షించుట కర్జ మని యెంచుటయు సమంజసముగాదు. మృతి నొందిన వారికి స్వీయ మగు యశము కర్ణరసాయన మగుట దబ్బర.

## నీత్యాభాసము

గీ॥ విబుధు లేమహనీయుల విమల మతము
ధర్మ సందేహమును బాపు దర్శనముగ
నెంచెదరో? రాగకృత మా మహేంద్ర జాల
మందుఁ బడి రౌర! వారలం గొంద ఱర్వి!

కం॥ యశమున్ బడయఁగ దేహము
నశించు సాహసపు పేత నాతెం బౌనే?
యశము గతాసుల వీనుల
వశమౌనె? రసాయనంబువలె విందౌనే?

కం॥ ప్రాణములు దీయు నట్టి మ
హానర్థము సంభవించు నప్పుడు ధర్మం
బా? నీతిగదా తిన్నఁగఁ
బ్రాణము దక్కించుకొనుట పథము దొలఁగియున్.

కావున నీకిట్టి తరుణమున ధర్మ భీతి వలదు. నన్ననురోధించుటతోడిపనియును లేదు. భవ త్తృప్తికై నాప్రాణములను సైతము గణింపను. అట్టి నాకు నింద్రియార్థముల కథ యెంతటిది? నే నింత

దూరము చెప్పినను వంగీకరింపవేని నర్తన చాతురీ ధురీణ యగు నాతలిరుఁబోఁడిని లాస్య ప్రదర్శన మునకై దేవాలయమునకుఁ బంపుదును. అటనుండి నీవాకాంతను గ్రహింపవచ్చును." అని యసాధారణముగను నీత్యాభాసముగను వచించు నాసార్థవాహుని వాక్యమువలనను, ప్రబలుఁ డగు సుమశరుని వలనను ప్రేరితుఁడై భోగ లాలసతా వశంవదుఁ డైన యాధాత్రీవల్లభుఁడు మొదట సిగ్గు పడి తుద కావామలోచన నెట్టకేలకు స్వీకరించెను. ఆశోభనాంగియు నావిధమున నరేంద్రవల్లభయై యుదాత్తము లగు కృత్యములచేఁ దనదౌశ్శీల్య లాఘవము నడంచుచు 'శ్రీనరేంద్రేశ్వరుఁడు' అను నామమున నీశ్వరునిఁ బ్రతిష్ఠింపఁ జేసెను.

ఇట్లుండఁ గ్రమముగఁ బ్రజలు చేసికొన్న పున్నెంపుఁ బరిపాకమువలనఁ బార్థివపత్ని 'వసుంధర' నిధానమును బడసినట్లు 'చంద్రాపీడుఁడు' అను కుమారరత్నమును గనెను. గనినుండి గైకొనఁ బడిన మహామణి నికషోపలపు వరిపిడిచే మాలిన్యమును బాయునట్లు ఆచంద్రాపీడుని వినిర్మలమగు గుణసందోహముచేఁ గులము వినిర్మలత నొంది శోభిల్లెను.

అతిమలీమస మగు ధూమమువలనఁ గారుమబ్బు సంభవించుచున్నది. అట్టి కారుమబ్బువలన వినిర్మలమైన సలిలము లభించుచున్నది, అట్లే పెను బండలతో నిండి యుండు కొండనుండి నిశితమైన లోహశలాక యేర్పడుచున్నది. మఱియు నతిజడమైన జలమునుండి తేజోమూర్తి యగు నర్చిష్మంతుఁ డుదయించుచున్నాఁడు. ఈప్రకృతివైచిత్రినిఁ బరికించినచో మహాత్ముల స్వభావము లెందునను జన్మకారణములగువారి ననుకరింప వనుట నిక్క మని తేలుచున్నది.

సీ॥ అతి మలీమస మగు నట్టి ధూమ స్తోమ
　　　　మునఁ బుట్టు వాఁదెడు ఘనునివలన
　　అమలమౌ జీవనీయంబు గల్గును; మొక్క
　　　　వోవు బండలతోడఁ బొదలు గిరుల
　　నిశిత లోహంబు జనించును; గడు జడ
　　　　మై యుండు నట్టి యయ్యంబువులను
　　వైద్యుత ప్రభల నవ్వారి చెల్వారెడు
　　　　జ్వలనంబు వొడమ; నీజగతి నిట్లె

గీ॥ బహువిధం బైన ప్రకృతి సంపదఁ బరీక్ష
　　సేయ నొక్కొకచోట విచిత్రరీతి
　　సాధు గణ్య గుణంబులు సహజ జన్మ
　　కారణానుగుణంబులు గాక వెలయు.

అటుపై దుర్లభక ప్రతాపాదిత్యునకు నిజపత్నియందు వరుసగ 'తారాపీడుఁడు' 'అవిముక్తాపీడుఁడు' 'ముక్తాపీడుఁడు' అను కుమారులు గల్గిరి, మఱియు 'వజ్రాదిత్యుఁడు' 'ఉదయాదిత్యుఁడు' లలితాదిత్యుఁడు' అనువారును బ్రతాపాదిత్యుని కొమరులని లోకమునఁ బ్రసిద్ధిగలదు. దుర్లభకుఁ డీరీతి నేఁబది యేండ్లు పుడమి నేలి దివంగతుఁడయ్యెను.

## చంద్రాపీడుఁడు

తర్వాత జంద్రాపీడుఁడు నృపాసన మలంకరించి చందురుని వెలుంగును గ్రేణి సేయునట్టి తనకీర్తి వెన్నెలచేఁ గలికాలపుఁ గాలుష్యమునకు నేలపైఁ బాలు లేకుండఁ బాలించెను. రాజు లెల్లరు కలికాలమున ధర్మమును సమస్యా తుల్యముగ నేక పాదముతో నుండునట్లు విడిచిపెట్టఁగా, 'చంద్రాపీడుఁడు' విశుద్ధ శ్లోక నిర్మాణచణుఁ డగుటంజేసి యద్దానినిఁ దక్కిన మూఁడు పాదములతో నలరారు నట్లు పుడమిపై వెలయించెను. అతని రాజ్యశ్రీ యారామమునందలి నానావిధ తరులతాదులను నుద్యానకుల్య జీవన మొసంగి తనుపునట్లు ఆయా పదవులం బడసి యున్న యనుజీవులను నాప్యాయన పఱచుచుండెను. ఆఱు ఋతువులు నందనోద్యానము నేకకాలమున సేవించువిధమున క్షమ, విక్రమము మున్నగు పరస్పర విరుద్ధము లయిన గుణములు చంద్రాపీడుని నేస్తముతో నాశ్రయించుటయు మహానది తనయందలి యడుసు మొదలగు మలిన పదార్థములను ద్రోవలందు కొండలదెసం ద్రోసి పుచ్చి నిర్మల సలిల పూరముతోడ సాగరునిఁ జేరుమాడ్కి రాజ్యసంపద దోషలేశములన్నింటిని వైరి రాజన్యులకడ నుంచి పావన గుణ మణులతో నాచంద్రాపీడుని భజించుటయు విను తింపఁదగ్గ విషయములు.

ఆ॥ అల సమస్య వోలెఁ గలిధర్మ మేకపా
దముగ విడువ నృపులు, ధర్మమూర్తి
పుట్టి యొక్కరుండు పూరించుఁ దగు మూఁడు
పాదములను శ్లోకభంగిఁ దనర.

కం॥ వర విక్రమ క్షమాదిక
పరస్పర విరోధి సుగుణ వర్గము భూమీ
వరు నాఱు ఋతువు లల ని
ర్జర వనమునువోలెఁ గొల్చు సంతత మున్వీన్.

కం॥ సుమన స్స్రవహణీయోద్యా
నమునం దరువులకు జీవనము భవ్యం బి
చ్చి మనుచు కుల్యవలెను భూ
రమణుని సంపదయుఁ బొల్చుఁ బ్రజ రంజిలుటన్.

గీ॥ సకల కాలుష్యమును దారి సాగు నప్పు
డడ్డుపడు తిప్పలకునెల్ల నంటఁజేసి
సాగరునిఁ గూడు నదివోలె సంపదయున
సుమతికడఁ జేరుఁ బరులపై నొంట్లువైచి.

కార్యవిదుఁడైన యాచంద్రాపీడుఁడు ఆయాసత్కార్యముల నిర్వర్తించు నప్పుడు వాని ఫలమును బ్రతీక్షించుచు నుద్విగ్నుఁడు గాకుండుటయ కాక ఫలోన్ముఖములగు తనచారుచర్యలను బ్రజలు పొగడినచో లజ్జ వడుచుండెడివాఁడు.

ఉ॥ కార్యవిదుండు సత్ఫలముఁ
గాంచఁగ నోరిమితోడ యత్నమున్
ధర్యత మీఱఁ జేయుః మదిఁ
దొందరపాటును జెందకుండు; నా
కార్య ఫలంబు నెల్లరకుఁ
గా వినియోగము సేయు; నట్టి యౌ
దార్యము సన్నుతింప నెడఁ
దన్ ద్రవ నొందును గర్వదూరుఁడై

చంద్రాపీడనరేంద్రుఁ డమాత్యులు మున్నుగాఁగల వారికే వినయాది సుగుణముల నలవ రింపఁ జేయఁగల మనీషి, అట్టి వారికి సచివులవలన నయపథం బెఱుఁగవలసిన యక్కఱ యెట్లుం డును? వజ్రము మణులు లోహము మున్నగు వానిని భేదించునే గాని యితర సాధనములచే భేదింపఁ బడునా? అపగత సందేహుఁడై న్యాయ్య పథమున నడచు నానరేంద్రుని కార్య మర్యాదలు మార్తాం డుని దివస కృత్యములం బోలి కరము రాణించిన వయ్యెను. మఱియు ధర్మపక్షపాతి యగు నారాజ శేఖరుఁడు ధర్మసందేహము వొడిమినపు డధర్మము వాటిల్లునేమో యను భీతిచే "వజ్రాయుధమువలన భీతి నొందెనో" యని నొప్పిన గరుత్మంతునివలె స్వీయపక్షము నైనఁ బరిత్యజించువాఁడై విఖ్యాతి గాంచెను.

గీ॥ ప్రజకు నీతినిఁ గఱపు సత్ప్రభువునకును
బుడమి ధర్మంబుఁ దెల్ప నోపునె యొకండు?
వజ్రమణి రత్నములనెల్ల వ్రచ్చుఁ గాని
దాని భేదింపఁ జాలు రత్నం బదేది?

గీ॥ న్యాయ్య మగు మార్గమును జూపు నరవరేణ్యుఁ
డర్యముఁడువోలె దివసకార్యముల నెల్ల
వీత సందేహములుగాఁగ విధి నెఱింగి
ప్రజలు దీర్పంగ నడచు మర్యాద లమర.

గీ॥ ధర్మ సందేహకాలాన ధర్మ భంగ
భయమునన్ ధర్మపరుఁ డాత్మ పక్షమేని
వదలు; ధర్మంబు వీడఁడు; వజ్ర మెంచి
విహగపతి పక్ష మీఁడె బల్వింతె గాఁగ.

ఇట్టి మహనీయ గుణ గణములు గల చంద్రాపీడుని వర్ణింప నలవి యగునా? అయినను గ్రంథ విస్తర మగు నని భారతి నియంత్రిత యగుచున్నది.

ఒకానొకప్పుడు చంద్రాపీడుఁడు త్రిభువనస్వామికి దివ్యప్రాసాదమును గట్టింప సంకల్పించి యతఁదుచితుఁ దగిన తావు నన్వేషించి తుదకు నొక చర్మకారుని గుడిసె యుండుచోటు నాలయ నిర్మాణము

నకు యోగ్యమగు క్షేత్రమునుగా నిర్ణయించెను. అంత నూతన దేవాగార నిర్మాణమున నధికృతులైన కర్మాధికారు లాచర్మకారునితో "నీకుటీరమును దీసికొనిపొమ్ము. అందుకుఁగా నీవెంత ధన మడిగినను నొసంగెదము" అని పలుమార్లు ప్రతిన యొనర్చి చెప్పినను నతఁడు "నేనొక్క నూలుపోగు మేరయేని నాతావున విడువనొల్లను." అని యధికమగు పట్టుదలతోఁ బల్కెను.

అంత నుద్యోగు లీవార్త రాజునకు విన్నవించిరి. నరపతియుఁ దన యుద్యోగులనే సాపరాధులనుగాఁ దలంచెను. కాని, చర్మకారుని యెడ నించుకేని కినుక వహింపలేదు. మఱియుఁ "వాలు తనే యాచర్మకారుని యనుమతి వడసి యాలయ నిర్మాణ కార్యమును బూనక యిట్లన్యాపేక్షకులోనైన తన యనుజీవుల కృత్యమును గర్హించుచు నిప్పుడీ యాలయ నిర్మాణము నాపివేయవలయును. లేదా, మఱియొక స్థలమునందైనను జరుగవలయును. ఇంతియకాని యన్యుల యావాసమును నాక్రమించి సుకృతమును గలంకపఱచువాఁడను గాను. మఱియు మంచి చెడ్డలను గనుగొనవలసిన నావంటి వాఁడే ధర్మవిరుద్ధములగు కార్యములను జేయ దొరకొనునేని యింక న్యాయ్యమార్గమున నడచువాఁ డెవ్వఁడుండును?" అని వారిని మందలించెను.

కం॥ నిర్మల ధర్మజ్ఞులె భువి
ధర్మము తార్మాఱుగాఁగఁ దారు నడచుచో
శర్మద మగు నాధర్మము
నర్మిలి సేవించునట్టి యతఁడెవ్వఁ డిఁకన్.

అప్పుడు మంత్రులు తమ యొడయని వాక్యములు విని చర్మకారుని కడకు మఱలఁ బ్రత్యేకముగ నొక దూతను బంపిరి. అతఁడు వాని దగ్గఱకుఁ బోయి పలుకవలసిన వెల్లఁ బలికెను. కాని యుపయోగము గలుగదయ్యెను. అంతట నాదూత చివరకుఁ జర్మకారుఁడు చెప్పిపంపిన వాక్యముల సారాంశము రాజుకడనిట్లు దెల్పెను. "దేవా! ఆపాదుకాకారుఁడు నిన్నుఁ జూడఁగోరుచున్నాఁడు. మఱియు నతఁడు "తనకాస్థానమునఁ బ్రవేశమొసంగుట యర్హము గాద"ని తలంతురేని వాహ్యాళికై వచ్చినపుడు దానచట దేవరవారిని దర్శింతును" అని పల్కి మఱేమియు నాతోఁ జెప్పనొల్లక పోయెను.

ఈరీతి దూత చర్మకారుని పల్కు లెఱింగింపఁ జంద్రాపీడ నరపతి మఱునాఁడు బహిర్విహారమునకై వెడలి యచ్చోట నాపాదుకాకారునికి దర్శనమొసంగి "ఓయీ! నీవుగదా? నాపుణ్యకార్యమునకుఁ బ్రత్యూహము గల్పించువాఁడవు. నీకు నీకుటీరమంత రమ్యముగఁ గన్పట్టుచున్నదా? అంతకంటె రమ్యతరమగు నొక భవనమును గోరుకొనుము. లేదా! చాల ధనము నర్థింపుము. అట్లుగాక యింతటి వృథా హఠమునకేల గడంగితివి?" అని పల్కి మఱేమియు ననక మిన్నకుండెను.

అంతటఁ జర్మకారుఁడు జేనిస్తత్వ గుణప్రమాణమును దన దంతాంశువు లనెడు సూత్రములతోఁ గనుగొనువానివలెఁ జంద్రాపీడ మహీధవు నుద్దేశించి "దేవా! నామనోగతమయిన భావము ననుసరించి యొకింత మనవి చేసెదను, సజ్జనగేయుఁడవగు నీవు నామనవి నేయ విషయమున నిర్ణేతవగుదువు. కావున నాపైనీను నొందకుండవలయునని మిమ్ముందుఁ బ్రార్థించుచున్నాఁడను. నేను ధనక

మునకంటె హీనుఁడనుగాను. లోకమున నేరాజయినను గాకుస్థవంశ తిలకుఁడైన రామచంద్రుని కంటెను గొప్పవాఁడుగాఁడు. ఇది యిట్లుండ దేవరవారి యాస్థానపు సభ్యు లీదినమున మాయిరువుర నుద్దేశించి సంభాషించుచు మిగుల సంక్షోభ పడవలసిన యక్కఱ యేముండునో! దెలియకున్నాను.

సంసారగహనమున జనించిన జంతువునకుఁ గళేబరమను కంచుక మవశ్య భంగుర మనుట నిక్కము గదా! ఆయినను నట్టి కాయకంచుకము అహంకార మమకారము లనెడి కొక్కెములవంటి శంకువుల నంటియుండును. కేయూరాం గదహారాది భూషితులగు మీకువలె మాకును స్వీయమైన కాయమున నహంకార మమకారములుండుట సహజము. దేవరవారికి సౌధహాసిని యైన యీ రాజధాని యెట్లు ప్రేమాస్పదమైయున్నదో! ఘటముఖములచే నేర్పఱుపఁబడిన గవాక్షములు గల నాకుటీరము నాకు నట్లే ప్రీతిం గొల్పునదై యున్నది. చిన్ననాటంగోలె నాసుఖ దుఃఖములకుఁ దల్లివలె సాక్షియై యున్న నాచిన్న కుటీర మిప్పుడు నేలపాలగుటకు సహింపఁజాలను. మానవులు దారు నివసించు గృహము వినష్టమగునప్పుడు పడు మనోవ్యధను విమానము నుండి యధఃపతితుఁడగు నమర్త్యుఁడు గాని, రాజ్యభ్రష్టుఁడగు రాజన్యుఁడుగాని నెఱుంగ వలంతి యగును.

గీ॥ అంతులేని భవాంభోధి యందుఁ బొరలు
ప్రాణుల శరీర కవచముల్ భంగురములె;
కాని 'నే నిది నాద'ను నట్టి భావ
శంకువుల హత్తుకొని యవ్వి సడలిపోవు.

గీ॥ కంకణాంగద హారాద్యలంకరణము
లను ధరించెడు వారికిఁ దనువునందుఁ
గలుగు నభిమాన మెంతదో! కటిక పేద
లకును నంతటిదే యౌ; నలంతి గాదు.

చం॥ కలకల నవ్వుమేడల వి
కాసముతోఁ జెలువొందు రాజధా
నులపయి రాజ సంతతికి
నూల్కొను ప్రేమ యదెట్టిదో! గరీ
బులకును నట్టి మక్కువలు
పుట్టుట సాజము గాదె! కుండమూ
తుల కిటికీలతోడ దయ
దోఁపఁగఁజేయు కుటీరపాళిపై.

మ॥ జననం బాదిగ సాక్షిభూతమయి క
ష్టంబందు సౌఖ్యంబు నం
దను దమ్మోముచుఁ దల్లిపోలెఁ గడు సం
తోషంబుఁ గూర్పంగఁ జా

లిన యాత్మీయ కుటీరముల్ పుడమిపా
ల్పేయంగఁ దా రట్టులే
కనులన్ జూచుచు నోర్వఁ జాలుదురె యా
కష్టంబు నిర్వేదలున్.

మ॥ భువిలో గేస్తులు దేహమట్లె గృహమున్
బోషింత్రు; తన్నష్టిచే
నవు దుఃఖంబది వారికే కొలఁదొ? రా
జ్య భ్రష్టుఁడై నట్టి వాఁ
డవనీ వల్లభుఁడో? విమానపతితుం
డౌ నాయమర్త్యుండొ, ద
క్క విశేషించి యెఱుంగ నన్యులకు శ
క్యంబౌనె తర్కింపఁగన్.

ఈ విషయ మిట్లుండినను ప్రభువులు తమరు నాగృహమునకు విచ్చేసి "కుటీరము నొసంగుము" అని నన్ను నడిగినచో సదాచారము ననుసరించి యట్టి కుటీరము నైనఁ ద్యాగము సేయుట నాకుచితమని తోచెదిని." అని పాదుకా కారుఁడు సాభిప్రాయముగ నుడివెను. చంద్రాపీడుఁడు వాని సమాధానము నాలించి వేఱొండు వల్కక యాచర్మకారుఁ డవినరీతి నతని యావాసమునకుఁ బోయి వానికి వలసిన ధనము నొసఁగి కుటీరమును గ్రహించెను. శుభార్థు లగు సజ్జనులు లోక కళ్యాణమునకై యభిమానము నుజ్జగింతురు.

కం॥ కులము చెలువంబు విద్యయు
గలిమియుఁ గలిగియును సుజన గణ్యుఁడు ధర్మా
వలితుఁ డయి లోక హితమును
నెలకొల్పఁగ స్వాభిమాన విరతిం దొఱఁగున్.

అంత నాపాదుకాకారుఁడు రాజు నుద్దేశించి అంజలిబద్ధుఁ డగుచు "పుడమి ఱేఁడా! ధర్మమార్గానుసారివై పెఱలకు లోఁబడి యుండు నీయుదార బుద్ధి యెంతయు శ్లాఘ్యతరమై యున్నది. తొల్లి సమవర్తి శునక రూపమున వెంట నంటుచు యుధిష్ఠిరుని ధార్మికత్వము నెట్లు పరీక్షించెనో? యప్పలెట్టుఁడ నగు నే నిప్పుడు నిన్నట్లే పరీక్షింపఁ గల్గితిని. నీకు సదా జయము గల్గుఁగాక. ఇట్లే శ్రేయము లగు ధర్మ పద్ధతులను లోకమున కనుష్ఠేయములనుగాఁ గఱపుచుఁ జిరకాలము రాజ్యశ్రీతోడ వర్ధిల్లుము" అని పల్కి యతఁడు సెలవు గైకొనెను.

పిమ్మట నిష్కల్మష వర్తనుఁ డగు చంద్రాపీడుఁడు 'త్రిభువనస్వామి' అనుపేర 'కేశవు'నిఁ బ్రతిష్ఠించి యాప్రదేశమును బావనము గావించెను. చంద్రాపీడుని పత్ని 'ప్రకాశదేవి' యను నామె విదిర్మలాకాశ భాసురము లగు పావనకృత్యముల నెన్నింటినో యొనర్చెను. మఱియు 'ప్రకాశవిహార

మును' సైతము నిర్మింపఁజేసెను, చంద్రాపీడుని గురువు 'మిహిరదత్తుఁడు' అను నతఁడును 'గంభీర స్వామి' యను నామమున విశ్వంభరుని ప్రతిష్ఠఁ గావించెను. చంద్రాపీడునిచే నియోగింపఁబడిన నగ రాధికారి 'ఛలితకుఁడు' అనువాఁడు సమస్తము లయిన యధికరణములయొక్క స్థైర్యమునకు నుచ్ఛేద కుఁడై యున్నను, 'ఛలితస్వామి' ప్రతిష్ఠకుఁ గారకుఁ డయ్యెను,

ఇట్లుండ నొకనాఁడు ధర్మాధికారులతోడఁ గొలువు దీరియున్న చంద్రాపీడధరణీకాంతు చెంతకుఁ బ్రాయోపవేశముఁ బూని యున్న ద్విజ పత్ని యొత్తు వచ్చి రాజు నుద్దేశించి యిట్లు వల్కెను. "మహారాజా! అనవద్యముగ నీవు పుడమి నేలుచుండ సుఖసుప్తుఁడై యున్న నాపతి నాకస్మికముగ నెవ్వఁడో వధించి పోయెను. ఇట్టి వింత [illegible]నమున నేటికిఁ జూడ నయ్యె[illegible]. తనప్రజ లకాల మృత్యువు వాతఁ బడినట్లు వినుటకంటె భూభర్తకు నోర్వరానిదియు లజ్జావహమును నగు వేఱొక విషయ ముండదు.

గీ॥ ప్రజలు తనపాలనమున శుభంబు లెసఁగ
సుఖపడం జూడఁ గోరు రాజునకు వా ర
కాల భీకర మృత్యు ముఖంబునందుఁ
బడుట తలఁగొట్టుచేః త్రపాభర మదెంతొ!

ఒకవేళఁ గలికాల ప్రాబల్యమున నిట్టిది జరిగి యుండు నని యెంచినను; అతిదుస్సహ మగు నిట్టి ఘోర పాపమును భవాదృశు లాలకించి నిర్లక్ష్యముగ విడిచి పుచ్చినచో నిఁక ధర్మదేవతకు గతి యెద్ది? నాభర్త కెవఁడేని విరోధి యుండి యతఁ డిట్లు ఘోరదురితమును నొనర్చి యుండు నేమో! యని నేనెంత యాలోచించినను నట్టివాఁ డెవ్వఁడును నామదికిఁ దట్టుట లేదు. మఱియు నిర్దోషి యగు నాపతి యెడ దిశ లెల్లఁ జందన శీతలాయితములై యొప్పుచున్న వని నాగాఢవిశ్వాసము. అసూయారహితుండును, నిరవలేపుండును, లోభవర్జితుండును, ప్రియవాదియు, గుణపక్షపాతియు. బూర్వాభిభాషియు నగు నానాథుని ద్వేషించునట్టి కూళ యెవఁ డుండును?

ఉ॥ ఈసునకుం దిలాంజలుల
నిచ్చి గుణప్రియుఁ డౌచు గర్వమున్
ద్రోసి సుదూర భూములకు
రూపఱఁ జేసియు లోభమున్, సద
భ్యాసముతోడ ముందుగ శు
భ ప్రియ భాషలు పల్కు వానిపై
నీసు జనించునే తుదకు
నెంతటి దుష్టునకేని యెయ్యెడన్.

అయినను నాబుద్ధి కిప్పు డొక్కఁడు పొడకట్టుచున్నాఁడు. అతఁడు 'మక్షికస్వామి' వాస్తవ్యుఁడు. అతఁడును నాపతియు సమాన వయస్కులు, వీరిరువురు బాల్యం బాదిగ విద్య నభ్యసించిరి,

అట్టి తరుణమున నతఁడు మంత్రులలోనై యొకనిం జేసి నాపతియొక్క బుద్ధికౌశలమున కసూయపడు చుండెడు వాఁడు. అతని కాఖ్యాని క్రియా నైపుణ్యము గలదు. కావున నాబ్రాహ్మణుఁడు నాధవుని ప్రాణములను హరించి యుండునని యను శంకించుచు వాదముచున్నది. లోకమున నీచమతులు బుద్ధి మంతులతోడ నాయా యుత్తమవిషయములందు స్పర్ధ వహించి గెలుపొందలేక యంతటితో మిన్న కుండరు. తమబుద్ధి దారిద్ర్యమునకు మనస్తాపము మూలమని తలంపరు. మేధావు లగు సాధువుల కార్య కౌశలంబునకుఁ గడుం బరితపించుకొని యుద్వేగం బూని వారి కెగ్గు సేయుటకై దొరకొనుచుందురు. ఇట్టి చర్యలు దుష్టులకు సహజము గదా!

చం॥ తమ దురదృష్ట దోషమున
ధన్య గుణంబులు లేమిఁ బేదలౌ
కుమతులు కౌశలాఢ్య గుణ
కోవిదులం గని మచ్చరంబునన్
గుములుచు వారి ప్రాణముల
కుం గడు ముప్పు ఘటిల్ల నట్టి య
త్నముల నొనర్పు చుందురు స
దా మద మోహ వినష్ట చిత్తులై.

ధర్మ పరతంత్రుఁడ వగు నోధరావల్లభా! కౌలేయునికంటెఁ జెడిపోయిన దుశ్శీలుఁడును, ద్రోహికంటె వేఱయిన నిత్యశంకితుఁడును, వాచాలుకంటె వేఱగు టక్కులాఁడును, కాయస్థునికన్న భిన్నుఁ డగు కృతఘ్నుఁడును, వాత్మవంశమున జనింపని వానికంటె లుబ్ధుఁడును, ఈర్ష్యాళువునికంటె నిత్యదుఃఖితుఁడును, స్త్రీకి లొంగి పోయిన వానికంటె నెల్లరకు హాస్యాస్పదుఁ డగువాఁడును, వృద్ధుని కంటె నితరుఁ డగు స్నిగ్ధభాషియు, జారజునికన్న వేఱగు పితృద్వేషియు, రాగమోహితునికంటె సిగ్గు లేని వాఁడును, క్షుద్రవిద్య నేర్చిన వానికంటె నధికుఁ డగు పాపియు జగమునం దుండఁబోరు. ఇయ్యది నీతికోవిదులు భూతార్థ పరిశీలనమునం గన్పెట్టి తెల్పియుండిన నీతిసార సంగ్రహ మని ధర్మ దీక్ష గల మిమువంటి ప్రభువులకుఁ దేట తెల్ల మగు విషయము.

సీ॥ వాచాలుకంటె దబ్బరకాఁడు, కాయస్థు
కంటెఁ గృతఘ్నుండు, కౌలేయు
కంటె దుశ్శీలుండు, ఖలమతియౌ ద్రోహి
కంటెను నిత్య శంకా యుతుండు,
దాత్మ వంశేతరోద్భవుకంటె లోభి, యీ
ర్ష్యాళువుకంటెను సతత దుఃఖి,
క్షుద్ర విద్యా విదగ్ధునికంటెఁ బాపియు
నబలకు లొంగిన యనదకంటె

గీ॥ హాస్యపాత్రుండు, సజ్జనుండైన వృద్ధు
కంటె హితభాషి, యన్యజుకంటెఁ బితకు
వైరి, రాగాంధుకంటెఁ బ్రపారహితుఁడు
లేరు గద! యిది భూతార్థ సార నీతి.

అని యిట్లు ఆబ్రాహ్మణి నుడువఁగా నప్పటి కప్పుడే యాచంద్రాపీడుఁ డాద్విజపత్నికి శంకాస్పద మగు చున్నట్టి బ్రాహ్మణుని సత్వరముగ రావించి యతని నుద్దేశించి "ఈద్విజపత్ని నీయెడఁ దెల్పిన నేరము కావించితివా? లేదేని నీవు నీనిర్దోషిత్వము రు జు వు చేసికొనుటకు నగ్నిప్రవేశము మున్నగు పరీక్షలను బడయవలసి యుండును." అని యతనితో ననుచుండఁగనే యాబ్రాహ్మణుని పత్ని మరల "రాజేంద్రా! అభిచార క్రియా నిపుణులు దివ్య శక్తి మహిమను గూడ సులువుగ స్తంభింపఁ జేయఁ గల్గుదురు. కాన నీతని యెడ నట్టి పరీక్షయు వ్యర్థ మగును" అని నుడివెను. నరపతి యందులకుఁ బరిమ్లాన వదనుఁ డగుచు నట్లయినఁ జేయునదేమి? అపరాధి యని నిర్ణయింపఁ బడకున్న నెవ్వనిం గాని దండించు టెట్లు? దోషి యయ్యును వధాతిరిక్త మైన శిక్షకే బ్రాహ్మణుఁ డర్హుఁ డగుచుండ నజ్ఞాతాపరాధుఁడగు నీబాడబుని విషయమున ధర్మాధికారమును నిర్వహింపఁ దగు నేను మాత్ర మేమి సేయఁగలుగుదును?"

కం॥ అపరాధ నిశ్చయము ధ
ర్మ పథంబునఁ దన కెఱుంగ రాని తఱి నృపుం
డపరాధి యనుచు దండము
గృప లేక విధింపఁ దగ దొకించుక యైనన్.

అని మాఱు పల్కి యూరకుండెను. అంత నాద్విజపత్ని మరలఁ జంద్రాపీడు నుద్దేశించి "ఆర్యా! నే నిప్పటికి నాల్గు దినములనుండి యాహార పానీయముల వర్జించి యుంటిని. భర్తృహంతకుఁ బ్రతిక్రియ సేయఁగోరి పతిమార్గము ననుగమింపక యుంటిని. శంకాస్పదుఁ డగు నితఁ డిప్పుడు దండ్యుఁడు గానిచో నిరాహార దీక్షతోడనే యసువులను బాయుదును." అని యత్యంత మగు నావేగముతోఁ బల్కి మిన్నకుండెను.

చంద్రాపీడుఁడును అవార్య మగు నావిప్రపత్ని నిరాహార దీక్షాయత్నమును వారింప నెట్టి మార్గము దోఁచనివాఁడై తుదకుఁ దానును త్రిభువనస్వామి పాదముల నాశ్రయించి ప్రాయోపవేశమును బూనెను. అట్లతఁడు మూఁడు దినములు రేయిం బవళ్ళును నాలయమునం దుపవసించి ధర్మ నిర్ణయ నిరతుఁడై యుండ మూఁడవనాటి ప్రదోష సమయమ్మునం జంద్రాపీడునకుఁ గలయం దాగరుడ వాహనుఁడు గోచరించి యిట్లు పల్కెను. "రాజా! సత్యాన్వేషణమునకై కలియుగమునం దిట్టి తీవ్ర నియమమ్ముం బూనుట శ్రేయస్కరము గాదు. నిశీథమూనం దర్కబింబము నంబరతలమునం దవతరింపఁ జేయ నెవనికి శక్యము?

కం॥ కలియుగమున నిరశన దీ
క్షలు కార్యంబులకు సాధకంబు లగునె? సూ
ర్య లలిత కాంతులు నిశీధ
ములఁ బొలయునె ధర్మదీక్ష ముమ్మర మైనన్?

అయినను నీదీక్షాశక్తికి మెచ్చితిని. కనుక నొక్క మాఱు మాత్రము నీకార్యము సాగించె దను, ఈయాలయపు ముంగిట వరిపిండిని బాగుగఁ జల్లింపుము. ఈ ప్రదేశమునఁ బరీక్ష్యుఁడగు నా బ్రాహ్మణుని మువ్మాఱు ప్రదక్షిణము సేయునట్లు నియోగింపుము. అప్పు డాద్విజుని పాదముద్ర ననుస రించిన బ్రహ్మహత్యాపాదముద్ర యొకటి వెనుకఁ గాన వచ్చినచో నతఁడు బ్రహ్మఘ్నుఁడని నిర్ణయిం పుము. పిమ్మట నాదుష్టద్విజునకుఁ దగిన శిక్ష విధింపుము. ఈ విధానము రాత్రియందే కావింపఁదగును. కారణ మేమన? పగటియందు భాస్వంతుఁడు సర్వపాపములను హరించుచుండును.'' అని 'త్రిభువన స్వామి' తనకుఁ గలయందు సాక్షాత్కరించి బోధించిన తెఱంగునఁ జంద్రాపీడుఁ డాద్విజపత్ని యను మానమునకు భాజనమై యున్న బ్రాహ్మణుని రావించి త్రిభువనస్వామి యాలయమున యథోక్తముగఁ బరీక్షించి బ్రహ్మహత్యాపాప మొనర్చిన వాఁడతండే యని నిశ్చయించెను. అతఁడు ద్విజన్ముఁ డౌటం జేసి వధేతరమైన దండమున నతని శిక్షించెను.

భూదేవేంద్రుఁడగు నాచంద్రాపీడుఁ డట్లు వ్రతదీక్షా విశేషమున నత్య మెఱింగి తనపతిని దనకు దూరము చేసినట్టి ద్రోహిని దగినట్లు శిక్షించుటచే నాబ్రాహ్మణకుటుంబిని రాజునకు దీవన ల నొసంగి "పుడమిఱేఁడా! మహీవలయము నేలిన నరపాలురలోఁ దొల్లి కార్తవీర్యుఁ డొక్కఁడును, ఇప్పుడు నీవును గూఢములయిన ద్రోహచర్యలను బయల్పఱచి ద్రోహులకుఁ దగిన 'శాస్తి' కావింపఁ గల్గితిరి. ధర్మరక్షా బద్ధ కంకణుఁడ వయిన నీవు వసుధ నేలుచుండ వైరస్నేహముల పాదము నాంచ కుండుటెట్లు?'' అని వచించి యచ్చోటు వాసి పోయెను.

చంద్రాపీడ మహీకాంతుఁ డీరీతిఁ దాను నేల నేలిన కాలము కొంచెపాటిదైనను కృతయుగ స్పృహణీయము లగు తన ధర్మ్య వృత్తాంతములచే నాశాచక్రమును బూరింపఁ గల్గెను. నిరంతరము జలజాసనపు సంసర్గము గల విధాత బుద్ధియందు నిరాటంకముగ నిబిడమైన జడత్వ మడుగిడినదేమో! యని తోచుచున్నది. లేకున్నచో నలువ మాహేంద్ర కార్ముకమునువలె నలఁతి కాలమునంద యమ్మహీ జానిని విభక్త వర్ణ శోభునిగ మెఱపించి మఱుఁగు పఱచు టెట్లుపొసఁగును?

కం॥ అక్కజముగాఁగ నలువకు
నెక్కటి జలజపు నివాస మేర్పడుటఁ గదా!
మొక్కలపు బుద్ధి జాడ్యం
బక్కట యబ్జజుని కొను నయ్యయి వేళన్.

కం॥ ప్రవిభక్త వర్ణ శోభుం
డవు నట్టి ధరాధినాథుఁ డల శక్రధను
స్సువలెఁ ద్రుటిలో నశింపం
గ, విధాత యొనర్చు; సృష్టికళ యిట్టిదొకో?

శిక్షితుఁడై పగఁ గొని యున్న యాద్విజన్ముని 'తారాపీడుఁడు' తనయన్న యగు చంద్రాపీడు పకు నభిచార ప్రయోగము సేయ నటులఁ బురికొల్పి తన్మూలమున నగ్రజుని సమయింపఁ జేసెను. అది మొదలుగఁ గాశ్మీరమున రాజ్యకాంక్షితు లగు రాజ కుటుంబములవారు; అభిచార ప్రయోగాది దుష్టక్రియలచే గురుజనమున కొప్పమి గూర్పఁ గడంగుచుండిరి. జగతియందు దుర్జనుల దుష్కర్మ సంభవము లగు తుచ్ఛ సుఖముల ననుభవించుటకై గుణోన్నతుల కెగ్గు సేయుచుందురు. మొగలి పొదలం జీరి సురుమాడు నొంటె పిల్లలకుఁ గంటకములు గ్రుచ్చుకొనుటకంటె వేఱొక ఫలము గల్గునా?

గీ॥ దుష్ట భోగంబులను గోరి దురిత మతులు
పరుల వేధించి నిరయానఁ బొరలుచుంద్రు.
కరభకంబులు మొగళులఁ గలఁచి కలఁచి
కంటకంబులచే నెంతొ గాసి పడవె?

అభిచార ప్రయోక్త యగు నాబ్రాహ్మణబ్రువుఁడు తనకుఁ జిక్కి యున్న ప్పటికిని నుదార మూర్తియై ముమూర్షు నగుచు నున్న యాకాశ్యపీనాథుఁడు "ఇతరులచేఁ బ్రేరితుఁడై యపకృతి యొన ర్చిన యీపరాకునియెడ నంత తప్పేమున్నది?" అని వచింపుచు నాతని క్షమించి విడిచి పుచ్చెను. అవసానకాలమందును జంద్రాపీడుఁ డిట్టి మహౌదార్యమును దితిక్షను నెనసి యుండుట దలంచినచో నెట్టి వానకేని మేను గగుర్పాటు నొందకుండునా?

నలువ కృతయుగ క్ష్మాపాలుర పంక్తి నడుమ నుంపఁ దగ్గ చంద్రాపీడుని మఱచి పోవుటం జేసి యిప్పటి కలినృపావళి యందొక 'కాకపదము' నుంచి యతనిం జేర్పవలసిన ట్లయ్యెను. చంద్రా పీడుఁడు ఎనిమిది యబ్దంబులపై నెనిమిది నెలలు మాత్రము నిస్తులముగ నిలాతలము నేలి పుడమియం దలి సజ్జనుల నెమ్మనంబుల నెడఁబాయకయె యూర్ధ్వలోకమునం బ్రవేశించెను.

## తారాపీడుఁడు

పిమ్మట, 'తారాపీడుఁడు' భ్రాతృద్రోహ మనెడు నిశితాస్త్రము బాసటగాఁ గల తనకడిమిచే లోకమునకు భయావహుఁడై. రాజాసన మధిష్ఠించి యుచ్చండముగ క్షమామండలము నేల దొడఁగెను. తారాపీడుఁడు దనప్రతాపశిఖువునకుఁ బట్టు పూర్ణపాత్ర విధానమునకుఁ బ్రతిభటము గాకుండుటకై శాత్ర వుల యుత్తమాంగముల ఛేదించి వారి కబంధములచే నత్తరుణమున వింత యగు నాట్య మాడించెను అత్యంత దుష్టచేతనుఁ డైన తారాపీడుని రాజ్యలక్ష్మి అంతటను నప్రతిహతముగ వెల్గొందుచున్నను నయ్యది శ్మశానమునందలి యగ్ని జ్వాలవలెఁ బ్రజల కుద్వేగ జనక మగుచుండెను.

దేవ ద్వేషి యగు నప్పార్థివుఁడు భూదేవులు మంత్ర ప్రభావముచే దేవతల మహిమ నాక ర్షించు వారగుటంజేసి భూసురులను దండింపఁ దయ్యెను. భ్రాతృ ద్రోహ కారణమునఁ దూర్ణముగ క్షీణించెడు సుకృతశేషము గల యీతారాపీడుఁడు వసుమతి నీతిరున నాల్గువత్సరములు నిరువది నాల్గు దినములును మాత్రమే పుడమి నేలఁగల్గెను. చివరకు కొందఱు ద్విజన్ములు గూఢముగ నీతనిపై నభి

చారముఁ బ్రయోగింప నాయుశ్శేష ప్రమాణము దీరినవాఁడై తారాపీడుఁ దన్నువలె నస్తమించెను. కాని యగ్రజునివలె సుగతి నొందఁజాలక పోయెను.

క॥ దేవతల మహిమ మంత్రో
ద్భావిత మమ్మంత్రములను బాఱుల కోపముల్.
కావున దేవ విరోధులు
భావింతురు భూసురులను బగతుర మాడ్కిన్,

లోకమున నౌరుల కపకార మొనరింపఁ గోరి యెవ్వఁ డేయుపాయమును గన్పెట్టుచున్నాడో! తుద కతని కద్దాననే తప్పక ముప్పు వాటిల్లును, కంవోయికిం గ్రుడ్డితనము గల్పించు ధూమ స్తోమము వహ్నివలనఁ గలుగుచున్నది. అయ్యది క్రమముగ నంబుద రూపముం దాల్చి చివరకు దనసలిల సేకముచే జ్వలనుని రూపు మాపుచున్నది గదా!

చం॥ పరులకు హాని సేయఁగ ను
పాయముఁ బన్నెడు వాఁడు దాననే
పొరయు ననర్థ మెట్లనిన
భూరితరాంధ్యకరంబు ధూమమున్
బరఁగ సృజించు వహ్ని, అది
పాపురె! యంబుద మాలయై నిజం
బులముచుఁ గ్రక్కి నగ్ని నపు
యుంగవ రూపమె మాసి పోవఁగన్.

## లలితాదిత్యుఁడు

అనంతరము విఖ్యాత చరిత్రుఁడైన 'లలితాదిత్యుఁడు' కాశ్మీర కాశ్యపికి నౌదయుండై భూవలయము నంతను దనవిక్రమ స్ఫూర్తిచే వశపఱచుకొని సార్వభౌముఁ డనెడి విఖ్యాతిఁ బడసెను. ఆకాలమునఁ బరిమిత భూభాగముల నేలు రాజులను మాత్రమే సృజించుట కలవాటు పడియుండిన విధాతబుద్ధి లలితాదిత్యుని సృష్టియెడ బొరపాటు పడియుండునేమో! లేకున్న నాకస్మికముగ నిట్టి సార్వభౌముని సృష్టికి విధాత యత్నించియుండునా? లలితాదిత్యుఁడు పటవాసతుల్యములగు తన ప్రతాపాంశుచ్ఛటలచే జంబూ ద్వీపమనెడి ద్విపేంద్రమునకు నూతనమగు నాభరణమును గల్పించెను. అతఁడు తన విజయ వార్తలందు నంజలిమోడ్పులతో విధేయులగు రాజుల యెడఁ దనయభినివేశమును సుజ్జగించి వారి యెడఁ బ్రసన్నతఁ జూపుచుండెడివాఁడు.

ఆ సార్వభౌముని రణభేరీ నినాదము వలన శత్రునగరము నందలి ప్రజలు గలఁత నొంది పటాపంచలుగఁ బరుగు వాఱుచుండ వారిసతుల కాభయంకరారావము వినుటవలన గర్భపాతములు గలుగుచుండెనో! యన్నట్లుండెను. లలితాదిత్యుని ప్రతాపానలమున వైరిభూపతులు శలభములవలె నసంగతులుగాఁగా వారిపత్నులు తిలకవిహీనములై బాష్పజల పూరిత

ములైన నెమ్మోములతోఁగూడి తమ పతులకు నివాపాంజలుల నొసంగినవారైరి. ఇట్టి వైరిజిగీషతో భూమండలము నంతను భాస్కరునివలెఁ బ్రదక్షిణ మొనర్చుటతోడ నాచక్రవర్తి తన వయస్సును జాలవఱకుఁ గడపిన వాఁడయ్యెను.

మఱియు నమ్మహారాజు గంగాయమునల మధ్యభాగమగు నంతర్వేదియందు నిజప్రతాపానలపుసాన్నిధ్యమునఁ బూర్వదిశాసంబంధమైన కరమును గ్రహించి స్వీయమగు కీర్తి యనెడు నుష్ణీషమును ధరించినవాఁడై కరము విరాజిల్లెను.

తొల్లి గాధినగరమైన 'కన్యాకుబ్జము' నందు మాతరిశ్వుఁడు కన్యలకుఁ గుబ్జత్వమును గలుగఁ జేసెను. కాని లలితాదిత్యుఁడు తనకాలమున నిజప్రతాపానలభీతులైన యచ్చటి పురుషులకుఁ గుబ్జభావము నుబ్రాపింపఁజేసి యత్యంతము ప్రశంసనీయుఁడయ్యెను,

మఱియు నీలలితాదిత్యనరపతి 'యశోవర్మ' యను గిరీంద్రము నుండి వెలువడిన మహావాహిని నొక్క క్షణములో నింకఁజేసి ప్రతాపాదిత్యుఁడని ప్రఖ్యాతిఁ బడయఁగల్గెను. లలితాదిత్యుని కెదురునిలిచి చెడినరాజు లెందఱోయుండిరి. కాన్యకుబ్జేశ్వరుఁడట్లుగాక యాసార్వభౌమునకు వినమ్రుఁడై యుపాయన బాహుళ్యము సర్పించి తన యుపాయ చాతుర్యమున రాజ్యప్రతిష్ఠకు భంగములేకుండ నడచుకొనెను. లలితాదిత్యునకు సహాయులై మెలఁగిన వారందఱు నతనికంటె నభిమానధనులై రాణకెక్కిరి. చందనాగతమగు మందమారుతము వసంతునికంటెను సౌరభ భరితమగుట లేదా!

లలితాదిత్యునితోడ యశోవర్మకు సంధి యేర్పాటు జరిగినప్పుడు రాజ్యతంత్రానుసారియగు నొడంబడిక లిఖితరూపమునఁ దయారుచేయఁబడి యుండ నందిరుపురకు సమాన ప్రతిపత్తియేగాని గౌరవాధిక్యము తనతేనికి నొసఁగఁబడలేదని యెంచి యక్కాలమున సంధి విగ్రహముల నడిపించు సచివుఁడై యుండిన 'మిత్రశర్మ' యను నతఁడు యశోవర్మ లలితాదిత్యులకు రాయబారము కుదురనీకుండఁ జేసెను.

పిమ్మట యశోవర్మ లలితాదిత్యులకు ఘోరమగు పోరు జరిగెను. అట్లా సమర మెడతెగక దీర్ఘకాలాను బంధి యగుచుండుటచేఁ జమూపతులకు సయితము లోలోన నశాంతి యేర్పడెను. మిత్రశర్మయెడఁ బెక్కండ్రకు నసూయ గలిగినను లలితాదిత్యుఁడు మాత్రము మిత్రశర్మయొక్క యౌచిత్యాపేక్షియయిన యుదాత్తాశయమును మెచ్చుకొనుచు నతనికిఁ బ్రీతితోనైదు మహాబిరుదముల నొసంగి బహూకరించి తుద కారణమునందు యశోవర్మయొక్క యశోవర్మమును విదారించి దీపిత ప్రతాపుఁడై విఖ్యాతిఁగాంచెను. అది మొదలుకొని యాసార్వభౌముఁడు 'మహాప్రతీహారపీడ' 'మహాసంధివిగ్రహము' 'మహాశ్వశాలయు' 'మహాభాండాగారమును' 'మహాసాధనభాగమును' అను నామములతో విఖ్యాతి నొందిన యైదు కర్మస్థానములను బ్రత్యేకముగఁ దానేర్పఱచి వానికి 'శాహి' మున్నగు నరపతుల నధ్యక్షులుగ నియోగించెను. ఈ కర్మస్థానములైదును బ్రాచీనములైన పదునెనిమిది కర్మస్థానముల కంటె భిన్నములై వాని కత్యంత మనుకూలపడునవై యున్నవి.

మహాకవులగు 'వాక్పతిరాజు' 'భవభూతి' మున్నగువారిచేఁ గొలువఁబడిన యశోవర్మ చివరకు లలితాదిత్యున కోడిపోయి యతని సుగుణములను వినుతించు వందిసాదృశ్యమును బడసెను. యమునాతీరమునుండి 'కాలికా' స్రవంతి యొడ్డువఱకుఁ గల కన్యాకుబ్జోర్వి యంతయు లలితాదిత్యునకు విజగృహ ప్రాంగణము వంటి దయ్యె ననిన వేఱ నితరమును జెప్పవలయునా?

అంత జాహ్నవి హిమాద్రినివలె లలితాదిత్యుని వాహిని యశోవర్మ నుల్లంఘించి సుఖముగఁ బూర్వసాగరునిఁ జేరెను. వారి నడుమఁ గళింగదేశమును గడచివచ్చునప్పుడు సేనయందలి మాతంగములు తమ జన్మస్థానమైన యా కళింగదేశమును సాదరముగ సారెకు నవలోకించుచుండ వాని నాదేశము నుండి మరల్చుటకు మావటివాండ్రు సాసూయముగ నతికష్టముగఁ బ్రయత్నింప వలసి వచ్చెను. తిర్యగ్జంతువుల కయినను స్వదేశాభిమానముండుట ప్రశంసనీయముగదా!

సిరియావాసమును గొల్లగొని పోవుచున్న యాసార్వభౌముని దంతావళములంగాంచి వాని తోడి నెయ్యమును గోరియో! యనఁ గౌడదేశమునందలి యేనుఁగులన్నియు వాని దారిఁబట్టిపోయెను. ఇట్లు లలితాదిత్యుని సేనానివహము సాగరముంజేరుటయు నందు సమర మత్తేభములు తమ హస్తములు సాచి వీచీకచములం బట్టుకొనుటయుంజూడ నాసార్వభౌముని సైనికులు పూర్వసాగరుని బందీకృతునిఁ గావించుచున్నట్లు గాన్పించెను.

అంతట వనమాలా శ్యామలమైన యక్కడలి వేలాతలము నాశ్రయించి లలితాదిత్యుఁడు యామ్యదిశకు ససైన్యుఁడై బయలుదేరుచుండ నతని శాత్రవులు తత్కృపాణధార నాశ్రయించి శమనుని రాజధానికేపోఁ గ్గిరి. అట్లతఁడు పోయిపోయి 'కర్ణాటముం' జేరఁగనే కర్ణాట ప్రజలు తమ జూటములయందలి పసిండి మొగిలి రేకులను దీసివైచి లలితాదిత్యుని ప్రతాపమును నవతంసమునుగా ధరించిరి.

ఆకాలమున 'రట్టా' యను పేరు గల కర్ణాటాంగన దక్షిణా పథమునకుఁ బాలయిత్రియై సమధికైశ్వర్యముతోడఁ దులఁదూఁగుచుండెను. ఆదేవి దుర్గాదేవివలె మితిలేని ప్రభావమునఁ దేజరిల్లుచు వింధ్యాచల మార్గముల నన్నిటిని నిహతకంటకములనుగా నొనర్చిన మహారాజ్ఞి. అట్టి దొడ్డరాణియు లలితాదిత్య సార్వభౌముని యడుగుఁదమ్ముల యందలి నఖముకుర మండలమునందుఁ దనమూర్తి సంక్రాంతమగునట్లు వీక్షించుచుఁ బ్రీతితో నతనికిఁ బ్రణత యయ్యెను.

పిమ్మట లలితాదిత్యుని యోధులు కావేరీతీర పరిసరముం జేరి యచ్చటి తాలీవన తలము నందు విడిదిఁ జేసి నారికేళ మద్యమును దనివిదీరఁ గ్రోలి శీతల వారి శీకరములను దమపైఁ జల్లుచు వీచుచున్న గాడ్పు కొమరుని బాల్యక్రీడలను మెచ్చుకొనుచుఁ దమ యలసటను దీర్చుకొనిరి. అప్పుడు అచ్చోటున కనతి దూరమున నున్న 'చందనాద్రి' సార్వభౌముని విజయయాత్ర విని భయపడుటం జేసి శ్రీ ఖండ ద్రుమములనెడు తన దోర్దండ మండలినుండి యహివ్యాజమున మండలాగ్రములను దిగువకుఁదానెఱుఁగకయె విడుచుచున్నదివోలెఁ గన్పట్టెను.

తరువాత నాకాశ్మీర భూజాని దక్షిణ సాగరమును జేరి యయ్యది తన రాకపోకలకొక కుల్యవంటిది యగుచుండ నచ్చటి దీవులందు సోపాన శిలా విన్యాస లీలను దలఁపించుచు నిరాటంకముగఁ జరించెను. ఆ మున్నీటి కెరటములమ్రోఁత తన విజయ మంగళ ధ్వానముగ నేర్పడుచుండ జిగీషువులకు నాయకుఁడగు నాచక్రవర్తి యటనుండి పడమటి దిక్కునకుం జేరఁ బయనమై పోక క్రమ్మఁకుల పోఁడిమిచే వన్నెగని యున్న కొంకణ రాష్ట్రముల నేఁడింటిని భాస్కరుఁడు సప్తాశ్వములను వలెఁ దన ప్రతాపమునఁ దపింపఁజేయుచు నత్యంతము ప్రఖ్యాతి వడసెను.

పిమ్మట నతఁడు పశ్చిమాంభోనిధి సమీపింప మారుతముచే విడిపోయెడి యందలి తరంగముల నుండి విశదమగుచున్న 'ద్వారక' లలితాదిత్యుని సైన్యమునకుఁ దనయందుఁ బ్రవేశ మొసఁగ నుత్సాహపడుచున్నదివోలెఁ బొడకట్టెను. అప్పుడు లలితాదిత్యుని చతురంగ బలముచే క్షుణ్ణమై వింధ్యగిరి భూమి నుండి గైరికధాతు పరాగములేగి యాకస మలముకొని యుండుటంజూడఁ బరాక్రమణ పరాభవము వలనఁ గలిగిన కినుకచే నాగేంద్రము జేవురువాఱిన తన మేనుఁబెంచి యెదుర నిల్చెనో యన్నట్లుండెను.

అంత లలితాదిత్యుని సేన క్రమముగ 'అవంతీ' పురినిఁ బ్రవేశించెను. అచ్చట సుప్రసిద్ధి నొందియున్న 'మహాకాళేశ్వరుని' జటాజూటమునందు వెలుఁగుచుండు రేవెలుఁగు వెన్నెలచే మాత్ర మతని సైన్యమునందలి మదపుటేనుఁగుల దంతములు బీఁటలు వారవలసి వచ్చెను.

ఇట్లా చక్రవర్తి పశ్చిమదేశమునందలి రాజమండలి తన ప్రతాపభానుని యెదుర నిల్వనేరక "దాసోహమ్మ"నుట నెఱింగి తరువాత దారులులేని విస్తీర్ణమయిన యుత్తరాపథమున కభిముఖుఁడై ప్రయాణము సాగించెను. కొండల తెక్కల నఱుక నుద్యోగించిన వేల్పుఱేనికిఁ గులపర్వతముల తోడఁ బోరు జరిగినట్లు లలితాదిత్యుని కట్టి తఱినడుగడుగున కుక్క తునకలవంటి రాచబంటులతోఁ గడిఁదియగు కయ్యము చేయవలసి నట్లయ్యెను.

తొలుత లలితాదిత్యుని చమూసమూహము కాంభోజదేశము నాక్రమింపఁ బ్రఖ్యాతి వడసిన యచ్చటి గుఱ్ఱపు దళమంతయు దిక్కులేనిదివలె దిక్కులఁబట్టి పోయెను. అట్టి తరుణమున నచ్చటి వాజిశాలలయందు దట్టముగఁ గ్రమ్మియున్న యిరుల కైతవమునఁ గారెనుములు నిండియుండెనో! యన్నట్లుండెను. అత్తఱి 'తుఖర' జాతివారు తమ సాహిణుల విడిచిపుచ్చి "బ్రతుకు జీవుఁడా" యనుచుఁ గొండకొమ్ములం జేరుచు నచ్చటి తురంగవదనులం గాంచుటంజేసి మరలఁ దమవారు వంబులఁ జూతమన్న యుత్కంఠ నొందకపోయిరి.

లలితాదిత్యుఁడా తరుణమున 'ముమ్ముని' యను నతనిని దారుణమగు పోరునందు ముమ్మాఱోడించి తాను గెలుపొందినట్లు నిశ్చయించి సంతసించెను, వీరపురుషులు పగతుర నొక్కమాఱు గెల్చుటతోఁ దనివినొందరు. అట్టి గెలుపు 'ఘుణాక్షర' తుల్యమని వారు తలంతురు.

కం॥ గుణముల విరు ముమ్మాఱులు
గణించి నిర్ణయము సేఁత కర్జంబగు; నా
గుణములు సకృద్భవంబులు
ఘుణాక్షర సమంబులనుచుఁ గోవిదుఁడెంచున్.

ప్రతిష్ఠా చిహ్నమును నెలకొల్పని నగరముకాని, యూరుగాని, సాగరముగాని దీవిగాని లేదని ముక్తకంఠముగఁ జెప్పుటయే యొప్పిద మగును. అభిమాన ధనుఁడైన లలితాదిత్యుఁ డొక్కొకచోఁ దానొనర్చిన యద్భుత కార్యముల కనుగుణముగను నొక్కొకచో సమయానుసారిగను నొప్పారెడు పెక్కువిధముల ప్రతిష్ఠాంకములను నెలకొల్పిన వీరసింహము.

మఱియు నతఁడు దిగ్విజయము సేయ నిర్ణయించిన తావున 'సునిశ్చిత' మనునగరమును కేశవస్వామి ప్రతిష్ఠతోఁ గూడిన 'దర్పితపురమును' దనగరువంపుఁ బెంపు మెఱయునట్లు నిర్మింపఁ జేసెను. అతఁడు ఫలములను గైకొన్న తావున 'ఫలపురమును' పర్ణములను స్వీకరించినచోట 'పర్ణోత్సము'ను, క్రీడించిన స్థలమునఁ 'గ్రీడారామవిహారమును' నిర్మింపఁజేసెను.

మఱియొక విచిత్ర మేమన? అమ్మానవేంద్రుఁడు స్త్రీరాజ్యమునందు (పాండ్యరాజ్యమునందు) నృసింహమూర్తినిఁ బ్రతిష్ఠింప నెంచి నృసింహవిగ్రహమును పైకిని దిగువకును నాకర్షించునట్టి యనర్ఘము లగు రెండు రత్నములను (అయస్కాంతములవంటివి) ఊర్ధ్వాధోభాగములం దుంచి యావిగ్రహము నితర మగు నాలంబన మేదియు లేకుండ నట్లే నిలిచియుండున ట్లొనరించుట సంస్తవనీయమైన విషయ మని గణింపఁదగును. లలితాదిత్యుఁడు దిగ్విజయార్థము దేశాంతరములకుఁ బోయినపు డతని శిల్పి యొకఁడు రాజానుమతి లేకయే తానొక నగరము నతనిపేరఁ బరగు నట్లు నిర్మించి యమ్మనుజేశ్వరుని కిన్కకుఁ బాత్రుఁ డయ్యెను. ఫలమనుభవించెను.

తనపేరఁ బరఁగిన యాలలితపురము నెడ నత్యంతాభిమానము గలవాఁడై యాపుడమిఱేఁ డాదిత్యుని కైంకర్యమునకై కాన్యకుబ్జోర్వి నంతను దత్త మొనర్చెను. పిమ్మట నతఁడు 'హుష్కపురమునందు ముక్తస్వామికిఁ బ్రతిష్ఠ గావించి యందు స్తూప యుక్త మగు నొక గొప్ప విహారమును గట్టించెను. లలితాదిత్యుఁడు దిగ్విజయార్థము బయలుదేరినపుడు కోటిపరిమిత మగు ధనమును మాత్రమే గైకొని పోయెను. విజయనినాదముతోడ నిజపురి కరుదేరఁగనే శుద్ధి బడయుటకై భూతేశునకుఁ బదునొకఁడు కోట్ల ధనరాశి నుపాయముగ నొసంగిన వాఁడై యచ్చోటనే యవ్వసుమతీశ్వరుఁడు జ్యేష్ఠరుద్రునకుఁ జిత్రచిత్రములగు శిలాఫలకములతోడ నలరారు నాలయమును గట్టించి తదారాధనమునకై పెక్కుగ్రామముల నర్పించెను. చక్రధరమునందు వితస్తానదియందలి సలిలమును జలయంత్రములచే మరలించి పెక్కుగ్రామములకు రుచ్య మగు వారిపూరమును బ్రసాదించిన మహాత్ముఁ డీమహీమహేంద్రుఁడు

నెఱదాత యగు నీసార్వభౌముఁడు గట్టించిన మార్తాండాలయ మత్యంత విశాలమై చూపఱ కాశ్చర్యకారి యగుచుండును. మహాశిలావినిర్మితమైన తత్ప్రాకారమందు ద్రాక్షాగుళుచ్ఛములచే నిండియుండు విశాల నగర మొకటి సొబగు మీఱి యుండుట గొండాడఁ దగ్గ విషయము గదా!

'లోకపుణ్యము' అను ప్రదేశమునఁ బ్రతిష్ఠింపఁబడిన వెన్నునకుఁ గైంకర్యముఁ జక్కఁగా జరుపుటకై యనేక గ్రామముల నుపాయనీకరించి యచ్చోటనే నానావిధము లగు నుపకరణంబులతో విరాజిల్లు పట్టణం బొక్కటిఁ గట్టించెను. తఱువాతఁ బరిహాసశీలుఁడగు నాభూలోక వాస్తవుఁడు వాసవా

వాసమును బరిహసించుచుండెనో యనునట్టుల 'పరిహాసపురము' అను పేరఁ బరఁగుచున్నట్లు నిర్మింపఁ జేసిన చతురమతి యయ్యెను. ఆపరిహాసపురమునందుఁ బ్రతిష్ఠింపఁబడిన 'పరిహాసకేశవ స్వామి' విగ్రహము రజతనిర్మితంబై యుండుటవలన రత్నాకరమునందు శయనించెడు నారాయణమూర్తి ముక్తా మణి కాంతి పూరముచే ననుస్యూతంబై యుండెనేమో యని యనిపించుచుండును.

మఱియు నచ్చటనె 'ముక్తాకేశవుఁడు' అను నామమున విష్ణువునకు వేఱొక ప్రతిష్ఠ చేయఁ బడి యుండెను. అయ్యది కాంచనమయ మగుటవలన నాభికమలమునందలి కింజల్కపరాగముచే నద్భుతకాంతి పూరము వంటిదైన ప్రకాశము నలరుచుండును. ఆతఁడు నిర్మించిన ఘన సువర్ణమయమగు మహా వరాహస్వామిని దిలకించినచో రసాతలమునుండి భూమిని బైకెత్తి యవతరించిన వేడివెలుంగు చందమును దలపించుచుండును. అమ్మహీపతి నెలకొల్పిన గోవర్ధనస్వామి వెండివిగ్రహము నీలమేఘ శ్యామాంగుఁడైన వెన్నుండు గొల్లపల్లెయందుఁ బెరుగుచుండి పొగడల నెడలేక జుట్టియుండుటఁ జేసి పాండుర శరీరుఁ డయ్యెనని చెప్పకచెప్పుచుండును.

మఱియు నాచక్రవర్తి విష్ణువునెదుర నేఁబది నాల్గుచేతుల నిడివిగల బ్రహ్మాండమైన యొక శిలామయ ధ్వజమును నెలకొల్పి దానియగ్రభాగమున గరుడుని మూర్తిభవింపఁజేసి సకల వస్తు సంపన్నంబైన 'రాజవిహారము' అను నొక గొప్ప విహారమును గట్టించి యందొక చతుశ్శాలాభవనమును, పెద్దపెద్ద చైత్యములను నత్యున్నత మైన బుద్ధవిగ్రహమును సయితము స్థాపింపఁజేసి రజోగుణ వర్జితుఁడైన మహావీరుఁడని పేర్వడసెను.

'శ్రీముక్తాకేశవస్వామి' విగ్రహము ఎనుబది నాల్గు వేల తులముల యెత్తుగల యపరంజి బంగారుచే నిర్మింపఁబడి యుండెను. పరిహాస కేశవుని మూర్తి యెనుబది నాల్గువేల పలముల యెత్తు గల వెండిచే నిర్మింపఁబడినది. ఆసార్వభౌముఁడు నెలకొల్పిన మహాబుద్ధ విగ్రహ మంబరచుంబి యగు చుండును. అయ్యది యెనుబది నాల్గువేల ప్రస్థముల తూనిక గల యిత్తడిచే నిర్మింపఁబడినట్టి మహా విగ్రహము. మఱియు నతఁడు గట్టించిన చతుశ్శాలాభవనమునకుఁ జైత్యమునకును దానవత్సరిత మగు ధనమును వెచ్చించి యుండుటచే నాయైదువిధములగు నిర్మాణములయెడ నతనికి సమదృష్టి యున్నట్లు చెప్పుట సముచితమై యున్నది.

ఇంతయేల? ఆయా దేవాలయములందుఁ బ్రతిష్ఠింపఁబడిన ముఖ్యదేవతలకుఁ బార్శ్వ భాగములందుఁ గొన్నితావుల వెండితోడను గొన్నిచోట్ల బంగరుతోడను నితరదేవతల విగ్రహములను సయితము ప్రతిష్ఠింపఁ జేసిన వదాన్యావతంస మని చెప్పఁదగిన లలితాదిత్యుని సుకృతమే సుకృత మనవలయును. ఆ సార్వభౌముఁడు తాఁ బ్రతిష్ఠించిన దేవతలకు సక్రమ సపర్య జరిపించుటకై యొసం గిన గ్రామములు రత్నములు నితరపరికరములును గణించిన నెంత విత్త మగునో వచింప నేరికిఁ దరమగును? నిజముగ నతఁ డాధనపతి నధఃకరించిన వాఁడనుట యత్యుక్తి గాఁజాలదు.

ఇఁక నాలలితాదిత్యుని యంతిపురవుటంగనలు నమాత్యులును సేవకులును నితరులగు రాజు లును గాశ్మీరమునందు దటనట నొనర్చినట్టి నానావిధము లయిన ప్రతిష్ఠావిధానములు భువనాశ్చర్య విధాయకములై వెలయుచుండు టప్పుడమితేని భాగధేయమహిమ గాక కారణాంతర ముండఁబోదు.

లలితాదిత్యుని పట్టమహిషి 'కమలవతి.' ఆదేవి 'కమలాట్టము' నిర్మింపఁజేసి అందు కమలాకేశవుని మహామూర్తిని నెలకొల్పెను. ఇఁక లలితాదిత్యుని యమాత్యుఁడు 'మిత్రశర్మ' యనునతఁడును 'మిత్రేశ్వరుఁడు' అను నామమున నీశ్వరునిఁ బ్రతిష్ఠించెను. లాటదేశపురాజు 'కయ్యా' అభిధానుఁడు 'శ్రీకయ్యస్వామి' ప్రతిష్ఠ గావించి రమ్యతమమగు నొక విహారమును నేర్పఱచి యద్దాని నాత్మీయ నామాంకితముగ వెలయించెను. బుద్ధదేవునకు సాటి యనఁదగిన 'సర్వజ్ఞమిత్రుఁడు' అను బౌద్ధభిక్షువు ఈవిహారమునందే వసించి ప్రఖ్యాతిం గాంచెను.

మఱియు 'తుఃఖారచంకుణుఁడు' 'చంకుణ' విహారమును నిర్మింపఁజేసిన వాఁడై లలితాదిత్యుని చిత్తోన్నతికి దీటయిన యొక స్తూపమును బంగరు బౌద్ధవిగ్రహమును నెలకొల్పి యుండెను.

లలితాదిత్యుని పత్ని 'ఈశానదేవి' యొక కోనేటిను త్రవ్వించెను. సుధారసమువలె రుచ్యమగు నందలి పానీయము రోగులకు దివ్యౌషధము వంటిది. చక్రవర్తియొక్క మఱియొక ప్రేయసి 'చక్రమర్దిక' యనునామె సహస్ర సంఖ్యాకము లగు వాసగృహములతోడ నొప్పారు చక్రపురమును' నిర్మింపఁ జేసెను.

అమ్మానవేంద్రుని కాచార్యుఁడైన 'భప్పటుండు' భప్పటేశ్వరుని ప్రతిష్ఠ నొనరింప నితరు... పెక్కండ్రు పెక్కు తావులందు 'రక్షటేశా'ది నామములఁ బ్రసిద్ధి నొందిన దేవప్రతిష్ఠలకుఁ గారకులయిరి. కాశ్మీరమునందలి మరియొక ముఖ్యపట్టణమునందును బ్రధానమంత్రి యగు 'చంకుణుఁడు' సచైత్య మగు మహావిహారమును నిర్మింపఁజేసి సుకృతోదార గుణ భాజనుఁ డయ్యెను. చంకుణమంత్రి స్యాలకుఁడు 'ఈశానుఁడు' అను నతఁడు షభిజ్ఞుణి. అతఁడు తక్షకుని యనుగ్రహమువలన నపార ధనమును గడించి యొక గొప్ప విహారమును గట్టించి ప్రఖ్యాతిం బడసెను.

లలితాదిత్యుఁ డిట్లు నిరుపమాన మగు తనపరిపాలనమున నుర్వీతలమును హేమమయ మొనర్చుచుఁ దనశౌర్యౌదార్యాదిగుణములచే గీర్వాణపతి యశంబును హసించు నట్టి కీర్తి వెన్నెలను గడ తెల్ల నిండు కొనఁజేసెను. అతని మోముఁదమ్మినుండి వెలువడిన మాట హేలామాలిక మయినను నద్దాని నమర్త్యులయినను నొకప్పుడేని యుల్లంఘింపరన నిఁక మర్త్యులసంగతి నేమి చెప్పవలయును. అందులకుఁ దార్కాణగ నతని చరిత్రాంశము నొకింత పరిశీలింపఁ దగి యున్నది.

లలితాదిత్యుఁడు కొండొకతఱి తూర్పుసముద్రపు టొడ్డున ససైన్యుఁడై విడిసి యుండెను. అంతట నతఁడక్కడ నున్నటులుండి యొకతరుణమున "నాకు వెలుగ పండ్లు కావలయును దెండు." అని యనుచరుల నాదేశించెను. వారును గింకర్తవ్యతా మూఢులై చేయునది లేక రిక్తహస్తములతో నాసార్వభౌముని కట్టెదుర నిలిచిరి. కాని. అప్పు డొకానొక దివ్యపురుషుఁడు మాత్ర మలభ్యము లయిన కపిత్థఫలములఁ దీసికొని యాచక్రవర్తికడ కరుదెంచి వానిని సమర్పించెను.

రాజాదివ్యపురుషునిఁ గాంచి ప్రతీహారునకు భ్రూసంజ్ఞ సేయఁగా నతఁ డాదివ్యపురుషుని జూపె. యతఁడు దెచ్చిన యుపాయనముం గైకొని "నీవెవరు పంపఁగా వచ్చితివి? ఎవ్వరినిఁ గొలుచు

ఉ॥ పాత్ర మెఱింగి యిచ్చు నది
స్వల్పమె యైనను నూఱు రెట్లుగా
ధాత్రి ఫలించు దాత; కిది
తథ్యము; దప్పికఁ గుందు వాని కే
మాత్రము నీరొసంగినను
మానక యద్ది మరుస్థలిన్ మహా
చిత్రముగా సుధా రస రు
చిం దలఁపించు పయోఝరం బగున్.

మ॥ క్షితి సత్క్షేత్ర సమర్పితం బగుచు, సు
స్నిగ్ధోక్తి బద్ధాలవా
ల తతిన్ బోషిత మౌచు మానస సము
ల్లాసి ప్రసాదాంబు సం
భృత సేకం బయి పొల్చు దాన మను భూ
మీజం బిడున్ దత్త దీ
ప్సితముల్ దాతకుఁ గల్పవృక్షముల వా
సిన్ గెల్చు చాయాతతిన్.

భూపాల తిలకమా! అనాలోచితముగ నప్పు డప్పుడు కొలఁది పాటి విషయములకై నీవొసఁగిన యాజ్ఞలు నిలింపపతి యగు నాకనుల్లంఘ్యము లవుటంజేసి వాని నన్నింటిని నీడేర్చి యుంటిని. ఇఁక నీచెల్లింపఁ దగిన యానతు లల్పావశేషములై యున్నవి; మఱియు సామాన్య భూపాలురకుఁ బరిపాటియై యుండు నిట్టి యవిచార కారిత్వము మహాసత్త్వుఁడ వయిన నీకును నెట్లలవాటుపడెనో తోఁపకున్నది. ఘనాగమ కాలమందుఁ గొన్ని దినములందు మాత్రమె గాశ్మీరమునందు దొరకు ఫలములు శిశిర ఋతువునందుఁ దూర్పు సముద్రపుఁ దీరమున నెట్లు లభించును? నీవొనర్చియుండిన తొల్లింటి యీవి మహిమచే దిశాచక్రమునం బర్యటించుచు నీవాదేశించిన వచనముల నన్నిటిని నాయా దిక్పతులు జాగరూకులై నెఱవేర్చుచున్నారు. ఇప్పుడు తూర్పు దిశ కేతెంచి నీ వీయఁలతి యానతి నొసంగినను ద్రిదశేశ్వరుఁడ నగు నేనెట్టకేలకు నెఱవేర్చిన వాఁడ నైతిని. కావున నో సార్వభౌమా! ఇఁక మీఁదట మిక్కిలి ముఖ్యములగు ప్రయోజనములం దప్ప కొండొక కర్జమునకై యెప్పుడును నానతి యీవలదు. నీమాట లాజ్ఞారూపమునఁ జెల్లఁదగినవి కొలఁదిగ నుండుటచే నిట్లనవలసి వచ్చెను." అని యింద్రుని సందేశము నుడివి యాపురుషుఁ డంతర్హితుఁ డయ్యెను.

పిమ్మట మహాశయుఁ డగు నప్పార్థివోత్తముఁడు దానమాహాత్మ్యము నాలోచించుచున్నవాఁడై యొంతయు సంభ్రమము నొంది నాఁడు మొదలుకొని యట్టి పాత్రునకు యుక్తకాలమున నుపకృతి సేయు నవసర మెప్పుడు దొరకునా? యని కడుంగడు నాసక్తితో నిరీక్షించుచుఁ 'పరిహాసపురమునందు' స్థిరమైన యొకానొక గొప్ప యుత్సవమును జరిపించుచు నద్దానిని 'సహస్రభక్తము' అను నామమున వెలయునట్లొనర్చెను.

'అనహాభక్తము' అను పర్వమున నేకోత్తర లక్ష సంఖ్యాకము లగు భోజనపాత్రము లన్నదానమున వినియోగింపఁ బడుచుండెను. అన్నదానమె గాక యుక్తతమ మగు దక్షిణావితరణము గూడ నెఱవేర్పఁ బడుచుండెను.

లలితాదిత్యుఁ డంత మాత్రమునఁ దనివి నొందక యెవ్వఁడేని యెపుడైన పిపాసా పీడితుఁ డైనచో నొకింత సేద దేఱుటకును స్వాదుజలముం గ్రోలుటకును సముచిగు చాడ్పున నూషరభూము లందు సైతము పట్టణములఁ గట్టించి దివ్యపురుషుఁ డెఱిఁగించిన తొల్లిటి తనపానీయ దానపు మాహాత్మ్యము మఱవక తదనుగుణముగ నడచుకొనుచుండెను. పవమాన బాలుఁడు నానాసూనములయందలి నెత్తావిని సంగ్రహించునట్లు లలితాదిత్యుఁడు క్రమముగ నానాదేశములనుండి చదువరులైన మహాపురుషులను దననికటమునకు నాకర్షింపఁ గల్గెను.

శా॥ నానాదేశముల న్నిగూఢ మణులై
నానా కలారాధన
శ్రీ నెంతేనియు నొప్పు వారలను బే
ర్మిం జేర్చి పూజించి దే
శానందంబును గూర్పఁగావలె నృపుం
డారీతిగాఁ జేయఁడే
సూనామోదముఁ గూర్చు గంధవహుఁ డ
స్తోక ప్రజా కోటికిన్.

ఇట్టి సందర్భమున లలితాదిత్యుఁడు రససిద్ధుఁ డయిన "కంకణవర్షుని" సోదరుఁడును గుణఖనియు నైన 'చంకుణుని' 'భుఃఖార' దేశమునుండి తనయాస్థానికి రావించెను, 'ఆచంకుణుఁడు' తన హేమ విద్యానైపుణిచే రాష్ట్రమునందలి కోశములను బంగారుగనుల నొనర్చి కమలమునకుఁ గమలాకరమువలె రాజున కత్యంత శుభావహుండై తనరారెను.

ఒకప్పుడు సార్వభౌముఁడు తనయనీక నివహముతోఁ "బంచనదము" (పంజాబ్) చేరి యచ్చటి దుస్తరము లయిన సింధుసంగమములం గాంచి కర్తవ్యమును గుఱించి చింతాపరుండై నీటిం దాటు నుపాయమును దనసచివుల నడుగఁగా, నందు 'చంకుణుఁడు దరియందు నిలువఁబడి యగాధ మగు జలమునం దొక మణిని విసరివైచెను, దానిమహిమచే నీటియందలి నీరంతయు రెండు పాయలుగఁ జీలిపోవుటంజేసి నరేంద్రుఁడు వేగిరముగఁ దనబలగముతోడ నదినిదాఁటి యావలిగట్టుం జేరెను. పిదప 'చంకుణుఁడు'ను వేఱొక మణియొక్క సాహాయ్యమున నీటం బడవేసిన యమ్మణి నాకర్షించెను, వెంటనే యమ్మహానది యందలి సలిలప్రవాహము తొల్లిటి రూపముం దాల్చి పాఱుచుండెను, ఇట్టి మహాద్భుతము గాంచి లలితాదిత్యుఁడు చంకుణునిఁ గర్వము వినుతించుచు స్నేహాతిశయమున నామణుల రెంటినిఁ దనకిమ్మని యతని నడిగెను. అందులకు చంకుణుఁడు నవ్వుచు 'దేవా!

ఆమణులు రెండును నాపాణితలమునం దుండు నపుడె యిట్టి మహాకార్యము లొనర్పఁగలవు. కావున మీకు నివి స్వీకరించుటవలనఁ గలుగు ఫల మేముండును?

ఉత్కృష్ట వస్తువు సాధారణ జనునికడ నున్నపుడే గొప్పఖ్యాతినిఁ బడయుచుండును. అయ్యది పెక్కు విధము లైన యనర్ఘ వస్తువులకు నావాసమై యుండు మహాత్మ నాశ్రయించినచో నంతగ వన్నె కెక్కదు. ఇందు కాంతమణి కడలిగట్టున నిసుక తిన్నెపై నుండు నంత కాలము తద్గత మైన సలిల స్యందము వ్యక్త మగుచుండును. అయ్యది రత్నాకరునిచే స్వీకరింపఁ బడునేని యందలి జలస్యంద మెప్పటి యట్లున్నను నంబుధియందు దన్మహిమ గనుగొన వలను పడదుగదా!

గీ॥ మహిమ గల వస్తు వెపుడు సామాన్యు కడనె
యమరి యుండంగఁ బ్రఖ్యాతి నవఘళించు;
బహువిధానర్ఘ గుణ వస్తు భరితు లౌ మ
హాత్ములను జేరఁ దద్భవిష్య త్తదెంత?

మ॥ అల వారాశి తటంబునం బులినమం
దావాసముం గాంచుచో
విలస చ్చంద్ర మరీచి సంగమునఁ గ
న్పించై ద్రవీభూతమౌ
నిల నిందూపల; మయ్యదే కడలిలో
నే యున్న నెవ్వండు త
త్కాళలం గన్గొని సన్నుతింపఁగలఁ డీ
తత్త్వం బెఱుంగన్ దగున్.

అని పల్కి చంకుణుఁ డూరకుండెను. లలితాదిత్యుఁ డంత స్మితాననుఁ డగుచు "నోహో నీకడ నున్న రత్నములకంటెను నావద్ద మిన్నయగు రత్నము లున్న ట్లూహించుచుంటివా? అట్లైన నాకడనుండు వస్తు జాలమునందు నీవెయ్యది యిమ్మణి ద్వయమునకంటె నధికతర మని యనుకొనుచుంటివో యావస్తువుం గైకొని దానికి మాఱుగ నీమణుల నాకొసఁగుము" అని యనెను.

చంకుణుఁడు, అమ్మాటకు మహాప్రసాదము అని యనుచు "ఈరెండు మణులును భవ దధీనములె యగుఁగాక. దేవర నాయిష్ట మీడేర్పఁ గోరెదను. మగధ దేశమునుండి గజస్కంధముపై నుంచికొని రాఁబడిన యమ్మహాసుగత విగ్రహమును నాకొసఁగుటకు దేవర యౌదార్యమును బ్రార్థించుచున్నాను. తమ కిమ్మణులు వారిపూరము నుత్తరించుటకు నుపాయము లగుచుండును. నా కాసుగత బింబము సంసార సాగర తరణోపాయము గాఁగలదు." అని యుక్తి యుక్తముగ నర్థించి రాజదత్తమయిన యాజిన విగ్రహమును బ్రతిగ్రహించెను. వాగ్మియొక్క వాక్నైపుణి నాటంకపఱుపఁగలవా రెవ రుందురు?

అనంతరము చంకుణుఁడు ఆసుగత విగ్రహమును దాఁగట్టించిన విహారమునఁ బ్రతిష్ఠించెను. కపిశ కాంతులతో నొప్పారు నాసుగతబింబము కాషాయాంబరమును ధరించినట్లు గన్పట్టుచుండును: ఇనుప కటకములచే (నాదాలచే) పరివేష్టితమై నేడును వీక్షింపఁబడుచున్న యాసుగత విగ్రహము మున్ను తాను గజస్కంధమున నిబద్ధమై యుండినట్లు చూపఱకు సూచించుచునే యున్నది.

ఒకానొకప్పుడు లలితాదిత్యుఁడు శిక్షితము గాని యొక యశ్వమునకు స్వయముగ శిక్ష గఱపుటకై హయవిద్యా విశారదుఁడగు నతఁ డొంటిగా యడవికి నాహయమును దీసికొని వోయెను. నిర్జనం బగు నాయరణ్యమం దతఁడు దవ్వులనుండి లలితాకృతులైన యిద్దరు పూఁబోండ్లను గాంచెను. వారిలో నొకరు మధురముగ గానము సేయుచుయు వేఱొకరు మనోహరముగ నృత్యము సల్పుచుయును నమ్మహీపతికి వీనులకుఁ గన్నులకు విందగుచుండ నతఁ డావారువంబునకు శిక్ష గఱపుచు వారిప్రక్క నెప్ప వాల్పక యట్లే చూచుచుండెను. అప్పు డచ్చెలువుగ నొక్కక్షణములో నావామనయనలు తమగీత నృత్తములను జాలించి ప్రణామ మొనర్చి యచ్చోటు వాసి వోవుట యతండు గన్గొనెను.

లలితాదిత్యుఁ డనుదినమును గుఱ్ఱముతోడ నాతావునకే యేగు దెంచుచు నక్కాంతారత్నము లట్లే తమకర్తవ్యముల నొనర్చి వోవుచుండుట గాంచి యెంతయు నబ్బురపడినవాఁడై కొండొక దినంబున నాహంసగమనల చెంతకుఁ జనుదెంచి వారి వృత్తాంతము నడిగెను.

ఆహరిణలోచనలు చక్రవర్తి కిట్లు బదులు వల్కిరి, "మే మాటవెలఁదులము. ఇక్కడనుండు దేవాలయమున నృత్తగీతాదు లొనరించుట మాపని. 'శూరవర్ధమానము' అనుగ్రామ మొకటి కలదు. అయ్యది మాయభిజనము, ఇక్కడనుండి జీవనముం బడయు మాతల్లులు మాకులమునకు నియతమై యుండు నృత్తాది విధానము నిందు నిర్వర్తించునట్లు మమ్మాదేశించి యుండిరి. ఈరీతి నిక్కడ గొల్పుట మావంశ పరంపరాగత మగు పద్ధతియై యున్నది: ఏమియుం గానరాని యీతావునం దిట్లు కొలువు సేయుచుండుటకుఁ గారణము మాకుఁగాని మఱి యెవ్వరికైనను గాని గోచరింపకున్నది. ఇయ్యది మాయుదంతము." అని యావిరిబోండ్లు తమవృత్తాంతమును నివేదింప నాసార్వభౌముఁడు సావధానముగ నాలించి యచ్చెరు వందుచుఁ దననగరమునకు మరలి వోయెను.

మహామహిమోపేతులగు మహీపతుల చిత్తము ననుసరించుచు వసుమతి వారికిఁ బ్రియతమము లైన యర్థములను దనంతటఁ దా బయల్పఱచుచుండుట యాశ్చర్యకరమగు విషయము గదా:

గీ॥ విమల మణి శోభిత మహత్త్వ విభవమునకుఁ
పీఠభూములు నా; నొప్పు పృథివి పతుల
భావముల కనుగుణముగా వసుమతీమ
తల్లి శుభముల పంటఁ జిత్రముగ నొసఁగు.

అంత నా లలితాదిత్యుఁడు మఱునాఁ డాసుగాత్రుల మాట ననుసరించి శిల్పులచే నచ్చటి పుడమి నంతయుఁ ద్రవ్వించెను. అట్లు నేలను జాల లోతుగఁ ద్రవ్వఁగా నాభూగర్భమునఁ బిహిత

ద్వారములై యున్న రెండు దేవాలయములు గానవచ్చెను. నరేంద్రుఁ డంత నతికుతూహలముతో నాల యపుఁ దలుపులు దీయించి చూడ లోన రెండు కేశవ విగ్రహములు గనుపడెను. అందలిబలిపీఠము నందుండు నక్షర పంక్తినిఁ బరిశీలింపఁగా నావిగ్రహములు రామలక్ష్మణులచేఁ బ్రతిష్ఠింపఁబడినవిగఁ దెలియవచ్చెను. ఆరాజేంద్రుఁ డపుడు పెన్నిధి గన్న పేదచాడ్పున నుబ్బుచుఁ బరిహాసపురమునందలి విష్ణ్వాలయము పార్శ్వమునఁ బ్రత్యేకముగ శిలాఫలకములతో రెండాలయములను గట్టించి యందు రామమూర్తి ప్రతిష్ఠ గావించెను.

'చక్రమిర్దిక' యను లలితాదిత్యుని వల్లభ ప్రియుని వేడికొని లక్ష్మణస్వామినిఁ జక్రేశ్వరుని పార్శ్వమునఁ దాను గట్టించి యుండిన యాలయమందుఁ బ్రతిష్ఠించి ధన్యురా లయ్యెను. లలితాది త్యుఁడు జైత్రయాత్ర సేయునపుడు జరిగిన చిత్ర మగు వృత్తాంత మొకటి కలదు.

లలితాదిత్యసార్వభౌముఁ డొకనాఁడు గజారూఢుఁడై యుండ నప్పుడపుడే గాయపడిన కాయముతో నొకానొక పురుషుఁడు ముక్కు చెవులు మున్నగు నవయవములనుండి నెత్తురు గారుచుండ శరణుఁగోరినవాఁడై యాతేని కట్టెదుటఁ గాన్పించెను. కృపాళు వగు నమ్మేదినీకాంతుఁ డతనినిఁ గరుణార్ద్రము లయిన చూపులం గాంచి యయ్యార్తుని వృత్తాంతము నడుగఁగా, నతఁడు "నరేంద్రా! నేను సికతాసింధువు (యిది ప్రాయికముగ గోబీ, యెడారిగనుండవచ్చును.) నకుఁ జెంగటనుండు మహీ పాలునకుఁ బ్రధానమంత్రినై ప్రఖ్యాతి నొందినవాఁడను. తమరు దండయాత్ర సలుపుచుండ నేను ఆతేని హితము గోరి మీకుఁ బ్రణతి సల్పునట్లు బోధించితిని. రోగికిఁ బథ్యము రుచింపనట్లు నాహిత వచన మాతేనికి గిట్టక నన్నీగతి నొందఁజేసెను." అని నుడివెను.

కాశ్మీరవల్లభుఁడు వానిపలుకు లాలించి "హిత మెఱుఁగని కూళ యగు మీతేనికిఁ దగిన శిక్ష సేతు ననీ" ప్రతినఁ జేసి సమర్థులగు నగదంకారులచే నాశరణార్థికి బాగుగఁ జికిత్స చేయించి యతని మేనిగాయములు మాన్పించెను.

పిమ్మట విజయయాత్ర ముగించి తిరుకతోడ నున్న లలితాదిత్యు నేకాంత సమయమున సమీపించి శరణార్థిగ వచ్చిన యామంత్రి వినతుం డగుచు సార్వభౌమా! ఇవ్విధముగ నేనీమేనుఁ గ్రాష్టాడుకొనుటకు హేతువును మనవి చేసెదను. పగ దీర్చుకొనవలయు నన్న యాసయే నాయసువులఁ గాపాడుచున్నది. ఆపని యైనచో దుఃఖమునకును సుఖమునకును బాష్ప జలాంజలుల నొసఁగి కృత కృత్యుఁడనై నిక్కముగ నవమాన పీడితములైన యసువుల విడువవలయునని యభిలషించుచున్నాను. పరుని యారావమును సహింపక యతిగంభీరముగఁ బ్రతిధ్వనించు గిరిరాజువలె నభిమానధనుఁడు మిత మెన యపకృతి నొనర్చిన పగతునకు నధిక మగు నపకారము సల్పి ముద మొందును.

ఉ॥ వైరి కృతాపకార మది
స్వల్పమె యైనను మానవంతుఁ డ
వ్వారిగ దానికిత బదు ఁ అ
పక్రియఁ జేసితో యూరకుల్లా; వి.

స్ఫార మలంతి మైన దగు
      నవ్వడి యేని గుహా ముఖంబునన్
జేరిన, శైలరాజు చెవి
      చిల్లులు వోవఁ బ్రతిధ్వనింపఁదే:

కావున బగఁ దీర్చుకొనినఁ గాని నామనసు గుదుట పడదు. ఇచ్చోటునకు మూఁడు నెలలు పయనము సేయఁదగిన దవ్వులందు మన పగతుఁ డున్నాఁడు. ఇంతదూరము సత్వరముగఁ గడచి పోవు టెట్లు? ఒకవేళఁబోగగ్గినను నత్తావుననే యతఁ డుండునని యెట్లు విశ్వసింపఁగలను? కావునఁ బదునేను దినముల పరిమిత మైన కాలముతో గమ్య స్థానమును జేరు దారిం జూపెదను. ఆబాట జల రహితమై యుండును. అయినను నానుకూల్యము ననుసరించి మనసేనకు దారినడుమ వలయునంత నీటి నిక్కడనుండియే గైకొని పోవచ్చును. ఈ మార్గ మధ్యమున నుండువారు నాబంధువులు. కనుక నీరాకను బగతునకుఁ దెల్పక యుందురు. ఇట్టి కైతవ పద్ధతితోడ నెక్కువ శ్రమలేకుండ గంతవ్యస్థానముం జేరి యంతఃపురామాత్యాది సహితుఁడైన వైరినిఁ దప్పక పట్టుకొనఁగలము" అని ప్రబోధించి లలితాదిత్యు నమ్మహావాలు కార్ణవమునఁ బ్రవేశించు నట్లు పురికొల్పెను.

లలితాదిత్యుఁడు శరణార్థి యగు నయ్యమాత్యుని మాటలు విశ్వసించి యతఁడు దెల్పిన మార్గముంబట్టి యొక పక్షము కాలము పయనము సేయ నతఁడు దెచ్చి కొన్న నీరంతయు నుపయుక్తమయ్యెను. మఱి యిఁక జలము లేక పోయెను. ఇట్టి స్థితియందును వీరవరేణ్యుఁ డగు నా సార్వభౌముండు రెండు మూఁడు రోజు లెట్లో పయనము విడువక సాగించెను, కాని, తుదకు దప్పిచే ముప్పునొందనున్న తన సైన్యముయొక్క దుర్గతి నాలోచించి యతఁ డామంత్రినిఁ గాంచి "నీవు దెల్పిన ట్లొక పక్షమునకంటె మిక్కుట మగు కాలము చెల్లినది. సైన్యము పిపాసచే ముమూర్షువై యున్నది. పానీయమా లేదు, ఇంకను గడవఁదగ్గ త్రోవ యెంత మిగిలి యున్నది?" అని ప్రశ్నించెను.

అందుల కామోసగాఁడు పరిహసించుచు "రాజా! నీవెల్లప్పుడు గెలుపు గోరువాఁడవు గదా! ఇప్పుడు మార్గశేష మెంత యని యడుగుచున్నావా? జముని వీఁడెంత దవ్వు? అని ప్రశ్నించుచుంటివా? నేను స్వామి హితమునే యభిలషించి ప్రాణములు సైత ముపేక్షించి యుక్తిచే ససైన్యుఁడ వగు నిను వంచించి మిత్తివాతం బ్రవేశపెట్టితిని. ఇయ్యది మరుమహీతలము మాత్రమే గాదు. భయంకర మైన వాలుకార్ణవమునై యున్నది. ఇందెక్కడను నీటిబొట్టైనను దొరకదుసుమా! ఇంక నీకిప్పుడు దిక్కేది?" అని తానొనర్చిన మోసమును బయలు పఱచెను.

ఆమోసగాని మాటలు విని గుండె దడదడ కొట్టుకొన బిట్టు కలఁత వడుచుఁ గరకాపాతమువలన ధాన్య మంతయు రాలిపోవ వట్టికాడలతోడఁ గూడియుండిన శాలిభూమివలె వెలవెలఁబాఱుచు నసువులపై నాస వదలు కొనుచున్న ట్లడలుచున్న తనసేనం జూచి ధీరవరేణ్యుఁ డగు లలితాదిత్యుఁడు ఆవంచకునితో "ఓయీ! యమాత్యా! స్వామి హితంబుఁ గోరి నీవొనర్చిన పని నభినందించుచున్నాను.

ఈ మరుభూమి యందును స్వామి హితకారివై నీవు పన్నిన పన్నుగడచే శీతార్తిం జెందిన వారికివలె మాకు మేన గగురు వొడుచుచున్నది. ఇట్లు నీవు మోసగించినను నభేద్య సారుఁడ నగు నాయెడ నీపడివ ప్రయాసము వజ్రమణియెడఁ బ్రయుక్త మగు లోహసాధనమువలె మొక్కవోయి విఫల మగుట గాక పొందఁదగిన దేమి గలదు? మణి భ్రాంతిచే వహ్నికణమును బట్టుకొని వ్రేళ్ళు కాల్చుకొను వాని వలె భ్రమపడి యిట్టి చైద మొనర్చిన నీవిప్పుడు పిచ్చివాంగుడవై దుఃఖపడుట తప్పదు. చూడుము. నాయానచే నిప్పు డీపుడమి తొలకరి మేఘంపు టుఱుముచే వైడూర్యభూమి రత్నములఁ గను తెఱంగున నమృత పేయమగు తోయమును గాంచఁ గలను." అని పల్కి వెంటనే తనచేతనున్న కుంతముచే వసుధను బిట్టుగఁ బొడుప నందుండి తొల్లి తిగకంటి ముమ్మొన వాలు తాకున వితస్తానది నుండి సలిలము వెలువడిన తీరునఁ దేనెచవులం గ్రేణించు నట్టి పానీయము పాతాళలక్ష్మి స్మిత విలాసమో యన్న వడువున బయలు వెడలి వెల్లువయై ప్రవహించెను.

గీ॥ వజ్రమునకు నభేద్యమై వాసి గన్న
కడిమి గల మేటి వీరునిఁ గెడప నితర
లోహమయ సాధనములు చాలునె? జగంబు
లో సుగుణముల కెవ్వరు లొంగి పోరు?

కం॥ మణి యనుచు నిప్పు కణికను
మనసు చెదరి యదిమి పట్టు మందుని చందం
బున వీర వరేణ్యుని మదిఁ
గినుక గలుగఁ దాకు వాఁడు గీడ్వడ కున్నే?

కం॥ నవ జలద గభీర ధ్వని
నవంధ్య వైడూర్య మణిచ యంబుం గను న
ట్లవని ధరణీశు నానతి
నవశ్య మొనఁగుంగదా శుభార్థము లెల్లన్!

అట్లు జాలు వాఱిన యయ్యమృత లహరి లలితాదిత్యుని సైనికుల నీర్వట్టును బాప వారి జీవితాశ యనెడు తీవ క్రొందలిరాకు జొంపములచేఁ దనరారినట్లయ్యెను. వ్యర్థముగ నంగ వైకల్యము నొందిన యాదుర్మంత్రియు "గోరుచుట్టుపై రోఁకటి పోటన్నట్లు" ఆశా భంగముచే మఱింత భగ్న హృదయుఁడై తన యంగ వైకల్యముచే నశుభము నెఱింగించు దూతవలె నెల్లెట్లో మొదటఁ దన స్వామింజేరి తోడనే యంతక పురిని దర్శించెను.

లలితాదిత్యుఁడును వెంటనే కుటిలాచారుఁ డైన తనమార్తుని పీచ మడఁచి యతని మంత్రి వడసిన గతి నొందంజేసెను. ఉత్తరాపథమున నప్పు డప్పుడు నాయాప్రదేశములం దవసరముం బట్టి లలితాదిత్యుఁడు సృజించిన కుంతవాహినులు నేఁడును బ్రవహించు చుండుట గాంచుచున్నాము. ఇంకను నాచక్రవర్తి యద్భుతావహము లయిన వృత్తాంతములు వేలకొలఁది గలవు. అయిన నవియన్నియు గ్రంథవిస్తృతి యగునన్న భయముచే విడువఁ బడుచున్నవి.

నిర్మల జలోపేతములై నిశ్శబ్దముగఁ బాఱుచుండు నదులు తాప మెగుళులచే మలీమస మగు కాలమందు దడుసుతో నిండి కలుషములై యుండుటయు, నతిశాంతిన మైన చట్టు తానేలపైఁ బ్రవహించుచు బెట్టిదముగ ధ్వనించుటయుఁ గలదు. ఇట్టివిషయమువలన దేశకాలములు మహాత్ములకు సైతము వానికి సరిపడి యుండు నాచారవ్యవహారములు సలుపవలసి యుండునని తెలియుచున్నది. అట్టిధీరోదాత్తుఁడైన లలితాదిత్యుఁడును నొకప్పుడు కలుష జనకము లయిన భయానక కృత్యములు జరిపించుటఁ జూడ నందుల కతఁ డధిష్ఠించిన సింహాసనపుఁ బ్రభావమో. లేక కలికాలపు మహిమయో కారణము గావచ్చును.

మ॥ అతినిశ్శబ్ద వినిర్మలాంబు గమనం
బౌచున్ మహావాహినీ
తతి పెన్గొండలనుండి దూకుఁబటుళ
బ్దస్ఫూర్తిఁ. గాలాబ్ద సం
గత వేళం గలుషత్వ మొందు; నిటు ది
క్కాల ప్రదేశ ప్రవ
ర్తిత చర్యన్ సుజనాళియున్ మెలఁగు; వ
ర్ణింపన్ దరంబే విధిన్,

ఒకానొకప్పుడు లలితాదిత్యుఁడు 'పరిహాసపురము'నందు నంతిపురపుటంగనలతోఁ గూడి మదిరాస్వాద మత్తుఁడై సచివులను రావించి "మీరు తొల్లి 'ప్రవరసేనుని'చే నిర్మింపఁజేయఁ బడ్డ ప్రవరపురము సర్వ విధముల నావీటికి సాటి యని తలంతురేని తత్‌క్షణ మద్దానినిఁ గాల్చి వేయుఁడు" అని యానతి యొసంగెను, వారును జక్రవర్తి యనుల్లంఘ్య శాసనుఁ డగుటంజేసి ఘోర మైన యయ్యాదేశము మీఱఁజాలక యాతావున కనతిదూరమున నున్న ప్రవరపురమునకుం బోయి యందు 'వాతులానకము' అను ప్రదేశమునందలి గొప్పగొప్ప గుట్టపు గడ్డివాములను దగులఁ బెట్టించిరి. చక్రవర్తి ప్రాసాదాగ్రమునఁ జేరి మిన్ను ముట్టు చున్న యావహ్నిజ్వాలలం గాంచుచు హర్షాతిరేకమున వికృత మగు నట్టహాసము సేయ మొదలిడెను. ఆకతమున నప్పు డతని మోము ధూమకేతు సమావృతమైనదో! యన్నట్లు గన్పట్టెను.

నిర్మలాత్మ యగు వాఁడును ద్వేషాది వికారమునకు లొంగెనేని యుత్తముఁ డగు నితరుని యందుఁ బొరపడి చెడ్డతనముఁ గాంచును. ప్రకృతిచేఁ దేజోమయ మగుచున్న నేత్రము తిమిరదోష దూషితమై చంద్రుఁడు మున్నగు తేజః పదార్థము సూటిగ నెదుర నున్నను నద్దానిని ద్విగుణముగఁ జూచుచుండును గదా!

శా॥ రాగ ద్వేషము లాదిగాఁ గల వికా
రాలంట నెవ్వాండు గా
నీ గగ్గోల్పడు; స్వాన్య నుత్తముని సుం
తే న్గానఁ డెట్లన్నఁ బ్రే దే

జో గోళంబు గదా! నిసర్గముగఁ జ
ఢు ప్రైనఁ గానీ, తమో
రోగార్తం బగు నద్ది గర్గొనును జం
ద్రున్ బెక్కు చందంబులన్;

ఇట్లు గాకున్నచో నసంఖ్యాకము లగు నగరములను గట్టించిన లలితాదిత్యునకుఁ బ్రవరసేన నిర్మిత మైన యొక్క ప్రోలు కనుల కంత మిక్కుటముగ నేల గన్పట్టెనో యూహింపఁ జాల కున్నాము.

తఱువాత నానరేంద్రుఁడు మద్యపానపు మత్తు దొలఁగిపోవ నగరమును గాల్పించుటవలనఁ గలుగు దోషమును దలఁచి వేఁడి నిట్టూర్పు తోడుగాఁగల పశ్చాత్తాప మనెడు చిచ్చు డెందము నావ రింపఁ గరము దురపిల్లఁ దొడఁగెను. చెడ్డపనిఁ గావించి లోలోన ఛిద్రములు గల పురుషులు తారొ నర్చినట్టి యాపాపకర్మచే వహ్నిసంకీర్ణము లయిన కోటరములు గల జీర్ణతరువులువోలె స్వశరీర పతన పర్యంతము దహింపఁబడుచునే యుందురు.

గీ॥ కోటరము లోని చిచ్చుతోఁ గుమిలి పోవు
చెట్టువలె మానవుఁడు తన చిత్తమందు
ఛిద్రములు గుప్తములుగాఁగఁ జేసికొనుచుఁ
దనువు దొఱఁగని తీవ్ర వేదన భరించు.

ఈరీతి వంత నొందుచున్న వేనికడకు సచివులు పఱువాతనే చనుదెంచి యతనివంతఁ బాపు టకై ప్రవరపురము వాస్తవముగఁ గాల్పింపఁబడకుండుట నెఱింగించిరి. లలితాదిత్యుఁడు సచివుల వాక్యములవలనఁ బురదాహము జరుగకుండుట నెఱింగి విగతశోకుఁ డగుటయేగాక పుత్రుఁడు మరణించి నట్లు కలఁ గాంచి విలపించుచు మేల్కొన్న తర్వాతఁ దనయుఁడు వానిం గనుగొన్న వాఁడువోలె స్నేహ భరితాంతరంగుఁ డయ్యెను.

కం॥ మనసునకు గిట్టనట్టిది
వినష్ట మగునేని నరుని వేడుక యేమం
దును? గలలోఁ గోల్పోయిన
తనయుని మేల్కొనుచు నెదుటఁ దగఁ జూచుటగున్;

పిమ్మట నమ్మహీజాని మద్యపాన మత్తతతోఁ దా నొసఁగిన యుదల నెరవేర్పక తగినట్లు నడచుకొన్న యయ్యమాత్యవర్గమును బ్రశంసించుచు నిఁక మీఁదటఁ దాను మద్యపాన మత్తత నొంది యున్నపు డొసఁగిన యానతి నెప్పుడుగాని చేయవలదని వారికనుమతి యొసంగెను.

పుడమిని వారస్త్రీ తుల్యముగ నేలుకొనుచు ననుచిత ప్రియుఁ డగు రాజును దమజీవన సుఖముం గోరి మఱింత చెడునడవడికిం గొంపోవు నీచులగు భృత్యుల వార్తల నైనం దలంచుట

నింద్యము. ఇఁక దుష్పథమునం బడు నరపాలునిఁ దమప్రాణముల నైన సరకు గొనక బలాత్కారముగ సన్మార్గమునకు మరలింపఁ గలవారు కొందఱే యుందురు. అట్టి మహాత్ములచేఁగదా యీ రత్నగర్భ యుద్ధరింపఁబడుచు నన్వర్థ నామమునఁ బొల్పారుచుండును.

మ॥ ప్రియముం గూర్తురు దుర్నయంబునయి భా
    శ్రీ వారాకాంతా క్షణ
ప్రియులో రాజుల కాత్మ సౌఖ్య పరులో
    భృత్యాధముల్. రాజు దు
ష్క్రియఁ బ్రాణంబుల నొడ్డియే న్మిగుల న
    ర్థి న్మాన్పి రక్షింత్రు భ
వ్యయశుల్ గొందఱు. వారిచే నవని స
    ర్వంబున్ బవిత్రం బగున్.

మహిమాతిశయమున వేల్పుల రాయని సయితము వెనుక వేసిన సార్వభౌముఁడు లలితాదిత్యుఁడు, అట్టివాఁడును సాధారణ రాజులకు సులభమైన దొసఁగును గూడ నొనరించి యుండుట చాలఁ జింతనీయము.

లలితాదిత్యుఁడు శ్రీపరిహాసకేశవుని మధ్యస్థుని (జామీను)గా నుంచి గౌడపతినిఁ గటికి వారిచే "త్రిగామి" యందుఁ జంపించెను. ఆకాలమున నద్భుత సత్త్వాభిమానములు గల గౌడులు తమ యొడయం డట్లు హతుండగుటకుఁ గినిసి కన్నులకు దూరమైన తమ ప్రభువునకై ధీర వర్తనముతో నసువులం బాసిరి. వారు మొదట శారదా దర్శనమను నెపమునఁ గాశ్మీరమును బ్రవేశించి తమఱేని హనన సమయమున మధ్యస్థుఁడై యుండిన 'పరిహాసకేశవుని' యాలయమును నలువైపులఁ జుట్టుముట్టిరి. అప్పుడు నరపతి దేశాంతరమునం దుండుటంజేసి సాహసముతోడ నాలయముకొఱకుం జొరనుద్యోగించు నాగౌడులకుఁ బూజారులు ప్రవేశ మీయక యాలయపుం గవాటములఁ బదిలముగ మూసివేసిరి. అంత నాగౌడులు తమకడిమి పెంపునఁ దెంపుతో నచ్చటనుండు 'శ్రీరామస్వామి' రజతవిగ్రహమును బరిహాసకేశవుఁడని భ్రమించి యమ్మూర్తిం బెకలించి పొడిపొడి గావించి పిమ్మట నప్పొడి నంతయు రవలు రవలుగా దిక్కులం దంతట వెదఁజల్లిరి. వారాపని సేయుచున్నపుడె సార్వభౌముని సైన్యము నగరమునుండి తఱుముకొనివచ్చి వారినందఱను బదఘాతములచేఁ బిండుకుమార్చెను, సైనికుల పాదహతులచే నప్పుడు నేలంబడి రక్తసిక్తాంగులై యసువులం గోల్పోయి నల్లవాఱిన యాగౌడులు ధాతురస వ్యాప్తములై కాటుక కొండనుండి దొరలి పడిన శిలాఖండములవలెఁ గన్పట్టిరి, అయిన నేమి? వారి శరీరమునుండి వెలువడిన రుధిర వాహిని వారి స్వామిభక్తిని జాజ్వల్యమానము గావింప లేదా? అట్టివారిం గన్న యీవసుంధర ధన్యురాలు గాలేదా?

వజ్రమణి యున్న యెడలఁ బిడుగుపాటువలని భయము గలుగదు పద్మరాగమణులవ నైశ్వర్య మేర్పడుచున్నది. గారుత్మత మణి నానావిధమైన విషమును హరించుచున్నది. ఇట్లొక్కొక్క

రత్నము ఒక్కొక్క మహాకార్యము సాధించుచుండ నింక నమేయ మహిమోన్నతు లయిన పురుష రత్నములు సాధింపరాని పని యేముండును?

మ॥ ఇల గారుత్మత మార్చివేయు విషవ
హ్నిఁ బద్మరాగంబు ని
చ్చలు గూర్చున్ సిరిఁ వజ్రభీ నడఁచు ఏ
త్రంబు బిమ్మొయిన్ రత్నముల్
ఫల మొందొందె యొసంగు శక్తి నియతిన్
బాటించి పుంరత్నముల్
గలిగించున్ నిఖిలార్థ సిద్ధుల నహో
ఘంబౌ ప్రభావంబునన్:

చిరకాల ప్రయాణముచే గమింపఁదగిన మార్గమెక్కడ? గతించిన రాజునెడఁ జూపెడు భక్తి యెక్కడ? ఈ విషయమున గౌడులు సాహసించి చేసిన ప్రతిక్రియను సన్నుంప విధికేని తరము గాదని చెప్పవలయును. ఆకాలమున గౌడులవంటి భృత్యరత్నములు పెక్కండ్రు పుడమిపై వెలసి తమకుఁ బ్రభువుపైఁ గల లోకోత్తర భక్తి విశ్వాసముల నిడుగడుగున గనుపఱచుచుండిరి. ఆనాఁడు జరిగిన గౌడ రాక్షస విప్లవమున 'రామస్వామి' యీగౌడుల మహిమోద్యమము చాటునా. లలితాదిత్యుని కత్యంత ప్రియుఁ డయిన 'శ్రీపరిహాసకేశవస్వామి' యట్టికెలది యని తెలియఁ జాలదు. నేఁడును బ్రహ్మాండ మగు నారామస్వామి యాలయము శూన్యముగా గాన్పించుచున్నది. గౌడవీరుల పరాక్రమము మాత్రము బ్రహ్మాండము నిండియున్నది.

ఈరీతి లలితాదిత్య చక్రవర్తి చరిత్ర మనేకములగు అద్భుతములతోఁ గూడియున్నది. అతఁడు నిజనగరమున నుండిన కాలము మిగుల కొలఁదియైనది. అనవరత జైత్ర యాత్రాదులకై దిశాచక్రముం జుట్టివచ్చుచు దనజీవితకాలమును జాలభాగము గడిపెను. ఇట్లంత నా నరేంద్రునకు నితరులెవ్వరు నాక్రమింపని పుడమినిఁ జూడఁ గౌతుకము పుట్టెను. అంత నతఁడు పయనమై మరల నపారమైన యుత్తరా పథమును బ్రవేశించెను.

ఆసమయమున లలితాదిత్యసార్వభౌముని మహిమ నెఱుఁగఁగోరి యక్కడివారేఁడు మున్నగు వారిచే నంపఁబడిన రక్కసులతోడ నాపృథ్వీపతిఁ దలపడిన పోరాటములయందుఁ దెలియఁదగు వృత్తాంతములు పెక్కుగలవు. సూర్యకిరణములు చొరరాని ప్రదేశములందును సహితము నేఁడును లలితాదిత్యుని యానతి స్వైరవిహారమొనర్చుచుండుట శ్లాఘ్యతమైన విషయము. ఆరీతి నమ్మానవేంద్రుఁ డుత్తరా పథమునఁ బర్యటించుచున్నప్పుడు ... ... ... ... తెలియకపోవుటచే నమాత్యు లొకచారునిఁ దమతోని నదర్శించిరి. ... ... యమాత్యుల వేడికోలును నివేదించెను. లలితాదిత్యుఁడును వారిముందు నాపంచి చారుని మూలమునఁ దన సుదీర్ఘ సందేశమును దెలియనంపెను.

లలితాదిత్యుఁ డంపిన సందేశమును చారుఁడు మంత్రిమండలి కిట్లు విశదీకరించెను. "అన్య సులభముగాని దేశమును గూడ నభిలషించి చరించుచున్న నా యొక్క రాక నెదురు చూచెదరేల? ఇట్టి మోహము ప్రతిభావంతులగు మీకెట్లు గల్గెను? ప్రతిదినమునను గ్రొత్త క్రొత్త గెలుపుం గొనుట మాని మనరాష్ట్రమును జేరి నేను జేయఁదగ్గపని యేమో పరికింపుఁడు. పుట్టిన తావునుండి బయలు వెడలు నదులకు గమ్య స్థానపు మేర యపాంపతి యౌను; గాని, నిర్వ్యాజ విజయము నభిలషించు పార్థివు లకు నవధి యెందుఁ గలదు?

గీ॥ అనుదినం బభినవ విజయంబుఁ గోరు
చుండు భూమీశ్వరుం డూరకుండఁ గలఁడె?
ఇనుము వంటి మనస్సైన నేగు చుండు
నిచ్ఛ యనెడు నయస్కాంత మీడ్చు కడకు.

కం॥ ఇరవుల దొలఁగుచుఁ బరువిడు
తరంగిణుల కవధి యబ్ధి; ధర్మోజ్జ్వల సం
గర దీక్ష నిర్వ్యాజ జ
య రమా కాంక్షులకు నెల్ల లనునవి గలవే?

కావున మీకు నా రాష్ట్రమునకుఁ దగిన యాచార పద్ధతి సారమును వచించెదను. దాని నను సరించి మీరనఘాత్ములరై నిరంతరాయముగ రాజ కార్యములను పరిపాలించుచుండవలయును.

ప్రభవిష్ణు లగు మీ రన్యోన్య భేదము నొందక రాష్ట్రమును జాగరూకతతో నెల్లపుడు రక్షించుచుండఁ దగును. ప్రకృతి వర్గము తమలోఁ దాము భేదభావము నొందుట రాష్ట్రమునకుఁ జాల ప్రమాదమును దెచ్చును. అట్టివారు చార్వాకులవలెఁ బరలోక భీతిం గాంచరు. మఱియు గిరి గహ్వర ములందు వసించు కిరాతులు నేర మొనరింపకున్నను దండ్యులుగా నెఱుంగవలయును; అట్లు కాకున్న వారు క్రమముగ నధిక ధనము నార్జించి యభేద్యములయిన దుర్గములం గల్పించికొని తుదకసాధ్యులై యపాయకారు లయ్యెదరు.

గ్రామవాస్తవ్యు లొక్క సంవత్సరమునకు సరిపడు నంత ధాన్యాదికమును మాత్రము తమ వద్ద నిక్షేపించునట్లును వారివారికిఁ గల క్షేత్రపరిమితి ననుసరించియె వృషభములు మొదలగు పశు ధనము నుంచుకొనునట్లును మాటిమాటికిఁ బరిశీలించి వారిని నియమబద్ధులను గావింపవలయును. అట్లొ నర్పనిచో వారందఱు ధనాఢ్యులై క్రమముగ గొప్ప గొప్ప డామరులై (జమీన్‌దారులై) తుదకుఁ దులు వఁదనమునఁ బ్రభు నానతి నిరాకరింప దక్షు లయ్యెదరు.

ఇంకను గ్రామీణు లగువారు నగరవాసుల కుచితము లయిన యుడుపులు, స్త్రీలు, ఆస్తర ణములు, భోజ్య పదార్థములు, అలంకార విశేషములు, గుఱ్ఱములు, మహాభవనములు, మున్నగువాని నెప్పుడేని యనుభవించుకొనినను. రాజులు తాము గాపాడుకొనఁ దగు దుర్గములయెడ నుపేక్షవహించినను

తమభృత్యుల కొఱవు సేఁత యందలి తారతమ్యము నెఱుంగలేని వారైనను, ఏదో యొకచోట నుండి మాత్రమే యోధులకు వలసిన యాహార సంభారము పశుమాఱు సేకరించుటకు గడఁగినను, ఉద్యోగు లొండొరులు వియ్యంపు బాంధవ్యము నెనసి యధికమగు నెయ్యమున మెలఁగినను, లేక, యట్టి యుద్యోగులవలె రాజును సయితము కర్మస్థానములయెడ విశేష దృష్టి లేనివారైనను అప్పుడు ప్రజల దురదృష్టదేవత పుడమిపై నడుగుపెట్టినట్లు నిస్సంశయముగ నెఱుంగఁ దగును.

## రాజనీతిసారము

గీ॥ రాజ్యమును సర్వదా, ప్రజా రంజనముగ
జరుపఁ దలఁచిన రాజు లాచార నీతి
సారమును యుక్త మగు భేషజంబు వోలెఁ
దప్పక భజింపవలయు శ్రద్ధాళు లగుచు.

గీ॥ రాష్ట్రమునఁ గొంద ఱెపుడు స్వార్థంబుఁ గోరి
మిత్రభేదం బొనర్చుచు మెలఁగు చుంద్రు.
వారు పరలోక భయమును వార్తఁ దృణము
విధమున గణింత్రు చార్వాక వితతివోలె.

గీ॥ దేశభక్తినిఁ బోకార్చి తివిరి తివిరి
ద్రవిణమును గూర్చి దుర్గ సంశ్రయముఁ గాంచు
దుష్టు లపరాధ రహితులై దొలఁగి రేని
దండ్యులే వారు రాజ్ణీతి దండ సరణి.

ఉ॥ పల్లెల రైతులున్ దమకుఁ
బండిన ధాన్యము నొక్క వత్సరం
బెల్లఁ దినంగఁ జాలు నది
యే విలువం దగఁ జేయఁ బోలు; వ
ద్దిల్లఁగ క్షేత్ర సమ్మిత మి
తిన్ టఱ సంపదఁ గూర్ప నొప్పెడున్.
జల్లఁగ నుండు రాష్ట్రము ప్ర
జా హితమై యటు సాగు చుండినన్.

గీ॥ ధనము మితి మీఱఁ గూర్చి యుద్దామ వృత్తు
లైన వారి నుపేక్షించు టరియు రాజ
నీతి యొప్పదు. వారలు నృప పదంబు
నాక్రమింపంగ నాశింతు రెపుడుఁ బూచి

కం॥ సేవకుల మానసంబుల
భావం బుల నెఱుఁగ వలయు: బహువిధ దుర్గ
శ్రీ విభవము రక్షింపఁగ
భూవిభుఁ డెన్నఁడు నుపేక్షఁ బొరయఁజన దిలన్.

ఉ॥ మట్టును మీఱు తిండియును
మందల లేని విహార వృత్తులున్
పుట్టములున్ గృహంబులును
భూషలు భోగము వాహనంబులున్
పట్టణమందు మీఱి చను
పద్ధతు; లిట్టివి పల్లెటూళ్ళలోఁ
బుట్టిన మంద భాగ్య మయి
పోవుఁగదా! భువియున్ ప్రజాళియున్

కం॥ ఒక దిక్కునుండి వచ్చిన
యొక తెగ వా రొక్కచోట యోధులుగాఁ జే
రిక మేలు గాదు; కార్యము
లకలంక స్థితిని జరుగ వారీతి నిలన్.

కం॥ దిట్ట లయిన కాయస్థులు
చుట్టఱికము మెఱయ నొక్కచో నధికృతులై
దిట్ట పడుటవలనన్ గడుఁ
జెట్ట గలుగు వారి వేఱు సేయుట మేలౌ.

కం॥ దుర్మతు లగు కాయస్థులు
కర్మస్థానములు సూచు కరణి నృపతులున్
ధర్మము తప్పఁగఁ గనుచోఁ
గూర్మి చెడున్, భాగ్య మెడలుఁ. గుందుదురు ప్రజల్

గీ॥ రాకుమారుల హృదయాంతరాశములను
గుబురుకొని గుప్తముగ నుడి గొనుచు నుండు
భావముల వారి చేష్టలఁ బట్టి సూక్ష్మ
దృష్టిఁ గనుగొని కార్యంబు దిద్దవలయు.

ఈరీతి నితరుల యెడందలఁ గలుగు నిగూఢాశయముల నెఱింగి మదుక్త మయిన విషయములం దలంచుచుఁ దరతమ భావ విచారము సేయుట పాడి యగును.

లోకమునందు మదపు టేనుఁగు సామీప్యమును మదగంధ కలితమైన గాడ్పు దెలుపుచుండును. తళతళమని మెఱయు మెఱుపు వెనువెంటఁ గలుగనున్న మేఘపు టుఱుము నెఱింగించును.

అట్లై జన్మాంతరానుబంధియై నిశ్చలమై యుండు జీవుల చిత్తవృత్తినిఁ దచ్చేష్టలే కుశాగ్రబుద్ధు లగు వారికి వ్యక్త పఱచుచుండును.

మ॥ మద గంధంబును వీచు గంధవహుఁ డ
మత్తేభ సాన్నిధ్య: మం
బుద గర్జారవ సంభవంబును రుచుల్
పూరించు నమ్మించులున్.
విదితం బౌనటు సేయు, విజ్ఞులు నిటుల్
వే గాంత్రు జన్మాంతరా
ప్త దృఢప్రజ్ఞను గుప్త భావములఁ ద
త్తచ్చేష్టలం బట్టియే.

కావునఁ "బరహృదయ మప్రత్యక్షము" అనుమాట ప్రతిభావంతులయెడఁ జెల్లనేరదు. నాపుత్రులు కువలయాదిత్య వజ్రాదిత్యు లిరువురును నాకు సమానులే. అయినను వారికిఁ దల్లులు వేర్వేఱుగఁ గలరు. కాన సోదరుల శీలము భిన్నమై యుండును. పెద్దవాఁడె రాజ్యాభిషిక్తుఁడు గావలయును, అతఁ డెప్పుడు బలవంతుఁడై కర్తవ్యము మీఱునో, అప్పుడు వాని యానతిని మీరు సరకు గొనక యుండఁ దగును. అట్టి పార్థివుఁడు తనజీవితమును గాని, రాజ్యమును గాని, త్యజించు వాఁడైనను వాని కొఱకై యెవ్వఁడు చింతింప నక్కఱ లేదు. ఈనాసందేశము మీకెల్లప్పుడును స్మరణీయ మగుఁగాక.

మఱియుఁ జిన్నవానిని రాజుగా నొనర్పఁగూడదు. ఒకవేళ ప్రమాదమున నట్లు జరిగెనేని వాని యాజ్ఞ నుల్లంఘింపఁగూడదు. అతఁడు విషమ స్వభావుఁడయ్యును గాపాడఁదగిన వాఁడని దలంపఁ దగును. నా పౌత్రులలోఁ జిన్నవాఁడు 'జయాపీడుఁడు' గలఁడుగదా! వానిని మీరెల్లపుడు "పితామహ సముఁడవు కమ్ము" అని యాశీర్వదింపఁ గోరెదను." అని ఇట్లు దూత తమయొడయఁడు పంపిన విస్తృత మైన సందేశమును వినిపింప మంత్రులు సావధానులై విని చక్రవర్తి రాక యెడ నైరాశ్యము నొందుచు సాభిప్రాయ మైన తదాదేశమును ప్రణామ పురస్సరముగ 'శిరసా'వహించి యయ్యది యమోఘవీర్యుఁ డగు చక్రవర్తి చరమ నియోగ మని గుర్తించుచు బాష్పార్ఘ్యముచే నద్దాని నర్చించిరి

పిమ్మట నొకనాఁడు ప్రధానామాత్యుఁ డైన 'చంకుణుఁడు' ప్రజల నందఱ సమావేశపఱచి వారి నుద్దేశించి "పతి వియోగానలమునఁ దపించుచున్న వసుంధరను గన్నీటిచేఁ దడుపుచు విజ్ఞు లగు మీరిపుడు రాజపుత్రుఁ డయిన కువలయాపీడుని రాజ్యాభిషిక్తునిఁ గావించుకొనవలయును. సుగృహీత నాముండగు మనఱేఁడు దివంగతుఁ డయ్యెను. ఆసుకృతి కోశవృద్ధికై వేల్పులు నాకుఁ బ్రసాదించిన రససిద్ధి రహస్య పర మగు హేమవిద్యయు నాకస్మికముగ నస్తమించి పోవుట మిగుల నాందోళనకర మగు విషయము. చక్రవర్తి దూరదేశమునం దుండియు నిదివఱకుఁ దనభాగ్య మహిమచే దుర్ఘటము లగు కార్యములను సులువుగ సమకూర్పఁగలిగి యుండుట మీకెల్లరకు విశదమై యున్నది:

అంశుమాలి కార్మొగుళ్ళచే నాచ్ఛాదితుఁ డయ్యును గమలములకు వికాసము నొసఁగుచునే యున్నాఁడు. మేఘము దూరస్థమై యున్నను వేడియగు నాతపస్పర్శమును శీతలము గావించుచునే యున్నది. ఇట్లే యభంగురశక్తియుతు లగు మహాపురుషు లెంతదూరమున నుండినను వారి యద్భుతమైన మాహాత్మ్యమువలన దుష్కరము లైన కార్యములును నిరంతరాయముగ స్వైరముగ ఫలించుచుండును.

శా॥ శీత స్పర్శ మొనర్చు నాతపము నా
జీమూతముల్ దూరమం
దే తారాడుచుఁ; గారు మబ్బు పయి నెం
తే నగ్రిమ్ముచున్నన్ సరో
జాతాళిం వికసింపఁజేయు రవియున్;
సత్త్వ ప్రభావాఢ్యు లీ
రీతిన్ గార్యము నడ్డు లేక ఫలపూ
ర్తిన్ శక్తులై గాంత్రుగా.

అని వచించి కర్తవ్యము వారికి నెఱింగించెను. లలితాదిత్య నృపచంద్రుఁడు ముప్పదియా బ్దంబులు నేఁడు నెలలును పదునొకండు రోజులును గూనలయ మంతను నాప్లావపఱచి యారీతి నర్తమించెను.

"లలితాదిత్యుఁడు 'ఆర్యానకము' అను ప్రదేశమునం దుండు నప్పు డకాండముగ సంభవించిన యొకానొక గొప్ప తుషారవర్షమువలన విపన్నుఁ డయ్యెను" అని కొందఱును, "రాజశిరోరత్నమై యొకానొక ప్రబల సంకటమునకు గుఱి యైన యతఁడు చిరకాల సంచితమై సర్వాతిశాయి యైన తనసార్వభౌమ ప్రఖ్యాతి నెట్టకేలకు నిలుపఁ బెట్టుకొనఁ బ్రయత్నించి తుదకు వీతిహోత్రునకాత్మ నర్పించెను." అని కొందఱును, "చక్రవర్తి మిగుల దవిష్ఠమైన యయ్యుత్తరాపథమునం దమర్త్యసులభ మగు తావును దనసేనతోడఁ జేరి యచ్చోట మర్త్యతనువుం బాసెను" అని మఱికొందఱును నుడువుచున్నారు. ఆపార్థివోత్తముని కృత్యము లత్యద్భుతము లైనవై వినవచ్చినవిగదా! అట్లె యతనికి ఘటిల్లిన యాపదము విచిత్రమై యున్నది.

గభస్తిమాలి యస్తమింపఁగా, ఆతేజోమూర్తి జలనిధిం జొచ్చె నని కొందఱును, వహ్నియందు లీనమయ్యె నని కొందఱును లోకాంతరమును బ్రవేశించె నని మఱికొందఱును గీర్తించుచున్నారు గదా! ఇట్టి విచిత్ర జనశ్రుతులఁ బరికింపఁగా నిరుపమాన ప్రస్థాన వేళతో నెసంగు మహాత్ములకు సంభవించు విపత్తులును వారి యసామాన్యమైన మహాత్త్వ తత్త్వమును సూచించు నవియై యుండు నవి స్ఫురించుచున్నది,

కం॥ అత్యద్భుతావహంబులు
కృత్యంబు లొనర్చు సుగుణ గేయుల కిల దే
హ త్యాగమందుఁ గారణ
మత్యద్భుత మగుచు నుండు టది సహజమొకా!

చం॥ అనలముఁ జేరు నారవి య
టంచును గొందఱు, కొంద ఱస్తమిం
చు ననుచు, నబ్ధిఁ జొచ్చు నను
చున్ మఱి కొందఱు, నన్య లోకముల్
సను నని కొందఱున్, బుధులు
చాటిరి; ముప్పుననే న్మహాత్మ్మ లి
ట్ల నుపమ చిత్ర యాత్రల గు
ణాధిక వార్తల నొప్పుచుంద్రుగా!

## కువలయాపీడుఁడు

తఱువాత 'చంకుణుఁడు' ప్రజలయెదుటఁ దాను బ్రకటించిన విధమున 'కువలయాపీడుఁడు' కువలయేశ్వరుఁ డయ్యెను. అదితి సురరాజును గన్న చందమున 'కమలాదేవి' యితనిం గనెను. కువలయాపీడుఁడు ప్రకృతి మలిన మైన చర్మమును మహోఫణి త్యాగ కాలమునందువలెఁ దనయెడ సహజముగ ననురక్తయై యున్న రాజ్యశ్రీని త్యాగమహిమచే విశద మొనర్చెను. వైశ్వానరుని వెలుంగుచే నావృత మైన దీపకాంతివలెఁ దుల్య ప్రభావోపేతుఁ డైన తనసోదరునితోఁ గూడి యుండిన కువలయాపీడుఁడు కొంతకాల మంతగఁ బ్రకాశింపలేక పోయెను. తేంట్లు దానాశచే గంధ గజముల కపోలముల నాశ్రయించునీతి నాశ్రితు లాసోదరుల నిర్వురను బర్యాయముగ సేవించు చుండుటంజేసి వారి రువురి నడుమ సిరి నిలుకడ లేనిది యయ్యెను.

గీ॥ సహజ మాలిన్య సంసర్గ సంతతాను
రక్తయౌ రాచసిరి మహోరగము మేని
త్వచమువలెఁ ద్యాగమునఁగాదె స్వచ్ఛ మౌచు
నందగించును లోకంబునందు మిగుల

మ॥ తన కీడై పెనుపొందు వాఁడొక గుణో
దాత్తుం డదూరంబునన్
ఘనుఁడై యుండినఁ గొప్ప పేరు వడయం
గా రాఁ దదెట్లన్నచో
వినుతింపం దగు దివ్వెయేని తగు దీ
ప్తిం గాంచునే హవ్యవా
హను సాన్నిధ్యమునందు నిల్పినఁ గళా
హైన్యంబె యందయ్యెడున్.

మ॥ సమ తేజస్కులు రాజు లిద్దఱొక రా
  జ్యం బేలినన్ భృత్యు వ
ర్గము మత్తేభ కపోల భాగములఁ బ
  ర్యాయ స్థితిన్ దాన లో
భమునం దేటులు మూగు చందమున స
  ర్వస్వంబునుం దోచుచున్
నిమిషం బైనను వీడకుండ్రు నృపు సా
  న్నిధ్యంబు నెల్లప్పుడున్.

ఇట్లు కువలయాపీడుడు తనకడను సోదరునివద్దను ధనమును సేకరించుచున్న యుద్యోగులను దమ్ముని వేఱు పఱచి వారిని రాజకార్యములందుఁ బాల్గొన నీకుండునట్లు నియమించి రాజ్యమును నిష్కంటకముగ నొనర్చెను. పిమ్మట నతఁడు క్రమక్రమముగ సంప్రాప్తబలుఁడై సరియగు తరుణమున దిఙ్మండలము నాక్రమింపఁ దొడఁగెను.

అట్టితఱి నొకనాఁడు మంత్రులలో నొకఁడు రాజు నానతి మీఱి పోయెను. అట్లతండు నడచుకొనుట కతని తండ్రి లలితాదిత్యుని యుపదేశమో లేక యతని దర్ప వికాసమో హేతువు గానోవును. ఏమైనను గువలయాపీడున కామంత్రి యవిధేయత మిక్కుటమైన యల్కఁ బుట్టించెను. ఆకతంబున తేఁడు రేయిఁ దల్పంబునఁ బరుండి నిద్దుర లేనివాఁడై దుర్వినీతుఁడైన యమ్మంత్రి చర్యను దలఁచి మఱింత యగుకినుకతో జాములు లెక్క వెట్టుకొనుచు నెట్లో యామినినిఁ గడపినవాఁడై మఱునాఁ డప రాధి యగు నాదుర్మంత్రిని వధింపఁ గోరెను. కాని, అట్టితరుణమునఁ గువలయాపీడునకు నవిధేయుఁడైన యమ్మంత్రియే గాక యతని నాశ్రయించి యుండిన వారు పెక్కండ్రుండుట తెలియవచ్చెను. వారందఱును వధ్యులుగా నతనిబుద్ధికి గోచరించిరి. ఆహేతువుచే రాజు పెద్దతడ వావిషయమును బరిశీలించెను. అట్లతనిచిత్త మనెడి పయోధి విచార మందరముచే మథింపఁబడుటంజేసి యందు మొదట మహాక్రోధ మను గాలకూటము పుట్టినను వెనుక శాంతి సుధ కల్గిన దయ్యెను.

ఉ॥ మానని చింత మందరము
  మాడ్కి మథింపఁగఁ గల్గు నట్టి పెన్
గ్లాని యతిప్రకోప దశ
  గాంచి యొకానొక కాలకూటమై
ప్రాణముఁ దీయ నున్న తఱి
  బాపురె! పుట్టును జిత్త మన్మహాం
భోనిధి లోన శాంతి సుధ
  పుణ్యము దాఁగిలి మూఁత లాడుటన్.

అంత నాతేఁడు క్రోధాగ్ని చల్లారుటచేఁ దనలోఁ దా నిట్లు తిన్నఁగఁ దలపోసెను. "ఇంతటి ప్రాణిహింస చేయఁదగు నని నాకెట్లు తోఁచినది? లోకమున నరుఁడు శరీరమునకు హితము గూర్పనెంచి చేయఁగూడని పనులం జేయుచుఁ బాపరాసులం బెంచుచుండునే గాని, అట్టి దేహము మర్త్యున కెవ్వని కయినను సుస్థిరముగ నుండునది గాదు. కావునఁ గృతఘ్న మైన మర్త్యతనువు నాడంబరమునకై జ్ఞానవంతుఁ డెవ్వఁడును హింసా పద్ధతులు హితకరము లని విశ్వసింపఁడు.

అయ్యో! పాపము, జీవులు తమ యాత్మ కాలుఁడను వంటవానిచే లెస్సగ నుడికింపఁబడు చుండుటచే క్షణక్షణమునకు నొక్కొక్క వింతయగు నవస్థను బొందుచుండుట గమనింపకున్నారు. నిన్న మొన్న, ననిమిత్తమైన హాసముల సొబగు మీఱుచుండిన మానవుని యాననము తెల్లదామర మొగ్గవలెఁ గన్పిందయి నేఁడు మీసాల దంబముతో నొప్పి దప్త తామ్రపు ఫలకమువంటిదై జేవు ముదిమిచే నెఱసినవెంట్రుకలతో నిండి ముదుసలి మేకపోతు తలవలె వికృతముగ నుండుట స్థిరకాల జీవులు వీక్షించుచుందురు, చిరస్థాయులగు నట్టిభూతములకు నల్పజీవులగు మర్త్యుల వయోవస్థల వికారము నవ్వు పుట్టించుచుండు ననుట నిక్కము."

గీ॥ భంగురము మేనుఁ బోషింపఁ బామరాళి
చేయఁగల దుష్క్రియల నెల్లఁ జేసి చేసి
పాపపుం గొండలను బెంచి భంగపడుదు.
రౌర! సుస్థిర మౌనె శరీర మవని?

గీ॥ అమలమతి యగువాఁ డెవ్వఁడైన నిట్టి
కట్టడి కృతఘ్న మగు మేను గారణముగ
విహిత విధులను మాని దుర్విషయ విహిత
పథములం బడి పోవంగఁ బాలుపడునె?

గీ॥ కాలుఁడను వంటవానిచే క్షణము క్షణము
వివిధ పాకంబు లొందుచు వింతగాఁగ
ఆత్మ పడెడు నవస్థల నక్కటకట!
ప్రాణు లెఱుఁగరు చెడ్డ త్రోవలను బట్టి

సీ॥ అనిమిత్త నిర్మల హాస యుక్తం బౌచుఁ
గమల కోశాకృతిఁ గాంచి నిన్న
ఉరువడితో నట్టె యున్నటులే యుండి
పుట్టు మీసలతోడఁ బిట్టు కర్క
శం బౌచుఁ దప్త తామ్రంబు చాయ నెసంగి
నేఁడుఁ తే పటుపయి నాఁడు నాఁడు
డుల్లి పోవుచు నుండు తెల్ల వెంట్రుకలతో
వికృత రూపంబున వెల్ల వోయి.

గీ॥ ముదుకయౌ మేకతల తలంపునకుఁ దెచ్చు
మొగముతోడనె యేమేమొ మరియు మనల
సుచిర సంస్థితి గల భూత నిచయము గని
పరిహసించుచు నుండుగా పలువిధములఁ

ఇట్లు చాల తడవు శరీరానిత్యత నాలోచించిన కువలయాపీడునకు శమసుఖమునం దాదరము మెండగుటచే నతఁడు రాజ్యమును ద్యజించి 'ప్లక్షప్రస్రవణము' అను నడవికిం బోయెను. కువలయాపీడుఁ డడవికిం బోవు నపుడు తననెమ్మనమున నిండ నిలువలేక పొంగిన వైరాగ్య సంస్కారపు టుత్సేకమును దనసింహాసనముపై శ్లోకరూపమున బ్రకటించెను. "భద్రముఖా! ఆరణ్యమునకే పొమ్ము. తపశ్చర్యకై మనస్సును నియోగింపుము. ఇట్టి యైశ్వర్య మంతయు నపాయకరమనియు క్షణభంగురమనియు నెఱుంగుము

కం॥ సిరి యచిరప్రభవలె న
స్థిర మెల్లరకని యెఱుంగు ధీరుం డెదఁ ద
ద్విరహంబునఁ గుందక సు
స్థిర మోక్షశ్రీ వరింపఁ జేరు నడవులన్.

అని యాశ్లోకమునందలి యాశయము. అయ్యది శాంతి ప్రబోధము సేయున్నది.

అంతట 'కువలయాదిత్యుఁడు' (కువలయాపీడుఁడు) అభగ్న శమ దమాది సంపదచే సిద్ధినిఁ బడసినవాఁ డయ్యెను. అతఁడు భవ్య చరితులగు వారి కీకాలమునను శ్రీపర్వతమునందు దృగ్గోచరుఁ డగుచునే యున్నాఁడు. ప్రభుపుత్రుఁడగు కువలయాపీడుఁ డారీతి నడవులం బడి పోవ స్వామిభక్తి యుతుఁడైన మిత్రశర్మ దుఃఖితుఁడై తనపత్నితోడఁ గూడి వితస్తా సింధు నదుల సంగమ స్థానమునందు నసువుల విడిచిపెట్టెను. ముక్తిస్థానమునకు సోపాన సరణి యనఁదగు సిద్ధిఁ బడసిన కువలయాపీడుఁడు గాశ్మీరము నొకసంవత్సరము పదునేను దినముల కాల మేలెను.

## వజ్రాదిత్యుఁడు (బప్పియకుఁడు)

పిదప 'చక్రమర్దిక' యను రాజపత్ని కొమరుఁడు 'వజ్రాదిత్యుఁడు' కాశ్మీరపతి యయ్యెను. ఇతనికి 'బప్పియక్కుఁడు' 'లలితాదిత్యుఁడు' అను నామాంతరములు గలవు. క్రూరచరితుఁ డగు నితఁడు సుధాసూతికి దుర్వాసుఁడు సోదరుఁ డైనట్లు ప్రజాహ్లాద విధాయి యైన కువలయాపీడునకు ననుజన్ముం డౌట చాల విసదృశముగ నున్నది.

ఉ॥ సోదరు లయ్యుఁ గొందఱు వ
సుంధరయందు విరుద్ధ కార్య మ
ర్యాదలతోడ నుందు; రమృ
తాంశు సహోదరుఁడై ప్రచండ కో

> పోదయమూర్తి గాఁడె ముని
> యొక్కఁడు, రావణు తమ్ముఁడయ్యు సం
> పాదిత సద్గుణ ప్రకర
> భాగ్యుఁడు గాఁడె విభీషణుం డిలన్:

మఱియు నితఁడు తనతండ్రి పరిహాసపూర్వమునం దుంచిన పలుతెఱంగు లయిన యుపకరణములను లోభమునకు దాసుఁడై యపహరించిన దురాచారుఁడు. కాత దత్యంతము రాగి. కావుననే భగ్న బీజము గాని గుజ్జుపుఁబోతువలె నితఁడు పెక్కండ్రు ప్రేయసులం గూడి రమించుచు "రాజానో బహువల్లభాః" అను లోకోక్తి సార్థకము గావించెను.

వెండియు నీదురాచారుఁడు మ్లేచ్ఛులకుఁ బెక్కండ్రు పురుషులను విక్రయించి మ్లేచ్ఛోచితమైన వ్యవహారమును దనమండలమునందుఁ బ్రవర్తింపఁజేసెను. కావుననే యితఁడు మున్నెవరును నాచరింపని నీచకార్యములు సల్పిన దుష్టుఁడను చెడ్డపేరు సంపాదించెను.

పాపాత్ముఁ డగు నితఁడు సర్వదా సంభోగ లాలసుఁడై యేడేండ్లు కాశ్మీరభూమి ననుభవించి చివరకు క్షయరోగియై యమక్షయము నొందెను.

## పృథివ్యాపీడుఁడు

పిదప నీవజ్రాదిత్యునకు 'మంజరికాదేవిఁ యందుఁ గలిగిన కొమరుఁడు 'పృథివ్యాపీడుఁడు' ఇతఁడు ప్రజాంతకుఁడై కాశ్మీరమును నాల్గు సంవత్సరములపైఁ గొన్నినెలలు (నాల్గుసంవత్సరములపై నొకనెల) ఏలెను.

## సంగ్రామపీడుఁడు

తఱువాత బప్పియునికి (వజ్రాదిత్యునకు) 'మమ్మాభిధాన' యగు ప్రేయసియందుఁ గలిగిన 'సంగ్రామపీడుఁడు' రాజపీఠము నాక్రమించెను. ఇతఁడు 'పృథివ్యాపీడుని' సమయింపఁజేసి రాజాసనమును బడయఁగల్గెను. ఎట్లయిన నేమి? రాయిస్వపు సోదరులచేఁ బాలిత మైన రాష్ట్రము హేమంత శిశిరర్తువుల యందలి సూర్య మండలమువలె ప్రకాశహీనమై యుండె ననుట నిక్కము. ఈ సంగ్రామపీడుఁ డేఁడు దినములుమాత్రమే పాలకుఁడై కాలగతి నొందుటకుఁ బ్రజలు చేసికొన్న పున్నెమే హేతు వనవలయును.

## జయాపీడుఁడు

అనంతరము బప్పియుని కొమరుఁడు చిన్నవాఁడు 'శ్రీమజ్జయాపీడుఁడు' రాజాసన మలంకరించెను. అతని చిన్నతనమునుండియు సమాత్యు లతనిని గుఱించి "పితామహునకు సమానుఁ డవ గుదువు" అని పలుమాఱు వచించుచుండుటను దలంచి యతఁడు విపుల బలము నాయత్తపఱచికొని జిగీషువై జైత్రయాత్ర సేయ బయలువెడలెను. నయనిపుణుఁ డగు నితఁడు స్వదేశము విడువక మున్నే యాయా ప్రాంతీయ నరపతులను వశపఱచుకొని వారితోఁ గూడి ప్రస్థానము సేయుచున్నవాఁడై కాశ్మీర

ప్రవేశించెను. ఆపురము పౌరులు చక్కని పరిపాలనమున నరలువా రగుటకును నతఁడు కరమానందించి యందుండు షణ్ముఖుని యాలయమునందుఁ బ్రవర్తింపఁబడు లాస్యమును జూడ వేడుక పడిన వాఁడై యచ్చోటనకుం బోయెను.

జయాపీడుఁడు 'భరతముని' ప్రోక్తమైన నృత్తగీతాది శాస్త్రమును బాగున నెఱింగిన వాఁడు గాన నచ్చటి లాస్యము జరుగు చోటునకు దగ్గఱ నొక శిలపై గూర్చుండి యుండెను. అచ్చట ప్రేక్షకు లతని గంభీర మనోహరాకృతిని గాంచి విస్మయచకితులై చెంగట నుండ నోడి కొంత దూరమునకు జరిగి కూర్చుండిరి. అట్టి తఱుణమున 'కమల' యను నామమునఁ బరఁగిన నర్తకియు నాసుందర విగ్రహుని వీక్షించెను. పిమ్మట నసామాన్యాకృతి యగు నాతఁ డప్పుడప్పుడు తన పాణిపంకజమును భుజశిరస్సుపై నుంచుట నానర్తకి గ్రహించి యచ్చెరువందుచు "నిమ్మహాపురుషుఁ డెవరగునో! లోకోత్తర వంశ సంభూతుఁ డగు నొకానొక నరేంద్రుఁడో! లేక రాజపుత్రుఁడో! గూఢముగ నీరీతి జరించుచున్నవాఁడై యుండును. అని ధ్రువముగ నమ్మవచ్చును. ఇందుల కితఁడు ప్రతిక్షణమున నంసపృష్ఠమునందుఁ దనపాణికమలమును జేర్చుటయే సాక్ష్య మగుచున్నది. ప్రాయికముగ నిట్టి యభ్యాసము వెనుక నిలిచి పరిచారిక లందిచ్చు తమ్ములపు మడుపు లగైకొనుటవలన రాజుల కుండును.

ఏనుఁగు తేంట్లగుమి దానాశచేఁ దనచెంతఁ జేరనప్పుడును గర్ణములు గదల్చుచునేయుండును. సింగము తనవెనుకఁ గరియూథము లేకున్నను నప్పు డప్పుడు కంధరము ద్రిప్పి యవలోకించుచుండును. నెమళ్ళు మొగులుగమి యుత్పన్న మగు తఱుణము దప్పినను నాకసము వంకఁ జూచి కేకలు వేయుచునే యుండును. ఇట్లే ప్రవృత్తియందు ప్రాణులకుఁ జిరకాల మలవాటు పడిన చేష్టలు కారణము లేకున్నను స్వయముగ వ్యక్త మగుచుండునని యూహింపఁ దగి యున్నది.

చం॥ కరు లట లేకయే తిరిగి
　　తాంచును సింహము; దానకాంక్షి బం
భరములు మూగకున్నను ద్వి
　　పంబు చెవుల్ గదలించు; మేఘముల్
నురిగిననేని కేకి తన
　　చోద్యపుఁ గేకలు మానకుండు; సు
స్థిర చిర సంతతాభ్యసన
　　చేష్టలు హేతువు పోవఁ బోవునే?

అని తన లో నాలోచించుకొని కొంతతడవున కొకానొక నిర్ణయము గావించుకొని తన డెందముతోఁ గలసి మెలసి యుండెడు సఖిని జయాపీడుని దగ్గఱకుఁ బంపెను. ఆరాజచంద్రుఁడు మరలఁ దనపాణి నంసపృష్ఠముపై నుంచి యుండ నర్తకి యొక్క చెలి మెల్లఁగ వెనుకటి భాగముఁ జేరి యతని కరమునందుఁ బోఁక పలుకుల నుంచెను. అంత జయాపీడుఁడు వానినోట నుంచుకొని వెనుకకుఁ దిరిగి చూచి భ్రూసంజ్ఞతో నీ వెవ్వరి దాన వని కమలయొక్క చెలినిఁ బ్రశ్నించెను. అప్పు డావామనయన తననెచ్చెలి తాంబూలము నిచ్చిరమ్మని పంపుట నెఱింగింప నమ్మనుజపతి యా'కమల' యెడ నత్యంతము దాక్షిణ్యము గలవాఁ డయ్యెను.

లాస్య ప్రదర్శన మయిన తరువాత నావెలికత్తె మధుర సల్లాపములచే జయాపీడుని మాన సము హరించి మెల్లఁగా నగుచుఁ గమలయొక్క నివాస భవనమునకుఁ గొనిపోయెను. అప్పుడు నవ్విలా సిని జయాపీడునకు నిరుపమాన మైన మైత్త్రీభావముతోడను, మృదు మధుర మైన నాగరిక సంభాషణ ముతోడను సకలోపచారములు చేసి యతని విస్మయ పరవశునిఁగాఁ జేసెను.

తరువాత రజనీముఖము శశాంక కలావిలాసముచే భాసమై యొప్పారుచుండ నవ్విలాస వతి క్షమాపతి పాణిపద్మమును బట్టికొని శయనాగారమునకుఁ దీసికొని పోయి తన బంగరు పడక మంచముపైఁ గూర్చుండఁబెట్టెను. అంతటఁ గొంత సంలాపము జరిగిన మీఁదట నయ్యాట వెలఁది మైరేయముఁ గ్రోలి మత్తయై సురతాభిలాషతో నతనిం బురికొల్పెను. కాని యాతఁడు పెదవి నించుకేని కదల్పక మిన్నకుండెను. అందుల కాకుటిలాలక లజ్జావివశయై యుండ జయాపీడుఁడు తోడనే తన విశాల వక్షమునం దవ్విలాసవతిని జేర్చుకొనువాఁడువోలెఁ గౌఁగిలించి మెల్లమెల్లఁగ నూరడించుచు నిట్లు పలికెను. "కమలనయనా! కమలా! నీవు నాచిత్తహారిణివి కాక పోలేదు. మఱేమన? సమయానురో ధము నన్నిప్పుడు సాపరాధునిఁ గావించుచున్నది. కల్యాణీ! అవ్యాజము లైన నీ మనోహర గుణము లచేఁ గ్రీతుఁ డయిన యీతఁడు నీకెప్పుడైన దాసుఁడే సుమా! అచిరకాలమున నావృత్తాంతము నరసి నాయెడఁ దప్పక దాక్షిణ్యమును జూపుదువు, అభిమానవతీ! నేనొక కార్యమును నెఱవేర్ప నుద్యమించి యున్నాఁడను. అద్దానిని సాంతముగఁ దీర్చు వఱకు భోగముల ననుభవింపకుండునట్లు సంకల్పించి యుంటిని. ఇట్టి నానిర్ణయమును దెలిసికొనఁ గోరెదను." అని యిట్లు పల్కి యుంగరములచే నలం కృత మైన పాణిచేఁ బర్యంకమును మాఱు పల్కించుచు నున్నవాఁడువోలె నిడుద యగు నిట్టూర్పు పుచ్చి యొక్క శ్లోకము మెల్లఁగఁ దనలో దాను పఠించెను. ఆ శ్లోకమునం దిట్లు గలదు, "జిగీషువు మనస్వియు నైన వాఁడు ముఖ్య మగు తనవాంఛితమును నెఱవేఱునంత వఱకుఁ గాంతాచింతనము మాని యుండును ఇనుఁడు సకల మైన జగము నాక్రమింపకయే సంధ్యా సంగతుఁ డగుట లేదుగదా!

గీ॥ మానవంతుండు విజయ సంపాదనేచ్ఛ
మాని యబలావిలాస నిమగ్నుఁ డగునె?
జగము మేల్కొల్పి సర్వంబుఁ జక్కఁ జేసి
కాదె మిత్రుఁడు సంధ్యను గలయఁ జూచు!

శ్లోకమునందలి భావమును గలాకుశల యగు నాకమల తావన్మాత్ర పఠనముననే గ్రహించి యతఁ డొక మహాపురుషుఁడుగా నుండవలయు నని యనుకొనెను. అనంతరము ప్రభాతమున గమనో న్ముఖుఁ డగుచున్న జయాపీడునిం గాంచి ప్రణయముతోడఁ బ్రస్తావనను నచిరకాలమున ముగింపవలయు నని బలవంతపెట్టుచు వేడికొనెను. అమ్మాటల కతఁ డేమియు ననక తనపనిపైఁ దాఁ బోయెను.

పిమ్మటఁ గొంతకాల మిట్లు జరుగఁగా నొకప్పుడు జయాపీడుఁడు సంధ్యా సమయమునకు నదికిం బోయి యచ్చోటఁ గాల్యంబు యథావిధిగ నొనర్చి రేయి చాల తడవునకుఁ గమలయొక్క భవనమునకుఁ జేరెను. అప్పు డవ్విలాసిని భవనము విలాస రహితమై గగ్గోలువడి యుండుట గాంచి యిట్లుండుటకుఁ గత మేమని కమల నడుగ నమ్మీననేత్ర శుచిస్మితయై యిట్లు మాఱు పల్కెను.

"ఈపురమున రాత్రులం దొక సింహము దిరుగుచున్నది. అది ప్రతిదినమునను నగరము నందలి గుఱ్ఱములను నేనుఁగులను మనుష్యులను బట్టికొని హింసించుచున్నది. మీరు చాల కాలము వనుక రాకుండుటచేఁ బంచాస్యము వలని భీతిం దలంచి మిగులఁ గుందుచున్నాను. రాత్రి యారంభ మయ్యెనేని రాజు లయినను రాజపుత్రు లయినను నడువ సాహసింపక యాక్రూర మృగమువలన వెఱఁగంది తమతమ యిరవులను విడిచి యడుగైనను గదలకున్నారు. ఇయ్యదియే హేతువు." అని నుడువుచున్న యమ్ముద్దరాలి మాటల నత్తు పెట్టి పరిహసించుచు జయాపీడుఁ డొకింత సిగ్గుపడిన వాఁడువోలెఁ గన్పట్టుచు నెట్లో యారేయిఁ గడపెను.

మఱునాఁడు జయాపీడుఁడు పగలు గడవఁగనే పుర మధ్యమునుండి బయలుదేరి పోయి యొకానొక గొప్ప మఱ్ఱిచెట్టుం జేరి యచ్చోట దిగువఁ గూర్చుండి సింహముయొక్క రాకకై ప్రతీక్షించుచుండెను.

ఇట్లుండఁ గొండొక సమయమున కాహార్యక్షమ శరీర చ్ఛాయచే విస్ఫారిత వకుళ పుష్పపుఁ జాయను మీఱుచున్నదై నడచుచు నర్పుచున్న రాయని యట్టహాసమో యన్న తీరున నొప్పారుచు జయాపీడుని కన్నులకు దూరమునఁ గానవచ్చెను. పిమ్మట నారాజసింహ మాకేసరి వేఱొక దారిం బట్టి పోవుచుండుటను బరికించి విగ్రహగ నటుచును దానినిఁ గయ్యమున కాహ్వానించెను.

ఆయఱపులకు గంతీరవము చురచుర మని రేఁగి చెవులు గదలకుండునట్లు సారించి వికరాళ మగు నోరు దెఱచి పూర్వకాయమును పొడిగించి కేసరములు గంపింపఁజేయుచు నాఖీలముగ నొక్కదుముకున జయాపీడుని దగ్గరి యతనిపై దుటికెను. ఆరాజకంఠీరవుఁడును వెంటనే నేరిమి మెఱపునఁ దనమోచేతినిఁ గైకొనుచున్న యాసింహము నద్భుత బిలమున దూర్చి యతిశయమునఁ గరవాలముచే దాని యుదరమును బిట్టుగఁ బొడిచి చీల్చి చేసెను. ఆదెబ్బతో నది తాఁ గబళించిన మత్తేభముల సింధూర పర్ణముం బోలిన రుధిరమును గ్రక్కుచు నేలం గూలి విలవిల తన్నుకొనుచు నసువులం బాసెను.

అంత వీర రాజన్య చూడామణి యగు జయాపీడుడు గాయమునకుఁ గట్టు కట్టుకొని మోచేయి గనఁబడకుండునట్లు మెలఁగి నగరి యగారముఁ బ్రవేశించి యెప్పటిరీతి నారాత్రియందు నిద్రించెను.

ప్రభాత మగుచుండఁగనే సింహము వధింపఁబడినట్లు రాజునకు వార్త దెలిసెను. 'జయంతుఁడు' అమ్మాట వినిన వెంటనే యత్యంత కుతూహలముతో దానిం జూడఁ గోరి తా నాప్రదేశమునకుఁ బోయి యాకేసరియొక్క ఘనమైన మృతకళేబరమును బరిశీలించి యయ్యది యొక్క ప్రహారమునకే పంచత్వ మొందినట్లు గుర్తించి యెంతయు విస్మితుఁడై సింహమును జంపినవాఁ డమానుష విగ్రహుఁడు గానోపునని భావించెను. అప్పుడు ప్రక్క నున్న తనసేవకుఁ డొకఁడు సింగపుఁ గోఱల నంటుకొని విరిగి కొని యున్న కేయూర మొకదానిం జూచి తీసికొని ప్రభువుని కొసంగఁగా, నాకేయూరమునందు 'శ్రీజయాపీడుఁడు' అను నామాక్షరము లుండుటఁ గాంచి జయంతుఁడు మఱింత విస్మయపడి యారాజకుంజరుఁ డిక్కడి కేల వచ్చెను? అని యాలోచించుచుండఁగా నావృత్తాంతము పురమంతయుఁ బ్రాకుటచే బౌరు లందఱు జయాపీడుని రాక నాశంకించుచు భయభ్రాంతులుగాఁ దొడఁగిరి.

అంత జయంతుఁడు పౌర జనులు పడుకలవరపాటును నిమర్శించి వారితో "సంతసింపఁ దగు నవసరమున, దల్లడపాటు నొందెదు మీకంకె మూఢు లెవ్వరును లేరు. బాహు బలశాలి యగు జయాపీడనరేంద్రుఁ డేదో యొకానొక కారణమున దిగ్విజయమున నేకాకియై దిరుగుచున్నట్లు వినియుంటిమి. ఆరాజపుత్రుఁడు నాకు కల్లటుఁడు (అల్లుఁడు) పుత్రహీనుఁడ నగు నేను మా 'కల్యాణదేవి' నా రాకొమరున కొసఁగి పరిణయము సేయఁగోరుచున్నాను. మనచే వెదకఁబడు నానృపాలుఁడు తానే యిట కేగుదెంచెనేని మన యదృష్టము ఫలించినట్లగునుగదా! రత్నముల సంపాదింపఁగోరి రత్నపుదీవికిఁ బయనము సేయ నుద్యుక్తుఁ డగు వానికి నింటనే రత్నఖని దొరకినపుడు వాని సంతసమునకు మేర యుండునా? తలచుగ నమ్మానవేశ్వరుఁడు మనపురమునందే యుండవచ్చు నని తోఁచుచున్నది. మీలో నెవ రారాకొమరుని వెదకి యతని యునికిం దెల్పుదురో! యట్టివారి యభీప్సితము నెఱవేర్తును." అని పలికెను. పౌరులు సత్యవాది యగు తమఱేని వాక్యము లాలించి సంతసించుచు జయాపీడుని యునికిని గనిపెట్టుటకై పెక్కు తెఱంగులఁ బ్రయత్నించి తుదకు నతఁడు కమలానిలయమున నుండుట యెఱింగి యయ్యుదంతమును దమప్రభువునకుం దెల్పిరి.

అంత వెంటనే జయంతుఁడు మంత్రులు మున్నగువారితోడను నవరోధ జనముతోడను గూడి కమలానిలయమున కేతెంచి జయాపీడునిఁ బ్రసన్నునిఁ జేసికొని యుత్సవము జరిపించుచు నారాజ పుత్రునిఁ దననగరునకుఁ దీసికొని పోయెను.

జయంతుఁ డంతటఁ "దనకూతుఁ 'గల్యాణదేవిని' స్వీకరింపుము." అని కల్యాణ పరంపర నొందఁగోరిన జయాపీడుని వేడుకొన నమ్మహీవల్లభుఁడు దాను విడిచి వచ్చిన రాజ్యలక్ష్మిని మరలఁ గైకొనుచున్న వాఁడువోలె నాకల్యాణదేవికరమును గ్రహించినవాఁ డయ్యెను.

జయాపీడుఁడు సైన్యము మొదలగు పరికరము లేకున్నను దనబాహుబలముతోడనే యచ్చటి గౌడరాజుల నేవుర నోడించి వారికందఱకును దనశ్వశురుని నధీశ్వరునిగా నొనర్చెను.

ఇట్లుండ మిత్రశర్మామాత్య కుమారుఁడు దేవశర్మ జయాపీడుఁడు నిజసైన్యమును బంపివేసి తానొంటరిగ బయలుదేరి పోయినపుడు అచ్చటచ్చట మిగిలి యున్న సేనం గూర్చికొని తమ ప్రభువున్న తావెఱింగినవాఁడై యచ్చోటునకు వచ్చి జయాపీడుని స్వీయ రాష్ట్రమునకు మరలి వచ్చునట్లు ప్రార్థించెను. ఆనరేంద్రుఁ డతనివేడికోలునకు సమ్మతించి ముందు జయశ్రీని వెనుక నాయిర్వుర చారులోచనల నిడికొని కాశ్మీరమునకుఁ బ్రయాణ మయ్యెను.

దారినడుమ నతఁడు తన పౌరుషమును దీపింపఁ జేయుచు కాన్యకుబ్జేశ్వరుని జయించి రాజ్యచిహ్న మగు నతని సింహాసనమును హరించెను. అంత తనదేశమున నడుగువెట్టఁగనే యంతకు మునుపే సైన్యమును సన్నాహపఱచి యుంచిన జజ్జుఁడు జయాపీడుని మార్కొనుటకై ససైన్యుఁడై బయలుదేరెను. జజ్జునకు జయాపీడునకు 'శుష్కక్షేత్రము' అను గ్రామమున దారుణ సంగ్రామము పెక్కు నాళ్ళు జరిగెను. గ్రామములయందును నుండు జను లెల్లరు జయాపీడునియెడఁ గడు నను రాగము గలవారును జజ్జునిపాలన మొప్పనివారును నగుటచే నాకయ్యమునందు వారందఱు గుంపులు గుంపులుగ జయాపీడునిపంకఁ జేరి సాయపడఁజొచ్చిరి.

ఆసమయమున నూళ్ళనుండి వచ్చు జనులలో 'శ్రీదేవుఁడు' అను నొక గ్రామచండాలుఁ డుండెను. అతఁడు యోధులను "జజ్జుఁ డెక్కడ నున్నాఁడు చూపుఁడు" అని యడిగెను. జజ్జుఁడు రణాంగణమునందు దప్పి గొన్నవాఁడై బంగరు పాత్రయందలి నీటినిఁ ద్రాగుచు గుఱ్ఱముపైఁ గూర్చుండి యుండుటను శ్రీదేవునకు దూరమునుండి చూపించిరి.

అంతట నా'శ్రీదేవుఁడు' తనచేతిలోని ఱాతిని గిరగిర త్రిప్పుచు విసరి సూటిగ జజ్జుని మొగమునఁ గొట్టి "ఇదిగో! జజ్జుఁడు నాచే హతుఁ డయ్యెను." అని పెద్దగఁ గేకలు వేసెను. శ్రీదేవుఁడు మొదట నింటినుండి బయలు దేరునపుడు తనతల్లిని "అన్నముపెట్టుము. రాజుగారికి యుద్ధమునందు బాసట గావలయును." అని యడిగి యుండెను. ఆమాటలకు వానితల్లి నవ్వగా, నతఁడు "చూడుము నేను జజ్జుని సంహరించి వచ్చెదను" అని శపథము చేసి యుద్ధభూమికి వచ్చి ఇట్లు తనపని నెఱవేర్చి యుత్సాహాతిశయమున నుప్పొంగుచుఁ గేకలు వేసెను.

తఱువాత నట్లు శ్రీదేవుని ఱాతిదెబ్బచే జజ్జుని మోము చీలి పెద్ద గాయముచే వికృత మగుటయు గాక యతఁడు గుఱ్ఱమునుండి నేలంబడి యటు నిటుఁ బొరలుచు నాసన్న మరణుఁ డగు చుండ వాని వంక వారందఱు వాని నచ్చో విడిచి పలాయితులైరి. జజ్జుఁడు రాజ్యమును ద్రోహముతో నార్జించెను, కాని యపత్ర విక్రముఁడగు మహావీరుఁ డొకఁడు తనకు శాత్రవుఁడై యున్నాఁడన్న భయముతోడ నెల్లపుడు చివుకుచు నెట్టెట్లో మూఁడేండ్లు రాజ్య మనుభవించి కడకేరీతిఁ మద ముట్టెను.

లోకమునఁ దమవద్దఁ గుదువఁ బెట్టిన వస్తువు నపహరించి కూడంబెట్టు వర్తకుల దగ్గఱను, కాముకజనమును వంచించి యార్జించుకొను వారవనితలకడను, ద్రోహమున రాజ్య సంపాదనము సేయు రాజుల వద్దను సంపదలు నిలుకడ నొందక నత్వరములుగ నశ్వరము లగుచునే యుండును.

గీ॥ న్యాస హరణంబుచేత బేహారి, ద్రోహ
పద్ధతిని భూపతులు, జూద వంచనమున
వెలవెలందులు నార్జించు విత్తచయము
నిలువక నశించు చుండుఁ జంచల విధమున.

జజ్జుఁ డారీతి హతుఁడైన పిమ్మట జయాపీడుఁడు రాజ్యశ్రీని నన్నైదండ నలరించుచు సత్కృత్యములచే సాధుజనులలం దనుపుచు బుడము నేలుచుండెను. కల్యాణదేవి తనపతి యేతావున శాత్రవ సంహారము వలన విజయ కల్యాణము వడసెనో! అచ్చోట గల్యాణపురము అను నొక నగరమును గట్టించెను. జయాపీడుఁడు 'మల్హాణ' పురమును నిర్మింపఁజేసి 'మహులకేశవుని' ప్రతిష్ఠ గావించెను. రాజవల్లభ యగు నా'విమల'యుఁ గమలపురమును నిర్మింపఁజేసెను. జయాపీడుఁడు కల్యాణదేవియెడఁ దనకుఁ గల దాక్షిణ్యాతిశయమును వెల్లడించుచుఁ 'మహా ప్రతీహారపీఠమునకుఁ జెందిన యధికార గౌరవమును దొల్లిటికంటె వృద్ధి పఱచెను.

తొల్లి 'కశ్యపుఁడు' ఉత్పత్తిస్థాన మైన కాశ్మీరదేశమున దూరమూలముగఁ దిరోహిత మయ్యెడు 'వితస్తానదిని' శివు ననుగ్రహమున నవతరింపఁజేసి నట్లు జయాపీడుఁడు విద్యాసంపదను గాశ్మీరమున నెలకొల్పి వన్నెకెక్కినవాఁ డయ్యెను.

ఒకప్పుడు లోకానొకఁడు ఆనరేంద్రుని కడకు వచ్చి "నేను మాటలనైనఁ జక్కఁగ నేరని మూర్ఖుఁడను అనుగ్రహింపుఁడు" అని నిజము దెలుప నతనిని విశరణముచే నాదరించి యది మొదలు సర్వవిధములైన విద్యలు నేర్చి యుండిన విద్యావంతులను రావించి వారికిఁ బరస్పరము విద్యాస్పర్ధలు గల్పించుచు భారతికిఁ గ్రొత్త వినోదము గల్పించుచుండెను. కావున జయాపీడుఁడు నరేంద్రుఁడు మాత్రమే గాక మహాపండితుఁ డని యుఁ జెప్పఁదగి యున్నాఁడు అతఁ డాకాలమునఁ దనదేశమునఁ బ్రచారము లేక విచ్ఛిన్నమై యున్న 'పతంజలి' కృత మహాభాష్యమును బాఠ ప్రవచనముల మూలమున వ్యాప్తి నొందించి క్షీరనామకుఁడు (క్షీరస్వామి) అయిన శబ్దశాస్త్రవిదుని సవిధమున శబ్దశాస్త్రమును బాగుగ నభ్యసించి బుధవర్గమునందు జయాపీడ పండితుఁడు, అను గౌరవమును బడయఁగల్గెను. బుద్ధి వైశద్యముచే విరాజిల్లు నానరేంద్రుఁడు తనతో రాజు లెవ్వరును బోటీసేయుట కెంతమాత్రము సహింపలేఁడు, కాని బుధులతోడఁ దనకెప్పుడును విద్యా స్పర్ధ యుండుట కెంతయు నుల్లాసపడు చుండెడువాఁడు

ఈకాశ్మీరపతికి రాజబిరుదమువలనఁ గలిగిన ప్రఖ్యాతికంటెను విద్వద్బిరుదమువలనఁ గలిగిన ప్రథ లోకమున నత్యధికమై వ్యాపించుటచే నయ్యది కాలాంతరమున నతఁ డొనర్చిన దోషములచే నితరగుణములట్లు మాలిన్యము నొందక యెప్పటియట్లు నిర్మలమై దనర్చిన దనుట కొనియాడఁదగిన విషయము.

ఇతరముఁ జెప్పనేల? ఆతేఁ డిట్లు విద్వదధీనుఁడు కాఁగా నతని దర్శించి సేవానుగ్రహము నొందఁగోరి వచ్చిన నృపాలురు విద్వాంసుల నాశ్రయించుచు వారివారి గృహముల నుండుటయు నమ్మనుజేంద్రుఁడు దేశదేశములందుండు పండితప్రకాండులను వెదకించి వెదకించి తనయాస్థానమున నాకర్షించుటయు నేర్పడెను. అందువలన నితర నరపతుల మండలములయందు విద్వాంసుల కఱవు సంభవించెను. ఇట్టి విషయము పరిశీలించినచో నాజయాపీడుని విద్యాభిమాన మెంతటిదో విదితము గాఁగలదు.

మఱియుఁ దనమంత్రి 'శుక్రదంతుని' భక్తశాల (అన్నదానశాల)యం దధ్యక్షుఁడుగ నున్న 'థక్కియుఁడు' అను పేరుగలవాఁడు పండితుఁ డగుట యెఱింగి యమ్మహారా జాతనిని స్వీకరించి యుక్తమయిన యున్నత పదవి నొసఁగెను, భట్ట బిరుదాలంకృతుఁడు మహావిద్వాంసుఁడును నగు 'ఉద్భటుఁడు' జయాపీడుని యాస్థానముననుండి యనుదినము నొకలక్షదీనారములను వేతనముగ గ్రహించుచు సభాపతియై వినుతికెక్కి యుండెను. తొల్లి బలిచక్రవర్తి ధుర్యుఁడైన 'కవి' నాదరించినట్లు చక్రవర్తి యగు జయాపీడుఁడును 'కుట్టినీమతమును' రచించిన 'దామోదరగుప్తుఁడు' అను మహాకవినిఁ దనధీసచివునిగ నొనర్చుకొనెను.

ఈ విధముగనే జయాపీడుని యాస్థానమున 'మనోరథుఁడు' 'శంఖదంతుఁడు' 'చటకుఁడు' అనువారు కవులుగను, వామనుఁడు మొదలగువారు మంత్రులుగను నుండిరి.

ఒకప్పుడు జయాపీడుఁడు పశ్చిమ దిక్కునందు సూర్యుం డుదయించినట్లు కల గాంచెను. అందుచే నతఁడు దేశమునందు ధర్మవేత్త యయిన యాచార్యుఁడు ప్రవేశింప నున్నాఁ డని తలంచుచు నాస్వప్నము హితసూచక మని భావించెను.

మఱియు నతఁడు విశుద్ధమైన మానసము గలవాఁడు గావున స్తుతియెడ వివేచన సేయఁ గలిగి మెలఁగు నేర్పరియు నుపభోగ్యము లయిన భావముల యాస్వాదమునందలి యంతరువు నెఱింగిన రసజ్ఞుఁడునై యుండెను.

భావాస్వాదన చణులగు కోవిదులం గూడి మనోజ్ఞ భావముల నెఱుంగని భూపతు లంధ వృషభములవలెఁ గడుపు నిండ భోజ్యముల మెక్కుటకంటె నేమి తెలిసికొనఁగలరు? చితిపై పడుండి యున్న వానికి సహగమనము సేయు సతి యాలింగనము వలని సుఖ మేమి తెలియును? ప్రబలమైన మూర్ఛచేఁ దన్నుకొను వానికిఁ జెఱకురసపుఁ జవి యెట్లు గ్రాహ్య మగును? గతాసువునకుఁ బూలదండల సువాసనచే ఘ్రాణతర్పణ మేరీతిఁ గాఁగలదు? అట్లే హృదయంగమము లగు భావముల మహిమ చిత్తోదాత్తత లేని మొఱకునకు నెంతమాత్రమును గోచరింపదు. జయాపీడుని మూర్తి యొక్కటి ముకురములవంటి మంత్రవిదులందుఁ బ్రతిఫలించి వేయితెఱంగుల యాకృతులతో నొప్పారెను.

కం॥ భావముల చవులు దెలియుట
పూవుల తావుల నెఱుంగు నోఁడిమి యౌ; మే
ధావులకె చెల్లుఁగద త
ద్భావన జన్మాంతరార్జితపు సుకృతమునన్.

గీ॥ భవ్య భావ రసానుభవంబు గలుగ
రసవిదగ్రణులైన వారలను జేర్ప
నట్టి నృపు లంధవృషభంబులట్లె యశన
మునకు మించి గ్రహింపఁ జాలు నది యెద్ది?

సీ॥ చితిపైఁ బరుండిన పతికి సతీమణి
సహగమనాశ్లేష సౌఖ్య మెఱుక
పడునె? మోహపిశాచి పట్టి నష్టస్మృతి
యగు వానికిక్షు రసామృతంపుఁ
బానంబు చవి మదిఁ బట్టునే? ప్రాణముల్
వాసిన యాకళేబరమునకును
సుమనో మనోహారి సూన దామంబుల
యామోదము రవంత యవసరంబె?

గీ॥ సహృదయుఁడు గాని జడుని కీజగతి మధుర
బహువిధ పదార్థ సుస్వభావంబు మహిమ
గోచరించునె తల ద్రవ్వియ్యెఁగొట్టుకొనినఁ
గాని సుంతేని? తథ్యంబు గద యిదెల్ల!

గీ॥ మంత్ర విక్రమములు రెండు మనుజపతి!
విలువుటద్దంబులై ఘనతి నెగడుచుండు.

వానిలోపల బింబించు వాని మూర్తి
యద్భుతముగ సహస్ర సంఖ్యాక మగును.

ఒకానొకప్పుడు జయాపీడుఁడు తనయెదుట నున్నవాఁడును చండి విగ్రహముల రెంటిని నడపువాఁడును నగు నమాత్యునిం గాంచి "వెంటనే నీవు లంకాధిపు నగ్రజకుఁ బోయి సేవుర రక్కసుల నడిగి తీసికొని రమ్ము" అని యాజ్ఞాపించెను. ఆసచివుఁడును దనయర్హతకు మించి యున్న యావిగుణ మైన యానతిని సైతము సేయ సమ్మతించి పయనమై నౌకను సాధనముగఁ జేసికొని కడలి దాఁటుచుండెను. అప్పు డానావనుండి జారి యతఁడు సాగరములోఁ బడెను. పాపము! దురదృష్టమున వాని నొక తిమి మ్రింగెను. వెంటనే యాధీరుఁడు తనఛురికచే తిమి పొట్టను గోసి వెలికి వచ్చి యావలి గట్టుం జేరి లంకను బ్రవేశించి రాజును దర్శించి తాను తెచ్చిన లేఖ నొసంగెను. లంకాపతి యగు విభీషణుఁడును రామభక్తుఁడు గాన వచ్చిన దూత మర్త్యుఁడైనను బ్రీతితో గౌరవించి జయాపీడుఁడు గోరినట్లు రాక్షసుల నిచ్చి వచ్చిన దూతను సురక్షితునిగ నిజదేశమునకుఁ బంపెను.

జయాపీడుఁడు కృతకృత్యుఁడై వచ్చిన యాసచివుని నానావిధ బహుమతులచే గౌరవించి వచ్చి యున్న రక్కసుల సాహాయ్యంబున నొక యగాధ మైన సరస్సునం దమరావతి కెన యగు జయపురమును గొప్ప దుర్గము నొక దానిని నిర్మింపఁజేసెను. ఆపురదుర్గమునందు జయాపీడునిచే నెలకొల్పఁబడిన పెక్కు దృశ్యములు గలవు. వానిలో గొప్ప బుద్ధవిగ్రహములు మూఁడు రమ్య మైన యొక విహారము ప్రశంసనీయములు. మఱియు జయాపీడుఁడు ఆనగరమునందు 'జయాదేవిని' శేషశాయి యగు కేశవుని విగ్రహమును బ్రతిష్ఠించెను. ఆవిగ్రహమును జూచు నపు డయ్యది చతురాకృతియు శేషశాయియు నగు కేశవుఁడు విష్ణులోకమును విడిచి యావిగ్రహమునందుఁ దన భవ్య మూర్తితో వెలుఁగుచున్నాఁ డని మనస్సునకు స్ఫురింపఁ జేయుచుఁ బ్రేక్షకుల నానంద పారవశ్యము నొందఁ జేయుచుండును.

జయాపీడుఁడు రాక్షసుల బిలిపించి వారిచే నేతొక కార్యమును జక్క బెట్టించి తనశిల్పులచే సరస్సునందలి జలము మరుగుపడి పోవు నట్లు కావించె నని కొందఱు నుడువుచున్నారు. కంసారి జయాపీడునకుఁ గలలోఁ గాన్పించి "నాకు జలమధ్యమున 'ద్వారవతీ దుర్గమును' నిర్మింపఁజేయుము" అని యడుగ నారాజేంద్రుఁ డట్లే 'ద్వారవతీదుర్గమును' గట్టించెను. నేఁడును జనులు రాజధానికి సంబంధించి యున్న యాద్వారవతిని బాహ్య దుర్గమనియు జయపురము నభ్యంతర దుర్గ మనియు బేర్కొను చుందురు. జయాపీడునివలన మీహాబిరుదముల నైదింటినిఁ బొంది యున్నవాఁడును నమాత్యుఁడును నైన 'జయదత్తుఁడు' 'జయపురదుర్గమునంమఁ' గట్టించిన మఠ మొండు గలదు.

రాజభక్త 'ప్రమోదుఁడు' అనువాఁడు మధురకు రాజు. అతని యల్లుఁడు 'ఆచాభిదేయుఁడు' 'ఆచేశ్వరుఁడు' అను పేర హరుని బ్రతిష్ఠ గావించెను.

జయాపీడమహీధవుఁడు గొంతకాల మీరీతి జరిగిన తఱువాత మరల యుద్ధోపకరణములను గూర్చుకొనిన వాఁడై దిగ్జయకాంక్షతోడ బయలు దేరెను. అప్పు డతని సైన్యమునందలి మత్తేభ

బృందము తూర్పు కడలి తీరముం జేర నంపు మిక్కిలి పొడవైన కొండ చాలొకటి యేర్పడిన ట్లొప్పారెను. అప్పు డారాజచంద్రుని వాహిని యతనితోడఁ బూర్వవారినిధిఁ జేరినను హిమాద్రియందు గూడ నవిచ్ఛిన్నమై పొల్చుచు భాగీరథివలెఁ గాన్పించెను.

రాత్రియందు సముద్రతీరమున విడిసి యున్న జయాపీడుని సేనకుఁ జుట్టును వెలుపలి భాగమునందు 'ముమ్మని' ప్రభృతు లగు నృపాలురు ప్రచండు లగు చండాలురతోఁ గూడి తిరుగుచు సేనను గాపాడు యామికులుగా నుండిరి. ఆ సమయమునఁ గాశ్మీరధవుఁడు తూర్పుదిశయందుఁ దనపేరు 'వినయాదిత్యుఁడు' అను నామాంతరమున వెలయించుచు నాదేశమున 'వినయాదిత్యపురము' అను నొక నగరమును గట్టించినవాఁ డయ్యెను.

దర్పాతిరేకమునను సాహసములతోడను బ్రమాదకరము లగు కార్యములం జేయఁ బూను వారు సమర్థులగు మహారాజు లైనను నొకప్పుడు వారి జయశ్రీ సంశయావస్థ నొందుచుండును.

ఆకాలమునఁ బూర్వదిశయందు 'భీమసేనుఁడను' నొక రాజుండెను. జయాపీడుఁడు వ్రతి వేష ధారియై వ్రతులతోడఁ గూడి నిశ్శబ్దముగ నారాజు దుర్గమునఁ బ్రవేశించెను. అప్పుడు 'జజ్జుని' సోదరుఁడు సిద్ధుఁడు అనువాఁడు చిరకాలమునుండి పగఁ దీర్చుకొనఁ దలఁచి రంధ్రాన్వేషియై యున్న వాఁడు గావున జయాపీడుఁడు మాఱువేషమున నున్న సంగతి యెట్లో తెలిసికొని యాభీమసేనునకుఁ దెలియ బఱచెను, భీమసేనుఁ డాకస్మికముగ వచ్చి తొల్లి యజగరరూపమున నుండిన నహుషుఁడు బలశాలియగు భీమునిఁ బట్టుకొని నట్లు జయాపీడుని బంధించి కారలోఁ బెట్టెను.

మహావీరుఁ డైన జయాపీడు డీరీతి బద్ధుఁ డగుట చూడఁ బౌరుషద్వేషి యగు దైవము మెల్లగఁ దలయెత్తినదని చెప్పవలయును. ఆవిధముగ నతఁ డతిదారుణ మైన సంకటమునఁ బడి యుండియుఁ బ్రతిభా విచ్యుతి నొందక మరల నున్నతిం గనుటకై కోకొనఁ బెక్కు విధము లైన యుపాయముల నాలోచించుచునే యుండెను.

ఇట్లుండ నింతలో నానగరమునఁ బౌరులకు రాజునకును మహాభీతినిఁ గొల్పు నదియు 'లూతా' మయముచే నేర్పడు నదియు నైన గొప్ప యుపద్రవ మొకటి సంభవించెను. 'లూతామయము' అనునది యాదేశమున నేర్పడు నట్టియంటువ్యాధి. అది స్పర్శమాత్రమున మానవులలో నొకరినుండి యొకరికి సంక్రమించుచుఁ బ్రాణాపాయము గలిగించు నది యగుచుండును. జయాపీడుఁ డావిషయమును దెలిసికొని యుపాయమును బన్నుట కనువైన మార్గము దొరికినదని తలంచుచు రహస్యముగఁ దన భృత్యుని మూలమునఁ దనపన్నుగడకు వలసిన వస్తువులను సేకరించి వానిని భుజించెను. ఆకారణ మున నతనికిఁ బైత్యోద్రేకము గల్గి ఘోర మైన పిత్తజ్వరము సంభవించెను. పిమ్మట నతఁడు 'వజ్ర' వృక్షము (ఆకుజెముడు) పాలు తనయొడలిపైఁ జల్లుకొనెను. ఆహేతువుచే నతని యొడలంతయుఁ బొంగి బొబ్బలచే నిండి పోయెను.

అయుదంతము రక్షక భటులవలన భీమసేనుఁ డెఱిఁగి బంది యైన జయాపీడుఁడు 'లూతా మయ' గ్రస్తుఁ డయ్యె నని యెంచి యిఁక నతఁ డావ్యాధిచే మృతి నొందుట తప్ప దని నిర్ణయించు కొనుచుఁ దనదేశమునుండి యతనిని వెలికిఁ బంపి వైచెను.

ఈవిధముగ జయాపీడుఁడు తనబుద్ధి వైశద్యమనెడు నౌకయొక్క తోడ్పాటుచేఁ గారావాస మనెడి విపత్సాగరమును దరించి సురక్షిత స్థానమును జేరిన వాఁడై మరల నిజ బలమును గూర్చుకొని మిన్నంటి యున్న యాభీమసేనుని దుర్గమును నతని యశమును నొక్కమాఱుగ రూపుమాపెను.

జగతియందు శాస్త్ర మనునది కల్పవృక్షము వంటిది. పామరులు దాని యంకురాద్యవస్థలు వ్రేళ్ళను గానరాకుండుటచే దానినిఁ బరిహసించుచుందురు. కాని ఆశాస్త్రవిటపి తద్వేత్త యగు పురుషునకు మహోపద్రవములయందుఁ దోడ్పడి యాకస్మికముగ ఫలించి యతని యశుభములను బోకార్చు చున్నది.

గీ॥ పామరులు సర్వకాలంబు పరిహసింప
మొలకయును వేళుఁ జూపక ముప్పులందుఁ
బురుషుల యలక్ష్మి దృటిఁ బోనఁ బో నడంచు
శాస్త్ర మను నట్టి కల్ప భూజము ఫలించి

అనంతరము జయాపీడుఁడు నేపాల దేశమునకుఁ బ్రస్థానము సాగించెను. నేపాలదేశపు రాజు 'అరముడి' అను పేరు గలవాఁడు. అతఁడు విద్యా విక్రమములతో నొప్పు వాఁడు మాయావియుఁ గాన నెట్టులేని జయాపీడుని నోడింప వలయునని తలంచి యాకాశ్మీరపతి తనదేశమున నడుగు పెట్టఁ గనే యడఁకువను జూపక తనసైన్యముతోఁ గూడి యతనికంటె ముందుగా నెటకో చాలదూరము నకుఁ బోయెను.

జయాపీడుఁ డరముడిని వెన్నంటి జయించుటకై చేయవలసిన యత్నము తా నితరరాజుల నోడించు నప్పుడు సేయు నట్టిది కాక పోయెను. అతఁ డానేపాలపు ప్రభువును వెంబడించు నపుడు నానాదేశములు చరింప వలసి వచ్చెను. మాయావి యగు నాతఁ డెక్కడనో యొకచోటఁ గాన్పించును. మరల మరుగు పడుచుండును. అయినను బగతు నెట్టేని పట్టుకొనవలయు నన్న పట్టుదలతో జయాపీడుఁడు దట్టమైన పొదయందు దాఁగి యప్పు డప్పుడు కాన్పించు పావురమునకై డేఁగ వెదకు చందమున నరముడిని వెదక నారంభించెను. జయాపీడుఁ డెంత యన్వేషించినను నేపాలపతి పొలఁకువ కాన రాక పోయెను. అపాయకర ప్రదేశముల నన్నింటినిఁ గడచి వచ్చిన యాకాశ్మీరపతి యట్లు దిగ్విజయము సేయుచు సన్నిహితమైన సాగరములోఁ గలయు నొకానొక యేటి యొద్దున తనబలముతోఁ జేరి విశ్రాంతి గైకొనెను.

అచ్చట రెండు మూఁడు దినము లుండి తఱువాత నతఁడు తూర్పు సముద్రముఁ జేరఁ, గోరి కడలి వేలనుండి వీఁచు చల్లని మంద మారుతముచే నల్లలనాడు ధ్వజపటములతో నొప్పారు తనచమూ నివహమును నడుపుకొనుచుఁ బయనము సాగించెను.

అట్టి తరుణమున నయ్యేటి దక్షిణ తీరమునందు నేపాల భూపాలుఁడు 'అరముడి' భేరీ భాంకారములతోడను, ఆత్మీయ ఛత్ర చిహ్నముతోడను దనరుచున్న తన సైన్యమును మెఱయించుచు మరలఁ బొడకట్టెను. అప్పుడు జయాపీడుఁ డాతని వింత చేష్టలకు నాజ్య ధారలచే ప్రజ్వలించు వైశ్వానరునివలె మండిపడుచు దన కాక్రాంత ప్రదేశమునందలి మంచి చెడ్డలు తెలియకున్నను.

నయ్యేటి యందలి నీటిని మోకాలిబంటిగా నెంచి నిరంతరాయముగఁ దరింప వచ్చునని యనుకొని క్రోధసాహసములు పైకొనుటచే వెంటనే యుద్దండబలముతోడ బ్రవేశించి తరింప నారంభించెను.

కం॥ వైరుల భేరీ రావము
వీర వరుల కర్ణపుటలకు వినవచ్చినచో
వారల పరాక్రమాగ్ని సు
దారుణ కీలలకు నాజ్యధార యది యగున్.

కడలికిఁ జేరువ నున్న యయ్యేటియం దతఁ డట్లు సగము దూరము గడచు నప్పటికి నాకస్మికముగ నానదియందలి జలప్రవాహము కూలంకషముగ నభివృద్ధి నొంది ప్రవహింపసాగెను. అక్కటా! జయాపీడుని చతురంగ బల మంతయు నొక్క త్రుటిలో నయ్యేటి వరద పాలై పోయెను. కాశ్మీరపతియుఁ బ్రవాహమునందలి కెరటముల సమ్మర్దముచే జారిపోయిన యాభరణాంబరములు గలవాఁడై తనభుజాదండములచే లహరీ పరంపరను భేదించు కొనుచు నవ్వాహిని జాలునం బడి చాల దూరము పోయెను. అప్పుడయ్యేటి ప్రవాహ ఘోషముతోడను నొక ప్రక్క వెల్లువంబడి పోవుసేన యొక్క కరుణాక్రందములతోడను, మఱియొకవంక సైన్య గర్జితములతోడను. దిక్కులెల్ల నిండి మాఱు మ్రోగినవై కరము భయానకము లయ్యెను, అంతట దాయయగు నరముడి నీటపైఁ దేల్చివేయు నట్టి కవచములతోడ సన్నాహపడి యుండు తనసైనికులను బ్రవాహమునందు దింపి యేటినడుమనుండి నాజయాపీడుని లాగించి బంధింపఁజేసి జయోత్సవమును జరిపించెను.

పరికింపఁగా జగమునందు దైవముయొక్కయు మేఘముయొక్కయు నానుకూల్య మనునది నియత మని చెప్ప వీలుగాదు. ఏది ప్రాణికిఁ బ్రియమును జూపించుచునే యొక్కక్షణములో నత్యంత దారుణమైన యిడుమ వాటిల్లఁ జేయును. అట్లే యంబుదమును, దీర్ఘమైన వేసవి సంతాపము నడంచునది వోలెఁ గన్పడి వనస్పతి నశనిపాతమున కాహుతి గావించుచున్నది.

ఉ॥ దైవము మేఘ మట్లె సత
తం బనుకూలము గాదు; మేలుగా
భావమునందుఁ దోఁచి యశు
భంబుగ వేఁ గనుపట్టు. నెట్లనన్
దావ నిభంబు దీర్ఘము ని
దాఘపుఁ దాపము నార్చ నట్టె మో
దావహ మయ్యుఁ గూల్చుఁ గద
యంబుద మయ్యశనిన్ మహీజమున్!

అరముడి జయాపీడు నారీతిఁ గారలో నుంచి 'కాలగండిక' అను నది గట్టున నున్నతమైన జాతికట్టడమునం దుంచి విశ్వాస పాత్రులగు రక్షకభటుల సందుఁ గావలి యుంచెను. కాశ్మీర ప్రభువు మరల నట్టి విపత్సాగరమున మునిఁగి యేమి సేయుటకుఁ దోఁచక లోలోపలఁ గలుగు వంతచే

సంతతము దహింపఁబడుచుండెను. ధీమంతుఁడైన 'యరముడి' జయాపీడునకుఁ గలావంతులలోఁ జుదకు శశాంకుఁడును దేజస్వులలో భాస్కరుఁడును గూడఁ గాని రాకుండునట్లు చేసి యతనినిఁ గడు జాగరూకతతోఁ గనిపెట్టుచుండెను.

జయాపీడుఁ డాచెఱసాలయందుఁ గొంచెము వెలుఁగు గానవచ్చు దిక్కునకుఁ బోయి యచ్చటఁ జూడ్కులను సారించి గాంచుచు నచ్చటికి జేరువ నున్న నదిని 'గాలగండికను' దిలకించి యుపాయము నన్వేషింపఁ దొడఁగెను.

అట్టిసమయమునఁ దన యప్పటి యవస్థను దలపోయుచు నతఁడు విరచించిన శ్లోకములను నేఁడును సూరివరులు పఠించుచు ద్రవీభూతము లయిన యంతఃకరణములు గలవా రగుచున్నారు.

మ॥ కళలం దేరు బుధాళిఁ దన్పునెడ వే
 డ్కన్ దత్కళాభాసురున్
గెలువన్ జాలి బరోద్ధతారుల తమః
 కేంద్రంబులన్ గూల్ప ను
జ్జ్వల భాస్వంతునిఁ గెల్చు భవ్య పటు తే
 జశ్శాలితన్ బొల్చు వా
రలు పాలించెడు రత్నగర్భ పయి ధ
 ర్మశ్రీలు వర్ధిల్ల వే?

ఆరీతి నభిమాన ధనుఁ డయిన యాకాశ్మీర వల్లభుఁడు కార యందుండఁగా నమాత్యశేఖరుం డయిన దేవశర్మ యొక్కఁడే ప్రభుపు తనకుఁ జేసిన సన్మానమును నెల్లవేళల స్మరించుచు సంతప్త హృదయుఁడై తుదకుఁ దనయసువు లైన నొడ్డి తనయొడయనికి హితముఁ గూర్ప నిశ్చయించి యందులకుఁ దగిన ప్రయత్నము సల్పుచుఁ గాశ్మీర మండలమునందలి శ్రీజయాపీడుని యైశ్వర్యము తోఁగూడ రాజ్యము నంతయు నొసఁగెద నని యరముడికి నాశఁ బుట్టించు వార్త నొకటి ప్రియాలాప చాతురీ ధురీణులగు దూతలవలనఁ దెలియఁబఱచెను. నేపాల భూపాలుఁడును రాజ్య లోభమున నందు కియ్యకొనినట్లు తనదూతలను గాశ్మీరమునకుఁ బంపెను.

అంత నాదేవశర్మ యాదూతను గారవించి కొంత సైన్యమును దీసికొని రాష్ట్రి మర్పించు టకు సమ్మతించి నట్లొక 'యొడంబడిక' పత్రికను తయారుచేసి నేపాలదేశమునకుఁ బోయి 'కాలగండికా నది' గట్టునఁ దనబలమునుంచి మిత పరికరముతో నావలిగట్టును జేరెను. యప్పు డరముడి సామంతు లెదు రేగుదెంచి దేవశర్మను గొలువునకు దీసికొని రాఁగాఁ దనయెడ నమ్రతను జూపు దేవశర్మను నరముడి సత్కరించి యుచితాసనాసీనుం జేసెను.

పిమ్మట నరముడి దేవశర్మ మార్గాయాసము నొంది యున్నాఁడని యెఱింగి వెంటనే యతనికి విశ్రాంతి గల్పించుటకై పరిచర్య సేయు పరిజనముతో నొక రమ్య మగు వసతి నిప్పిం

చెను. మఱునాఁ డరముడి మహీధవుఁడును దేవశర్మయుఁ బరస్పరము పీతకోశులై (దేవతాబలిపుర స్సరముగఁ బ్రమాణములనొనరించినవారై) యొక విజన స్థానమును జేరి కర్తవ్యమునెడ నేదేని యొక్క నిర్ణయము గావించు కొనుట కుపక్రమించిరి.

అప్పుడు దేవశర్మ నేపాల భూపాలునితో నిట్లనెను. "జయాపీడునిచే సంపాదింపఁబడిన ధనము బహులముగఁ గలదు. అతఁ డాధనమంతయు మిగుల గుప్తముగా నుంచెను. ఆధన మెచ్చట నుండునది జయాపీడునకు సైన్యమునం దతనికి మిక్కిలి యాప్తులై యుండు వారికిని మాత్రము తెలియును. నేను జయాపీడుని దగ్గఱకుఁ బోయి నీవు ధనము నంతయు నిచ్చితి వేని కారావిముక్తుఁడ వగుదువు." అని పల్కి యతనిని వంచించి మోహపెట్టి "ధన మెక్కడ గుప్తమై యుండెనో యాతావుం దెల్పు మ"ని యతని నడుగఁగోరి యున్నాను. కావుననే జయాపీడుని వృతనాబృందము నంతను నిటకుఁ దీసికొని రాలేదు. [illegible]నర్చిన యెడల ధన నిక్షే[illegible]ను దెలిసిన వారు సైన్య మధ్యగతులై యుండు నపుడు మన[illegible] సేయుటకును నలవి గాకుండును. కావున సైనికులలో నొక్క రినిఁ బిలిపించి వారి నెల్లరను బంధించినచో మనహృదయము వారెఱుంగరు గావునఁ జేయునది లేక రోస మడంచుకొని మన మడిగిన దానినిఁ జెప్పఁదలంతురు. ఇయ్యది నాకుఁ దోఁచిన యుపాయము" అని నచ్చిక యగునట్లు నుడివెను.

మేధావి యగు దేవశర్మ పల్కిన యీమాట లాలించి యానేపాలపతి విమోహితుఁడై యతనియెడ మిగుల విశ్వాస ముంచి జయాపీడునికడ కతఁడు పోవుట కానతి యొసంగెను.

దేవశర్మ వెంటనే బందీకృతుఁడై యున్న తనప్రభువు దగ్గరకుఁ బోయి తదవలోకనముచేఁ బొరలి వచ్చెడు శోక ప్రవాహమును ధైర్య సాగరమునఁ గానరాకుండు నట్లు గోపనము సేయుచు నాతెఱపాలను విజనముగ నొనర్చి సత్వరముగ నాతేనితో నిట్లనెను. "ప్రభూ! నీవు తాతి గోడవలె నభేద్యమైన నీధైర్యమును గోల్పో లేదుగదా! అయ్యది యుండునంత దనుక సాహస మనెడు నాతేఖ్యవుఁ గల్పన నిష్పన్న మగుచునే యుండును." అని పల్కిన తనమంత్రితో జయాపీడుఁడు మంత్రిపుంగవా! నైజ మగు తేజము నన్ను విడువలేదు. కాని యాయుధ రహితుఁడనై యీరీతి నున్న నేనిప్పు డెట్టి సాహసము నాచరింపఁ గలను? అని మాఱు పచించెను. అందుకు దేవశర్మ "దేవా! నీకడిమి పెం పట్లే యుండె నేని విపత్సాగర మీక్షణములోనే తరించినట్లని విశ్వసింపుము. ఈవాతా యనమునుండి కొంత నుండు నదీజలమునందుటికిఁ బారమును జేరఁ గల్గుదేని యక్కడ నీయనీకిని సిద్ధముగ నుండును. పిమ్మట నసాధ్యమేమి?" అని యనెను, అమ్మాటలకు జయాపీడుఁడు "సచివో త్తమా! నిజమే. కాని యేదేని యొక దళమైన చర్మపుఁ దిత్తి లేక యీకిటికీనుండి దుమికి నీటఁదేలుట సంభావ్యము గాదు. ఒకవేళ నట్టిదృతి సాధనముగ నున్నను నయ్యది యూర్ధ్వ పాతనమువలనఁ దగులు దెబ్బకు బ్రద్దలై పోవును, కావున నీతరుణమున నిట్టి యుపాయ ముపయోగకరము కాఁజాలదు. విమానితుఁడనై యపకర్తను బరిమార్పని వ్యర్థముగఁ దనుత్యాగము సేయుటకేనియు నిష్టపడను." అని మరల బదులు పల్కెను.

అమ్మాటలకు దేవశర్మ యించుక యాలోచించి యొకతీరున నిర్ణయించుకొని జయాపీడునితో నిట్లనెనచో నేదో యొక మిషతో నాడికాద్వయ పరిమిత మగు కాలము వెలుపల నుండుము. తఱువాత

దేవర యేకాకిగా నిటకు వచ్చి యీ ప్రోవల నాచే నది దాటుటకై కల్పిత మగు నుపాయ సంభారమును గాంచి నిశ్శంకముగఁ గర్తవ్య మనుష్ఠింపఁదగును.'' అని పల్కెను.

జయాపీడుఁడు దేవశర్మ వాక్యముల నవహితమతియై విని యచటనుండి బయలుదేరి పాయు క్షాళనము సేయు గదిలోనికిఁ బోయి మంత్రి చెప్పినట్లు వెలుపలఁ గడపఁదగిన కాలపరిమితి నెట్లో గడపి మరల నేకాకియై లోనఁ బ్రవేశించెను.

అప్పు డాప్రదేశమునందలి విషాదకర దృశ్యమును గాంచి యతఁడు కారుణ్య విస్మయ ములకుఁ బరవశుఁ డయ్యెను. ప్రాణ తుల్యుఁ డగు మంత్రి వలువను గంఠమునకు దృఢముగ నురి వేసికొని విగత జీవుఁడై నేలపై బడియుండుటం గనుగొన్న యప్పుడమితేని డెంద మెట్లుండ వలయును?

జయాపీడుఁ డించుక చింతించి పరిశోధింప మంత్రి తా నురిపోసికొన్న కంఠమునందలి యుంశుక పల్లవముపై స్వీయ మైన కాయమునందు గోళ్ళచే విదారించి తీసిన రక్తముతో వ్రాసిన విషయమును గాంచి చదువుకొనెను. అందు ''ఇప్పుడిప్పుడే ప్రాణములు పోయినదై శ్వాసముచే లెస్సగ నిండింపఁబడి యున్న యీశరీరము. ఇయ్యది యభేద్యమౌ చర్మభస్త్రికయై యుండును. కావున దీని సాహాయ్యమున దేవర సులువుగ నదీ ప్రవాహమును దరింపవచ్చును. మీయూరువు లీకళే బరముపై నత్తుకొని యుండుటకై తలపాగా యీనాతొడలకు సంబంధించి యుంటిని అందు దేవర నిజశరీరమును జొనిపి రయముగ వాతాయనమునుండి ప్రవాహమునం దుఱికి పారమును జేరి కార్య మును జక్కఁబెట్టుకొనఁదగును.'' అని యుపాయము వివరింపఁబడి యుండెను.

జయాపీడుఁ డావిషయమును జదువుకొనిన వెంటనే మంత్రి తనప్రాణములఁ దృణీకరించి తనకై కావించిన యమ్మహాత్యాగమునకు మితిలేని విస్మయ స్నేహ శోకములకు గుఱియై వెంటనే యతఁడు దెల్పినరీతి నతని మృత కళేబరమును దృతిగాఁ జేసికొని వాతాయనమునుండి వేగిరముగఁ బ్రవాహమునందు దుమికి యావలిగట్టుం జేరెను. అప్పు డచ్చట సన్నద్ధమై యున్న యాత్మీయ సైన్యమునకుఁ దన దర్శనము చిరకాల మినాలోకము లేక కుందు జీవరాశికి నుదయభానుని యవలోక నమువంటి దయ్యెను.

ఉ॥ ధైర్యమె ధీర తేజ మది
తప్పనిదై మది వజ్ర భిత్తియై
కార్యములందు దైవ సహ
కారము చేకొని సత్ఫలం బని
ర్వార్యముగా నొసంగు జన
వంద్య చరిత్రుల సాహసంపు టౌ
దార్య విచిత్ర చిత్రములు
దానఁగదా రచితంబులౌ దరన్.

అంతట జయాపీడుఁ డాలసింపక తన యసాధారణ తేజః పుంజమును మెఱయించుచు సర్వవిధముల సన్నద్ధమై యున్న తనవాహినితోఁ గూడి నేపాలదేశము నంతను నేపాల భూపాలుఁ డగు నరముడిని నామరూపములు లేకుండు నట్లు నిర్మూలించెను. చెఱనుండి తాను దప్పించుకొనిన సంగతి యచ్చటి రక్షకభటులు తెలిసి కొనునంత లోపలనే నేపాలదేశమును గథామాత్ర శేషముగ నతఁ డొనర్చుటే యతని యద్భుత విక్రమమునకు గొప్ప నిదర్శన మనవలయును. నర్తనము సేయు కబంధములతోడను. వేల్పు వెలందులు మీఁగఁ బడవేయు పూలమాలలతోడను, దివ్య తూర్య ఘోషణములతోడను, నొప్పారుచుండిన యాసమరోత్సవము బంధనమునుండి విముక్తుఁ డయిన జయాపీడునకుఁ జేయు నూతనోత్సవముగఁ బరిణమించెను.

ఔరా! వేసవికాలమందు నితర పర్వతములు దావజ్వాలలచే నుజ్జ్వలములై దూరముగ విసర్జింపఁ దగిన వగుచున్నవి! అట్టితఱిని యందే సాంద్రమైన హిమద్రవముచే నార్ద్రమై యుండు తుషారగిరి కరము సేవింపఁదగినది యగుచున్నదిగదా!

ఉ॥ ధీరులఁ బ్రోచి దుర్మదము
పెంపున రేగు నరాతు లెల్ల దు
ర్వార పరాక్రమంబున ధ
రంబడి యాడఁ గబంధ మాత్రులై,
బారులు దీరి నింగిపయి
వారి వరింపఁగ నప్సరోంగనల్,
వీరవిహారముల్ సలుపు
విక్రమ సింహులు లేరె యీధరన్.

వేసవిలో దవాగ్ని పను
వీధులఁ బర్వఁగ నెంతొ భీకరం
బౌ నెగఁ జల్లు కొండ లవి
త్యాజ్యము లయ్యెడు దవ్వులందె. యా
వేసవినే హిమ ద్రవపు
వీచుల దివ్య సుధాకరం బయినా
ఖాసిలి ప్రాణులం దనుపు
పర్వత రాజమె శ్లాఘ్య మీయిలన్.

ఇట్లే స్వామి ద్రోహు లగు జజ్జాదు లేదేశమున నేసమయమున జన్మించిరో! యట్టి తరుణముననే యాదేశముననే స్వామిభక్తి పరాయణుఁడై సుకృతి యైన దేవశర్మామాత్యుఁ డుద్భవించి యుండుట చిత్ర మగు విషయము. ఘాతుకుఁడైన జజ్జునకును వక్రగాముఁడైన శనైశ్చరునకును సామ్యము కుదురలేదు. కాని మిత్రశర్మకును సత్యనిష్ఠాపరునకును పోలిక నప్పిన స్పృహణీయమై యుండుట యెంతేని శ్లాఘనీయము.

ఉ॥ శూరునకున్ రణాంగణముఁ
జూడఁగఁ జాలని భీరువున్; మహా
క్రూరునకున్ బ్రసన్న గుణ
రూప వచోవిభవుండు, జ్ఞానియౌ
సూరి కనత్క్షరాస్యుఁడును
సోమరియున్ జనియింత్రు; భాస్కరుం
డౌ రవికిన్ జనించెఁగద!
యాశని తీవ్ర తమో విలేపుఁడై.

మిత్ర శర్మ దేవశర్మలు ఈ శ్లోక వాదమున కెదురు నిల్చిన సద్గుణ గరిష్ఠు లగు స్వామి భక్తి పరాయణులు. కావుననే రక్షామణియయ్యెఁ బైనట్టి దేవశర్మ యెల్ల జీవితావధి నొందఁగా జయాపీడుఁడు రాజ్యశ్రీఁ బడసినవాఁ డయ్యు సద్దానిఁ దాను గోల్పోయినట్లై తలపోయ సాగెను. మానవంతుఁడైన జయాపీడుఁడు దిగ్విజయమును బొందిన తరువాత ముందతనికిఁ గల్గిన మాన గ్లాని యుపశమించినది. కాని, దేవశర్మామాత్యుఁ డొనరించిన మహోపక్రియ మాత్ర మతని నెమ్మనమున గాటముగ నాటుకొని యుండెను.

కం॥ రక్షారత్నం బనఁదగు
నక్షీణ ప్రతిభుఁడౌ మహామాత్యుఁడు పోఁ
గా క్షితిపాల వరుఁడు రా
జ్య క్షేమమె తొలఁగె నని విచారింపఁడొకో!

గీ॥ పోనఁబట్టిన రత్నంబు పొందఁబడినఁ
మాన భంగంబు కొంత సమ్రాట్టు విజయ
మాత్రలం గాంచి పవప యశంబు వడసి
క్లేశమే దోఁచనటులఁ బ్రకాశ మొందు.

పిమ్మట జయాపీడుఁడు మరల జిగీషువై స్త్రీరాజ్యమునకుఁ బోయి యమ్మండలము నంతను జయించుటే గాక యింద్రియ గ్రామ విజయమును సయితమచ్చట సంపాదించి యుండుట విచిత్రమైన విషయము. జయింపఁబడిన యా స్త్రీరాజ్యమునుండి 'కర్ణశ్రీ' యను పతాకను లేపనెత్తి ధర్మాధికరణ మనెడు కర్మస్థానమును స్థాపించెను.

మఱియు నతఁడు తన కోశగృహము మార్గముననుండుటచేఁ బ్రయాణపు సౌకర్యమునకై 'చలగంజము' అను పేర మఱియొక కర్మస్థానమును సైతము అచ్చోట నేర్పఱచెను. ఇట్లు విక్రమ విహారియై పొల్చిన యా కాశ్మీర క్షమాకాంతుని భుజము సుఖావాసముగ నేర్పఱచుకొన్న జయలక్ష్మికి నాల్గు సాగరములును విలాస మణిదర్పణములవంటి వయ్యె నన నింక నతని విజయమును గుఱించి యితరము చెప్ప నేల?

మ॥ ప్రజ మెచ్చ న్నిఖిలావనిం గెలిచి ధ
ర్మ జ్యోతి వెల్గించు భూ
భుజు బాహూన్నత పీఠి నిల్చి చతుర
బ్ధుల్ నిల్వుటద్దంబులై
నిజ రూపంబును జూపఁగా ముదమునన్
నిశ్చింతమై నల్గడన్
విజయశ్రీ గనుచుండుఁ దద్విమల దో
ర్వీర్య ప్రభా మండలిన్.

జయాపీడుఁ డంత మరలఁ గాశ్మీరమును బ్రవేశించి రాజ్యాసన మధిష్ఠించి సామంత వర్గముచేఁ బరివృతుండై నిజయోపార్జిత మైన సంపదను చిరకాల మనుభవించెను.

ఇట్లుండ నొకానొకప్పుడు సర్వ దిగ్విజయ శోభి యైన జయాపీడునకు స్వప్నమం దెవరో యొక దివ్యపురుషుఁడు పొడకట్టి కృతాంజలియై "మహీవల్లభా! నేను మహాపద్ముఁ డను పేరుగల నాగేంద్రుఁడను. నీదేశమున నేను నాబంధువులతోడ సుఖముగ వసించుచున్నాను. ఇప్పుడు నీశరణుఁ జొచ్చితిని, కారణ మేమన? ద్రవిడ దేశీయుఁ డగు నొక మాంత్రికుఁడు నన్ను జలాపేక్ష గల మరుమండలమున ధనమునకై విక్రయించుటకు నాసరస్సునుండి నన్నాకర్షింప నుద్యుక్తుఁడై యున్నాఁడు. వానివలన భయము లేకుండ నన్నుఁ గాపాడితివేని బంగారు గనులు గల పర్వతము నొండు నీదేశమునందే నీకుఁ జూపించెదను." అని పలికెను.

జయాపీడుఁడు మేల్కాంచి స్వప్నమునం దాలించిన వృత్తాంతము నరయుటకై నల్గడలకుఁ జారులను పంపెను. చారు లంతటను దిరిగి యొకానొక ప్రదేశమునం దుండిన యామాంత్రికునిఁ గనిపెట్టి పట్టుకొని వచ్చి రాజున కప్పగించిరి. నరనాథుఁ డప్పు డమ్మాంత్రికునిఁ గాంచి మొదట నతనికభయదాన మొసంగి మహాపద్ముని యెడ నతఁడు సంకల్పించిన విధాన మెట్టిదని ప్రశ్నించెను.

అమ్మాటలకు బదులుగా ద్రవిడ మాంత్రికుఁడు నాగపతి రాజునకుఁ గలయందుఁ జెప్పిన వృత్తాంతము నంతను జెప్పెను. అందుకు జయాపీడుఁడు విస్మయపడుచు మరల నతనితో "ఆనాగపతి ప్రభావాఢ్యుఁడును బెక్కు యోజనముల వైశాల్యము గల యగాధ సరోవరమునందు నంతరాళమున నుండు వాఁడును గదా! అట్టి వానిని నీవెట్లు వెలుపలికి నాకర్షింపఁగలుగుదువు?" అని యనెను. ఆ ప్రశ్నకు జబాబుగా నామాంత్రికుఁడు "రాజా! మంత్రశక్తు లచింత్య ప్రభావములు. వానినిఁ జూడఁ గోరితేని వేగిరమ నాతోడ వచ్చి విస్మయ విషయమును వీక్షింపవచ్చును." అని యనియెను.

అంత నాయిరువురును మహాపద్ముని నివాస మగు సరస్సునకుం బోయిరి. అచ్చోట నామాంత్రికుఁడు బాణముల నభిమంత్రించి దిగ్బంధ మొనర్చి విడువఁగా నవి కొలఁకునందలి జలము నంతయను శోషింపఁ జేసెను. అప్పు డాయెండిన కొలఁకునం దడుసులోఁ బొరలుచు మనుష్యావనము

తోడ నొప్పు జేసెడు సర్ప మొకటియు మఱియు దానిచుట్టును చిక్కుపడి కుఱుచవైన పాము లనేకములును నుండుట జయాపీడుఁడు గనుంగొని మిగుల నచ్చెరు వందెను.

పిమ్మట మాంత్రికుఁడు నరనాథునిఁ గాంచి "దేవా! నామంత్ర ప్రభావముచే సంకోచితాకారము గల యియ్యహిని నిప్పుడు పట్టుకొందునా?" యని యడుగ జయాపీడుఁ డట్లు సేయవలదని నిషేధించి మంత్ర మహిమ నుపసంహరించి సరోవరమును యథాపూర్వముగా నొనర్పుమని యతనినిఁ గోరెను. రేనియానతిచే మాంత్రికుఁ డాకాసారము నెప్పటియట్ల జలపూర భాసురమై యొప్పున ట్లొనర్చెను. తఱువాత జయాపీడుఁ డాద్రవిడ మాంత్రికునకు దలసిన ధనము నొసఁగి యతనిని వీడ్కొల్పి మహాపద్ముఁడు దనకు గలయందుఁ జెప్పినరీతి నిప్పుడును బంగారు గని గల గిరీంద్రము నెఱింగింపఁడయ్యెఁగదా! యని తలంపఁదొడఁగెను.

ఒకనాఁ డాకాశ్మీర ధరావల్లభుఁడు తన ప్రాసాదమునందు పరుండి యున్నపుడును నట్లే తలపోయుచు నిద్రించెను. మరల నప్పు డతనికి స్వప్నమునందు మహాపద్ముఁ డగపడి "మహీకాంతా! నీవు నాకెట్టి మహోపకృతి యొనర్చితి వని నీకాస్వర్ణఖని గల గిరినిఁ జూపుమందువు? జగతియందు శరీరధారులకు స్థాన పరిచయ మనునది స్వదేశ మనుబుద్ధినిఁ గల్గించుచున్నది. అట్టి పరిచయము లేనప్పుడు వారికి విదేశమను భావము గల్గుచుండును. నే నవమాన భయమున నిన్ను శరణు వేడితిని. అట్టి యవమాన దుఃఖమును శరణ్యుండవనుకొన్న నీవలననే యనుభవించిన వాఁడనైతిని. ఆశ్రితులగు వారు తమప్రభు వపాంపతివలె నక్షోభ్యుఁడని నమ్మికతో నుండ నట్టి వానిసమక్షముననే వారు పెఱలచేఁ బరాభవము నొందుటకంటె నిగ్గుపాటు గలిగించు విషయము వేఱొకటి యుండునా? అన్యులచే నవమానిత లగు కాంతలను రక్షించుకొనుటకు శక్తి లేనివాఁడ నైతినిగదా! అట్టివాఁడనైన నేను నా ప్రేయసుల మోముల మరల నెట్లు చూడఁగలను? నిన్నాశ్రయించి వంచితుల మైన మేము కారణ సామ్యమునఁ బామరులమాడ్కి నీకు గ్రీడావినోదము గల్పించువార మైతిమి,
అదియుఁగాక యపేక్షాపూర్వకముగఁ గార్యములఁ దగులము గలవారును ఐశ్వర్య మదాంధులును నైన పార్థివుల యసంప్రేక్ష్యకారిత్వమునకై యంత వింత పడవలసిన యవసరము లేదు.

మఱియును క్ష్మాపాలురు గొప్పవారి కవజ్ఞ సేయుట యనునది యొక క్రీడగా నెంతురు. అట్టి యవమానము వారికే గల్గినచో వారద్దానిని జీవన్మృతి తుల్యముగఁ దలఁచుచు మిగులఁ గాఱియ వడుచుందురు. సామాన్యులగు రాజన్యులు స్వార్థసిద్ధి గావలసి యుండెనేని యుపేక్షింపఁదగిన పక్షమునందును గొంత యభిమానమును జూపుచుందురు. కాని స్వార్థము గోరని మహాపురుషులు గ్రాహ్యమైన పక్షమునే స్వీకరించి తమ ప్రాణములనైన నుపేక్షించి పూన్కితోడ సత్పక్షమునకు సాయ మొనర్చి కృతకృత్యు లౌదురు. గొప్పవారివలన గలుగు నవమాన మభిమానాధీనులకుఁ దీరని దుఃఖమును బుట్టించును. అట్టివానిదెందమునందలి వంత యిట్టిదని యూహింప నేరికిఁ దరమగును?

## లోక తంత్రము

గీ॥ చిరతరం బున్కి లేములఁజేపి నరుఁడు
స్వీయ పరకీయ దేశ విభేద మెందు

సంత మాత్రాన భూత దయాది ధర్మ
విధుల విజ్ఞులు భేదంబు వెదకఁ బోరు.

గీ॥ మాన హాని భయం బోర్వ లేని వాఁడు
శరణ మర్థించి రాఁ గనికరము లేక
వానిఁ శరణ్యుఁడే యుక్తిఁ గ్లాని గలుగఁ
జేయుటది యెంతొ తుంటరి చేష్టగాదె!

గీ॥ పశులవలనఁ బరాభవంపడు స్వకీయ
మానినులనేని గాపాడ లేని వాఁడు
మరల నావామనేత్రల దరికిఁ జేర
లేఁడు గద సిగ్గు సంకెల లీలఁ దగుల!

గీ॥ కడలివలె నేమహీజాని కలఁత లేక
యాశ్రితుల నెల్ల నలరించుః వాఁడె వారి
యెదుట శత్రు తిరస్కార మెనయు నేని
యంతకంటెఁ త్రపాతిశయంబు గలదె?

గీ॥ శ్రీమదంబున నంధులై చిత్త మెట్లు
త్రిప్పి యాడించునో! యట్లై తిరుగు వారు
బుద్ధి పూర్వకముగను నబుద్ధి పూర్వ
కముగఁ జెడ్డలె కావింత్రుగద సతంబు:

గీ॥ మోహపంకంబునం బడి మూర్ఖ జనుఁడు
వారి చెంతను ధన తృష్ణఁ జేరి బుద్ధి
మంతులును సంతసంబున వంతు సొంపి,
పాడుచుం బాపమునఁ బాలు పంచుకొంద్రు:

గీ॥ అహిత పక్షము నున్నతులైన వారిఁ
బరిభవించుట యొక యాటనటె, వలంత్రు.
బ్రతికినందాక శ్వాస నిబద్ధ మరణ
మట్లె యనుభోక్తలు దలంతు రక్షకేశి.

కం॥ తమకోరిక లీడేరఁగఁ
గుమతు లసత్పక్ష మూఁత గొందు రెలమిన్నై
సుమనస్కులు ప్రాణములన్
గమనింపరు సాధు పక్ష కార్యోన్ముఖులై.

కం॥ గుణజనుల నవమానించుచుఁ
గుజనుల సఖ్యమున మిగులఁ గుమతు లయిన పం
చజనుల మానస తత్త్వం
బజానకుసైతం బెఱుంగ నలవియెఁ దలఁపన్.

ఇంత జరిగినను మీదన్యమైనవలె మమ్ముఁ గనుటయు నంత నిరర్థకము గాఁజాలదు. కావున బంగారు గని గలగిరిని జూపను గాని, యాపర్వతమునందె తామ్ర ద్రవ నిష్యందము గల ఖని యుండు చోటును దెల్పెదను.'' అని వచించి తామ్రఖని యున్న తావును దెలిసి కొనుటకు నొక గుర్తును గలయందే తెల్పి యతం డంతర్ధానము నొందెను.

తరువాతఁ బ్రభాతమునందు జయాపీడుఁడు మేల్కాంచినతోడనే రాగిగని గల కొండ దగ్గఱకుఁ బోయి యచ్చట 'క్రమరాజ్యస్థ' మను తావునందు నాతామ్రమును గైకొని తన్మూలమున నొక్కటి తక్కువగా నూఱు కోట్ల దీనారములను స్వనామాంకితములుగ ముద్రింపించెను. పిమ్మట నతఁడు రాజులకు గర్వభంగ మగునట్లు ''నూఱు కోట్ల దీనారములను బూర్ణముగ నెవ్వఁడు తనరాష్ట్రమున నిర్మింపఁగలఁడో: యతఁడు నన్ను గెలిచినవాఁ డగును.'' అని యొక సమయము గావించెను.

జయాపీడుఁ డిట్టే తనకార్యములను సమస్యలనువోలె సావశేషములుగ నొనర్చి విడిచి యుండుటం జూడ నతఁడు తత్తుల్య నిర్మాణమునందు నితర నరపతులకు యోగ్యత లేమిని వెల్లడించుటకై యట్లు చేసి యుండు నని తోఁచుచున్నది.

ఇట్లు గొంతకాలము జరిగిన పిమ్మట జయాపీడుఁ డకస్మాత్తుగాఁ బ్రజా భాగ్య విపర్యయము వలనఁ దాత యగు లలితాదిత్యుని మార్గమును వదలిపెట్టి దుష్ట మైన తంత్రి పద్ధతి నవలంబించెను. అంతట నతఁడు తనయుద్యోగులచే ''దిగ్విజయ క్లేశ మొందుటకు? స్వదేశమునందే ధనము నార్జించు ప్రయత్నము సేయవచ్చును. మండలమునందలి యపరాధులనుండి ద్రవ్యమును లెస్సగ గడింపవచ్చును.'' అని పురికొల్పఁబడిన వాఁడై యట్టిపని కావింప మొదలు పెట్టెను. ఇట్టి విషయమున రాజునకుఁ జవి పుట్టించిన లుబ్ధులు 'శివదాసుఁడు' మున్నగు కోశాధికారులు.

అయ్యది మొదలుకొనియె కాశ్మీర భూపాలురకుఁ దమయాజ్ఞను జరుపుకొనుటకై యుద్యోగుల ముఖములం జూచుచు గనిపెట్టుకొని యుండవలసిన గతి పట్టినది. తొల్లి జయాపీడుఁడు ఆయాయి నరపతులను బట్టుకొనుటకై యేమంత్రశక్తిని వినియోగించు చుండెనో; అయ్యదియే యిప్పు డాతనికి స్వదేశ వాస్తవ్యులను బంధించుటయందలి యెడతెగని చింతగాఁ బరిణమించెను.

వైదుష్య మనునది సజ్జనులకుఁ బాపప్రశమనము సేయఁగల యుపదేశము వంటిదిగదా! ఈతరుణమున జయాపీడుని పాండిత్యము ప్రజాపీడన శౌండ మైన దనుట మిగుల విచారణీయము.

చివరకు జయాపీడుఁడు తొల్లి సుదాసుని కుమారుఁ డగు కల్మాషపాదునివలెఁ బెక్కుండ్రు జనుల హతమార్చియుఁ దా నొనర్చెడు నట్టి దుష్కృత్యములయెడఁ గలయందైనను దృప్తి నొందక పోయెను.

జగమునందుఁ గులటలును దుష్టులగు క్షితిపతులును నొక్క విధముననే యుందు రని నుడువ వచ్చును. వారు పాపకార్యములను జేయుచుండు నపుడు "ఈదోష మొక్కటేగదా సేయుచున్నారము" అని యనుకొని కౌతూహలముతో నొక్కమారు చెడ్డపని ప్రారంభింతురు. స్వైరిణులు క్రమముగఁ దమదుర్వృత్తి కలవాటు పడి యంత్యజాతుల బొందు నొందు నపుడును బాప భీతియు నేవగింపును లేక మెలంగుదురు. అట్లే క్ష్మాపతులును క్రూర కార్యములొనరింప దక్షులై సిగ్గు లేక తుదకుఁ బితరుల హత్యలను సైత మొనర్చుచు నించుకేని మనంబునఁ బరితాపము నొంద కుందురు.

మ॥ కులటల్ కుత్సిత భూపతుల్ మొదట సం
కోచించి "యల్పంబె కా
కలుషం బియ్యది." యంచుఁ బాపమునకై
కాంక్షింతు రారీతి నా
విల మోహాకుల వృత్తి నంత్యజుల నే
స్వైరి మింతు రావామ; లీ
యిలకై భూపతు లక్కటా! పితరులన్
హ్రీ లేక హింసింత్రుగా!

జయాపీడుఁడు లోభమునకుఁ జిక్కి చివర కొక మూఁడు సంవత్సరములు కర్షకులు పడయుచుండెడు శరత్కాలపు సస్య ఫలమునందు సైతము దాను భాగమును గైకొనుచుండెను. రాజోద్యోగు లయిన కాయస్థులు ప్రజల సర్వస్వమును హరించుచుఁ దనకు స్వల్పధనము నిచ్చుచున్నను విత్తలోభమున బుద్ధి జాడ్యము నొందిన జయాపీడుఁ డాయుద్యోగులు హితకారులనియే విశ్వసించినవాఁడయ్యెను.

సాగరమునందలి జలమును విరివిగఁ గైకొనిన యంబుదములు సలిల కణములను గొన్ని పడవైచినంత మాత్రానఁ గడలియందుండు తిములు మేఘుని జీవన దాతృత్వమునకు సంతసించుచుండును. లోభాకృష్టు లగు నరపతులను బశ్యతోహరులును దుష్టులు నైన కాయస్థులు రాష్ట్రమునందు వచ్చెడు ధనమును జాలవరకు హరించి తమ కష్ట్యల్ప మగు భాగము నొసఁగినను వారినిఁ దమయంతరంగమున హితకారు లనియే విశ్వసింతురు. కావున జలవాసులగు తిములఁ బోలి మెలఁగు రాజుల డావస్థ చాల విచార్య మని తెలియుచున్నది.

గీ॥ అర్థమం దైన యట్టి దురాశ మదిని
దూరనీయదు దానిచేఁ దొడరు హాని.
గాలమున వ్రేలు నెఱ్ఱికై కవియు మీలు
జాలరుల నమ్ముఁగద దానశీలు రనుచు.

ఉ॥ అంబుధిలోని యంబువుల
సంబుదముల్ గొని తత్కణంములే
డంబముతోడ రాల్పఁగ నె
డందఁ దిముల్ 'ఘన దాన' మంచు హ

ర్షంబు వహించుకీతిని బ్రా
    హ్మణధన మెల్లను గొల్ల గొట్టి శే
శంబె యొసంగు పేదకుల
    చర్యలు మెచ్చెద లౌర, భూపతుల్‌!

ఇట్టి సందర్భమున నాశ్చర్యప్రదమగు విషయము మఱొక్కటి గలదు. ఎల్లప్పుడును బ్రహ్మతేజో విరాజితు లగు ద్విజుల యొక్కయత పైన ప్రత్యేకము సర్వమును నెదిరించి నిల్వగలిగి యుండు ననుట మాత్రము నిక్కము. అట్టి బ్రాహ్మణుల కపకారమును గోరి జయాపీడుఁ డిప్పుడు వారిని సర్వవిధములఁ బీడింప మొదలుపెట్టెను. జయాపీడుఁ డొనరించు దండగములను సహింపఁ జాలక పెక్కురు బ్రాహ్మణుల దేశాంతరములను జేరిరి. శేషించిన వారు మాత్రము మరణమునకై నను దెగించి కాశ్మీరమునందె నిల్చియుండిరి. జయాపీడుఁడును నట్టి బ్రాహ్మణుల ధనప్రాణముల హరించుట కెంతమాత్రము వెనుదీయ లేదు.

రానురాను జయాపీడుఁ డతిక్రూరుఁడై "మేమొకనశతసంఖ్యాకు లగు విప్రు లొక్కదినమున వధింపఁబడుదురు" అను విషయము నంతటను దెలియఁబఱుపవలయు నని తనయుద్యోగులతోఁ బలికెను. ఈతని చరితమునందలి విపర్యాసమును దెలుపుటకు నింతకంటె వేఱొక్క నిదర్శనము వలయునా? ఈ పార్థివుఁ డిట్టి విపర్యస్త చరిత్రుఁ డైన వాఁడు కావుననే నితని నుద్దేశించి స్తుతి విపర్యాసము నీరీతి వెల్లడించియుండిరి. గుణ వృద్ధి విధాయియై కృతకృత్యుఁ డైన శ్రీజయాపీడదేవునకును బాణిని మహామునికినిఁ దారతమ్య మేమున్నది? మరియు భూత నిష్ఠా విధాయియై కృత విప్రోపసర్గుఁడు నగుచున్న శ్రీజయాపీడ నరపతికినిఁ బాణినిమునికిని భేద మేమి గలదు?

కం॥ గుణ వృద్ధి విధు లొనర్చిన
యనఘుఁడు కృతకృత్యుఁ డౌ జయాపీడనరేం
ద్రునకుం బాణిని మునివ
ర్యునకున్‌ లేశంబు భేద మున్నదె యరయన్‌?

గీ॥ వివిధ విప్రోపసర్గంబు వెల్లడించి
భూత నిష్ఠా విధాన నైపుణినిఁ గన్న
యల జయాపీడునకుఁ బాణినాత్మజునకుఁ
దారతమ్యం బెఱుంగ సాధ్యంబు గాదు.

ఇవ్విధంబునఁ బండితులు మహాభాష్యమునకు వ్యాఖ్యానము సేయు సందర్భమున వైదుష్య నిబద్ధములగు శ్లోకములచే జయాపీడునియెడ స్తుతి విపర్యాసము నొనర్చి యున్నారు.

కం॥ సుకవుల సూక్తులు సుజనుల
కకలంక శ్లోకదంబు లౌ: నవె కుజనా
ళికి లుప్త లకార శ్లో
క కారణము లౌ విరుద్ధ కథన పరములై.

ఒకప్పు డీకాశ్మీరపతి 'చంద్రభాగానది' యొడ్డునందు విడిసినవాఁడై 'తూలమూల్యము' అను బ్రాహ్మణుల భూమినిఁ దా నాక్రమించు కొనుటచే వారు మిగులఁగుందుచు నొక్కరు తక్కువగ నూర్వురు విప్రులు లాయేటి నీటఁబడి యసువులం బోఁగొట్టుకొనిరి. ఆవార్త నతఁ డచ్చోట నాలించి మిగుల నానందించెను. అప్పటినుండి యానరపతి యగ్రహారములను స్వాధీనము చేసికొనుట మాత్రము మానెను. కాని, తొలుతఁ దాను బలాత్కారముగఁ దీసికొన్న సామాన్య వాస్తవ్యుల భూమిని మరల వారికిఁ బూర్తిగ నొసఁగక పోయెను.

పిమ్మట నొకనాఁడు 'తూలమూల్య' ప్రదేశమున వసించు ద్విజులు రాజు దగ్గఱకు విజ్ఞప్తి చేసికొనుటకై వచ్చిరి. వారు ప్రతీహారుల కరప్రహారములఁ బడయుచు నరపతిసన్నిధి కెట్లో యేతెంచి పెక్కుతెఱంగుల నాక్రోశించుచు నిట్లు వల్కిరి. "తొల్లి మహాపురుషు లగు మను మాంధాతృ రామాదులు పుడమి యేలి యుండలేదా! అట్టి వారి సన్నిధిని సైతము బ్రాహ్మణులు గౌరవహాని నెఱుంగక సన్మాన పాత్రు లగుచు నుండిరి. నిక్కముగ బ్రాహ్మణు లల్గినచో సశైల కానన మగు నిలాతల మంతయు నింద్ర నాగేంద్రులతోఁ గూడిన స్వర్గ పాతాళ లోకములును నొక్క క్షణములో బూదియైపోవును."

అను నీమాటలు జయాపీడుఁడు విని తనవెనుక నున్న సామంత వర్గము లేచి యదరుచుండ నొక కనుబొమ రేఖను దీర్ఘీకరించి దురహంకార పూరితుఁడై బ్రాహ్మణుల నుద్దేశించి "భిక్షాకణములను భుజించు శఠులకు మీకు నిట్టి యహంకార జ్వర మెందుకు? ఎక్కడనో తీవ్ర తపము సేయు మహర్షులవలె వదరుచున్నారు. మీప్రభావము మాకుఁ దెలియదా? చాలింపుఁడు" అని గద్దింపుచుఁ బల్కెను. అమ్మాటలు విని భయంకర మైన యతని భ్రూభంగ మాత్రమునకే యడలు నొంది యాద్విజు లెవ్వరు నేమియు ననక యూరక యుండిరి. కాని, బ్రహ్మతేజో నిధి యైన 'ఇట్టిలుఁడు' అను పేరఁ బ్రసిద్ధి గన్న భూసుర పుంగవుఁడు జయాపీడుని వంకఁ జూచి "రాజా! యుగ మాహాత్మ్యము ననుసరించి మాకు సత్త్వ మహిమ యుండును. లేక యుండక పోవచ్చును. భూపాలకుఁడ వైన యిట్టి నిన్ననుసరించి చూచినచో మేమేల ఋషులము కాకుందుము?" అని యనెను. అమ్మాటలను జయాపీడుఁడు దర్పాతిరేకముతో "నీవు విశ్వామిత్రుఁడవా? వసిష్ఠుఁడవా? యగస్త్యుఁడవా? ఏతపోనిధులం దెవ్వనిఁ బోలుదువు?" అని యిట్టలుని గద్దించుచుఁ బ్రశ్నించెను.

జయాపీడుని యీమాటలకు 'నిట్టిలుఁడు' మండిపడి యగ్నికణములు వెలువడఁ జేయు తేజస్సువలెఁ జేరి చూడరాని మూర్తి గలవాఁడై పడగను విప్పి పైకుఱుకు మహానాగమువలె నిట్టూర్పులం బుచ్చుచు జయాపీడునితో నిట్లు నుడివెను.

కం॥ యుగముల మాహాత్మ్యంబునఁ
బ్రగల్భ గుణ గణ్యుఁ డైన పార్థివు బాహా
యుగ పటిమను ధర్మశ్రీ
నిగనిగలు చెలంగు జనుల నెమ్మనములలో.

కావున నీ విప్పుడు హరిశ్చంద్రుఁడవో! త్రిశంకుఁడవో! లేక, నహుషుఁడవో! యయాతివో నిన్ను ననుసరించి విశ్వామిత్రాదులం దొక్కఁడ నయ్యెదను." అని మాఱు వచించెను.

ఇట్టులని యామాటలు విని జయాపీడుఁడు వికటముగ నవ్వి "విశ్వామిత్రుఁడు మున్నగు వారి యల్పునంగ హరిశ్చంద్రుఁడు మొదలగువా రాపదలపా లయిరి. బింకమున వట్టి నేనంటిని దలిగిన నేమగును?" అని పరిహాసముఁ జేసెను. జయాపీడుఁ డొనర్చిన యిట్టి యోశనమును సహింప లేక యాబ్రాహ్మణుఁడు బడబానల సదృశ దగుచు నిజచేతనే ఘోరమునఁ గుణుచు "నాయమున్నలన నీవు బ్రహ్మదండము బారి బడనున్నావు." అని పలుకఁ నన్నరపతి మరల పరిహాసించుచు "ఒక్కట్టి బెదిరింపులేల? బ్రహ్మదండము నాపైఁ బడనిమ్ము. అంతుల కింత యాలస్య మేల?" అని చులకనగఁ దూలనాడెను. బ్రహ్మతేజో విరాజమానుఁ డైన యిట్టియఁ డింక సహింపలేక పోయెను. అతఁడు జయాపీడునితో "ఓయీ! జాల్ముఁడా! ఇదిగో! బ్రహ్మదండము నీపైఁ బడినది. చూడుము. అని నుడువు చుండఁగనే వితానమునుండి జారి యొక కనకదండ మాజయాపీడుని యొడలిపై నాకస్మికముగఁ బడెను.

ఆదెబ్బతో నతనిమేనఁ బెద్దగాయ మొకటి యేర్పడి యొడలు వాచి పోయెను. పిమ్మటనతని దేహమునందలి వ్రణము నాశ్రయించిన క్రిమి జాలమును వస్త్రు కార్లచేఁ బట్టి తీసివేయవలసి వచ్చెను. జయాపీడుఁడు భావికాలమున నరకమునందుఁ దా ననుభవింపఁ బోవు క్లేశమునకు సూచక మనఁదగు మహావ్యథను బెక్కు రేలనుభవించుచుండ నతని దేహము నెఱులేని వదలి పోవలయునని యాతుర పడుచున్న యసువు లెట్లో యతనిం దప్పించుకొని వెలిఁబడి పోయెను. దండఘాతనకు సాటి యైన జయాపీడుఁ డాచందమున నకాండ దండములను విధించి తానును బ్రహ్మదండ కృత మైన దండము ననుభవించి తుద కిమ్మాడ్కి దండధరుని యింటఁ జేరెను. అనియతచిత్తుఁ డైన యాతేఁడు ప్రతాప శాలియై ముప్పదియొకటి యబ్దంబులు కాశ్మీరమునేలి చివర కిట్టి దుర్గతి నొందెను.

ప్రపంచమునఁ జేవలవలెఁ బుడమిఱేండ్లును ధనకృత మగు కలుష జీవనమున కాసపడి తమస్థితిని వదలి కుమార్గానుసారు లగుచుందురు. పాపము వారాకారణమున జాలరుల కెనయై వికృ తాకారు లగు యమ భటులవలన నకస్మాత్తుగ స్థిర మైన నిరయ జాలమునఁ దగుల్కొని మితిలేని వంత నొందుచుందురు.

మ॥ అవనీపాలుఁడు మీనముల్ కలుష వి
త్తాంభ స్తృషన్ గావథం
బవలంబించుచుఁ గాలకింకరులు న
ట్లాజాలరుల్ కాల పా
శ వితానంబులు గాలముల్ వివిధముల్
జాలంబులున్ జూపఁగా
వివశత్వంబున దుర్గతి ప్రణయులై
వే గూఱుచుం డ్రమ్మెయిన్.

జయాపీడుని జనని 'అమృతప్రభ' యను నామె చివరకుఁ బాపకార్యము లొనరించి నశిం చిన తనసుతుని నరక కూపమునుండి యుద్ధరించుటకై 'యమృతకేశవుఁడు' అను నామమున విష్ణు వును బ్రతిష్ఠింపఁ జేసెను.

## లలితాపీడుఁడు

తరువాత జయాపీడునకు 'దుర్గాదేవి' యందుఁ గలిగిన కొమరుఁడు 'లలితాపీడుఁడు' అను వాఁడు వసుమతీపతి యయ్యెను. ఇతఁ డెప్పుడును కామియై రాజధర్మమును బాటింపక రాజ్యమును వారాఙ్గనోపభోగ్యముగను దుర్నయ దూషితముగను నొనర్చెను. లలితాపీడుఁడు తనతండ్రి దుండగముచే గడించి పెట్టిన ధనము నంతను దదనుగుణముగనే చారణులు విటులు వన్నెలాఁడులు మున్నగు వారికి విరివిగ నొసంగుచు వినియోగింపఁ దొడంగెను. విటులు క్రమముగ నాయా వారకామినులను దార్చుచుఁ దద్బాంధవ్యమునంజేసి రాజనగరు నాశ్రయించిన వారై లలితాపీడునిఁ గోడెగాండ్ర విద్య యందుఁ బండితునిఁ గావించిరి.

రాగ లంపటుఁ డగు నితఁడు రాజోచిత మండనము లైన కిరీట కటకాదులను ధరింపక యందుకు బదులుగాఁ సుందరవదనల దంతములచేఁ గురులు చీకాకు వఱుపఁ బడుటయుఁ దనయుదరమున వారి గోళ్ళచిన్నె లేర్పడుటయు నొడలికి నమూల్యము లైన యలంకారములుగ నెంచుచు వీరుల వార్తను బండితుల వృత్తాంతమును బెడచెవిం బెట్టుచు నెవ్వరు వేశ్యా కథా కథన చణులో! యెవ్వరు నర్మవచన చాతురీ విచక్షణులో అట్టి వారిని మాత్రమే లెస్సగఁ బ్రేమించువాఁ డయ్యెను.

ఈరీతి లలితాపీడుఁ డప్పటప్పటికి రాగోద్రిక్తుఁ డగుచు సామాన్యలగు నబలల పొందుచేఁ దనివి సనక స్త్రీరాజ్యమును జయించి రాగపారవశ్యపు జవుల నందక యూరక మరలి వచ్చిన తండ్రి యగు జయాపీడుని జడునిగా భావించెను.

మఱియు "దిగ్జయవ్యసనముతోఁ గాలము గడపిన తనపూర్వికు లగు భూపాలురు కేవలము తెలివి లేని వారనియు వారిచరితము పనికి మాలిన దనియు" ననుకొనుచుఁ దనదురాచారములందు మునిఁగి తేలుచు భోగ రస లాలసత్వమున గణనకెక్కు పెక్కు గణికలం గూడి స్వైరముగ రమించుచు నెల్లపుడు ప్రొద్దులు పుచ్చు నతనిని విటవర్గము తమజేబులలో వేసికొని యాడింప సాగిరి. కావుననే వారు లలితాపీడుని యెదుర నీచనర్మోక్తు లాడుచు నుండుట కలవాటు పడిరి. అప్పు డెవరేని పెద్దలు సంకోచముతోడ నీసడించుకొనినచో నట్టివారిని బెదరించి నివారించుచుఁ దమవచన రచనకు ముగ్ధుఁడై యున్న లలితాపీడునివలనఁ బెక్కు పారితోషికములు వడయఁగల్గుచుండిరి.

కం॥ వెలయాండ్ర కథలయందును
పలురకముల హేయ నర్మ భాషలఁ గడుఁ గౌ
శలము గల వారె పెద్దలు
బలియురు పండితులు నంచు భ్రష్టుఁడు దలఁచున్ ;

మఱియు నచ్చపుఁ గుంటెనగాండ్రవలె హేయ పరిహాసమునందు నేర్పరియై యెల్లపుడు వెలయాండ్రకు నెచ్చెలియై యున్న యీతఁడు తుదకు నాస్థానమునందుఁ జేరు పెద్దలయిన యమాత్యులు సిగ్గుపడునట్లు నడచుకొన మొదలుపెట్టి తన పడుపుఁ జేడియల పాదముద్రలచే నంకితము లయిన విలువగల వలువలు మున్నగు వానిని సమ్మాననీయు లగు సచివులు ధరించునట్లు నియమించుటకుఁ గూడఁ దెగించెను.

ఇట్లువి 'మనోరథుఁడు' అను మంత్రిపోషకుఁ డొక్కఁడు మాత్రము లలితాదిత్యుని సాధుమార్గమునకుఁ ద్రిప్పఁ గడంగెను. కాని తత్ప్రయత్నము లేవియు ఫలింపలేదు. పరిపరియును తనకు సరిగావని నిశ్చయించుకొని తనమంత్రిపదవిని వదలుకొనియెను.

పెద్దనడవడి గలవాఁడును నొకరి నెఱుఁగని వాఁడును ద్వేషియు ద్రోహియు నగు ప్రభువును గొలువక దూరమునఁ ద్యజించుటయె సేవా జ్వర పీడితుఁ డగు మానవునకు దివ్యౌషధము.

కం॥ సద్యోగ విముఖుఁ డౌమన
సద్యోగమునందు వేడ్క సాగఁగ దుష్కా
ర్యోద్యమ పరుఁడగు నొడయని
విద్యావంతుండు విడిచి వేయుటె హితమౌ॥

ఇట్టి లలితాపీడుఁడును బ్రాహ్మణులకు 'సువర్ణపార్శ్వము' 'ఫలపురము' 'లోచనోత్సము' అను ప్రదేశముల నొసఁగి పండ్రెండేండ్లు కాశ్మీరము నేలి కర్మఫలానుభవమునకై కాలగతి నొందెను.

## సంగ్రామపీడుఁడు

పిమ్మట జయాపీడునకుఁ 'గల్యాణదేవి' యం దుదయించిన వాఁడు 'సంగ్రామపీడుఁడు' సింహాసన మధిష్ఠించెను. ఇతఁడు 'పృథివ్యాపీడుఁడు' అను నామాంతరమును బడసి సామ్రాజ్యము నేఁడేండ్లనుభవించి పుడమినిఁ బాసెను.

## శ్రీచిప్పటజయాపీడుఁడు

తదనంతరము లలితాపీడుని కొమరుఁడు 'శ్రీచిప్పటజయాపీడుఁడు' అనువాఁడు తన శైశవమునందే కాశ్మీరపతి యయ్యెను. ఆతనికి 'బృహస్పతి' అను నామాంతరము గలదు. రాగగ్రహావిష్టుఁడైన లలితాపీడుఁడు 'అఖువము' అను గ్రామమునం దున్న 'ఉప్పుడు' అను పేరుగల కల్యపాలునకుఁ (సారాయి మున్నగు పదార్థములను దయారుసేయువానికి) కొమరిత యగు 'జయ' అనుదానిని వేశ్యనుగా వరించి తద్రూపలోభమునకుఁ జిక్కి యాకల్యపాలినిఁ దన యవరోధకాంతనుగా నొనర్చెను. ఆజయాదేవియందుఁ గలిగినవాఁడె శిశువైన యీరాజు. ఈశిశువును మేనమామలగు 'పద్ముఁడు' 'ఉత్పలుఁడు' 'కల్యాణుఁడు' 'మమ్ముఁడు' 'ధర్ముఁడు' అనువారు సంరక్షించుచు రాజభోగములను బాగుగ ననుభవించుచుండిరి. పెద్దవాఁడగు నుత్పలకుఁడు మహోన్నతపదముల నైదింటినిఁ బడసెను. తక్కిన మేనమామలు నల్వురును నితరము లగు కర్మస్థానములకు నధికారులైరి. సామ్రాజ్యమును వశపఱచుకొని సోదరులు తనయాజ్ఞ శిరసావహించి గౌరవించుచు నుండ ముదిత యైన రాజమాత యగు 'జయాదేవి' జయేశ్వరుని ప్రతిష్ఠ గావించెను.

విత్తలోభు లైన కోశాధికారులచే నపవిత్ర మైయుండు రాజసంపదను గ్రొత్తగ నధికారమునకు వచ్చిన మఱికొందఱు పూర్తిగఁ గొల్లగొట్టుచుండిరి. ఇట్లే జయాపీడుఁడు క్రమముగ గడించిన విత్తములోఁ గొంతవరకు నతనిసుతుఁడు వ్యయపఱచెను. మిగిలియున్న దానిని లలితాపీడుని స్యాలకులు వరుసగ హరించిరి. అదృష్టవంతులగు నయ్యేవురును భగినీ భగ సౌభాగ్య సంభవము లైన విభవములచే భంగురములయిన భోగముల నడ్డులేక బాగుగ ననుభవించుచు నిరంకుశముగ నడచుకొనుచుండిరి.

చం॥ ఖల సచివుల్ నృపాలురును
గాని పనుల్ దగఁజేసి విత్తరా
సుల సమకూర్చి వాని నటు
చూచుచునే గనుమూసికొండ్రు; దు
ష్ఫల మది చిట్కాలో మెఱపు
చందమునన్ మటుమాయగాఁగ ని
స్తుల శుభముల్ పొనర్చి గుణ
తోయధు లౌదురు కొంద ఱీభువిన్.

కాని రాజభోగముల ననుభవించుచున్న యీయేవురును దుర్గుణములకుఁ బీఠభూము లయిరి. ఇట్లుండ బాల్యము చెల్లి భాగినేయుఁడు మెల్లఁగ రాజ్య వ్యవహారము లందుఁ బాల్గొన మొదలిడెను. అంతట మేనమామ లేవురును నరపతి యయిన భాగినేయుఁడు తనుచుస్వవృత్తిని గ్రహించి తమ్ము దండించు నని శంకించి వాని నెట్టులేని మట్టుపెట్టం బరస్పర మాలోచించిరి. రాజ్య కాంక్షా పీడితు లైన యాదుండగీండ్రు రాజైన తమమేనల్లునిఁ జివరకు నభిచార క్రియచేఁ బొలియించిరి.

లలితాపీడుని కొమరుఁడు పండ్రెండు వత్సరములు పుడమి నేలి ద్రోహులును నీచులును నైన తనమేనమామలచే నీరీతిగఁ గడతేరెను.

పిమ్మట నతని మేనమామలు రాజ్యకాంక్ష గలవారైనను పొత్తు కుదరక నృపాసన మెక్కుటకు నేను నేనను తలంపు గలవారై వారిలో నేయొక్కఁడును రాజగుటకు నొప్పక పోయిరి. మఱియు వారేవురును నాయాదేశము లాక్రమించి నామమాత్రముతోడ రాజులను జేసి యుంచుటకుఁ గొందఱ నెన్నుకొనుచు నొకరికి సరిపడిన వారు మఱియొకరికి గిట్టకుండుటచే నట్టిపనియుఁ జేయఁజాలక పోయిరి.

## అజితాపీడుఁడు

ఇట్లు జరుగుచుండ నీతరుణమున బప్పియనృపతివలన 'మేఘావళీదేవికి' గలిగినవాఁడు 'త్రిభువనాపీడుఁడు' అనువాఁ డొకఁ డుండెను. అతఁడు జ్యేష్ఠుఁడయ్యును రాజ్యతంత్రజ్ఞుఁడు గాఁడు. అనుకారణమున సింహాసనముఁ బడయలేక పోయెను. కాని యతనికి జయాదేవియందుఁ గలిగిన సుతుఁడు 'అజితాపీడుఁడు' అనువాఁడుండెను. 'చిప్పటక'జయాపీడుని మేనమామలలో 'నుత్పలుఁడు'

సోదరుల మాటను జైకి రానీక యీయజితాపీడుని సింహాసన మెక్కించెను. ఉత్పలకుఁడు మున్నగువా రేవురును 'శేడా'ది గణనా స్థానములందు మిగులుగా నుండు ధనమును వేఱుగ నుంచి యది యైదవ గణనాస్థానముగ నేర్పఱచి దానినుండి యజితాపీడునకు నన్నవస్త్రములకు లోటు లేకుండునట్లు ద్రవ్యము నొసఁగుచుండిరి. వీరి నేవుర నాశ్రయించి పేరునకు రాజై యుండిన యజితాపీడుఁడు దుస్థితి ననుభ వింప వలసిన వాఁడయ్యెను. ఈ సోదర పంచకమునం దేయొక్కనితో సంభాషించినను నితరులు మనస్సునం గుములుచుండెడు వారు. కావున నజితాపీడుఁడు దినదినమునను మిగుల విసుగు నొందుచు నేవురకు సమాన ప్రాముఖ్యము లేకుండుట తనకు మేలని తనలో నభిలషించెను.

ఈ విధముగఁ బద్మఁడు మున్నగు వారేవురు సోదరులును అజితాపీడుని రాజుగ నుంచి రాజ్యమునందు వచ్చు రాఁబడి నంతను నపహరించుచు పురములను దేవాలయములను మొదలగు వానినిఁ గట్టించి దార పుత్రాదులతోడ యథేష్టముగ రాజభోగముల ననుభవించుచుండిరి. వీ రాతరుణ మునఁ "బ్రభువిరహితమ"నియే చెప్పఁదగు కాశ్మీర రాజ్యమును విజనప్రదేశమున లభించిన మహి షము నీసుతోఁ గూడిన తోడేళ్ళువలెఁ బెనఁగులాడుచు ననుభవింపసాగిరి.

చం॥ మగఁటిమితోడ ధర్మమును
మన్చు నరేంద్రుఁడు లేని రాజ్య మా
మృగపతి లేని కానవలె
మెప్పు ఘటింపదు; వంచక ప్రభల్
మిగులు; వృకోదర ప్రతతి
మ్రింగును రాజ్యపు టామిషంబుఁ బె
న్వగపున సాధువుల్ నిజ ని
వాసములన్ విడనాడి పోవఁగన్.

ఇఁక 'ధర్ముఁడు' ధర్మస్వామినిఁ 'గల్యాణుఁడు' గల్యాణస్వామినిఁ బ్రతిష్ఠించి సుకృత వంతు లైరి. ధనాఢ్యుఁడయిన మమ్ముఁడు కలశప్రతిష్ఠా విధాన సహితముగ 'మమ్మస్వామి' ప్రతిష్ఠఁ గావించి యాతరుణమున నెనుఁబది యైదు వేల గోవులను దానము సేయుచుఁ దదుపకరణముగ నొక్కొక ధేనువునకు నైదేసి వేల దీనారములను నొసఁగెను. ఇట్టి విషయమును గమనించినచో నొక్క మమ్ముని సంపదయే యపరిమితమై యున్నది. ఇఁక నాభ్రాతృపంచకమునకుఁ గల యైశ్వర్య మంతయు నింతటిది యని చెప్పుట కేరికిఁ దర మగును? వారు సిరిని ద్రోహపద్ధతిచేఁ బడసినవా రైనను గావచ్చును. కాని, వారి యైశ్వర్యము దాతృత్వ గుణమున వన్నె కెక్కి యెల్లరకు స్పృహ ణీయమై యుండెనని చెప్పవచ్చును.

గీ॥ ద్రోహమున దోచికొను సిరితో ననర్థ
కార్యములకై కడంగు రాక్షసునికంటె
నాధనంబున ధర్మ కార్యములు జరుపు
వాఁడు యోగ్యుండెగద కొంతవఱకు వరయ.

ఈసోదరులు మొదట దానుద్దేశించిన గొప్ప గొప్ప దేవాలయములను గట్టించి వాని ప్రక్కనే యిదర దేవతల యాలయములను గూడ నిర్మింపఁజేసిరి. అదృశ్యమును జూచినచో దిగ్గజముల దగ్గఱ నుండు గున్నయేనుఁగుల సంగతి తలంపునకు వచ్చుచుండును.

ఆ॥ గున్న యేన్గు గములఁ గూడిన మదపుటే
నుఁగుల వరుసవోలె నగరులందు
చిన్ని గుళ్ళతోడఁ జెన్ను మీఱెడు గొప్ప
దేవళంబు లున్నఁ దేజ మెసఁగు.

ఇవ్విధమునఁ బద్మ్కుఁడు మ... సోదరు లేవురును దమభాగి...ుఁడు లౌకికయుగమ (సప్తర్షిచార సంబంధముగలది కాశ్మీర ప్రా...ం సుప్రసిద్ధమైనది) 3889 (క్రీ. శ 813-844)వ లౌకి సంవత్సరమున కాలధర్మము నొందిన రాదిగ 3926వ లౌకికసంవత్సరము (క్రీ.శ. 850-51) తుదివఱకు నిరంతరాయముగ మహాభోగముల ననుభవించిరి.

అవల మమ్మునకు నుత్పలునకు నంతఃకలహము ముమ్మరమై దారుణ మగు పోరిక మేర్పడెను. ఆ ఘోర రణమునందు నేలపాలయిన జోదుల మొండెములు వితస్తానది ప్రవాహము నడ్డగించిన వయ్యెను.

అట్టితరుణముననే బుధ మానస పారావార రాకాశశాంకుఁడు 'శంకుకుఁడు' అను మహాకవి కాశ్మీరమున వినుతి కెక్కి యుండెను. అతఁడు వీరిసంగ్రామము నుద్దేశించి 'భువనాభ్యుదయము' అను పేర నొక కావ్యమును రచించెను. ఆసోదరుల సంగ్రామరంగమునందు మమ్ముని సుతుఁ డగు 'యశోవర్మ' తేజస్వి యగు భాస్కరుఁడు నక్షత్రములను వెలుంగునుపోలె శూరుల నందఱను బేరు లేకుండఁజేసి తనతండ్రికే విజయమును జేకూర్చెను.

## అనంగాపీడుఁడు

పిదప మమ్మాదు లుత్పలునిచే రాజుగా నొనర్పఁబడిన యజితాపీడుని సింహాసనమునుండి తొలఁగించి సంగ్రామపీడుని తనయుఁడైన యనంగాపీడునిఁ గాశ్మీరపతిగా నొనర్చిరి. ఈకారణమున నుత్పలుని తనూజుఁడు సుఖవర్మ మమ్ముని యుత్సాహమును సహింపనివాఁడై 'యనంగాపీడుఁడు' రాజౌట కిష్టపడక లోలోన నతని మిగుల ద్వేషించుచుండెను. అట్లు మూఁడు వత్సరములు గడచెను. ఉత్పలకుఁ డసువులఁ బాసెను. 'సుఖవర్మ' యెట్లో నేర్పుతోడ నజితాపీడుని కుమారుఁ డగు 'నుత్పలాపీడు'ని నృపాసనారూఢునిఁ గావించెను.

## ఉత్పలాపీడుఁడు

ఈవిధముగఁ గాశ్మీర రాజ్యపీఠము నధిష్ఠించుటకుఁ బెక్కు రోజులు మాటిమాటికి మార్పాటు నొందుటంజేసి యట్టివా రందఱు "అశ్వయుజరాజు" సదృశు లని చెప్పఁదగి యుండిరి. వారికథ

భృత్యులుగా నుండియు నేర్పరు లగు కొందఱు మిక్కిలి యైశ్వర్యమును గడించిరి. ఉత్పలాపీడుని దగ్గర సంధి విగ్రహమునను నశపు మంత్రియై 'రత్నుఁడు' అనునామమునఁ బరఁగినవాఁ డాకాలమున 'రత్నస్వామి'నిఁ బ్రతిష్ఠించి గొప్ప యాలయమును గట్టించెను.

మఱియు నానమయమున 'నరుఁడు' మొదలగు వ్యవహారవిదులు, ఆయాగ్రామముల కధికారులై యుత్తమ మైన యశ్వ సంపదతోఁ గూడి 'ద్వారాభిసారము' మున్నగు నుత్తమ ప్రదేశము లను బడసి భూపాల నిర్విశేషముగ సుఖించిరి.

ఇంతటితో 'కర్కోట' నాగ వంశ్యు లయిన రాజుల వరుస క్షీణప్రాయమై యుత్పలకుని వంశజుల సంతతి విస్తృతి నొంది నృపాసన భాజనమై వన్నె కెక్కెను.

ఉత్పలుని కుమారుఁ డైన యాసుఖవర్మ క్రమముగఁ దనయసాధారణ శక్తిచేఁ బార్థివ తుల్యుఁడై యొప్పారఁదొడఁగెను. కాని, యతని బాంధవుఁడును దద్వైరియు నగు 'శుక్కుఁడు' అను వాఁడు సమయము వేచి యతనినిఁ గడతేర్చెను.

తఱువాత నత్తఱి సాచివ్యమును జక్కఁగ జరుపుచు దిట్టయై యున్న 'శూరాభిదుఁడు' అను నొక మంత్రి "సుఖవర్మ కొమరుఁడును సుగుణ భూషితుఁడును నైన 'యవంతివర్మ' రాజ్య పదవికి నెంతయు యోగ్యుఁడు" అని యెంచి యతనియెడ బద్ధాదరుఁడై యుండెను.

ఇట్లుండ లౌకికయుగము 3931వ సంవత్సరమున (క్రీ.శ. 856) ప్రజారంజన లబ్ధవర్ణుఁ డైన రాజు లేక పోవుటచేఁ బ్రజా విప్లవ మొకటి విజృంభించెను. అయ్యదనున 'శూరుఁడు' అను మంత్రి ప్రజల తిరుగుఁబాటును శమింపఁజేయుటకై ప్రజల తోడ్పాటుతోడనే యుత్పలాపీడుని రాజ పదమునుండి తొలఁగించి యవంతివర్మను గాశ్మీరధవునిగా నొనర్చెను.

తనతండ్రియు, తాతయు నేరాజ్య పదవికై దీక్షతోడ యత్నించి తుదకు విఫల మనోరథులై గతించిరో యట్టి పార్థివ పదవిని సుకృతి యగు నవంతివర్మ యిపుడు హేలగాఁ బడసినవాఁ డయ్యెను.

కదలిలోని సలిలమును వెలుపలఁ గ్రుమ్మరించుటకై పవఖ్యు, రేలును నెన్ని కుండల నుప యోగించినను క్లేశము తక్క ఫల మించుకేని యుండదు, కాని యాకుండనుండి పుట్టినవాఁ డొక్క రుఁడే యొక్క త్రుటిలో విచిత్రముగఁ బాథోధి నంతయు నరచేతిగుంటలో నిమిడ్చి యాచమింపఁ గల్గి యుండెనుగదా! కావున దైవ ఘటన కేదియు నసాధ్యము లేదు.

కం॥ తనవారి నొరుల సుఖములఁ
దనుపఁగ ముత్తాత, తాత, తండ్రులు యత్నిం
చిన పని ఫలింపకుండుట
విని యది సాధించు నతఁడె విశ్వ హితుండౌ.

ఉ॥ అంబుధిలోని నీటిని స
హస్ర ఘటంబుల ముంచి ముంచ ప
త్యంబును బాఱఁ జల్లినను
దగ్గునె తజ్జల మించుకేని? య
య్యంబుధి నంతయున్ జుళుక
మందునఁ జేరిచి యాచమించెఁ జి
త్రంబుగఁ గుంభసంభవుడు;
దైవ విలాస మదట్టిదౌ సుమీ।

అటుపిమ్మట నమాత్యులు రాజ్యలక్ష్మి క్రీఁగంటి ప్రసారపుఁ దళ్కులఁ నెనసిన పట్టుతల పాఁగతోడ నలరారుచున్న 'అవంతివర్మ'దేవుని యుత్తమాంగమునఁ గనక కలశములయందలి వివిధ తీర్థ తోయములచే యథావిధిగ నభిషేక క్రియ జరిపించిరి. సూర్యచంద్రులు సద్వంశజు లయిన భూపాలురకుఁ దొల్లి నిర్ణయించి యుండిన నూతన రాజ్య తంత్రమును క్రొత్తగ రాజైన యవంతి వర్మకు నుపదేశించుటకై యతఁడు మండనార్థమై ధరించిన కుండల ద్వయము నెపమున నతని కర్ణ సాన్నిధ్యముం జేరిరో! యన్న ట్లాతని మూర్తి యొప్పారెను. మఱియు నతనికిఁ బట్టియున్న రాజ్య చిహ్న మగు శ్వేత చ్ఛత్రము రాజ్యలక్ష్మికి గద్దియయై విప్పారి యున్న పుండరీకమువోడ్కిఁ దనరారెను.

శ్రీ శ్రీ శ్రీ

ఇది కాశ్మీరికమహామాత్యశ్రీ చణ్పకప్రభు సూను 'కల్హణ మహాకవి' ప్రణీతమగు 'రాజతరంగిణి' యను
సంస్కృత మహాకావ్యమునకు, అనువాదరూపమును స్వయంపాకాన్వయ భారద్వాజ గోత్రజ
శ్రీ, వేంకటలక్ష్మ్యంబా వేంకటప్పార్య తనూజ, పరదేవతానుగ్రహ సముపాత్తోభయకవితా
సాహితీవికాస, వ్యాకరణవిద్యాప్రవీణ, విద్వత్కవిశేఖర, మహాకవి, ఆయుర్వేద
విశారద, జరుగుమల్యభిజన, సింహపురనివాసి, వేంకటరమణశర్మచే
విరచితమును నగు, ఆంధ్రరాజతరంగిణి, అను చంపూ
మహాప్రబంధమునందు సర్వంబును
చతుర్థ తరంగము.

ఓం తత్, సత్



శ్రీ పరదేవతాయైనమః

# రాజతరంగిణి

(మహాకవి కల్హణుని కృతికి ఆంధ్రీకృతి)

## పంచమ తరంగము

## మంగళాచరణము

మ॥ అల పుంస్కోకిల కంఠ గోరుచులు నీ
యందుండఁ జక్షుశ్శ్రవ
స్సులు హర్షంబునఁ జూచుఁ. జూడుము, కచ
స్తోమంబునన్ బాములన్
గలయన్ జుట్టుట నీకుఁ గ్రొత్త రుచి యౌఁ
గాః యన్న భిన్నార్థ సం
కలితైకోక్తి యుమామహేశుల చమ
త్కారంబు మిమ్మోముతన్.

### అవంతి వర్మ

శ్రీ అవంతివర్మ రాజాసన మలంకరించినవాఁడై సామ్రాజ్యము నంతను నుత్పాటిత కంటకముగా నొనర్చియుఁ దనభవ్యచరితముచే విచిత్రముగ సత్పురుష శరీరములను మాత్రము గంటకితములఁ గావించెను. రాజగు నవంతివర్మయు శూరుఁ డనుపేర నొప్పిన యాసచివుఁడును నొకరియెడ నొక రాజ్ఞ యొసంగు నప్పుడు ప్రభువు లగుచు నానతి స్వీకరించు నపుడు భృత్యు లగుచును మెలఁగఁ జొచ్చిరి. ఆరాజు క్షాంతి కృతజ్ఞతలకు నిదాన మైన వాఁడు, అయ్యమాత్యుఁడు స్వామిభక్తుఁడును గర్వవర్జితుఁడు నై పొల్చువాఁడు. ఇట్టివారి నెయ్యమును గుఱించి మఱి యింకేమి చెప్పవలయును? రాజునకును నమాత్యునకును గల యిట్టి యభంగురమైన స్నేహ బాంధవ్యమును సుకృతవంతు లగువారు మాత్రమే యొకానొకప్పుడు వీక్షింపఁగల్గుదురు.

గీ॥ క్షాంతియుఁ గృతజ్ఞతయుఁ గల క్ష్మావరునకుఁ
బతిభ ప్రభుభక్తి లోదవి గర్వంబు లేని
సచివుఁ డుండుట యొక భవ్య సంఘటనము.
కలుగు నేరికొ? యదియు భాగ్యమున నెపుడొ?

ధీమంతుఁడైన యవంతివర్మ రాజ్యశ్రీ సముపేతుఁడైనను వివేచనా విలసిత మగు తన స్మృతినిఁ గోల్పోవక నరేంద్ర సంపదనుగుఱించి తనలో నిట్లు తలపోసెను.

"మాతంగోత్సవ లాలితయై భూభుజులకు వల్లభ యైన లక్ష్మి వారికి రాచసిరియెడ నప్పటప్పటికిఁ బేరాస బుట్టించుచు సున్నతాత్ములను సైతము దూషింపఁజేయు చుండును. నీచుని ప్రీతివలె మొదట నానుకూల్యమును వెల్లడించుచుఁ బిమ్మట మిగుల సంతాపపెట్టు స్వభావము గల యీ రాజ్య లక్ష్మిచే గాపిపడని ఱేఁడొక్కఁడును బుడమిపై నుండఁబోఁడు. చపలమతు లగు వేల్పు వెలయాండ్ర తోడ మున్నీటియందు నివసించినట్టి సిరికి నేకచారిణీ వృత్తమనునది యేరీతి నొనఁగూడును? నరపతులు వారు జీవించియున్నంత కాలము తనను స్తుతి పూర్వకముగ బాలించుచుఁ జివరకుఁ గాలగతి నొంది బంధుమిత్రాదులు తోడులేక పాథేయ మైనను బడయక దిక్కులేనివారై పోవునపుడు రాచసిరి యట్టి వారిని నిరాదరముగ విడిచిపుచ్చుచున్నది. గాని యించుకేని వారి ననుసరింపకున్నదిగదా!

పూర్వ రాజన్యులు బంగరు భోజన పాత్రలు మొదలగున వెన్నో సేకరించి భాండాగారము లందు నింపి యిహమునకు దూరమై పోయిరిగదా! వారెల్ల నిప్పు డావస్తు సంచయమునకు యజమాను లేలకారో? యాలోచింపఁదగి యున్న విషయమేగదా! ఇతరు లనుభవించి విడిచిపెట్టిన బంగరుఎంగిలి పాత్రలందు భుజించుచు భూభుజులు విఱ్ఱవీగుదురే కాని అట్టిపద్ధతి లజ్జాకరమని యెఱింగి పారిశుద్ధ్యము నైనఁ గోరకుందు రనుటయే వింత గలిగించు విషయము. గతించిన భూపాలుర నామాంకములు గల పెద్ద పెద్ద వెండి పాత్రలను గాంచినవాఁ డనుమాన మైనను లేక తనకడనె యుంచుకొనునట్టివాఁ డెట్టివాఁ డగునో బుద్ధిమంతుఁడు విచారింపఁదగును.

మూమూర్షువు లగుచున్న వారికిఁ గాలపాశములు గంతగతము లగుచుండఁగా నప్పుడు వారి కంఠములనుండి లాగివేసి యుంచిన హారములు విలువగలవైనను నపవిత్రములుగదా! అట్టివాని నలంకరించుకొనుటకు వివేకవంతుఁ డెవఁ డిష్టపడును?

పూర్వు లాసన్న మరణు లైనప్పుడు దుఃఖముచే వేఁడి కన్నీరు దొరలుచుండ నందుఁ దడిసి మలినమై పోయిన వారి యలంకారములను మేనిపై ధరించుటకు నెవ్వఁడు సంకోచము నొంద కుండును? మఱియుఁ బయోనిధి యంతరాళమున నెల్లప్పుడు వసించి యుండియుఁ బారిశుద్ధ్యము నొందక మలినమై యుండు సిరిని దారిద్ర్యాగ్నిచే దగ్ధు లగుచుండెడు వారను బాత్రులను నగు వారి దరిఁ జేర్చినచో నట్టిసిరి పుణ్యతీర్థమునిచే శౌచమును బడయు హరిణివలె నైర్మల్యము నొందును.

## శ్రీవిలాసము

క॥ భూతల పతి వల్లభయై
మాతంగోత్సంగములను మఱి లాలిత యౌ
శ్రీతరుణి యున్నతాత్ముల
చేతము లూరించి మొదటఁ జెడఁగొట్టుఁ దుదిన్.

గీ॥ ఆనుకూల్యము మొదటఁ దా నట్టె చూపి
చివరఁ గష్టాల పాలుగాఁ జేయు లక్ష్మి
చపల నీచప్రవణ; ఆమె జగతియందుఁ
దనిపె నెవరినిఁ బూర్తిగాఁ దథ్య మరయ?

క॥ వారినిధిఁ జపలలో సుర
వారాంగన లలముకొనఁగ వసియించిన యా
శ్రీరమణికిఁ దన మానే
నేరిచికొన వేశ చారిణీ ధర్మమిలన్.

మ॥ అరరే! శ్రీసతి యెంత నిష్కరుణ ని
త్యంబున్ జిరం బట్టు త
న్నరలేకుండ భజించు రాజులు శరీ
రాపాయ వేళన్ సహో
దర దారాదులు వెంటరాక తమచే
తన్ జిల్లి గవ్వైన లే
కరుగన్, బాపము! సాగనంపుటకుఁ దో
డై పోదు రెండడ్గులున్.

గీ॥ పసిఁడి భోజన పాత్రాది బహు ధనంబు
తమఖజానాల నింపి మోదమునఁ బొంగు
నృపు లిహముఁ బాసి నపుడె వానియెడ వారి
కరయ లేకుండు నేల స్వామ్యం బొకింత?

గీ॥ పర్వితము చవిఁ జూచెడు చందమునసె
వరు లనుభవించి విడిచిన భర్మ రజత
భాజనాదులపైఁ గాంక్ష ప్రబలియుండు
వారి డాయన్ ప్రపయు భయంపడునొ యేమొ!

గీ॥ ప్రేత నామాంకితంబులు పెద్ద పెద్ద
వగు కపాలంబులకు నెన యగుచు నుండు
రజత పాత్రంబులందు విరక్తి శంక
లేల గల్గును బుద్ధుల కించు కేని?

చం॥ గళమునఁ గాల పాశములు
కాలుఁడు వేయుచు నుండఁగా సుతా
దులు గళహారముల్ దిగిచి
దుఃఖముతోడనె దీసికొందు: రా
పులినపు హారముల్ కర మ
మంగళముల్ దలపంగ మర్త్యు లీ
కలిమిపయిన్ సదా మమతఁ
గాంచుట వెఱ్ఱితనంబు గాదొకో!

చం॥ కడపటి యూర్పులన్ విడుచు
కాలమున న్నెనుపొందు దుఃఖపుం
గడలినిఁ బుట్టు వెచ్చని ప్ర
గాఢపు బాష్పము సోకి యావిలం
పడిన యభద్ర హారములు
బాపురె! యెట్లు మనోహరంబులో!
జడమతి యైన లోభియును
జంకక వాని స్పృశింప నోపునే!

శా॥ ఆవారాశి జలంబునందె సిరి ని
త్యావాసముం జేయుచున్
దా నీడంగను లేకపోయె మలిన
త్వం బౌరః దారిద్ర్య మ
న్దావాగ్నిం బడి కాలు పాత్రుల కిడన్
దల్లక్ష్మి సంశుద్ధయౌ
నావై శ్వానర శౌచ యైన మృగి మ
ర్యాదన్ విమర్శింపఁగన్!

ఈరీతి నవంతివర్మ పెద్దతడ వాలోచించి తన వశముననుండు స్వర్ణాదికమును జూర్ణీకరించి యాపొడిని దోసిళుల నిండఁ దీసికొని సద్బ్రాహ్మణులకుఁ గరంభమునువలె నొసఁగెను. అట్టి సమయమున నొక ద్విజుఁ డతని వితరణమును మెచ్చుకొనుచు "ఓరాజా! నీయీవి లెస్సయైనది," అని యనుటకు బదులు త్వరపడి "అవంతివర్మా బాగు బాగు" అని పల్కియు గర్వమెట్టిదో యెఱుంగని యా పార్థివ శేఖరుని వలన నాద్విజున్నుఁడు స్వర్ణ చూర్ణాంజలులఁ బెక్కింటినిఁ బడసిన వాఁడయ్యెను.

ఇట్లు సుకృతి యగు నవంతివర్మ ఛత్ర చామరముల మాత్ర ముంచుకొని తక్కిన తన యైశ్వర్యము నంతను నర్థి సార్థముల యధీనము గావించెను. అపార ధనసంపదతోడ నొప్పారు తనదాయాదులు పెక్కండ్రు తన్నెదిరించి యుండుటచేఁ గ్రొత్తగ రాజపీఠము నలంకరించిన యవంతి

చక్రవర్తి [illegible] పొందుటకు మిగుల శ్రమపడవలసి వచ్చెను. కావుననే యతఁడు [illegible] తోడను భ్రాతృవ్యులతోడను దెబ్బలాటలు సమర మొనర్చి యెట్టకేలకు రాజ్య ముగ [illegible] మొనరించెను.

అతఁడు రాజ్యతంత్రము నడపుటకు నెట్టి విఘ్నములు గలుగకుండఁ జక్కఁజేసియు సౌజన్య శీల మైన మానసము గలవాఁడు గాన రాజ్య సంపదను బంధు మిత్రామాత్యుల కందఱ కును యుక్తముగ విభజించి తానును దగిన ట్లనుభవించెను.

అవంతివర్మ జ్ఞాతిప్రేమగల వాఁడు కావుననే తన సవతితల్లి కొమరుని 'శూరవర్మ' యను వానిని యౌవరాజ్యాభిషిక్తునిగ నొనర్చి యుండెను. ఆశూరవర్మ పుణ్య కార్య నిరతుఁడు. అతఁడు 'ఫాలాయము' 'హస్తిశర్ణము' అనునగ్రహారముల నొసఁగి గోకులము నేర్పఱచి 'శూరవర్మస్వామిని' ప్రతిష్ఠించెను, మఱియుఁ దనపూర్ణమైన దైవభక్తిని వెల్లడించుచు దేవతల సంపూర్ణ మాహాత్మ్యమున కాకరమై యుండు మఠము నొకదానిని నిర్మింపఁజేసి 'పంచహస్త'యను ప్రదేశము నొసఁగి యుండెను. అవంతివర్మ సోదరుఁడు 'సమరుఁడు' అనువాఁడు. చతురాత్మ కేశవుని 'సమరస్వామి' అనుపేరఁ బ్రతిష్ఠించెను, శూరవర్మ తమ్ములు 'ధీరుఁడు' 'విన్నపుఁడు' అనువారును తమ యభిధేయములతోడ నాలయములఁ గట్టించిరి. ఇతని తమ్ములే మఱి యిర్వురు గణనాస్థానమున కధికారులై యుండిరి. వారిర్వురు ప్రభావ సంపన్నులైనను పైకి మాత్రము స్థిర చిత్తత లేనివారివలెఁ గన్పడి చివరకుఁ దమమస్త తనువులతోడనే శంకరుని యావాసముఁ జేరి యచ్చోట మహేశ్వర భక్త సమాజమునం దగ్రగణ్యులైరి. శూరవర్మకడ రాజదౌవారికుఁడు 'మహోదయుఁడు' అనువాఁ డుండెను. అతఁడును మహోదయ స్వామినిఁ బ్రతిష్ఠింపఁజేసెను. మఱియు నితఁడు వ్యాకరణశాస్త్రమున మిగులఁ బరిశ్రమము చేసిన 'రామటుఁడు' అను నుపాధ్యాయుని మహోదయస్వామి దేవాలయమునందు మతబోధకునిగ నేర్పఱచెను.

అవంతివర్మ నరేంద్రుని యమాత్యుఁడైన 'శ్రీప్రభాకరవర్మయు' 'ప్రభాకరస్వామి' అను పేర విష్ణువునకుఁ బ్రతిష్ఠ గావించెను. ఇతఁడు తనగృహశుక మితరశుకముతోడఁ గూడి వచ్చి తన కనర్ఘము లైన మౌక్తికముల నొసఁగఁగా విష్ణుప్రతిష్ఠ సేయు నపు డందొక రమ్యతర మైన నిలయ మును శుక నివాసమునకై కట్టించెను.

మఱియొక విశేషమేమన? విద్యా ప్రసారము విచ్ఛిన్నమై యున్న యాతరుణమున నవంతి వర్మ భూకాంతుఁడు మహామాత్యుఁ డగు శూరుఁడును విద్వత్తల్లజులను బాగుగ సత్కరించి మరలఁ గాశ్మీరమున భారతీదేవి నవతరింపఁ జేసినవారైరి.

అవంతివర్మ భూపాలుఁడు పండితుల నత్యధిక సత్కార పూర్వకముగ రాజ యోగ్యము లగు పల్లకీలయందు రావించి తనకొలువునందుఁ బ్రవేశపెట్టి యాదరించు చుండెను. ఆకాలమున నతని సామ్రాజ్యమునందు 'ముక్తాకణుఁడు' 'శివస్వామి' కవిపుంగవుఁ డయిన 'ఆనందవర్ధనుఁడు' 'రత్నా కరుఁడు' అనువా రత్యంత ప్రఖ్యాతి వడసి యుండిరి. అమాత్యుఁడగు శూరుని యాస్థానమునందు

వందియై యున్న 'కృతమందారుఁడు' అనువాఁడు శూరు దుద్దేశించి యుపాయించిన విషయము నతని స్మృతికిఁ దెచ్చుటకై యనుదినమును నొక యార్యాగీతిని బఠించుచుఁ దన్మూలమున నీయంశమును జ్ఞప్తికిఁ దెచ్చుచుండెడి వాఁడు

"ప్రకృతి చంచల మైన యీసంపద యెంత కాలముండునో? అంతవఱకుఁ బరుల కుపకృతి చేయుట మిగుల నావశ్యక మగు విషయము, దుష్టకాలమ్ము దగుల నెల్లప్పుడు తప్పనిదే. కావున, బరోపకార మొనరించుటకు వేఱొక తరుణ మెట్లు దొరకును?"

చం॥ జగతి నిసర్గ చంచలము
సంపద; యయ్యది గల్గు వేళ ముం
దుగఁ దగ [illegible] కొంచు సుగ
తుల్ [illegible]గించు పరోపకార ధ
ర్మరతిఁ జరింపఁగా వలయు.
మర్త్యుల కెప్పుడు నాపద చ్చుటల్
పగ గొనినట్లు పైఁబడు; శు
భంబు లొనర్పఁ దరంబె యత్తఱిన్?

అని యాయార్యాగీతి నుడువు చున్నది.

పిమ్మట నమ్మంత్రి సురేశ్వరీక్షేత్రమునం దనేక భవనములను గట్టించి యందుఁ బార్వతీ పరమేశ్వరులకుఁ జిరస్థాయి యగు సన్నిధి [illegible] యాలయమును నిర్మింపఁజేసి 'శూరేశ్వరు' నందుఁ బ్రతిష్ఠించెను. మఱియు నతఁ డచ్చోటఁ బవిత్రసోపానములతో నత్యున్నతమై తాపసులకు సుఖాస్పదమై తనరున ట్లొక గొప్ప మఠమును గట్టించి యద్దాని నాత్మీయ నామమున నలరారఁ జేసెను.

తొల్లి 'క్రమవర్త' ప్రదేశమున నుండిన భక్కాస్థానము నమ్మహామాత్యుఁడు దాను నిర్మింపఁజేసిన 'శూరపురమునందు' నివేశపఱచెను. శూరునియొక్క [illegible] 'రత్నవర్ధనుఁడను' సురేశ్వరీ ప్రాంగణమునందే భూతేశ్వర ప్రతిష్ఠ కావించి తనతండ్రి గట్టించిన శూరమఠమునకు [illegible] రమణీయ మగు మఱియొక మఠమును నిర్మింపఁజేసెను. శూరుని ధర్మపత్నియు [illegible] నైన 'కావ్యదేవి' సురేశ్వర క్షేత్రమున 'కావ్యదేవీశ్వరుఁడు' [illegible] ప్రతిష్ఠించిన దయ్యెను.

నిర్మత్సరుఁడగు నవంతివర్మయు [illegible] నైన శూరుని శాశ్వతమగు రాజభోగములకు భాజనులనుగా నొనర్చి తాను [illegible] సచివోత్తముఁ డగు శూరుని ప్రాపమును భగవదాశయమును [illegible] వాఁడు గావునఁ దానును శైవ తత్త్వము నాదరించుచుండెను. అమ్మహీపాలుఁడు [illegible] ప్రసిద్ధమైన 'విశ్వైక సారము' అనెడు క్షేత్రమునందు [illegible] మనోజ్ఞమైన యవంతి పురమును నిర్మింపఁజేసి యచ్చోట రాజ్యప్రాప్తికి పూర్వమే 'అవంతిస్వామి' ప్రతిష్ఠ నొనర్చియుండినవాఁడు గాన సామ్రాజ్య లాభానంతర 'మవంతీశ్వరుని' నామమునఁ బ్రతిష్ఠించినవాఁడై హరిహరుల యెడఁ దనకుఁగల భక్తిపారమ్యమును స్ఫుటీకరించెను.

డాభూజాని చెంతకు వచ్చి కుశల మడుగఁగా నంచు కవంతివర్మ బాధ శమించినది. అని బదులు చెప్పెను. అంతట శూరుఁ డవంతివర్మను దల్పమునుండి లేవనెత్తి యాలయమునకుఁ దోడ్కొని పోయి పూజా శేషమును యథావిధిగ జేయించెను.

ఇవ్విధముననే యెల్ల కార్యములయెడ భూపతి యేమియుఁ జెప్పకున్నను నతని భావమును గనిపెట్టి మెలఁగుచు నుండిన ధీమంతుఁడై నశూరుఁ డాతేనికిఁ బ్రాణముల నైన నొడ్డి హిత మాచరించు చుండెను. ఆనృపాలుఁడు నయ్యమాత్యుఁడును బరస్పరము కోప కాలుష్య దూషణముల నొకప్పుడేని యించుకైన నెఱుఁగక బద్ధానురాగులై యుండిరి. వేఱు చెప్పనేల? లోకమునఁ బ్రజలు వారినువ్వరకు సాటివచ్చు నృపామాత్యులను జూచి యుండరుగదా! వినియైనను నుండ రని చెప్పవచ్చును. అవంతి వర్మ సామ్రాజ్యము తొల్లి మేఘవాహనుని రాజ్యమువలెఁ బది సంవత్సరములు ప్రాణి హింస యన్న పేరుగూడ లేకుండఁ జెన్ను మీఱ వర్ధిల్లెను.

అవంతివర్మ రాజ్య మేలుచుండ శరత్కాలమునందుఁ బాఠీనములు మొదలగు చేఁపలు శీతల మైన జలమును వదలిపెట్టి దడులఁ జేరి వెన్నుపై సోఁకు నాతపమునఁ గరము సుఖము ననుభ వించునవై ముద మొందఁగల్గెను. అవంతివర్మ కాలముననే లోకానుగ్రహమునకై 'భట్టశ్రీకల్లటుఁడు' మున్నుగాఁ గల సిద్ధులు పుడమిపై నవతరించిరి. ఇట్టితఱిఁ జెప్పఁదగ్గ చరిత్రము బహుళముగ నున్నది. కాని వారి యందఱి వృత్తాంతము నిటఁ దెల్పుటకు వీలు లేకున్నను నందుఁ బ్రాసంగికముగ నొక్క మహాపురుషుని యుదంతము మాత్రము మచ్చునకై వర్ణింపఁ బడుచున్నది.

కాశ్మీర దేశము 'మహాపద్మసరస్సు' నందలి సలిలముచేతను నితరము లైన నదులచేతను నావృతమై శబలిత మగుటవలన ధాన్యాధిపదార్థోత్పత్తి యల్పముగ నుండును. లలితాదిత్య సార్వ భౌముఁడు మిగులఁ బూనికతోఁ బ్రయత్నించి కొంతవఱకు నీటిని దేశమునుండి పోఁగొట్టుటచే భూమి యించుక ఫలింపఁ దొడఁగెను. తఱువాత జయాపీడుని వఱకు దేశపరిస్థితి యట్లే యుండెను. కాని తఱువాతివా రల్పసత్త్వులగుటచేఁ దగినట్టు జతనములు లేక వసుంధర మరల జలోపద్రవ ములకు గుఱియగుచుండెను. అట్టి తరుణమున నొకఖారి (పుట్టి) ధాన్యపుఁ గ్రయమొక వేయియేఁబది దీనారము లయ్యెనని చెప్పనిఁక నాదేశమున నెట్టిఘోర దుర్భిక్షము తాండవించుచుండెనో లోకులెంతటి యాఁకలిమం టలన గుంది యసురుసురగు చుండిరో తెలియకపోదు.

ప్రకృత మవంతివర్మ పాలకుఁడు కాఁగా నాతేని సుకృత మహిమ వలనఁ బ్రాణులను బ్రతి ంచుటకై యన్నపతియైన 'సుయ్యుఁడు' స్వయముగఁ బుడమిపై నవతరించెను. ఆ'సుయ్యుఁడు' పవనమందద్భుత చరిత్రుఁడయ్యెను. అతఁడెవ్వరి కొమరుఁడో యేరికినిఁ దెలియదు. కావునఁ గలికాలము ందును సట్టి యయోని సంభవులు గలరుగదా! యని ప్రజలు నిశ్చయించి యుండిరి.

పూర్వమొకప్పుడు 'సుయ్యా' యను పేరుగల చండాలవనిత వీధుల యందలి కసవు చిమ్ముచు నుండ నొకానొకచోట నొక క్రొత్తకుండ యానాఁటికిఁ గానవచ్చెను. అమగువ యచ్చటికిఁ బోయి కుండపై మూఁతదీసి చూడఁగా నందుఁ దమ్మిరేకులంబోలు కన్నుంగవతో నొప్పారుచు నొర

వ్రేలుంచి చీకుచుఁ బరుండియుండు నొక బాలునిఁ గనుంగొని యచ్చెరువొందుచు "ఎవ్వరో మంద భాగ్యురాలు సుందరాకారుఁడగు నీబిడుతనిఁ గుండయందీపగిది నుంచిపోయి యుండును" అని యెంచి యాశిశువు నెడఁ గరము వాత్సల్యము గలదగుటచేఁ దన పాలిండ్లనుండి స్తన్యము స్రవించుచున్నను దన స్పర్శముచే నబ్బాలుని శోభనగాత్ర మపవిత్రము సేయనొల్లక యొకానొక శూద్రస్త్రీ దగ్గఱ నాపెట్టను విడిచిపెట్టెను. ఆమెయు నాశిశువు నల్లారుముద్దుగఁ బెంచుచుండెను. ఆకుర్రఁడట్లు దినదిన ప్రవర్ధమానుఁడై 'సుయ్యుఁడు' అను నామముం బడసి బాగుగఁ జదివికొని మేధావి యయ్యెను.

పిమ్మట నాసుయ్యుఁడు గొంతకాలమున కొక గేస్తువింట బాలురకు విద్యనేర్పు నొజ్జయై జీవనము సేయుచు స్నానానుష్ఠాన వ్రతాది నియమములతోడ సజ్జనులకు హృదయంగముఁడగుచు గోష్ఠి వేళలందుఁ దన ప్రజ్ఞను వెల్లడించుచు నుండుటచేఁ జదువరులు పెక్కండ్రాతనికడఁ జేరుచుండిరి. సుయ్యునితోఁ గలసి మెలసి యుండువారు కొందఱు కథా ప్రసంగమునందుఁ గాశ్మీరము నందలి జల విప్లవమును గుఱించి మాటలాడుచుఁ బలుమాఱాదురవస్థను నిందించుచు నుండ సుయ్యుఁ డాసందర్భమున "నాకు బుద్ధి యున్నది. కాని నిర్ధనుండను నేనేమి సేయఁగలను?" అని పలికెను.

సుయ్యుఁ డంతటితో నూరకుండలేదు. అతఁ డావాక్యములను బంతముఁబూని పిచ్చివాని వలె మాటిమాటికి నుడువుచుండెను. అవంతివర్మ యావృత్తాంతమును జారులవలన విని విస్మయం పడినవాఁడై సుయ్యునిఁ దన సాన్నిధ్యమునకు రావించి "నీవేమి పలుకుచుంటివి?" అని యతనినిఁ బ్రశ్నించెను.

అందుకు సుయ్యుఁడు జంకుగొంకులేక "బుద్ధి యున్నది. కాని ద్రవ్యహీనుఁడనగు నేనేమి సేయుదును?" అను వాక్యముల నుడివెను. అవంతివర్మ యతని మాటలను విశ్వసించి యతని బుద్ధి యెట్టిదో! కనుగొనఁ గోరినవాఁడై తనయాప్తులు "ఈతఁడు న్మత్తుఁడు. వీని మాటలు సరకు సేయ వలదు." అని యడ్డుపడుచుండినను వారి వాక్యముల నంగీకరింపక కోశమునుండి యనేకములగు దీనారభాండములను హేలగా సుయ్యుని యధీనము చేసెను.

అంతట సుయ్యుఁడు రాజదత్తమైన ధనమును గైకొని సత్వరముగ నావపై మడవ రాజ్యమునకుఁ బోయి యందొక గ్రామము సంపూర్ణముగ నగాధ జలమున మునిఁగి యుండుట నెఱింగి యాసలిల మందొక దీనార భాండమును విడిచిపెట్టి తోడనే వెనుకకు మరలి పోయెను.

ఆ వార్త యవంతివర్మ సభాస్థారులకెల్లఁ దెలిసెను. వారందఱు నేకగ్రీవముగ "నతఁడు వాతూలుఁడు (వెఱ్ఱివాఁడు) అనుమాట నిక్కము" అని చెప్పుచుండినను రాజుమాత్రము సుయ్యుని కార్యదీక్ష యెట్టిదో పరీక్షింప వలయును. అను తలంపుతో వేచియుండెను. అంతట సుయ్యుఁడు క్రమ రాజ్యమునకుఁ బోయి యచ్చట 'యక్షదరము' అనుపేరుగల యగాధసలిలమునందు దోసిళులతో దీనారములను దీసికొని చల్లెను. ఆచోట వితస్తానదియొక్క రెండు దరులందును గొండలుండుటచే వాని గండశిల లానదిలోఁబడి ప్రవాహము నడ్డగించుటం జేసి నీరంతయుఁ గ్రమముగఁ బోక దేశము నలు గెల్లంకులకుఁ బ్రాఁకి భూమి పాడై దుర్భిక్ష మేర్పడుచుండెను. సుయ్యుఁడచ్చోట దీనారములను జల్లుట

తెలిసికొని క్షమ పీడితులగు గ్రామీణు లందలి దీనారములను వెదకి సంపాదించుకొనుటకై వితస్తా ప్రవాహము నందలి శిలల నన్నిటిని వెలుపలికిఁ దీసివైచి శోధించిరి.

ఈ రీతి సుయ్యుఁడు తనయుక్తి ప్రయోగమున నీటినంతను రెండుమూఁడు దినములలో సరియగు మార్గమున నొప్పునట్లు వితస్తానది నొక్క ప్రదేశమునఁ గార్మికు లయిన శిల్పులచే బంధింపఁ జేసెను అశ్మప్రజ్ఞ కాశ్మీరజుఁ డైన సుయ్యుని యాలోచనమునఁ గట్టించిన శిలామయ సేతు బంధనముచే నీల సంఘాత మయిన యానది యంతయు నొక వారము దినము లడ్డగింపబడినదై యుండెను.

అంతవరకు నిలచి యున్న యా ప్రవాహము యొక్క. యడుగు భాగము నంతను జక్కఁ జేయించి మరల గంభీరము ప్రవాహమునం బడి యుష్ణు పడకుండునట్లు గొప్ప శిలామయ సేతు బంధముల నిర్మింపఁ జేసి ప్రవాహము నడ్డగించుటకై కట్టించిన సేతువును బగులఁ గొట్టించెను. అంతట నాసాగర గాముని యచిరకాల నిరోధమునే సుత్కంఠ నొందినదో! యనునట్లు సరిత్పతినిఁ జేరుటకై యతిరయమునఁ బ్రవహింప సాగెను. నిరంతరయు: జోఁగా బురదచే వ్యాప్తమయి తళుకు తళుకు మనెడి మీలతో నొప్పారుచున్న యాభూమి మేఘ వర్జిత మగుటచే శ్యామల కాంతి కాంతమై తారకోత్కరముతోఁ నొప్పారు నభస్థలంవోలె విలసిల్లు చుండెను.

పిదప సుయ్యుఁ డెక్క డెక్కడ నీటి వరదలవలని యుపద్రవము లున్న వని తాను గనుఁగొనెనో యాయా ప్రదేశములందెల్ల వితస్తానదికిఁ జక్కని సేతువుల నిర్మింపఁజేసి ప్రవాహమును సరి యగు తెరువున నడిపించెను. వితస్తానది పుట్టిన తావునుండి కొంత దూర మొక విధమునఁ బ్రవహించినను గ్రమముగఁ బెక్కు ముఖములతో విస్తృతి నొంది యుండుటంజేసి యానది పెక్కు పడగలతో నొప్పారు కృష్ణ సర్పమువోలెఁ జెన్ను మీఱి యుండును.

'త్రిగామి' అను ప్రదేశమునకు నెడమప్రక్క సింధునదియుఁ గుడివైపు వితస్తా స్రవంతియుఁ బ్రవహించుచు నవి రెండును 'వైన్యస్వామి'కిఁ బ్రాగ్భాగమున సంగమించుచుండును. సుయ్యుని యుపక్రమమున 'శ్రీనగరి'కిఁ బొంత నా రెండు నదులయొక్క సంగమము నేఁడును బ్రేక్షకులకుఁ గన్నుల పండుగై యానందమును గొల్పుచున్నది. సింధు సంగమ ప్రదేశమున నిరుదరులయందుఁ గల 'ఫలపుర' 'పరిహాస' పురములందుఁ దొల్లి 'శ్రీవిష్ణుస్వామి' 'వైన్యస్వాములు' ప్రతిష్ఠింపఁబడి యుండిరి. సుయ్యుని కాలమునందు సుందరీ భవనము వఱకును సింధు సంగమ మేర్పడుటచేఁ దత్తటమున యోంశాయి యైన హృషీకేశుఁడు ప్రతిష్ఠితుఁడై యర్చింపఁ బడుచుండెను.

ఆకాలమున నాయా నదులనుండి పెక్కు కుల్యలు వెలువడి యుండెను. నిషాదు లానాఁడు కుల్యలయందు విడిచి యుండు నావలను మోకులచే లాగి తత్తీరములందలి తరువులకుం గట్టుచుండెడి వారు. అట్టి రజ్జు బంధనాంకములం బొరసిన యాజీర్ణ వృక్షము లీకాలమునను గన్గొనఁ బడుచున్నవి.

మఱియు సుయ్యుఁ డాకాలమున మాంత్రికుఁడు పన్నగములను వలెఁ దరంగములను జిహ్వలతో నొప్పు నాయా తరంగిణులను నన్నిటినిఁ గుటిలగతి మాన్పించి తన యిచ్చవచ్చినట్లు చక్కని

మార్గమున నడిపించిన నేర్పుకాఁడయ్యెను. సుయ్యుఁడు క్రమముగ వితస్తానదిని నేఁడు యోజనముల వఱకు శిలామయములయిన సేతువులచే బంధించి యగాధమైన మహాపద్మ సరోవరమునందలి జలమునంతను నదిని నియంత్రిత మొనర్చి యుండుట యత్యాశ్చర్యావహమగు విషయము. సుయ్యునిచే యోజింపఁబడిన యా వితస్తానది మహాపద్మసరస్సునుండి వెలువడు చాదున నది సముగఁ బ్రవహించుచుండును.

తొల్లి యాదివరాహము మున్నుదు మునిఁగి యున్న పుడమి నుద్ధరించినట్లు అగాధ జలము నందుఁ గానరాకుండిన కాశ్మీర వసుంధరను సుయ్యుఁడు తన మేధాబలమున బయల్పఱచుటచే నచ్చోట బహుళ జన సంకీర్ణములయిన పెక్కు జనపదము లేర్పడి కనువిందై యొప్పెను. ఆ జనపదము లన్నియుఁ గాలువల మూలమునఁ బాఱింపఁబడిన నీరు వలసినంత గలవియై నీటి కుండములవలె నొప్పారుచు సర్వవిధములైన యాహార పదార్థములతోడ సమృద్ధములై యుండుటంజేసి వానిని జనులు 'కుండములు' అను నామమునఁ బేర్కొనఁ దొడంగిరి.

కాశ్మీరమున నేఁడును బుడమియందు లోతుగఁ బాతఁబడి యుండిన కీలసమూహములు శరత్కాలమున సలఁతి జలముతోఁ బ్రవహించుచుండు నచ్చటి నదులయందుఁ బైకిఁ గాన్పించుచు నీటి యందుండు మదపుటేనుఁగులం గట్టుటకొఱకేర్పడిన బంధన స్తంభములను దలఁపించుచు నుండును.

సుయ్యుఁడు మొదటఁ దాను దీనార భాండములను నగాధ జలమున విడిచి యుండెనుగదా! కొంత కాలమున కవి యన్నియు నిర్గత జలమగు 'నందకము' అను ప్రదేశమున దొరికిన వయ్యెను. మఱియు నతఁడు దేవమాతృకము లగు సస్యభూముల నెల్లఁ బరిశోధించి వానికిఁ దగినంత నదీజలమును గుల్యలవలనఁ బాఱించి యవి యన్నియు నదీమాతృకములై సుక్షేత్రము లగునట్లు గావించెను. ప్రతిభాశాలి యగు సుయ్యుఁడు దేశమునందలి నానావిధములయిన భూభాగములకు నీరెంతెంత విభజింప వలయునన్న విషయమును బరిశీలించుటకై యా యా గ్రామ పరిసరములయందలి పలుతెఱంగుల మంటినిఁ దెప్పించి యామృద్భాగముల నీటితోఁ దడిపి యవి యెంతెంత కాలమున నెండునో కనుఁగొని తదనుగుణముగ నాయా మృద్భాగములు గల ప్రదేశములకు వలసినంత నీటిపరిమితి విభాగమును నిర్ణయించి యవ్విధమున 'అనూల' మన్నగు నదులయందలి జలమును గాలువల ద్వారముగ దేశమునందలి నలువైపులకు శాశ్వతముగఁ జేయుచుండున ట్లత్యద్భుత ప్రయత్న మొనర్చి కృతకృత్యుఁ డయ్యెను.

స్తవ్య చరితుఁడైన సుయ్యుని ప్రయత్నమునఁ గాశ్మీర మంతయు సమృద్ధ ఫలోదారములైన కేదారములతో నిండి లక్ష్మీవిలాసముల కావాసమై చూడ్కులకు నపూర్వ దృశ్యమై చనరారఁ గల్గెను.

తొల్లి 'కశ్యపుఁడును' 'సంకర్షణుఁడును' గాశ్మీరమునకుఁ జేయఁజాలని మహోపకృతి సుకృతి యగు నొక్క సుయ్యుఁడు సేయఁగలిగి యుండుట యరిది విషయముగదా! ఇంతియకాదు. శ్రీమహావిష్ణువు దాను బుడమిని నీటినుండి యుద్ధరించుటయు నద్దానిని యోగ్యుఁ డగు బ్రాహ్మణుని

కొనఁగుటయు క్షాళ్యనే సేతువును గట్టించుటయుఁ గాళియ సర్పమును శిక్షించి నియమించుటయు నను నీనాల్గు పవిత్రకార్యములను నాల్గవతారములందు సాధించెను. సుయ్యుఁ డీనాల్గు కార్యంబులను తన సుకృత విశేషమున నొక జన్మమునందె సాధించి యుండుట స్తుతింపఁదగు విషయము.

సృష్టి మొదలుకొని సుభిక్ష కాలమునందును నేకాశ్మీరమండలమున నొక్క పుట్టి ధాన్యమును గొనవలయు నన్న రెండు వందల దీన్నారములకుఁ దక్కువ గాని ద్రవిణ మావశ్యకమై యుండెనో! అట్టి తావునఁ బుణ్యరాశి యగు సుయ్యునివలన నానాటినుండియు ముప్పది యారు దీనారములకు మాత్రమే యొక పుట్టి ధాన్యమును బ్రజలు పడయఁ గల్గిరని చెప్పుటకంటె ప్రమోదావహ మగు వృత్తాంతము వేఱొకటి యెయ్యది గలదు?

పిమ్మట సుయ్యుఁడు 'మహాపద్మసరోవరము' యొక్క సలిలమునుండి వెలువడెడు వితస్తానది దరియందు నమరావతికి నీడయైన యొక మహానగరమును దనపేరఁ బరఁగునట్లు వెలయింపఁజేసి యతఁడు దిక్తటంబుల నాక్రమించి యున్న యాసరస్సునందలి మీనములు పక్షులు మొదలగు ప్రాణులకు హింస గలుగకుండునట్లు దానొక్క శాశ్వతమైన నియతి నేర్పఱచి యయ్యది యెల్లవారికి సార్వకాలికముగ నవశ్య మంగీకార్య మగున ట్లొనర్చెను.

మఱియు నతఁడు 'సుయ్యాకుండలము' అనుపేరుగల గ్రామమును బ్రాహ్మణుల కొసఁగి పెంటలయందు శిశువుగ నున్న తనను గాంచి కనికరముతోఁ దోడ్కొని పోయి పెంచినట్టి 'సుయ్య' అను చండాలి నుద్దేశించి యాయమ్మపేర నొప్పారునట్లు 'సుయ్యా' సేతువును సైతము గట్టించి కృతార్థుఁ డయ్యెను.

ఈరీతి సుయ్యునిచేఁ గాశ్మీర భూభాగములు సలిలమునుండి యుద్ధరింపఁబడినవై యుండ నాయాయి ప్రదేశములందెల్ల నవంతివర్మ మున్నగువారిచే 'జయస్థలము' మున్నగు గ్రామములు వేలకొలఁది వెలయింపఁబడిన వయ్యెను. ఇవ్విధముగ నవంతివర్మ ధర్మములైన వృత్తాంతములచే రాష్ట్రమునందుఁ గృతయుగ ధర్మమును వర్ధిల్లఁజేయుచు వసుంధరను మాంధాతృ మహీవల్లభుని పోడ్కిఁ బరిపాలించెను.

పిమ్మటఁ గొంతకాలమున కవంతివర్మ ప్రాణాపాయకరమైన యొక మహావ్యాధికిఁ జిక్కి తనయసువులను బావన క్షేత్రమున విడువఁగోరినవాఁడై 'త్రిపురేశాద్రి' యందలి 'జ్యేష్ఠేశ్వరుని' యంతికమును జేరి యచ్చోటఁ గాలమును నయించుచుఁ దుదకు నాత్మవియోగము భౌతికశరీరమునకు మిగులఁ జేరువ నుండినట్లు నిశ్చయించుకొని చిరకాలమునుండి లోలోన వెలుఁగొందుచుండిన తన వైష్ణవభక్తిని బ్రాంజలియై యచ్చోట బహిరంగపఱచెను. ఆవిధముగ నతఁడు ప్రాణావసాన సమయమున భగవద్గీతలను వినుచు భావితాత్ముఁడై వెన్నుని దివ్యమూర్తిని ధ్యానించుచు జీవితమును బాసెను.

అవంతివర్మ యేఁబది తొమ్మిదవ యేట నాషాఢమాసమున శుక్ల పక్ష తృతీయయందు దివంగతుఁ డయ్యెను. అతఁ డట్లు శాంతినిఁ బడయఁగా నుత్పలవంశ్యులు పెక్కు రైశ్వర్య మదమున నొకరి కొకరు దీసిపోనివా రగుటంజేసి వారెల్లరు రాజ్య తృష్ణార్తులై ప్రత్యేకముగఁ బ్రయత్నింపసాగిరి.

# శంకరవర్మ

అయినను రత్నవర్ధనుఁడను ప్రతీహారుఁడు (కంచుకి) దృఢప్రయత్నము సల్పి యవంతివర్మ తనూజుఁడైన 'శంకరవర్మ'నే సింహాసనారూఢునిఁ గావించెను. విన్నపామాత్యుని సుతుఁడు 'కర్ణపుఁడు' అనువాఁడు శంకరవర్మయెడ నీర్ష్య గలవాఁడు గనుక 'శూరవర్మ' తనయుని 'సుఖవర్మ' యనువానిని యౌవరాజ్యాభిషిక్తునిగ నొనర్పఁ గలిగెను. ఆకారణమున రాజునకును యువరాజునకును లోలోన పగ రగుల్కొనుటయు అందువలన రాజ్యము డోలారోపితమున కెన యగుటయుఁ దటస్థించెను. అట్టి తరుణమున 'శివశక్తి' మున్నగు వీరవరేణ్యులు స్వామి కార్యమునకై ప్రాణముల నర్పింప సంసిద్ధులై దమపరాక్రమ పరీక్షకుఁ దగినకాలము త్వరలో రానున్నదని కుతూహలపడుచుండిరి.

అప్పుడు 'శివశక్తి' మున్నగు శూరవరేణ్యులు తమయెడయని దాయలు "తమ కత్యంత గౌరవపురస్సరముగ నధిక మగు ధనాదికము నొసఁగుదుము" అని ప్రతినఁ జేసి తమవంకకుఁ ద్రిప్పుకొనుటకై విశ్వప్రయత్నము లొనర్చినను వారిమాటను బెడచెవిం బెట్టి స్వామి భక్తి పరాయణులై మెలంగిరి. ఆకాలమున ననుజీవులు సుశిక్షితులును నభిమానధనులును నగు వారు గనుకఁ గబళలౌల్యమునఁ జరించెడు శ్వవృత్తిని మిగుల నీసడించుకొను చుండెడివారు.

అనంతరము శంకరవర్మ బలవంతుఁ డైన యువరాజు నెట్టకేలకు నోడించి ప్రాజ్య మైన తనవిజయారంభమును దిశలెల్ల దీపింపఁజేయుచు 'సమరవర్మ' మున్నగు వీరులతోడఁ బెక్కుమాఱులు పోరి తనయెడఁ బ్రణయమును జూపు కీర్తికాంతను సిరినిసైతము కైవసముఁ జేసికొనినవాఁడయ్యెను.

ఇట్లతఁడు దాయాదుల నోడించియు దిగ్విజయము సేయఁ గోరి తగిన సన్నాహము సేయింప నాతరుణమున దేశమునందలి ప్రజలును సంపదయుఁ బెంపు తఱిగి యుండుటచే నతఁడు విజయ ప్రస్థాన మారంభించి స్వదేశపుఁ బొలిమేర దాటు నప్పటికిఁ దొమ్మిది లక్షల పదాతి బలము మాత్రమే యతనితోడ బయలుదేరెను. దాయాదుల నోడించుటకుఁ బూర్వము 'శంకరవర్మ' యానతి స్వరాష్ట్రము నందును నాదరింపఁబడకుండెను. కాని, యతఁ డీనాఁడు విశిష్ట విక్రమ సముపేతుఁ డగుటచే నతని యాన నితరదేశపు నరేంద్రులుగూడ శిరోధార్య మైన యనర్ఘరత్నమునుగా నాదరించుచుండిరి. మహానది ప్రవహించు నపుడు కాలువలు వాగులు మొదలగునవి యందుఁ గలియుచు నాప్రవాహమును మఱింత పెంపొందించుమాడ్కి శంకరవర్మ వాహిని సాగుచుండఁ గ్రమముగ నాయాదేశపు రాజుల పృతనానిచయము లడుగడుగునను దానఁ గలియుచుండుటచే నదియొక మహావాహినియై తనరారెను.

దిగ్విజయ యాత్రాసంబంధ మగు నామ్నాయ సంప్రదాయము విచ్ఛిన్నప్రాయమై పోవుచుండ నద్దానిని శంకరవర్మ తనప్రజ్ఞాబలమున మరల నుజ్జీవింపఁజేసినవాఁ డని యనవలయును.

శంకరవర్మ ప్రస్థానము నాలించి 'దార్వాభిసారపు టొడయఁడు' భయపడి యద్రి ద్రోణుల నాశ్రయించెను. కావున నతని సేనానినాద మాకొండ లోయలం జొచ్చెను. కాని వాహినుల కర్ణపథంబులం జొరలేక పోయెను. అప్పుడు శంకరవర్మ ప్రజానీకముతోడ నిండి యుండు 'హరిగణము'

ఆనుప్రదేశము నాక్రమించి యానృపతి యొక దుర్గమునుండి మఱియొక దుర్గమునకు జేరు లోపలనే యాయా ప్రదేశముల నెల్ల నధీనము గావించుకొనుచుఁ దుద కతనికిఁ దల దాచుకొనుటకుఁ దావు దొర కుండునట్లు తఱిమి వైచెను.

అట్టి తరుణమున శంకరవర్మకుఁ దొమ్మిది లక్షల పదాతి సైన్యము మున్నూఱు మదపు టేనుగులు నొక లక్ష గుఱ్ఱపుదళమును నుండెను. పిమ్మట నతఁడు 'ఘూర్జర' దేశపు విజయమునకై బయలుదేరి ప్రస్థానము సాగించుచుండఁ ద్రిగర్తదేశపు రాజు 'పృథ్వీచంద్రుఁడు' "కాశ్మీరపతి దన్ను పట్టుకొని పరాభవింపునేమో!" అను భ్రాంతితోడఁ దబ్బిబ్బుపడి హాస్యపాత్రుఁ డయ్యెను. మఱియు నాపృథ్వీచంద్రుఁడు శంకరవర్మయెడఁ దనవినమ్రతను జూపింప మొట్టమొదటఁ దనకుఁ దాన తన కుమారుని 'భువనచంద్రుని' గాశ్మీరనాథునకుఁ బ్రతిభువు (ప్రతినిధి)గా నొసఁగఁబంపియుఁ బిమ్మటఁ దనప్రణతినిఁ దెల్పుటకై స్వయముగ బయలుదేరి శంకరవర్మ కడ కరుదెంచుచుండెను. కాని. తత్త న్మండలముల కధినేతలగు నృపాలురు గుఱ్ఱవాలములఁ గేల గీలించి చుట్టును దిరుగుచు రక్షించు చుండ మహోదధివలె భయానకమై తనకెదురు వచ్చుచున్న యాశంకరవర్మయొక్క చమూనివహ మును గాంచి భయకంపితుఁడై దనకు బంధనప్రాప్తి యగు నను శంకతో నచ్చటినుండి శీఘ్రముగ దవ్వులకుఁ బలాయితుఁడై పిక్కబలమును జూపించెను.

నిజ మాలోచింపఁ బురావిదు లగువారు శంకరవర్మ నిరుపమాన సౌందర్య రాశియని నేఁడును జెప్పుకొనుచుందురు. అట్టివానిని సైత మాజైత్రయాత్రా కాలమున వైరి నరనాథులు విలయ కాలునివగిదిఁ గాంచుచు డాయనైనను నోపక పలాయన పరులు గాఁదొడంగిరి.

తఱువాత శంకరవర్మ ఘూర్జర దేశమును ముట్టడించి ఘూర్జరాధిపుం డగు 'అలఖానుని' సమరమున నొప్పించి యొక్క క్షణములో నతఁడు నిక్షేపించి యుండిన సిరినంతయుఁ బెల్లగించి యతనిని దరిలేని శోకవార్థియందు ముంచినవాఁ డయ్యెను. 'అలఖానుఁడు' సేయునది లేక యడఁకువ తోడ శంకరవర్మ యడుగుఁదమ్ముల కెఱఁగి యంగుళి నొసంగి తనశరీరమును, 'తక్కదేశము' నర్పించి స్వీయమండలమును నిల్పుకొనినవాఁ డయ్యెను.

ఆపల శంకరవర్మ యధిరాజగు 'భోజుఁడు' థక్కియకుని రాజ్యమును హరించి యతనిని దనప్రతీహార స్థానాధిపతి యగు భృత్యునిగాఁ జేసికొని యుండ వానిని మందలించి థక్కియకాన్వయ మునకుఁ దద్రాజ్యము మరల నిప్పించెను.

ఆకాలమున 'శ్రీలల్లియశాహి' యను నతఁ డొకఁ డుండెను, అతఁడు హిమవ ద్వింధ్య నగములకు నడుమ నుండు నార్యావర్తమువలెఁ గేసరి వరాహములవంటి దారద తురుష్కాధిపతుల యిర్వుర నడుమ మెలఁగుచుండెను. పక్షచ్ఛేదము వొడము నన్న యదలునఁ గొండలు కడల్లిం జొచ్చినమాడ్కిఁ బెక్కు పుడమిఱేండ్లు లల్లియశాహి 'యుదభాండపురము' శరణముగాఁ జేసికొని సుఖ ముండిరి. విశాల తారాపథముం బోలిన యుత్తరాపథమునందు భూపాలురు నక్షత్రగణమువలె మినుకు మినుకు లాడుచుండినను లల్లియశాహి మాత్రము నైజతేజమున మార్తాండ మండలమును దలంపునకుఁ దెచ్చుచునే యుండెను.

అట్టి లల్లియశాహి యయ్యుఁ ఖానునకు నాశ్రయ భూతుఁడై యుండెను. కావున నతనిని గినుకతో రాజ్య భ్రష్టునిఁ జేయఁగోరుచు విజయోత్సుకుఁ డైన శంకరవర్మ యతని సేవ నియ్యకొనక పోయెను. కాశ్మీర క్షమారమణుఁ డైన శంకరవర్మ యీరీతి దిగ్విజయ యాత్ర నిరాకంటకముగఁ గొన సాగించి నిజమండలమున కరుదెంచి 'పంచసత్రము' అనుపేరఁ బరఁగు ప్రదేశమునఁ దనపేర నొప్పు నట్లు ఒకనగరమును నిర్మింపఁజేసెను.

ఉత్తరాపథము నేలుచుండిన 'శ్రీస్వామిరాజు' యొక్క కుమారీరత్నము 'సుగంధ' యను నామె క్షపాకరునకుఁ బున్నమ రేయివలె శంకరవర్మకుఁ గరము ప్రేయసియై యుండెను. శంకరవర్మ దా నిర్మింపఁజేసిన పురమునందు స్వీయ నామముతోడను ప్రఖ్యాత మగునట్లు 'శంకరగౌరీశ' సుగంధే శ్వరుల ప్రతిష్ఠలం గావించి యాదేవాలయముల కైంకర్యములు యథావిధిగ జరిపించుటకై చతుర్వేద పారీణుఁడును, వాగ్దేవికిఁ గులమందిర మనఁదగినవాఁడును 'నాయకుఁడు' అను నామమున విఖ్యాతుఁడును నగు నొక ద్విజోత్తముని నియమించి యుండెను.

ఈకాలమునఁ గవులు పరగ్రంథ చౌర్య మొనరించియు రాజులు పరద్రవ్య మపహరించియు స్వీయకృతులను బోషించు కొనుచున్నారు.

మ॥ పరకావ్యార్థములన్ హరించి స్వకృతిన్
  ప్రఖ్యాతిఁ జెందించు నే
ర్పరు లీనాఁడు గవుల్ మహామహులు; భూ
  భర్తల్ సదా స్వార్థ త
త్పరు లౌచున్ బర రాజ్య విత్త హరణ
  ప్రావీణ్యులై పశ్యతో
హరు లౌచున్ విహరించు చుండి రిది యే
  మన్యాయ్య కాలంబొకో!

ఇట్లే శంకరవర్మయుఁ గొంతకాలమునకు మన స్సత్త్వము గోల్పోయి తాను గట్టించిన ప్రోలన్నింటను మిన్నయగు నట్లు సేయవలయు నన్న కోర్కెతోఁ బ్రసిద్ధ మైన 'పరిహాసపురము' నందలి విలువ గల వస్తు నికరము నంతయుఁ దననగరమునకుఁ దెప్పించెను. శంకరవర్మ యానతిచే బరిహాసపురమునందుఁ బేర్వడసి యున్న నేతపద్ధతులు పశువుల క్రయవిక్రయాది ముఖ్య వ్యవహారములు శంకరపురమునందు నడచున ట్లేర్పడెను. శంకరవర్మకు రాజ్యము నిప్పించిన 'రత్నవర్ధనుఁడు' అనుమంత్రియు 'రత్నవర్ధనేశుఁడు' అనుపేర నీశ్వర ప్రతిష్ఠ నొనర్చెను.

పిదప శంకరవర్మ క్రమక్రమముగా నధిక లోభ గుణమున కలవాటుపడి ధనార్జన పరాయణుఁడై ప్రజా పీడనమునకు దొరకొనెను. నరపతు లనెడు ద్విరదములు యశస్సనెడు సెలయేటి నీటిచేఁ బరిశుద్ధ గాత్రములతో నొప్పుచున్నను వ్యసనాసక్తి యను పాంసు స్నానముచే నిజ శరీరములను మలీమసములఁ గావించు కొనుట చిత్ర మగు విషయము.

గీ॥ నృపతి యను మత్త గజము కీర్తి యను విర్ఝ
రాంబు పూరాన జలకము లాడు చుండు:
కాని, దుర్వ్యసనం బను గాఢ పాంసు
పాంసుల స్నాన మొనరించుఁ బసలు చెడఁగ:

శంకరవర్మ నానాటికి మిగుల వ్యసనాసక్తుఁ డగుచుఁ గోశముల యందలి ధనము నంతను గొల్లపుచ్చి క్రొత్త క్రొత్త పన్నులు విధించుటయే గాక దేవతాద్రవ్యమును సైతము హరింపసాగెను.

పిమ్మట నానృపతి పట్టణములందును నివసించు వారికడనుండి ధనము నంతయు నపహరించుచు నాధనముతోడ 'అట్టపతిభాగము' 'గృహకృత్యము' అనుపేర్లతో రెండు కర్మస్థానములను నెలకొల్పి యంతతోఁ దనివి దీరక దేవాలయములందలి ధూప చందన తైలాదులు విక్రయింపఁగా వచ్చు నాదాయమును 'క్రయమూల్యసుంకము' అనెడు నెపముతో స్వీకరింప మొదలు వెట్టెను.

తఱువాత నాతేఁ డిట్లే పాప కార్యాచరణ పండితుఁడై దేవాలయములందలి పూర్వదత్తమును సర్వస్వమును గైకొనుచు నందుఁ బ్రత్యేకముగఁ బ్రత్యవేక్ష యను మిషవెట్టి తనయుద్యోగులను నియమించి యఱువది నాల్గు దేవాలయములను బూర్తిగ దోపిడి చేయించెను. మఱియు నతఁడు దేవాలయములకుఁ బూర్వ లొసఁగి యుండిన గ్రామములను దానే స్వయముగఁ గైకొని 'మక్తా' నిచ్చు కృషీవలుఁడై మెలఁగఁ జొచ్చెను.

ఈ విషయ మిట్లుండ నింక నతఁడు బ్రాహ్మణ 'పర్షద'మునకు సంవత్సర గ్రాసమునకై యొసఁగుచుండు ద్రవ్యము నధిక పఱచినట్లు వెల్లడించుచు ధాన్యాదికము నిచ్చుచుపట్ల తులామానమును మూఁడు వంతుల వఱకుఁ దగ్గించునట్లు కృత్రిమ నియమ మొకటి గావించెను.

వెండియు నతఁడు వేర్వేఱు దిక్కులకుఁ బయనమై పోయి యాయాయి చోట్ల నుండు గ్రామీణులు వస్తు సంభారములను మోసికొని తనకడకు రాకుండిరేని వారి కెల్లరకు వారివారి ప్రదేశములకు సంబంధించిన మూల్యమునకుఁ దగినట్లు ఒక్క సంవత్సర భార మూల్య మర్పింపవలసినట్లు జరిమానాను విధించుటయే గాక మఱునటి యేఁడు నిరపరాధులగు గ్రామ్యు లందఱు నట్లే 'భారమూల్యము' చెల్లింపవలయు నని శాసించెను.

ఈరీతిని శంకరవర్మ యదివఱ కెన్నఁడును లేని వింత యగు 'భారభారోఢి' యను శాసన శస్త్రమును గ్రామవాస్తవ్యులపైఁ బ్రయోగించుటచేఁ దన్మూలమున గ్రామవాసులైన జనులు పదమూఁడు విధములయిన దారిద్ర్య మనుభవింప వలసివచ్చెను. కటికవాఁడగు నీతఁడు 'స్కందక' గ్రామోద్యోగులగు కాయస్థుల 'మాసవృత్తిసంగ్రహము' మున్నగు పెక్కు పన్నులను స్వైరముగఁ బ్రవేశపెట్టి గ్రామముల నుద్వేత్తుగా దోచుకొనుచుఁ 'దులామానపు టుపచయాపచయ మూలమునను, మాసవృత్త్యాది సంగ్రహమునను సేకరించిన ధనమును 'గృహకృత్య కర్మస్థానమునకై' వినియోగపెట్టుచు నాకర్మస్థానమున వేర్వేఱు పనుల నరిచూచుటకై యేవు రుద్యోగులను (దివిరులను) నియోగించి యాఱవవానిని 'లటవుఁడు' అనుపేరుగల శకటునిఁ గోశాధికారినిగా నేర్పఱచెను.

పాపియు మూఢుఁడును నగు నీనరేంద్రుఁడు తనకు నిరయము సంభవించుట కియ్యకొని భవిష్య ద్రాజన్యులకు మేలు సేయ నెంచియో లేక, యుద్యోగులకు మేలు సేయ నెంచియో యిట్టి ఘోరములగు శాసనముల నపూర్వముగ రాష్ట్రమందుఁ బ్రవేశపెట్టెను.

ఆనాఁడు కాశ్మీరమండలమున విద్యలయెడ ననాదర మేర్పడుటకును రాజులు నిస్తేజస్కులై యుండుటకును శంకరవర్మ యొక్కఁడే కారణభూతుఁ డనవలయును. రాజుల దోపిడి యానాఁడు ప్రజల నీతిరునఁ జిక్కులఁ బెట్టి చింతాసాగరమున ముంచినది. రాజ ప్రేరితు లగు కాయస్థులను దోపిడి గాండ్ర పాలఁ బడి కాశ్మీర మాకాలమునఁ దల్లడపాటు నొందినది.

ఇట్టి మహాఘోర మైన ప్రజల కుందు నెఱింగి రాజపుత్రుఁ డగు గోపాలవర్మ కృపారస తరంగితాంతరంగుఁడై యొకానొకప్పుడు తనతండ్రితో నిట్లు నుడివెను. "తండ్రీ! మున్ను నీవు నాకొక వరము నొసఁగి యుంటివిగదా! సత్యసంధుఁడవు గావున నద్దానిని నిన్నిపుడు వేడుచున్నాను. ఇప్పుడు మనరాజ్యమునందు కాయస్థుల ప్రేరణమువలన మీరు విధించి యుండిన నానావిధములగు పన్నులచేఁ బ్రజలు పలుతెఱంగుల పడరాని పాట్లు పడుచున్నారు. అకటా! మనప్రజలు తిననన్నము లేక శ్వాస శేషమే జీవనోపాధిగ నవలంబించి యఱచేతఁ బ్రాణములం బెట్టుకొని యుండుట మీకుఁ దెలియదా! ఇట్టి ప్రజాపీడచే మీకిహపరసుఖప్రాప్తి యుంచుకేని గలుగునా? "ఆముష్మికము-అదృష్టము" అది దురవగాహ మగునది. దానిసంగతి మనకెందుకు?" అని యొకవేళ ననుకొన్నను బ్రజాపీడన కార్యమువలనఁ దుద కిహమునందును బడయునది యనిష్టముగాక మఱేమున్నది.

పరికించిచూడఁ బ్రజలకు క్షామము వ్యాధి మున్నగు నుపద్రవములవలనఁ గలుగు వంత యంతయు నొక యెత్తుగను బుడమిఱేని లోభ గుణమువలన వారొందు నిడుమ యొక యెత్తుగను నెన్నఁదగును. ఇదియుఁగాక లోభాభ్యాసశీలుఁడగు మహీకాంతుని సిరి యకాలమునఁ బూచిన ప్రసూనముమాడ్కి ఫలవంతము కాకుండుటంజేసి యెవ్వరికిని నభినందనీయము కాఁజాలదు. దాతృత్వము సూనృత భాషిత్వము నను రెండు గుణములచేఁ బ్రభువు జగమునందుఁ బ్రజామోదసుఖమును జూఱఁ గొనుచున్నాడు.

ఇఁక లోభ మనునది సుగుణ కల్పకమును బోకార్చు వేఱుపురు గగునని చెప్పఁదగి యున్నది. మొగులుగమి హేమంత లక్ష్మిని రూపఱఁ జేయునట్లు లోభము పార్థివుని ప్రతాపాది సద్గుణములను నొక్కుమ్మడి రూపుమాపఁ గలదు.

గీ॥ సద్గుణం బను కల్పవృక్షంబు నడుపు<br>
వేఱుపుర్వగు లోభంబు, విమల మైన<br>
హైమనశ్రీ హరించెడు నట్టి మలిన<br>
జలద మాలకు నెన యది జగమునందు!

మఱియు జగతియందు లోభి యగు నరపతి సైన్యభరణాది వ్యయమునకు వెనుదీయు చుండును. అందువలన నతని ప్రాయాదులు క్రమముగ బలాఢ్యులై వానికిఁ గీడు సేయ వేచియుందురు.

అట్టివాఁడు తన లోభగుణముచేఁ బ్రత్యుపకారము సేయ నొల్లకుండుటంజేసి భృత్యు లెవ్వరు నతనికిఁ బ్రియ మాచరింపరు. ఇఁక నట్టిరాజు దగ్గఱ ధనము రాశీభూతమై మూల్గుచుండును. కావున. దదీయు లగు వారె తుద కతనిజీవితమును హరింప నుద్యోగింతురు. ఈవిషయమును దూరదృష్టితో నాలోచించినచోఁ బార్థివునకు లోభ మనునదియె గొప్ప శత్రువనియు నద్దానఁ గలుగని యపకారము వేఱొండు లేదనియు విశద మగుచున్నది.

సీ॥ ధనలుబ్ధుఁడై నట్టి ధరణీధవుఁడు ధన
వ్యయ భయంబునఁ బరిత్యక్త యుక్త
కార్యుఁడౌ; నతనికిఁ గల్గు దాయాదు ల
భ్యున్నతి కాములై యుత్సహింత్రు.
ప్రత్యుపకృతి యను పల్కు గిట్టని యా నృ
పాలుపై భృత్యులు స్వామిభక్తి
దప్పి వర్తింతురు. ధనరాశిని హరింప
బాంధవుల్ వాని యపాయమునకుఁ

గీ॥ గాచుకొని యుంద్రు కటా! వివేకంబు రూపు
మాపి వేధించి నారక కూపమందుఁ
ద్రోయుఁగద లోభ! మిట్టి విరోధి గలఁడె?
ఇంతటి మహాపకారి లేఁ డీజగమున.

తండ్రీ! 'రాజసంవాహము' అనెడు పేరుతోడ మీరిపుడు జనులపై మోపిన క్రొత్త పన్ను మిగుల భారమైనది. అయ్యది ప్రజల డెందములందు భయంకర దావానలమును రగులఁజేయును. అట్టి పన్ను విధించుటకు మిమ్ము పురికొల్పినది లోభమేగదా! అద్దానిని జయింపుఁడు. రాజశబ్దము నన్వర్థము గావింపుఁడు." అని యిట్లడఁకువతోడను సౌజన్యసరణితోడను వేడుకొను కొమరుని మాట లాలించి శంకరవర్మ చిర్నగవు మోముపైఁ దొల్కాడుచుండఁ గుమారునిఁగాంచి మెల్లఁగ నిట్లు పల్కెను.

'వత్స! సౌజన్యపేశలమును సత్కృత్యవిసంవాదియు నగు నీ వాక్యము నాకుఁ జిన్ననాట నుండిన చిత్తవృత్తిని నిప్పుడు మరల జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. తొల్లి నేను కౌమారప్రాయమున నుండి నప్పుడు ప్రజావాత్సల్య నిధినై యుంటిని. అట్టి తరుణమున నాతండ్రి నన్ను వేసవియందు గొప్ప కవచము ధరించువానిగను జలికాలమున సామాన్యమైన యంగవస్త్రమును గప్పుకొనునట్లును నలవరించెను.

మఱియు మీతాతగారు నన్నుఁ బాదుకలనైన ధరింపనీక సంచరింపఁ జేయుచుండువారు. ఒకనాఁడట్లే వేటకుఁబోయి గుఱ్ఱములు మున్నగువానితో నేనును నడవియందుఁ ద్రిమ్మరుచుఁ గాళ్ళ యందు ముళ్ళు గ్రుచ్చుకొనుటచే వేదనాభరమ్ము సహింపలేక పొరలుచున్నట్టి కన్నీటిని లోలోన నణంచు

కొని పరితపించుచు వెనుఁ జిక్కియున్న నన్నుఁ బురోహితులగు వారు కనుగొని నాజనకుని పద్ధతి యసమంజసమని భావించుచు నసూయపడుచుంటిని. వారి తలంపెఱింగి నాతండ్రి వారింజూచి "నేను మొదట సామాన్యజనుఁడనై యిప్పుడు నరపతి నైతిని. కావుననే యాయా తరుణముల యందు ప్రేక్షకుని సేవా పరిశ్రమమును గనుగొనఁ గల్గుచుంటిని. ఈనా కొమరుఁడును నిట్టి క్లేశము ననుభవించినఁ గాని మున్ముందితరుల బాధ నెఱుంగఁజాలఁడు. ఇయ్యది నిక్కము. లేకున్న నాగర్భశ్రీమంతుఁడు పరుల కష్టము గ్రహింపలేని మూర్ఖుఁడై యుండును." అని పలికి వారల సమాధాన పఱచెను. ఇట్టి యుపాయ ప్రయోగమునఁ దండ్రిచే సుశిక్షితుఁడనైన నేనును రాజ్యసంపద వడసి యిప్పుడీరీతిఁ బ్రజాపీడన రతుండ నైతిని.

శరీరధారి గర్భవాసమనెడు నరకమునందుఁ బడు వ్యథను బుడమిపైఁ బడినంతనే మఱచిపోవునట్లు నరపతియు రాజ్యశ్రీ సముపేతుఁడై పురాతనపుఁ గష్టముల నన్నింటిని విస్మరించుననుట నిక్కము.

చం॥ చిరతర గర్భ వాసమునఁ
జెందుచునున్న యసహ్యవేదనా
భరము శరీరు లీపుడమి
పైఁబడుచున్న క్షణంబులోననే
మఱచెడు రీతి రాజులును
మాన్యతమంబగు పూర్వచింతితం
బెఱుఁగని యట్టులే మఱచి
యేచి సుఖింతురు పూర్ణకాములై.

కావున వత్సా! నీవే నాకిపు డొక వరమీయఁగోరుచున్నాను. అది యేమన? వినుము. నీవయినను రాజ్య విభవమును బడసినతఱువాత నింతకంటె నధికముగఁ బ్రజలను బాధింపకుండువు గాక! ఇయ్యది నా యభిలాషము. అని సాసూయముగఁ దండ్రి పల్కుటయు నంతుల కటనుండు రాజాప్తులయిన విటు లొండొరులంగని మందహాసమొనరించుచుఁ దనదెసఁ గాంచుటయుం దలంచి సౌజన్యఖనియగు నా రాజకుమారుఁ డేమియు ననఁనేరక సిగ్గునఁ దలవంచుకొనెను. విటబృందముతో మెలఁగెడు మూర్ఖులకు హితబోధ రుచించునా?

ఇమ్మాడ్కి శంకరవర్మ దుర్గుణదూషితుఁడై త్యాగభీరువై సజ్జనులగు విద్వాంసులగోష్ఠి నొల్లకుండువాఁడునై యుండుటవలనఁ గవితల్లజులైన 'భల్లటుఁడు' మున్నగువారు అల్పతి వృత్తుల నాశ్రయించిజీవింపఁదొడఁగిరి. ఆకాలమునఁ గాశ్మీరమునఁ గవులెల్ల నిర్వేతనులైరి. ఇఁక భారికుఁడు (మూటలు మోయువాఁడు) మున్నగువారు 'లవటా'దులు శంకరవర్మ యనుగ్రహమునకుఁ బాత్రులై రెండువేల దీనారముల పరిమితిగల వేతనము వడయుచు గొప్ప శ్రీమంతులైరి.

గీర్వాణవాణి నాదరింపక గ్రామ్యుఁజోతుల కుచితములయిన గ్రామ్యదవుమాటలందు మొనగాఁడగు శంకరవర్మ తాను పల్యపాలకులమున జననమొందుటను విశదపఱుపఁ గల్గెను.

ఆకాలమునఁ జుట్టుతిరిగిన మీసలును దలపాగయు నాసికాగ్రమునఁ బ్రదేశినియు ధ్యానై కాగ్రమగు దృష్టియు నార్యజనోచితమైన వేషముగ నెన్నఁబడుచుండెను. 'సుఖరాజు' అను మంత్రి యిట్టి యార్యవేషధారియై యుండెను. అయిననేమి? దుర్నయపరతంత్రుఁడైన శంకరవర్మ యాశయము ననుసరించి యిట్టి సచివుఁడు సైతము ప్రవర్తించుచుండెను. అక్కాలమున నా మంత్రివర్తనము నట విడంబనమునకు దీటయ్యెను. అతఁడు 'దార్వాభిసారమునకు' నొడయఁడును బరాక్రమవంతుఁడును నగు 'నరవాహనుఁడు' ద్రోహి గాకున్నను నతనిని ద్రోహబుద్ధిగలవానినిగా ననుమానించి యొకనాటి రేయి యనుచర సమేతుఁడయిన యా దార్వాభిసారేంద్రుని నాకస్మికముగఁ బొలియించినవాఁడయ్యెను.

ఆకారణమునఁ బ్రజలెల్లరును నున్మార్గవర్తియు నృశంసుఁడును నగు రాజును బలుతెఱంగుల శపింపఁ దొడఁగిరి. ప్రజల యాడికోలుచేఁ గాఁబోలు? రాజపుత్రు లిరువదిమందియో లేక ముప్పదుగురో యెట్టి వ్యాధియు లేకయే యకాలమృత్యువు వాతఁ బడియుండిరి.

ప్రజల కహిత మాచరించు కూళలగు నరేంద్రులు దారపుత్రాదుల తోడ సాన్వయముగ నశింతురు. తుదకు వారిపేరయినను బుడమిపై నిలువనేరదనుట నిక్కము. ఈవిషయ మిదివఱకే విదితమైనదిగదా? ఇఁక ముందును విశదీకరింపఁబడును.

గీ॥ సిరి కళత్రము పుత్రులు చెప్పనేల
కులము కీర్తియుఁ బేరుతోఁగూడ నమయు
క్షణములో రాజులాత్మ సౌఖ్యంబుఁగోరి
ప్రజలఁ బీడింతురేని దుర్మదముతోడ.

ప్రకృతమున శంకరవర్మ వృత్తాంతమును బట్టి యట్టివిషయమును బరిశీలింపవచ్చును. శంకరవర్మ తనపేరఁ బరఁగునట్లు నిర్మింపఁజేసిన నగరము పట్టణము-అను సామాన్యనామమున మాత్రమే పేర్కొనఁబడుచున్నది. ఈవిధమునఁ బెట్టినపేరు గూడ నిలువక యణఁగారిపోవుట యొక్క శంకరవర్మ చరిత్రమునఁదక్క మఱి యెవ్వరి యుదంతమునను గానరాదు.

స్వీయనామ విధ్వంసియగు నీకాశ్మీరరాజు మిగులఁ గూళయనుటకిది చాలదా? శంకరవర్మ తనమంత్రియగు 'సుఖరాజు' యొక్క భాగినేయుని 'వీరానకము' అను స్థానమునందు ద్వారాధ్యక్షునిగాఁ నియోగించెను. అచ్చోటఁ బ్రమాదమున వర్తించునప్పుడు కొందఱతనిని వధించిరి. అందుకు రాజు క్రోధోద్రిక్తుఁడై తాను స్వయముగ రణప్రస్థానమును సాగించి 'వీరానకమును' నున్మూలించి యట నుండి యుత్తరాపథమునకొచ్చి యందు సింధుతీరముననుండు పెక్కు రాజ్యములను జయించెను.

ఆయాదేశములవారు భయభ్రాంతులై యడఁకువఁ జూపుచుఁ దనకు లోఁబడియుండుటచే శంకరవర్మ స్వీయమండలమున కభిముఖుఁ డయ్యెను. అప్పుడు మార్గమధ్యమున నుండు 'ఉరశ' అను దేశమునుఁజేరఁగా నచ్చోట నతని సైన్యమునకుఁ దద్దేశ వాస్తవ్యులతోడ నికేత హేతుకమగు ఘోరాట మారంభమయ్యెను.

అంతట నపుడు గిరిశిఖరమునుండి యొకానొక శ్వపాకుఁడు శరము నొకటి విడువఁగా నది రివ్వున వచ్చి రేని కంఠమునందు గాటముగా నాటెను. ఆ బాధ భరింపలేక శంకరవర్మ తాను ముమూర్షువగు చెలింగి తనయాప్తులం బిలిచి "సైన్యమును గాపాడుకొనుచు మీరు మన నగరమును జేరుఁడు. అని యాదేశించి యొక పల్లకి నెక్కినవాఁడై యచ్చటనుండి పయనము సాగించెను.

పిమ్మట నతఁడు మఱింత బాధననుభవించుచు నాసన్నమరణుఁడై యుండుతఱి మహారాజ్ఞి 'సుగంధాదేవి' యతని మేనిపై వాలి పెద్దపెట్టున నేడ్చుచుండఁ గన్నులు గానరాకున్నను బట్టమహిషి యెఱుంగు గుర్తించి హీనస్వరముతోడ "బుత్రుఁడగు 'గోపాలవర్మ' బంధురహితుఁడును బాలుఁడునై యున్నవాఁడు. కావుననతనిఁ గాపాడవలయును." అని పలికి గళంబును జొచ్చియున్న యమ్ముగును వెలికిఁ దీయవలయునని కోరెను.

అంత నతఁడు పడుబాధఁ జూడలేక యతని కుత్తుకయందలి శరమును దొలఁగింపఁగా నా శంకరవర్మ మార్గమధ్యమునందె యసువులఁబాసెను, అతఁడు 3977 వ (శకసంవత్సరమున) (క్రీ. శ. 902,) ఫాల్గుణ బహుళ సప్తమినాఁడు కాలునిపురముఁ జేరెను.

సుఖరాజు మున్నగు మంత్రులు రాజు వృత్తాంతమును గుప్తముగ నుంచి పరదేశములఁ గడచునపుడు జాగరూకతతోడ సైన్యమును, గాపాడుకొనుచు రాజు శవమును దీసికొని కాశ్మీర మండలమునకుఁ బోవుచుండిరి. అతిచతురులైన మంత్రులు యంత్రసూత్రముల సాహాయ్యమున జేని మస్తకము వంగువిధమును బైకి లేచువిధమును తంత్ర కల్పనము గావించిరి. ఆకారణమున సామంత రాజవర్గము రాజును దర్శించి ప్రణతి సల్పునపు డందులకు రాజు శవము తల యూపఁగలుగు చుండెను.

ఆరీతి వా రాతేని శవముతోడ నాలు దినములలో స్వీయ మండలమును జేరి 'బోల్యాసకము' అను పేరుగల స్థానమునందు భీతి రహితులై రాజున కంత్యక్రియలు జరిపించిరి. అప్పుడు 'సురేంద్రవతి' మున్నగు రాణులు మువ్వురు సహగమనము నొందిరి. మఱియు 'జయసింహ' పర నామధేయుఁడు 'వేలావిత్తుఁడు' అనువాఁడును 'లాడుడు' 'వజ్రసారుఁడు' అను నిర్వురు భృత్యులును గృతజ్ఞులై రాజు ననుగమించిరి. వీరిర్వురును రాజు శవముతోడఁ జితియందు నగ్నిసాత్కృతు లైరి.

## గోపాలవర్మ

తఱువాత సుగంధాదేవిచేఁ గాపాడఁబడుచున్న 'గోపాలవర్మ' కాశ్మీర క్షితి పాలకుఁ డయ్యెను అతఁడు బాలుఁడయ్యును సత్యసంధుఁడును ధార్మిక గుణ భూషితుఁడునై యొప్పువాఁడని యిదివఱకే విదిత మైనదిగదా! అట్టి వాఁడు కావుననే యతఁడు దుర్వృత్తులును నీచులును నగు నాశ్రితుల నడుమ నున్నవాఁ డయ్యును జిఱుప్రాయపువాఁ డయ్యును జెడు నడవడుల కలవాటు పడకుండెను. [illegible] మాత్రము వైధవ్య దశయందును నానావిధను లగు భోగములను విడువక కామ పరతంత్రయై తుదకుఁ 'ప్రభాకరుఁడు' అను మంత్రితోడ స్వైరముగ విహరింపఁ గోరెను

పిమ్మట నాసుగంధ ప్రభాకరునకుఁ బూర్తిగ వశంవదయై యతనిని సౌభాగ్య శృంగారము లకు నెలవుగ భావించుచుఁ జక్రత్రయాంకిత మైన మౌళి గల వానిగా నొనర్చుటయే గాక రాగోన్మాద మున నతనినే కోశాధ్యక్షునిగాఁగూడ నొనర్చెను. ఆకారణమున నతఁడు కోశమునందలి ధనము నంతను గొల్లగొట్టి 'ఉదభాండపురము'నందలి శాహిరాజ్యమును జయించెను. 'శాహి' యనువాఁడు తనయానతిని మీఱి యుండినవాఁ డగుటచే వానిరాజ్యమును 'లల్లియుని' కుమారుఁ డగు 'తోరమాణు నకు' నొసంగి వానికి 'కమలకుఁడు' అను పేరు వెట్టి యంతట నగరమునకు మఱలివచ్చెను.

పిమ్మట నా'ప్రభాకరదేవుఁడు' శౌర్య శృంగారముల కావాస మైన తన శరీరమునందుఁ బ్రబల మగు నభిమానముఁ జూపుచు శాహిరాజ్యమును జయించితి ననెడు నహంకారమున మిగులుచు పీరు లగువారినిఁ బలుమాఱు చులకన సేయ మొదలిడెను. శూద్రుఁడు వెలయాలి చెంపుఁ బట్టిన మాడ్కి రాజజననీ జారుఁడై యతఁడు నృపమందిరము నాశ్రయించి యుండుటఁజేసి యితరునకు మఱియెవ్వరి కినిఁ జొరవ యందు దొరక దయ్యెను.

ఇట్లుండఁ గొంతకాలమునకు మెల్లఁగా నాదుండగిని వృత్తాంతము గోపాలవర్మకుఁ దెలియ వచ్చుటయె గాక యొకానొక సమయమున నాత్మీయ ధనమానముల హరించిన యానీచుఁడు సయిత మక్షిగోచరుఁ డగుట తటస్థించెను. అయ్యదనున గోపాలవర్మ కోశగణనా పరిశీలనమునకై దొర కొనెను. కోశాధ్యక్షుఁడై ధనమంతయు దోచికొని యున్న యాతఁడు "శాహిరాజ్యమును జయించుటకై కోశమునందలి ద్రవ్య మంతయు వ్యయింపఁబడినది కాన నిందేమియు లేదు." అని సమాధానముఁ జెప్పికొనెను. కాని, యితఁడు రాజభీతి నొంది యుండుటచే నరపతిని హత మార్పవలయు నని యెంచి తనబంధువును, 'ఖార్ఖోద' విద్యావేదియు నైన 'రామదేవుఁడు' అనువానిని రావించి "గోపాలవర్మపై నభిచార ప్రయోగము గావింపుము." అని పురికొల్పెను. రామదేవుఁడును వానిమాటను ద్రోసిపుచ్చఁ జాలక యట్లే వానిపనిఁ దీర్చెను. గుణవంతుఁడగు గోపాలవర్మ యయ్యుత్పాతమునం దగిలి యిహ మును బాసెను. ఇంతకు గోపాలవర్మ కాశ్మీరమునకు రెండేండ్లు మాత్రము భూజానిగా నుండఁగల్గెను. తఱువాత రామదేవుఁడును దనదుశ్చర్య వెల్లడి యగుటవలనఁ దాను శిక్షాపాత్రుఁడ నగుదునన్న వెఱ పుచే మతిభ్రంశము నొంది యాత్మహత్య గావించుకొనెను.

## సంకటుఁడు

పిమ్మట గోపాలవర్మ సోదరుఁడు 'సంకటుఁడు' అనువాఁడు రథ్యలయందుఁ ద్రిమ్మరు చుండ వానినిఁ దోడ్కొని వచ్చి యమాత్యులు రాజపదము నలంకరింపఁజేసిరి. ఆసంకటుఁడును న్నపాపన మెక్కినతఱువాతఁ బదినములకే కాలధర్మము నొందెను.

## సుగంధాదేవి

పిదప శంకరవర్మ వంశ క్షయ మిట్లు కాఁగా, ప్రజలు "తమకుఁ బాలయిత్రివి గమ్మ"ని సుగంధాదేవిని వేడుకొనుటచే నామె కాశ్మీరరాజ్య భారమును వహించెను. ఆ సుగంధ రాష్ట్రమునందు

ధర్మము నభివృద్ధి పఱచుటకై తననామమున నొక నగరమును, సుతునిపేర గోపాలపురమును, గోపాలమఠమును గట్టించి గోపాలకేశవుఁడు ననునామమునఁ బ్రఖ్యాత మగునట్లు విష్ణువును బ్రతిష్ఠింపఁజేసెను. గోపాలవర్మపత్ని 'నంద' యనునామె గలదు. ఆమె కులముచేతను వయస్సుచేతను చిన్నది యయ్యు 'నందామఠమును' గట్టించి తనపేరఁ గేశవునకుఁ బ్రతిష్ఠఁ గావించెను.

గోపాలవర్మకు 'జయలక్ష్మి' యను మఱొక జాయ యుండెను. ఆయమ యాకాలమునఁ జూలాలుగా నుండెను. కాశ్మీర పాలపుత్రి యగు సుగంధ జయలక్ష్మికిఁ గలుగు నపత్యముపై నాస పెట్టుకొని యుండెను. కాని కొడుకు బ్రసవించిన తోడనే యాబిడ్డ మృత్తివాతఁ బడిన వార్త విని సుగంధ మిగుల వాపోయి కడకుఁ దనరాజ్యము నాత్మీయ కులమునకు సంబంధించిన వాని కెవ్వనికేని యీఁదలఁచి యందులకుఁ దగిన ప్రయత్నమును జేయుచుండెను.

ఆకాలమునఁ గాశ్మీరమునందుఁ 'దంత్రి' యనఁబరఁగు పదాతి వర్గము మిగుల నైకమత్యము గలిగి భూపాలుర ననుగ్రహించుటకు నిగ్రహించుటకును జాలియుండెను. ఆకారణమున సుగంధయుఁ దనసేనమెం జూపి 'ఏకాంగ' నామకు లగు మఱియొక తెగ వారి నాశ్రయించి తంత్రి సంఘముతోడ మైత్రి నెఱపుచు రాజ్యభారమును దానె మఱిరెండు సంవత్సరములు వహించిన దయ్యెను.

తదుపరి సుగంధాదేవి మున్ను తానుద్దేశించినట్లు యోగ్యుఁ డగు వాని నొక్కని సామ్రాజ్య పట్టభద్రునిఁ జేయ నిర్ణయించి తనయాశయము నెల్లరకు సభాముఖమునఁ దెల్పుటకై యొకనాఁడు మంత్రులను సామంతులను తంత్రివర్గమును, 'ఏకాంగ' సంఘమును, నితరులను రావించి పేరోలగంబుండి యందు సామాజికులతో నిట్లనెను. "అవంతివర్మ వంశాంతమునందు మాకుటుంబమున జనించిన 'గంగాదేవి' 'సుఖవర్మకు' జాయ యయినది గదా? ఇప్పుడామె సుతుఁడు 'నిర్జితవర్మ' యను వతఁ డుండుట మీరెఱుంగుదురు. అతఁడు 'శూరవర్మ'కు మనుమఁడు. వాని నీరాజ్యమున కధినేతగాఁ జేయవలయునని నాకోరికి. అతఁడు బాంధవ్య స్నేహమున నాకనుకూలుఁడు కానోపును. మీభావ మెట్టిదో దెలుపఁగోరెదను." అని పలికెను.

ఈవాక్యములు మంత్రులలోఁ గొందఱకు రుచింపలేదు. అట్టివా రందఱు సుగంధమాటలకుఁ బ్రతిఘటించుచు "నిర్జితవర్మ విషయలంపటుఁడు. అతఁ డట్లు రాత్రులందు జాగరము సల్పుచుఁ బగలంతయు నిద్రించుచుఁ గాలము గడుపుచుండువాఁడు. పగలంతయుఁ బర్యంక శాయియై లేవకుండుటచే నతఁడు 'పంగువు' అనుపేర గడించినాఁడు. అట్టివాఁడు రాజగుట కర్హుఁడగునా? ఇందులకు సమ్మతింపరాదు" అని నుడివిరి. ఈమంత్రు లిట్లు పల్కుచున్నపుడె తంత్రివర్గము గూఢముగఁ బోయి సత్వరముగ నిర్జితవర్మ సుతుని దశవర్షదేశీయునిఁ దీసికొనివచ్చి సింహాసన మెక్కించి "మనకు రాజితండె యగును" అని వెల్లడించిరి.

## పార్థుఁడు

ఈవిధముగఁ దంత్రివర్గము సుగంధాదేవిని రాజ్య పదవినుండి తొలఁగించుటచే వారందఱును దొల్లి మానహానికరము లగు కోశాధిపతి వాక్యములను దా మనుసరించి యుండినందుకుఁ బ్రాయశ్చిత్త మొనరించుకొంటి మని తృప్తి నొందిరి.

అంతట సామ్రాజ్య భ్రష్ట యగు సుగంధయు నవమాన భారమును సహింపలేక రాచనగరు వదలిపెట్టినపై దొరలెడు నశ్రు బిందువులు హారావళి యగుచుండ రాజధానినుండి నిష్క్రమించెను. పూర్వము సుగంధ కేసేవకులు రక్షకులుగా నుండిరో వారెల్లరు నిప్పు డామెకు విపక్ష పక్షములోని వారుగఁ గాన్పించిరి.

సుగంధాదేవి గతి యిట్లయిన తరువాత మరల నెనుబది తొమ్మిదవ వత్సరమున (శక॥ 3989) (క్రీ. శ. 913) ఏకాంగ సైనిక సంఘ మేర్పడి యేకమైపోయి హుష్కపురము నందున్న సుగంధాదేవిని మరలఁ దీసికొని రాఁ బ్రయత్నించిరి. ఆవార్త నెట్లో తంత్రి సైనికులు దెలిసికొని వారు పార్థివానుగ్రహము గలవా రగుటంజేసి గర్వాతిరేకమున సమరోన్ముఖులై చైత్రమాసాంతమున బయలుదేరి యేకాంగ సైనికుల తోడ్పాటుతో వచ్చుచున్న సుగంధాదేవి నరికట్టి వైచిరి. అంత నేకాంగ సైనికులకును తంత్రిసైనికులకును ఘోరమైన పోరితము వారియందే యారంభమయ్యెను. తంత్రిసైన్య మెట్టకేలకు నేకాంగ సైనికోత్కరమును బలాపంచలుసేసి పలాయనోత్సుకయైన సుగంధను బంధించుకొని వచ్చి తొంబదియవ సంవత్సరమున (శక. 3990) (క్రీ. శ. 914) వైశాఖమాసమునందు 'నిష్పాలక' విహారాంతరమునందు బందీకృతగా నుంచిరి.

సుగంధాదేవియుఁ గొంతకాలమునకు నవ్విహారమునందె యసువులఁ బాసెను. భాగ్యచక్రము యొక్క యుచ్చనీచగతు లనిత్యములుగదా!

తరువాత, సర్వాతిశాయి యయిన కాశ్మీర మండలమునం దంతటను బ్రజానాశము ధనక్షయము గలిగించు మహానర్థ పరంపర యడుగు వెట్టెను. తంత్రి సైనికులయనుగ్రహముచే రాచగద్దియ నెక్కిన వాఁడు బాలభూపతి 'పార్థుఁడు' అనువాఁడు. అతని తండ్రి 'నిర్జితవర్మ' పంగువు అను పేరఁ బరఁగిన వాఁడే యమాత్యుల సహకారమున రాజ్యాంగమును నడపించుచు జనులఁ బీడింప సాగెను. అతఁడే కాక యాతరుణమున రాజు లందఱును గ్రామోద్యోగులవలెఁ దంత్రివర్గమున కొకరికంటె నొక రెక్కుడెక్కుడుగ లంచ మొసఁగుచుఁ దంత్రిసైనికుల ప్రాబల్యమున నొకరిని గాదని మఱియొకరు రాజపీఠము నెక్కుచుండిరి. తొల్లి 'కన్యకుబ్జాదుల' సైతము నాక్రమింపఁగల్గి మహైశ్వర్యమునఁ దులఁతూఁగుచుండిన భూపాలవతంసములచే వన్నె కెక్కిన కాశ్మీరమునందు నీనాఁడు భూపాలురు తంత్రి సైనికులకు లొంగి వారికి 'హుండి నొసఁగుచుఁ దత్కృపచే జీవికను గడపవలసినవారైరి.

'మేరువర్ధనుఁడు' అనుమంత్రి కాశ్మీరమునందలి ప్రాచీన రాజధానియందు 'శ్రీ మేరువర్ధనస్వామి' యనుపేర విష్ణువును బ్రతిష్ఠించి గొప్ప యాలయమును గట్టించెను. ఆమేరువర్ధనుని సుతులు 'శంకరవర్ధనుఁడు మున్నగువారు, వారందఱు నిర్జితవర్మకుఁ దోడ్పడునట్లు నటించుచు నిగూఢ మగు రాజ్యతృష్ణచేఁ బ్రజలనుండి యధికమైన పన్ను రాఁబట్టి మిక్కుటమగు ధనము నార్జించిరి. మేరువర్ధనుని తనయులలోఁ బెద్దవాఁడు 'శంకరవర్ధనుఁడు' అతఁడు సుగంధాదిత్యునితోడ బద్ధసఖ్య మొనర్చి నాని సాహాయ్యమున నొకనాఁడు రాజమందిరమును గూఢముగ దోపిడిచేసెను.

ఆతరుణమునఁ బ్రజలు పన్నుల బాధచేఁ దపించుచుండ గాయముపైఁ గారము చల్లినట్లు కదాళములందుఁ గన్నులవిందై గాన్పించు శరత్కాల సస్య ఫల మంతయు వెల్లువల పాలై పోయెను.

ఆకారణమున 3993 లౌకిక సంవత్సరమున (క్రీ.శ. 917-18) ఒక్క పుట్టి ధాన్యము వెల వెయ్యి దీనారము లయ్యెను. ఇంక సామాన్య జనులు కొనఁదగిన దేమి? భుజించునదేమి? అతిఘోర మైన కాటకమునకు గుఱియై జనులు అన్నపానము లేక మాడుచు మృత్యువు కరాళ వదనమునందు నిండి పోయిరి.

అట్టితఱి వితస్తానదియందంతటను నీరు కనఁబడకుండునట్లు పొట్టఉబ్బి తేలుచుండిన శవ సముదాయమును జూచినచో నెట్టి కటికవానికేని గుండె నీరు గాక పోదు. మఱియు నెక్కడఁ జూచినను తీనుఁగుల పోగులు నిండి యుండుటచేఁ బుడమి యంతయు నెంప రాలచే నిండి పోయెను. కావున, నప్పుడు రాజ్య మంతయు రుద్రభూమిగా మాఱి చూపఱ కత్యంతము భీతి దాయక మయ్యెను.

ఇంకఁ బ్రభు సమ్మతి నొంది యుండిన మంత్రులు తంత్రులును దాచి పెట్టి యుండిన ధాన్యరాసుల నత్యధిక మైన వెల కమ్ముకొని యపార ధనమును గడించిరి. తంత్రి పరివర్తియై మెలఁగునట్టి యానాటి కాశ్మీరపతి యట్టి దుర్గతి నొందుచుండిన ప్రజల హితము నతిక్రమించి ద్రవ్య మును దన కెవ్వఁ డొసఁగునో వానినే తనమంత్రినిఁగా నాదరించుచుండెను. ఆద్రవ్యము తాను తంత్రి వర్గమున కీయవలసిన 'హుండి' ధనముగా నుపయోగపడుటయుఁ దన్మూలమునఁ దనకు స్వాసనము దక్కుటయు నందుకుఁ గారణమై యుండె ననుట తేటతెల్లముగదా!

ఇట్టి తీవ్ర సంకట సమయమందుఁ బ్రజలు దిక్కులేని వారై యాతిబాధ లనుభవించుచుండఁ గనికరము లేని యాపంగుప్తుఁ డట్టి జన బృందమును జూచుచు రాజధానియందుఁ దాను భోగియై యుండుటకు గరువపడుచుండెను. ఇట్టి హీనవర్తనము పెక్కుజను లడవియందుఁ దుపాను దెబ్బ తిని తల దాఁచుకొనుటకు పరిగొని పరుగిడుచుఁ బడిపోవుచుండఁగా నొకానొక పశుప్రాయుఁ డూష్మ యుక్త మగు మహాభవనమునందు సుఖియై బాధపడువారినిఁ దొంగి చూచి సంతసించుచుండుటను బోలి యున్నది. కాపురుషులకుఁ గరుణ యెక్కడిది?

తొల్లి ప్రజలను గన్నతండ్రులను మఱపించి గారామునఁ బాలించి లాలించిన 'తుంజీన' 'చంద్రాపీడా'ది మహారాజులచేఁ బాలింపఁబడిన కాశ్మీరము సురక్షితము గాలేదా? నేఁడు రాజ రాక్షసులు పాల కులగుటచేఁ బ్రజల కిట్టి చేటు వాటిల్లెను. విధిగతి విచిత్రము. స్వర్గ రాజ్యతుల్యమైన కాశ్మీరరాష్ట్రము క్షుద్రరాజుల పాలనము బాఱిఁబడినది. కావుననే వీరిలో నొక్కరును చిరకాలము రాజ్యమునేలు నర్హ తను గాంచరైరి. దుర్దినములందు జడివానలచేఁ బుట్టుచుండు నీటిబుడగ లెంతకాలము నేలపై నిలువ నేర్చును?

నిర్జితవర్మ సుతుఁడు పార్థుఁడనువాఁడు తంత్రివర్గపుఁ దంత్రముచేఁ దండ్రినిఁ గాదని సింహా సన మెక్కెను. నిర్జితవర్మయు నట్టి తంత్రివర్గ సాహాయ్యముననే సుతునిఁ బదభ్రష్టునిఁ జేసి యొక ప్పుడు రాజాసనముఁ బడయఁగల్గెను. ఈ విషయము మిగుల వింతగా నుండును. పంగునామకుఁడైన నిర్జితవర్మకు 'బప్పటదేవి' దేవేరి. ఆకాంత కామాంధయై సుగంధాదిత్యుఁడను మంత్రిపై మరులుగొనెను. వాఁడును నభంగుర సురతోత్సవములచే నారాజపత్నికిఁ గల మదన కండూతి నడంచి తద్దత్తమైన బహు విధమగు ధనసంపదతోఁ దులఁదూఁగుచుఁ దనకుఁగల ధన తృష్ణను దీర్చుకొనెను.

మేరు వర్ధనుని సుతుల విషయ మొకింత యిదివరకు వినియుంటిమి. వారిసోదరి సౌందర్య రాశి 'మృగావతి' అనుపేరుగలది. నీచులగు నాసోదరులు భగినీ సౌభాగ్య విభవమున రాజ్యమును గడింప నాసపడి తమ సోదరియగు మృగావతిని వంగు నామకున కొసంగిరి. ఆయువతియు వివేక భ్రష్టయై కామప్రేరితయై సుగంధాదిత్యుని స్వయముగఁ బ్రేమించి యతనితో స్వైరముగ రమింప సాగెను. నిర్జితవర్మయొక్క వెలఁదు లిర్వురును నీరీతి సుగంధాదిత్యునిఁ గూడి జారరతిం దనియు చుండిరి. అతఁడును బేదవెలఁదుకలకు నిర్వురకు నేర్పడిన యొక్క భోజనపాత్రమువలె నాపూఁబోండ్లకు దానొక్కండై పర్యాయ సరణి ననుసరించి వలపుఁబెంపుఁ జూపుచు వారి నావేశించిన మదన దేవతకుఁ దనివిదీర దాస్యము సేయుచుండెను. స్వైరిణులైన నిర్జిత వర్మపత్నుల కిర్వురకును సుతులు గలరు. కావున వారిర్వురును నాపుత్రునకే రాజ్యప్రాప్తి, నాకొమరునకే రాజ్యలాభము, అనెడి కోర్కెతోడ నందులకై తమ జారపతియైన సుగంధాదిత్యుఁడు తన సాచివ్యనైపుణితోఁ దోడ్పడవలయు నన్న తలంపుతో నతని చిత్తము వచ్చునట్లు పరస్పరము స్పర్థవహించి రతిపారవశ్యమున నతని ముగ్ధునిఁ గావించుచుండిరి.

## ని ర్జి త వ ర్మ

ఇది యిట్లుండ, 'పంగువు' అను నామాంతరము గల యానిర్జితవర్మ తంత్రి సైనికుల నాశ్రయించి వారి తోడ్పాటుతోఁ దనకొమరుఁడగు పార్థుని రాజాసనము నుండి తొలఁగించి 3997వ లౌకికాబ్దమున (క్రీ.శ. 921) పౌష మాసమునందుఁ దాను రాజయ్యెను.

## చ క్ర వ ర్మ

పిమ్మట నిర్జితవర్మయు 3998 లౌకిక యుగాబ్దమునందు (క్రీ.శ. 923) మాఘమాసమునఁ దనకుమారుని 'చక్రవర్మ' అనువానిని శిశుప్రాయునిఁ బట్టాభిషిక్తునిఁ గావించి క్షీణపుణ్యుఁడై క్షితినిఁ బాసెను.

తరువాతఁ బైతృకమగు రాజ్యపదవి నభిలషించుచు 'పార్థుఁడు' తంత్రి పదాతులను మంచి చేసికొనసాగెను. ఆహేతువుచేఁ దంత్రులకును నేకాంగ సైనికులకును గొంతకాలము సమరము తటస్థించెను. ఇఁకఁ బ్రకృతమున శైశవమునందే రాజై యున్న 'చక్రవర్మ' బప్పటదేవి తనయుఁడు. అతని మాతామహిపేరు 'కిల్లిక' వీరిరువురును జక్రవర్మను పదియేండ్లు కాపాడుచుండిరి. చక్రవర్మ బాలుఁడగుట వలనఁ దనతల్లి దౌశ్శీల్య మెఱుఁగకుండెను. శైశవము నందతనినిఁ గాపాడుటయుఁ దన కడనుంచుకొనుటయు బప్పటిదేవికిఁ గూడఁ గ్లేశావహము గాకుండెను. అండస్థమగు ఫణినిఁ జేతఁ బట్టికొని లాలించినందునఁ గలుగు ప్రమాదమేమి గలదు?

ఇట్లు కొంతకాలము జరుగ మరల తంత్రి సైనికులు చక్రవర్మను సింహాసనమునుండి తొలఁగించి 'మృగావతి' సూనుని శూరవర్మను రాచగద్దె నెక్కించిరి.

## శూరవర్మ

ఈ మృగావతి నిర్జితవర్మ భార్యయనియు పాపచరితయనియు విదితమగు. విదితమైనదేగదా! ప్రస్తుతము రాజైన 'శూరవర్మ'కు శంకరవర్ధనుడు మున్నగువారు మేనమామలు. వారు నిర్దయులు, స్వార్థపరులునై యుండుట పరిచితమైన విషయమే. అట్టివారు రాజునకు అమాత్యులగుటచే మంత్రి వర్గమునకు జెందవలసిన హుండికా ద్రవ్యము క్రమముగా జేరకపోవుచుండెను.

పుడమిఱేడగు శూరవర్మ దుర్వృత్తిలేని వాడైనను దనమేన మామల కృత్రిమచర్యల వలన దంత్రి సైనికుల కధికమగు ధనము నీయజాలని వాడగుటంజేసి వారికతడు ప్రీతిపాత్రుడు కానేరకపోయెను. ఎంతగుణవంతుడైనను మిక్కుటముగ రొక్కము చెల్లింపని వానియెడ వేశ్యలు వలపు జూపకుండుట సహజముగదా! ఆరీతి నొక్కయేడు గడచెను.

## పార్థుడు

పిమ్మట తంత్రిసైనికులు తృప్తి లేనివారై యధికమైన లంచమును సేకరించు నాశతో శూరవర్మను పదభ్రష్టుని జేసి మరల దొల్లిటి పార్థుని (నిర్జితవర్మసుతుని) రాజాసన మెక్కించిరి. ఈపార్థునకు ప్రేయసి యగు వేశ్య యొకతె కలదు. దానిపేరు 'సాంబవతి' ఆవెలయాలికి దంత్రిసైనికుల లోబఱచుకొనునట్టి నేర్పు కలదు. కావున పార్థుడు మరల రాజు కాగల్గెను. అయిననేమి? పదభ్రష్టుడైన యాచక్రవర్మ రాజ్యప్రాప్తికై కాలమును నిరీక్షించుచునే యుండెను. అతడు "నేనొడయడనైతినేని విత్తము భవదాయత్తము సేయుదును." అని తంత్రిసైన్యమును లోభపెట్టి వారిచే బార్థుని తిరిగి పదభ్రష్టుని గావించి 4011వ లౌకిక వత్సరమున (క్రీ.శ. 935) ఆషాఢమాసమున మరల రాజపీఠమును నాక్రమించుకొనెను.

## చక్రవర్మ

ఇట్లైనను జక్రవర్మ దూరదృష్టి లేనివాడై మేరువర్ధనుని తనయులగు శంకరవర్ధన ప్రభృతులకే మరల నాధికారిక పదవులను నొసగెను. శంకరవర్ధనుడు మున్నగువారు తొల్లి పార్థాదులను బదచ్యుతులను గావించి కుట్రలచే నధికార పదవులను సంపాదించి యధిక ధనమును సేకరించి సుఖజీవను లగుచుండిరి. మఱియు వారు తనసోదరుని దనతండ్రిని సింహాసనమునుండి తొలగించుటకు గారకులైరి, ఇట్లాసోదరులు మోసగాండ్రను విషయము ప్రత్యక్ష విదిత మైనను 'చక్రవర్మ' యా శంకరవర్ధనాదులకే యధికార మొసంగుటకు హేతు వతని బుద్ధిజాడ్య మనియే చెప్పవలయును.

చక్రవర్మ 'శంకరవర్ధనుని' నక్షపటలాధీశునిగను అకార్యకారియు దాంభికుడును నైన 'శంభువర్ధనుని' గృహకృత్యాధికారిగను నియమించెను. చక్రవర్మ రాజపీఠము నధిష్ఠించెనే గాని తంత్రిసైన్యమునకు దా నొసగదగు హుండికా ద్రవ్యమును నొసగజాలక రాజుగా నుండుటకు జంకి మరల నేడాది తిరుగకమునుపే రాజ్యమును విడిచి పలాయితుడై మడవరాజ్యమునందు నొక చోట గూఢముగ నుండెను.

## శంభువర్ధనుఁడు

ఇట్టితఱి 'శంకరవర్ధనుఁడు' భూవల్లభ పదవి నొందఁగోరి యందుల కనువైన యద నయ్యదియ యని నిశ్చయించుకొని తాను రాజ్యార్థి యైనట్లు తంత్రి సైన్యమునకుఁ దెలుపుటకై తన తమ్ముని శంభువర్ధనుని వారికడకు దూతగాఁ బంపెను. ఆశంభువర్ధనుండును దంత్రుల చెంతఁజేరి యనేక కపటవచనములు పల్కి తన మాయావాగురయందు వారినిఁ బడవేసి యన్నకు రాజ్యప్రాప్తి లేకుండఁ దననే వారిచే రాజ్యాభిషిక్తునిఁ గావించుకొనెను,

ఇది యెత్తుపై నెత్తుగదా! తిమి యను చేప జలమధ్యమునఁ బొరాడు చిన్న మీలను మెసవుచుండును. ఆతిమిని బకవల్లభుఁడు మౌనియై గిచుకపరనకుండ గుటుక్కున నోటవైచుకొనును. ఆ బకమును వ్యాధుఁడు తనయోగిరము గాఁ జేసికొనును. ఇట్లే కూళ లగు మానవు లొకరిని మించి మఱి యొకరు మోసపుటురు లొడ్డి చిక్కిన వారిని వంచించి బ్రదుకఁజూచుచుందురు.

ఉ॥ ఒక్కరికంటె నింకొకరు
యోధులిలన్ బరవంచనాచణుల్;
నిక్కము తీర్థమందుఁ దిమి
నేర్పున స్వీయ కులంబు మ్రింగుఁ; దాఁ
దక్కరి మౌనియై బకము
దాయు తిమిన్ గబళించు; వ్యాధుఁడున్
దక్కున నాబకంబుఁదెగ
టార్చుఁగదా! తనకుక్షి నింపఁగన్॥

ఆవల నారీతి రాజ్య చ్యుతుఁడైన చక్రవర్మ యొకానొక దినమున రాత్రియందు 'శ్రీథక్క' వాస్తవ్యుఁడును డామర నాయకుఁడును నైన 'సంగ్రాముఁడు' అనువాని యిల్లుఁ జేరెను. ఆడామర నాయకుఁడు చక్రవర్మయొక్క ముఖ తేజో విశేషమును గాంచి రాజని తెలిసికొని సంభ్రమముతో వినమ్రతను జూపుచు నంజలిబద్ధుఁడై తాను గూర్చుండు గద్దియ నలంకరింపుఁడని కోరెను. చక్రవర్మయు నట్లు గావించి తాను రాజ్య పద చ్యుతుఁడౌటఁ దెలిపి "నీవు నాకు రాజ్య ప్రాప్తికి సాయపడవలయును." అని తిన్నని మాటలతో నతని నర్థించెను, అందుల కా'సంగ్రాముఁడు' చక్రవర్మతోడ "ఓరాజా! నీసేవకై నేనెట్టి పనికైనను జాలియుందును. అని మొనయందుఁ దంత్రి సైనికులన నెంత? వారిమగఁటిమి యన నెంతటిది? వారు తృణప్రాయులు. కాని నీవు జయమును బడసి ప్రాప్తోత్సాహుఁడ వైన పిమ్మట మరల మమ్మే నాశన మొనరింపఁ గోరుదువేమో! ఏమన?

కృతకృత్యులైన పుడమిఱేండ్లు తోడుత వారు పడసియున్న యుపకృతి మఱచుచుండుట సహజముగదా! కుఠారికుఁ డక్కఱ దీరిన తఱువాత దిగువంజేరి తరుస్కంధమును నఱకుచందమ్మున మేదినీపతియు నున్నత స్థానము నారోహించుటకుఁ దన కెవ్వఁ డాలంబనమై యుండెనో యట్టివానిని

నైతము మ[illegible] వ్యాపించును. మేఘాలంబమునను నై[illegible] [illegible] ఉపకరిం పనచో ప్రా[illegible] నై[illegible] యున్నదే [illegible] స్వల్పాల [illegible] యతని శక్తినిఁ దలంచి యనుమానించును "[illegible] నాకే [illegible]" అని భావించి [illegible] యుండిన [illegible] దనకున్నదాని [illegible] చేయును. [illegible] రాజు [illegible] చేయుచుండును.

మఱియు గ్రహించు నట్టి రాజు [illegible] దొరకినట్టుగు ప్రమాదమున నిందుకు తప్పు కావించినను నట్టిని వెన్నదేసి వాఁడొనరించియున్న యపకృతినిఁ దలపెట్టక యెల్లప్పు డాయలంతి దొసఁగునే స్మరించుచుండును. అంతమాత్రమె కాదు. శత్రుభయము గాని వ్యాధి బాధ గాని [illegible] దొరకొని యుండెడు తమయనుచరుల నైన్యమును దీర్చక యుద్ధివారు తమకత మనుటకు సిగ్గుపేటని యెంచును వారి నుద్ధరింపఁ గడఁగు కృపాహీనుఁడు రాజు లెంపతో గలడు.

ఒకవేళ రాజు సజ్జనుండె యగునని యనుకొందము. అంతమాత్రమున నగున దేమి గలదు? అట్టి రాజును పిశాచ పుంజమువలె దుష్ట ప్రకృతి వర్గ మాక్రమించి యుండును. వారెల్లప్పుడు నేనుఁగు చెవుల చెంగటం జేరి పాడుచుండు దుమ్మెదలవలె నట్టి నరపతిం జేరి యాతనికిఁ గలుషవర్తన మలవరించు చుందురు.

నరేంద్రా! "ఈర్ష్యాళు వగువాఁడు కులటను గనిపెట్టి కాపాడుచందమున నెవ్వఁడేని సమర్థుఁ డొకఁడు నరనాథుని సన్నిధిం బాయక యతనిని ఖలప్రేరణ మనెడు నడుమునఁ బడకుండఁ జేయఁ గలఁడు." అని యనుకొంద మన్నను నట్టి పని పగటియందు మాత్రమె యతఁడు నిర్వహింపఁ జాలి యుండును. ఇఁక రాత్రియందు నొజ్జతనమును జూపెడు తనను దేవేరికి [illegible] యాయమ్మ సేయు పిశునోపదేశమును గ్రహించు రాజన్యుని సర్వజ్ఞుఁడు దక్ష మఱెవ్వండును బ్రబోధింప శక్తుండుగాఁడుగదా!

కొందఱు భూపతులు పగలంతయు విచక్షణుల గోష్ఠియందు నతికష్టముగ ధర్మప్రబోధము వడసియు రాత్రియం దాశిక్ష నంతయు గౌర ఖరములవలె మఱచి ప్రమత్తు లగుచుందురు. ఇదియును గాక స్నిగ్ధమును దీర్ఘమును నైన జిహ్వను జాచి లోభమును గలుగఁ జేయుచుఁ దనదరిఁ జేరిన పిపీలికములను జప్పుడు లేకుండఁ జప్పరించి వేయు శల్యకమువలె ద్రోహచింతనుఁడైన భూమీశుఁడు తనయాశ్రితుల నాకస్మికముగ హింసించును.

మఱియుఁ గ్రూరుఁడైన మహీపాలుఁడు బకమువలె దూరస్థునిఁ గాక తనచెంతఁ జేరిన వానినే హంతవ్యునిఁగా నెంచు ననుట నిక్కము. ద్రోహవృత్తు లయిన రాజుల విషయ మింకను గలదు. అట్టి పుడమితేఁడు కంటకాకీర్ణుఁడైనను బిల్లివలె నణఁగి మణఁగి తనలో నున్న కౌటిల్యమును వెలిపుచ్చక కాలాపేక్షియై యుండును.

ఇఁక నమ్రత్వం జూపినను సింహ మెట్లు హింసింపక మానదో! కౌఁగిలించు కొన్నను భుజంగ మేరీతిఁ గాటు వేయక విడువదో! నవ్వుచున్న వాఁడయ్యును బేతాళుఁ డేవిధమున వధించునో! అట్లే యెంత పొగడుచున్నను గూళ యగు నరపతి తనయాశ్రితుని నొకప్పుడు పరిమార్ప సమకట్టును.

## సుభాషితములు

గీ॥ చెట్టుపై నెక్కి పండ్లు గోసికొని దిగువఁ
జేరి చెట్టును నఱుకు కుఠారికునకు
నెన యగుచు హీనమతి యో మహీ ధవుండు
సేయు నుపవర్త కపకృతి సిగ్గు మాలి:

గీ॥ ధైర్య శౌర్యాది యుతుఁడు మేధావి తనకు
సాయపడుట సమున్నత స్థాన మొంది
నుపతి శంకించు నేమొ కూర్మి లేక
యుపకరించిన యా గుణాభ్యుదయు నెంచి:

కం॥ ఆపత్సేవకు లుండిన
నాపదలు ఘటిల్లు ననుచు నతిముగ్ధులు భూ
మీ పతులు వారిఁ జేర్పరు:
శ్రీపుష్టిన్ శుభములందు స్పృహలుప్పతిలన్:

గీ॥ ఆపదలయందు బాసట యైన లెంక
లెప్పుడో పొరపాటున నించుకంత
తప్పొనర్చి రటంచును దెప్పి వారిఁ
దఱుము నుపతులు లేరె కృతఘ్ను లిలను:

ఉ॥ ఆఁకటి బాధచే నవయు
చామయ పీడఁ గృశించుచున్, మదిన్
దూఁకెడు వైరి భీతికిని
దూపిలుచున్ స్ఫుట మైన వైకృతిన్
జీఁకు విపత్సహాయు లగు
సేవకులన్ గనుగొంచు సిగ్గు పె
ల్లేఁకన గాఁగ వారలను
వెంపర లాడుచు నుంద్రుగా నృపుల్:

మ॥ అవనీనాథుఁడు సాధు వైనను దద
భ్యర్ణంబునం దాప్తులై
యవిశుద్ధ ప్రకృతుల్ సదా మధుపముల్
వ్యాపించు చాశావశిన్
భువి భద్రేభము పొంత మూర్ఖక్రియ, దు
ర్బోధంబు గావించుచో
నభినీతుం డగుఁగాక: వాఫి కగునే
యాశ్వాస మొక్కింతయున్.

మ॥ పశుధర్మం బగు పాంసులాత్వమును మా
న్పం బూనిన ట్లీసునన్
విభున ప్రేరణ మంట పీక ప్రభువున్
విశ్వ ప్రయత్నంబులన్
విశదాత్ముల్ పగలెల్ల నోమెదరు లా
పింపంగ నాపిమ్మటన్
వశమా రాణుల రాత్రి యొజ్జటికమున్
వారింప నెవ్వారికిన్.

కం॥ అతికష్టంబున నెట్లో
మతిమంతులు నృపునిఁ బగలు మానక బోధా
న్వితుఁ జేయ గౌరవకర మ
ట్లతఁడు మఱచి పోవు నిశలయం దది యెల్లన్.

గీ॥ స్నిగ్ధమై దీర్ఘ మగు నట్టి జిహ్వఁ జాచి
యాశఁ బుట్టించుటన్ దనయంతికమునఁ
దిరుగు చీమల బారును దినెడు శల్య
కంబువలె మోసగించు లెంకలను గువతి.

కం॥ చెంతం జేరిన దుర్బలు
నంతం బొందించి దవ్వులందు మిగులు దు
ర్దాంతు నుపేక్షం గను భూ
కాంతుఁడు బకమల్లె ద్రోహి గాఁడె నిజముగన్.

మ॥ అనుకూలం బగు నట్టి కాలమునకై
యాశించి గోప్యంబుగాఁ
దనువున్ దుస్సహ కంటకావృతముఁ ద
త్తద్రీతిఁ గాపాడు నా
పుమగుంబిల్లికి సాటి యౌచు నృపుఁడున్
బొంకంబుగా మానసం
బునఁ గౌటిల్యము దాచి యుంచు సమయం
బున్ శాంతిమై వేచుచున్,

మ॥ నత మయ్యున్ వధియింపఁ బైకి దుముకున్
నాగారి; యాలింగన
స్థితి విశ్వాసముఁ జూపియున్ గఱచెడున్
దంద్రించి యాపాద సం

తతి; స్నేహంబు నటించి నవ్వుచునె బే
తాళుండు హింసించు; నీ
గతి మర్యాద లొనర్చుచున్ గున్నపతుల్
గారింతు రర్థార్థులై
'మఱియు'

గీ॥ వంగినను జై౯ బడుచు మ్రింగు సింగమట్లె;
కౌఁగిటన్ జేర్చినను బాము కఱచి చంపు;
నవ్వుచునె కూల్చు బేతాళుఁ; డివ్విధమున
స్తుతులఁ బడయుచునే చెడఁజూచుఁ గుపతి.

ఈ విషయ మిట్టిది. కావున నో నరేంద్రా! నీ వెప్పటికిని మాయెడ ద్రోహచింత సేయనట్లు ప్రతిన సల్పుదేని జేవకడనే సైన్యముతో సన్నద్ధుఁడనై యవ్యాజ భక్తితో నీకు దాసుడనై నీమనోరథము నీడేర్ప సమర్థుడైదను అని వచించెను.

ఈరీతిఁ బల్కిన డామరుని పల్కులకుఁ జక్రవర్మ లజ్జా మిశ్రిత మైన మందహాస మోష్ఠ బింబమునఁ దళుక్కొత్తుచుండ డామరుని వంకఁ జూచుచు, "ఉపకర్తలై యుండు మిమ్మెల్లర నాత్మసము లనుగాఁ జూచుకొనుచు నవ్యాజానురాగమున మెలఁగు చుండెదను." అని యనెను.

పిమ్మట నాడామరచక్రవర్మ లిర్వురు రక్త సిక్త మైన మహిషచర్మముపైఁ బాదము లుంచి యుసి లతలఁ గేలఁ గీలించి యొండొరుల ప్రమాణ సమ్మిత మైన సఖ్యము గావించిరి.

తఱువాతఁ జక్రవర్మ ప్రాతఃకాలమందు నానాముఖములఁ గూడి వచ్చిన డామరుని ప్రచండ సైన్య మండలముతోడఁ గూడి జైత్ర యాత్ర సాగించి నగరోన్ముఖుఁడై పోవుచుండెను.

ఈవార్తను దెలిసికొని తత్క్షణమే తంత్రి సైన్యము చైత్రశుద్ధ, అష్టమియందు శంకరవర్ధనుని ముందిడుకొని పోరు సేఁతకై చక్రవర్మ కెదురేతెంచెను. అంతట చక్రవర్మ కాలానురోధమునం జేసి తనలో నడఁగి యున్న ప్రతాపానలము నొక్క మాఱుగ నావిష్కరించి శాత్రవ సైన్యమును దహింపవలయు నన్న కౌతుకముతోఁ గరము త్వరపడుచు నుండెను. ఇట్లుండ నిరువాగుల సైన్యము దీకొని ఘోర మగు పోరితము నారంభించెను.

ఆసమరము పద్మపురమునకు వెలుపల జరుగుచుండెను. అట్టి తరుణమునఁ జక్రవర్మ యుత్తమాశ్వము నారోహించి తొలుదొల్త శంకరవర్ధనుని చెంతకుఁ దురగము నతిరయమునఁ బోనిచ్చి యతనినిఁ గరవాలమున బెట్టిదముగఁ బ్రహరించెను. ఆవ్రేటునకే యతఁడు గతజీవుఁడై యిల గూలెను.

అంతటఁ దంత్రివాహిని తమదళవాయి పడిపోవుటచే వైఖఁగంచి వారాశియందు వాయు గతిచేఁ బడి పోవుచున్న నావవలెఁ జెల్లచెదురై పిక్కబలముఁ జూప మొదలిడెను. కాని, చక్రవర్మ యాతంత్రిసైనికుల నెన్నంటి వారియసువులఁ దనప్రతాపాగ్ని కాహుతి యొనర్చెను.

మఱియు నన్నరేంద్ర కంఠీరవము సంగ్రామ రంగమున విహరించుచునుండ నతని వీర పట్టాంచలములు వడుస సమాపటలి విభ్రమము ననుకరించుచుండెను. ఇఁక నాపోరునందు నొక్క క్షణ మునఁ జక్రవర్మచే నిహతు లైన దంతిసైనికు లయినావేల కొలఁదిగ నుండిరని చెప్పుటకంటె నతని పరాక్రమము వేఱుగ వర్ణించి తెలుప నవసరము లేదు. ఆసమరోర్వియందు రణసంరంభమునఁ బరిక్రాంతి నొందిన వారివలెఁ బడియుండిన దంతి సైనికులకు గ్రద్దలు గుంపులు గుంపులుగఁ జేరి తక్కలిం గప్పి యొకింత నీడ నొసఁగిన వయ్యెను. శూరుఁడగు శంకరవర్ధనుండును గులీనులును గుణవంతులును నగు తనయాశ్రితులతోడ రణస్థలియందు వీరశయనము నొంది యుండుట ప్రశంస నీయము. ఇఁకఁ దంతిసైనికు లెల్లరు నాదినుండియు సంఘీభూతులై యుండిరి. అట్లే యొక్కమాఱు సాంఘిక క్షయము నొందిరి. వీరివృత్తము నరసినచో వీరిమనుగడ యేరికిని రుచింపకుండె నని చెప్పవచ్చును.

ఆదంతిసైనికులు మున్నెంచి చిరకాలము మాననీయులును నమ్మకస్థులును మహావంశ్యులును నగు మహీపతులను గొంచెపఱచి పాములవాండ్రు తమ జీవనమునకై సర్పముల నింటింట క్షణక్షణ మునను నాడించి క్రీడించు తెఱంగున వారిని దమచేతికీలుబొమ్మలుగఁ జేసికొని మించియుండిరి. ఈ పరాభవమును భరింపలేక చక్రవర్మయను కాలాహి కాలాపేక్షచే గూఢమై యుండిన విద్వేష విషము నంతను నొక్కుమ్మడిగ వెలువరించి గర్వావలిప్తు లైన దంతిసైనికు లను పాములవాండ్ర నంద అను నామరూపములు లేకుండున ట్లొనర్చుట యీసందర్భమున విస్మరింపరాని విషయము.

మఱునాఁడు పేరువడగు శంభువర్ధనుఁడు మూలమూలలఁ బాఱి పోయినవారును హతశేషులును నగు దంతిసైనికులం గూర్చుకొని మరలఁ గయ్యమునకు కాలుదువ్వ దైర్యము లేదనే సామంతులును మంత్రులును నేకాంగసైన్యమును చక్రవర్మను గలిసికొని యతని యుత్సాహమును బ్రశంసించుచు నల్లడలనుండి యేతెంచు వాహినీశతంబుల 'జయజయ' నినాదంబులకు దిక్కులు మార్మ్రోగుచుండ నతని నగరంబునం బ్రవేశపెట్టిరి. ఆతరుణమున స్ఫురద్రూపుఁ డగు నాచక్రవర్మ యశ్వరక్షకుల నడుమ నుండు నుత్తమ సమరాశ్వము నెక్కి కేవి మెఱయు విహరించుచు వాగెలను బట్టుకొని యెడమచేతితో నప్పుడప్పుడు తొలఁగి పోవుచుండిన తలపాగను సవరించు కొనుచుండెను. స్వేద కణ భూషిత మైన యతని కుడిచేత నలరారు చుండిన యసిలతయందు సూర్యబింబము ప్రతిఫలించుటంజేసి తత్కాంతి పుంజ మతని కర్ణభూషణముల నైగనిగ్యమునకు మఱింత వన్నె నేకూర్చునదై యుండెను. మఱియు నతఁడు ఘనమైన కవచమును ధరించి యుండుటవలనఁ దద్భార జనిత మైన క్లేశము ననుభవించుచు భ్రుకుటితాననుండై చూపఱకు భయావహుండును నగుచుండెను.

సంగ్రామ జయాంక పరిశోభితుఁ డైన యాచక్రవర్మ నగరమునందలి యంగళ్ళను గొల్లి గొట్టుచున్న దోపిడిగాండ్రను హుంకారమాత్రమునఁ బాఱఁద్రోలుచు భీతి నొందుచున్న నగర వాస్తవ్యులను గనుసన్నలతోడను శిరః కంపముతోడను నభినందించి యూరడించుచు ప్రతిపుటంబులను భేదించు భేరీభాంకృతుల మాటునఁ బౌరదీవనలు చెలరేగుచుండ నట్టియెడనునఁ గోటఁ బ్రవేశించి నృపాసన మాక్రమించెను.

## చక్రవర్మ

ఈవిధముగఁ జక్రవర్మ రాజాసన మలంకరించి కాశ్మీర రాజ్యమును మరలఁ గైవసము గావించుకొన నాసమయమున 'భూభటుఁడు' అనువాఁ డెటనుండియో శంభువర్ధనుని బంధించుకొని రాజు దగ్గఱకుఁ గొనివచ్చెను. ఆశంభువర్ధనుఁడు దన్ను వధింతు రేమో యనుభీతిచే నిమీలితనేత్రుఁడై దైన్యమును వెల్లడించుచున్నను భూభటుఁడు కసాయివానివలె నిష్కారుణుఁడై వానినిఁ దనకృపాణము నకు బలి యిచ్చెను. అతఁడు రాజభక్తి వెల్లడించుటకై రాజగు చక్రవర్మ కన్గొదుటనే యిట్టిపనిఁ గావించెను.

అయిననేమి? భృత్య మర్యాదను పీసరవోఁజేసి జనక సదృశు లగు రాజులను హత మార్పఁ బూనిన ధూర్తులలో శంభువర్ధనుఁడే ప్రథమగణ్యుం డనఁదగు. ఇంతకును జక్రవర్మ నిష్కం టక మైన రాజ్యమును బడయుటయే తేలిన సారాంశము.

ఐశ్వర్య మదము మానవునిఁ గుదురుగ నుండనీయదు. రాచఱికపు సింహాసనము నెక్కిన చక్రవర్మ కతిపయ దినంబులకే యైశ్వర్య మదోన్మత్తుఁడై నృశంసు లాచరింపఁదగు కార్యములందుఁ బాల్గొనెను. అంత నతఁడు క్రమక్రమముగఁ దన్ను దైవముగ నుతించుచుఁ దనవిక్రమమును గొని యాడుచు నుండు వందులు విటులు మున్నగు వారిని దగ్గఱఁదీసి వారి చమత్కృతులకు ముగ్ధుఁడై సదసద్వివేకమును గోల్పోయి స్వైరముగ నడచుకొన సాగెను.

ఇట్టితఱి దోంబగాయకుఁడు 'రంగఁడు' అను నతఁడు దూరదేశమునుండి వచ్చి గానసభ సేయింప రాజానుమతిం గోరుచు నిరీక్షించుచుండెను. రాజందుల కియ్యకొని వానినిఁ బ్రవేశపెట్టుట కనుజ్ఞ నొసఁగెను. పిదప సామంతులు మంత్రులును యథార్హముగఁ గూర్చుండిరి. ప్రతీహారులు రాజు నకు ముందఱ కొంత వివిక్త స్థాన ముందున కేర్పాటు గావించి యాగాయకునిఁ దోడ్కొని రాఁ బోయిరి.

అప్పుడు నానావిధ దీప కాంతులచేతను తెల్లని తలపాగలచేతను గర మలరారుచుండిన యాసభ ఫణామణులచే దీపించు శేషశయ్యవలె నొప్పారెను. ఆసాయంతన సమయమున నంతిపురపు టంగనలును గానసభా వినోదమును గనుంగొనుటకై వారికి ననువైన తావులందుఁ జేరి యుండిరి. వారి నెఱికొప్పులందలి పుష్ప సౌరభమును గ్రహించి చల్లఁగ వీచుచుండిన మందమారుతము సభాస్థా నులకు ఘ్రాణ తర్పణ మొనరించుచుండెను. మఱియు నాసవామోదమునఁ జెన్నారు నాయంతఃపుర కాంతల మోముఁదమ్ము లాతరుణమున గవాక్షంబుల కన్నిటికిఁ దొడుగని తొడవులై యలరారుచుండెను.

ఇట్లుండఁగా దోంబగాయకుఁడు మణికంకణ హారాది నానా భూషణ భూషితలైన తన కుమారీరత్నములతోడను నితర పరివారముతోడను సభాస్థానమును బ్రవేశించెను. ఆగాయకుని సుతలు 'హంసి' 'నాగలత' యనువా రిర్వురు నయ్యదనున నత్యంత కుతూహలమున నుద్గ్రీవములతోడ నొప్పారు చుండిన యాపేరోలగమును గొంతతడవు చిత్రవిలిఖితముగ భాసిల్లున ట్లొనర్చిరి.

ఆవిలాసవతు లిద్దఱు విలాసంబులతో విలసిల్లు తమ త్రిభంగి సోయగంబులను సభాంతరమున నల్గడలను బ్రసరింపఁజేసిరి, ఆకారణమున వారు రెండవమాఱు సయితము పుష్పప్రకరమును జల్లినట్లు సభ్యులకుఁ దోఁచెను.

అంతట గాయకులు నరేంద్రుని కీర్తిగుణములను వర్ణించుచు 'జయ, జయ' ధ్వనుల తోడ గానక్రమము నవక్రమింప సామాజికు లందఱు తమహర్షాతిరేకమును దోస్తోనఁ బ్రకటించిరి. పిమ్మట వైణికులు పంచమస్వరమున రాగవిశేషము నాలాపనము సేయుచుండ నాతరళనయనలు సభావందనాదిక మాచరించి శీర్షకంపనములను గందోయి సోయగమును గన్బొమల తంబును మనోహరముగ మెఱయించుచుఁ "గంఠస్వర మొక్కటే" యని కట్టెదుట నుండువారు సైతము తలంచునట్లు తమ మధుర గాన నైపుణిని బ్రకటింపసాగిరి.

ఇఁక వారి మనోహర గానమును వినుచుండిన యారాజ కురంగము రాగపరవశమై తాంబూలపు రోమంథమును వదలి రెప్ప వాల్పక వారిదెసఁ జూచుచు భిత్తి చిత్రమువలె నుండెను. ఆవామలోచనలును దమ విభ్రమ జాలమున నారాజకురంగము దగుల్కొనుచుండుటఁ గనిపెట్టి తొంటి కంటెఁ దమ విలాస లావణ్యములను మఱింత పెంపొందించుచు నడుమనడుమ మందహాస చంద్రికలను విలసిల్లఁ జేయుచు గీతికల గానము సేయుచుండిరి.

అట్టితఱి నన్నరేంద్రుని చూడ్కులును నాతామరసాక్షుల వాలుచూపులును మిళితమై పరస్పర మేదో స్వసంవేద్య మగు సంలాపమును జేయుచున్నట్లు గన్పట్టెను. అయ్యదనున రాజునకుఁ బ్రియతముఁ డగు నొకానొక విటుఁడు తేవిడెందము పరవశ మగు టెఱింగి దగ్గరఁ జేరి ప్రసంగవశమున నతని రాగ లోలతను బెంపొందించుచు నిట్లు ప్రసంగించెను.

"దేవా! గానకలారస మీకుటిలాలకల నాశ్రయించినదై మణిమయ పాత్రమునందుఁ బడిన మైరేయము మాడ్కి నెంత మనోహరముగ నున్నదో గమనింపుము. మణిమయము లైన దంత స్తంభములందుఁ బ్రతిఫలించిన వీరి మోహనాకృతులచే నీసభాభవనము గన్నుల పండుగై యున్నది. అందుచేతఁ గాఁబోలు! రేవెలుఁగు మిగుల ననురక్తుఁడై పెక్కు రూపములతో నిమ్మందిరమును ముద్దు వెట్టుకొనుచున్నది. మఱియు నీయిందువదనలు సుందరములగు తమ పాణిపల్లవములందుఁ జెక్కిళులఁ జేర్చి యించుక యూర్ధ్వ భాగమునకు మోములు సారించి గానము సేయునప్పుడు వీరి కటాక్షపాతములచే వైమానికులును మోహపెట్టఁబడుదు రనుట నిక్కము."

ఇదిగో! చూడుము. వారిరువురలో నొక్క తనుమధ్య మనము వారి నుద్దేశించి చర్చించునది తెలిసికొని యేమో! యసూయా గర్భిత మగు చిఱునగవుతో నొక్క కటాక్షమును మనపైఁ బ్రయోగించినది.

ఆరెండవ పాటకత్తె తళతళమను తాటంకములు మనోజ్ఞముగఁ గదలుచుండ మోము వాంచి పాడుచున్నది. ఆవైఖరిఁ జూడ నాపూఁబోణి విపరీత రతి సుఖాతిశయము ననుభవింపఁ గోరుచున్నది

వోలెఁ గాన్పించుచున్నది. "నిజముగ నిరాటంక మగు నిజన ప్రదేశమునందు నిట్టి యందగత్తె లెవ్వాని వీనులకు గానసుధారసమును దనుపుచుందురో వాని యొలంబ్రాయమే ధన్య మగు"నని యనవలసి యున్నది.

ఇప్పుడొక విటశిఖామణి విమర్శింతము. "ఒకజాతినుండి వెలువడు నింద్రియార్థములు పెక్కు. భోగ్యము లగుచుండఁ గొందొకటి మాత్రము వర్జింపఁదగినది." అని శాస్త్రము బోధించుటయు నాకీతి ననుష్ఠించుటయు జరుగుచున్నది. ఇది యంతయు నజ్ఞానమూల మనవలయును. లేకున్న నట్టి శాస్త్రములు యుక్తి యుక్తము లగు కారణములను గూడఁ దెల్పవలసి యుండును. మోహనాకృతులఁ జూచునట్టి కన్నులకును మధురధ్వని వినునట్టి వీనులకును బాపము లేనిచో నిఁక నట్టికామినుల తను వల్లినిఁ దాఁకునట్టి పురుషులకు మాత్రము దోష మేల గలుగునో దలపోయుము." అని యిట్లే యేమేమో యవ్విటశిఖామణి కర్ణసంగినియై రాజున కుపదేశించెను.

స్వభావ చపలుఁడై యున్న యాచక్రవర్మకు నంతకుముందే యాతలిరుఁబోండ్లయెడ నభి లాష గలిగి యుండెను. ఈతరుణమున నవ్విటుని యుపదేశముచే నతని రాగాంకురము సుధ వోసి పెంచిన తెఱంగున నప్పటికప్పుడే శాఖోపశాఖలతోడఁ బెంపొందిన దయ్యెను.

జగతియందు జలధరములు సింహములకుఁ బైపై దాపునఁ జేరినవై తమకుఁ గల వర్ణ సంకరపురుచిని వెల్లడించుటకై ధ్వనించుచు గోత్రారి ధను ర్లంఘనము నుపదేశించును. ఆసింహములు వాని మ్రోఁతల ననుసరించి పైకెగిరి యెగిరి గుంటలఁ గూలఁబడి పోవును. ఇవ్విధముగనే వర్ణసంకర రుచి గల విటులును రాజసింహముల దాపునఁ బ్రవేశము వడసి వారి రాచరికపు ధర్మమును నిర్మూ లించుచు గోత్రాంత కారి యగు చెడునడతను బలుమాఱు వారికర్ణములం దుపదేశించి తాము గొప్ప సంపన్నులై యారాజసింహములను దుర్గతుల నొందించుచున్నారు.

మఱియు నితంతవాదములచే మంచిని చెడ్డగను చెడ్డను మంచిగను నమ్మునట్లు సేయు మేధావులు విటులు. అట్టి మాటిమాట లనెడి యురులలోఁ దగుల్కొని తమ్మకొనువారు జడులు. ఇట్టి విటులకుఁ బుడమియందుఁ దాపు లేనిచో దండధరుని నరకములు పాడు వడినవై మృగ సంచార యోగ్యములు గావలసి యుండును. అట్టి సుకృతము వసుంధరాదేవికిఁ గల్గునా?

మ॥ తమ విస్తారపు వర్ణ సంకర రుచుల్
దైవార "గోత్రాంతకా
రిమితావస్థితి చాప లంఘన మలం
శ్రేయస్కర" మ్మంచుఁ బా
ర్శ్వమునన్ బెంపునఁ బొంగు చవ్విట ఘనుల్
శబ్దించుటన్ రాజసిం
హము లాసింహములున్ గుమార్గ పతన
వ్యాపన్ను లౌచుంద్రుగా।

ఉ॥ వస్త్ర కలంతిమై యనువ
 పన్నమె యైనను దానినే విటుల్
"నిస్తుల మిద్ది భవ్య" మని
 నెమ్మది నమ్మ నృపుల్ వచింతు ర
భ్యస్త కుతంత్ర వాద చణు
 లాకితవుల్ భువి లేక యున్న వి
ధ్వస్త మనుష్య వాస మయి
 పాడు వడున్ నిరయంబు సర్వమున్.

గీ॥ కన్నుఁగవ కర్ణ యుగళంబుఁ గాంత రూపు
గాన గరిమంబుఁ గని విని కాంచు ముదము
శాస్త్ర చయ మేల "యంగ సంస్పర్శ సుఖము
కూడ దనె" నంచు విటు లేదొ కూయుచుంద్రు.

పిమ్మట నపాత్ర దాన రాధేయుఁ డగు నాచక్రవర్మ కేయూరహారాదు లొసంగి యాడోంబ గాయకుని వాని పరివారమును సంతోషపెట్టి తనశుద్ధాంత భవనమును బ్రవేశించెను. కాని. గానసభ సేయు తరుణమున డోంబగాయకుఁడు చూపిన నేర్పును అపువ్వుఁబోణుల లావణ్య కౌశలమును దలంచుట తప్పఁ జక్రవర్మకు వేఱేదియుఁ దోపదయ్యెను. డోంబగాయకుఁడు నభయం"దీ కాంతారత్నము లిర్వురలో నొకదాని కీతేఁడు వల్లభుఁ డగును." అని ప్రభు నామధేయ మొకప్పుడును ప్రచండ తాండవమును నొనర్చుచు స్వీయ మగు నామధేయము నొకప్పుడు వెల్లడించుచు నడుమ నడుమ విచిత్రమైన గీతరచన సల్పెను. ఆగేయరచనయే యొక కావ్యరచనయై చక్రవర్మను మోహపెట్టెను. ఇట్టి సామాన్య విషయములకే విస్మయపడి తమయైశ్వర్యమును గొల్లపెట్టు మూఢులగు నరేంద్రుల జీవితము మిగుల నింద్య మని చెప్పవలయునుగదా!

లోకమున "వెలయాలి వలపు వేల్పుతేని వింటి వికాసము పసుపుఁబూఁత మిసిమి యుపాంగ గీతపు రుచియు అను నీనాల్గును మనోరంజకము లైనను నస్థిరములై యచిర కాలముననే పెంపు చెడి రాణింపవు. అని యనుట నిక్కమగు విషయము.

ఉ॥ వారవధూటి ప్రేమ, సుర
 వల్లభు వింటి మెఱుంగులున్, హరి
ద్రా రస రంజనంబు, రుచి
 రం బగు నట్టి యుపాంగ గీతముల్
నీరసముల్; రసజ్ఞుల వి
 నిర్మల చిత్తములన్ హరింపఁగా
నేరవు; తద్ప్రవిష్యము గ
 ణింప నిమేషము మాత్రమే గదా!

ఏమైననేమి? చక్రవర్మ యాచండాల యువతుల లావణ్యమును బలుమాఱు వీక్షించియుండుటచే నతనికిఁ జఘూరాగ మతిశయించి యుండెను. అందువలన నతఁ డావన్నెలాఁడులఁ గాంచనిచోఁ దృటి యైనను నయింపలేనివాఁ డయ్యెను. అంత నతని కోర్కె ననుసరించి యాకాంత లిర్వురును నతని శయనోపాంతమును జేరి మధురముగఁ బాడుచు నప్పుడపుడు మురిపెపు ముద్దులు వెట్టుచు నన్నరేంద్రుని హతాత్తుగ రతిసుఖాభిజ్ఞు నొనర్చిరి.

ఆకలకంఠుల నూతన సంగమము వారి కౌశలము చక్రవర్మ యంతస్సారమును బూర్తిగా హరించుటచే నతఁడు సిగ్గుపడుట కైనను నోచుకొనక పోయెను. రాగాంధుఁడగు చక్రవర్మ 'హంపినిఁ' దనపట్టపుదేవేరినిఁగా నొనర్చెను, అంత మాత్రమె గాక తక్కిన యంతఃపుర కాంత లెల్లరు వింజామరముల వీవనలచే నామెకుఁ బరిచర్య సేయునట్లు నియోగించెను. సతతము రతి పరిశ్రమ నొంది యుండు నన్నరపతి గాత్రము స్వేదజలముచే నాకులితమై యుండెడిది. ఆచందముఁ జూడ నతని భాగ్యోష్మము క్షీణించుటచేఁ గ్రమముగ మేను జడమై పోవుచుండెనా! యన్నట్లుండెను.

చక్రవర్మ హృదయమును హరించిన యాహంసి భుజింపఁగా మిగిలిన యుచ్ఛిష్టమును మక్కువతోడ నెవరు తినుచుండిరో యట్టివా రాతేని మనస్సునకు నచ్చినవా రగుచుండిరి. అట్టివారు చక్రవర్మ యోలగమునందే గాక యతనికి లోఁబడి యున్న పెఱరాజుల సభలందును యోగ్యు లగు సభాసదు లగుచుండిరి.

ఇఁక 'డోంబగాయకుని' యధికార మాకాలమున విచిత్రముగ సాగెను, అతని పరివారము గూడ 'అక్షపటలము' అను ముఖ్యాధికారమును మంత్రులకు నొసఁగఁజాలి యుండెను,

ఈరీతినిఁ జక్రవర్మ కొలువునందు శ్వపాకు లెల్లరు నధికార పదవుల నందఁగల్గిరి. కాని యందుఁ గొందఱు మొఱకుఁదనమువలన సాచివ్య మొనర్చు నేర్పులేని వారైరి. కొందఱు మాత్రము మంత్రులవలె రాజ కార్యమును చక్కదిద్దు నేరిమి గలవారై రాణ కెక్కిరి, చివరకుఁ జక్రవర్మ మహీపాలుని రాజ్యమునందలి పరిస్థితి యిట్టి నికృష్టగతి నొందెను. అచ్చట మంత్రులు తస్కరులు. రాణి శ్వపాకి, స్నేహితులు శ్వపచులు. ఇంతకు మించిన లోకోత్తర విషయ మేమి కావలయును? ఈ సందర్భమున రాణి యగు శ్వపాకి పెత్తనము స్థాలీపులాకన్యాయముగ నెఱుంగవలసి యున్నది.

రాణీపదవి ననుభవించెడు నాశ్వపాకాంగన ఋతు స్నాతయై తనమలినవస్త్రములను మంత్రుల కొసఁగుటయు వారాచేలముల ధరించి రాజసభ కేతెంచి గర్వముతోడ నుప్పొంగుటయుఁ గనని వినని విశేషములుగదా! ఆకాలమునఁ జక్రవర్మ నేస్తగాండ్రగు శ్వపచులు వదలిన యుచ్ఛిష్టమును సామంత రాజులు సైతము భుజింపవలసిన ట్లయ్యెను. వ్రేల్మడచి చెప్పఁదగిన వారు కొలఁది రాజులు మాత్రమే చక్రవర్మతోడి వైర మైన నియ్యకొని శ్వపాకుల యుచ్ఛిష్టము నీసడించి దూరమునకుఁ దొలఁగి యుండిరి. ఆకాలమున కట్టిరాజులే సోమయాజు లని చెప్పఁదగి యుండెను.

అపవిత్ర చరిత్ర యగు నాశ్వపాకాంగన ప్రవేశింపని దేవాలయము లేకుండెను. దేవతా మహిమకుఁ బ్రసిద్ధి కెక్కిన కాశ్మీర మండలమం దాకాలమునఁ బ్రభావోగ్రులగు దేవతలు లేరేమో!

కాకున్నచో బాంసుల యగు నాహంసి యాలయములందు బ్రవేశింపఁగలిగి యుండెడివారు: శ్వపాకి 'శిలద్వారక' నాఁడు రణస్వామిని దర్శించుటకై యాలయముఁ బ్రవేశించెను. అప్పుడు సామంతరాజు లెల్లరు తదనుయాయు లైరి. కాని, అభిమానధను లగు డామరుల మాత్రము వెంబడి పోరైరి.

ఇఁక నాశ్వపాకియే గాక తత్సంబంధులగు డోంబ కుటుంబమువా రందఱును బొగరు తల కెక్కి రాజబంధువులవలె మెలంగుచుండిరి. వారియానతి రాజాజ్ఞవలె నేరికిని మీఁటరాని దయ్యెను. ఇట్లుండ రాజు రంగనికి 'హేలు' అను గ్రామము నగ్రహారముగా నొసఁగెను. "దానపత్రిక వ్రాయుము" అని 'పట్టోపాధ్యాయున'కు వర్తమాన మంపఁగా నతఁడట్లు వెంటనే లిఖింపకుండుటఁజేసి డోంబగాయకుఁడగు నా 'రంగఁడు' కినుకతో సక్షపటలమునకుఁ బోయి పట్టోపాధ్యాయునిఁ బిలిచి "ఓరీ దాసీపుత్రా! హేలుగ్రామము నాకొసఁగినట్లు దానపత్రము లిఖింపు మన్న నీవేల యట్లు సేయవైతివి?" అని బెదరించెను. ఆరంగని భీషణ వాక్యములకును నతని బొమముడి పాటునకును నతఁడు జంకి తోడనే యాతఁడు కోరినట్లు దానపత్రికను లిఖించెను. రాజు దుర్వృత్తుఁ డైనచో నీతికిఁ దావెక్కడిది?

ఇఁకఁ బాపి యగు చక్రవర్మ తనయుపదేష్ట లగు విటులను దాను శ్వపాకీ గమనమునఁ బడయు దురిత మేరీతిఁ దొలఁగు నని యడిగెను. అందుకు వారు "రాజా! మంచు మంచువలననే యుపశమించును. అట్లే పాపము పాపకర్మములు పెక్కొనర్చినచో శమించి పోవును. కావున నీవింకను గలుష కార్యములు పెక్కు సేయుము." అని హాస్యప్రాయము లైన ప్రాయశ్చిత్తధర్మముల నుపదేశించిరి.

గీ॥ "హిమము హిమపాతమున శమియించి పోవు.
దుష్కృతము దుష్కృతముచేతఁ దొలఁగి పోవు."
ననుచుఁ గర్ణజపులు ధూర్తు లైన విటులు
కుపతులకు నొజ్జ లౌచు నిక్కుదురు మిగుల;

ఈవిధముగఁ బతితుఁడును బామరుఁడును నైన చక్రవర్మ విటుల మాటలను వేదవచనము లనుగా దలంచి వారుపదేశించిన చొప్పున నడచుకొన సాగెను. అతఁడు చండాలాంగనం గూడిన కలుషమును బాపికొనుటకై విటోపదేశమున కనుగుణముగ మాసోపవాసియై పావనచరిత్రుఁడై యున్న యొక విప్రవర్యుని ధర్మపత్నిని బలాత్కరించినవాఁ డయ్యెను.

ఇట్లు చక్రవర్మ యాకాలమున దురితాచరణ పరాయణుఁడై యుండఁ గొందఱు బాడబులారాజును మించిన పాపు లగుటవలన నాతని భవనమున సపంక్తి భోజనములఁ దనివి నొంది యా చక్రవర్మ యొసఁగిన యగ్రహారములను గైకొనిరి. ఈతఁ డిట్టివాఁడయ్యును శైవుల కాశ్రయముగ నుండుటకై 'చక్రమఠము' నొకదానినిఁ గట్టింపఁబూని యది సగమువరకు నిర్మింపఁబడు నంతలో హత్య గావింపఁబడెను. మిగిలియున్న మఠనిర్మాణ మతని ధర్మపత్నిచేఁ బూర్తి గావింపఁబడెను.

ఇఁకఁ జక్రవర్మ వధింపఁబడుటకుఁ గారణము దెలియఁదగి యున్నది. చక్రవర్మ రాజ్యభ్రష్టుఁడై డామరనాయకుని సాహాయ్యమున మరల రాజ్యము వడసిన ట్లిదివరకుఁ దెలిసికొంటిమిగదా!

ఆతేఁడు శ్వపాకి యగు 'హంసి' కనుసన్నల మెలఁగుచు నిరాగసులును పూర్వోపకారులును విశ్వాసముతోఁ దన్ను సేవించుచున్నవారును నైన యాడామరులలోఁ గొందఱ నేదో నెపమువెట్టి వధించెను. ఆకతమున డామరులకు లోలోనఁ గ్రోధాగ్ని రగుల్కొన సాగెను. అట్టితఱిఁ గొందఱు డామరులు రాజుకడ నత్యంత విశ్వాసముతో నటించుచు నతనిని రహస్యముగ వధింప నెంచి తగిన యదనుకై వేచియుండిరి.

ఇట్లుఁడ నొకనాటి రాత్రి చక్రవర్మ యామాతంగాంగన వసించు భవనమునకుఁ జెంగట నుండు నవస్కర గృహము (పాయఖానగృహము) లోనికి శౌచముఁ దీర్చుకొనుటకై పోయి యుండెను. పగఁబూని యనుక్షణము వేచి యుండిన యాడామరు లయ్యదను నెఱిఁగి నిరాయుధుఁడై యుండు చక్రవర్మ నకస్మాత్తుగ నచ్చోట ముట్టడించి తోడ్తోన వాడితూపుల జడివాన నతనిపైఁ గురిపించిరి. అంతటఁ గునికిపాట్లచే మత్తుగొని యున్న చూపులు గల యాధూర్త నృపతి గట్టుపై నిద్రించుచు నాకస్మికముగ మడుఁగులోఁ బడిన వానివలె మేల్కొని దిక్కు దోఁచక బెట్టిదము లగు బొబ్బలిడుచు శరీరమునుండి రుధిరధారలు గారుచుండ నాయుధమును వెదకుటకై మరల శయ్యాగృహమునే ప్రవేశించెను.

ఆడామర తస్కరులు వానిని వెంబడించిరి. తత్తరపాటున నదరుచున్న చక్రవర్మకు ఖడ్గము గూడ సమయమునకుఁ గానరాకుండెను. ఇట్టిస్థితియందు శ్వపాకి పెద్ద యెలుఁగున రోదనము సేయుచు నతనిఁ గౌఁగలించుకొనెను. ఇంతలో డామర తస్కరులు లోనఁ బ్రవేశించి హంసినిఁ గౌఁగలించికొని యున్న యాతేనిఁ బలుతెఱంగుల శస్త్రములం గ్రుచ్చి మృతకల్పునిఁ గావించిరి. చక్రవర్మ చావ సంసిద్ధుఁడై యుండు తరుణమున నతనిభార్యలచే నయిత మాడామరులు ప్రేరితులై యతని మోకాళ్ళను తాళ్ళచేఁ బిండి యగునట్లు గావించి రనుటకంటె వాదుష్టనరపతి దుర్గతినిఁ గూర్చి మఱి యేమి చెప్పవలయును? ఇట్లాచక్రవర్మ 4013న లౌకిక వత్సరమున (క్రి.శ 937) జ్యేష్ఠశుక్ల, అష్టమినాఁడు నడిరేయి పాయఖానయందు శ్వపాక భోగ్యమైన శునకమువలె డామర తస్కరులచే వధింపఁబడెను.

## ఉన్మత్తావంతి

అనంతరము పార్థుని కొమరుఁడు కాశ్మీర ధవుఁడయ్యెను. ఇతఁడును జాల దుర్బుద్ధి. ఇతఁడు 'ఉన్మత్తావంతి' అనుపేరు గల యవివేకి. క్రూరుఁడును నైన తులువ. బుద్ధిహీను లైన 'శర్వటుఁడు' మొదలగు మంత్రు లాతరుణమున నితనిని రాజ పదమున నభిషేకించిరి. శ్వపాకీ కాముకుఁ డైన యాపాపి హతుఁ డయ్యె నను నూరట ప్రజలకు లేక పోయెను. అంతకంటె దురిత భాజనుఁడగురాజు ప్రజల పాపఫలము మూర్తీభవించె నన్నట్లు మరల నరనాథుఁ డగుట శోచనీయము.

శక్తిహీన మగు గుఱ్ఱము భారమును వహింపనేరక యీడిగిలఁబడు చందమున దుండగీఁడును కొరగానివాఁడును నగు నీతేని కథను వర్ణించుటవలన గలుగు దురితమునకు జడిసి వైముఖ్యముతోడ ముందుకు సాగకున్న భారతి నీసందర్భమున నెట్లెట్లో బ్రతిమాలికొని నడుపవలసి యున్నది.

బడబానలమునకుఁ గడలి జలమే హవ్య మగునట్లు రక్కసుఁడగు సేనాపతికిఁ ధనతంత్రి వంశమే భక్ష్యముగా నేర్పడెను.

ఇంక మూపులపైనను దలలమీఁదను బొప్పులు గలిగిన వింత పద్ధతులు గల పామరులే ఈరాజు నాస్థానమున నమాత్యు లయిరి. వీరు వికృత నృత్యము సేయఁగలరు. ముక్కుతోడను, నితర సాధనములతోడను వాద్యక్రియఁ బ్రదర్శింప నేర్పరులు. ఈయమాత్యులు చారణులు గావున లజ్జ లేనివారై గ్రామీణుఁడైన యీకాశ్మీరపతిని మిగుల రంజింపఁజేయఁ గల్గిరి. ఈమంత్రులే భావికాలమున రాజులుగఁగూడఁ బరిణమింతురు.

వీరిలోఁ 'పర్వగుప్తుఁడు' అనువాఁ డీయున్మత్తావంతినాథునకు నత్యంత ప్రియుఁడుగా నుండెను. ఈపర్వగుప్తుఁడు రాజుకొలువునందుఁ గటీపటమును దొలఁగించి నర్తన మొనరించువాఁ డగుటచే నరపతికి మిక్కిలి ప్రేమపాత్రుఁ డయ్యె నని చెప్పుటకు నేవ పుట్టుచున్నది. పర్వగుప్తుఁడు తంత్రి విప్లవ మారంభ మైన దాదిగఁ గాశ్మీర భూపాలురు కీటక సదృశులై యుండు టెఱింగి తాను రాజ్యపదవి నాక్రమించుటకై పలుతెఱంగుల జతనము లొనర్చుచుండెను.

ఇతఁడు తనరాజ్య తృష్ణను బయల్పఱుపక 'భూభటుఁడు' మున్నగు ముఖ్యులయిన మంత్రుల నేవురను దననేస్తగాండ్రనుగాఁ జేసికొనెను. భూభటుఁడు, సర్వటుఁడు, ఛోజుఁడు, కుముదుఁడు, అమృతాకరుఁడు, అను నామములఁ బరఁగువా రేవురను నున్మత్తావంతికి ముఖ్యులగు మంత్రులుగా నుండిరి. వీరును పర్వగుప్తుఁడు రాజునకుఁ బ్రియతరుఁడుగా నుండుట గనిపెట్టి యతనితోఁ బీతకోశులై ప్రమాణ బద్ధముగ సఖ్యముఁ జేసికొని యుండిరి.

ఆకాలమున విఖ్యాత పౌరుషుఁడును 'గవాక్షసరస్సు'నందు శ్రీదేవినిఁ గనుగొన్న వాఁడును నగు నొకబ్రాహ్మణుఁడు డామరనాయకుఁడైన 'సంగ్రాముని' గేహమునందు నివసించుచుండెను. ఆబ్రాహ్మణుఁడు 'రక్కుఁడు' అను పేరు గలవాఁడు. ఇతఁడు పదాతిమాత్రుఁడయ్యును తన యసమాన పరాక్రమమును రణరంగమునఁ జూపి యుండుటచేఁ గాశ్మీరపతి వీనిని గౌరవించి తనకు మఱొక మంత్రిగా నొనర్చుకొనెను. వీరుఁడగు నీపాఱుఁడు మున్ను 'గవాక్షసరస్సునందు' దాఁ గాంచి యుండిన శ్రీదేవి మూర్తిని నిర్మింపఁజేసి 'రక్కజయాదేవి' అనునామ మామూర్తి కిడెను.

ఇట్టితరుణమున ధూర్తుఁడైన పర్వగుప్తుఁడు రాజ్యమును నిష్కంటకముగ నొనర్చిన తఱువాత రాజ్యాపహరణము సేయఁగోరిన వాఁడై మూఢుఁడగు రాజును స్వీయ వంశ క్షయమును జేయఁ బురికొల్పెను. వివేక భ్రష్టులు కావింపరాని పని యేది గలదు? పర్వగుప్తుని దుర్బోధము నాప్తవాక్యముగ నాలించిన యీవెఱ్ఱి యొడయఁడు మొదటఁ దనతండ్రి సర్వస్వమును దోచికొని యతనిని బత్నితోఁగూడ నగరమునుండి వెడలఁగొట్టించెను.

పాపము! ఆపార్థుఁడు జాయతోఁగూడ శ్రీజయేంద్ర విహారమును జేరి యందలి శ్రమణులు వెట్టు కబళములతో జీవిక గడపవలసి వచ్చెను. పెమ్మటఁ గ్రూరుఁ డగు నీవెఱ్ఱిరా జంతటితోఁ దృప్తి

నొందక పితృవధ సేయ నుల్లాసపడి యందుకు సమ్మతించిన మంత్రులకుఁ దలపాగల నొసఁగి గౌరవించెను. అసమ్మతిఁ దెలిపిన వారిని శృంఖలా బద్ధులఁ గావించెను.

ఇట్లుండ నొకనాఁడు రేయి మంత్రులు సామంతులు కాయస్థులు తంత్రి సైనికులును రాజు నానతిచే నతనితండ్రి యగు పార్థుఁడు వసించు తావునకుఁ బోయి యతని నొక్కుమ్మడిగఁ జుట్టుముట్టిరి. అంతట వారి చైదమునకుఁ బార్థునిపత్ని యులికిపడి ముఱికి వట్టి చినిగిపోయి యున్న కట్టుపుట్టము లోక వైపు దైన్యము వెల్లడించుచుండఁ బెద్ద యెలుంగున నేడ్చుచుఁ దనపతియెడ ద్రోహ చింతనులై మూగియున్న యాతులువలను లోనికి రాకుండునట్లు ద్వారమున కడ్డముగా నిలచిన దయ్యెను.

అట్టితఱిఁ దులువ యగు నాపిచ్చిరాజునకు నత్యంతము ప్రియులై యున్న 'కుముదుఁడు' మున్నగువారు భర్తను గౌఁగలించుకొని విలపించెడు నారాజమాతను లాగి నేలఁబడ వైచిరి. "గోరు చుట్టుపై రోకఁటిపోటు అన్నట్లు, ఆకటి మంటచే స్రుక్కినట్టి యాపార్థునకుఁ గట్టెదుర సంభవించిన భార్య దుస్థితి కటుంగడు సంక్షోభము గలిగించెను.

అంత నతఁ డాయుధ సాహాయ్య మైన లేనివాఁడై చేయునది లేక పెద్దగ నాక్రోశింపుచుండ నాక్రూరు లందఱును బార్థుని శిరోజములు పట్టికొని క్రిందఁబడవైచి చండాలురు మృత పశువును లాగికొని పోవుచందమున నవ్విహారమునుండి గులకఱాతి నేలపై నీడ్చిరి. అకటా! ఈరీతిని నెత్తుటి ముద్దయై పోయిన యప్పార్థుఁడు మార్గ మధ్యమునందె పంచత్వము నొందెను.

దుండగీఁడగు నున్మత్తావంతికిఁ బితృవధ పీనుల విందయ్యెను. అతఁడు తండ్రి మృత కళేబరమును జూడ సంజాత కుతూహలుఁడై మఱునాఁ డుదయమున లేచి సచివ సమేతుఁడై పోయి తండ్రి శవమును గన్నులారఁ గాంచి పరమానంద భరితుఁ డాయెను.

మఱియు నట్టితఱి రాజపురుషు లతని యెదుట "నేను నీతండ్రి కరములను ఖండించితిని" అని యొకఁడును "మేము కాళ్ళు విఱుగఁ గొట్టితిమి." అని మఱి కొందఱును, ఇట్లే తమపరాక్రమమును బొగడికొని యతని సన్మానమునకుఁ బాత్రులైరి. పర్వగుప్తుఁ డీసందర్భమున రాజును మఱింత రంజింపఁజేయుటకై తనకొమరుఁ డగు పర్వప్తునిఁ బురికొల్పఁగా నానీచుఁడు రాజు చూచునట్లు కత్తితో నాశవమును బొడిచెను. అందుల కాపాపాత్ముఁ డగు వెఱ్ఱిరాజు పెద్దతడవు సంతసించి యతని బహూకరించి వెడలి పోయెను.

చక్రవర్మ తుదముట్టిన తఱువాతడామరులు చెలరేగి దేశము నంత నొకమాఱు కొల్లగొట్టిరి. మరల నిప్పు డీయున్మత్తావంతి దుష్టులైన కాయస్థులను రేపి దేశమును నానావిధముల దోచుకొన సాగెను. మఱియు నితఁడు తన దుష్టమంత్రుల యుపదేశముచే విలువిద్య నలవఱచుకొనఁగోరి బలాత్కారముగ స్త్రీలను విగతవస్త్రులఁ గావించి వారి స్తనాంతరములను శరములకు గుఱి చేసెను. గర్భిణుల గర్భంబులను జూడఁగోరి వారి యుదరములను విదారించెను. కాఠిన్య పరీక్షకై కర్మకారుల శరీరముల నుత్పాటించెను, ఇంతటి దురాత్ముఁడు మఱి యెందుండును? ఈనీచుకడఁ గొందఱు బ్రాహ్మణబ్రువు లగ్రహారంబులఁ బడసిరి. ఆద్విజు లందఱు నగ్రహారములఁ బ్రతిగ్రహింపనిచోఁ బాపియగు నీయున్మత్తుఁడు కుపితుఁడై తమ్ము వధించు నని జడిసి యట్లు చేసిరి.

ఇట్లుండఁ గొంత కాలమునకుఁ గాశ్మీరపతి యగు నీదుష్టుఁడు తానుజేసిన క్రూర కార్యములకుఁ దగిన ఫలము ననుభవించుటకై ఘోరమగు క్షయవ్యాధికి గుఱియై వర్ణింపఁ దరముగాని యాతన ననుభవింపసాగెను. ఇతఁడు రాజయక్ష్మచే విపరీత వ్యథ ననుభవించునపు డొక్క ప్రజానీకమే గాక యితనిదేవేరులు పది నల్వురును మేరలేని యానందము నొందిరి. జనకవధ గావించిన వాఁడును పరమనీచుఁడును, రాజాధముఁడు నగు నీయున్మత్తావంతి కమలవర్ధనుని యెడ ద్వేషభావమునువహించి యుండెను.

కమలవర్ధనుఁడు గొప్ప సేనాపతి. ఇతఁడు మడప రాజ్యమునం దుండువాఁడు. డామరుల నుత్పాటింపఁగల శూరుఁడు. కావుననే యున్మత్తావంతి కమలవర్ధనుని పరాక్రమమును దలపోసియు దాను ద్వరలో నిహమునుబాయుట తప్పదని యెంచియు మిగులఁ గుములుచుఁ గుందుచుమండెను. ఇట్టి తరుణమున నంతఃపురపు దాదులు కొందఱొకానొక యర్భకు నెటనుండియో తోడ్కొని వచ్చి "ఈ శిశువు రాజుగారికిఁ గలిగిన బిడ్డ" యని యనృతములు వల్కి యాకాశ్మీరపతి దగ్గఱ నుంచిరి.

అంతట నున్మత్తావంతి 'శూరవర్మ' యను పేరుగల యాబిడ్డను వెంటనే నృపాసనమున నుంచి సచివులను సామంతులను ఏకాంగ తంత్రి సైనికులను బిలిచి "ఇదిగో! ఈబాలుని మీహస్తమున నుంచితి నని చెప్పెను. పిదప నతఁడా రాజయక్ష్మ రోగముచే భూలోక నరక మనుభవించి ప్రజల పుణ్య బలమున 4015 వ లౌకికాబ్దమున (క్రీ. శ. 939.) నసువులఁ బాసెను.

## శూ ర వ ర్మ

ఆవల నాబాలనృపాలుఁడు 'శ్రీజయస్వామి విరోచనుని' దర్శించుటకై యాషాఢ శుక్ల సప్తమినాఁడు సపరివారముగఁ బయనమై పోయెను. అతఁడు పోవునపుడు కేలఁబట్టి యున్న కృపాణ మనెడు వేణిలతతోఁ గరము విరాజిల్లు నూతన రాజ్యలక్ష్మి ఛత్ర చామర వ్యాజమున శృంగార హాసము నొనర్చుచున్నదివోలె నెంతయుఁ బొల్పు మీఱి యుండెను.

ఇది యిట్లుండ నింతలోఁ గమలవర్ధనున కీవార్తను గూఢచారు లతిరయమునఁ బోయి నివేదింప నతఁడు వెంటనే సామంతులతోడ బయలుదేరి కాశ్మీర నగరోపాంతమును జేరి క్రమక్రమముగ నగరమును బ్రవేశించెను. కమలవర్ధనుఁడు తనవిరోధు లగు డామరులను మార్గమధ్యమున నోడించి వచ్చినవాఁ డగుటవలన శ్రీనగరిం బ్రవేశించు నప్పటికి నొకింత శ్రాంతుఁ డయ్యెను. అట్టితఱి నేకాంగ తంత్రి సైనికులును 'స్యాలహారకులు' అను పెక్కండ్రాశ్వికులును మూగి కమలవర్ధనుని నలుదెసల ముట్టడించిరి. కమలవర్ధనుఁడు శ్రాంతుఁడై యున్నను విరోధివారమును సరకు సేయక తనబీరమును మెఱయించి శత్రువాహినినిఁ జీకాకుపఱచి మూలమూలకుం దఱుమఁగొట్టి పురమును నిరాటంకముగఁ బ్రవేశించి జయశ్రీ కటాక్షములకుఁ బాత్రుఁ డయ్యెను.

కమలవర్ధనుఁ డిట్లు జయము నొందుటయుఁ దంత్రి సైనికులు మున్నగువారు బాలభూపతిని విడిచిపుచ్చి పలాయితు లగుటయు విని యేకాకియై యున్న యాబాలుని నతని తల్లి భద్రముగ నుంచుటకై యెటకో మెల్లఁగఁ దీసికొనిపోయెను.

ఇంకఁ గమలవర్ధనుఁడు గెలుపు నొందెనే కాని యతని ప్రాకృత కర్మ దోషముననో లేక కుత్సితు లగు మంత్రుల ప్రేరణముననో మోహితుఁడై సింహాసనారూఢుఁడు గాక పోయెను. దీనింబట్టి యతఁడు రాజనీతిజ్ఞుఁడు గాఁడనవచ్చును. కమలవర్ధనుఁడు రాజ్యకాంక్ష గలవాఁడైనను యుక్త కాలమున సింహాసనము నాక్రమించుకొనక "మఱొకనాఁడైనను దాను సింహాసనారూఢుఁడుగా గల్గుదును" అని యెంచి యప్పటి కాపని మాని నిజమందిరమునకుఁ బోయెను.

తఱువాత నాతఁడు మఱునాఁడే రాజ్యాభిలాషియై గొప్ప యేర్పాటుతోడ విప్రుల నెల్ల రావించి వారిం గాంచి "మీరెల్లరు నిప్పుడు సమర్థుఁడును. ప్రౌఢుండును, స్వదేశజుఁడును నైన యొక్కని నొడయనిగా నభిషేకింపుఁడు" అని పురికొల్పెను. కమలవర్ధనుఁడు "తానొక్కఁడే యాకాలమున స్వదేశజులకోఁ బ్రౌఢ శక్తి యుతుఁడను నిశ్చయము గలవాఁడై వారందఱు దననే పట్టాభిక్తునిఁ గావింతురు." అని తలంచి పామరుఁడై యారీతి వారినిఁ బ్రేరేచెను.

నవ యౌవన విరాజమానయు దుర్లభయు నగు మదిరాక్షి యేకాకినియై దొరికినపు డనుభవింపక మఱునాఁడు దూతీముఖమున నామె యనుగ్రహమును గోరునట్టి యరసికునివలె బలాత్కారముగఁ బ్రాప్తించిన సిరిని వెంటనే కైవసము చేసికొనక మఱునాఁడు నీతిపద్ధతితోడఁ బడయఁగోరు పామరుఁడును శోచనీయుఁడై పరిహాస పాత్రుఁ డగుచుండును. ప్రకృతమునఁ గమలవర్ధనుని గతి యట్టి దయ్యెను.

గీ॥ హృదయ హారిణి యైనట్టి యింతి దుర్ల
భంబు సిరియును నొంటరి పాటునందు
దొరక నొప్పరికించి ముగ్ధు లగువారు
దౌత్య మొనరింత్రు మరలఁ దత్ప్రాప్తి గలుగ.

ఇంతకుఁ గాశ్మీర భూభారమును వహించి యుండిన యుత్పలుని వంశము (కల్యపాల వంశము) ఉన్మత్తావంతితోడ నీవిధముగ నస్తమించుటయుఁ గాశ్మీర రాజధానిని గెలిచిన కమలవర్ధనుఁడు తగినరాజు నన్వేషింపుఁ డని బాడబులతో నుడువుటయు జరిగిన తఱువాత నావిప్రులందఱు నొక గోకులముం జేరిరి.

## కమలవర్ధనుని ప్రయత్నము

అచ్ఛోట వారు గొప్ప గొప్ప కంబళములను గప్పుకొనినవారై కొమ్ములు లేని వృషభముల మాడ్కిఁ గన్పట్టుచు ధూమ చ్ఛన్నములగు వింత గడ్డములు గలవారై (పెరిగిన బూడిద రంగు మీసలును, అట్టి గడ్డములును గలవారై) ఒండొరులు రాచరికపు వ్యవస్థను బరిష్కరించు నుపన్యాసములు సేయుచుఁ దమ కిచ్చ వచ్చిన యూరు పేరు లేనివారిని రాజులుగాఁజేయఁ బూని తుదకు భిన్నాభిప్రాయులై వివాదములు సేయదొరఁకొనిరి,

ఇట్లు యిరువది దినములు ఆ బ్రాహ్మణులు తమలోఁ దాము వివాదపడుచు నొక్కని నైనను రాజ్య పదమున నభిషేకించుటకు నిర్ణయింపఁజాలకుండిరి. కాని వారు చేయు ఘోరము లగు వివాదము లందు నొండొరుల ముఖ గహ్వరములనుండి వెలిగిన లాలాజల శీకర నికరము వారికి పెరిగి యుండిన గడ్డములను మాత్రము చక్కఁగ నభిషేకింపఁగల్గెను. ఇట్టింత ముగ్ధుఁడైన కమలవర్ధుఁడు నా బాడబ బృందము కడకు స్వయముగఁ బోయి రాజపదాపేక్షను గుఱించి తనవిషయమై వారి తలంపునను దెల్పుచు మాటాడఁబోవఁ బాపము! అతని నా ద్విజ బృందము నొక్కుమ్మడిగ పాషాణ ప్రయోగములచే నటనుండి వెడలఁగొట్టిరి. కాని బ్రాహ్మణులు మాత్రము యిరువది దినములవఱకు రాజును నిర్ణయించు శుష్క వాదములు మాత్రము చేయుచునే యుండిరి.

ఇట్లుండ నింతలో నగరమునుండి పౌరముఖ్యుల బలగ మంతయు రథమునందుఁ దీర్చి యుంచిన యాసనములతోడను ఛత్ర చామరాదుల తోడను నెగయుచున్న పతాకలు గల ధ్వజముల తోడను బొల్పారుచు నానావిధ బలములతోఁ గూడి యచ్చోటున కేతెంచెను.

ఈదృశ్యమును గాంచిన కమలవర్ధునకు గుండె నీరయ్యెను. పౌరుషమున గెలిచికొన్న రాచ సిరి కులటయై పరుని పాలగుచున్న పత్నిచాడ్పున నతనికి మిగుల దుఃఖహేతు వయ్యెను. ఈసమయమును గనిపెట్టి పితృఘాతి యగు నున్మత్తావంతి పత్ని తాను గుప్తముగఁ బెంచుచున్న తన సుతునకు రాజ్యము నిప్పింపఁగోరుచు రాజపురుషు లగు దూతలను బ్రాయోపవిష్టులగు నా ద్విజ సమాజము కడ కంపెను.

దైవగతి చాల వింత యైనది, యని యీ ఘట్టమున జక్కఁగ గుర్తింపవచ్చును. ఏమనఁ? తొల్లి 'పిశాచకపురము' అను గ్రామమున 'వీరదేవుఁడు' అను నొక గృహస్థు నివసించుచుండెను. వాని కొమరుఁడు 'కామదేవుఁడు' అతఁడు విద్యావంతుఁడు. మనకుఁ బూర్వ పరిచితుఁడై యుండిన మేరు వర్ధనుని మందిరమున బాలురకు విద్య గఱపుచు సౌశీల్యాది గుణ భూషితుఁడై యుండి కొంతకాలమునకుఁ గోశాధికారియై పేర్వడసెను. అతని సూనుఁడే 'ప్రభాకరదేవుఁడు'. ఈ ప్రభాకరదేవుఁడు తొల్లిఁటి శంకరవర్మ మహారాజునకుఁ గోశాధ్యక్షుఁడు మంత్రియునై యుండి రాజ్ఞి యగు 'సుగంధ'యొక్క వలపును జూరఁగొని యుండుట విదితచరమే గదా! ఆ ప్రభాకరునకు కాలమున నొకపుత్రరత్న ముదయించెను. అతఁడే 'యశస్కరుఁడు' అను నామమునఁ బరఁగి మహావిద్వాంసుఁ డయ్యెను.

అయిన నేమి? అట్టివాఁడు నిరుపేదతనమునకు గురి యయ్యెను. "ఇందుకుఁ గారణము లక్ష్మి సరస్వతి యెడ సహజముగ గన్పట్టు ద్వేషమో! లేక యప్పటి దేశవిప్లవమో! యగు" నని చెప్పవచ్చును. ఆకారణమున 'యశస్కరుఁడు' తనచెలికాఁడగు ఫల్గునునితోఁ దేశాంతరములందుఁ 'శీతదేవి' నుపాసించుచు నద్దేవి యాశీస్సులం బడసియు సుస్వప్నములం గనియు, హర్షోత్సాహ భరితుఁడై యుండి యాసందర్భమున మరలఁ దనయభిజన మగు కాశ్మీరమునకు రాఁగోరి యటనుండి బయలుదేరి వచ్చెను.

యశస్కరుఁ డద్భుత మైన వక్తృత్వము గలవాఁడు. పితృవధ నొనర్చిన యున్మత్తావంతి భార్య పంపియుండిన దూతలు మార్గమందు యశస్కరునిఁ గాంచి యతని మాటల నేర్పున కలరుచు వానినిఁ దమతోడ ద్విజ పరిషత్తు వివాదపడుచున్న తావునకుఁ దీసికొని వచ్చిరి. బ్రాహ్మణు లందఱు యశస్కరునిఁ గాంచినతోడనే దైవవశమున వారికిఁ గల విభిన్నాశయము లన్నియు నొక్కమాఱుగ నణఁగిపోయిన వయ్యెను. పిమ్మట నాద్విజు లందఱు నేకగ్రీవముగ నీతఁడే మనదేశమునకు నొడయఁడు. గాఁదగిన వాఁడని ముక్తకంఠముగఁ బల్కిరి.

అనంతర మావిప్రు లాలసింపక వెంటనే క్షమా ధృతి ప్రౌఢసామర్థ్యుఁ డగు పర్వత రాజును ఘనబృంద మభిషేకించు చందమున నయ్యశస్కరునిఁ బుణ్యజలంబుల నభిషేకించి రాజపట్టమున నలంకరించిరి. విధికి ఘటింపరాని దేదియు లోకమునందు లేదుగదా!

అడవిలోని వేణువు లొండొంటి సంఘర్షణముచేఁ జిచ్చుపా లగుచున్నవి. కాని వాని మూలములు ఘనబృంద మొసఁగు నుదారములగు జీవన ధారలచే నంకురించి మరలఁ బెంపొందుచుండును. పెనుగాలిచే సమూలముగ నుత్పాటింపఁబడిన వృక్షమును, ఆవాయు వేగమున నొకప్పు డొక గొప్ప గిరి కుహరమునం బడి బ్రతుకు గనుటయుఁ గలదు. ప్రకృతియం దిట్టి విధమైన యఘటన ఘటనా పటిమంబు దైవమున కుండుట సహజము.

ఉ॥ వేణు వనం బొకం డొకటి
      వీడక రాయుచు దగ్ధ మౌను; దై
వానుమతిన్ క్షణంబున మ
      హాంబుద జీవన ధార లాని మూ
లాన నవాంకురోదయ వి
      లాసముఁ జూపును; వాత నీత మే
కోననొ పడ్డ వృక్షము చి
      గుళ్ళ నిడున్ విధికే దసాధ్యమౌ?

పార్థుని కొమరుఁ డగు నున్మత్తావంతి భృత్యుల ప్రేరణముచేఁ దనకులము నుడుపుకొనుటయు, నాకాలమున సింహాసనము వడసిన తత్పుత్రుఁ డైన 'శూరవర్మ' కమలవర్ధనుని దండయాత్ర చేఁ బలాయితుఁ డగుటయు, జరుగకున్నచో గొప్ప వంశమునం బుట్టనివాఁడగు యశస్కరుఁడు కాశ్మీర క్షమాపతి యగుట పొసఁగునా? అంతయు దైవచిత్రము.

## యశస్కరుఁడు

జనసామాన్యమునఁ జేర్పఁదగిన వాఁడై పరిజన రహితుఁడై పాదచారియై పర్యటించుచుండిన యశస్కరుఁ డిప్పు డొక్క క్షణములో సామ్రాజ్య రమా విలాసమునఁ జెన్నారుచుండెను. అట్టి యతని మనోహరాకృతినిఁ బౌరనారీ నికరముల నయనారవిందములతో నిండి యుండిన రాజమార్గమే మిక్కిలి పేరాసతోఁ జూచుచున దయ్యెను.

యశస్కరుఁడు శ్రీనగరియందలి రాచనగరున నివసించి యపుడు మంత్రిరత్నముల సాహాయ్యమున ననయము నయము వినయము ప్రజా పరిపాలనాది ధర్మముల నెఱింగింపఁగల ధీమంతుఁ డగుటచే నెప్పుడు వారి ప్రశస్త్యము విశ్వాసములయిన వారలకే గన్నులం బ్రకటింపఁజేసి గరువములేక కర్తవ్యము లాచరించుచుఁ బోవుచుండెను.

అప్పటికి శుభ్రము నైన శ్వేతచ్ఛత్రము లనెడు రజత పాత్రములందు వేలకొలఁదిగఁ బ్రతిఫలించిన రవిదీపములు గన్నుల విందై తేజరిల్లుచుండెను. అట్టి దృశ్యము యశస్కరునకు గాశ్మీర భూరమణి పట్టిన క్రొత్త నివాళివలె నొప్పారిన దయ్యెను. ఈరీతి యశస్కర భూకాంతుఁడు మహా వైభవోపేతుఁడై సతీమతల్లుల దీవనలచేఁ బ్రతిధ్వనించుచున్న రాజధామమును సపరివారముగఁ జేరెను.

శ్రీ శ్రీ శ్రీ

ఇది కాశ్మీరకమహామాత్యశ్రీ చణ్పకప్రభు సూను 'కల్హణ మహాకవి' ప్రణీతమగు 'రాజతరంగిణీ' యను సంస్కృత మహాకావ్యమునకు, అనువాదరూపమును స్వయంపాకాన్వయ భారద్వాజ గోత్రజ శ్రీ, వేంకటలక్ష్మ్యంబా వేంకటప్పార్య తనూజ, పరదేవతానుగ్రహ సముపాత్తోభయకవితా సాహితీవిలాస, వ్యాకరణవిద్యాప్రవీణ, విద్వత్కవిశేఖర, మధురకవి, ఆయుర్వేద విశారద, ఉరుగుమల్ల్యభిజన, సింహపురనివాసి, వేంకటరమణశర్మచే విరచితమును నగు, ఆంధ్రరాజతరంగిణి, అను చంపూ మహాప్రబంధమునందు సర్వంబును

పంచమ తరంగము.

ఓం తత్, సత్





శ్రీ పరదేవతాయైనమః

# రాజతరంగిణి

(మహాకవి కల్హణుని కృతికి ఆంధ్రీకృతి)

## షష్ఠ తరంగము

## మంగళాచరణము

### యశస్కరుని చరిత్ర

శా॥ ఆవిశ్వేశ్వరు ప్రేమయే జనని! నీ
వర్ధాంగి వౌకారణం
బావాతాశన పర్ణ భోజన తపం
బా? కాదు; సర్వోపేక్షముల్
తావన్మాత్రపు జీవనంబులె సుమా
తద్రీతిగా, నంచు నా
దేవస్త్రీలు నుతింప హైమవతి ప్రీ
తిన్ వించు మిమ్మోముతన్.

అంతట యశస్కరుఁ డట్లు సపరివారుఁడై రాచనగరిలోపలి యావరణముఁ బ్రవేశించుచుఁ దనయానతి యలంఘనీయ మను సంగతి తొట్టతొలుతనే ప్రజల కెఱింగింపఁగోరి వేత్ర హస్తులను జూచి "మీరీబ్రాహ్మణులను దూరమున నుంపుఁడు." అని పల్కెను. వారు వెంటనే నరనాధున కత్యాసన్నులై యొకరి నొకరు నెట్టికొనుచున్న యావిప్రులను దూరమునకుఁ బంపుచు బెదరించుచు నుండ యశస్కరుఁడు వారిని వారించి యంజలిబద్ధుఁడై బ్రాహ్మణులతో నిట్లనియెను.

భూసురులారా! మీరు సామ్రాజ్య దాత లగువారు గాన నాకెంతయుఁ బూజనీయులు దేవసములు నగుచున్నారు. రాజ్యము నొసంగితిమిగదా! యన్న యభిమానముచేఁ బనిపడినప్పుడు దక్కనితరసమయములందు మన్నికటముఁ జేరఁ జనదు." అని యనఁగాఁ బ్రజ లతని గంభీర భాషణము

నాలించి "యీతఁడు సులభముగ దొరకువాఁడు కాఁడు" అని యెంచుచు నతనియెడఁ దమ కిదివరకుండిన సహవాస పరిచయ జనిత మైన లాఘవమును మఱచి పోయిరి. ప్రకృతులు యశస్కరుని భయ భక్తులతోఁ గొలువసాగిరి.

అంత యశస్కరుఁడు తనప్రతిభా బలమునఁ బ్రాచీన మహాకవుల సంప్రదాయమును సుకవి పోషించు తెఱంగున ఖిలీభూతము లైన పూర్వ రాజన్య వ్యవస్థల నన్నింటినిఁ గ్రమక్రమముగఁ బునరుద్ధరించెను. అట్టితఱిఁ గాశ్మీరమున వణిజులు తమ యాపణంబులు రాత్రులందు మూయకయే సుఖంబుగ నిద్రింపఁగల్గిరి. పాంథులు దారి దోపిళ్ళు మున్నగు నిడుమ లెట్టివో యెఱుంగక నిరంతరాయముగఁ దమపయనములు సాగింపఁగల్గిరి. ఇంత యేల? కాశ్మీర వసుంధరయందుఁ జోర శబ్దము వినరాకుండె ననవలయును. రాజ్యమున నిదివఱకుఁ బ్రజల సర్వస్వమును దోచుకొనుచుండిన యుద్యోగుల కీనాఁడు గొప్ప యాశాభంగము గల్గెను. అందులకుఁ గారణము యశస్కరుఁ డుద్యోగుల నందఱను బ్రత్యేకముగ బ్రత్యవేక్షతోడఁ గనిపెట్టి యుండుటయే. అట్టి యధికారుల కిప్పుడు కృషి వక్కణిగ సాగుచున్నదా? లేదా? యని పరీక్షించు పని దక్క మఱొక్కటి కర్తవ్యము లేక పోయెను.

ఇట్లు ప్రజా పాలనము నడచుటచే గ్రామీణులెల్లరు కృషి పరాధీనులై రాజమందిరము వంకఁ జూడనైనఁ జూడక పోయిరి. విప్రులు వేదాధ్యయన తత్పరులై శస్త్రధారణ మను విషయమును దలంపునకైనఁ దేరైరి. ఇక గురువులైన విప్రులు సామగానము సేయుచు మద్యపాన పరు లగుటయుఁ దాపసులు భార్యా పుత్ర పశు ధన ధాన్యాది సమేతులై మెలఁగుటయుఁ గించిత్తేని పొడసూపకుండెను. ఇదివఱకు మూర్ఖు లగువారు కొందఱు గురుపదము నధిష్ఠించి స్వకపోల కల్పిత మగు గ్రంథములతోఁ దర్కాగమ పరీక్షలఁ జేయుచు మత్స్యాపూపములతో యాగాది విధానములఁ బ్రవర్తింపఁ జేయుచుండిరి. అట్టివా రిపుడు కలికమునకైనను దొరకరైరి, మఱియు మునుపువలె నిప్పుడు కులాంగనలు దేవతలట్లు గురు దీక్షావదము నధిష్ఠించి తమ పతుల సౌశీల్య సంపదను శిరఃకంపములచేఁ దృణీకరించువా రెచ్చోటను లేకుండ నణఁగిపోయిరి.

ఈవిషయ మిట్టిది. ఇంకను గ్రొత్తదేమన? యశోభానుఁ డగు యశస్కరుని కొలువున గురువులు మంత్రులు పురోహితులు సభ్యులు మున్నగు వారు విద్వాంసులై యుండుట యొక విశేషము గాదు. ఆతని సామాన్య పరిజనము సైతము విద్యాభూషితమై యుండె ననుటే చెప్పుకొనఁదగ్గ విషయము.

యశస్కర మహారాజు పరిపాలన మీరీతి జరుగుచుండెను. ఇట్లుండ నొకనాఁడు ప్రాయోపవేశాధికృతు లైన యధికారు లొక్కచోఁ బ్రాయోపవిష్టుఁడై యున్న యొక మనుజునిఁ జూచి వానిని రాజుకడకుఁ గొనివచ్చిరి. తేఁ డాతనినిఁ జూచి "నీవు ప్రాయోపవేశ మేల సేయుచుంటివి?" అని యడిగెను. అంత నాతఁడు రాజున కాత్మీయ వృత్తాంతము నిట్లు విన్నవించుకొనెను.

"మహారాజా! నే నీదేశ వాస్తవ్యుఁడనే. తొల్లి నేను గొప్ప ధనవంతుఁడనై యీనగరమున నివసించుచుఁ గొంత కాలమునకు దురదృష్ట వశమున నప్పుల పాలై క్రమముగ దరిద్రుఁడ నైతిని. అట్టితఱి ఋణ మంతకంతకును బెరిగిపోవుటచే నుత్తమర్ణులు నన్ను మిక్కిలి పీడింపసాగిరి నేనును వారి బారి పడలేక "యిప్పటికి నాయధీనమున నున్న గృహాదికము నమ్మి యప్పు చెల్లించి దేశాంతరములందుఁ బర్యటించెదఁగాక" యని నిశ్చయించుకొంటిని. తదనుగుణముగ గొప్పధనవంతుఁడగు నొకానొక వణిజునకు నాకుఁ గల సర్వస్వమును విక్రయించుచు విలువల నాభవనమునుగూడ నమ్మి వేసితిని."

విక్రయించు తరుణమున నాభార్య తలంపున వచ్చుటచే సోపాన శ్రేణితోఁ గూడిన యొక దిగుడుబావి నెల్లెట్లో వేఱుగ నుంచి దానితోడ నాజాయ జీవనము సేయునట్లు నియోగించి యేర్పాటు గావించితిని. ఆకూపమునకుఁ జుట్టును జాలఁ బ్రదేశము గలదు. వేసవియందు దాచల్లని కూపోపాంతమునఁ బూలచెట్లు తమలపాకుల తీఁగలు మున్నగునవి వేసి పెంచుటకు వీలగుచుండును. కావునఁ దోఁట కాపఱులీప్రదేశమును గుత్తకుఁ దీసికొని నాపత్నికి ధన మీఁగలరని యట్లొనర్చి యుంటిని. ఆకార్యము ముగిసిన తర్వాత నేను దేశాంతరములకుఁ బోయి పెక్కు తావులం బర్యటింప మొదలిడితిని.

ఇట్లు పెక్కువిధముల దేశములు పర్యటించి కొంత ధనము సేకరించు కొంటిని. ఇట్టి పర్యటనముతో నిరువదేండ్లు గడపి స్వదేశముఁ జేరు కుతూహలము మెండగుటచే మరల నీనగరముఁ జేరఁ గల్గితిని. ఇక్కడికి వచ్చినతోడనే నాపత్ని యునికి నన్వేషింపవలసిన ట్లయ్యెను.

పిమ్మట నేను వన్నె చెడి మలిన వసనయై యితరుల గృహములం దూడిగము సేయుచు జీవనము గడపుచున్న సాధ్వి యగు నాపత్నిం గాంచి పుట్టెడు దుఃఖముతోడఁ దద్దైన్యగతి నారసి "నీకు జీవనోపాధిఁ జూపించితినిఁగదా! నీస్థితి యిట్లగుటకు హేతువేమి?" అని యడిగితిని. అంతట నాయర్ధాంగి తనయుదంతము నిట్లు చెప్పికొనెను. "నాథా! నీవు నన్నొంటిఁజేసి దేశములం బట్టిన తర్వాత నాకై నిలిపియుంచిన యాసోపాన కూపమును జేరి యుండ దుష్టుఁడైన యావేహారి బెత్తములచే నన్ను బెట్టిదముగఁ గొట్టించి యాతావున నుండనీక తఱిమి వేసెను. అబలనగు నేనేమి సేయఁగలను? అంతకంటె మఱియొక జీవనోపాధి లేకుండుట నీకుఁ దెలిసినదేకదా! కావున నేను గత్యంతరము దోఁపక యిప్పటినుండియు నిట్లూడిగము సేయుచు దినములు గడపుచుంటిని" అని పల్కి మదీయ కుటుంబిని బాష్పనయనయై తల వంచి యూరకుండెను.

నాపతి దీనాలాపములు నాచెవులకు ములుకులై సోక నేను శోకక్రోధముల యగాధమునం బడి కర్తవ్యము గానక ప్రాయోపవేశముం బూని పెక్కండ్రు తీర్పరుల దగ్గఱ "ఫిర్యాదు" చేసితిని. కాని, వారందఱు నాప్రత్యర్థి పక్షమునకే జయముఁ జెప్పియుండిరి. ఏమైన నేమి? తుదకు నేనే పరాజయమునకు గుఱి యైతిని.

మహారాజా! నేను జడుఁడను. న్యాయ మేమో నాకెఱుక పడుట లేదు. సోపాన కూపము మాత్రము నేనావర్తకునకు విక్రయించిన వాఁడను గానని త్రికరణ శుద్ధితో మనవి సేయుచున్నాను. ఈ

విషయమై యీనా ప్రాణములే పణద్రవ్యముగా నుంతును. ధనము గోల్పోయి యపమానమున కోర్చి బ్రతుకుటకంటెఁ బ్రజా పాలకుండ వగు నీసన్నిధానమున నాయువును విడుచుట మేలని నిశ్చయించు కొంటిని. దేవరకుఁ బాప భీతి గలదేని తమరే యీవివాద విషయమున పక్ష నిర్ణయము గావింతురు గాక." అని యావాది మిన్నకుండెను.

యశస్కర నరేంద్రుఁడు వాది తెలుపుకొనిన విన్నప మాకర్ణించి తాను స్వయముగ ధర్మాసన ముండి యతని వాదమును విచారింపఁగోరి వెంటనే న్యాయాధికారుల నెల్ల రావించి "వాది విన్నవించు కొనిన విషయమును మరల జాగరూకతతోడ విమర్శించి తత్త్వమును దెల్పుఁడు." అని యాజ్ఞాపించెను. వారందఱును విక్రయ పత్రమునం గల విచారణీయాంశముల నన్నింటినిఁ బరిశోధించి నరేంద్రుం జూచి "దేవా! వాది చెప్పుకొనిన విషయము సార హీనము బూటకమునునై యున్నది. విక్రయపత్రమునం దొక్క గృహమే గాక సోపాన కూపముగూడఁ జేర్పంబడి యున్నది. ఇతండు వణిజునకు సోపాన కూప సహితమైన తనభవనము నమ్మియుండియు నన్నృత వాదియై లిఖిత పత్రమును దూషించుచున్నాఁడు." అని యైకకంఠ్యమునం బల్కిరి.

యశస్కరుఁడు స్వీయాధికారు లిట్లు పల్కుచుండ విని విక్రయ పత్రమును దాను గైకొని సభ్యు లందఱు వినునట్లు చదివెను. అది విని సామాజికు లందఱును "న్యాయాధిపతులు సెప్పిన తీర్పు సత్యబద్ధము" అని తమ సమ్మతిని వెల్లడించిరి. కాని, యశస్కర నరేంద్రుని యంతరాత్మ మాత్రము వాది జయమునే యొప్పుకొనుచుండెను. ఆకారణమున నతఁ డొక్క ముహూర్త కాల మట్లే యవ్విషయమును దీవ్రముగ నాలోచించి మరల సభ్యులతోడ నితరము లయిన చిత్ర విచిత్రములగు కథా ప్రసంగములు సల్పుచు సామాజికులను దనవాగ్వైచిత్రిచే ముగ్ధులను గావించుచుండెను.

తరువాత నాతఁడు కథాప్రసంగముల నడుమ సామాజికులు ధరించి యుండునట్టి వివిధములైన యాభరణముల లోని రత్నములను జూడఁగోరి యాయా సదస్యుల కడనుండు నాభరణములను గైకొని వీక్షింప సాగెను. ఇట్లతఁడు రత్నభూషణములం జూచునపుడు ప్రతివాది యగు వర్తకుని రత్నాంగుళీయకమును వీక్షింప నభిలషించి యద్దానినిఁ గైకొనెను. పిమ్మట యశస్కరుఁ డా యుంగరమును గొనుచు పాదప్రక్షాళన మను నెపము పెట్టి సభాస్తారులదెస చిఱునగవు మొలయించి "మీరిటనే యుండుఁడు, నేనిప్పుడే వత్తును." అనుచు నచ్చోటు వదలి పోయెను.

అనంతర మానరపతి యొక విజన స్థానముఁ జేరి సేవకునిఁ బిలిపించి వానితోఁ జెప్పవలసిన మాటలు చెప్పి తాను సభయందుఁ దీసికొన్న యుంగరము నిచ్చి యతనినిఁ బ్రతివాది యగు వర్తకుని సదనమునకుఁ బంపెను. తోడనే యారాజ సేవకుఁడు ప్రతివాది భవనమున నున్న గణనాధ్యక్షుని కడకుఁ బోయి యిట్లు నుడివెను. "ఆర్యా! మీయజమానుఁడు నన్నిటకుఁ బంపి యున్నాఁడు. నేఁడు వాది ప్రతివాదుల తగవు రాజ సమక్షమున విమర్శింపఁబడినది, ఇప్పుడు కడపటి తీర్పు చెప్పఁబడును. కావున మీకు వాది వ్రాయించి యిచ్చిన విక్రయ పత్ర మేసంవత్సరమునఁ బుట్టినదో "యాసంవత్సరపు గణనా పత్రికను (లెక్కలపట్టిగల పుస్తకమును) దెమ్మంటి నని చెప్పి తీసికొని రమ్ము" అని నన్నిటకుఁ బంపినాఁడు. మీకు గుర్తుకై తనయుంగరము నొసఁగి పంపియున్నాఁడు." అని యనెను.

అంత గణనాధికారి వర్తకుని యుంగరము నభిజ్ఞానముగాఁ దనకడ నుంచుకొని రాజసేవకుఁ డడిగిన ఖ్లాలెక్కల పట్టిక పుస్తకము నతని కొసఁగి పంపెను. దానిం గైకొని సేవకుఁడు ఖేనికడ కరుదెంచి యాగణనాపత్రము నొసఁగెను.

యశస్కర మహీకాని వణిజుని గణనా పత్రమును జక్కఁగ బరిశీలించి యందు విక్రయ పత్రమును లిఖించిన లేఖకునకు సహస్రదీనారముల నిచ్చినట్లు "ఖర్చు" వ్రాసి యుండుట గనుఁగొనెను.

మేధావియగు నమ్మహారాజు విక్రయపత్రము వ్రాసినంత మాత్రాన లేఖకున కింత ధన మొసఁగుట గలదా? దీనికిఁ గారణ ముండు నని యూహించి తనలో నిట్లు నిర్ణయించుకొనెను. "వాడి సోపాన కూప రహితమైన భవనమునే యమ్మియుండును. మొదట విక్రయ పత్రము వ్రాయించు నప్పు డట్లే లేఖకుఁడు వ్రాసియుండును. కాని వణిజుఁడు తరువాత లేఖకునకు దీనార సహస్రము నిచ్చి యతనిచే విక్రయపత్రమునందు 'రహితము' అను మాటలోని రేఫమును సకారముగా నవరించి యుండ నోపును. లేకున్న నాపాటి పత్రమును వ్రాసి నందులకు లేఖకునకు వర్తకుఁ డొక వేయి దీనారముల నొసఁగి యుండె ననుట యెంతయు సత్యదూరము. కావున నిది యిట్టిద యగును" అని యమ్మహారాజు నిశ్చయించుకొని వెంటనే సభా భవనమును జేరి ధర్మాసన మధిష్ఠించి తాను గణనా పత్రమును బరిశోధించి కనుగొన్న విషయమును సవిమర్శముగ సభ్యుల కెల్లరకు నెఱుక పఱచెను.

సభయంతయు నొక్కమాఱుగ నమ్మహీపతియొక్క ప్రతిభాతిశయమునకు విభ్రాంతి నొందినది. సభ్యులు భిత్తి చిత్రములవలె నిశ్చేష్టులై యుండిరి. అయినను నన్నరేంద్రుఁ డంతతో నూర కుండక విక్రయపత్రమును వ్రాసిన లేఖకునిఁ దనయంతికమునకు రావించి యభయ దాన పురస్సర ముగ నతనిని నిజము చెప్పుమని యడిగెను. ఆలేఖకుఁడు "విక్రయపత్రమునఁ దనకావించిన పనియు వర్తకుఁడు తనకిచ్చిన ధనమును నిక్కము." అని గడ గడ వణఁకుచు డగ్గుత్తిక యెలుంగుతో మనవి యొనర్చెను.

అంతట సభాభవన మంతయు హర్షధ్వనులతో మ్రోగెను. యశస్కరునకు నుతి శతంబులతోడ నపరిమితంబైన బహూకృతి జరిగెను. పేలోలగంబెల్ల రాజుగావించిన నిర్ణయమునెడఁ దమ పరిపూర్ణ విశ్వాసము నహమహమికతో వెల్లడించెను.

యశస్కరుఁ డటుపైఁ బ్రతివాది కావించిన నీచ కార్యమున కతఁడు దేశాంతర వాసియగు నట్లును ధన భరిత మైన యాతని భవనమును వాది యధీనము సేయవలసినట్లును దీర్పు సెప్పి కొలువు చాలించెను.

తరువాత యశస్కర భూపాలుఁ డొకనాఁడు దినాంతమున నాహ్నికంబుఁ దీర్చి భోజనము సేయఁగోరి యుండ నట్టితఱి దౌవారికుఁ డొకఁ డచ్చటికి వచ్చెను. అద్వారపాలకుఁ డకాలమునఁ దాను రాజునకు విన్నవింపవలసి వచ్చెఁగదా! యని యనుకొనుచు భయముతోడ వణఁకుచు "దేవా! ద్వారము దగ్గఱ నొక బ్రాహ్మణుఁడు తమతో మనవి సేయ వేచి యున్నాఁడు. నేనావిప్రునితో "ఱేఁడు దివస కృత్యములు పూర్తి గావించి యున్నాఁడు. రేపటికి మీపని విచారించును." అని యెంత చెప్పినను

బట్టుదలతో నతఁడు ద్వారమును వీడక ప్రాణత్యాగమునకు సైతము సిద్ధపడి యున్నాఁడు. అందువలన దేవరకుఁ దెలుపవచ్చితిని." అని యనెను. యశస్కరుఁ డామాట విని సరె, ఆబాడబుని ప్రవేశ పెట్టుము. అని యాజ్ఞాపింప నతఁ డట్లొనర్చెను.

ఆబ్రాహ్మణుఁడు రాజును దీవించి తీవ్రమైన చింతతో నిట్లనియెను. "మహాప్రభూ! నాదీ దేశము. దారిద్ర్య దోషమున దేశాంతరముల పాలై యక్కడక్కడఁ దిరిగి సువర్ణరూపకముల నూఱింటిని సంపాదించుకొంటిని. నేటి కీభూమి మీవలన సురాజ్ఞి యయ్యె నని బాటసారులవలన విని యార్జించుకొన్న ధనముతో స్వీయదేశమున సుఖజీవనము సేయవచ్చునుగదా! యని ప్రయాణమైతిని" దారినడుమఁ జోరభయ మను మాట లేక పోయెను, దేవరవారి పాలన మిట్టిదిగదా! యని గ్రహించితిని. నిన్నటి సాయంసమయమునకు లవణోత్సవమునకు రాఁగల్గితిని. విడుగర లేవి పయన మొనర్చి యుండుటచే మిగుల బడలిక నొంది యుంటిని. కావున దారిచెంగట నుండు నొక తోఁటలో నొక వృక్ష మూలము నాశ్రయించి యందు నిర్భయముగ సుఖనిద్రతో నిన్నటి రాత్రినిఁ గడపితిని. ఈదినము ప్రభాతముననే పయనము సాగింపఁదలఁచి లేచి బయలుదేరు నప్పుడు నారూకల సంచి పార్శ్వమున నున్న యార ఘట్టమునఁ (జలయంత్రమున) బడిపోయినది. ఆజలయంత్రము నాకు దగ్గఱనుండినను హఠాత్తుగ నుండుటచేఁ గానలేక పోయితిని. ఇఁకేమున్నది? పుట్టిమునిఁగెఁగదా!" అని పుట్టెఁడు దుఃఖముతో నాక్రోశించుచుఁ జొరరాని యాజలయంత్రము చుట్టును దిరుగుచు నందుఁబడి యసువులఁ బాయనుంకించుచున్నట్టి నన్నుం గని జనులు పరువిడి వచ్చి పట్టుకొని నాప్రయత్నమును సాగనీయక పోయిరి. ఇట్లుండ నచ్చటి వారిలో సాహసికుఁ డగు నొక పురుషుఁ డాజలయంత్రమునందుఁ జొచ్చి రూకల సంచినిఁ దెచ్చుటకుఁ బూనుకొని నాతో నిట్లనెను.

"అయ్యా! నేను నీధనమును వెలుపలికిఁ దెచ్చెదను. అట్లొనర్చిన నీవు నాకేమి యొసంగెదవు?" అని యతఁ డడిగెను. అమ్మాటలకు నేను బరవశుఁడనై "ఓయీ! యగాధమునం బడియున్న యాధనమునకు నేను స్వామి నగుదునా? దానిని వెలికిఁ దీయుము. పిమ్మట నందు నీకేది యిష్టమో యదే నీవు నాకొసఁగుము." అని యంటిని. తోడనే యతఁ డాయారఘట్టములోనికి బోయి సువర్ణ రూపకముల మూటను దీసికొని వెలుపలికి వచ్చెను.

అది చూచి యచ్చటి వారందఱు నేనును మిగుల నాశ్చర్యపడితిమి. అంతట నాసాహసి బహిరంగముగనే సువర్ణ రూపక శతమును మూటనుండి తీసి యా బంగరు నాణెములలో రెంటిని మాత్రమే నాకొసఁగి తక్కిన తొంబది యెనిమిది దాను దీసికొనెను. వానిచర్య యచ్చటి చూపఱ కెల్లరకుఁ గన్నుగుట్టిన ట్టయ్యెను.

అంత వారందఱును లోలోనఁ గుందుచున్న నన్నుం గని "ఓపాఱుఁడా! ఈ వంపకము చాల నక్రమమైనది. యశస్కర మహారాజుగారితోఁ జెప్పికొనుము. మీరు చేసికొన్న వ్యవస్థ నింద్యముగ నున్నది, మీ వ్యవహారము చక్కఁగ విమర్శించి పరిష్కరింపఁదగును, యశస్కర నరేంద్రుని పరిపాలనమున నిట్టి యొడంబడికల చిక్కులు చక్కఁగఁ బరిష్కరింపఁబడును." అని యనుచు నన్ను

దూరుచు మీతోఁ జెప్పికొను మని పెక్కువిధములఁబురికొల్పిరి. నేనును మీతో నున్న సంగతి దాచక విన్నవించుకొంటిని. ఎండనక వాన యనక చిరకాలము దేశదేశములు ద్రిమ్మరి యార్జించుకొన్నది నావిత్తము. ఈ వ్యవహారమునందలి వ్యవస్థను ప్రభువులు చక్కఁగఁ బరిష్కరింతురేని జీవింతును. లేకున్న నాకు జీవితముతోడఁ బనిలేదు. పురద్వారమునందే యసువులఁ బాసి ధర్మదేవత నర్థింతును." అని యాబ్రాహ్మణుఁడు తన వృత్తాంతము నంతను జెప్పుకొనెను.

యశస్కర మహీపతియు విప్రుని వ్యవహారమును సుదీర్ఘముగఁ బరిశీలించుచు నాద్విజుని దెసఁ జూచి "నీవాతని పేరును స్వభావమును వివరించి చెప్పఁగలవా?" యని యడిగెను. అందుల కాద్విజుఁడు "రాజా! నేనతని గుఱించి యేమియు నెఱుఁగను. వాని ముఖమును జూచిన గుర్తింపఁ గలను" అని బదులు పలికెను.

అంత నాధరారమణుఁడు, ఇంచుక యాలోచించి "యట్లయిన నీయభీప్సితమును తీర్తు దీర్తును." అని శపథము సేసి భోజన సమయ మయినది గనుక మనమిరువురమును గలిపి భుజింతము, రండు అని యాభూసురు నెట్లెట్లో యొడఁబఱచి యాతనితో నారేయి విందారగించెను.

రాత్రి గడచినది. అమ్మహీజాని వేఁకువనే దూతల నంపి 'లవణోత్సవమున' వసించు వారి నెల్లరను రావించెను. ఆజనతయందు జలయంత్రమునుండి నాణెముల మూటను బైకిఁ దెచ్చిన వాఁడును నుండెను. అంత బ్రాహ్మణుఁడు వానిముఖమును గుర్తించి యతనిని రాజునకుఁ జూపఁగా నరపతి యాతనిఁ దనచెంతకుఁ బిలిచి "యతనికిని, బ్రాహ్మణునికిని జరిగిన యొడంబడికను గూర్చి వాస్తవము నెఱింగింపుము." అని యడిగెను. వాఁడును బ్రాహ్మణుఁడు మున్ను చెప్పినట్లే యథాస్థితిని విన్నవించి మిన్నకుండెను.

అట్టి తఱి నచ్చోటఁ గూడినవా రెల్లరును నొకప్రక్క సత్య వాక్పరతంత్రతను నొక వైపు వస్తు వృత్తమును గుఱించి పరిశీలించి యారెంటి తారతమ్యము నిర్ణయింప నశక్తులై డోలాందోళిత మానసులై యూరక నేలఁ జూచుచుండిరి.

అంత మేధావి యగు నారాజేంద్రుఁడు ధర్మాసన మధిరోహించి వారి ధన విభాగ వ్యవహారమును గూర్చి సవిమర్శముగ నిట్లు నుడివెను. "సువర్ణ రూపక శతమునందుఁ దొంబది యెనిమిది బ్రాహ్మణున కీయఁదగును. తక్కిన రెండును అరఘట్టమునుండి వానినిఁ బైకిఁ దెచ్చినవాఁడు గైకొన వలయును. ధర్మముయొక్క గతి మిగుల సూక్ష్మ మైనది. కావున నది మిగుల గహన మైనదియై యుండును. అట్టి ధర్మతత్త్వమును విమర్శకుఁడు సూక్ష్మేక్షికతోడఁ జక్కఁగ నరయవలయును" అని యాధరణీకాంతుఁడు నుడువుచుండఁగనే పృచ్ఛకులు పెక్కండ్రు "రాజొనర్చిన విభాగ నిర్ణయమునకుఁ గారణమేమి?" అని సందేహించుచు నమ్మహీవల్లభునిఁ బ్రశ్నించిరి. యశస్కరుఁడు వారిపృచ్ఛలకుఁ బ్రతివచనము లిచ్చుచుఁ దా నొనర్చిన తీర్పునందలి ధర్మతత్త్వమును సభ్యుల కిట్లు విశదపఱచెను,

లోకమునందు దుర్వృత్త మగు నధర్మమును నిర్మూలించుటకునై యేర్పడునట్టి ధర్మము మిగుల గొప్పదై యుండును. అయినను దానిగమనము సాధారణముగా నాలోచన పథమునకు దూర మగుచుండుటయు సహజము.

భానుఁ డస్తమించు నపుడు తనతేజము నగ్నియందును. నమ్మయ మగు సిందువింబము నందును నుంచి రాత్రులం దలముకొను నిబిడాంధకారమును దివ్వెల రూపమునను వెన్నెలరూపునను హరించుచున్నాఁడు. ఆరవితేజము పరస్పర విరుద్ధము లయిన శీతోష్ణ ప్రకృతులం దిట్లు విభజింపఁ బడినదయ్యెను. రెండు విధములను దిమిరమును హరించుచునేయున్నది. ఇట్లే వినిర్మలమగు ధర్మమున కధర్మమును రూపు మాపుటకంటె వేఱొక పని యుండదు.

మఱియు నధర్మమునందు మిశ్రితమై యుండు ధర్మము సామాన్య దృష్టికిఁ గోచరింపదు. కాని, విమర్శించిన నయ్యది యధర్మమును రూపఱఁ జేయఁగలదు. కట్టెలో నిమిడి యుండు వహ్ని మొదటఁ గానవచ్చుచున్నదా? కాని యది యింధనములను దహింపఁగలిగి యుండుట ప్రత్యక్షానుభవ సిద్ధము. ఇట్లే ధర్మతత్త్వము గూడ నుండును.

చం॥ అనలునియందు శీతకరు
నందు దినాంతమునన్ దివాకరుం
డనుదినమున్ స్వతేజమును
నప్పన పేయుచు నుండు; వీరియం
దును నది యుష్ణ శీత గతి
తో ద్వివిధంబుగ భిన్నమై వెలుం
గును దమమున్ హరించుచు. వి
గూఢపు ధర్మ రహస్య మిట్టిదే?

గీ॥ ఇంధనాంతర్గతము వహ్ని యెట్టు లగ్ని
సంగతినిఁ బ్రజ్వరిల్లు; నాచందముననె
నిర్మలం బగు సత్య మనిర్మలాన్మృ
తమున వెల్వడు సద్విమర్శమును దవిలి.

ధర్మతత్త్వ మిట్లుండును. బంగారు నాణెముల మూటను జలయంత్రమునుండి పైకిఁ దీసిన వానితో విప్రుఁడు మున్ముందుఁ జెప్పినదేమి? అతఁడు "నేమ నీద్రవ్యమును వెలికిఁ దెచ్చినచో నీవు నాకేమి యొసఁగెదవు?" అని యీవిప్రుని నడిగెనుగదా! అట్టితఱి బ్రాహ్మణుఁడు "నీవేమి యీయఁ దలఁచితివో! అది యిమ్ము" అని చెప్పి యుండలేదు. "నీకేది యిష్టమో యది నాకిమ్ము" అనిమాత్రమే నుడివి యుండెను. నాణెముల మూటను బైకిఁ దీసిన యాపనివాఁడు తొంబది యెనిమిది నాణెములఁ గైకొన నిష్టపడెను. తాను గైకొన నిష్ట పడిన యాతొంబది యెనిమిది నాణెములను నిపు డీవిప్రుని కిచ్చుట పాడి యగును. తక్కినవి రెండును శ్రమ పడిన యీపనివాఁడు తీసికొన నర్హుఁడు.

వీండ్లకొలఁది దేశములం దిరిగి సేకరించు కొన్న ధన మొక్కమాఱు జలయంత్రమునందుఁ బడుటయు నద్దానినిఁ బైకిఁ దెచ్చినచో నేమొసంగెదవు? అని తన్నొరుఁ డడుగుటయు సంభవించుటం జేసి యీబ్రాహ్మణుఁడు పరవశుఁడై యట్టి యొడంబడిక చేసికొనెను. అట్టి వీరిరువురి యొడంబడికకు

నిట్టి యర్థమును నిర్ణయించినచో నిరువురకు న్యాయ్య మైన విభాగము జరుగును. లేకున్నఁ బనివాఁ డొక్క నిముసములో తొంబది యెనిమిది స్వర్ణ రూపకములఁ దీసికొనుట పేరాస యగును. కాని, న్యాయ్యము గాఁజాలదు. ఇయ్యది నానిర్ణయము.'' అని యాధరణీకాంతుఁడు ధర్మ స్వరూపమును సభా సదులకు విశదపఱచెను.

అంతట సభ్యులందఱు నరేంద్రుని ప్రతిభా బలంబునకు విస్మయపడుచుఁ దమయంగీకారము నొక్కమాఱుగ హర్షధ్వనులతో వెల్లడించిరి. పిమ్మట నాక్ష్మాపతి వారిరువురకుఁ దాఁ జెప్పిన తీర్పు ననుసరించి విత్త విభాగము గావించి యానాటికిఁ గొలువు చాలించెను. ఈరాజేంద్రునకుఁ గల మేధా సంపద యింతమాత్రమే గాదు. ఇతఁడు తనయేలుబడియందు ధర్మాధర్మముల తారతమ్యము నత్య ద్భుత మగు రీతినిఁ దన సూక్ష్మ దృష్టితోఁ బెక్కు మాఱులు నిశ్చయించి భారత భూమియందు నూతన కృతయుగోదయమును వెలయించె నని చెప్పవలయును.

యశస్కరుఁ డీవిధమునఁ బ్రజలను వినయ సౌశీల్యాది శోభితులనుగాఁ జేయుచు శ్రోత్రియుని మాడ్కిఁ దాను సదాచార సంపన్నుఁడై యితరులకు సదుపదేశంబులు సేయుచున్నను దనకొలువున నాటుకొని యుండిన నీచులను బెకలించి వేయక యట్లే యుంచెను. ఆనీచులు మనకుఁ గ్రొత్తవారు కారు. డోంబగాయకుని యుచ్ఛిష్టమును భుజించి పూర్వము రాజానుగ్రహమును బడసినవారు. ''అట్టి తులువలను యశస్కరుఁడు తనకొలువునకు దూరము సేయకుండుట గొప్ప లోపము.'' అని చెప్పఁ దగును. ప్రజాహితము నుపదేశించు నమ్మహీకాంతుఁ డీసందర్భమున నితరులకుఁ ''బథ్యభోజనము సేయుఁడు.'' అని యుదేశించుచుఁ దానుమాత్ర మపథ్యాహారమును మెక్కుచుండు వైద్యునివలెఁ బరి హాసపాత్రుఁ డయ్యె ననుట చింతింపఁ దగ్గ విషయము.

ఇట్టి తరుణమున నగరాధికారులు నల్వురుండిరి. వారి మూలమున యశస్కరుఁ డధిక విత్తము నిజాయత్తముఁ జేసికొనెను. ఈక్షమాపతి శ్రీరణేశ్వరస్వామి పీఠసమీపమున ఖడ్గము నుంచి శాంతికాముఁడై సూనృత భాషియై యుండియుఁ బదాతి సైన్యముయొక్క హానసమునకు హేతువుగూడ నయ్యెను. ఈనృపతి తనయన్న మరణించినపుడు చాలకాలము ముదితహృదయుఁ డయ్యెను. దానం జేసి ప్రాజ్ఞులు కొందఱు రాజసోదరుని యాకస్మిక మరణమునకు రాజకృత మైన విషప్రయోగమే కారణ మని యూహించిరి.

మేధావి యగు నీయశస్కరుఁడును 'వేలావిత్తుఁడు' అనువాని (సచివుని) యెడఁ దనకు గాఢ విశ్వాస మంకురించుటచే వానిని మండలాధిపతినిఁగా నొనర్చి మిగుల సమ్మానించెను, అంతట నాచండగీఁడు నరనాథు పరిచితినే గాక యతని యంతఃపుర కాంతల ప్రేమ సంబంధమును సైత మభిలషించుచు మెలఁగుచుండెను. వాని నడవడికను గుఱించి భూనాథుఁడు గజనిమీలికతోడ వ రింప సాగెను.

ఇది యిట్లుండఁ గొంతకాలమునకుఁ గ్రమముగ యశస్కరునకు వేశ్యాలోల్యముగూడ నేర్పడెను. ఆకారణమున నతఁ డత్యంత లావణ్యవతి యైన 'లల్ల' యను నొక పణ్యాంగన వలపు లతలోఁ దగుల్కొనెను. ఆయాటవెలఁది యాడినది యాట పాడినది పాటయునై యావారకాంత గీఁచిన గీటు దాటక వర్తించుచుఁ జివర కతఁడు తనవెలయాలిని శుద్ధాంత కాంతామణుల కందఱకు శిరోధార్య యగునట్లొనర్చెను. ధీమంతుఁ డగు నీనరనాథుఁ డింతటి మోహ జాలమునఁ జిక్కువడి యుండుట కాగణికయొక్క నిరుపమాన లావణ్యమే నిదాన మనవలయును.

విధాత లోకమునందు స్త్రీల యంతరంగములందు సువృత్తములకుఁ జోటు లేదని కాఁబోలు! ఆవేశ్యకు బహిరంగము లైన వలుద పాలిండ్లను గరము సువృత్తముగ నొనర్చి యుండెను, మఱియు శుచి బాహ్య లయిన వెవెలఁదుక లుత్తమాధములను భేదము లేక తుచ్ఛ భోగము ననుభవింతురు. విధి కీవిషయము దెలియును గావున వారి కంగనాత్వమును బ్రసాదించి యున్నాఁడు.

యశస్కరుని ప్రేయసి యగు వేశ్య యిట్టిది. అతఁ డావెలయాలి నెంత ప్రేమించి లాలించు చుండినను దన నైజ గుణమును విడువలేక పోయెను. ఆరూపాజీవ రాజును వలపించుటతోఁ దనివి నొందక రాత్రులందు రాచనగరునఁ గాపరియై యుండు నొక చండాల యామికునికిఁ జిక్కి వాని పొత్తునఁ దృప్తి నొందుచుండెను. ఆచండాల యువకునియందేదో యొక మోహకారిణి యగు నాకర్షణ శక్తి యుండె నని చెప్పవచ్చును. లేకున్నచో నావేశ్యాంగన సంగతి యటుండ రాజవధువు సైతము తత్ప్రభావమునకుఁ బరవశయై వానిం గోరుట పొసఁగునా? ఆరాజకాంత చండాలకులమున జనించిన దైనను గావలెను. లేదా! ఆచండాల యువకుఁడు మంత్ర వేత్తయై యుండినను నుండును. కాకున్న నిట్టి యసంభావ్య మైన సంబంధమున కవకాశము గలుగనేరదు. వానికి నామెతోడి పొత్తేవిధముగఁ గుదిరె నని యెవ్వరుగాని యెచ్చోటఁగాని యనుకొనరైరి, ఆకారణమున నావృత్తాంతము ప్రకటము గాక పోయెను.

ఇట్లుండ నాపాపాత్ముల పరస్పరానురాగము 'హాడి' యను పేరు గల యొక యధికారికి మాత్రము మొదట నెఱుకపడెను. ఆయుద్యోగి యొకనాఁ డాకామినీ కాముకు లొండొరులు కనుసైగ లొనర్చుకొనుచుండఁ గనిపెట్టి యుండెను, తఱువాత నరేంద్రుఁడు క్రమముగఁ బ్రణుధులవలనఁ గలరూ పెఱింగి యాపాప ముపశమించుటకై కృష్ణాజినమును ధరించుచుఁ గొన్నాళ్ళు తా నుపవాసములం జేయుచుఁ గృశించెను. యశస్కరుఁ డిట్లొనర్చుట కతని కాకాంతయెడఁ గల యనురాగమె కారణము. అతఁ డాదుర్వృత్తమును దెలిసికొని మొదటఁ గ్రోధ మూర్ఛితుం డయ్యెను. కాని, యతఁడు కామ మోహితుఁ డగుటవలనఁ గులటయై యుండిన తనకాంతను వెంటనే వధింపలేక పోయెను. రాగాంధు లకు లజ్జ యెక్కడిది? పురోభాగులగు పౌరు లీసందర్భమున నవకాశముఁ జేసికొని యశస్కరునిఁ బెక్కువిధముల దూరిరి.

దీనికంతకును దొల్లి డోంబగాయకుని యుచ్ఛిష్టమును భుజించి తన్మూలమున సంపన్నులై యుండిన సీచులను దనయాస్థానమునకు దూరము సేయుచుండుటే యశస్కరుఁడు గావించిన గొప్ప

తప్పు. ఆయనవధానతయే నేటికిని గీర్తిచంద్రికతోడ విలసిల్లు చుండిన యారాజచంద్రునకు దీరని కళంకము గల్గుటకుఁ గారణ మయ్యెనని చెప్పవలయును. యశస్కరుఁ డీరీతి నశుచి యయ్యె నను టలో వింత యేమున్నది? కుష్ఠరోగము గలవారితో నిత్యము గలసి మెలసి వర్తించువారు గుష్ఠవ్యాధికి గురి యగుట చిత్రము గాదుకదా!

ఏమైననేమి? ఈకాశ్మీరభర్త బుద్ధిమంతుఁ డనఁదగును. ఇతఁ డొకనాఁడు తనలోఁ దాను "నేను సామాన్యుఁడనేగదా! పూర్వ భవములందుఁ జేసికొన్న కొన్ని పుణ్య కర్మలవలన నిప్పుడు నరేంద్రుఁడనై యుంటిని. ఈతరుణమున ధర్మ కార్యముల బహుళముగ నాచరించి రాఁగల జని యందు నితోధిక మైన సామ్రాజ్య పదమును బడయుదును గాక." అని సవిమర్శముగఁ దలపోసెను. పిమ్మట నితఁడు తనతలంపున కనుగుణముగ నిరాతంక మైన తనరాచసిరి నొక్కనాఁ డొక ద్విజపుంగవునకు నొసఁగెను.

మఱియు నీయవనీనాథుఁడు దానశౌండుఁడను ఖ్యాతిఁ గాంచి యార్యదేశమునుండి విద్యార్థులై యేతెంచిన యంతేవాసులు వసించుటకుఁ దనపితరుల వాసస్థానమునందు గొప్ప మఠమును గట్టించి వారికందుకు వలసిన యేర్పాటులు గావించి యచ్చోట మఠాధిపతి నొక్కని ఏర్పఱచెను. అమ్మఠాధిపతికి టంకాంతఃపురములు దక్కఁ దక్కిన ఛత్ర చామరాది రాజ్యశ్రీ వైభవమంతయును రాజునానతిచేఁ జెల్లుచుండెను. ఇవిగాక యీనరనాథుఁడు వితస్తాతీరోపకంఠమున విరాజిల్లునవియు నానావిధోపకరణ సమన్వితములును నైన యేఁబదియై దగ్రహారములను బ్రాహ్మణుల కొసంగి యుండెను.

అంతటఁ గొంతకాలమునకు యశస్కరుఁడు జలోదర వ్యాధికిఁ జిక్కి మిగులఁ గుందుచుఁ దాను రాజుగా నుండుట కొల్లక తనకుమారుఁడు సంగ్రామదేవుఁడనువాఁ డొకఁ డున్నను వాఁడు దన కొడుకు గాకుండు టెఱింగినవాఁ డగుటచే నతనిని రాజ్యమునం దభిషిక్తునిఁ గావింప నియ్యకొనని వాఁడై రామదేవుని కొమరుఁ డగు 'వర్ణటుని' రావించి సచివులను సామంత వర్గమును, ఏకాంగ సైనికులను జేరఁదీసి వారి సమక్షమునం దావర్ణటుని రాజ్యాభిషిక్తునిఁ గావించెను.

## వర్ణటుఁడు

ఇట్టి తఱిఁ జిరకాలమునుండి రాజ్యామిషము నపహరింపవలయునని వేచియున్న పర్వగుప్త ప్రభృతులకు గొప్ప యాశాభంగము గలిగిన దనవచ్చును. అర్భకుఁ డగు సంగ్రామదేవుని రాజ్యాభిషిక్తు నొనర్చి యుండినచో వారి పన్నుగడలు ఫలించి యుండెడివి. వర్ణటుని రాజుగావించుటచే నింతకుముం దుదయోన్ముఖ మగుచుండిన పర్వగుప్తుని కౌటిల్య ప్రయోగ మీక్షణమున నొకింత భగ్నమైనట్లు గాన్పించెను.

ఇఁక వసుంధరా వల్లభుఁ డైన 'వర్ణటుఁడు' తనకు రాజ్య మొసంగిన యశస్కరుఁడు రాజధానియందు వ్యాధి పీడితుఁడై యుండ వాని నొక్కమాఱు చూచికొని చివరకతని యారోగ్య వార్తనైన

విచారించియేని గానీ యెఱుఁగక పోయెను. యశస్కరుఁడు తనయెడ వర్ణటుఁడు గనుపఱచిన యట్టి యనాదరమునకు మిగులఁ బశ్చాత్తప్తుఁడై వగపు నొందుచుండఁగా గొందఱు మంత్రు లాతని నను నయించుచు వర్ణటుని రాజ్యమునుండి తొలఁగించి సంగ్రామదేవునకుఁ బట్టము గట్టింపఁ బెక్కుతెఱంగులఁ బురికొల్పిరి. యశస్కరుఁడును జివర కాసచివుల మాటలకు లొంగెను.

పిమ్మట వారు రాజాజ్ఞను బడసి వర్ణటుని నొకనాటి రేయి యంతయు నెనిమిది స్తంభముల మండపమునందు బంధించి వెలుపల గడియలు బిగించి తెల్లవాఱఁగనే యందుండి వానినిఁ దఱుమఁ గొట్టిరి. ఆయాస్థాన మండపము నాటిరాత్రి రాజసేవకులకు 'పాయఖాన.' దొడ్డిగా నేర్పడెను. అట్లగు టకు నారాజసేవకుల భయాతిరేకమో; లేక, వారు రాత్రియంతయు మేల్కొని యుండుటో కారణమై యుండనోపును. ఆరాజ సేవకులలో 'దేవప్రసాదుఁడు' అనువాఁ డొకడు గలఁడు. అతఁడు వర్ణటుఁడు రాజై యున్నపు డొక్కనాఁ డతనికి సన్నిహిత భృత్యుఁడై యుండెను. ఆకారణమున నతఁడు తన రాజునకు జరిగిన విషాదకరమైన పరిభవమునకు మిక్కిలి సిగ్గువడుచుఁ దనయసిలతను విజయేశ్వరాల యమున స్వామిసన్నిధియం దుంచి తనసేవకు స్వస్తిచెప్పెను. నిక్కముగ నట్టి సేవకుఁడు గదా 'రాజ బీజి'యని చెప్పఁదగిన వాఁడు.

తఱువాత యశస్కరునకు వ్యాధి బాధ తీవ్రము గాఁదొడఁగెను. అంత నతఁడు సంగ్రామ దేవునిఁ గాశ్మీరపతిగా నియమించి తాను గట్టించిన మఠమునందు నసువులు విడువఁగోరిన వాఁడై రాజ ధానినుండి యచ్చోటునకుఁ బయన మయ్యెను. తొల్లి యశస్కరునియెడ బద్ధానురాగులై స్వామి భక్తిని వెల్లడించుచుండిన భృత్యుల''మ్మహారాజు రాజ్యపదవిని వదలుకొనినచో వారందఱు నాయు ధములఁ బరిత్యజించి కేశ శ్మశ్రువులఁ దీయించి తలపాగలను మాని కాషాయ వస్త్రములను ధరించి సన్యసింతుము.'' అని కడు నుద్వేగముతో బ్రతిజ్ఞ లొనర్చి యుండిరి. అట్టివా రందఱును నేఁడు తమ ఱేఁడు మరణింతు నన్న నిశ్చయముతో మఠమునకుఁ బయనము సాగించుచుండ దా మొనర్చియుండిన ప్రతినలను స్వప్నవార్తలవంటివిగ నైనఁ దలంపరైరి.

యశస్కరుఁడు ముమూర్షువై యుండియు దాను రాచనగరు వీడునపుడు తనకు నరణముగా నొసగఁబడి యుండిన 2500 బంగారు నాణెములను దనయుత్తరీయమునందు గట్టి యుంచెను. పర్వ గుప్తుఁడు మున్నగు దుష్టమంత్రు లేవురును యశస్కరుఁడు జీవించి యుండఁగనే యతఁడు తనకడ నుంచికొన్న యాధనము నపహరించిరి. అంతమాత్రమేగాక వానియెదుటనే యొండొరు లాసువర్ణ శకలములను బంచుకొనిరి.

అమ్మహీపతియు మఠమును జేరి వ్యాధి బాధను భరింపలేక యందంధకారముతో నిండి యున్న యొక చిన్న కుటీరములో శయ్యపైఁ బరుండి యటునిటు పొరలుచు దనయెదుర ద్రోహపరులై యున్న తనవారినిఁ జూచి మిగులఁబరితపించుచు స్మృతినిఁ గోల్పోకయే యుండెను. అతఁడచ్చోట రెండు మూఁడు దినములు మాత్రము జీవించియుండెను. అయినను నీలోననే ''యతఁ డెప్పుడు మరణించునా రాజ్యమెప్పుడు హరింతుమా!'' అని వేగిరపడుచున్న యతని స్నేహితులు బంధువులు భృత్యులు

వేలావిత్తులను నేకీభవించి విషమును బానీయమందుఁ గలిపి యతని ద్రావించిరి. ఎట్లైననేమి? యాసన్న మరణుఁడైన యశస్కర మహీపతి యానెపమున నసువులఁ బాసెను. "రాజ్య తృష్ణా పీడితులైన నరులకుఁ జేయరాని నీచకార్యము లెవ్వియు నుండఁబోవు." అని దీనఁ దేటపడినది.

యశస్కరుని యంతఃపుర కాంతలలోనెల్ల 'త్రైలోక్యదేవి' యను నామె యొక్కతెయే సాధ్వీమతల్లి యనఁదగినది. ఆసతి మాత్రము సూర్యప్రభ సూర్యు ననుసరించునట్లు తనపతి ననుగమించెను. యశస్కరుఁడు వర్ణాశ్రమ ధర్మ ప్రత్యవేక్ష గొప్ప పూనికతోడ నొనరించు చుండెను. అతఁడు "తనప్రజలు వర్ణాశ్రమాచార ధర్మమును జక్కఁగ ననుష్ఠించుచున్నారో! లేదో!" యని గమనించు నపుడు 'చక్రమేలము'నందు 'చక్రభానువు' అనునొక ద్విజుఁడు దురాచారపరుఁడై యుండుట తాను స్వయముగఁ గనుఁగొని ధర్మవశంవదుఁడై యాబాడబుని లలాటంబున 'శ్వపాదాంకములు' (కుక్కచ్చులు) వేయునట్లు శిక్ష విధించెను. ఆద్విజుని మేనమామ వీరనాథుఁ డనువాఁడు. ఆవీరనాథుఁ డనువాఁడు యోగిగా నుండి యశస్కరుని దగ్గఱ నంతఃపుర సంధివిగ్రహముల నడుపునట్టి వాఁడుగ నుండెను. అతఁడు తనమేనల్లునికి రాజు విధించిన శిక్షను దలపోసి యశస్కరునియెడఁ బగఁబూని యతనిమృతికిఁ గారకుఁ డయ్యె నందురు. ఈ వార్త యశస్కర మహీజాని మరణించిన తఱువాత నేఁడు దినములకు బయలు వెడలెను.

లోకమున గురువులుగా నుండువారు కొందఱు పూర్వాచార్యుల ప్రభావము తమయం దారోపించుకొని తమకును నట్టిమహిమ గలదని వెల్లడించుటకుఁగా నిట్టివార్తలు పుట్టించుచుండుట గలదు. "యశస్కరుని మరణవిషయమునఁ బ్రఖ్యాపిత మైన వార్తయు నిట్టిదే" యని చెప్పవచ్చును. లేకున్నచో దీర్ఘ వ్యాధికిఁ జిక్కి కృశించి కృశించి యశస్కరుఁ డసువులఁ బాసియుండ నావల నేఁడు రోజుల కిట్టిది పుట్టుటయు, నద్దానిని నమ్ముటయు సమంజస మనఁదగునా?

మఱియు నమ్మహీపతి వ్యాధిగ్రస్తుఁడై యున్నపుడె యీవార్త వెల్లడియై యుండిన దని యన్నచో నిట్టి సందర్భమున నొక వీరనాథుని కోపమే యశస్కరుని మృతికిఁ గారణమని చెప్పనేల? పర్ణటాదుల యభిశాపముగూడ హేతువుగాఁ గల్పింపవచ్చును. ఇంతకును సవిమర్శముగఁ బరికించినచో నిట్టివార్తలు విశ్వాస పాత్రములు గావనుట నిక్కము. యశస్కర మహీకాంతుఁడు తొమ్మిది సంవత్సరములు రాజ్యశ్రీ ననుభవించి 4024 వలౌకికాబ్దమున (క్రీ.శ. 948) భాద్రపద బహుళ తృతీయనాఁడు దివంగతుఁ డయ్యెను.

## సంగ్రామదేవుఁడు

పిదప రాజ్యాభిషిక్తుఁ డైన 'సంగ్రామదేవుఁడు' బాలుఁడు గావున నతనిం గాపాడుచున్న యతని పితామహిని పర్వగుప్తుఁడు నృపాసనమునం దుంచి భూభటాదుల నేవురను లోఁబఱచుకొని తనప్రభుత్వమును గాశ్మీరమునం దంతటను మెఱయింప సాగెను. అట్లు గొంతకాలము జరుగఁగాఁ గ్రమముగఁ బ్రాబల్యమును గడించిన యాపర్వగుప్తుఁడు సంగ్రామదేవుని పితామహిని భూభటాదులను దన కౌటిల్య ప్రయోగమునఁ బొలియించి రాజస్థానమునఁ దానొక్కండె నియంత యనఁదగు రీతిని విజృంభించెను.

మాయావి యగు పర్వగుప్తుఁడు బాలభూపతికి షడ్రసోపేతము లైన వివిధ భోజ్యముల నర్పించుచు ఋజుబుద్ధు లగువారు తనను స్వామిభక్తి పరాయణునిఁగా భావించునట్లు తననేర్పు మీఱ నటించుచుండెను. అతని చైదము లోకప్పు డతని ప్రభుత్వమును వెల్లడించునవియై యొక్కొకప్పుడు మంత్రిత్వమును నుడువునవియై యుండెను. ఆహేతువుచేఁ బ్రజలు పర్వగుప్తుని రాజుగను, రాజానకుని గను (మంత్రిగను) భావించుచు మెలఁగ మొదలిడిరి. యశస్కరుఁడు దేవరిని స్వామిభక్తిపరులనుగా విశ్వసించి యున్నతాధికారులనుగాఁ జేసెనో! వారే యిప్పు డాతని సుతుని నిర్మూలించుటకుఁ బ్రయత్నించినా రైరి. వారిలోఁ బ్రధానుఁడు పర్వగుప్తుఁడు. వానియాశ మేర లేనిది. అతఁడు తనకు రాజ వర్చస్సు గలదని వెల్లడించుటకై శాద్వలమువలె విస్తృతమై యొంతొ వెంద్రుకలుమాడ్కిఁ గపిల వర్ణము గల గడ్డమునకును మీసలకును గుంకుమాలేపనము వేసి మురియుచుండెను.

ఈరీతి దుష్టుఁ డగు పర్వగుప్తుఁడు ప్రకటముగా సంగ్రామదేవుని నృపాసనమునుండి తొలఁగింపవలయు నని తలంచెను. కాని, యతనియత్నము సాగలేదు. కారణమేమనః తానట్లు చేసి నచో నేకాంగ సైనికులు సమ్మతింప రనుభీతి యతని హృదయమును బాయకుండుటే. అందువలనఁ బర్వగుప్తుఁ డుపాయాంతరము గానక యాబాలభూపతి నాభిచారిక ప్రయోగమునఁ బొలియింప నుద్యోగించెను. అతఁ డాప్రయత్నమున నున్నప్పు డాభిచారిక శక్తి యతనితో నిట్లు నుడివెను.

"ఓయీ! నీవు రాఁగల చైత్రమాసపు తొలివాసరమున రాజ్యమును బడయుదువు. నీకుఁ దరువాత నీవంశమువారికిని రాజ్యము క్రమప్రాప్తమై యుండును. నీవీకోపలనే త్వరపడితివేని నీకును నీవంశమునకును నాశము తప్పదు సుమా!" అని భూత భారతి యొకనాటి రాత్రి యాతని శ్రుతికి సోఁకెను. ఆకతమునఁ బర్వగుప్తుఁడు తా నొనర్పనున్న యభిచారక్రియవలన ఫలములేదని తెలిపికొని యేకాంగసైనికులవలన జడియుచు రాజ్యతృష్ణచే నహర్నిశ మాలోచనాపరుఁడై మతి చెడినవానివలెఁ గనుపడుచుఁ బరితపించుచు గూఢముగ బలమును సేకరించుకొనుచుండెను.

ఇట్లు కొంతకాలము గడచిన పిదప నొకనాఁడు హిమసంపాతముచే జనసంచారములేకుండుట పరికించి పర్వగుప్తుఁడు దాసదివలకు గుప్తపఱచి యున్న సైన్యముతో నకస్మాత్తుగ రాజధాని నరికట్టి తనభావమునకుఁ బ్రాతికూల్యమును గనుపఱచుచుండినవాఁడును మంత్రియునగు 'రామవర్ధనుని' నతని సుతుని' బుద్ధునిఁ దొట్టతొలుత నాకస్మికముగ యుద్ధమున వధించెను.

ఇట్టితఱిఁ బర్వగుప్తుని తండ్రియొక్క వేలావిత్తుఁడు వెంటనే యొక పుష్పమాలను దెచ్చి పర్వగుప్తుని కంఠమున వైచెను. పుష్ప మాలాలంకృతుఁ డైన యతఁడు తోడనే రాచనగరునకు బోయి వక్రాంఘ్రి యను సంగ్రామదేవుని నృపాసనమునుండి క్రిందికిఁ బడవైచి బంధించి యారాత్రి యొకానొక నిగూఢాగారమున నబ్బాలుని సమయింపఁజేసి యాతని కళేబరము మెడకు బండను గట్టించి వితస్తానదియందలి యగాధజలమునందుఁ బాఱవేయించెను.

## పర్వగుప్తుఁడు

పాపియగు పర్వగుప్తుఁ డీరీతిని బాలభూపతినిఁ దుదముట్టించి కవచధారియై కరవాలమును గేలఁ గీలించి యొట్టకేలకు 4024వ లౌకికసంవత్సరమున (క్రీ. శ. 948.) ఫాల్గుణ బహుళ దశమినాఁడు

రాజాసనము నిరాటంకముగ నాక్రమించుకొనెను. పర్వగుప్తుని తాత 'అభినవగుప్తుఁడ'నువాఁడు. అతని యభిజనము 'విశోక' తీర ప్రాంతము. అతఁడు 'గుమస్తా' పని సేయుచు జీవించుచుండెను. అతని కుమారుఁడు సంగ్రామగుప్తుఁడు. ఆ సంగ్రామగుప్తుని సుతుఁడీపర్వగుప్తుఁడు. ఇతఁ డిప్పటి కీవిధముగ గాశ్మీర ధవుఁ డయ్యెను. భాగ్యరేఖల వక్రత్వము వర్ణనాతీత మనుట లక్ష్య లక్షణ సమన్విత మైనది.

ఇదివరకుఁ బర్వగుప్తుని తలంపునకుఁ బ్రాతికూల్యమును జూపి యుండిన వారెల్లరును నతని క్రౌర్యమునకు వెఱగంది తమభావముల నణఁచికొని యుదయముననే పోయి వానిచెంగటఁ దమ ప్రణతులను నివేదించి విధేయతం జూపిరి. ఇఁక ద్రోహవర్తను లైన సామంతరాజులు నేకాంగ సైనికులు మంత్రులును గాయస్థులును పర్వగుప్తునికి భయపడి ద్రోహచింతయం దైకమత్యమును వహించి యుండసాగిరి.

పర్వగుప్తుని యాస్థానమున నొక్కనాఁడు 'సుయ్యవంశ'జుఁడు 'మదనుఁడ'ను నొక యేకాంగ సైనికుఁడు ప్రమాదవశమున 'ఢక్క' విదారణ మొనర్చెను. అందుల కారాజు కోపించి యాసైనికుని విగత వస్త్రునిఁ గావించి తల గడ్డము మీసములు గొరిగించి సన్న్యాసినిఁ గావించి తఱిమి వేసెను. ఆయేకాంగభటుఁ డట్టి వికృతవేషము నొందియుఁ దనదారపుత్రాదులతోఁ గూడి యుండెను. తద్వంశజు లీనాఁడు త్రిపురేశ్వరమున వసించుచున్నారు.

పార్థివుఁ డైన పర్వగుప్తుఁడు ధనార్జనమునకై పూని తనయుద్యోగుల నందులకై పురికొల్పెను. రాజోద్యోగులు ప్రజలపాలి రోగము లనఁదగినవారు. అట్టివారికిఁ బర్వగుప్తుఁ డిప్పు డొసఁగిన యవకాశము మరల వారి యుత్సాహాంకురములకు రుచ్యమగు పానీయము పోసిన ట్లయ్యెను. వారందఱును జలగలువలెఁ బ్రజా రక్తమును బీల్చి కొంత తాము హరించుకొని పరిశిష్టముచేఁ బర్వగుప్తునిఁ దనిపిరి. పాపియగు పర్వగుప్తుఁడును బాపార్జిత మైన యాద్రవ్యముతో స్కందభవనవిహారమునకు సమీపమునఁ బర్వగుప్తేశ్వరాలయము గట్టించెను.

ఒకనాఁడు ధూర్తుఁ డగు నీరాజు శ్రీయశస్కర మహీకాంతుని శుద్ధాంత కాంతలలో మిగుల లావణ్యవతి యయిన యొక యలరుఁబోఁడినిఁ జూచి యామెపై మరులు గొని తనయనురాగమును నాదేవికిఁ దెలియఁబఱచెను. ఆరాజకాంత యప్పు డేమిసేయుదునా! యని మిక్కిలి చింతించి తుద కిట్లు బదులు చెప్పెను. "నానాధుఁడు శ్రీయశస్కరస్వామి యాలయమును గట్టింప మొదలిడి యది సగము పూర్తి యగు నప్పటికే యిహమును బాసి యుండెనుగదా! ఇప్పు డాదేవాలయ నిర్మాణము పూర్తి గావించి తోడనే నీయభీప్సితము నెఱవేర్తును. ఇట్టి నానియమమును బ్రతీక్షింపవలయును." అని బదులు వార్త నంపెను.

ఆయమ్మ మాటలు కామ మోహితుఁ డగు పర్వగుప్తుని యాశ నినుమడింపఁజేసెను. అతఁ డందుకు సమ్మతించి శిల్పులను రావించి "యయ్యాలయమును గొలఁది దినములలోనే రమ్యముగ నిర్మింపుఁడు" అని యాజ్ఞాపించెను. ఆశిల్పులు రాజు నానతిచొప్పున సత్వరముగ నాలయ నిర్మాణమును బరిపూర్ణము గావించిరి. యశస్కరస్వామి కందుఁ బ్రతిష్ఠ జరిగిన తఱువాత యాగశాలలో

హోమకుండమునఁ బూర్ణాహుతి జరుగుచుండెను. అయ్యదనున నారాజకాంత యాజ్యధారలచేఁ బ్రీతుఁడై యుప్పొంగుచున్న యాహవ్యవాహనునకుఁ దనతనువు నర్పింపఁ నిశ్చయించుకొన్నదై ప్రేక్షకుల హాహా కారము లుప్పతిల్లుచుండ నిశ్శంకముగ నాహోమకుండమునందిడి భౌతిక దేహమును బాసెను. హోమాగ్నియందు దగ్ధ మౌచున్న యాసాధ్వీమతల్లి శరీరముపై వినులవాన గురిసెను. ప్రజల వదనములనుండి వెలువడిన యత్యంత పరుషము లగు వర్ణమాలయి తులువ యగు పర్వగుప్తుని ముంచి వేసెను.

ఆసాధ్వి యుక్తి యుక్తముగ నొనర్చిన పావన సాహసముతోఁ బర్వగుప్తుని గర్వ మణఁగుటయె కాక యశస్కర నరేంద్రుని శుద్ధాంత కాంతలకుఁ గల్గియుండిన కౌలీన మను కళంక మెల్లఁ దుడుచుకొని పోయెను.

అనంతరము పర్వగుప్తునకు ద్రోహవర్ధతితో నైశ్వర్యమును బెంచు లోభము మిక్కుటమయ్యెను. తదను గుణముగ నతఁడు సుదీర్ఘము లగు సాహస సన్నాహము లొనర్చువాఁడై దివానిశ మట్టి చింతచేఁ గృశించి కృశించి తృష్ణారోగమునకుఁ జిక్కిపోయెను.

మూఢబుద్ధు లగు లోభు లాదివ్యాధులచేఁ గుందుచుఁ దదుపశాంతికై మిగులఁ బ్రయత్నించి చివరకుఁ జిత్త స్వాస్థ్యము గలుగకుంతు బెటింగియు ద్రోహసంపదకై తాము పడు బాధలనైనను సహింతురు. కాని, లోభమును మాత్రము విడువలేరు.

గీ॥ వ్యాధులు మనోవ్యథలు దీర్ప యత్నములను
జేసి సుస్థితి గానక చివికి చివికి
పోవుచును లోభు లైన కాపురుషు లకట!
ద్రోహ సంపదపై బుద్ధిఁ దొలఁగనీరు.

పుట్టుకతోఁ బుట్టినది పుడకలతోఁగదా పోవును. ప్రాణ సందేహ దశలో నుండియు లోభము సందలి హూనికను విడువఁజాలని యాపర్వగుప్తుఁడు తనయమోఘము లైన కొన్ని ప్రాక్తన కృత్యములచేఁ దుదకు సురేశ్వర క్షేత్రమునఁ బంచత్వము నొందెను. అతఁడు 4026 లౌకికాబ్దమున (క్రి.శ.950) ఆషాఢ బహుళ త్రయోదశినాఁడు ద్రోహార్జిత మగు రాజ్యము నెడఁబాసినవాఁ డయ్యెను.

అతీంద్రియ మగు పరలోక వర్తనము సాధారణ మానవుని మనస్సునకు గోచరింపదు. ఇహలోకమున నొనర్చిన యత్యుత్కట మైన పాపపుఁ బరిపాకమును వెల్లడించుటకై మృతి శీఘ్రముగ సంభవింపకున్నచో దుష్టుఁ డగు మనుజుఁడు కుకృత్యములచే సిరిని గడించుపని యెన్నటికి మానఁడు.

మ॥ పరలోకంబున నేమి యయ్యెడునొ? యె
వ్వం డోపుఁ దర్కింప వి
స్తరమౌ పాపపుఁ బంట నీయిహమునన్
దత్తత్క్షణంబందె దు

ర్భరమౌ దుర్గతిఁ గూలి పోవకయె దు
ర్మార్గుల్ సదా భూతికై
దురితంబుల్ పొనరింప మానుదురె నీ
తుల్ పెక్కు బోధించినన్?

## క్షే మ గు ప్తుఁ డు

పర్వగుప్తుఁడు యముని వీటి కతిథి యైన పిమ్మట నతని కుమారుఁడు 'క్షేమగుప్తుఁడు' రాజాసన మధిష్ఠించెను. అతఁడు నానావిధము లైన మద్యములం గ్రోలుచుఁ గలిమికినిఁ బరవశుని కను జిక్కి మిక్కిలి చిక్కియు నిక్కుచుండెను. అతఁడు స్వాభావికముగనే చెడు నడత గలవాఁడు. దానికిఁదోడుగ నతఁడు దుర్జనులతోడ నేస్త మొనర్చుచుఁ గారు మొగులుచేఁ గ్రమ్మఁబడి కటిక చీఁకటిఁ నెలవగు కృష్ణ పక్షపు క్షపా సమయమువలెఁ బ్రజలకు భయంకరుఁడై కాన్పించుచుండెను. దురాచారులు నిచ్చకము లాడువారును నగు ఫల్గునుఁడు మున్నగువా రనేకు లతని నాశ్రయించి తుల్యము లయిన వేషభాషలతో నతని నెడఁబాయక మెలఁగుచు ధనమును దోఁచుకొను చుండిరి.

ఇంక వెలఁది జూదము, పానము, అనెడు వ్యసనములు క్షేమగుప్తుని శరణుఁ జొచ్చి క్షేమముతో నుండఁగల్గెను. ఇట్లైనను సిరిమాత్ర మతని నెడఁబాయదయ్యెను. ఇట్టిగుణము సిరికి సైజమయినదని చెప్పఁదగును.

రాగియై మధుప్రణయియై యక్షసంగియై కోశసారమును హరించు మధుప సమూహముతో సఖ్య మొనరించునది యైన పద్మము సిరితోడ సంబంధమును దినమెల్లను బడయుచున్నదిగదా! ఆ విధముననే తత్తుల్య గుణుఁడైన వాఁడు మాత్రము సిరి నాకర్షించువాఁ డెట్లు కాక పోవును?

ఉ॥ రాగ పరాయణుండు మధు
రక్తుఁడు నెప్పుడు నక్షకేళి దు
ర్యోగుఁడు కోశ సార హర
ణోద్యత దుర్మధుపాళి చెల్మికిన్.
స్వాగత మిచ్చువాఁడు దివ
సంబున మాత్రమె గూడియుండినన్.
శ్రీ గలవాఁడె యౌచు సర
సీరుహ మట్లు ముదంబుఁ గూర్చెడున్.

కావుననే క్షేమగుప్తుఁడు పానాది వ్యసనములఁ దవిలి యున్నను లక్ష్మి వానిని విడువకయె యుండెను. జిష్ణు పుత్రులయిన 'వామనుఁడు' మున్నగు విటులు క్షేమగుప్తుని మనస్సును బూర్ణముగా నాకర్షింపఁగల్గిరి. ఆనరపతి వామనాదులు గఱపిన యపవిత్ర రుచుల నన్నింటినిఁ బిశాచమువలె మరగి పరులను హేళనము సేయుటయందు నేర్పరియై పరాంగనల బొందుకై మురియుచుఁ బరాధీన బుద్ధియై

-యనర్థ కార్యములందు శ్రద్ధ వహించుచుండెను. ఎవరేని పూజ్యులు తెలియక పొరపాటున రాజుగదా! యని తనకడకు వచ్చినపు డాతడువ వారి మూతిపైనను గడ్డములపైనను నుమిసి కర్ణకఠోరముగఁ దిట్టి తలపైఁ గొట్టి పంపివేయుచుండెను. కటి సంఘటనముచేఁ దన్పునట్టి స్త్రీలను, అశ్లీల సంభాషణ చణు లయిన విటులను, క్షేమగుప్తునికి మిక్కిలి ప్రేమపాత్రు లైరి. ఆదుర్మతి యోలగ మ్మెప్పుడును గులటలతోడను, జారులతోడను, బాలురతోడను, వైధేయులతోడను, ద్రోహులతోడను నిండి యుండున దగుటచే మానవంతు లగు వారెవ్వరు నాదిక్కునకై మొగము పెట్టరైరి. ధూర్తులగు వామనాది విటులు విటగుణములను బాగుగ నలవఱచుకొన్న క్షేమగుప్తునిఁ దమచేతి కీలుబొమ్మనుగాఁ జేసి తమ యిచ్చవచ్చిన ట్లాడించుచుండిరి. విటు లితనిని "నీవు కంకణవర్షివి" అని స్తుతించుటచే నతఁ డుబ్బి పోయి తనచేతికంకణములను వారిపై వర్షింప వానిం గైకొనుచు సంతసంబున నుప్పొంగుచుండెడి వారు. మఱియు నీవిటులు నిర్దోషులందు దోషముల నోపుటవలనను గ్రొత్త క్రొత్త వస్తువులను దెచ్చి చూపుటవలనను, గౌరవము గలవారిని తేని సన్నిధియందు మోదుటవలనను రాజును దృప్తి పఱచుచు వాని యనుగ్రహము వడయఁగల్గిరి.

ఇంతమాత్రమే గాక యానీచు లొకప్పుడు తమపడతులను గుచ కుట్మలములను జఘన సీమలను రాజునకుఁ గానవచ్చున ట్లుండ నియోగించెడి వారు. రాగాంధుఁ డగు నానరపతి యంతట వారి గృహములకుఁ బోయి వారిఁ బొందఁగోరెడి వాఁడు. అయ్యదనున నవ్విటులు మందమతి యగు నారాజాధమునితో జూద మాడి యతనిని నిర్ధనునిఁ జేయుచుండెడి వారు,

ఇంతకంటెను బైపెచ్చుగలదు, సిగ్గులేని యావామనాదులు క్షేమగుప్తునకుఁ దమతమ కాంతలను దార్చుటయందుఁ బరస్పరము స్పర్ధ వహించుచు నతనిం జేరి తమతమ వెలందులం జూపి "యీయువతులందు నేయువిద కొఱకు వదని లావణ్యము గలదియో దేవర నిజానుభవమున నిర్ణయింపఁ దగును." అని పల్కుచుందురు. కామ పరవశుఁడగు నాచెనఁటి తేఁడు వారి కోర్కెల నంగీకరించి తత్కాంతలలో సంభోగ విశేష సౌఖ్య మెవ్వరివలనఁ గలిగె నని మరల తన్నడుగుచుండ నందుకు సంతసించుచు నుత్తమ మధ్యమాధమ బహుమతులను వారివారికిఁ దగిన ట్లొసఁగుచుండెడు వాఁడు.

ఆవిటబృందములో 'హరి'యను వాఁడును 'ధూర్జటి' యనువాఁడును నట్టి నీచ సంభోగపుఁ బందెములందుఁ బాల్గొనరైరి. వారిరువురు మాత్రము తమ తల్లుల పాతివ్రత్యమును గాపాడుచు నిర్ధనులై భిక్షాటనముచే జీవనము గడపఁగల్గిరి.

ఈసందర్భము విమర్శనీయ మగుచున్నది. విటులకు లజ్జాభిమానము లనునవి యిండుసున్నా. వారు నర్మ కథా కథనమునకై తమ శరీరములను బరాధీనము గావింతురు. తమపడఁతుల శీలమును దామె పాడొనర్చి వారి నితరులకుఁ దార్చి తమకులము నంతను బంకిలము నొనర్తురు. చిరకాలము సేవా దుర్గంధ పంక పల్వల సంసక్తులై సౌఖ్యహీన మయిన పంది బ్రతుకుతోఁ దవిలి నొందుచుందురు. ఈశ్రమపడుటయెల్ల ధనము నార్జించుటకే గదా! వారు ధనాశను వదలుకొన్నచో నీచ మగు నిట్టి సేవా వృత్తితో వారికిఁ బని యేముండును?

సీ॥ అభిమానమే లేక యహరహంబును నర్మ
గాథా వినోద కైంకర్య పరము
గాఁ దమతనువులఁ గావించి కాంతల
కులశీలములు మంటఁ గలిపి స్వయము
గా, లుబ్ధభావంబు గరుడు గట్టిన మదిఁ
ద్రవయు నేవయు నుంత దాఁకనీక
యర్థార్థులై గదా! యవనీశులను విటు
లీరీతి సేవింతు రెల్లకాల.

గీ॥ మకట! సౌఖ్యంబు నీఁజాలనట్టి యిట్టి
యధమ వృత్తినిఁ దీరుక యైన లేక
దోచుకొను నట్టి యర్థంబుతోడ వారి
కేసుఖం బౌనొ దేవుఁడే యెఱుఁగవలయు.

ఈరీతి ధన లుబ్ధులైన మానవు లెన్నెన్ని పాట్లో పడుచుందురని యీసందర్భమునఁ దేటపడినది. క్షేమగుప్తుని ధూర్త వర్తన మింకను గలదు. 'భట్టఫల్గునుఁడు' అనువాఁడు తొల్లి యశస్కర మహీపాలుని కడ హితోపదేష్ట యగుమంత్రియై యుండెను. అతఁడు 'ఫల్గునస్వామి' మున్నగు దేవతల ప్రతిష్ఠల నొనర్చి యుండెను. అట్టివాఁడును దుండగీఁడగు క్షేమగుప్తుని దగ్గఱఁ దనజీవితాంతమున నుద్యోగిగా నుండవలసినట్లయ్యెను. హితోపదేష్టయయిన భట్టఫల్గునుని క్షేమగుప్తుఁడు పలుమాఱు పరిహాసించుచుండెను. దుష్టుఁడైన యారాజు ననుకొనవలసిన దేమున్నది? అతనికడ సుఖింపఁగోరి సేవఁ జేయ నలవాటు పడినవారి దురదృష్టమును దిట్టవలయును.

మఱియు నీరాజుకడ 'రక్కుఁడు' అను నొక వృద్ధసేనాని యుండెను. అతని స్వభావము సమీచీన మగునదియే. అయిననేమి? అట్టివానిని సైతము పాపియగు నీభూపుఁడు తిట్టుచుఁ బెక్కువిధముల బాధింపసాగెను. చివరకు రక్కుఁడు క్రూరుఁడగు నీరాజునకుఁ దనపై ద్వేషము లేకుండఁ జేసికొనుటకై తానును దుష్టుల గోష్ఠిలో నవకాశము గల్పించుకొనెను. "మూర్ఖం ఛందానురోధేన" అను సూక్తి కీతని యనుసరణ ముదాహరణముగ నున్న దనవచ్చును.

ఒకప్పుడు 'సంగ్రాముఁడు' అను డామరనాయకునితో నీక్షేమగుప్తునకుఁ బోరు తటస్థించెను. ఆడామరుఁ డాతీవ్రయుద్ధమున నిలువలేక తలదాచుకొనుటకై తన జయేంద్రవిహారములోనికిఁ బోయెను. అంతట నీపార్థివుఁడెట్టి సంకోచమును బొందక యవ్విహారమును బూర్తిగఁ దగులఁబెట్టించి డామరుని రూపుమాపి దగ్ధమైన యవ్విహారమునందలి యిత్తడి బౌద్ధవిగ్రహము లన్నింటిని దీసికొనుటయె గాక యితరము లయిన జీర్ణదేవాలయములందలి రమ్యములయిన శిలలను దీయించి తన రాజధానికిఁ జేర్పించెను. పాషాణ హృదయుఁ డగు క్షేమగుప్తుని కిట్టి కార్య మంత గొప్పదిగాదు. అంతట నీదుష్టమతి కీర్తిని సంపాదింపఁగోరి యాశిలాచయముతోఁ దనరాజధానిలోని యాపణవీధియం దొక యాలయమును గట్టించి యందు 'క్షేమగౌరీశ్వరుని' ప్రతిష్ఠ గావించినవాఁ డయ్యెను.

జగతియం దొకానొకఁడు ధనము సేకరించి కన్ను మూయును. మఱియొకఁడు వానిధనమును బలాత్కారముగఁ గైకొని సంతోషించును. కాని తాను మరణించినపుడు తనధనముగూడ నింకొకని వశ మగునుగదా! యను తలంపు వానికుండదు. ధనతృష్ణగల వారి బ్రతు కిట్టిది యగుటచే వారిని నిందించుటకంటె వారిని లోభాంధకారమున ముంచెడు తదీయ దుష్టసంస్కారమును దూషింపవలయును.

చం॥ ఒకఁడు ధనంబుఁ గూర్చుకొని
యున్నటులుండి నశింప వేఱొకం
డు కలుషజీవనుం డది త
టుక్కున బల్మిమెయిన్ హరించి మో
దకలితుఁడౌ; నతండు మది
"దాను గతించిన దాని నెవ్వడో
యొకఁడు హరించు" నం చెఱుఁగ
నోపఁడు లోభహతాంధచిత్తుఁడై.

పిమ్మట క్షేమగుప్తుఁడు దా నగ్గిపా లొనర్చిన జయేంద్రవిహారమున కుండు గ్రామములు ముప్పదియాఱింటిని తనయధీనము చేసికొని తనదాతృత్వ ఘనతను వెల్లడించుటకై యాగ్రామములను 'ఖశభూపతి' భుక్తికై యొసంగెను. త్యాగమన నిట్టిదని యామూర్ఖుని భ్రాంతి. ఇంక 'లోహరా'ది దుర్గములకుఁ బాలకుఁడును శక్రతుల్యుఁడును నగు 'సింహరాజు' ధూర్తుఁడగు నిట్టి కాశ్మీరపతిని జామాతగాఁ జేసికొనఁగోరి తనకుమారిని 'దిద్దాదేవిని' అతని కొసఁగెను. దిద్దాదేవి మాతామహుఁడు 'భీమశాహి' యనువాఁడు. భీమశాహి 'భీమకేశవస్వామి' కొక గొప్ప ప్రాసాదమును గట్టించెను.

క్షేమగుప్తుఁడు దిద్దాదేవియెడ గాఢానురాగమున మెలఁగుచుండెను. అతఁ డామె యనురాగలతలోఁ జిక్కుకొని 'దిద్దాక్షేముఁ' డనెడి లజ్జావహమయిన ఖ్యాతిని సంపాదించుకొనెను. ద్వారపతియగు 'ఫల్గునుఁడు' తనకుమారిని 'చంద్రలేఖను' క్షేమగుప్తున కిచ్చి పరిణయ మొనర్చెను. అయ్యది కారణముగ దిద్దాదేవి ఫల్గునుని యందు మత్సరముఁ బూని యుండెను.

క్షేమగుప్తుఁడు, ఆయుధ విద్యయం దారితేరిన గడుసరి.ై గురువులకడ శ్రమించి చక్కఁగ శస్త్రవిద్య నభ్యసించి యుండెను. అట్టి విద్య నతఁడు నింద్య కార్యములం దుపయోగపెట్టెను. అతఁడు సంగర రంగములందు నమోఘ పతనమున కుపయోగించెడు ప్రాసాద్యాయుధములను నక్కలను వేఁటాడుటకై యుపయోగించుచు వాని యోగ్యతను గొనియాడెడువాఁడు. క్షేమగుప్తుఁడు నక్కలవేఁట యందు మిక్కిలి మక్కువ గలవాఁడై యనుదిన మడవులకుఁ బోవుచుండ దొంబసమూహము, ఆటవిక జనులును వలలు, ఉరులును, బల్లెములును, ఈఁటెలును దీసికొని యతనినిఁ జుట్టుకొని పోవుచుందురు. వారితోఁగూడఁ గుక్కల గుంపు నడచుచుండును, ఈవింతదృశ్యమును బ్రజలు గుమిగూడి యనుదినముఁ జూచుచుండెడి వారు. ఇవ్విధమున 'దామోదరారణ్యమందును', 'లల్యాన', 'శమికా'ది ప్రదేశములందును నెల్లప్పుడు నక్కల వేఁటాడుటతోఁ బ్రొద్దులు పుచ్చుచుండిన యీరసికునకుఁ బ్రాయ మంతయును జెల్లెను.

అనంతర మొకనాఁడు గృష్ణచతుర్దశియందు మృగయావ్యసని యైన క్షేమగుప్తుఁ డడవికిఁ బోఁగా నందొక సృగాలము పెద్ద బొబ్బ లిడుచుండెను. అతఁడు దాని వెంతకుఁ బోఁగా దాని నోటి యందు గొప్ప మంట యొకటి యాతనికిఁ గాన్పించెను. దానినిఁ జూచి యామృగయావ్యసని మిక్కిలి భయపడి గడగడ వణఁకుచు వెంటనే నగరమునకు మరలి పోయెను. అయ్యది హేతువుగ క్షేమగుప్తున కానాఁడె లూతామయకృత మగు ఘోరమైన జ్వరము తగిలెను. ఆ'లూతావ్యాధి'చే నతని శరీర మంత యును బెట్లిన చిఱుసెనగ లంతటి బొబ్బలతో నిండి పోయెను. క్షేమగుప్తుఁ డావ్యాధి బాధను భరింపలేక తాను ద్వరలో యమసదనమునకుఁ బోవుట తప్పదని తెలిసికొని యేదేని యొక పుణ్యక్షేత్రమున నసు వులం బాయుట మంచిదని తలంచెను. అవసాన దశయం దైనను నతని కిట్టి బుద్ధి పుట్టుట యొక సుకృత మనవచ్చును.

పిమ్మట నతఁడు హుష్కపుర సమీపమునఁ దాను గట్టించిన 'శ్రీకంఠ, క్షేమ, మఠములతో విరాజిల్లు 'వారాహక్షేత్రమును' జేరి యచ్చోట 4034వ లౌకిక హాయనమున (క్రీ.శ.958) పుష్య శుక్ల నవమినాఁడు కాలుని పురి కేగెను.

## అభిమన్యువు

తఱువాత క్షేమగుప్తుని కుమారుఁడు 'అభిమన్యువు' అనువాఁడు గాశ్మీరమునకు రాజయ్యెను. ఇతఁడు తనతండ్రి మరణించు నప్పటికి బాలుఁడై యుండెను. అట్టి తరుణమున సంధి విగ్రహములను జరుపునట్టి సచివులును అంతిపురపు ముఖ్యకార్యములను నడపునట్టి యుద్యోగులును నిర్భయముగ రాజ పదవు పొన్పు శూన్యము గాకుండున ట్లొనర్చుచు భోగము లనుభవింపఁగల్గిరి.

ఈయభిమన్యువు పాలయితగా నున్నపు డొకనాఁడు తుంగేశ్వరమునందలి యంగళ్ళ వీధిలో నకస్మాత్తుగా భయానక మగు గొప్ప యగ్నిజ్వాల మిన్నుముట్టుచుఁ బ్రజ్వలించెను. అవహ్నికీలలు 'వర్ధనస్వామి' పార్శ్వమున నున్న 'భిక్షుకీపారకము' వఱకు వ్యాపించి వేతాల సూత్రపాతస్థము లయిన మహాభవనముల నన్నిటిని నేలమట్టముగఁ గాల్చివేసెను. మఱియు నయ్యనలకీలలు తొల్లి 'దోంబ' చండాలురచేఁ జెడియున్న రాజబంధువుల ప్రాసాదములను భస్మావశేషముగఁ జేసి భూతలమును బావన ముగా నొనర్చెను.

పిమ్మట బాలుఁ డగు నభిమన్యుని గాపాడుచున్న యతని జనని 'దిద్దాదేవి' స్త్రీ స్వభావమును బట్టి తనకర్తవ్యమును గూర్చి గనుగొన్న వారినెల్ల నడిగి తెలిసి కొనుచుఁ జినరకు సార మేది? యసార మెద్ది? యను నిర్ణయము గాననిదియై యుండెను. ఇవ్విధంబున దిద్దాదేవి భర్త మరణించిన తర్వాత దనసపత్ను లెల్లరును సహగమనము సేయుచుండ దానును దంభముతోఁ బతి ననుసరింప నుద్యమిం చెను. ప్రధానమంత్రి యగు 'ఫల్గునుఁడు' తనకొమరితను 'చంద్రలేఖను' రాజున కొసఁగియుండుటయు నాకారణమున దిద్దాదేవి ఫల్గునునిపై వైరముఁ బూని యుండుటయు విదితచరముగదా! ఈసమయమున దిద్దాదేవి దంబముతో "భర్తృ సహగమనము సేయుదును" అని పట్టుదలను జూపుటచే ముఖ్యమంత్రి యగు ఫల్గునుఁ డామె యత్నము నంగీకరించెను.

అప్పుడు దిద్దాదేవి చితివద్దకుఁ బోయి యచ్చోటఁ బశ్చాత్తప్త యగుచునుండఁ, గృహాధిపుఁడగు 'నరవాహనుఁడు' అనుమంత్రి యెట్టకేల కామె నాప్రయత్నమునుండి విరమించునట్లొనర్చెను. అంతట స్వభావ పిశునుఁడైన 'రక్కుఁడు, "ప్రధాని రాజ్యము హరింపఁగోరి యున్నాఁడు" అని శంకించి తన సంశయమును మన్యు దూషితయై యున్న దిద్దాదేవికి రహస్యముగ నెఱుక పఱచెను.

## దిద్దాదేవి

ఇవ్విధమున వైమనస్యముతోఁ గొంత కాలము జరుగ ఫల్గునుఁడు దిద్దాదేవికిఁ దనయెడ సమీచీన భావము లేన ట్లాయాచిహ్నములచే గుర్తించెను. అంతియగాక యామె యితర మంత్రి వర్గముతో నేకీభవించి తనపై వైర మూని విషమ భావముతో నుండుటయు నతఁడు గ్రహించి శంకిత హృదయుఁడై యుండెను. ఏమైననేమి? ఆఫల్గునుఁడు ప్రధాన సచివుఁడు గావున సర్వాధికారము లతని వశమై యున్నవి. అందఱికి నతఁడు బాగుగ నెఱుకపడి యుండెను. మఱియు నతఁడు మంత్ర శౌర్యోత్సాహాది గుణములచే నందఱికంటెను మిన్నయై రాణించుచుండెను.

ఇట్లుండ క్షేమగుప్తుని యస్థులను భాగీరథియందు గలిపి వచ్చుటకై క్షేమగుప్తుని పుత్రుఁడు 'కర్దమరాజు' అనువాఁడు వానినిఁ దీసికొని పయనమై పోయెను. వైరి శంకితుఁడై యున్న ఫల్గునుఁడు నృప మందిరమున విశ్వాసముతో నుండ నిష్టపడని వాఁడై కర్దమరాజు మరల రాజధానికి వచ్చునంత దనుక 'పర్ణోత్సమునందు' నివసింప సంకల్పించి కోశముతోడను ప్రబలమైన బలముతోడను బయన మయ్యెను.

ఫల్గునుఁడు నగరమును వీడి 'కాష్ఠవాటము' చెంతకుఁ బోవునంతలో రక్కాదులచేఁ బ్రేరిత యగు దిద్దాదేవి ఫల్గునుని ప్రయాణ హేతువును శంకించి యతని ప్రార్థనాదికము నైన నెమను చూడక యతనిని హతమార్చుటకు యాష్టికులను బెక్కండ్రను బంపెను. దిద్దాదేవి యొనర్చిన యీపని ఫల్గునునకు నొక క్రొత్త పరిభవముగఁ దోఁచెను. మానవంతుఁ డగు నాతఁ డాకారణమున మిగుల ఖిన్నుఁడై తన యనంత సైన్యముతోడ వెనుకకు మరలి 'వరాహ' క్షేత్రమును జేరెను. ప్రతాప శాలి యగు ఫల్గునుఁడు సైన్య సమేతుఁడై వెనుకకు మరలెనన్న వార్త విని తమపై దండెత్తి పగ దీర్చుకొనుటకు వచ్చుచున్నాఁ డనుశంకతో శ్రీనగరియందు దిద్దాదేవియు నితర మంత్రులును భయకంపితు లగుచుండిరి. కాని, ఫల్గునుఁ డట్టి సంకల్పము గలవాఁడు కాఁడు, అతఁడు 'వరాహక్షేత్రమందు' గతాసువైన క్షేమగుప్తునిఁ దలంచి చాలఁ దడవు విలపించి వరాహస్వామి పాదమూలమునఁ దనశస్త్రము సమర్పించెను. ఆప్రధానమంత్రి యిట్లు శస్త్ర త్యాగము చేయుటచే నితరుల ద్రోహ సంభావనచే దనకుఁ గలిగిన పాపమును రాజమాతకుఁ దనవలనఁ గలిగిన భయమును నొక్కమాఱుగఁ దుడిచి వేసెను.

జగమునందు యుక్తాయుక్త వివేకహీనుని సేవ గొప్ప ప్రమాదమును గల్గించును, అట్టివాఁ డలిగెనేని వాఁడొనర్చు ప్రతీకారక్రియ మిక్కిలి ద్రోహపూరితమై ప్రబలమై యపవాదమునకు మూలమై యుండును. వివేక హీనుని కోపము శస్త్రమునకు శాస్త్రమునకును సంబంధింపక గుణరహితమై యుండును. ఇఁక వివేకవంతుని కొకానొకప్పుడు క్రోధము గలిగినచో నదెట్టిదైనను శాస్త్రమునకుఁ గాని శస్త్రమునకుఁ గాని విగుణమైనది యెంతమాత్రము గాక సజ్జన సమ్మతమై యొప్పుచుండును.

మ॥ ఇది యుక్తం బిది గాదటంచు నెదలో
నీషత్తు గానీ వివే
కదృశ ల్గానని వారిఁ గొల్చుటది దుః
ఖ ప్రాయ మౌ; వారికిన్
మదిఁ గోపంబు జనింప రక్ష కడుఁ దీ
క్ష్ణం; బావరం బైన న
య్యది హీనంబు; వివేకి యల్కఁ గుణ గ
ణ్యం బస్త్రశాస్త్రాద్భృతిన్.

పిమ్మట ఫల్గునుఁడు మెల్లఁగా సైన్య సమేతుఁడై పర్ణోత్సమునకుఁ బోఁగా శ్రీనగరియందు మంత్రు లందఱు నుపాధ్యాయుఁడు లేకుండుటచే బాలు రందఱు సంతసించునట్లు మిగుల సమ్మోదము నొందిరి. రాజమాతయుఁ గరము జాగరూకతతో రాజ్య సంబంధ మైన యోగక్షేమములు స్వయముగ విచారించుకొనుచు వైరి వర్గ మెవ్వరేని యున్నయెడల వారి నుత్పాటించుటకై యనిశమును గనిపెట్టి యుండెను.

తొల్లి పర్వగుప్తుఁడు రాజ్యార్థియై 'భోజుఁడు' 'భూభటుఁడు' అనుమంత్రులు తనపక్షమున నుండుటకై వారితోఁ బ్రమాణ పూర్వక మైన నేస్తము గావించి తనపుత్రికల నిరువురను వారి కిచ్చి రకు నొసఁగి పాణిగ్రహణ మొనర్చెను. ఆభోజ, భూభటులకు 'మహిముఁడు' 'పాటలుఁడు' అను కుమా రులు గల్గిరి. ఆకుమారు లిరువురును రాజ భవనమునందు రాకొమరులవలెఁ బెంపొంది యప్పటినుం డియు రాచనగరునందె యున్నవా రగుటఁజేసి యీయదనున రాజ్య లాలసులై ప్రచండవర్తను లగు హిమ్మకాదులతోఁ గలసి యాలోచించి రాజ్య హరణమునకై ప్రయత్నములు జరుపుచుండిరి.

దిద్దాదేవి యబల యైనను గంటకోత్పాటనమునకై మెలఁకువ వహించి యున్నది. కావున 'మహిమ'పాటలుల' నిద్దఱిని రాజ మందిరమునుండి వెడలఁగొట్టించెను. అంతట వారిర్వురును మిక్కిలి పగఁ బూని తమ గృహంబులందు వసించుచు నప్పుడప్పుడు రాజగృహమునకు వచ్చుచుం బోవుచు నుండిరి.

ఒకనాఁడు రాణియగు దిద్దాదేవి మహిముఁడు రాచనగరునకు వచ్చుచుఁ బోవుచుండుటఁ దెలిసికొని వానిని సంహరించుటకై బహిరంగముగ వేత్రహస్తులను వారివెనుకఁ బంపెను. వాఁ డది తెలిసికొని పరుగిడుచుఁ దనమామ యగు 'శక్తిసేనుని' గృహమునకుఁ బోయెను. బెత్తములవారును వానిని వెంబడించుచు నచ్చోటుం జేరిరి. 'శక్తిసేనుఁడు' యాష్టికులతో సాంత్వన వాక్యములం బల్కుచు వారిని శాంత చిత్తులను జేయ యత్నించెను. కాని, వారు వాని యోదార్పును సరకు సేయక యక్కడ నుండి కదలక పోయిరి. శక్తిసేనుఁ డల్లునిఁ గాపాడుకొనుటకు వేఱు పద్ధతి గానక తానే వ్యక్తముగ నతని కాశ్రయ మిచ్చెను.

మహిమయుఁడు బద్ధాశ్రయుఁ డగు కులుంగి వానిచెలికాండ్రు వెంటనే వానిం గలిసికొనిరి. వారిలో 'హిమ్మకుఁడు' 'మకుటుఁడు' పరిహాసపురాశ్రయుఁ డైన 'యేరమంతుఁడును' 'అమృతాకరుని' నందనుఁ డైన 'శ్రీమదుదయగుప్తుఁడును' లలితాదిత్య పురవాస్తవ్యు డగు 'యశోధరుఁడు' మున్నగు వారును ప్రాముఖ్యము నొందియున్నారు. వీరిలో నొక్కొక్కఁడును సైన్యములతోఁ గూడి వచ్చునేని ప్రజా క్షోభమును బుట్టించు దిట్టలై యుందురు. ఇట్టి తఱి వీరందఱు చేకీభవించిరి. కాన నికఁ గాశ్మీరమున ప్రజా విప్లవము గలుగుట కెట్టి సందియము నుండఁబోదు.

అంతట మహిమాదు లందఱు రాజమాతను బ్రతిఘటించి రాష్ట్రమును ద్వైరాజ్యమును జేయుచు చమూ సమూహములం గూర్చుకొని యుద్ధమునకు బద్ధసన్నాహులై నానావిధము లగు నాయుధములను దీపింపఁజేయుచు 'వర్మస్వామి' యంతికమును జేరిరి.

ఇట్టి భయానక సమయమున రాణియగు దిద్దాదేవిని విడువక యుండిన మంత్రి నరవాహనుఁ డనువాఁ డొక్కఁడే. అతఁడు ద్రోహబుద్ధి లేనివాఁడు గావునఁ దనబంధువర్గముతోడ రాజమాతను విడువక యాశ్రయించియే యుండెను.

అనంతర మారాజ్ఞి వ్యాకుల స్వాంత యగుచుఁ దనకొమరుని సూర మఠమునందు విడిచి యేయుపాయమున నిపుడు వాటిల్లు నపాయమును దప్పించుకొని రాజ్యమును రక్షించు కొనఁదగునో యట్టి పద్ధతులను సమర్థులగు వారి నడిగి తానుగూడ నిపుణముగ నాలోచించెను. చివరకు దిద్దాదేవి లలితాదిత్యపురజులును బ్రాహ్మణులును నగు యశోధరాదులకు మిక్కుటముగ బంగారము నొసఁగి వారిని వేగిరముగ శాత్రవ సంఘమునుండి వేఱుపఱచెను.

మహిమాదు లెల్లరును మొట్టమొదట సంఘీభవించునపుడు "తమలో నెవరికైనను శత్రువు లెదిరించినచో నందఱు నట్టి వైరిపై బడఁబూని వానిని మట్టుపెట్టవలయును." అని యొండొరులు బాసఁజేసి నెయ్యమును జరిపి యుండిరి.

అట్లయ్యు దిద్దాదేవి దానోపాయమున వైరి వారమునుండి యశోధరాదులను భేదింపఁజేసి తనవంకకుఁ ద్రిప్పుకొనెను. ధనయుక్తులకుఁ బ్రమాణము లడ్డుపడవు. పిదప మహిమునియొక్క తక్కిన చెలికాండ్రును దిద్దాదేవితో సంధిచేసికొనిరి. మొదటఁ బగతుర సన్నాహము వినినప్పుడు దిద్దాదేవి యొక్క గోష్పదమాత్రమేని కడవఁగలదని యెవ్వరును దలంపరైరి. అట్టి చిక్కునం బడియుండిన రాజమాత యపార మైన వైరివార మనెడి మహార్ణవమును వాయుపుత్రునిమాడ్కి లీలతో నత్తఱి నుత్తరింపఁ గల్గెను. అంతయును ధనమూలము "ధనమూలమిదంజగత్" అనుసూక్తి యన్వర్థ మైనది.

ప్రపంచమున ననర్ఘము లగు రత్నములను మహౌషధులను సంగ్రహించుటవలన సర్వ వ్యసనములును నశించుచున్నవి. ధనత్యాగమువలన సకల వ్యసనములును విస్తరించుచున్నవి. ఇట్టి విచిత్ర ప్రభావ మగు ధనదేవతకుఁ బెక్కు జోహారు లర్పింపవలయును.

మ॥ మహిమోపేతము లైన యోషధులు ర
మ్యంబుల్ మహారత్నముల్
బహుకష్టంబుల సంగ్రహించి విపదల్
వారింపఁగా వచ్చు; ని
మ్మహి విత్తంబుఁ ద్యజించుటన్ వ్యసనసం
స్పర్శంబె లేకుండుఁగా!
అహహా! విత్తమ నీదు చిత్ర మగు మా
హాత్మ్యంబుఁ గొండాడెదన్.

పదపడి దిద్దాదేవి యశోధరాదులకుఁ గాంచనము లంచ మిచ్చుటే గాక యంతకంటె వారి కధిక మైన యుపకార మొనర్చుట తనకు మంచిదని తలంచి సేనాపతిత్వము మున్నగు నధికారము లను వారి కొసఁగెను. పిదప నామె తనశత్రు వైన మహిముని నాభిచారిక ప్రయోగమునఁ గొలఁది దినములలోనే పొలయించి నిష్కంటకయై మండలమునం దంతట నఖండితాజ్ఞ యగుచుఁ దనరంబా ప్రభుత్వమును విజృంభింపఁజేసెను.

ఇట్లుండఁగా నొకతరుణమున శాహిరాజ్యమున కధిపతి యగు 'థక్కనుని'పై సేనాపతి యైన యశోధరుఁడు గోపించి దాడి వెడలి యతిరయమున నదీ శైల దుర్గములను గడచి థక్కను దేశమును బ్రవేశించెను. యశోధరుఁ డఖండ శక్తి యుతుఁడు. గావున థక్కనుఁ డతనిధాటికి నిలువ లేక బలాత్కారముగ నతనికిఁ బట్టువడి వినతుఁ డయ్యెను. యశోధరుఁడు ప్రణతుం డైన యాథక్క నునివలనఁ గప్పముఁ గైకొని మరల నతవిని వానిరాజ్యమున నిల్పి యభిషేకాంబువులచే నతని రాజ్య శ్రీవల్లి నాప్యాయనపఱచి శ్రీనగరికిఁ బయన మయ్యెను.

ఈలోపల రక్కాదులు మెల్లఁగా రాణి దగ్గఱఁ జొరవ సంపాదించుకొని చమూపతి యగు యశోధరునిపై నేమేమో కొండెములు సెప్పిరి. మూఢమతి యగు దిద్దాదేవి యాఖలుల మాటలు నమ్మి యశోధరునిపై నీర్ష్య వహించిన దయ్యెను.

లోకమునందు శీలరహిత యయిన స్త్రీని అట్టిరాజును సతతము కనిపెట్టి యుండవలయును ఎప్పుడేని యించుక వారి సన్నిధానమును బాసి యుండినచో వారిడెందమునం దితరుల యనురాగము నకుఁ జొరవ దొరకుచుండును. ఇట్లే స్ఫటికముచెంత నెప్పుడు నొక వస్తువున్నను నయ్యది కొంచె మెడ యయినచో దగ్గఱ నుండు మఱియొక వస్తువురం గాస్ఫటికమునందు సంక్రమించునుగదా! మఱియు ధూర్తులు మూర్ఖుల చెంగటను విటకాండ్రు వేశ్యదగ్గఱను, చేటులు ప్రభువులకడను జేరి వారి వారి చిత్తములకుఁ దృప్తి గలిగించు నిచ్చకము లాడి వారి డెందముల నాకర్షించుచుందురు.

చం॥ స్ఫటికపుఱాలు, శీల మెడఁ
బాసిన స్త్రీలు, కుమార్గులౌ నృపుల్
చటుల హృదంతరాళముల
సన్నిధిఁ జేరెడు దుష్ట వర్గమున్

చటుకునఁ జేర్చికొంద్రు పయిఁ
దార్కొను రాగ భరంబుతోడ; న
క్కటకట! యాత్మఁ గైకొనప
గా! తమ యాప్తుల దూరగాములన్.

చం॥ మనసున కింపితంబు లగు
మాటల నేర్చును జూపుచున్ విటుల్
గణికలఁ గూడుచుండెదరు;
కమ్మఁగఁ బల్కుచు ధూర్తులున్ పృథ
గ్జనులను మోసపుచ్చెదరు;
క్ష్మాపతి మాత్రుల పజ్జ నిట్టులే
ఘనులయి గర్వచేటులును
గల్మి హరించెద రాప్తులై భువిన్.

ఇట్లే ప్రకృతమునఁ దులువలగు రక్కాదులు దిద్దాదేవినిఁ దమవంకకుఁ ద్రిప్పుకొని యశోధరుపైఁ జాడీలు చెప్పిరి. ఆరాణియు "యశోధరుఁడు ధక్కుని గాపాడి వానికడ ధనమును గ్రహించి యుండెను. అందువలన నతఁడు రక్కాదులు చెప్పినట్లు ఖలుఁడు ద్రోహియు నగు ననుట తథ్యమే". అని తనలోఁ దాను వాదించుకొని యాసేనానిపై మచ్చర మూని యుండెను.

దిద్దాదేవి యిట్లుండ గెలుపు గొనిన యశోధరుఁ డుత్సాహియై తనయావాసముఁ జేరెను. దిద్ద వెంటనే వానిని నగరమునుండి తఱుమఁగొట్టుటకై ద్రబ్దలవారి నతనికడకుఁ బంపెను. సేనానియుఁ దమసఖుఁడును నైన యశోధరుని రాజమాత యీరీతి నవమానింపఁ బూనుట నెఱింగి యేకాంగతుఁడు హిమ్మకుఁడు మొదలగు వారు తారు తొల్లి చేసికొని యుండు ప్రమాణ పూర్వక మైన సఖ్యమును దల ఖోసి యతిశీఘ్రముగ యశోధరునిఁ జేరి వానిపక్షము నవలంబించిరి. ఇవ్విధముగ సైన్యము భేదించి యిరువక్షములం జేరినను మంత్రి యగు నరవాహనుఁడు దదీయులును మాత్రము తొల్లిటివలె విష్ణుడును దిద్దాదేవిని విడువకయే యుండిరి.

అనంతరము యశోధరుని పక్షమున నుండు 'శుభధరుఁడు' మున్నగు వారు క్రుద్ధులై సేనా సన్నాహములతోఁ బురమును బ్రవేశించుచుండఁగా దిద్దాదేవి మరలఁ దనపుత్రుని 'భట్టారకా' మఠమునందుంచి యప్పటి కప్పు డాత్మ రక్షణము చేసికొనుటకై రాచ నగరులోఁ జేరి యర్గళాదుల బిగించుకొని డాఁగి యుండెను. శుభధరాదులు రాచనగరుం జొచ్చి యొంటిమై యున్న యారాణిని నిర్మూలించి యుండవచ్చు. కాని దురదృష్టమున వారి కాపాటి తెలివి యప్పుడు గలుగలేదు.

అంతట మఱునాఁడే ప్రజానీక మంతయు రాణిపక్షము నాశ్రయించి విజృంభించుటయు నట్టి బలముతో రాజమాత కొకింత స్థైర్యము గలుగుటయు దైవికముగ నేర్పడెను.

అనంతరము శాత్రవ సైన్యము 'జయాభట్టారిక' పార్శ్వమునుండి 'శూరమఠ' సమీపము వఱకును వ్యాపించియుండ నచ్చోటున నిరువాగుల వారికిని దారుణమైన సమర మారంభమయ్యెను. కొంత తడవునకు రాజసైన్యము యశోధరుని వాహిని ధాటికి నోహటిల్లి కాందిశీకమై రాజధానిం బ్రవేశింపఁగా నట్టితఱి నేకాంగ సైనికులు సింహద్వారము ముందఱ వ్యూహములుగ నిలిచి భయపడి పరుగిడిన రాజసైన్యమును నిలిపి శాత్రవసేన నెదిరించిరి. వారు తమశరీరములను తృణమాత్రముగనేని తలంపనివారు. కావున వారితోఁ బోరలేక పగఱ బలగములోఁ గొందఱు వెనుకకు మరలి పోయిరి. ఆసమయముననే 'రాజకులభట్టు' తూర్య ఘోషములచేఁ బగతుర సేనను భేదించుచుఁ దనసైనికుల నానందపఱచుచు నచ్చోటున కేతెంచుటయు సంభవించెను.

'ఆరాజకులభట్టు' రాణిసైన్యమును గలసికొనిన కొలఁదికాలముననే శాత్రవానీకము రూపఱి పోయెను. ఈసందర్భమునుబట్టి శస్త్రదేవత రాజద్రోహ మనెడి తులువతనము సహింపకుండె ననుట విశదమైనది. 'హిమ్మకుఁడు' పెద్దబండలను జూర్ణము చేసియు నినుపసంకెళ్ళను ద్రెంచియు భీమవిక్రముఁడని నిక్కమైన విఖ్యాతినిఁ బడసియుండెను. అట్టివాఁ డీతరుణమున రాజకులభట్టుతోఁ బోరుచు నతనిపైఁ గ్రూరమైన కరవాలమును విసరికొట్టెను. కాని, యాఖడ్గప్రహారమునకు రాజకులభట్టు కవచముపైని చర్మమైనను జిట్లకపోయెను. పరాక్రమశాలియగు హిమ్మకుఁడు పూనికతోడఁ బ్రయోగించిన యమోఘకృపాణము రాజకులభట్టునకుఁ దగిలియు నిష్ఫలమగుట కనులారఁ గాంచి యతని సైన్యము నిర్విణ్ణమగుచుఁ గరము దైన్యము పాలయ్యెను.

అయ్యెడనున రాజకులభట్టు యోధులు హిమ్మకునిఁ బట్టి వధించి నాయకుఁడైన యశోధరునిఁ బట్టికొని బంధించిరి. ఏరమంతుఁడును రణమునందుఁ దనప్రతాపమును మెఱయించుచుఁ గొలఁది కాలము పోరి భగ్నాసియై గుఱ్ఱమునుండి పుడమిపైఁ బడెను. రాజభటు లతనినిఁ గూడ సజీవునిగఁ బట్టికొని శృంఖలాబద్ధునిఁ గావించిరి.

ఇఁక 'సుదయగుప్తుఁడు' రాజబంధువగుటంజేసి యతఁడు శత్రుపక్షమునఁ జేరియున్నను యుద్ధమునందె యతనిఁ బట్టుకొని యవమానించుట కొల్లనివారై యోధు లతని వదలిపెట్టిరి. ఆయుదయగుప్తుఁ డపుడు పదివేలనుకొనుచు నమ్మహానసపురమును వీడి యెటకో పోయెను.

యివ్విధమున నదృష్టశాలిని రాజ్ఞియు నగు దిద్దాదేవి సంగ్రామ విజయశ్రీ గైకొనినదై యశోధరుని, శుభధరుని, మకులుని, వారిబాంధవులను నిరవశేషముగ విగ్రహించెను.

తదుపరి యారాజ్ఞి యుద్ధరంగమునందుఁ బట్టువడి జీవముతో నున్నవాఁడును పరిహాసపురాశ్రయుఁడును శూరుఁడును నైన యేరమంతకుని మెడయందుఁ బెద్ద బండయొకటి గట్టించి యతనిని వితస్తానది యందలి యగాధ జలపూరమునందుఁ ద్రోయించి పగఁదీర్చుకొనెను. ఆయేరమంతుఁడు గయయందుఁ గాశ్మీరయాత్రికులకు విధింపఁబడు శ్రాద్ధశుల్కమును దీసివేసెను. అందువలన గాశ్మీరమునుండి గయకుఁ బోవు యాత్రికులకు గయయందు నివాసగృహము మొదలగు నేర్పాట్లు లోపించిన వయ్యెను. ఆకారణముచే నేరమంతునిపై దిద్దాదేవి మఱింత పగఁబూని తుదకు వాని నీవిధముగ హత మార్చియుండెను.

ఈసంఘటనములు విమర్శించి కనుఁగొనఁగాఁ దేలిన యంశము పరికింతము. శ్రీ లౌకి కాబ్దమున (క్రి.శ.901 Ab) కాశ్మీరభూపతియై యుండిన 'గోపాలనృపాలుఁడు' మొదలుకొని యువ్వటి బాలభూపతియగు నభిమన్యుని వఱకు నఱువదేండ్లు గడచెను. ఈయఱువది యేండ్లలోఁ బదునార్వురు రాజులు గాశ్మీరము నేలిరి. ఆనరపతుల ప్రతాపైశ్వర్యములను హరించిన వారును, స్వామిద్రోహులును నగు మంత్రులు పెక్కండ్రు కాశ్మీరమునందుఁ బాదుకొనియుండిరి. ఆదుష్టమంత్రులందఱును నేటికిఁ దమ బంధువర్గముతోఁగూడ దిద్దాదేవి క్రోధాగ్నిచే నలుక నొందిన దుర్గాదేవి భయంకర భ్రూభంగమాత్ర మున ఘోర రాక్షసులు నశించిపోయినట్లు నిశ్శేషముగ నశించిపోయిరి.

మహోద్ధతులయిన యశోధరాదుల నీవిధముగ నుత్పాటించి దిద్దాదేవి రక్కాదులకు సేనాధి పత్యము మొదలగు కర్మస్థానాధికారముల నొసఁగెను. దిద్దాదేవినిఁ బెక్కు చిక్కులందుఁ గాపాడుచు ద్రోహబుద్ధిలేక కాశ్మీరరాజ్యమును రక్షించుచుండిన మంత్రిప్రకాండుఁడు నరవాహనుఁ డెంతయుఁ బ్రశంసార్హుఁడని చెప్పవలయును. ఆమంత్రి పుంగవుని వలననే దిద్దాదేవి యఖండమైన కాశ్మీర మండ లమున కాఖండలోపమయై నిలువఁగల్గెను.

స్వామిభక్తిపరుఁడై మహోపకారియై యున్న నరవాహన మంత్రియెడ దిద్దాదేవియు నాద రాభిమానములను మెండుగఁ జూపుచు నొక్కనాఁడు మంత్రుల సభలో నరవాహనమంత్రిని 'రాజాన కుఁడు' అను మహా బిరుదముతోఁ బేర్కొని తన కృతజ్ఞతను బ్రకటించెను. ఇంతమాత్రమే గాదు. ఆసచివ వరేణ్యుఁడు భుజించినఁ దాను భుజించుచు, అతఁడు నిద్రించిన నామెయు నిద్రించుచు, అతఁడు సంతసించినఁ దాను సంతుష్టయగుచు, అతఁడు నిర్విణ్ణుఁడయినచోఁ దాను నిర్విణ్ణయగుచు అతని సుఖమే తన సుఖమనియు, నతని దుఃఖమే తన దుఃఖమనియు నెంచుచుండెను. మఱియు నాయమ యనుదినము మొట్టమొదట నరవాహనుని యొక్క యారోగ్యమును దెలిసికొని పిమ్మట వివిధవిషయములం దతఁడొసఁగు హితబోధను మిక్కిలి యక్కఱతో నాలకించి తన కానుక నతని కొసఁగిగాని తృప్తి నొందదయ్యెను.

ఇట్లు కొన్నాళ్ళు జరిగిన తర్వాత దిద్దాదేవి దగ్గఱ కోశాధికారియై యుండిన 'సిందుఁడు' అనువాఁడు రాజ్ఞి చెంగట నిచ్చకము లాడుచునుండెను. తొల్లి క్షేమగుప్తుని పల్లకి మోయుచుండిన 'కుయ్యుఁడు' అనువానికి సింధు, భుయ్యులు అను సుతులు గల్గిరి. జ్యేష్ఠుఁడగు సింధుఁడు పర్వగుప్తుని కడ కోశాధికార పదవి సంపాదించి యుండెను. అతఁడప్పుడే దిద్దాదేవివద్ద నయితము కోశాధ్యక్షుఁడై చిరకాలముండినందునఁ గ్రమముగఁ బ్రధాన కోశాధ్యక్షుఁడు గూడనయ్యెను. అతఁ డయ్యధికారము వడపి కొన్ని క్రొత్తపన్నులను విధించి 'సింధుగంజము' అను కర్మస్థానము నొకటి యేర్పఱచెను. ఈకారణ మున నతఁడు దిద్దాదేవి కత్యంత విశ్వాసపాత్రుఁ డయ్యెను.

ఆసింధుఁడు రాణితో నొకనాఁడు ప్రసంగ వశమున ''నరవాహనుఁడు ప్రబలుఁడై క్రమ ముగఁ దఱచుగ నీరాజ్యము నపహరించియే యున్నాఁడు'' అని పల్కి యందులకుఁ గొన్ని కారణము లను గల్పించి చెప్పెను. కొన్ని దినములకు రాజమాత వాని దురుపదేశమునకు లొంగి యంత పెద్దగ

గౌరవించి యభిమానించిన నరవాహనుని యెడ లోలోన వైముఖ్యమును వహించి నేయబుద్ధియై యుండెను.

ఇట్లుండఁ గొండొకనాఁడు మంత్రియగు నరవాహనుఁడు దిద్దాదేవినిఁ దనయింట విందారగించుటకై రమ్మని ప్రీతితోఁ బ్రార్థింపఁగా నామె 'యట్లె' యని పల్కి తన యనుయాయులతోడ నచ్చటికిఁ బోయి యుండెను. ఆతరుణమున 'సింధుఁడు' గూఢముగ దిద్దాదేవి దగ్గఱ "నరవాహనుఁడు నిన్నిపుడు తప్పక బంధింపనున్నాఁడు. ఇది నిక్కము." అని యామె క్షేమమును గోరి తెలుపువానివలె నచ్చిక యగునట్లు పల్కెను. అందులకారాణి "యట్లయిన నిప్పుడేమిగతి నీవే చెప్పుము" అనియడిగి యతఁడు చెప్పినట్లు యెవరికిఁగాని యేమియుఁ దెల్పక వెంటనే రాచనగరునకుఁ బోయి యేకాంత నివాసముఁజేరి యక్కడనుండి "తాను ఋతుమతియైనట్లు" మాటమాత్రము నరవాహనునకుఁ దెలియఁజేసెను. ఉపచారాదికమును సిద్ధపఱచియున్న తరుణమున రాణి యున్నటులుండి యేమియుం జెప్పక యారీతిం బోవుట నాలోచించి నరవాహనుఁ డామె భావమునందలి మార్పు నూహింపఁగల్గెను. అందువలన నతఁ డప్పటినుండియుఁ దాను మునుపటివలె నామెకు హితము దెల్పుటమానెను. ఆమె యెడ నతనికిఁ గల ప్రీతియు నశించెను.

అది మొదలుకొని రాణికిని నాసచివోత్తమునకును నొండొరుల యెడఁగల యాదరాభిమానములు సన్నగిల్లెను. అయ్యవకాశమును వృథాపుచ్చక సింధు ప్రభృతులు మాయోపాయములను మఱింతగఁ జూపుచు వారిరువుర కొకరియెడ నొకరికిఁ బిణ్యాక సదృశమైన వైరస్యమును బ్రబలఁజేసిరి.

పుడమిపై లోహము లెవ్వియును వజ్రమును భేదింపఁజాలవు. వారి పూరము శైలసేతువులను బగులఁగొట్టలేదు. కాని, దుర్జనుల కభేద్యములగు నవెవ్వియగునా? అను విషయ మూహాకందనిదై యున్నది. దుర్జను లొకప్పుడు బాలురకంటెను గరము మూఢులై యుందురు. ఒక్కొక్కప్పుడు వారు తులువతనమును మెఱయింపఁజేయుచుఁ బ్రతిభాతిశయమున బృహస్పతిని మీఱి యుందురు. ఇట్టి దుర్జాతుల సృష్టికి నెట్టి పరమాణువులు వలయునో దెలిసికొనఁ బ్రహ్మకుఁ దక్క నెరికిఁ దరమగును? కాకి డెందమున విశ్వాసమునకుఁ జోటులేదు. అట్టి వాయసము పరశిశువులను దనవారినిగా విశ్వసించి పెంచుచున్నది. నీరక్షీర విభాగమునకుఁ జాలిన జాణయగు రాయంచ యపారమైన యంబుదమాలఁగని వెఱఁగందుచున్నది. ప్రజల తప్పొప్పులను గనిపెట్టి పాలింపఁగల చతురుఁడగు రాజు ఖలులవచనమును యథార్థమని యొకప్పుడు నమ్ముచున్నాఁడు. సృష్టియం దిట్టి విషయములఁ బరికింపఁ "గాకాదులను దూరుటకంటె నొక్క ప్రకృతియందె వైదగ్ధ్య మౌగ్ధ్యములను మేళగించి సృజించిన విధియొక్క విధానమును నిందించుట సమంజసము." అని యనిపించుచున్నది.

గీ॥ సకల లోహంబులకును వజ్రంబు; వారి
పూరమునకు శిలా సేతువును నభేద్య
మయ్యెడును. కాని, దుర్జనులైనవారి
కేదియు నభేద్యముగఁ దోపదించుకేని.

కం॥ సురగురు విస్మయించు ధిషణయు.
నెవదగు శిశు మౌఢ్య మొకనియందే కలుగన్
ధరసృష్టి సల్పనే యే
పరమాణువులన్ విధాత పరయం గలఁడో

సీ॥ విజ్ఞానమును జూసి వెఱ్ఱిపై కాకంబు
 అన్య సంతతిని స్వీయముగ భ్రమసి
పొదిగి పిల్లల జేసి పోషించుచుండును;
 రాజహంసములు క్షీరమును నీరు
విభజింపఁ గలిగిన విజ్ఞాన సారంబు
 నెనసియు సార విహీన ఘనముఁ
గాంచి భయంబునఁ గనెంచు: లోక మ
 వేక్షించు సూక్ష్మ దృగ్జాలనసంబు

గీ॥ గలుగువారయ్యు నృపతులు ఖలుల మాట
నమ్మి మెలఁగుదు రిదె చిత్రమ్ము గాఁగఁ
గౌశలంబును మౌగ్ధ్య మొక్కటనె చేర్చి
వేడ్క విహరించు విధికి వేవేలనతులు.

ఇట్లు దిద్దాదేవి చెవులకు ధూర్తవచనములు సమ్మతమైనవి. సదాచరణ విహీనయైన యారాజ్ఞి యాచారహీనుండును శ్రుతిబాహ్యుండును నగు మూఢవిప్రుఁడు నిందాపాత్రుఁడగునట్లు సజ్జన దూషిత యయ్యెను.

పిమ్మట నారాజ్ఞి యెల్లప్పుడును నరవాహనుని డెందమునకు బాధగల్గు కార్యములను జేయసాగెను. ఆమంత్రియు నామె యొనర్చు దుండగములను గొంతకాలము వఱకు నోర్చియే యుండెను. కాని రాణిబుద్ధి మాత్రము ఋజుమార్గము పట్టలేదు. అంతట నమ్మంత్రి పుంగవుఁడు దిద్దాదేవి దుశ్చర్యను సహింపలేక "తానింక జీవించుటే సమంజసము గాదు" అని తలంచి యాత్మహత్యచే నిహలోకముఁ బాసెను. దుష్టుని దుండగ మప్రతీకారమయినపుడు కీర్తికాములగువారు తమ తేజస్సుచేఁ దామే తపించుచుందురు. అట్టివారికి మరణము దక్క వేఱు శరణ మేమున్నది?

చం॥ బహువిధములౌ ప్రతిక్రియల
 భంగము నొందక దుష్టకార్య ధూ
ర్వహతఁ జెలంగు వారిఁగని
 రమ్య యశోవిభ వార్ధి మానసం
బహరహ మాత్మ తేజమున
 కాహుతిఁ జేయుచుఁ గుందు; వానికి

ముహమున దిక్కు మృత్యువాక
చే గదః యెంత దలంచి చూచినన్,

అమాత్యశేఖరుఁ డగు నరవాహనునిఁ గోల్పోయిన కాశ్మీర రాజ్యలక్ష్మి చంద్రుఁడు లేని రాత్రివలెను సత్యవిముక్త యగు భారతి చందమునను వించుకేని రాణింపదయ్యెను.

గీ॥ చంద్రమ శ్శ్రీ విహీనయౌ శర్వరివలె
సత్య సంపృక్త గాని భాషయును వోలెఁ
బ్రజల రంజింపఁజేసెడు ప్రభువు లేని
రాజ్యలక్ష్మి యెడారి పెన్రక్కసి గదః

దిద్దాదేవి తనక్రౌర్యాభ్యాసము నంతటితో విడువక డామర సంగ్రాముని పుత్రులను బలి మూర్పఁ బ్రయత్నించెను. వారు మిగులఁ గడిమి గలవారు. దిద్దాదేవికి సమీపస్థులు నగుటచే నామె వారిని మట్టుపెట్టుట క్షేమకర మని యట్లుద్యమించెను. కాని, వారారాణి పన్నుగడలం దెలిసికొని యచ్చట నున్నఁ దమకు ముప్పు వాటిల్లు ననెడి భయముతో దిద్దాదేవికి దూరమున నుండుటకై 'యుత్తరఘోష' మను నిజావాసమును జేరిరి. అచ్చట ద్వారపతి యైన 'కుయ్యుఁడు' మున్నగు వారికిని సంగ్రాముని కుమారులకును బోరు జరిగెను. ఆకయ్యమున వారు కుయ్యాదుల నణఁచివేసి యచ్చట నిష్కంటక ముగ నిలిచిరి.

దిద్దాదేవి యాసంగ్రాముని సుతులఁ దలపోసి వారు ప్రబలులై తనపై దండెత్తుదురేమో యని భయపడుచుఁ ద్రపారహితయై మరల నెట్లేని వారి నూరడించి శాంతచిత్తులను జేయుటకుఁ గరము ప్రయత్నించెను. స్వార్థపరులగువారి కభిమాన మెక్కడిది? అయినను వారు దిద్దాదేవి యంతికమున నుండ నియ్యకొననివారై 'స్థానేశ్వరుఁడు' మున్నగు వారితోడను నితర డామరులతోడను గలసి మఱింత విజృంభించిరి.

ఇది ఇట్లుండ సేనాపతి యగు ఏక్కుఁడు కాలధర్మము నొందెను. అంత నారాజ్ఞి తన పక్షము బలహీనమగుటయే గాక యెదిరి పక్షము మిగుల నుండుటచే రాజ్య రక్షణోపాయమును గానక మిక్కిలి భయ భ్రాంతయై తగిన వీరుని రాజ్యమున నిలుపఁగోరి సన్యస్తశస్త్రుఁడై యున్న ఫల్గునుని కడకుఁ బోయి యతని పేవిధములఁ బ్రార్థించి మరల రాష్ట్రమునకు నతనిఁ దోడ్కొనివచ్చెను.

ఫల్గునుఁడు శస్త్రసన్న్యాస మొనర్చియు దిద్దాదేవి ప్రార్థనముచే రాజ కార్యములను నిర్వహించుటకు మరల శస్త్రమును బట్టెను. "ఇంతకు భోగ వాసన దుస్త్యజ మనుట నిక్కము." అని యంగీకరింపవచ్చును. రాజపురి మున్నగు వానిని జయించిన ఫల్గుని పూర్వ విక్రమము మిగులనద్భుత మైనది, అట్టి పరాక్రమము నేఁ డీవృద్ధ బంధకిచేఁ దిరోహితమై పోయెను.

దిద్దాదేవి సోదరుఁడు. 'ఉదయరాజ'నువాఁడు, వానికిఁ బ్రియతరుఁడైన హితుఁడు, 'ఉదయ గుప్తుఁడు'. కుబుద్ధి యగు నీయుదయగుప్తుఁడు 'అక్షపటలము'నందు సహాయుఁడై యుండి తనకుఁ

దోడుగఁ గ్రూరవర్తను లయిన మఱికొంద ఱధికారులను గూర్చికొని కాశ్మీరమును గొల్లఁగొట్టి నాశంపించెను. అందుకు గాశ్మీరదేశము గూడఁ బెట్టుకొన్న దుష్కృతమే మూలము గావలయును. ఆసమయమున దుశ్శీల యగు తనతల్లి చేసిన పాపములు పండియుండుటం జేసి యభిమన్యుఁడు క్షయరోగ గ్రస్తుఁ డయ్యెను.

'అభిమన్యుఁడు' గొప్ప పాండిత్యమును గడించెను. అతని విశాల లోచనములు తెల్ల దామరలవలె మిగుల నందముగ నుండును. విద్వాంసుల కౌముదు లెల్లప నతని మిక్కిలి గౌరవముతోఁ జూచుచుండిరి. తారుణ్య వైదుష్యము లతనికిఁ దొడుగని తొడవులై యొప్పారెను. ఇట్టి పరిశుద్ధాత్ముఁ డగు నభిమన్యునికి మాతృదోషము శిరీషకుసుమమునకు సూర్యుని వేడిమివలె శోషదాయి యయ్యెను. ఇట్లు క్షయరోగముచేఁ బీడింపఁబడుచుండిన యీ రాజచంద్రుఁడు తరుణవయస్కుఁడుగ నున్నపుడే కాలుఁడను రాహువుచే గ్రసింపఁబడెను. సప్తర్షి 4048 వ లౌకికహాయనమున (క్రీ. శ. ఎ. డి. 972.) కార్తిక శుక్ల పక్ష తృతీయ నాఁడీతఁడు పరలోకము నొందెను.

## నందిగుప్తుఁడు

అనంతరము, అభిమన్యుని సుతుఁడు 'నందిగుప్తుఁడు' రాజాసనమున నిలుపఁబడెను. ఈనంది గుప్తుఁడును బాలుఁడే. దిద్దాదేవి పౌత్రుని పట్టాభిషేకముచే సూరట నొందలేదు. ఆమెకుఁ బుత్రదుఃఖము హృదయమునకుఁ జాల వ్రేగై యుండ దానిమూలమున నామెయొక్క క్రౌర్యగుణము లీనమై పోయెను. కావుననే సూర్యకాంత శిలాక చీఁకటిలో నున్నపుడు తన యూష్మ వైకృతినిఁ గోల్పోయి ప్రశాంతి వడయునట్లు దిద్దాదేవి పుత్ర దుఃఖముచేఁ గూశతనమును బాసి శాంతగుణ యయ్యెను.

అప్పటినుండి యారాణి ధర్మకార్య పరతంత్రయై నానావిధము లయిన ధర్మకార్యములందుఁ బాల్గొనుచుండుటవలన నామె తొల్లి కుకర్మలచే నార్జించి యుండిన సిరియు నిపుడు పవిత్రత నొందెను. సింధుని సోదరుఁడును, నగర పాలకుఁడును నగు 'భుయ్యుఁడు' సద్భావము గలవాఁడు. కావున నితఁడు దిద్దాదేవి ధర్మకార్యములకుఁ బరిపోషకుఁడుగ నుండి యుండెను.

ఇట్లు దిద్దాదేవి తనశుభవర్తనముచే బూర్వ పాపమును నిర్మూలించుచుఁ బ్రజల డెందము లందుఁ గొంగ్రొత్త లగు రాగాంకురములను మోసులెత్తించి యది మొదలు సర్వ జన సమ్మతయై శోభిల్ల సాగెను.

అమాత్యుఁడగు ఫల్గునుని స్వభావము తీక్ష్ణము గాక ప్రశాంతమై యుండెను. అట్టిమంత్రి రాష్ట్రమునకు దొరకుట దుర్లభ మనఁదగి యుండెను. ప్రసన్న హృదయుఁడగు నమాత్యునితో నొప్పుచుండెడు రాజు హేమంత కాలపు సూర్యునివలె సుఖ సేవ్యుఁ డగుచుండును.

ఇట్టి సమయమున దిద్దాదేవి విపన్నుఁ డైన తనతనయుని యాత్మ ధన్యత నొందుటకై 'యభిమన్యు పురమును' గట్టించి యభిమన్యు స్వామినిఁ బ్రతిష్ఠించెను. పిమ్మట 'దిద్దాపురమును' గట్టించి యా నగరమునందు 'దిద్దాస్వామినిఁ' బ్రతిష్ఠించి యందే యొక మఠమును మధ్య దేశీయులకును లాటదేశీయులకును, సౌరాష్ట్రులకును నివాసభవనముగఁ గట్టించెను.

మఱియు నారాణి 'కంకణవర్షుఁడు' అను బిరుదు నొందిన తనభర్తకు మఱింత సుకృతము గల్గుటకై యర్థులకు సువర్ణ మొసఁగుచుఁ 'గంకణపురమును' గట్టించి దిద్దాస్వామికి శ్వేత శిలామయ మయిన గొప్ప యాలయము నిర్మింపఁ జేసెను. ఆ యాలయము హిమవత్పాదమునఁ బుట్టిన గంగా తరంగిణి యొక్క యభంగ తరంగములచే క్షాళితమై యట్టి ధావళ్యము నొంది యుండెనో! యన నొప్పారుచుండెను. వెండియు నారాణి దైశికులగు బ్రాహ్మణుల కొకమఠమును గాశ్మీరజులకు నత్యున్నత మైన చతుశ్శాలము గల యొక రమ్యవిహారమును గట్టించి తనతండ్రి యగు 'సింహరాజు' పేర ప్రఖ్యాత మగుటకై 'సింహస్వామి' ప్రతిష్ఠ సల్పెను.

వితస్తా సింధు సంగమము దిద్దాదేవి గట్టించిన పవిత్ర మఠములతోడను విష్ణ్వాలయముల తోడను నితరము లయిన వివిధ ప్రతిష్ఠలతోడను నిండి మిగుల పావన మయ్యెను. పెక్కు విధములఁ జెప్పనేల? ఆ యా ప్రదేశములందు దిద్దాదేవి సల్పిన ప్రతిష్ఠలన్నియు నఱువదినాల్గని తెలియుచున్నది. తొల్లి యాకస్మికముగ వాటిల్లిన యగ్నిప్రమాదమునఁ బెక్కు ప్రాకారములు రూపఱి పోయెను. దిద్దా దేవి యాజీర్ణ దేవాలయములను శిలామయ ప్రాకార వలయములతోడఁ బునరుద్ధరించెను.

దిద్దాదేవి పంగువు (ఈఁచపోయినకాళ్ళుగలది) అయినను నామె క్రీడలయందుఁ బాల్గొను చుండెడిది. అట్టి తరుణములందు 'వల్గ' యను నామము గల యొక పనికత్తె రాణి దగ్గఱ విగ్రహ వాహినిగా నుండెను. దిద్దాదేవి విగ్రహవాహిని యైన వల్గపేరు వన్నె కెక్కుటకై 'వల్గామఠమును' సైతము గట్టించెను.

దిద్దాదేవి యిన్ని పుణ్య కృత్యము లాచరించినను నామెకుఁ గ్రౌర్యము సహజ గుణమై యుండెను. శమగుణము తాత్కాలికముగ నేర్పడినది. అందువలనఁ గలుష కృత్యము లెప్పటికిని మాని యుండు ననెడి నిర్ణయము లేకపోయెను.

జగమునందు, తిమి యను పెద్దచేఁప తీర్థ సేవన మౌనములు గలది యయినను దన వంశమునఁ బుట్టిన మీనములను గబళింప నాసక్తి గల్గియుండును. నెమలి యెల్లపుడు మేఘోదకము నకై యాసించి యుండునదైనను వాతాశనములగు భుజంగములను గ్రసించును. బకము తన ధ్యాన పరవశత్వమును బ్రకటించుచు విశ్వాసముతోడఁ జెంతఁ జేరిన మీలను దటుక్కున నోట వైచుకొను చున్నది. ఇట్లే పాపులు సత్క్రియల నాచరించు చుండినను దుష్కృత్యములను మాని యుందు రనెడి నిర్ణయము లేదనుట దీన విదిత మగుచున్నది.

మ॥ ఘన నిర్ముక్త పయోర్థి యౌ నెమలి కా
క్షన్ మ్రింగు వాతాశనం
బును దీర్థంబుల మౌని యౌ తిమి కులం
బున్ స్వీయమున్ మ్రింగు; ధ్యా
న నిమగ్నంబు బకంబు నమ్మి తనచెం
తన్ జేరు మీనంబులన్

ఏనుఁగాపుల్ విడఁబోరు పాపమునఁ బ్రీ
తిన్ సత్క్రియారంభులై

దుష్ట వర్తన యగు 'దిద్ద'యొక్క సంవత్సరములోననే పుత్ర దుఃఖము నుండి పోలు మరల భోగాసక్తయై యర్భకుఁడు తనపౌత్రుఁడును నగు నందిగుప్తునిఁ గడతేర్చుటకై యుతని నాభిచారిక ప్రయోగమును జేయించెను. ఆ కారణమున నతఁడు 4049 లౌకికాబ్దమున (క్రీ. శ. 973 ఎ డి.) మార్గశీర్ష శుక్ల ద్వాదశి నాఁడు విగత జీవుఁ డయ్యెను. పిమ్మట నారక్కసి 'త్రిభువనుఁడు' అనుపేరు గల తనమనుమని మఱియొకనిఁ గూడ నభిచారక్రియ మూలముననే 4051 లౌకిక వత్సరమున (క్రీ. శ. (క్రీ. శ. 973 ఎ డి) మార్గశీర్ష శుద్ధ పంచమినాఁడు తుద ముట్టించెను.

క్రూరచిత్తయగు దిద్ద కింకను 'భీమగుప్తుఁడు' అను మూడవ పౌత్రుఁ డొకఁ డుండెను. క్రమప్రాప్తుఁడైయున్న యీ బాలుని దుష్టురాలగు నారాణి రాజ్య మనెడి మృత్యుమార్గమున స్వేచ్ఛగాఁ బ్రవేశపెట్టిన దయ్యెను.

దుష్ట యగు దిద్ద. యింతవఱకును వృద్ధుఁ డగు ఫల్గున మంత్రియందలి గౌరవమువలనఁ దనదౌశ్శీల్యమును క్రౌర్యమును బ్రకటము గానీక యెట్లో గూఢముగ నుంచుకొనుచుండెను. ఈ తరుణముననే యా వృద్ధమంత్రియుఁ గాలుని పిలుపు ననుసరించినవాఁ డయ్యెను. ఇంక నామె స్వైర వృత్తి కాటంక మేమున్నది!

అనంతర మా'దిద్ద' శతముల కొలఁది దుష్టచేష్టలు సుస్పష్టముగఁ జేయుచు మదోత్కటయై ముఖపటము జారిపోఁగా గన్పించు నట్టి మదపుటేనుఁగుయొక్క యుత్కట మూర్తివలెఁ జూపఱకు వ్రేఁకనయై దోఁచెను.

స్త్రీలు మహాభిజన సంజాతలైనను వారిమనోవృత్తి నింద్యము. అయ్యది సహజముగ మహానదుల ప్రవాహమువలె నిమ్నానుసారియై యుండును. సరిత్పతియు నపాంపతియునగు సాగరునకు లక్ష్మీదేవి గారాబు కొమరితగదా! అట్టిలక్ష్మి యెక్కడ? అల్పతి జలము గల జలాశయము లెక్కడ? వానియందలి జలమునం దావాసము సల్పు టేటిపని? కావున లోకమున స్త్రీలు మహావంశమునఁ బుట్టిన వారలైనను సామాన్యముగ నీచ భోగ్య లగుట సహజమై యున్నది.

ఉ॥ ఎంతటి గొప్ప వంశమున
నింతులు పుట్టిన నేమి? చీ! కటా!
స్వాంతమునన్ స్వభావజ మ
సాధువు శీలము వీడకుందు; రెం
తెంతొ సమున్నతం బగు గి
రీంద్రమునుండి జనించు వాహినుల్
ఎంతగు నిమ్నగాత్వమును
వీడవుగా యెవ రేమి చేసినన్.

మ॥ విలస ద్దివ్య నదీ విధుత్వమున ను
ర్వీ న్నేరు గన్నట్టి యా
జలధిన్ బుట్టువుఁ గాంచి యల్ప జల కా
సారంబునన్ విప్పు మో
డ్పులతో నుండెడు పంకజంబు నిలయం
బు న్జేసె శ్రీదేవి; వా
మలు సద్వంశజ లయ్యు నీచుల వరిం
పన్ శంక లేకుండ్రుగా ।

'పర్ణోత్సము'నందలి 'బద్దివాసమ'ను గ్రామమున 'బాణుఁడు' అను పేరుగల ఖశుఁ డొకఁ డుండెను. అతని సుతుఁడు 'తుంగుఁడు' అనువాఁడు. అతఁడు మహిషముల కాపరిగానుండెను. అతనికి 'సుగంధిసింహుఁడు' నాగుఁడు 'అట్టాయకుఁడు' 'షణ్ముఖుఁడు' అనెడువా రేవురు సోదరులు గలరు. 'ఆతుంగుఁడు' తనసోదరులతోఁగూడఁ గాశ్మీరమునకు వచ్చి యచట లేఖాహారక వృత్తిని సంపాదించెను. అట్లతఁడు లేఖలను గొనిపోవుచు వచ్చుచు నుండి యొకప్పుడు సాంధివిగ్రహికుఁడయిన మంత్రి చెంగట లేఖలను దీసికొని పోవుటకై వచ్చియుండ గులట యగు 'దిద్ద' వానిం గాంచి మోహ పరవశ యయ్యెను. పెక్కండ్రు జారులను గూడి తనిసి యుండిన దిద్దకు యువకుఁడైన యాలేఖా హారకుఁడు నయితము మనోహరుఁడయ్యెను. ఇంతకు భావ్యర్థపుఁ బ్రాబల్య మట్లున్నది. కావుననే యారాణి యొక దూతినిఁ బంపి యాలేఖా హారకుని రహస్యముగ నంతఃపురములోనికి రావించుకొనెను.

అప్పటినుండియు సిగ్గు మాలిన యారాణి తుంగునియెడ నుత్తుంగానురాగమును జూపుచు వలపు వలలోఁ దగుల్కొని యుండఁ బురపాలకుఁ డగు భుయ్యుఁ డామె దౌశ్శీల్యమును దెలిసికొని యామె చెడు నడతకుఁ దనవైముఖ్యమును గనఁబఱచెను. పాంసుల యగు నారాణి భుయ్యుని యాటంకము తనకేల యని యతనిపైఁ గినిసి గూఢముగ విషము నిప్పించి యతనిని మృత్యు ముఖమునఁ ద్రోయించెను.

దుష్టులు విషమచిత్తులు నగు పాలక వర్గము వారి వర్తనము మిక్కిలి ప్రమాదకర మైనది. వారికి సంతోషము గలిగినపుడు ఫలశూన్యమైన స్తుతితో ముగింతురు. ఇంచుక దొసఁ గేర్పడినచో ధన ప్రాణములను హరింతురు.

గీ॥ విషమ చిత్తులు నృపులు వివేక శూన్యు
లెంతయును నింద్యు లే మనః సంతసంబు
గన్నచో వారు ఫల మది సున్న; ఇంక
నలుగుచోఁ బ్రాణ ధన హాని యగును జూవె,

ప్రకృతమునఁ బాంసుల యగు 'దిద్ద' సుస్వభావుఁడగు భుయ్యుని యధికార పదవియందు- రక్కుని కుమారుఁ డగు దేవకలశుని నియోగించెను. దేవకలశుఁడు వేలావిత్తుఁడుగ నుండి విటవర్త

నుఁడై రాణివద్ద తార్పుకాఁడై సిగ్గులేక మెలఁగుచుండెను. ద్వారాధిపత్యము మొదలుగాఁగల ముఖ్యాధికారమును వహించిన వారును వీరులును నగు కర్దమరాజాదులే దిద్దకుఁ గుంటెనకాండ్రుగా వర్తించిరని యన్నచో నిఁక నితరుల గణింపనేల?

ఆపాపజాతి యీరీతిఁ గుటిలవర్తనయై యుండ సర్భకుఁడయిన భీమగుప్తునికి రాజమందిరమునందు నాలుగైదు వత్సరములు గడచెను. అది మొదలతని బుద్ధి యించించుక వికసించుటచే నంతట నతఁడు "పితామహియొక్క పాశ్చల్యమును రాజ్యాంగముల లోపమును బోఁగొట్టి కాశ్మీర వసుంధరను రాజన్వతిగాఁ జేయవలయును. అని సంకల్పించి యుండ బంధకి యగు 'దిద్ద' యతని యింగిత మెఱిఁగి యతని నెట్లు కడతేర్పవలయునా! అని యాలోచింప మొదలుపెట్టెను. ఇది వఱకిద్దఱు పౌత్రులను దుదముట్టించిన యాపాపాత్మురాలికి మూఁడవవాని విషయమునఁ గరుణ యుండునా? ఆమె కంగ వైకల్యమువలె దురాచారము కరుణ లేమియు నైసర్గికములై యున్నవి.

ఇఁక భీమగుప్తుఁడట్లు సుస్వభావుఁడగుట కతని కులీనత యొక హేతువు. రెండవకారణమతని తల్లి (అభిమన్యుపత్ని) యతనికి దిద్దయొక్క దుశ్శీలతను గుఱించి గూఢముగ నెఱింగించి యుండుట, అతఁ డెట్టివాఁడైననేమి? దిద్ద యనెడి మిత్తి యతనిఁ జూడలేక పోయెను.

పిదప నా దురాత్మురాలు దేవకలశునితో నాలోచించి భీమగుప్తుని గూర్చి శంకించుచు నతఁడు తనపౌత్రుఁడను నభిమానమైన లేక ప్రకటముగ నతనిం జెఱయందుంచెను. ప్రజలు "చిన్నలగు నంది గుప్తాదులను మంత్ర ప్రయోగమునఁ జంపించిన దెవరా? యని శంకించుచుండిరి కాని, 'దిద్ద' యిప్పుడు వారి కట్టి సందియము గలుగకుండునట్లు స్పష్టముగ భీమగుప్తునిఁ జెఱఁబెట్టి యతనిఁ బెక్కు యాతనలచేఁ బీడించెను. పాపము. భీమగుప్తుఁడు తుద కాకారణమున మరణించుటయు వెంటనే యపవిత్ర చారిత్ర యగు దిద్ద స్వయముగ నృపాసన మాక్రమించుటయు జరిగెను. ఆమె 4056 లౌకిక వత్సరమున (క్రీ. శ. 980 - 81 ఎడి.) సింహాసన మెక్కినది, అది మొదలాదిద్ద పట్టపగ్గములు లేనిదై దినదినమును మఱింత రాగోద్రేకమునఁ బొంగుచు తనవలపుకాఁడగు తుంగునిఁ గూడి స్వేచ్ఛగాఁ బ్రొద్దులు పుచ్చసాగెను. ఆతుంగుఁడును దానే సర్వాధికారియై తనసోదరులకుఁ బ్రధానాధికారముల నొసఁగి పూర్వమంత్రుల నెల్లరను ధిక్కరించి తనయాన చొప్పున వర్తించువారినిఁగా నొనర్చెను.

అంత నమ్మంత్రులెల్ల రేకీభవించి తమపదవులయెడ విరక్తులై రాజ్య విప్లవమునకై ప్రయత్నించుచు దిద్దాదేవి సోదరుని కుమారుఁడగు 'విగ్రహరాజును' గలసికొని వానినిఁ దమపక్షమునకు ద్రిప్పుకొనిరి. ఆవిగ్రహరాజు ప్రచండ పౌరుషుఁడు అట్టివాఁడు కావుననే మంత్రివర్గము వాని నాశ్రయించి విప్లవ నాయకునిఁగా నతనిం బురికొల్పెను. అంత నతఁడు మంత్రివర్గముయొక్క ప్రేరణముచేఁ గాశ్మీరమున కేతెంచి యచ్చటి ప్రధానాగ్రహారముల ననుభవించు బ్రాహ్మణులను జేరి వారితోఁ బెక్కు విధముల ముచ్చటించి "రాజ్య విప్లవమునకై ప్రాయోపవేశముఁ జేయుఁడు." అని వారిసఁ బ్రేరేచెను.

అంతల కొం బ్రాహ్మణు లియ్యకొని యొక్కమొగి ప్రాయోపవిష్టులై యుండఁగనే ప్రజలు తదనుగుణముగ విప్లవకారులై ప్రబలుచుండిరి. ఈతరుణముననే విగ్రహరాజు జనితము తుంగుని తుద ముట్టించుటకై తగిన యదను గూఢముగ నన్వేషించుచుండెను.

దిద్దయు వానితలంపు పొలఁకువ నెఱింగి తుంగుని రక్షించుటకై యొక హర్మ్యమునందు వాని నుంచి తద్ద్వారమును బంధించి పోరు జరుగునన్న శంకతోఁ గొన్ని దినము లట్లే గడపును. ఈలోపల రహస్యముగఁ బ్రాయోపవిష్టులై యుండిన యావిప్రులలో 'సుమనోమంతకుఁడు' మున్నగు వారికి బంగారము పెచ్చుగ నొసఁగి బ్రాహ్మణులచేఁ బ్రాయోపవేశము మాన్పించి వారినిఁ దనపక్షము నకుఁ ద్రిప్పికొనెను. బాడబులు ప్రాయోపవేశము మానుటచే లోకుల యలజడియుఁ జాలవఱకుఁ దగ్గెను.

యుక్తిశాలిని యగు దిద్ద రాష్ట్రమునందు విప్లవము విజృంభింపనున్నప్పుడు దానోపాయ మున నీవిధముగ వారించి యుండ విగ్రహరాజు భగ్నోత్సాహుఁడై మరలఁ దనదారిఁ బట్టి పోయెను.

తరువాతఁ దుంగుఁడు మొదలగువారు మరల మెల్లగాఁ బ్రభుశక్తి సంపన్నులై రాష్ట్రమున విప్లవమును బురికొల్పిన కర్దమరాజాదులను హింసించిరి. ఇంతకుముందు తుంగాదులు రక్కని సుతుఁడు 'సులక్కణుఁడు' మున్నగువారు మంత్రులు గానుండ వారిపైఁ గోపించి వారినిఁ బదభ్రష్టులను జేసి తఱిమివేసిరి. అట్టివా రిప్పుడు మరల వారినిఁ బ్రీతితో దగ్గఱఁ జేర్చి పదవుల నొసఁగి యాదరించిరి. తులువలతోడి సంబంధము ముల్లునకు నరఁటియాకునకుఁ గల పొత్తువంటిదని తెలియుచున్నది.

ఇట్లు కొన్నాళ్ళు జరుగఁగా భగ్నకార్యుఁడైన విగ్రహరాజు మిక్కుటమైన పగతో బ్రాహ్మణుల కడకు గూఢచారులను బంపి వారిని మరలఁ బ్రాయోపవేశము చేయుటకై పురికొల్పెను. ధనలుబ్ధులగు నప్పాఱులు మరల మిక్కుటముగ నుత్కోచమును (లంచమును) గైకొను తలంపుతో విగ్రహరాజు మాటలను సమ్మతించి ప్రాయోపవేశ సన్నద్ధులై యుండిరి.

ఇప్పుడు తుంగుఁడు లబ్ధస్థైర్యుఁడై యున్నవాఁడు. కావున నున్నటులుండి యా బ్రాహ్మణుల నందఱను బలఁగముతోఁ గూడి ముట్టడించెను. ఆబాడబులమధ్యనుండి 'ఆదిత్యుఁడ'నువాఁడు గూఢముగఁ దప్పించుకొని పాఱిపోవఁ బ్రయత్నించెను. కాని, తుంగుని భటులు వానిం దఱిమి పట్టుకొని పరిమార్చిరి. అయ్యాదిత్యుఁడు విగ్రహరాజునకు స్నేహితుఁడు అట్లే 'వత్సరాజు' అనుపేరుగలవాఁడు మఱియొకఁడు కత్తిదెబ్బఁ దిని తప్పించుకొని పోవుచుండ తుంగుని సైనికులు స్వయంకోతకాములు వానిని సజీవునిగఁ బట్టుకొని బంధించిరి. పిమ్మట తుంగుఁడు రాణిదగ్గఱఁ దొల్లి యుత్కోచమును బడసి యుండిన 'సుమనోమంతుఁడు' మున్నగు బ్రాహ్మణులను వెంటనే పట్టి బంధించి కారయం దుంచెను.

అంతటితో విప్లవకారుల యాగడ మణఁగిపోయినది. కాని మహావీరుఁడయిన ఫల్గునుఁడు (మంత్రి) సహించినది మొదలు రాజపురాధిపతి 'పృథ్వీపాలుఁడు' దృప్తుఁడై తుంగాదులను సరకు సేయక విజృంభించుచు నుండెను. ఆకారణమునఁ గాశ్మీరమంత్రులు వాని నణఁగ ద్రొక్కుటకై సమ రసన్నాహముతో బయలు వెడలి రాజపురి నొక్కుమ్మడిగ ముట్టడించిరి. రాజపురాధిపతి యగు

పృథ్వీపాలుఁడు వీరుఁడు గావున వారిని సరకు సేయక తాను స్వయముగ సంగరమునఁ బ్రవేశించి కాశ్మీర సైనికులను బెక్కండ్రను దెగటార్చెను. ఆసైన్యమునందు 'శిపాటకుఁడు' 'హంసరాజు' అను నిరువురు మంత్రులును బ్రాణములఁ గోల్పోయిరి. ఆపృథ్వీపాలుని బారిపడిన వారి కందఱకును నత్తఱి మరణమే భేషజ మగున ట్లుండెను.

ఇట్టి తఱి, తుంగుఁడు తన సోదరులతోడను, బహూలములతోడను నకస్మాత్తుగ మఱియొక మార్గమునుండి వచ్చి రాజపురి నంతను దగులఁ బెట్టించెను. అయ్యగ్ని ప్రమాదముచేఁ బృథ్వీపాలుఁ డాత్మరక్షణము నగర రక్షణమును జేసికొనఁగోరుచు నుక్కు చెడినవాఁ డయ్యెను. శేషించిన కాశ్మీర మంత్రులు మిగిలియున్న తమసైన్యముతోడఁ దుంగునికి సహాయపడుటకై యతనిం గలసి కొనిరి.

పిమ్మట వారందఱు పృథ్వీపాలుని ముట్టడింపఁగా నతఁడు చేయునది లేక వారికి లొంగి తుంగునికిఁ గప్పము చెల్లించెను. తుంగుఁడు తన కాయుద్ధమున వ్యయమైన ధనమును బృథ్వీపాలుని వలనఁ గైకొనెను. పిదప శ్రీనగరినిఁ బ్రవేశించి తాను స్వయముగ సర్వసేనాధిపత్యమును స్వీకరించి సింహావిక్రముఁడై డామర వీర వారమును బీచ మడఁచెను.

తఱువాత శ్రీనగరియందు 'దిద్ద' తనసోదరుఁడగు 'నుదయరాజుయొక్క పుత్రుని 'సంగ్రామ రాజును' బరీక్షించి శంకావర్జితయై యతనిని యౌవరాజ్యాభిక్తునిఁ గావించెను. దిద్దాదేవి సంగ్రామ రాజును యువరాజును జేయుటకు ముందు తనసోదరుని కుమారుల నందఱను దగ్గఱఁ జేర్చి వారిముందు గొన్ని పాలేవత ఫలములను (సీమరేగుపండ్లు) గుమ్మరించి "మీలో నెవరెన్ని పండ్లను దీసికొనఁ గలరో చూచెదను గాక తీసికొనుఁడు" అని వారితో ననెను వారు శిశుప్రాయులు గాన నప్పు డావల ముల నొకరికంటె మఱియొకరెక్కువగఁ దీసికొనుటకై పెనఁగు లాడుచు వారివారికిఁ జిక్కిన ట్లాపండ్లను బోటీతోడఁ గైకొనిరి.

అక్కడి పండ్ల నన్నిటిని వారట్లు తీసికొన్న తఱువాత దిద్దాదేవి వారినిఁ గ్రమముగఁ బరీక్షించి చూడఁగా నొక్కొక్కరు కొలఁది పండ్లను మాత్రమే తీసికొనఁగల్గిరి. అట్టివా రందఱకు వాపోటీ పరీక్షలోఁ చాల దెబ్బలు దగిలి యుండెను కాని, యామె 'సంగ్రామరాజును గూడ నట్లే పరీక్షింప నతని కడ మాత్రము చాలఁ బండ్లుండెను. ఇఁక దెబ్బలన్ననోః యొక్కటిగూడ నతనికిఁ దగిలినట్లు గన్పట్ట లేదు.

అంత దిద్దాదేవి విస్మయపడుచు సంగ్రామరాజును గాంచి "నీవు దెబ్బలు తప్పించుకొని యిన్ని పండ్లెట్లు పడయఁగలిగితివిః" అని యతనినిఁ బ్రశ్నించెను. అందుల కతడిట్లు బదులు పల్కెను. "నేనుగలహపరు లైన వీరందఱకు మఱింత మచ్చరము గల్పించి వీరు గొట్టుకొనుచుండ నేను మాత్రము కొంచె మెడముగ నుండి దెబ్బలు దగులకుండ నొక్కొక్క పండును మెల్లమెల్లఁగ దీసి కొనుచు నిట్లు పెక్కు ఫలములను సేకరించుకొంటిని. స్వకార్య ధురంధరు లైన నేర్పరులు పరులకు ముళ్ళమాటలచేఁ గలహమును బెంచి వారు పరస్పరము దన్ను కొనుచుండఁ దాము మాత్రము

ప్రమాద రహితులై మెలఁగుచుఁ దమకార్యములను జక్కఁ జేసి కొనుచుందురు. ఇట్టివారికి గార్యసిద్ధి కరతలామలకము" అని యతఁడు బదులు సెప్పెను.

అంత దిద్దాదేవి వాని నేర్పును సహజము స్ఫూర్తిని బర్యాలోచించి స్త్రీప్రకృతికి సులభమైన భీరుత్వమునకు గుఱియయి యుట్టివానిని యువరాజుగ నొనర్చుట శ్రేయస్కరమని తలంచి యప్పుడే సంగ్రామరాజును యౌవరాజ్యమున నభిషేకింపఁ జేసెను.

ఈరీతిని సంగ్రామరాజు గాశ్మీరమునకు యువరాజయ్యెను "జగతియందు భీరువునకు వెఱపుచేతఁ గార్యము సాధ్యమగునట్లు శూరునకు శౌర్యముచేతనే కార్యసిద్ధి యగును" అని తోఁచుచున్నది. అట్లు గానిచో వారియువురకుఁ భేదమనునదియే లేదు. నిప్పులేకున్నను వత్తికొఱకై మాత్రమె కోఁతుల చలిని మాన్పఁజాలి యున్నది. జింక లగ్ని శౌచము లయ్యును వాని లోమముల శుద్ధికి నీరు నగ్నియుఁ జాలియున్నవి దీనిని విమర్శించి చూడఁ బదార్థములు ప్రాణుల భావనాబలము ననుసరించియే కార్యసిద్ధిని ఘటింపఁ జేయుచున్నవి." అనియు "సహజ తత్త్వమెద్దియు నెక్కడను లేద"నియుఁ, దెలియుచున్నది.

క॥ శూరుఁడు కార్య ఫలంబును
శూరత్వంబుననె పొందఁ జాలును; భీరుం
డారయ భీరుత్వమె త
త్కారణముగ నెంచు వేఱుగా నిఁక నేమో॥

చం॥ హరిణము లగ్ని శౌచములె
యైన జలాగ్నులు లోమ శుద్ధి సం
స్కరణమునందుఁ గావలయు
గాః చలిబాధను దీర్చుకోఁగ వా
నరములకు న్నిరగ్నులయి
నన్ సమిధల్ దగఁ జాలుఁ; గార్యముల్
జరుపును బ్రాణిభావన; ని
సర్గజ తత్త్వము లేదదెచ్చటన్॥

సహజ తత్త్వము నశించిన భీరువు దిద్దాదేవి. అప్పటి కప్పు డుదయించిన యొకానొక భావనా ప్రపంచమున లీనమైన యాదిద్ద సంగ్రామరాజును గాశ్మీర యౌవరాజ్యాభిషిక్తునిఁ గావించి **4079.** లౌకిక సంవత్సరమున (క్రీ. శ. 1003 ఎ. డి.) భాద్రపద శుద్ధాష్టమినాఁడు మృత్యువు పాలయ్యెను. యువరాజగు సంగ్రామరాజు కాశ్మీర ధరారమణుఁడయ్యెను. సంగ్రామరాజు.

## సంగ్రామరాజు

కాశ్మీర మండలము నేలిన రాజులకు స్త్రీ సంబంధముచేఁ గలిగిన వంశ పరివర్తనములలో నిది మూఁడవది. ఈవిషయము దెలిసికొన్నపుడు లోకమునకుఁ గొంత వింత గలుగుచుయు సహజమే యని చెప్పవచ్చును.

కంటక కుల మంతయు సమసి పోయిన తఱువాత నానావిధ ధనసంపన్నంబై విరాజిల్లు కాశ్మీరమండలమునకు శ్రీసాతవాహన కులజుఁడైన 'శ్రీ సంగ్రామరాజు' పాలకుఁ డగుట యెంతయు స్పృహణీయమగు విషయము.

క్రీడావనమునందలి పెద్దచెట్లు కార్చిచ్చుచేఁ గాలిపోఁగా నట్టి తరుణమున ఘనుఁ డొసఁగిన జీవన ధారల నాధారము చేసికొని యచ్చోటనే చూతాంకుర మొకటి మోసెత్తి పెనుపొందు చుండుట గన్నులపండు వగు దృశ్యముగదా!

కం॥ లలిత వని యగ్ని పాలై
కలుషితమై యుండ నందు ఘన జీవన ధా
రలఁ జూతాంకురమును విధి
మొలపించును; దత్కృతికి నమోవాకంబుల్,

సంగ్రామరాజు ధైర్యశౌర్యము లతని మార్దవ గుణము మాటునఁ బ్రచ్ఛన్నములై యుండెను. అట్టివాఁడు కావుననే తామరతూండ్ల తుటుమువలె శోభిల్లు తెల్లని మేని ఛాయచే మఱుగు వడి యున్న ప్రాణసారముగల ఫణిపతి భూదేవిని ఫణామండలమునం దుంచి కాపాడు చందమున నిజ బాహుబల సంపదచేఁ గాశ్మీర వసుంధరను లాలించి పాలించుచు వన్నె కెక్కెను.

శ్రీ శ్రీ శ్రీ

ఇది కాశ్మీరికమహామాత్యశ్రీ చణ్పకప్రభు సూను 'కల్హణ మహాకవి' ప్రణీతమగు 'రాజతరంగిణి' యను సంస్కృత మహాకావ్యమునకు, అనువాదరూపమును స్వయంపాకాన్వయ భారద్వాజ గోత్రజ శ్రీ. వేంకటలక్ష్మ్యంబా వేంకటప్పార్య తనూజ, పరదేవతానుగ్రహ సముపాత్తోభయకవితా సాహితీవికాస, వ్యాకరణవిద్యాప్రవీణ, విద్వత్కవిశేఖర, మహాకవి, ఆయుర్వేద విశారద, జరుగుమల్ల్యభిజన, సింహపురనివాసి, వేంకటరమణశర్మచే విరచితమును నగు, ఆంధ్రరాజతరంగిణి, అను చంపూ మహాప్రబంధమునందు సర్వంబును

షష్ఠ తరంగము.

ఓం తత్, సత్





శ్రీ పరదేవతాయైనమః

# రాజతరంగిణి

(మహాకవి కల్హణుని కృతికి ఆంధ్రీకృతి)

## సప్తమ తరంగము

## మంగళాచరణము

### సంగ్రామరాజు చరిత్ర

సీ॥ జననికి నీకు సంస్తవనీయ మౌ తను
వమల మౌ పితృవంశమందు బ్రహ్మ
యమర సృజించె; సంధ్యా హిత సన్నిధి
వై నీవు నాదు జపాధరమున
నమరక్త వౌచు ఖేలన మొనర్తువు గదా
యనుచు సంధ్యా వందనావసరము
నన్ సాభ్యసూయ యౌ నగరాజ సుత నీర్ష్య
శము లౌ నిపుణ వాక్ఛలములతోడ

గీ॥ సన్నుతించుచు దాననే సాంధ్య విధులఁ
జక్కఁగాఁ దీర్చు నట్టి విశ్వ ప్రదాత
సర్వమయుఁ డైన యాగిరిజా ధవుండు
జగము నోముసుగాక శశ్వ చ్ఛుభములఁ.

అట్లు సంగ్రామరాజు గాశ్మీర క్ష్మాపతియై భుజమునందును మనస్సునందును శమను మెలఁకువతో వహించుచు నిరుపమాన మగు తన గాంభీర్యముతోడను, ప్రభుశక్తితోడను వాహినీపతు లను బెక్కండ్రను దనకరిగాపులఁ గావించుకొనియెను.

ఇఁక దిద్దాజారుఁడైన తుంగుఁడు రాణియైన దిద్ద మరణించుటచేఁ బదభ్రష్టుఁడై శృంగ భంగము నొందు నని పలువురు దలంచి యుండిరి. కాని, వాని కాగతి పట్టలేదుగదా! వానికిఁ బ్రతి భటులై యుండిన శూరు లందఱు క్రమక్రమముగఁ నణఁగిపోవుటయు నతఁ డభ్యున్నతి నొందుటయుఁ జూపట్టెను. ఇంతకును విధి పోకలు పలుతెఱంగులు. వాని నెఱుంగ నెరికిఁ దరమగును? సంగ్రామ రాజునకు జ్ఞాతి యయిన 'చంద్రాకరుఁడు' గొప్పశూరుఁడు. అతఁడు సర్వాధికారములను నిర్వహించు టకు యోగ్యుఁడై యుండెను. సంగ్రామరాజునకు సహాయుఁడై యుండఁదగిన యాదిట్టి యయ్యుదనున మిత్తివాతఁ బడుట శోచనీయ మగు విషయము.

మఱియు 'భీమతికాగ్రామము'న బ్రాయసకాఁడై ధనాఢ్యుఁడును నై యుండిన 'పుణ్యాకరుఁడు' మేధావి. అతని తనయులు పరాక్రమ సంపన్నులై రాజు ననుసరించుచుండిరి. ఇవ్విధముగఁ దనకు విశ్వసనీయులగు వారందఱు మృత్యు ముఖమును జొచ్చుటంచేసియు సమర్థు లగు మంత్రులు లేమిం జేసియు సంగ్రామరాజు తనకిష్టము లేకున్నను గత్యంతరమును గానక తుంగుని పక్షము నాశ్రయించి యుండునట్లు విధి యతనిని నియమించెను. ఇందుకుఁ దగినట్లు దిద్దాదేవి తాను మరణించునపుడు దన వలపుకాఁడగు తుంగుని సంగ్రామరాజును దనదగ్గఱకు రావించి వారు పరస్పరము ద్రోహచింత మాని యుండునట్లు వారిచే బాసలు చేయించెను.

తఱువాతఁ గ్రమక్రమముగ సంగ్రామరాజు భోగాభ్యాస లాలసుఁ డగుచుఁ గ్లేశము సహింప లేని సోమరి యయ్యెను. అక్కాలమున నతఁడు ప్రజల కార్య భారమును దీర్చుపని తనపై నుంచు కొనక యందులకుఁ దుంగుని వినియోగించి ప్రమత్తుఁడై యుండసాగెను.

ఆ కాలమున దిద్దామఠమున కధిపతిగా నున్నవాఁడు 'ప్రేమనాముఁడు.' అతఁడు సిరితోడను శౌర్యముతోడను నొప్పారుచుండెను. సంగ్రామరా జాతని సాయమును బడయుటకై 'లోఠిక' యను తనకుమారీరత్నము నతని కొసఁగి పరిణయము గావించెను. పార్థివోత్తముని పాణినిఁ బట్టుకొనఁ దగు రాకొమరిత యెక్కడ? అల్పబుద్ధియుఁ బ్రతిగ్రహ జలముచేఁ గ్లిన్నహస్తుఁడును నగు పాఱుఁ డెక్కడ? అట్టివానితోడ నా బాంధవ్యము?

సంగ్రామరా జవ్విధమున నీడుగాని వియ్య మొనర్చి తనకీర్తిలత చిగురు ఛిన్నభిన్నముగా నొనర్చెను. రాజకీయ వ్యవహార నిర్వహణమున నతనికిఁ గలిగిన భీరుత్వమును వెల్లడించుట కీ వృత్తాంత మొక్కటియే చాలి యున్నదని చెప్పఁదగును.

ఇట్లుండ సమాత్య పదవులం దుండు బ్రాహ్మణు లందఱు నొక్కటై తుంగునిఁ దదాప్తులను దుదముట్టింపఁ గడగి పరిహాసపురమునందలి విప్ర పరిషత్తును బ్రాయోపవేశమును జేయఁ బురికొల్పిరి. వారును మంత్రుల మాట ననుసరించి ప్రాయోపవేశమును బూనిరి. అగ్నికి వాయువు సాయపడినట్లు మంత్రులును బ్రాహ్మణులును నిశ్చైకమత్యముతో మెలఁగుచుఁ గావించెడు విప్లవము రాజునకెంతయు దుస్సహ మయ్యెను. అయిననేమి? అతఁ డేమిసేయఁగలఁడు?

అద్విజులు మొదట రాజును సైతము త్పాటింపవలయునని యెంచిరి. కాని. వలుమా అతని నేడికోల్పుం బడసి యట్టితలంపు మాని తుదకుఁ దుంగాదులను మాత్రమే పదభ్రష్టుల నొనరింపఁగోరుచుఁ దమపూనికను సాగించుచుండిరి.

అంత నరపతియుఁ దుంగాదులును బ్రాహ్మణులు గోరినది యొసంగువారై ప్రతినలు సల్పి యుండినను నాద్విజులు శాఠ్యముతో వైముఖ్యముఁ జూపుచుఁ దమకోర్కి యిదమిత్థ మని విస్పష్టముగఁ దెలుపకపోయిరి.

తఱువాత నావిప్రులు తుంగుని భవనమునకుఁ జేరువనుండు బావి కనతి దూరమున నొకానొక శవమును గాంచి యాశవమును గైకొని వచ్చి "ఈతఁ డొకబ్రాహ్మణుఁడు. తుంగుని దురాగతముచేఁ బ్రాణములఁ గోల్పోయెను. కావున నీతుంగుని గేహమునందె యీశవ దహనముఁ జేసెదము" అని యందఱకు వెల్లడించుచుఁ దుంగుని యుత్తుంగ ప్రాసాదమున కభిముఖులై పోవుచుండిరి.

ఇది యిట్లుండ నింతలోఁ దొల్లి వారు తుంగుని సమయించు కృత్య నొకదానిం బుట్టించుటకై 'కేశహోమము' గావించి యుండిరి. తత్ఫలముగా నొక కృత్యయుత్పన్నమై తుంగునిపైకిఁ బోక మంత్రు లగు విప్రులను దుదముట్టింప నెంచి యెదురు దిరిగినదై ద్విజులు వోవు మార్గమునుబట్టి పోసాగెను. అంతట నాకృత్యనుండి కలియందు దురాచారులను ద్విజులను బొలియించు దివ్యశస్త్ర మొకటి యాకస్మికముగ నుద్భవించి యాపాపుల వెంట నంటెను.

అప్పు డాద్విజు లందఱు భయభ్రాంతులై పలాయితు లగుచు గూఢముగఁ దమకు మంత్రోపదేష్టయై యున్న రాజకలశుని యింటికిఁ బోయిరి. ఆ 'రాజకలశుఁడు' తన కౌటిల్యము వెల్లడి యగుట వలనఁ దాను స్వయముగఁ గృత్యాస్త్రముతోడ యుద్ధము సాగించెను. ఇంతలో బ్రాహ్మణు లందఱు వాని గృహమునందలి వెనుకటి ద్వారమునుండి తప్పించుకొని పరువిడి పోయిరి.

'రాజకలశుఁడు' గొంత తడవునకుఁ బరాజితుఁడై పోఁగా మరల 'శ్రీధర' ప్రభృతు లగు బ్రాహ్మణమంత్రు లెల్లరు నొక్కపై దయ్యము గావించి సమరాంగణమున వీరశయనము నొందిరి. ఆ హేతువుచే వారందఱును సూర్యమండలమును భేదించుకొని యూర్ధ్వలోకము నాచికొనఁ గల్గిరి.

శ్రీధరాదులు సమసి పోయిన పిమ్మట సుగంధిసింహుఁడు' రణవిజితుఁడైన రాజకలశునకు సంకెలలు వేయించి నిరాయుధు నొనర్చి తుంగుని పల్లకిని మోయు వాహకుల మూపుపై నాతని నుంచి బారిసడుమఁ గొట్టించుచు నాతనిఁ బెక్కువిధముల నాడించుచుఁ దుంగునికడకుఁ గొనివచ్చెను.

'భూతికలశుఁడు' అనుమంత్రియు నాసంగ్రామమున నోడిపోయి 'రాజకుండు' అను తన కొమరునితోడ నెల్లో శూరమఠముం జేరెను. సుగంధిసింహుఁడు' మున్నగువారు పాఱిపోయిన యాభూతికలశునిఁ గరుణించి వెంబడింపక వదలిపెట్టి వెళ్ళిరి. అవమానాగ్ని సంతప్తుఁడైన భూతికలశుఁ డచ్చో నిలువలేక తనసుతునిఁ గూడి దేశాంతరములంబట్టెను.

పరిహాస పురమునందుఁ దుంగోన్మూలనమునకై యేర్పడిన దేశవిప్లవము దైవయోగమున తుదకీవిధమునఁ దుంగునకు శుభమునే సేకూర్చెను. తరువాత రాజు కొంతకాలమునకుఁ బ్రసన్నుఁడై చూపట్టు చుండ గుణదేవుఁడను మంత్రి నరపతిని సమ్మతింపఁజేసి భూతికలశుని మరల రాజధానికి రావించెను.

భూతికలశుఁడును గాంగతోయములందు కృతస్నానుఁడై మరల రాజమందిరమున మెల్లఁగ నవకాశమును సంపాదించుకొనెను. అంతటితో నతఁ డూరకుండక సంగ్రామరాజును జేబులోవేసికొని తుంగుని హతమార్చు తలంపుతో నొకనాఁడు కొందఱ గూఢచారులను బంపెను.

తుంగుఁడు మెలఁకువతో నుండెను. కావున భూతికలశుని పన్నుగడను ముందె యెఱింగి యతని ద్రోహచింతను బట్టబయలు గావించి నిన్నకుండెను. అప్పుడు సంగ్రామరాజు తుంగుని యూరటకై భూతికలశుని నతనిపుత్రునితోఁగూడ మరలఁ గాశ్మీరమునుండి వెడలఁగొట్టించెను.

ఇంక నరపతి దగ్గఱఁ జంద్రాకరు' నూనుఁడు' మయ్యామంతకుఁడు' అనువాఁడు మాత్రము మెల్లఁగా నొకింత యవకాశమును బడపియుండెను. అతఁడును దుంగుని యదృష్టమువలనఁ గాలధర్మము నొందినవాఁ డయ్యెను. మఱియు రాజున కుపకారి యగుచు రాజకన్యతోఁ గూడి సుఖించుచుండిన 'శ్రీపేమనాముఁడు'ను బిమ్మటఁ గొలఁది కాలమునకే మృత్యువునకు దొరకెను. సంగ్రామ రాజునకు సఖులైయుండిన గంగాదు లెల్లరును గాలగతి నొందిరి. తుంగుఁడు మాత్ర మతని సోదరులతోడ మిగిలియుండెను. భోగానుభవము తుంగుని పాలఁ బడినది. "మొదటినుండియు నేయే వృత్తాంతములు తుంగుని నాశము కొఱ కేర్పడియుండెనో; అట్టి పన్నియుఁ దుదకు దైవానుకూల్యమువలనఁ దుంగునికి శ్రేయోదాయకము లయ్యెను" అని విశదమైనది. "అదృష్టవంతునిఁ జెఱుపువారును, అదృష్టహీనుని బాగుపఱుచువారును లేరు" అనుట నిక్కము.

ఏటిగట్టుపై నుండు చెట్టునకుఁ జుట్టు నుండునట్టి మన్ను ప్రవాహవేగమునఁ గొట్టుకొని పోవఁగా నాతరువు వేళ్ళ యాధారమున మాత్రమే నిలిచియుండును. అయ్యదనున వారిపూరము ప్రవహించుచుండినచో నావృక్షము సమూలముగఁ బడిపోవునుగదా! కాని యట్టి ప్రవాహమే యాభూరుహము చుట్టు మఱింత మంటినిఁ జేర్చి దాని నొకప్పుడు గాపాడుటయు సంభవించును. ఇదంతయు దైవలీల గాక మఱేమున్నది? దైవగతి వివిధమైన పోకలు గలది. విచిత్రమైనది.

మ॥ దరులన్ బుట్టిన చెట్లు వాహినుల పె
న్దాడి న్నిజాధారమౌ
స్థిరఁ గోల్పోవుచు, వేళ్ళపై నిలుచుచున్
క్షీణింప నున్నట్టి య
త్తరుణంబందె పటిష్ఠమై పరగు నా
ధారంబుగా మన్నుఁ దె
చ్చి రయం బారఁగ నింపి వాని నవె పో
షించున్ విచిత్రంబుగన్.

ఇట్లే తుంగుని స్థితియు నతని యదృష్ట రేఖవలన బాగుపడినది. తుంగుఁడు ప్రజారాధన పరుఁడై నీతి చతురతతోఁ గొంతకాలము సాగించుచుండెను. కాని, యతఁడు తనపూర్వ పుణ్యము నశించుటచేఁ గాఁబోలుఁ గ్రమ క్రమముగ వివేక భ్రష్టుఁడై నీచుఁ డగు నొకకాయస్థుఁడు 'భద్రేశ్వరుఁ' డను వానినిఁ దనకు సహాయునిఁగా జేసికొని వానిని మిగుల నాదరించుచుండెను. ఆభద్రేశ్వరుఁడు జన్మచేతను హీనుఁడు. అతని వంశమువారు తోఁటమాలి వృత్తి. పెంటకుప్పల వ్యాపారము పశు హింసతోఁగూడిన మాంసవిక్రయము. కట్టె లమ్ముపనియు మొదలగు వానితో జీవించుచుండెడివారు. ఇతఁడును సున్ని కంబళ్ళు, తోలుసంచులు, మషీభాండములు మోయుచు జీవించుచుండెను. అట్టివానిని దగ్గఱ దీసిన తుంగుని దురదృష్ట దేవత యావేశింపకుండునా? ఆభద్రేశ్వరునకు వంశక్రమానుగత ధార్మిక లక్షణ ములుగల యధికారి నిర్వహింపఁ దగిన యట్టి యధికార మొసఁగుట కనకపు సింహాసనమున శునక మును గూర్చుండఁబెట్టుటయేగదా?

అతఁ డావదవికి వచ్చినది యాదిగ దేవ గో బ్రాహ్మణాదులకును నతిథ్యభ్యాగతులకును సత్కారము పూజ్య మయ్యెను. అందువలన నతిథులు మున్నగువారు "భద్రేశ్వరుఁడు దమపాలిటి యకాలమృత్యు వయ్యెఁగదా!" యని తలపోయుచుండిరి. శవాజీవుఁడగు కాపాలికుఁడు మిగుల క్రూరుఁడైనను దనవారినేనియుఁ బోషించుకొనుచుండును. భద్రేశ్వరుఁడు తనవారి ప్రాణములునైతము తీయునంతటి పాపియై యుండెను. ఇంక నట్టివానికి ధర్మ మనునది యుండునా? ఇట్టి దుర్మతియుఁ దుంగునిమూలమునఁ గ్రమక్రమముగ సర్వాధికారియై విజృంభించెను.

ఇట్లు భద్రేశ్వరుఁడు చైత్రమాసమున సర్వాధికారములం బడయుటయు నాషాఢమాసమునఁ దుంగుని తమ్ముఁడు సుగంధిసీహుఁడు వినాశము నొందుటయు నేర్పడెను. సుగంధిసీహుఁడు సమస్తమైన యధికార భారమును వహించుచు నన్న కించుకేని కార్యభారము దోపనీక యతని సుఖపెట్టుచుండిన దిట్ట, అట్టివాఁ డాకస్మికముగ మరణించుట తుంగునకుఁ దల దీసివేసిన ట్లయ్యెను. ఆ కతంబున నతఁ డహర్నిశము చింతా శల్యమునఁ జివుకుచుండెను.

ఇట్లుండ 'శ్రీత్రిలోచనపాలుఁడు. శాహి యనువాఁడు మార్గశీర్షమాసమునందుఁ దనకు సాయమును బంపఁగోరుచు సంగ్రామరాజునకు వార్త నంపెను. సంగ్రామరాజు తుంగున కావిషయ మును దెల్పఁగాఁ దుంగుఁడు రాజపుత్ర సామంత మహామాత్యాది సకల పరివారమును బ్రబలమైన చతురంగబలమును దీసికొని శాహిరాజునకు సాహాయ్యమును నిర్వర్తించుటకు వేగిరపడుచు సన్నాహ సంరంభముతో బయలుదేరి పోయెను.

శాహిరాజు తనరాజధానిని సమీపించుచున్న తుంగున కెదురు వోయి సపరివారముగ నతనిఁ దోడ్కొనివచ్చి యుచితరీతిని సత్కరించెను. తుంగుఁ డాత్రిలోచనపాలుని సత్కారములఁ బడయుచు నున్మదుఁడై యయిదాఱు దినము లట్లే యతనివీట సుఖముగఁ గడపెను. ఈతరుణమునఁ ద్రిలోచనుఁడు "తురుష్కపతితో యుద్ధము సేయుటకుఁ దగిన సన్నాహము తుంగునకున్నదా! లేదా!" యని కను గొనుచు శస్త్రాభ్యాసము మున్నగువానియందుఁ బ్రోడలై రాత్రులందు మేల్కొని శిబిరములను

ఉప్పులవలెఁ గాచుచుండు రక్షక భట వర్గము మొదలగు పరివారము శేఖరింజేసి తుంగునితో నాతఁ డిట్లనియె. "మీరు తురుష్కుల నెదిరించుటకుఁ జాలినంత యనుభవమును బడయు నంతవఱకు నీగిరి తటమున వేచియుండుఁడు. పిమ్మట సుకరముగఁ బోరు సాగింపవచ్చును." అని పల్కెను. అతని మాటలను తుంగుఁడు సరకు సేయక గర్వించి యాహవోత్సాహియై పొంగుచుండెను. ఇట్లుండఁ దురుష్కపతి యగు 'హమ్మీరుఁడు' ప్రతిపక్ష వాహిని బలము నెఱుంగఁ గోరినవాఁడై కొంత దండును శాహిదేశముపైకిఁ బంపెను. అంతటఁ దుంగుఁడును బరిమిత మగు సేనతోడనే బయలుదేరి 'తౌషీ'నది యావలి గట్టున జేరి హమ్మీరుని దళమును నలినులిగాఁ జెండాడెను.

ఇంకేమున్నది! తుంగునిఁ బట్టబగ్గములు లేక పోయెను. మొదటనే గరువమున మిఱుచుండిన తుంగున కీపాటి గెలువు గలుగుటచే నతని దర్పోన్మాదమున కడ్డు లేక పోయెను. అయినను శాహితా జాహవ తత్త్వజ్ఞుఁడు గాన తాను మున్ను చెప్పినట్లే తుంగునకుఁ బలుమాఱు హితమునుజెప్పి కొంత తడవు గిరితటమున వేచి యుండు మనెను. కాని, యాగర్వోద్ధతున కాతని హితవాక్యములు రుచింపలేదు. వినాశకాలము దాపురించిన వారికి హితోక్తులు రుచించునా?

అంతట మఱునాఁ డుదయముననే తురుష్కసేనాపతి తాను మున్నంపిన సైన్యము శాత్రవులచేఁ జిక్కి యోటమి గాంచుట కెంతయుఁ గినిసి సమర సన్నాహ కుతూహలియై ప్రబల మైన బలఁగములతో స్వయముగఁ బ్రస్థానము సాగించెను. ఆతురుష్క వాహినీపతి కూట యుద్ధములందు నాకస్మిక పుటెత్తుగడలందును గుశలుఁడు. కావుననే యతఁడు దనయనీకము నొక్కుమ్మడిగఁ దుంగునిపైకిఁ బంపెను. ఆతాకునకుఁ దుంగుని సైన్యము నిలువలేక చెల్లాచెదరై 'మూలమూలలం బట్టి పోయెను. కాని, శాహిసేన మాత్ర మొక్క క్షణకాలము రణభూమిని నిలిచి పోరు సాగించెను.

అట్లు శాహిరాజు సేనయుఁ దురుష్క పృతనా చయముతోఁ జాల కాలము పోరలేక వెన్నుఁ జూపఁగా జయసింహుఁడు, తదనుయాయులును సంగ్రామ డామరుని సంతతి వారును నగు 'శ్రీవర్ధన' 'విక్రమార్కుల'ను దురంగ వ్యూహములచేఁ దుములమై యున్న యాసమరాంగణమును జొచ్చి తమదేశము వీరక్షేత్ర మనెడు ఖ్యాతికి హాని వాటిల్లకుండునట్లు తమమగఁటిమిని మెఱయించిరి. ఏమైనను హమ్మీరునకే తుదకు జయము చేకూరెను. కాని, త్రిలోచనపాలుని శౌర్యము సాటి లేనిదని చెప్పవచ్చును. అట్టివాఁడు సైత మీతరుణమునఁ గోట్లకొలఁది యోధులను సమర భూమియందుఁ బ్రవేశపెట్టి తానుమాత్ర మేలకో! రిపువ్యూహమునుండి యేకాకియై వెన్కకుఁ బోయెను. అతఁడు సమర కార్య మర్మజ్ఞుఁడు కావునఁ దనయేనుఁగుల బలమును దనతోఁగూడఁ గొనిపోయి యుండెను. అదనుఁ జూచి మఱల జయశ్రీనిఁ జేపట్టుటకై యతఁ డట్లు పన్నుగడఁ బూని యుండెను. ఆశాహిరా జట్లు దవ్వులకుఁ బోవఁగనే హమ్మీరుని ప్రచండ చండాల సైన్య మంతయు నాతని రాష్ట్రమున మిడుతల దండువలె వాలి నిండుకొనెను.

ఈరీతి హమ్మీరుఁడు ప్రాప్త విజయుఁ డయ్యును త్రిలోచన పాలుని యమానుష కార్యములఁ దలంచుచు నిట్టూర్పు పుచ్చుచునే యుండెను. శాహిరాజు వృత్తాంత మిచ్చోటఁ బ్రాసంగికమాత్ర

మగుటచే నతని సిరి చివరకు నామరూపములు లేకుండఁ బోయిన విధమంతయు నిచ్చోట వర్ణింపఁబడుట కవకాశము లేక పోయినది. శాహిరాజ్యము చాల విపుల మైనదని యిదివఱ కొక మాఱు శంకరవర్మ వృత్తాంతమును వర్ణించు సందర్భమున సంగ్రహముగఁ దెల్పఁబడి యుండెనుగదా! ఈనాటి లోకము శాహిరాజ్య మనునది యమూల్య వస్తు పరివార శోభితమై యుండెనో! లేదో! యని యనుకొను చున్నది. దైవ బల మమానుషము గావున నద్దానిని మానవు లెఱుంగఁజాలరు.

కలయందైన నెట్టి యసంభావ్య మగుచుండునో! దేని విషయమునఁ గోర్కులు పూర్తిగ భగ్నములై యుండునో! అట్టి విషయము నైతము దైవ మనుకూలించినచో ఫలవంతమై విస్మయ కారి యగుచుండును. కావున విధి కసాధ్య మైనది యొకండును లేదు.

ఉ॥ కలలో నైనను లభ్య మంచుఁ దలపం
గా రానిదే యైన, నా
శలు భగ్నంబులు నైన నొక్క త్రుటిలో
సర్వంబు సంపన్నమై
ఫలవంతంబును గాఁగ దానిని ఘటిం
పం జేయు దైవంబు లీ
ల లవేద్యంబు లశక్య మొక్కటియుఁ గ
ల్గం బోదు దైవేచ్ఛకున్.

తరువాతఁ దుంగుఁ డారీతి హమ్మీరున కోడి తురుష్కులకు నల్గడల దేశమునందుఁ బ్రవేశ మొసంగి తానెట్టెట్లో మెల్లఁగా స్వదేశమును జేరికొనెను. ఇట్లు పగఱచేఁ బరాజితుఁడై నక్కవలెఁ బాఱి వచ్చిన తుంగునిఁ గాంచి కాశ్మీరపతి యించుకేనియుఁ గోపింపక వాని యపరాధమును సైచి యుండెను. ఆతఁడును ధైర్యాది గుణములయెడఁ దుంగునకు సాటి యగుటవలననే యిట్లు మిన్నకుండఁగల్గెను. కాని యమ్మహీకాంతుఁడు తుంగుని యధికారమును సమ్మతించుచు వానిచేతి కీలుబొమ్మవలెఁ దాను మెలఁగ వలసినవాఁ డగుట కెంతయు నెమ్మనమున వంత నొందుచుండెను. పశువున కైనను బరా యత్త చిత్తత సంతాపకారి యగుచుండునుగదా!

ఇటఁ దుంగుని కొమరుఁడు 'గంధర్వసింహుఁడు' శౌర్యముచేతను నైశ్వర్యముచేతను మిగుల గర్వించుచుఁ దానొక రాజువలె రాష్ట్రమున వ్యవహరింపసాగెను. ''గోరుచుట్టుపై రోఁకటిపోటు'' న్నట్లతని ధూర్తవర్తనము రాజునకు మఱింత సంతాపమును గలుగఁజేయున దయ్యెను.

ఇట్లుండ ఱేని సోదరుఁడు 'విగ్రహరాజు' చిరకాలమునుండి తుంగునిఁ బరిమార్పవలయు నను తలంపుతో రంధ్రాన్వేషియై వేచియున్నవాఁడు కావున నియదనునఁ బెక్కు లేఖలను గుప్తముగ వ్రాయుచుఁ దుంగుని హతమార్చుటకై సోదరుని, పలువిధంబులఁ బురికొల్పుచుండెను. అయినను రాజు దిద్దాదేవి తొల్లి తుంగునితోఁ దనకుఁ గావించియుండిన బాసను దలంచి డోలాందోళిత మానసుఁ డగుచుఁ దుంగుని వధించుటకై దన్నుఁ బలుమాఱు ప్రేరేపించు వారిం గాంచి తుంగుని యెడ మఱింత యుద్విగ్నుఁడై యెట్టకేలకు వారితో నిట్లు వల్కెను.

"తుంగుఁడు నిజ పుత్రమాత్ర సహాయుఁడై తానెప్పుడేని యొకనాఁడు మనకడకు రాకపోఁడు. అట్టి యదను గనిపెట్టి మన మాతని నేమి చేయవలయునో నిర్ణయించుకొని యట్లు చేయుదము. అట్లు గానిచో నతఁడు మన గుట్టెఱింగి మనల నందఱ నొక్కమాఱుగాఁ బిలుకమార్పఁ గలఁడనుట నిక్కము." అని యతఁడు కాలము గడపుటకై యట్లు వారితోఁ బల్కి యూరకుండెను. ఇమ్మాటలకు విగ్రహరాజు మున్నగు వారందఱు సంతసించి "యిప్పటి కీపాటి తలంపు రాజు డెందమున నాటితిమి గదా!" యని తృప్తినొంది తుంగుని మారణమునకుఁ గృతోద్యములై తదవకాశమునకై వేచియుండిరి.

కొంతకాలము జరిగినది. ఆఱు నెలలలోనే రాజొకనాఁడు తుంగునిఁ దనకడకు రమ్మని వర్తమాన మంపెను. అంతకుమున్ను తుంగుఁడు దుస్స్వప్నములఁ గాంచియుండెను. కాని, యతఁడు విధివిపాకమున వానిని సరకుసేయక సుతసహితుఁడై బయలుదేరి నరపాలుని యాస్థానమును జేరెను. తుంగుఁడు రాజువద్ద క్షణకాలముండి పరిమితమగు నేవురార్వురు భృత్యులతోఁ గూడి మంత్రమండపమును బ్రవేశించెను. ఇట్టి యదుననే 'పర్వుఁడు' 'శర్కరుఁడు' మొదలగువారు తుంగుని వెనువెంటనేపోయి తేనికించుకేని దెలుపకయే తుంగుని నిశితములైన శస్త్రములతో బొడిచి గ్రుచ్చిపడఁ గొట్టిరి. ఆతరుణమునఁ దుంగుని భృత్యులలో 'సింహరథుఁడు' అనువాఁ డొక్కఁడు మాత్రమే శ్లాఘ్యుఁడని చెప్పఁదగియుండెను. అతఁడు తొల్లిటి శంకరవర్మ మహారాజునకు మంత్రియై యుండిన 'మహారథుని' వంశమున జనించినవాఁడై యుండెను. సింహరథునికడ నెట్టి యాయుధములును లేవు. అయినను నతఁడు తన యేలికను గాపాడఁగోరి వధింపఁబడుచున్న తుంగున కడ్డము నిల్చి తానును గలవాలధార కెరయయ్యెను. తుంగునకుఁ దొలికత్తిపోటు దగిలినపుడు రాజు భయభ్రాంతుఁడై యూపిరి బిగఁబట్టికొని యుండెను. అతఁ డసువులను బాసెనని విన్నతోడనే జేఁడించుక యుచ్ఛ్వాసముల విడువఁ గగ్గెను.

ఆస్థాన బ్రాహ్మణుఁడగు ధర్మునకుఁ 'బార్థుఁ'డను కొమరుఁడు గలఁడు. అతఁడు మిగుల దుండగీఁడు. వాఁడును 'కంకుఁ'డను మఱియొక తులువయును దుంగుని వధించుకాలమున నతని చెంగటనే యుండిరి. వారు తుంగుని యనుచరులే యయినను భీతిచే నాశవిరేచనము లేర్పడ నాత్మరక్షపరాయణులై కేలనున్న కరవాలములను నేలవైచి మోములపై నంగుళుల నుంచి దీనవదనులై పశువులవలె నట్లే నిలువఁబడియుండిరి. ఇఁకఁ దుంగుని యంతరంగ మంత్రులైన 'చంగాదులు' సంత్రాసవశులై శస్త్రపాణులై యుండియు స్త్రీలవలె ముష్టాగ్రిపికలతో నూరకయుండిరి.

ఇట్టితఱి నరపతికి భీతియొండు జనించెను. "తుంగుని యెడఁ బ్రీతిగల యతని భృత్యులు మొదలగువారు తుంగుఁడు జీవించియే యుండునని శంకించినచో వారందఱేకమయి నగర దహనము మొదలగు క్రూరకార్యములు సేయఁ గడంగుదురు." అని యనుమానించి తన యనుచరుల యూరటకై యచ్చటఁ బడియున్న తుంగునియొక్కయు నతని కొమరుని యొక్కయు నుత్తమాంగములను స్వయముగ సత్వరముగఁ గరవాలమున ఖండించి వెలుపలఁ బాఱవేయించెను.

అంతట మూగియున్న తుంగుని సైన్యము తమ యేలిక తల నేలపైఁబడి యుండుట గని యేమియుఁ దోఁచక సైన్యముతో మూలమూలలకుఁ బలాయితమై పోయెను. అయినను దుంగుని సేవకులు కొందఱు స్వామిభక్తి ననురూప క్రియాచరణమున దీపింపఁజేసిరి. అందు 'భుజంగుఁడ'ను వాఁడొకఁడు. అతఁడు స్వామిభక్తి ప్రేరితుఁడయి రోషావేశమున విజృంభించుచు నర్గళితమై యున్న ద్వారమును గనక దండముచే విఱుగఁగొట్టి నరనాథు నాస్థానమండపము నిరర్గళముగఁ బ్రవేశించి యచ్చోటి వింశతి యోధుల నేలపాలు సేసెను. అంతమాత్రమకాక యతఁడు సంగ్రామరాజును సయితము పెన్నంటి తఱిమి తఱిమి యిల్లిల్లు ద్రిప్పి పెక్కు వెతలు పెట్టెను. ఈసమయముననే తుంగుని కోశాధికారి యగు 'త్రైలోక్యరాజు' సైతము తుంగునియెడఁ బక్షపాతియై పోరి రణమున నిహతుఁ డయ్యెను.

వీరుఁడును 'గయ్యామంతకుని' భ్రాత్రేయుఁడును నయిన 'యభినవుఁడు' గూడ నీసంగ్రామమునందుఁ బరాసువయ్యెను. మఱియుఁ దుంగోపజీవులును మహావీరులును నగు నేకాంగసైనికులు ముప్పదిమంది బుద్బుదప్రాయమైన జీవనమును సరకుచేయక కయ్యమొనర్చి యాత్మీయకాయముల స్వర్గ పథమునకు సోపాన శ్రేణిచందమునఁ జెలంగుచునుండ వీరశయ్యల నలంకరించిరి. తుంగునకు నత్యంతము ప్రియమిత్రుఁడు 'పద్మరాజు' అనువాఁ డొకఁ డుండెను. అతఁడు మాత్ర మాల మొనర్చియు నక్షతుఁడై సంగరమును వీడి తుంగుని వినాశమువలనఁ గలిగిన సంతాపమును దీర్థయాత్రలు సేయుచు నపనయించుకొనెను. తుంగునియెడఁ బక్షపాతము గల మఱికొందఱు కదనమున కేగి భీరువులై లోకద్వయ మిత్ర మగు శస్త్రమును రణావనియందు విడిచిపుచ్చి హేయ మగు కాయమునే గాక స్పృహణీయ మగు కీర్తికాయమును సయితము గోల్పోయిరి. సుభటంమన్యుఁడైన 'చందుఁడ'నువాఁడును, డామరుఁడగు 'హేలాచక్రుఁడును' బైతరగతిలోని వారుగనే యెన్నఁబడిరి.

అనంతరము సంగ్రామరాజు తుంగుని భవనమును గొల్లగొట్టి యతని యైశ్వర్యము నంతయు హరించియుఁ దుంగుని కథామాత్రావశేషునిగా నొనర్చెను. ఇంతకును దుంగునికి రాజునెడ ద్రోహచింత మింతయును లేదనవచ్చును. అట్టివానిని సపుత్రమిత్రముగఁ బొలియించుటచే నెప్పటినుండియో వేచియున్న ఖలప్రాయు లెల్లరు లబ్ధోదయులై రాజాస్థానమున నధికారులైరి.

ఇట్టితఱి నాత్మీయ వంశనాశకుఁ డయిన తుంగునిసోదరుఁడు 'నాగుఁడ'నువాఁడు నరనాథునిచే సర్వసేనాధిపతిగా నియోగింపఁబడెను. ఈతఁడే మొదటినుండియు గుప్త మయిన ఖల వర్తనముతో నరపతి హృదయమును గలుషిత మొనర్చి నిజసోదరుని సోదరుని కుమారుని నొక్కమాఱు చిత్రవధకు గుఱిచేసి యట్టి లోకనింద్యపుఁ బాత్రుఁ డగుచుఁ దల యెత్తికొని తిరుగఁగల దిట్ట యయ్యెను. కందర్పసింహుని భార్య 'క్షేమ' యనునది తనకు నైజమై యుండిన పాంసులాత్వమునఁ జెలరేగి తులువయగు నీనాగునిఁ గూడి యుండెను. వీరిపొత్తు కృష్ణపక్షరాత్రికిని రక్కసునకుఁ గల కలయికతోఁ బోల్పఁదగి యుండెను.

ఎట్టకేలకు నాల్గుదినముల కావల తుంగవధ మూలక మైన సంకుల సమరము కాశ్మీరమునఁ గ్రమక్రమముగ నణఁగి పోయెను. పిమ్మట 'శాహి' తనూజయుఁ దుంగుని కోడలును నగు బింబాదేవి

పతితిలక మగుటఁజేసి భర్తృ వియోగ జనిత విషాద పరితప్తమై పావన మగు స్వీయ కాయమును హుతాశనుని కర్పించి తనపాతివ్రత్య తేజముచే నాజ్వలనుని నెంతయు దీపింపఁజేసెను.

కందర్పసింహునకు 'మమ్మ'యందు 'విచిత్రసింహుఁడు' 'మాతృసింహుఁడు' అనుపుత్రులు గలిగిరి. తుంగుని భార్య 'మంఖన' కోడలిని మనుమలను విదుపురను దీసికొని దేశమును విడిచి దైన్య మనుభవించుచు రాజపురిఁ జేరి యందుఁ దత్కాలోచితముగ వసతిని గల్పించుకొనెను.

పిమ్మట సంగ్రామరాజు తుంగుని పదవియందుఁ బాపి యగు 'భద్రేశ్వరుని' నియోగించెను. ఇతఁడు భద్రేశ్వరాది దేవతల ధనాగారములను గొల్లగొట్టిన దిట్ట. శునకమును గనకాసనమునఁ గూర్చుండఁబెట్టినట్లు చెనటులందు మేటి యగు 'పార్థుని' నగరాధిపతిగా నియోగించిన యాసంగ్రామరాజున కైన వివేక వైకల్యము మిగుల నింద్యావహము. ఈపార్థుఁడు భాతృకళత్రమును బొందినవాఁడు. మఱియు బరమ పావన మైన ప్రవరేశ్వరుని రంగపీఠమునందు వధాది పాపకార్యములఁ బెక్కింటినిఁ జేయించెను.

ఈనరపతి నానాటికి ధనలుబ్ధుఁడు కాఁదొడఁగెను. అందులకనుగుణముగఁ గృపణాగ్రణియు 'సింధు'ని సుతుఁడును నగు 'మతంగుఁడు' సంగ్రామరాజునకు నచ్చిన బంటయ్యెను. అతఁడు ప్రజాపీడన పండితుఁడై కోశవృద్ధికిఁ జాలఁ దోడ్పడెను. ఈవిధమున సంగ్రామరాజునకుఁ గల లుబ్ధత్వము లోకమునకు బాగుగ విశద మయ్యెను.

మఱియు నొక్కటి గలదు. తొల్లి 'దేవముఖుఁడు' అను దివిరునకు (లేఖకునకు) 'అహూపిక' యగు వేశ్య యొకతె యుండెను. వారిరువురకుఁ 'జంద్రముఖుఁడు' అనువాఁడు జనించెను. వాఁడు మొదట మెల్లఁగా దుంగుని యాశ్రయము సంపాదించి తన్మూలమున రాజు లాలన పాలనములకుఁ బాత్రుఁ డయ్యెను. అయిననేమి? శునకమునకుఁ జెఱకు తీపు దెలియునా? సంపదున్నతి నొందిన యాచంద్రముఖుఁడు లుబ్ధాగ్రేసరుఁడై జరా పీడితుఁ డగు వృద్ధునిఁ బోలి యుండెను. తాను రాజాశ్రయమును గడించి యుండుటచే నితరులచే నపూపములను గానుకగాఁ దెప్పించుకొని వాని నన్నిటినిఁ దన భృత్యులకు విక్రయించి కులక్రమాగత వృత్తిని వీడకయు నీయధముఁడు ధనము నార్జింపుచుండెడు వాఁడు. ధనార్జనమున నీతఁడు మిగులఁ బ్రజ్వరిల్లెడు నాశాగ్ని గలవాఁడై యుండెను. కాని, లబ్ధోదయుఁడైన పిదప వ్యాధి గ్రస్తుఁడై ప్రజల పరిహాసమునకు మాత్రము పాత్రుఁడయ్యెను. లోభి పొందున దింతకంటె నేముండును? అయినను నీతఁ డాసన్న మరణుఁ డైనపుడు కోటిలో మూఁడవ వంతు ద్రవ్యమును శ్రీరణేశ్వరుని కైంకర్యమునకు నొసంగి యుండెను. ఈపుణ్య కార్య మొక్కటి యీతఁ డొనర్చుటయు నాశ్చర్యకర మగు విషయము.

ఈతని కొమరులు 'నాన' 'భాగ' 'నందిముఖులు' అను వారు ముప్పురు. ఈముప్పురు తుంగోపజీవులై యుండిరి. ఇట్టి తరుణమున సంగ్రామరాజు వీరిని తనసేనాధినేతలనుగా నొనర్చెను. అర్భకుఁడు పసిఁడి బొమ్మల నుంచుచోట్ల యవల నుంచినట్లు సంగ్రామరాజు యుక్తాయుక్త వివేక హీనుఁడై యనర్హుల కున్నత పదవుల నొసఁగి నగుపాట్లపా లయ్యెను.

ఆ చమూపతులు మువ్వురు తురుష్క యోధ వారమును రూపు మాపుటకై మరల సంగ్రామరాజు నియోగమునఁ బ్రస్థాన మొనర్చిరి. కాని, వారు పిరికిపందలు గావునఁ దొల్లిటి తుంగుని వలెనే రణక్రీడ జరుపలేక పిక్కబలముఁ జూపుచు నిజదేశమునకు మరలి వచ్చిరి. సంగ్రామరాజు క్షమించి మిన్నకుండెను. రాజిట్లు శాంతి శీలుఁ డగుటయు నమాత్యు లయోగ్యు లగుటయుఁ గనిపెట్టి కొండజు దారదులు, దివిరులు (రాజోద్యోగులు) డామరులును నుద్రేక పూరితులు గాఁదొడఁగిరి.

ఇఁక రాజ దుహిత యగు 'లోఠిక' తనపేరను దనతల్లి యగు 'తిలోత్తమ' పేరను రెండు మఠములను గట్టించెను. పాపాత్ములు సైతము జన్మాంతర కృత మైన యొకానొక సత్కర్మ వాసనా బలముచేఁ బుణ్య కార్యము లాచరింప దొరకొనుటయుఁ గలదు. ఇందు నిదర్శనముగ భద్రేశ్వరునిఁ జెప్పవలయును. ఇతఁడు చాల దుష్టుఁడుగదా! అయినను నితఁడు సుకృతోజ్జ్వల మైన యొక విహారమును గట్టించెను. ఇది యొక వింత.

ఇంక సంగ్రామరాజు దనకుఁ గల విత్త మన్యాయార్జిత మను విషయము సత్య మని ప్రకటించు వివేకి. పాపము! ఈతఁడు తుదకు నొక చలిపందిరి నైన నేర్పఱచిన పుణ్యమునఁ బోలేదు. సంగ్రామరాజు దుర్దశకుఁ బరమావధి యగు విషయము మఱియొకటి గలదు ఇతని భార్య 'శ్రీలేఖ' 'శ్రీయశోమంగళని' కుమార్తె భర్త శిథిల సత్త్వుఁడై యుండఁ దాను స్వైరిణియై విహరించెను. 'సుగంధసింహునకు' 'జయలక్ష్మి' యందుఁ గలిగిన 'త్రిభువనుఁడు' శ్రీలేఖ చిత్తమును హరించెను. జయాకర గంజాది కోశ నిర్మాత యగు జయాకరుఁడును బార్థివ పత్ని యగు శ్రీలేఖకుఁ గోశోపకార మొనరించుచు నామె చిత్తమును స్వాయత్తము చేసికొనెను.

శ్రీలేఖయు, 'మయ' గ్రామమునందు గంజాది నిర్మాత్రియై ధనరాసులను సేకరించుచు ధన బుద్ధిఁ దగు భర్త యనుగ్రహమును బడసి భూరి వైభవములతో విలసిల్లెను. సంగ్రామరాజు తుదకిట్టి దుస్థితికి లోనై 4104. లౌకిక వత్సరమున (క్రీ.శ. 1028 ఏడి) తనపుత్రుని హరిరాజును రాజ్యాభిషిక్తునిఁ గావించి యిహమును బాసెను.

## హరిరాజు

అనంతరము కాశ్మీరపతి యైన హరిరాజు సుమన స్సేవితుఁడై యశేషాశాప్రకాశ మొనర్చుచుఁ జైత్రోత్సవమువలె సర్వలోకమునకు నాహ్లాదావహుఁ డగుచుండెను. రాజపదవి నలంకరించిన నాటినుండియు హరిరాజు నానతి యమోఘమై విరాజిల్లెను. వసుంధరపైఁ జోరులకుఁ జోటు లేక పోయెను. అట్టి రాజాజ్ఞచే నిశీథములందును బణ్యవీథులందుఁ గవాట బంధములు మాని వణిగ్జనము సుఖ ముండఁగగ్గెను. హరిరాజు నానతి చిరస్థాయిగా లేకపోయినది. అయినను దదున్నతి రాజుల కాలోచనా సమాదరణీయ మగుచుండెను. కావుననే రాజు లెల్లరు వానియానను నవేందు రేఖనువలె వందనార్హముగ నెంచి తదనుగుణముగ వర్తించుచుండిరి. క్షమాపతి యిరువది రెండు దినములు మాత్రము గాశ్మీర క్షితినిఁ బాలించి యశోవిలసిత మూర్తియై పుణ్యలోకము నొందెను. ఆషాఢమాసమున శుక్లపక్షాష్టమినాఁడు భౌతిక తనువుఁ బాసెను.

చిత్ర ప్రేమన! విశాల శ్యామలాకాశమునఁ దారలు 'తళతళ' మెఱయుచుండును. వానిశోభను వేసవినాటి రేయి చిరకాలము సహింపలేదు. ఇట్లే మానవుల శ్రీవిలాసము క్షణభంగుర మైయుండు ననుట నిక్కము.

గీ॥ ఆకసంబున మినమిన లాడు నట్టి
రిక్కలను గూడు వేసంగి రేయి వోలెఁ
బ్రాణులకు దక్క సిరియును బాపి పోవుఁ
గనులు దెఱవక యుండు నాక్షణములోన.

హరిరాజు తనజనని స్వైరిణీ వర్తనమునెడ సీసడించి యుండెను. అందుచే నామె సుతుని క్షేమమును గోరక యభిచార క్రియచే నాతనిఁ దుదముట్టించె నని జనశ్రుతి యొకటి లోకమున వెలువడెను. స్వైరిణులు సాహసికురాండ్రుగదా! ఆకింవదంతి నిరాధార మని చెప్పలేము.

తఱువాత రాజమాత యగు 'శ్రీలేఖ' రాజ్యార్థినియై రాజ్యాభిషేకమునకు వలసిన యుపకరణములను స్వయముగ సిద్ధపఱచి మంగళస్నాన సన్నాహ పర యగుచుండెను. కాని యంతలోననే శ్రీలేఖకు జ్ఞాతేయ సోదరుఁడు 'సాగరుఁడ'నువాఁ డేకాంగ సైనికులతోఁ గలసి యాలోచించి వారి సాయమున శ్రీలేఖ తనయుని బాలుఁ డగు 'ననంతుని నృపాసన మెక్కించెను. "తా నొకటి దలఁచిన దైవ మొకటి దలఁచును" నిక్క మయ్యెను

## అనంతభూపాలుఁడు

ఒకానొకఁడు నిధిలాభమునకై ప్రయత్నించి తద్రక్షకముగ నున్న మహాసర్పమును బహు ప్రయాసముతో నెట్టెట్లో సమయించెను. ఆనిధిని మాత్రము వేఱొకఁడు హరించెను. ఇట్లు ప్రయాసపడిన సర్ప హంతకు పాపము నార్జించుట దక్క ప్రయోజన ముండదుగదా!

కం॥ నిధి నోము పాము నొక్కఁడు
వధించి యుండంగ నొకఁ డుపాయంబున నా
నిధిఁ గొనియె; నింకఁ బామును
వధియించిన వాని పాలు పాప ఫలమెగా!

ఇట్లే రాజ్య లోభముచేఁ బుత్ర మారణము గావించిన దురాత్మురాలు 'శ్రీలేఖ' రాజ్యమును బడయలేదు. కాని, కేవలము ఘోర కలుషము నొడిఁగట్టుకొనఁ గల్గెను. చరిత స్వాంతురా లగు శ్రీలేఖ రాజ్యాధికార వియోగమునంజేసి వికల చిత్తయై పుత్ర ప్రేమకు నుంకేని మనసునం దావొసంగలేక పోయెను. మానవులందుఁ జూపట్టు నిట్టి భోగాభ్యాస వాసన నెంతేని నింపింపవలయునుగదా!

అనంతరము సింహాసనము వడసి యున్న యనంతుఁడు పిన్నవాఁడు గావున వానిఁ ద్రోసిపుచ్చి రాజ్యమును హరింపవలయు నను దురూహతో బాలభూపతియొక్క పితృవ్యుఁడు విగ్రహరాజు

'లోహర'మునుండి సమర సన్నాహముతో బయలుదేరెను. ఇతఁడు వృద్ధుఁడయ్యును విగ్రహ చతురుఁడు. కావుననే యితఁడు వెంటనే ద్వారమును గాల్పించి రెండున్నర దినములలోనే నగరమును బ్రవేశింపఁగల్గెను

ఆసమయమున శ్రీలేఖ వాని నెదిరించుటకై కొంత సైన్యమును బంపెను. ఆసైన్యమంతయు నొక్కమాఱుగ బయలుదేరి మంటలు రగుల్కొల్పి 'లోఠికామఠము'నందుఁ జొరఁబడియున్న విగ్రహరాజును వాని యనుచరులను నిరవశేషముగ మంటఁ గలిపెను. శ్రీలేఖ యీవిధముగ రాజ్యము నన్యాక్రాంతము గాకుండునట్లొనర్చెను.

మఱియు నామె పతిపేరను సుతునిపేరను మఠములను గట్టించెను. కాని, యామె భోగలాలస కావున ధనము నతివ్యయ మొనర్చి మరలఁ దదార్జనమునకై రాజ్య ద్రోహమునకు నడుకట్టియుండెను.

అంత కాలానంతునకు శైశవము మెల్ల మెల్లఁగఁ దొలఁగుచుండెను. అతఁ డాగర్భశ్రీమంతుఁడు. కష్ట మెఱుఁగని వాఁడు. అందుచేఁ దోడు తొలి యౌవనమునకుఁ జిక్కియుండెను. 'శాహి' పుత్రులు 'రుద్రపాలుఁడు' మున్నగు వారు వేతనముల బహుళముగ నార్జించుచు రాజ్యమున వచ్చు నాదాయమును గబళించుచుండిరి. వారికిఁ దగినట్లు కాలానంతుఁ డతివ్యయ వ్యసని యయ్యెను. ఆ రుద్రపాలాదులు ప్రతిదినము లక్షలాది ధనమును దోచుకొనుచుండియుఁ దనివి నొందక యుండిరి. అందు 'అనంగపాలుఁడు' క్ష్మాపాలునిచే లాలితుఁ డగుచుండుటవలనఁ దనయిచ్చ వచ్చినట్లు ద్రవ్యార్జనము సేయుచుఁ గడకు బంగరు వేల్పు విగ్రహముల నయితము కొల్లగొట్టి యింట వేసికొనుచుండెను. 'రుద్రపాలుఁడు' ధనప్రాణాదుల హరించు చోర చండాలాదుల కభేద్యమయిన వజ్ర పంజరమై వారినిఁ గాపాడుచుండెను. రుద్రపాలుని యాప్తులు కాయస్థులు పెక్కండ్రు గలరు. వారిలో నగ్రగణ్యుఁ డనఁదగిన వాఁడు 'ఉత్పలుఁడు' ఇతఁడు మాత్ర మొక్క యంధమఠమును గట్టించెను.

రుద్రపాలునకు భూపాలునెడఁ గల వాల్లభ్య మపారము. మొదట ననంతభూపాలుఁడు జాలంధరాధిపతి యగు 'నిందుచంద్రుని' జ్యేష్ఠకుమారిని 'ఆసమతిని' స్వయముగ వరించెను. ఆమె 'సురూపలావణ్యఖని' కావున నతని మనస్సు నాకర్షించెను. ఆదేవి 'త్రిపురేశ్వరము'నం దొక మఠమును దనపేరఁ బరఁగునట్లు నిర్మింపఁజేసెను. ఈ'ఆసమతి' చెల్లెలు 'సూర్యమతి'. ఆమెను గూడ 'రుద్రపాలుఁడు' 'అనంత' భూపతి కిప్పించి పరిణయము గావించెను. రుద్రపాలుఁడు నిత్యము భూపాలుని దరిఁ జేరి కర్ణసుఖముగ సంభాషించుచుఁ బ్రియవయస్యుఁడై నరపతిని దుర్నయ భాజనునిఁ గావించెను. వీరి నేస్తము కర్ణదుర్యోధనుల సంగాతమును దలఁపించుచుండెను.

ఇట్టి తఱి బల పరాక్రమ శాలియు దళవాయియు నగు 'త్రిభువనుఁడు' డామర సంఘమును గూర్చుకొని రాజ్యాపహరణ లౌల్యముతో దండు వెడలెను. ఇట్లతఁడు రాజద్రోహియై సైన్య నివహముతో యోద్ధుకాముఁడై రాఁగా నేకాంగ సైనికులు హయారూఢులై రాజపక్షమును వీడక యెదిరిపక్షము నెదిరించి రాజభక్తిని వెల్లడించిరి.

శ్లాఘ్యవిక్రముఁ డగు ననంతదేవుఁడు, అయ్యవసరమున రణరంగమునందు వీరవిహార మును సల్పుచుఁ గృపాణ పాణియై శాత్రవ ప్రయుక్తములగు ప్రాసాదులను నుగ్గుసేయుచు మదించిన యా త్రిభువనుని స్వయముగ సమరావని కుదుగర గావించెను.

త్రిభువనుఁడు మైమఱువు మున్నగు సంగ రక్షక సాధన సంపదతోఁ గూడియు ననంత దేవుని బెట్టిదములగు నసి లతా ప్రహారములకు లొంగి క్షతగాత్రుఁడై పుడమిం బడునపుడు స్వీయ ప్రతాపమును గ్రక్కుచున్నవాఁడువోలె రుధిర ధారలు ముఖమునుండి వెలువడుచుండ నూహాతీత మైన యయ్యనంత భూపతి శక్తినిఁ గాంచి నిలువలేక రణరంగమును విడిచి పరుగిడి పోయెను.

అనంత భూపాలుఁడు శిశుప్రాయుఁడయ్యును గాంభీర్య ప్రాగల్భ్యాది గుణగణముల నొప్పు చుండెడివాఁడు. అతని ప్రాగల్భ్యమునకు నతనియడఁకువ కవచమై పొల్పారుచుండెను. అభూపతి త్రిభువనుఁ డట్లు సంగర విముఖుఁడై పలాయితుఁడు గాఁగా, 'అభినవుఁడు' అను శమాలాడామరుఁడు ప్రాసాదులం బ్రయోగించి నిజ సైన్యమును హత మార్చుచుండుటఁ గని యచ్చోటునకు వైళంబ యేగి 'శాలాస్థలమునందు' వాని విక్రమమును మట్టువెట్టి శ్లాఘ్యవిక్రముఁ డయ్యెను. మఱియు ననంత భూపతి యత్తఱి ఘనీభవించిన మాంస రుధిరాదులు దట్టముగ నలముకొనుటచేఁ జేగఱ్ఱగాఁ గాన్పించు చున్న ఖడ్గలతను గేలఁ గీలించి రణాంగణమున వీరవిహారము సల్పుచుండుటం జేసి ప్రపంచ క్షోభ కారి యగు భైరవుని చందానఁ గన్పట్టెను.

ఆసమరమున క్షతగాత్రులై లూనాంగులైన యేకాంగ సైనికులు పెక్కండ్రుండిరి. దగ్గఱ నుండు ననుచరు లిట్టివారిని నామ నిర్దేశ పూర్వకముగ నివేదించుచుండ ననంతదేవుఁడు వారినెల్ల నడు గడుగునను జూచి యాదరించెను. అంతియెగాక యమ్మహీపతి యేకాంగులయెడ నెంతయు దాక్షిణ్య మును గనఁ బఱచుచు, 'అక్షపటలము' నందలి వారి పూర్వపుఁ జంచల జీవనమును నివారించి వారికి నిర్ణీత స్థిర పురోభివృద్ధి నేర్పాటు గావించి ప్రజారాధకుఁ డయ్యెను.

అత్తఱుణమున ననంత మహీపాలుఁడు నిజ భృత్యులయెడఁ గృతజ్ఞత నీవిధముగఁ గనఁ బఱచుచుఁ గ్రమముగ వారి బహుమాన పోషణములకై తొంబది యాఱు కోట్ల దీనారముల ధనమును వినియోగ పఱచెను. ఆతేఁడు కదనమునుండి మరలి వచ్చిన తఱువాత నతని హస్తమును దృఢముగ నంటి యున్న కృపాణపుఁ బిడినిఁ బెద్దతడవు దుగ్ధ సేకములచే నెట్టకేలకు నూడఁబెఱుక వలసి వచ్చెను. ఇట్టి యనంత భూపాలుని మహత్త్వము నెంతేని గొనియాడవలయును. ఆశ్చర్య పడవలసినది మఱి యొకటి గలదు.

ద్రోహి యగు 'త్రిభువనుఁడు' ఆహవ పరాజితుఁడై దేశములంబట్టి యుండెనుగదా! అట్టి వాఁడు దీనుఁడై యనంతునికడకు వచ్చుటయు వానినిసైత మతఁడు సుంతేని పగలేక మరలఁ జేరఁదీసి యుండుటయు సంభవించెను.

ఆతేని మహౌదార్యమే యిందు కవకాశ మొసఁగియుండె నని వేఱుగఁ జెప్ప నక్కఱ లేదుగదా! భూపాలుని కోశాధికారి 'బ్రహ్మరాజు' అనువాఁడు చంద్రపాలుని ద్వేషించు చుండుటచేఁ దన

యధికారమునకు 'స్వస్తి' చెప్పవలసిన వాఁడయ్యెను. రుద్రపాలుఁడు రాజున కత్యంత మాప్తుఁడని మనకు విదితచరమే. బ్రహ్మరాజాకారణమునఁ దనపదవియెడ విరక్తుఁడై శత్రువర్గమును జేరుకొనెను.

అంత నాతఁడు ప్రబల మైన పూన్కితో డామరుల మైత్రి సంపాదించెను. మఱియు మ్లేచ్ఛ భూపతుల సఖ్య మర్థించెను. దరద్భూపతి యగు 'నచలమంగళుని' నతియత్నమునఁ దనపక్షమునకుఁ ద్రిప్పుకొనెను. ఈరీతి సమర సన్నాహ విజృంభితుఁడై బ్రహ్మరాజు 'క్షీరవృష్ఠ' మను గ్రామమును జేరుకొనఁగ వాని నెదిరించుటకై విక్రమోదగ్రుఁ డగు రుద్రపాలుఁడు సమధిక సమర సన్నాహముతో బయలుదేరెను.

అంత నిరువాగుల సైన్యములకును "తేపటి దినము సంగ్రామము ప్రారంభ మగును." అని నిర్ణయింపఁబడెను. దరదీశ్వరుఁ డానాఁడు విహార వినోదమునఁ బ్రొద్దు పుచ్చుచుఁ 'బింగారకుఁడు' అను నాగుని భవనముఁ జేరెను. అచ్చో నతఁడు పార్శ్వచరులు దన్నెంత వారించినను వినక యక్కడ నీఁదుచున్న యొక మత్స్యముపైఁ గుంతమును బ్రయోగించెను. తోడనే యాహ్రదమునుండి జంబుకాకృతి గల యొక భుజంగము వెలుపలికి వచ్చెను. ఆదరదీశుఁడు విస్మయంపడి మృగయా కుతూహలమున దానిని వెంబడించెను. ఆయుధపాణియై వచ్చెడు దరదీశ్వరుని రాజసైన్య మాలోకించి వ్యవస్థాభంగమొనర్చి యెత్తివచ్చుచున్న వానిఁగాఁ దలంచి కోపమున మిన్ను ముట్టి యొక్కమాఱుగా వానిపైఁ బడెను.

ఆ సమర సంరంభమున శస్త్రాస్త్ర సంఘర్షణముచే హుతాశన జ్వాల లుప్పరవీధి నలముకొనెను. అయ్యవి సాక్షిగా స్వర్నారీమణులకు వీరవతంసుల యెడ స్వయంవరోత్సాహము మెండయ్యెను. కొంత తడవునకే దరదీశ్వరుని శిరము ఛిన్నమై నేలఁబడెను. మహాభటుల 'జయజయ' ధ్వానములతో రౌద్ర మూర్తి యగు రుద్రపాలుని కీర్తిలత పల్లవిత మయ్యెను. ఆకయ్యమునందుఁ బెక్కండ్రు మ్లేచ్ఛరాజులు యమపురి కతిథు లైరి. కొందఱు హత శేషులు బందీకృతు లైరి. ఈవిధమునఁ గాశ్మీర నాథునకు మరల హేమ రత్నాది బహువిధ ధన నిచయము కైవస మయ్యెను. దరదీశ్వరుని యుత్తమాంగమునుండి స్రవించు రుధిరము తదుత్తంస మౌక్తికముల కాంతి పూరముచే శోణిత మగుచున్నట్లుండెను. అట్టి శీర్షము 'రుద్రపాలుఁడు' కాశ్మీర మహీకాంతున కుపాయనముగా నొసఁగెను.

అనంతభూపతి కప్పు డప్పు డీవిధముగనే తనసోదరుఁ డగు సుదయనవత్సునితోడను ప్రాయోపవేశము లొనర్చుచు బెదిరించు విప్రులతోడను బెక్కు చిక్కు లెదుర్కొనవలసిన ట్లయ్యెను.

అంతఁ గొంత కాలమునకు రుద్రపాలుఁడు 'లూతామయ' గ్రస్తుఁడై యసువులఁ బాసెను. పిమ్మట నతికాలములోనే రాహితనయ లందఱు వినాశము నొందిరి. అనంతభూపాలుని డెందము దర్పణమువలె స్వాభావికముగ నిర్మల భావ భాసుర మైనది. కాని, రుద్రపాలుని స్నేహముచే నయ్యది చీకటి కోన యయ్యెను. ఇప్పటి కాయంధకారము తొలఁగుటవలన సాధుశీల యగు 'సూర్యమతీ'దేవి భర్త యగు ననంతుని యంతరంగమునఁ జక్కఁగాఁ బ్రతిఫలింపఁగల్గెను.

సూర్యమతికి 'సుభట' యను నామాంతరము గలదు. ఆయమ్మ గౌరీశ్వర మఠమును గట్టించి యుండెను. మఱియు నారాజ్ఞి సదాశివుని( బ్రతిష్ఠించిన తరుణమున( బెక్కండ్రు ద్విజపుంగవులకు గో హిరణ్యాది భూరి దానము లొనర్చి యుండెను. ఆమె చేసిన మహోదార వితరణమున నాద్విజన్ము లందఱు దారిద్ర్య దేవతకు నుద్వాసనము( జెప్పి సుఖం బుండిరి. సూర్యమతి యిప్పుడు వితస్తానదీ పులిన భాగమునందు 'సుభటా' నామమున( బరగునట్లు వేఱొక పవిత్ర మఠమును నిర్మింపఁజేసెను.

ఇంతమాత్రమే గాదు. ఆరాణి తన యనుజుఁడును 'ఆశాచంద్రుఁడు' అను నామాంతరము గలవాఁడు నగు 'కల్లను'ని పేరను 'పిల్లనుఁడ'ను వేఱొక సోదరుని పేరను దనపతినామముననుు విఖ్యాతములగునట్లు మఠముల వేర్వేఱ విజయేశామరేశుల యాలయ ప్రాంతమున నిర్మింపఁజేసెను.

మఱియు నీసూర్యమతి విజయేశ్వరమునందు నూటయెనిమిది యగ్రహారములను విద్వాంసుల కొసఁగుటయేగాక యమరేశ్వరమునందు భర్తృనామమున విలసిల్లిన ట్లగ్రహారముల నొసఁగి త్రిశూల, బాణలింగాది ప్రతిష్ఠలను సైతము గావించి ధన్యురాలయ్యెను. ఈరాజదంపతులు తమపుత్రుఁడు "రాజరాజు" అకాలమరణము నొందుటచే విరక్తులై రాజహర్మ్యమును వీడి సదాశివుని యంతికమున నివాస మేర్పఱచుకొనిరి.

అదిమొదలు తఱువాతి రాజన్యులకు సైతము రాజభవనములను బరిత్యజించుటయు నాసదాశివాలయము చెంగట వసించుటయు రూఢ మైన పరిపాటిగా నేర్పడెను. ఈయనంతమహీపతికి నుత్తమాశ్వములన్న మిగులఁ బ్రీతి. కావున నితఁ డశ్వశాలీయులయెడఁ గర మాదరముఁ జూపుచుండెను. ఆశ్వశాలీయు లెల్ల రట్టి యవకాశమును బురస్కరించుకొని దేశమును గొల్లగొట్టుచు రాజసములై మెలఁగఁదొడఁగిరి. ఆగర్భశ్రీమంతుఁ డగు నీతేనికి నర్మకోవిదుఁడును దైశికుఁడును నగు 'డల్లకుఁడు' నచ్చిన చెలికాఁడు. అతఁడును బ్రజలను బీడించి విశేష ధనము నాచికొనెను.

కాశ్మీరమునఁ " 'పాపసూదనము' అను తీర్థము గలదు". అని మున్నే తెలిసికొంటిమి' మాలవ దేశాధిపతి యగు 'భోజమహారాజు' "పాపసూదన పావన తోయములతో వదన స్నాన మాచరింపవలయు" నని ప్రతినఁ బూని యుండెను. అందుల కనుగుణముగ నమ్మహీకాంతుఁడు 'కపటేశ్వరము'నం దొక కొలఁకు నిర్మింపఁజేసి దుష్ప్రాప మగు పాపసూదన జలమును గావ ఘట చయములతోఁ దెప్పించి యయ్యలఁతి కొలఁకును నింపఁజేయుచుఁ దనప్రతిజ్ఞను సాధించు కొనఁగల్గెను. ఇక్కార్య సాధనమునఁ 'పద్మరాజు' అను పేరుగల దైశికుఁడు భోజభూజానికి మిగులఁ దోడ్పడియెను. ఆతేనివలన గడించిన ధనముతో నతఁడు బంగారు పాతరలు వెట్టెను.

ఈపద్మరాజు తొలుత మేలయిన చవి గల తమలపాకుల విక్రయించుచుఁ గాశ్మీరమున వసించుచుండెను. కాశ్మీరపతి యనంత భూపాలుఁడు తాంబూల ప్రియుఁడు. కావునఁ బద్మరాజునకు ననంత మహీపతికిని స్నేహము సమకూరెను. పద్మరాజు పాపసూదన జలమును బంపుచు భోజుని వలనను దాంబూల ప్రియుఁడై త్యాగము నొనరించు ననంతునివలనను నపార ధనము నార్జించెను.

నాగర ఖండములను దమలపాకులను నమ్ముకొనునట్టి 'పద్మరాజు' ఈవిధముగఁ గాశ్మీర మహీపతి ధనము నంతను దోచుకొనుటయె గాక దేశలబ్ధమగు ద్రవ్యమును సంపూర్ణముగఁ గబళించెను. తుదకు 'చంద్రక' పర్ణ భాసమానములై మణిపంచకముతో వెల్గుచుండెడు ననంతుని కిరీట సింహాసనములను సైతము దనకు రావలసి యున్న యధిక ధనమునకై తనదగ్గఱఁ గుదువఁ బెట్టించుకొనఁ గల్గెను. అట్లు కుదువఁబెట్టిన కిరీట సింహాసనములను బ్రతిమాసమునను గొలువుండు సమయములందు నాచారార్థము మాత్ర మాకాశ్మీరపతి పద్మరాజు భవనమునుండి తెప్పించుకొనుచు మరలఁ బంపుచుండెడువాఁడు.

ఈరీతినిఁ బద్మరాజువలన దేశమునకు వాటిల్లిన యవ్యవస్థను గమనించి యనంతుని పట్టమహిషి యగు 'సూర్యమతి' యుద్దానిని సహింపక స్వీయ మగు కోశ సంచయమును బద్మరాజున కొసఁగి వాని దుశ్చర్యను నివారించెను. మఱియు నాదేవి 'డల్లకుఁడు' మున్నగు నశ్వశాలీయాదుల వలనఁ గలుగుచుండిన దుస్తంత్ర పీడను గూడ వారించి మరల దేశమునందు రాజ్య వ్యవస్థ సక్రమముగ సాగింపఁగల్గెను.

అది మొదలుకొని యారాణియే రాజ్యకార్యముల నన్నిటిని మెలఁకువతో నిర్వహింపఁ బూనెను. అనంతభూపతియుఁ దనశౌర్య కథలను గట్టిపెట్టి రాణి ననుసరించి మరల సక్రమ కార్యకరుఁడై విలసిల్లుచుండెను. మగఁడు భార్యకు విధేయుఁ డగుట భార్య మగనిపైఁ బెత్తనము సాగించుటయు లోకమున నంత మెచ్చఁదగినవి కావేమో! కాని. నిష్కళంక శీలమున విరాజిల్లు నారాజదంపతు లాపరిపాటిచే నిందకు గుఱి కారైరి.

శివభక్తి వ్రతానుష్ఠానము త్యాగము శీలము మొదలగు సద్గుణము లన్నియు ననంతునియం దావేశించినవి. అకారణమున నాసుకృతి మునులను సైతము మఱపింపఁగల్గెను. ఇంకొక విశేషము. దీర్ఘ మగు నీయనంతభూపాలుని కాలమున రాచఱికపుసిరి పతింవర యగు నంగనామణివలెఁ బలుమాఱు క్రొత్త క్రొత్త భృత్యులపైఁ గన్ను మెలపినది.

ఆ తరుణమున 'క్షేముఁడు' అనునొక నాపితుఁడు వివిధ వ్యాపారములచే విశేషధనము నార్జింపుచు ద్వాదశభాగాదికమగు సుంకము చెల్లించుటచే రాజధనాగారము మరలఁ బరిపుష్టమయ్యెను. అయ్యదనునఁ ద్రిగర్తదేశపు బ్రాహ్మణుఁడు 'కేశవుఁడు' అనువాఁడు, అమ్మహీజాని కదృష్టవిశేషమున మంత్రిగా నేర్పడెను. అతఁడెంతయు సాధువు, మంత్రిపదము నలంకరించిన యాద్విజరాజు చెంగట ననంత క్ష్మాకాంతుఁడు నిండు వెన్నెలతో శోభిల్లు సౌధమువలె నెంతయు వన్నెమీఱెను. అయిననేమి! అట్టి యనంతుఁడే మరలఁ గొంతకాలమునకు హతభాగ్యుఁడై యేకాకిగఁ బరిభ్రమించుచుండఁ బ్రజలు మున్నటి నేత్రములతోడనే యాతని నావిధముగఁ జూడవలసివచ్చెను.

అంతయు భాగ్యాధీనముగదా! సంపదలు భాగ్యాంబువాహసంజనితములగు వైద్యుత ప్రభలు. అవియెందునను ఘనీభవించి సుస్థిరముగ నుండవు. ఇట్లు భాగధేయాధీనమైన ధనాది సంపదను వంశపరంపరానుగతమైనదనియు స్వీయ పౌరుషలబ్ధమైనదనియుఁ దలంచి దర్పమున నుప్పొంగుచుండుట కేవలము వ్యర్థము. అట్టి గొప్పతనము గగన కుసుమము వంటిది.

గీ॥ సంపదల పై భవము తటిచ్చంచలంబు
మబ్బువలె నది చిటికెలో మాయమగును.
వాని కలిమికిఁ బొంగుడు వాని పోక
కలమటించెదు వాఁడెవో వ్యర్థుఁ డుర్వి.

గౌరీశనాలయమునందుఁ బ్రాసాదపాలకుఁడుగా 'భూతి'యను వణిజుఁ డొక డుండెను. అతనికి 'హలధరుఁడు' 'వజ్రుఁడు' 'వరాహుఁడు'నను ముప్పురు సుతులు గలరు. వారిలో హలధరుఁడు మిగులఁ దెలివిగలవాఁడగుటచే సూర్యమతి వానికిఁ దనయాస్థానమున నొకస్థానము గల్పించెను. ఆహలధరుఁడు తన నేర్పుచే సంస్థానమున దినదినాభివృద్ధి నొందుచుఁ దుదకుఁ బ్రధానమంత్రి యయ్యెను. అతఁడా పదవిచే మిగుల రాణించి తనబుద్ధి కౌశలమున సమీపవర్తులగు క్షితిపతుల నందఱను విధేయులనుగా నొనర్చుటవలన నారాజ దంపతు లిరువురు నాతని స్వీయునిఁగా నెంచి యత్యంతాదరము నతనిపైఁ జూపుచుండిరి.

తొల్లిక్షేమగుప్తుఁడను వానిచేఁ గర్మస్థానపు విధానము సపాదాగ్రముగ సూత్రింపఁబడి యుండెను.' హలధరుఁడట్టి కర్మస్థానము సాంగోపాంగముగ శోభిల్లు నట్లొనర్చెను. మఱియు నాకాలమున రాష్ట్రమునందు బంగారపు వర్ణమూల్యాదుల ప్రకాశమునకై ప్రజల విత్త సంచయమునఁ గొంత రాజాయత్తము గా వలసియుండుట పరిపాటిగా నుండెను. హలధరుఁడు మిగుల దూరదృష్టిగలవాఁడు. కావుననే యట్టి పరిపాటిని నిషేధించెను, కారణమేమన? "ప్రజలను వారి సమార్జిత విత్తములపై లేనిపోని నెపములువెట్టి జరిమాన మొదలగునవి విధించి అధికారులు పీడింతురు." అని హలధరుఁ డూహించి యందుల కవకాశము లేకుండున ట్లాపరిపాటినే రద్దు గావించెను.

ఆతరుణమున సశ్వశాలీయులు మదించి ధన దారాపహరణ మొనర్చుచుఁ బ్రజలఁ బీడించుచుండెడివారు. హలధరుఁ డట్టివారలలో మొనగాండ్రను గొందఱను బట్టి యురిదీయించి లోకవిప్లవము నణఁచివేసెను. మఱియు నితఁడు వితస్తా సింధునదుల సంగమ ప్రాంతమంతయు బంగరుతళుకుల జీరాడునట్టి దేవాలయములతోడను అగ్రహారములతోడను బూరించి పన్నులు లేక వన్నె మీఱునట్లు గావించెను. ఇఁక హలధరుని సోదరులును సుతులును సంతతలక్ష్మీ పరిచయోన్మదులై మదగజములవలె నెందును స్వాభావికమైన దానప్రణయిత్వమును విడనాడకుండిరి.

హలధరుని సోదరుఁడు వరాహుఁ డనువాని కుమారుఁడు 'బింబుఁడు' అనువాఁడు ద్వారాధికారపదవిని నిర్వహించుచుండెను. అతని దానధార ఘనాఘన సలిలధార ననుకరించెడిది. అతఁడు డామరకులమున కకాల మృత్యువు. ఒకానొక సమయమున నతఁ డలఁతి దళముతో సంగర రంగమున ఖశులతోఁడ మాఱ్కొని వెనుకకుఁ దిరుగని వాఁడై వీరశయన మలంకరించెను.

ఆకాలమున 'చంపను' బాలించుచుండిన 'సాలునితో' ననంత భూమీశునకుఁ బోరు సంభవించెను. ఆసంగ్రామమున ననంతక్ష్మాపాలుఁడు సాలనరపతినే గాక యాయారాజులఁ బెక్కండ్ర నోడించి వారివారి రాజ్యములందుఁ దనకు విధేయులగు నూతన సామంత రాజులను బాలకులుగా

సల్పెను. ఈతఁ్మకొంతఁ్ డప్పుడప్పుడు మంత్రాంగము నెఱపకయే స్వీయశౌర్యమును మాత్రమవలం బించి పర దేశములం దాకస్మిక ప్రవేశ మొనర్చి పెక్కుమార్లు సంకటములం జిక్కుకొని యుండెను.

ఒకమాఱు తుక్కాత్మజుండగు ఖసనితోఁ బోరు సల్పునప్పుడు నిజసైన్య మలసటతో ఖిన్నమైయుండ నతఁడు శౌర్యమును వీడక యొంటిమై పోరుచు విపద్దశకు గుఱియగుట తటస్థించెను. అట్టి తరుణమున హాలధరుఁడు తనయొడయని యుక్తితో నాప్రమాదమునుండి తప్పించెను. మఱియు నొకప్పుడితఁడు 'ఉరశను' ముట్టడించుటకై ప్రస్థాన మొనరింప శత్రువ్యూహము లీతని మార్గమున నాకస్మికముగ నడ్డగించెను. అప్పు డీతని ప్రధాన దండనాథుఁడు సాయపడి శాత్రవ సేనలను దఱిమి వేయఁగా విజయయాత్ర నిరాటంకముగా సాగెను. ఇట్లు వైరి విజయమునకై ప్రయత్నించుచుండిన యనంతమహీపతి పాలనకాలమునఁ బగతురతో నాయోధనములు విరామములేక వాటిల్లుచునే యుం డెను. అందువలన నీధరణీధవుఁడు పలుమాఱు, ఆకస్మికములగు పెక్కు చిక్కుల నెదుర్కొనవలసి వచ్చెను.

క్రమరాజ్యము నందుండు డామరులు మదించి రాజసంబంధువులను నితరుల ననేకులను హత మార్చిరి. అంతమాత్రమె గాదు, భద్రేశ్వరుని సుతుఁడును ద్వారాధ్యక్షుఁడును నగు రాజేశ్వరుని సయి తము వధించిరి.

రాజమందిరమునం దవమాన మనునది యెఱుఁగకుండఁ దుదివఱకు సేవచేయుట కడుంగడు నరిది. ఎంత నయదృష్టితోఁ గార్యపరిశీలనము జరుపుచున్నను ఎంత భయ వినయ శీలసంపదతో వ్యవహరించు చుండినను నెట్టి మేధావులకేని నృపభవనముల నెప్పుడో యొకసారి పరిభవము తప్ప దనుట నిక్కము.

గీ॥ నృపతి మాత్రులదగ్గఱ నేర్పుతోడ
భీతితో పీతితోఁ గడుఁ బ్రీతితోడ
మెలఁగి సేవించుచుండు భృత్యులకుఁ గూడఁ
బరిభవము లేక సాగదు బ్రతుకుఁ దెరువు

హాలధరుఁడు దన ప్రతిభాబలమునఁ బట్టమహిషి యగు సూర్యమతీదేవి సన్నిధినిఁ గూడ నత్యంత పరిచయమును సముపార్జించెనని మున్నె వినియుంటిమి. హాలధరుఁ డట్లా దేవినిఁ గరము సేవించుటంజేసి లోకమునఁ గొండొక కాలమున నొక దుష్ప్రవాదము బయలుదేరెను. ఆకారణమున నాశాచంద్రాదులు మిగులఁ గోపించి యట్టి హాలధరునిఁ గూడఁ జెఱ యందుంచిరి. వాఁడును హాలధరుని సర్వస్వమును స్వాయత్తము చేసికొనియె. పాపమతఁ డీవిధమునఁ గారాక్లేశమునఁ జిరకాలము దుర పిల్లవలసిన వాఁడయ్యెను. అదృష్టము సారహీనమయినప్పుడు స్థిరమైన సుఖమెట్లు దక్కఁగలదు?

పిదప గొంత కాలమునకు రాజానుగ్రహమువలన 'హాలధరుఁడు' కారావిముక్తుఁడయ్యెను. అంత రాచసిరియు శ్వేతచ్ఛత్రమును చిఱునగవును నునుసిగ్గును బొదివికొన్న మోముతో నాతని యథా

పూర్వకముగా నాశ్లేషించినదయ్యెను. రాణి యాదరమునకు హాలధరుఁడు పాత్రుఁడైనను క్షణక్షణము నను వర్షకాలమునందలి దినలక్ష్మి కాఱు మబ్బులను దినమణి ప్రభావీచులను నెనసినట్లు నామె విగ్రహాను గ్రహములకుఁ బర్యాయముగ గుఱియగుచునే యుండెను.

అనంతరము సరళచిత్తుఁడగు నయ్యనంత మహీజాని క్రమముగ దురదృష్ట విపాకమున కభిముఖుఁ డగుటవలన భార్యకు వశంవదుఁ డయ్యెను. అంత నతఁడు పుత్రస్నేహ విమూఢ యగు భార్యచేఁ బ్రేరితుఁడై హాలధరుఁడు మున్నుగాఁ బెక్కండ్రు మంత్రులు "పశ్చాత్తాప మూల మగు నిట్టి పని యిప్పుడు వలదు. వలదు." అని యెంత విన్నవించినను వారల గణింపక 'కలశుఁడు' అను తనపుత్రుని రాజ్యాభిషిక్తునిఁ గావింపఁ బూనెను.

పిమ్మట నతఁడు 'రణాదిత్యునకుఁ' దనయాశయమును దెలుపఁగ నతఁడును నందులకుఁ దన సమ్మతినిఁ దెలుపక యిట్టి కృత్యమున వెనుక విచారింపవలసి వచ్చును." అని యనెను. ఏమన్నను, భార్యా జితుఁడగు ననంతభూపతి పట్టాభిషేక సన్నాహము జరుపవలయునని రణాదిత్యునకు ముదల యిడెను. ఇట్టి పూనికతో నాతఁడు నిజ తనూజాతుఁ డగు "కలశుని" 4139 శకవత్సరమున (క్రీ. శ. 1063 ఏ డి) కార్తికశుక్ల షష్ఠినాఁడు రాజ్యాభిషిక్తునిఁ గావించెను.

## కలశమహీపతి

అనంతరము రణాదిత్యుఁడు రాచకొలువునందు రాజపుత్రులను బ్రవేశపెట్టి రాజ్యమహిమను వెల్లడించు గౌరవ విశేషములందు నియతి నావంతయేని దప్పక పాటించుచుఁ గ్రొత్తరాజ్య పట్టముచే నలంకరింపబడిన యాబాల భూపతికి వారి నందఱ నెఱుకపఱచెను. అట్లే యనంతుని సన్నిధికివచ్చి నపు డారణాదిత్యుఁ డాతని ముచ్చెలిగుంటపైఁ దనహస్తముంచి కలశమహారాజుతో "దేవ! యీయన రాజపుత్రుఁడగు ననంతుఁడు" అని విన్నవించెను. అందుల కనంతమహీపతి గోపించి గిఱ్ఱున రణాదిత్యునివంక దిరిగి యాతని సవిశేషముగఁ జూచెను. మహామాత్యుఁడగు రణాదిత్యుఁడును ననంత భూజాని కినుకకుం గల కతం బెఱింగి దర హసిత వదనుఁడై తన నీతి నియమమును సడలింపక సుస్పష్టముగ ననంతభూపతితో నిట్లు పల్కెను.

"రాచరికపు టానువంశిక మర్యాదను బాటించుటయే యీకొలువునందుఁ గాన్యకుబ్జ మహీశుఁ డాదిగఁగల వారి నెల్లరను గ్రొత్త రాజన్యునకు నివేదించితిని. అట్టి ప్రతిపత్తియే మీయెడను గనుపఱచితిని. ఇందు నేనొనర్చిన దోసఁగేమియు లేదుగదా! అదియుఁగాక రాజ్య భారమును విడిచి పెట్టిన మీకు నీయాస్థానంబునఁ జూపఁదగ్గ మర్యాద విశేషము వేఱొక టేమున్నది?" అని యనుచు వెండియు రణాదిత్యుఁ డనంతు నుద్దేశించి "దినదినము మీ కిఁకఁ బశ్చాత్తాప భారము వహింపక తప్పదు. కారణ మేమన? రాజ్యాభిమాన మట్టిది. మునులు సైత మభిమానము వీడలేరన్న రాజుల విషయమున నది యెట్టిదో చెప్పవలయునా?" అని పల్కెను. ఇట్టి రణాదిత్యుని పల్కులు దూరదృష్టి గల యచ్చటి మంత్రి వర్గమున కెంతయు హృదయంగమముగఁ దోఁచెను. అనంతుఁడు మాత్రము విని సదుత్తరము నొసఁగ నేరక మిన్నకుండెను. ఈసంగతి యానాఁ డంతమాత్రమున ముగిసెను

మఱునాఁడు సామంత రాజ బృందము మున్నగు వారందఱును నూతన మూర్ధాభిషిక్తుఁ డగు కలశుని సేవించుచుండిరి. ఇఁక ననంతమహీధవుఁడు పరిమిత సామాన్య పరిజన పరివృతుఁడై యుండెను. నిపుణమతి యగు 'హలధరుఁడు' అనుమంత్రి యొకకంట ననంతుని దైన్య దశను మఱి యొక కంట వానిపుత్రుఁ డగు కలశుని రాజరీవి విశేషమును గన్గొనియెను. ధీమంతుఁ డగు నాతం డంతట నూరకుండక యెట్టులేని యనంతుఁడు మరల రాజ్యాధికారమును వహించునట్లు చేయఁదలంచి యొక యుక్తి పన్నెను.

అంత హలధరుం డనంత నరేంద్రుని వలనుఁ జూచి తెచ్చికోలు కిన్కతో బెదరించుచున్న వాఁడువోలె నిట్లు పల్కెను. "ఓరాజా! శిశుప్రాయుఁ డగు నీకొమరునిపై నకాలమున నింతటి రాజ్య భారమును మోపి యతనిని యౌవన సుఖ హీనునిగా నొనర్చి సుఖ లాలసుఁడవై నీవు వార్ధక్యమును గడపఁబూనితివి. ఇయ్యది నీకు లజ్జాకరము గాదా! కావున నీవే రాజ్య భార మంతయు వహింపఁ దగును. నీపట్టి యౌవన సుఖానుభవ శూన్యుఁడు గాకుండుఁగాక"। ఇట్టి యుక్తి యుక్తము లగు హలధరుని వాక్యములు రాజ్యాధికార మనంతభూపాలుఁడు మరల స్వీకరించుట కెంతేని దోడ్పడెను. అంత మాత్రమె గాదు. ఈమాటల చాకచక్యము కలశుని వలలోనికిఁ దెచ్చెను. ఎల్లపుడు పితరుల యంతికమున నే కలశున కాహార పానీయములు సాగుచుండెను. ఇట్లు కలశమహీపతి రాజాస్థానమునఁ బార్థివోచిత మైన యుత్రపూజాది సకల విధానమునందును దండ్రికి బాసటయై పురోహిత కల్పుఁడై మెలఁగుచుండెను.

ఇఁక రాజమాత పుత్ర వాత్సల్యమునంజేసి మొదటఁ గలశుని పట్టాభిషేకమునకై భర్త నెంతేని ప్రోత్సహించినది. కాని పిమ్మట మిగుల ననుతాపపడఁజొచ్చెను. నిష్కారణ మగు హర్షమును నిర్నిమిత్త మగు పశ్చాత్తాపమును బొందెడు చలచిత్తులకుఁ దిర్యక్కులకుం బలె నెందును నిశ్చితాశయము లుండవు.

గీ॥ నిర్నిమిత్తానుతాపంబు నిర్నిమిత్త
మైన హర్షంబుఁ గాంచెడు నట్టి వారు
చపలులై యుంద్రు పక్షులు పోటి గాఁగ
వారి కుండదు నిశ్చిత భావ మెందు.

ధవుని నిర్బంధించి సుతుని రాజ్య పట్టముచే నలంకరింపఁజేసిన యాదేవి యంతలోఁ దన యుని యున్నతి నొల్లక వంత నొందసాగెను. స్త్రీప్రకృతియం దిది యొక వింత విషయ మనవలయును. మఱియు నామె తనపుత్రుని దేవేరులు రాజపత్నులకుఁ దగిన నగలను ధరించుటగాని, అట్టి పట్టములఁ గట్టుకొని యుండుట గాని చూచి సహింపలేక పోయెను. ఇల్లలుకుట మొదలుగాఁగల పనులు గూడఁ గోడండ్రచేఁ జేయింపుచుఁ దనమచ్చరమును బ్రకటించుకొనెను. అరాణులును నట్లే యత్తగారి యానతిని మీఱక మెలఁగుచుండిరి. ఈసంగతి యిట్లుండెను.

ఒకనాఁడు 'క్షితిరాజు' అను నతఁడు, అనంతభూపతి సన్నిధి కరుదెంచెను. ఈతఁ డనంతుని తండ్రి సోదరుఁడగు విగ్రహరాజు కుమారుఁడు. క్షితిరాజు తనకుఁ గల్గిన మనోవ్యధ ననంతుని కిట్లు దెల్పుకొనెను. "ఇప్పుడు నాకుఁ గల్గిన కష్టమిది. నా కుమారుఁడు 'భువనరాజు' 'దుండగము మేర మీఱినది. ఇంతకు మునుపే యతఁడు 'నీలపూరు' రాజ్యము నాశ్రయము కావించుకొని యుండెను. ఇప్పుడు వాఁడు నన్నెదిరించి నారాజ్యము నంతయు లోఁబఱచుకొనవలయునని ప్రయత్నించుచున్నాఁడు. అందు కనుగుణముగ నీలపురమునందలి బలము నంతయుఁ దనవశము గావించుకొని నన్నణఁచివేయ సన్నద్ధుఁడై యున్నాఁడు. నాకుఁ బుత్రరూపమున నీవ్యాధి గల్గెను. ఆదుష్టుఁడు భాగవత శిఖామణులు నాకుఁ బరమ పూజ్యులు నగు వారి నవమానించుట కెంతో యుల్లాసపడుచుండును. మఱి యేమి వచింతును? కుక్కలకు యజ్ఞోపవీతములు వేసి బొట్లు పెట్టి పూజనీయులయిన యా పరమభాగవతుల నామముల వాని కిడి పిల్చుచు వారిని గేలి సేయుచున్నాఁడు. ఇంతకంటె దుస్థితి నాకేముండును? క్షితిరాజు తనకు వాటిల్లిన దుఃఖమునీ రీతి నెఱింగించి రాజ్యమునెడ విరక్తి నొందెను.

క్షితిరాజు చివరకుఁ దనభార్య సమ్మతింపకున్నను సర్వమును బరిత్యజించి సమస్త సంతాపములను హరించు భగవద్ధ్యానము సేయఁగోరెను. అతఁ డారీతి నిర్ణయించుకొని తనరాజ్యమును గలశ భూపతి రెండవ పుత్రుఁ డగు 'ఉత్కర్షుఁడు' అనువాని కొసఁగి విద్వాంసులను దనతోఁ దీసికొని పుణ్యతీర్థములు సేవింప నేగెను.

ఉత్కర్షుఁడు చంటిబిడ్డ. కలశునకు 'రామలేఖ'యందు జనించినవాఁడు. పుత్రుని దుండగమునకు విసుగు నొంది యన్యుల చంటిబిడ్డకుఁ దనరాజ్యమును గట్టిపెట్టి రాజర్షి యయిన క్షితిరాజు పెక్కేండ్లు తీర్థసేవ జేసి శాంతి సుఖ మనుభవించెను. కడపట నతఁడు 'చక్రధరము'నందు విష్ణుభక్తి పరాయణుఁ డగుచుఁ జక్రధరుని సాయుజ్యమును బడసెను.

పిదప ననంతభూభుజుఁడు తనపౌత్రుఁడు 'ఉత్కర్షుఁడు' శిశు వగుటయు నతని కట్టిదశయందే రాజ్యలాభ మొదవుటయుఁ జక్కఁగా నాలోచించి యాస్తనంధయుని సురక్షితునిఁగాఁ గాపాడుటకై తన్వంగుని చెంత నుంచెను. 'తన్వంగుఁడు' అనంతభూపతికిఁ దండ్రిసోదరుఁడైన కాంతరాజు మనుమఁడు 'జస్సరాజు' యొక్క కుమారుఁడు. ఆతన్వంగుఁడును ననంతుని కోర్కె నాదరించి యుత్కర్షుని నతనిరాజ్యమును భద్రముగ రక్షించుచు నభివృద్ధి నొందించెను. తన్వంగుఁ డిట్లుత్కర్షునిఁ బెంచి పెద్దను జేసి మఱలఁ గాశ్మీరమునకు వచ్చి చక్రధరమునందు భౌతిక శరీరమును బాసెను.

అనంత మహీపాలుఁడు దాతృత్వగుణమునందు భోజభూజానివలె వన్నెకెక్కెను. వారిరువురాకాలమునఁ గవితావైదుష్యములను బోషించి 'కవిబాంధవులు' అను నఖండ విఖ్యాతి గడించిరి.

రాజకుటుంబమున జనించిన వారికి రాజబంధువుల కందఱకును సర్వ సాధారణములగు రాజభోగములం దన్నిటను గొఱఁత లేకుండ నుండున ట్లనంత మహీకాంతుఁడు దగిన యేర్పాట్లను జేసి యుండెను. అట్టి పూర్వ సంప్రదాయ మనంతుని కాలము వఱకుఁ గాశ్మీరమున నమలునం దుండుటచే రాజబంధువులు ద్రోహచింత లేక మెలఁగుచుండిరి.

అయినప్పటికిని వీరుఁడగు 'మదనరాజునకు' జిందురాజు' అను కుమారుఁ డుండెను. మదనరాజు తండ్రి 'సిద్ధరాజు' 'బుద్ధరాజు' తండ్రి 'ఇందురాజు' వీరందఱు రాజవంశములోనివారు. అఖండ పరాక్రముఁ డగు 'జిందురాజు' ఒకప్పుడీయనంతుని యాదరమును బడయలేక యలిగి నృప కుమార మండలికి దూరముగఁ దొలఁగి యుండెను. అంతట నతఁడు గర్వోద్రిక్తుఁడై రాజునకు సంశయింపఁ దగిన వాఁడుగ నుండెను. అట్టి సమయమున రాణి గర్వితులగు డామరులవలన భయంపడి చెదరి పోయినజిందురాజును దాను స్వయముగ రావించి యాతనికి మంత్రిపదవి నొసంగెను

ఆతరుణమున 'దేగ్రామ' వాసి యగు డామరుఁడు 'శోభుఁడు' అనువాఁ డొకఁ డుండెను. వాఁడొంటి కంటివాఁ డైనను బలమదమున రెండు కన్నులు లేనివానివలె నిరంకుశుఁడై మెలఁగఁ జొచ్చెను. అతని నడత యనంతుని మనస్సునకుఁ జాల నుద్వేగము గొల్పున దయ్యెను. అట్టిడామరుని జిందురా జెదిరించి నిర్మూలించెను.

అది మొదలుకొని యనంతనృపతికి జిందురాజుపై నభిమాన ముదయించెను. ఇట్లు జిందురాజు పార్థివు నభిమానమునకుఁ బాత్రుఁడై ప్రధాన సేనాని యగుటయే గాక 'రాజపురి' మొదలగు ప్రదేశములకు నధీశుఁడు గాఁగల్గెను. రాజ్య పరిపాలనమునందు వాటిల్లు పొరపాట్లు పెక్కు చిక్కులు దెచ్చి పెట్టును. అనంతున కట్టి సంఘటనము దప్పు దయ్యెను.

ఆతరుణముననే మేధావి యగు హలధరుఁడు మిక్కిలి ముదుసలి యగుటచే జరాభారమున నత్యంతము గృశించి గడ్డిపుల్లకు నీడై యున్న తనతనువు నెట్టకేలకు విడిచి పుచ్చెను. అతఁడు' చక్రధరమున' మరణింపనున్న యదనున ననంతదేవుఁడు వానికడ నేకాంతముగ హితము వినఁగోరి తన దేవేరితో నేగెను. హలధరుఁడు వారితో నిట్లు పల్కెను. "రాజా! సాహస ప్రేరితములగు కార్యములఁ గావింపకుము. తెగువతోఁ బరరాష్ట్రముపై దండెత్తకుము మున్ను 'వల్లపురము' మున్నగు ప్రదేశములం దారీతి నొనర్చి తెచ్చికొన్న ముప్పు నెట్లో యుపాయమునఁ దప్పించితిని గదా! మఱియు నీ జిందు రాజిపుడు మిగులఁ బెంపు వడసి యున్నవాఁడు. ఇతని ప్రవర్తనము శంకింపఁ దగినది 'జయానందుఁ డును' నిట్టివాఁడే. అతఁ డెప్పుడో మీకును మీకొమరునకును భేదము పుట్టింప వేచి యున్నాఁడు"

ఇట్లు మరణావస్థలోనుండి పల్కిన హలధరుని యీ హితవచనము ననంతుఁడు నెమ్మనమునఁ బాటించి మహావిక్రముఁ డగు జిందురాజును యుక్తితోఁ బరిత్యక్తాయుధునిగ నొనర్చి 'బిజ్జునిచే' బంధింపఁజేసి యతని కొసఁగిన యధికారము తానే నిర్వహించుచుండెను. కొంతకాల మిట్లు జరిగిన పిదప కలశభూపతి భావములు గలుషితములు గాఁదొడఁగెను. దుష్టులగు లెంక లతనికి దుష్పథము పట్టునట్టి యలవాట్లు గలుగఁజేసిరి. ఆసందర్భమున 'గలశునకు' శాహివంశజులు 'బిజ్జ' 'సిద్ధ' 'రాజు' 'పాజులు' నల్వురు రాజపుత్రులు చెలికాండ్రయి యుండిరి.

మఱియు, గోశాధిపతి యగు నాగుని కుమారుఁడు 'జయానందుఁడు' కలశునికి సదా పార్శ్వవర్తియగు సేవకుఁడుగా నేర్పడెను. అతఁ డారాకొమరునకుఁ గౌటిల్యాధ్యాపకుండై యుండెను. అట్టి తఱి ద్విజశ్రేష్ఠుఁ డైన 'యమరకంఠుఁడు' శివసాయుజ్యము నొందుటయు నతని తనయుఁడు 'ప్రమద

కంఠుఁడు' కలశభూపాలునకు గురు వగుటయు నొనఁగూడెను. స్వభావముచేతనే చెడు త్రోవలం బోవు చున్న యారాజునకు నింద్య కార్యముల నుపదేశించు నట్టి గురువు దొరకుటచే గమ్యాగమ్య విచారము నకుఁ దావే లేక పోయెను.

గీ॥ నైజముగఁ జెడ్డ త్రోవల నడచు వాని
కకట! దుశ్శీలుఁడౌ గురు వబ్బెనేని
గమ్యము నగమ్య మను నవి గలవె? మంచి
చెడ్డ పను లివి యను సుంత చింత యున్నె?

ప్రమదకంఠుని దుశ్చారిత్రము వాకొనను నూకొననుగూడఁ దగనిది. అతఁడు స్వసుతా సంగమునే కోరె నన్న నిఁక నేమనవలయును? ప్రమదకంఠుని యందే గాక కలశమహీశునకు 'బిడాలవణిజుఁడు' అను నామాంతరముతోఁ బ్రసిద్ధిఁ గాంచిన ధూర్త శిఖామణి యగు నొక వర్తకునిపై గాఢ విశ్వాస మేర్పడెను.

అవణిజుఁడు మొదటినుండియు నెల్లప్పు డొక పునుగుఁబిల్లినిఁ దనయొడిలో నుంచి లాలిం చుచు నుండు నలవాటు గలవాఁడై యుండెను. ఆకారణమున నతనికి 'బిడాలవణిజుఁడు' అను నామము గలిగెను. ఆమాఱుపేరుతోడనే లోకమంతయు నతనిఁ బేర్కొన సాగెను. అందువలన నతని తొలి నామమును జనులు పూర్తిగ మఱచి పోయిరి. ఆవర్తకుఁడు పరమ వంచకుఁడు, దాంభికుండునై యుం డెను. అతఁడు తఱుచుగ నింగువ వర్తకము సేయుచు నుండెను.

మఱియు నతఁడు మంత్రకానివలె నటించుచు వైద్యము శిల్పము మున్నగు విద్యలందు నేర్పు గడించినట్లు జనులఁ బ్రలోభపెట్టి దాకలివారికిని శిల్పులకును గురువై రాజ విశ్వాసమునకుఁ బాత్రుఁడై మిక్కుటముగ ధనము నార్జింపసాగెను. పూజ్యులు భైరవమూర్తికేని జంకని మాంత్రికులును నగు మహావిద్వాంసులు సైతము మాబిడాలవణిక్కు దంభవర్తనమునకు బెదరి లొంగిపోయి యతని నాశ్రయించి పాదానతు లైరి. ఆవర్తకుఁడును వారి నట్లు లోఁగొని యభయహస్త మొసఁగి వారిని స్వస్థ చిత్తులఁ జేసెను. ఈవిధముగ నాబిడాలవణిజుఁడు ఇంగువ పునుగుల వాసనలతో గుబాళించు తనకపట హస్తమును బూజనీయులగు వారితలలపై నయిత ముంచి వంచింపఁగల్గెను.

ప్రకృతి విస్ఫార మగు గొప్ప మేఘపుంజముచే దివసలక్ష్మి హరింపఁబడునట్లు దొంగ గురువులచే లోకము మంచిచెడ్డలు దెలిసికొనలేక మోహపాశములం దగుల్కొని చీఁకటికోనం బడి దిక్కు దెలియక భంగపాటు నొందుచున్నది.

## అనంత కలశ మహీపతుల చరిత్ర

ఉ॥ సారము లేకయే ఘనుల
చందమునన్ బటు గర్జితోక్తి వి
స్తారతఁ జూపి యున్నత ప
దంబును గాంచుచుఁ గుత్రతో దురా

చారులు ముగ్ధులౌ జనుల
సన్నిధి నుందురు; జ్ఞాన భానువుల్
చేరఁగనీరు తామసపుఁ
జీఁడ లిలన్ దినమందుఁ గ్రమ్మఁగన్।

ఇట్లు దుర్విటులకు లొంగి పోయిన కలశుని చెంతఁ జేరినవా రందరందఱే. ఆధూర్తులు సులువుగ జీర్ణముగాని మాంసాది గుర్వాహారమును మితి మీఱఁ దిని రాత్రులందు జాలకాలము దుర్విలాసములతో జాగరణ మొనర్చుచుందురు. అజీర్ణపుఁ బులిత్రేన్పులతోడను దుర్వాసనలు గ్రుమ్మరించెడు బెట్టిదంపు టావులింతలతోడను వికృతములైన వారి కంఠములు నగర వీధులందు భూగర్భమున ముఱికి నీటినిఁ గొనిపోవునట్టి గొట్టములవలె నెల్లప్పుడు మద్యరసమును వెడలఁ గ్రక్కుచునే యుండును.

అట్టివారిలో నెల్ల మేటి యగువాఁడు 'చమకుఁడు' అనువాఁ డొకఁడు. వాఁడు చారణవృత్తి యందు మిగుల వలంతి. అతఁడు వేణు వాద్య నిపుణుఁడు. చతుర్విధ వాద్య కుశలు లగు పూర్వోక్త దురాచారులకెల్ల నాయకుఁడై సిగ్గుమాలిన నడవడితోఁ దిరుగుచుఁ గులాంగనలకు భీతిఁ గొల్పుచుండెను.

ఒకనాఁడు హాలధరుని కుమారుఁడు 'కనకుఁడు' ధూర్తుఁడగు చమకుని దుండగమును జూచి క్రోధోద్విగ్నుఁడై తన భృత్యులచే నాతని ముక్కు దూలము తునియలు గావించెను. లజ్జాకరము లగు చెడ్డ పోకలతోఁ బ్రొద్దు పుచ్చుచు ముమ్మందే వంశ ప్రతిష్ఠా భంగమునకుఁ గారకుఁడై యుండిన చమకున కాతరుణమున వాటిల్లిన నాసికా వంశ భంగ మొక బహుమాన మయ్యెను. ఆవిధమున నతఁడు మంత్రులలో మిన్నయై 'ఠక్కుర బిరుదము నొంది కలశునకుఁ దార్చువాని పని నొనర్చుచు గొప్ప యుపకారిగా మెలఁగెను, అతఁ డారాజున కలవరించిన దౌశ్శీల్యము వాకొనరానిది. కలశునకు 'కల్లన' అను సోదరి, 'నాగ' అను సుతయుఁ గలరు. ఆతుచ్ఛుఁడు చమకుని దుర్బోధచేఁ బరదారలు, తోఁబుట్టువులు, తనయలు, అను మనుజధర్మము మంటఁ గలిపి కామ మోహితుఁడై స్వేచ్ఛగ మెలఁగ సాగెను. వృద్ధులగు వాని తల్లిదండ్రులు కలశుని దుర్వృత్తమును విని సిగ్గుతో నోరెత్తలేక తీరని మనోవ్యధ యందు మునిఁగి పోయిరి. ఇట్టి పుత్రులకంటె శత్రువు లెంతో మేలనవచ్చుఁగదా!

మఱియు 'ఓవనాగ్రామమున' నివసించువాఁడు 'లోష్టకుఁడు' అను నొక బ్రాహ్మణుఁడు గలఁడు. అతఁడు మిక్కిలి మూర్ఖుఁడు. అయినను వాఁడాగ్రామమున దైవజ్ఞుఁడై ధాన్య ముష్టులను సేకరించి బిచ్చగాఁడై మెలఁగుచుండెను. కాల క్రమమున నతఁడు ప్రతిదినము రాత్రులందు సంచరించుచు గ్రామమునందలి క్షేత్రపాలకుని యనుగ్రహముఁ బడయఁగల్గెను. అందువలన నతఁడు పిడికిట నున్న వస్తువులను గనిపెట్టి చెప్పఁగల విజ్ఞానమును గడించెను. ఆనేర్పుచే నతఁడు 'ముష్టిలోష్టకుఁడు' అను పేరుతో మిక్కిలి విఖ్యాతి వడసెను. ఆవిప్రుని చర్యలు క్రొత్తరాజుగారి మనస్సు నాకర్షించెను. మెల్లఁగ రాజు దగ్గఱ దైవజ్ఞ పదవి సంపాదించి తానొక గురువుగా మెలఁగఁ గలిగియు నాబ్రాహ్మణ బ్రువుఁడు కామ పరతంత్రుఁడైన కలశభూపతికిఁ గుంటెనకాని పని సైతము నెనవేర్చుచుఁ గరము ప్రీతిపాత్రుఁ డయ్యెను.

మఱియు 'మదనుఁ'డనువాఁడు మఱియొకఁడు తులువ కుంటెనగాండ్ర గోష్ఠియందుఁ జౌరవ సంపాదించుకొని వదరుఁబోతై చల్లఁగాఁ గలశునకుఁ జెలికాఁడయ్యెను. ఈ'మదనుఁడు' బాల్యమున దౌర్భాగ్య మూషితుఁడై యవంతి పురమున దిక్కులేక పడియుండెను. ఆతరుణమున 'ఖర్షుట' మను ప్రదేశమున భట్టారక మఠాధిపతియై నిష్ఠతోఁ దప మొనర్చుచుండిన సాధువగు 'శివస్వామి' కడకు గాయకుఁడగు నొక గ్రుడ్డివాఁడు 'మమ్ముఁడు' అనువాఁడు ప్రతిదినమును బోయి భక్తితో నాసాధువు నర్చించుచుండెడివాఁడు, ఆగ్రుడ్డి గాయకుని దిక్కులేని యర్భకుఁడగు 'మదనుఁడు' చేయి పట్టుకొని 'శివస్వామి' దగ్గఱకుఁ దీసికొని పోవుచుండెను. శివస్వామి కీయనాథ బాలునిపైఁ గ్రమముగ నెనరు గల్గెను. శివస్వామి జనపనార గోచి పేలికలను ధరించుచుండిన మదనుని విరుపేదరికపు దీన వేషము నొకింత పోఁగొట్టెను. కాని వానికి సహజముగ నేర్పడిన నీచభావములు వానిని విడిచి పోవయ్యెను.

శివస్వామి యొకతఱిఁ గొన్ని పువ్వుల నొసఁగి రాజుకడకు మదనునిఁ బంపెను. అది కారణముగా మదనుఁడు గాశ్మీరపతి యగు కలశుని దర్శించి క్రమముగ నతనికి నచ్చిన నేస్తగాఁడయ్యెను.

ఈవిధముగఁ గలశమహీపతి నర్మసాచివ్య ప్రవీణులు నీచవిటులు నగు చమకాదులకు నెచ్చెలికాఁడై వారి చేతులలోని కీలుబొమ్మ యయ్యెను. ఆధూర్తు "లాడినది యాట పాడినది పాటగా" నుండెను. అందువలనఁ గలశుని కలుషిత హృదయమున గుణములెల్ల దోషములే యయ్యెను. కలశునకు దోషములే గుణములుగఁ దోఁచెను.

మఱియు నాదుష్టుల చెలిమిచే సిగ్గుపడఁదగిన మాటలు చమత్కార వచనములుగను, ప్రజాపీడనమః ఘన కార్యముగను, సిగ్గిడితనము పౌరుషముగను, అంటరాని యంగనలఁ గలయుటయె సారస్యముగను, నీచు లగు తుంటరుల దుర్భాషల నోర్చియుండుటే సారళ్యముగను నాగలశునియెడఁ బరిణమించెను. ఇంక నతఁ డొనర్చు పనులయందు "దోషదూషితమిది" యని యేర్పఱచి తెలిసికొని విడువఁదగినదియే మృగ్య మయ్యెనని చెప్పవచ్చును.

గీ॥ మారుతోద్ధూత కాసార వారిఁ గోన
భాను శశి బింబములు రూప హాని నొందు
నట్లు కలుషిత మౌ హృదయమున మధుర
భావములు డిందుఁ బాప సంపదలు వొదలు.

సీ॥ విన నసహ్యము లైన వెగటు మాటలె చమ
త్కార వాక్యములుగాఁ దలఁచు నతఁడు.
పనివడి ప్రజలను బాధించుటే గొప్ప
పని యంచు సంబరంపడెడి వాఁడు,

సిగ్గిడితనమునఁ జెలరేగుచే మేటి
విక్రమం బని విఱ్ఱవీగు వాఁడు,
తాకంగ రానట్టి తరుణులఁ గూడుచే
తగు రసజ్ఞత యని దలఁచు వాఁడు.

గీ॥ ఖలుల దుర్భాష లోర్చుచే కరము సరళ
భావ మని యెంచు వాఁడు పాపంబు లేక
చేయు కార్యంబు గలదె? తచ్చిత్తమునకుఁ
జీఁకటియె కాని వెలుగు రుచించు నెట్లు?

కలశమహీపాలుఁ డింతటి వాఁడయ్యెను. అతఁడు చౌర్య రతియందు మిగులఁ గుతూహలము గలవాఁడై రాత్రులం దిల్లిల్లు దిరుగుచు స్వభార్యాలింగన ప్రీతి యెట్టిదో యెఱుఁగక పోయెను. పెఱవెలం దులపై ననురాగము పరతంత్ర భావమున నపార మగు ప్రీతినిఁ గలిగించును. మఱియు నది యఖిలా షలను నగ్ని జ్వాలలపైఁ గురియు నెడతెగని నేతిధార యని చెప్పఁదగును.

మ॥ పర కాంతారతి పాప వృక్షమున కా
వాలంబు; స్వాతంత్ర్య మన్
దరువు న్గూల్చెడు వేఱు పుర్వదియె; త
త్త త్తుచ్ఛ వాంఛా విషా
గ్ని రగు ల్కొల్పు మహాజ్య ధార యదియే;
నిక్కంబుగా నయ్యదే
నిరయాన న్పడఁద్రోసి మానవుని బం
ధించున్ జిరస్థాయిగన్.

కలశభూపతి యొకనాటి రేయి కుంటెన కాండ్ర నైదారుగురఁ దోడుజేసికొని జిందురాజు గృహమునకుఁ బోయెను. కామపరతంత్రుఁడై యతఁడు పాంసుల యగు జిందురాజు కోడలు స్వగృ హమున సంకేత స్థానమునఁ దనకై వేచి యుండు చోటునకు హుటాహుటి నేగుచుండెను. అంత నచ్చటి కుక్కలు బిగ్గరగా మొఱుగుచు వానిని వెంబడించెను. అది గనిపెట్టి గస్తి దిరుగు తలవరులు కృపాణ పాణులై దొంగలని శంకించి శునకములు సూచించు దారినిఁబట్టి పరుగిడివచ్చి వానినిఁ బట్టు కొనిరి. కలశుఁడు తలారులు తన్నుఁ జంపుదు రన్న భీతిచే వివశుఁడై పుడమిపైఁ బడెను.

అట్టితఱి వాని యనుచరులు వానికిఁ బ్రాణాపాయము గలుగకుండ మెల్లగఁ బట్టి యెత్తికొని కాపాడిరి. ఆ సమ్మర్దమునఁ దలవరులు కలశుని యనుచరులకును బిడికిటిపోట్లు మున్నగు పెక్కు ప్రహా రములను వడ్డించిరి, అదెబ్బలను దినుచునే వారా 'గస్తి' దిరుగువారితో "కొట్టకుఁడు కొట్టకుడు. ఈయన కలశ భూజాని," అని రహస్యముగఁ బలుమాఱు పల్కి యెట్లెట్లో వారి బారినుండి తమ యొడయని

విడిపించుకొని బయటఁబడిరి. నాసాహీనుఁడును నమంగళుఁడును నగు 'చమకుఁడు' మున్నగు దుర్వి టులతో విహరించు నట్టి కలశున కట్టిపాడుదశ ఘటిల్లుటయందు వింత యేమున్నది?

కలశమహీపతి కాంతా కటాక్షములకు వివశుఁడై గృహమునుండి కదలిపోయెను. దారి నడుమ దైవికముగఁ గాళీకటాక్షమునఁ బ్రాణములు గోల్పోవక మరి రాఁగల్గెను. నరేంద్రుఁ డైననేమి? దేవేంద్రుఁ డైననేమి? నీతిదప్పిన వానిని లోకము మన్నించునా? కావుననే కలశుఁడు కాల కింకరుల వంటి తలారులచేఁ బడరాని పాట్లు పడియెను.

గీ॥ ఇంద్ర చంద్రాది సురలును నింద్రియముల
చాపలమునకు రొంగి లజ్జా భరమునఁ
గుప్పతిలి వెన్క నెంతెంతొ గుమిలి పోరె?
మర్త్యుని భవిష్య మెంత? తన్మహిమ యెంత?

మఱియును

మ॥ తొలుతన్ దుర్యశ మంకురించు; నటపై
దుష్టాభిలాషంబు తీఁ
గలు సాగున్, క్షయమందు ధర్మవును; శ్లా
ఘ్యం బాభిజాత్యంబు, నా
వల సందేహమె లేదు; పోవు; గుల జీ
వంబుల్; సుశీలాఖ్య ని
ర్మల చింతామణి డిందునేని భువిఁ దా
ర్మా ఱౌను సర్వార్థముల్.

అట్టి దుర్దశ పాలై భాగధేయ బలమునఁ దప్పించుకొని రాజధానిని బ్రవేశించిన యాకలశ భూవిభుని వృత్తాంత మారాత్రియందే వాని తల్లిదండ్రుల కర్ణములకు శూలమై సోఁకెను. పుత్ర స్నేహ మొక వైపు లజ్జా భర మొకవంక శోక భార మొక ప్రక్కను ముట్టి ముప్పిరియై ముంచివేయుటచే వారేమియుఁ దోఁచక చిరకాలము విలపించి విలపించి చివరకు దుశ్శీలుఁ డగు తమ సుతుని ధర్మ రక్షకై బంధింప నిశ్చయించిరి. అంత మాత్రమె గాదు. 'బప్పిక' పెద్ద కుమారుఁడును సర్వ విద్యా నిధియు నగు 'హర్షుని' రాజ్యాధిపతినిఁ గావింపఁగోరి యారేయి నెట్లో గడపిరి.

అంతటఁ బ్రొద్దుననే కుమారునకుఁ దమయొద్దకు రమ్మని వార్త నంపిరి. కాని చండశాసన యగు ననంతదేవుని పత్ని యాతరుణమున విడువరాని జపమౌనముల ముద్రితయై యుండెను. కల శుఁడు దనతల్లిదండ్రులకుఁ దనమోముఁ జూప భయపడెను. తననెయ్యురగు బిజ్జ జయానందులకుఁ బిత రుల యాదేశమును దనదు శంకాతంకములను దెల్పుకొనెను. పిదపఁ గలశభూపతి యాచెలికాండ్ర యోదార్పుతో జయానందునిపైఁ హస్త మూని బిజ్జుఁడు వెనువెంట ననుచరుఁడై రాఁగా నతికష్టముగఁ బితృ సౌధమును బ్రవేశించెను.

అనంత మహీకాంతుఁడు తనయంతికమున కరుదెంచుచున్న సుతునిఁ జూచి చూడకయె యఱచేత ముఖముఁ గప్పికొని "ఓరీ దౌర్భాగ్య దూషితుఁడా; నీకేలరా యీరాజచిహ్న మగు చంద్రహాసము? విడువుము రా చెడుగా!" అని పరుషముగఁ బల్కెను. జనకుని దారుణ వచనములకుఁ గలశుఁడు భయ కంపిత గాత్రుఁ డయ్యెను. అతని శరీర సంధులు శిథిల మయ్యెను. అట్టి మిత్రునికి బిజ్జుఁడు తిన్నఁగా జేయూఁత నొసఁగి కొండొకచేత నతని స్పృశించుచు సగర్వముగ ననంత భూపతితో "రాజా! నీవు మానవంతులలో నగ్రేసరుఁడవు. అట్టివాఁడ వయ్యును మాన గ్రహ మను మహావ్రతము విడువరానిది యని తెలియకున్నావు. రాష్ట్రపతి యగు నీకుమారునిఁ జిరకాలము జీతముబత్తెములఁ బడయుచుఁ బ్రభుభక్తి పరాయణుఁడై శస్త్రధారియై సేవించుచున్న యీబిజ్జుఁడు తాను జీవించుచుండఁగనే తనస్వామి నేరీతి విడనాడఁగలఁడు? ప్రభూ! ఆలోచింపుము. ఇప్పుడు నీవిట్లంటివి. కాని, ఏమైనను నీవు తండ్రివి. ఇతఁడు నీపుత్రుఁడు. వేఱొక తరుణమున నీపితృవాత్సల్యము యథాస్థితము గాఁగలదు. నాపరోక్షమున నీతనయు నెట్లు చేయఁదగునో! యట్లొనర్తువుగాక." అని యనెను.

పరుసములును స్నేహ యుక్తములు నగు బిజ్జుని వచనము లనంతుని ముగ్ధునిఁ జేసెను. అందుచే నతఁడు కొంత మిన్నకుండెను. బిజ్జుఁడును దనయొడయనిఁ దిన్నఁగా దోడుకొని యచ్చోటు నుండి తరలి పోయెను. శిక్షాస్మృతి విషయమున నంతకకల్పుఁడైన యనంతదేవుని సన్నిధానమున సైత మీతీరున విజృంభించి యతిమానుష మగు నిజధైర్యమును బ్రదర్శించిన బిజ్జుని ధీరు లందఱు నయ్యవసరమున మిగులఁ బ్రశంసించిరి. ఇన్నిటికిని భవిష్యదర్థ మంతగా బలవత్తర మగుటంజేసి యయ్యవసరమున ననంతదేవుని పట్టమహిషి యచ్చోట లేకుండెను. ఆయమయే యున్నచో కలశునికి మరణ దండనమో కారాగార ప్రాప్తియో తప్పక సంభవించి యుండెడిది.

తండ్రి సాన్నిధ్య మను గండము దప్పినను భీతి విడువక తపించుచునే యున్న యాకలశ మహారాజును 'బిజ్జుఁడు' మెల్ల మెల్లఁగా నాతని వల్లభ యగు 'దిల్లాదేవి' భవనమునకుఁ దీసికొని పోయెను. 'దిల్లాదేవియుఁ' జాలఁ బ్రాజ్ఞురాలు. ఆమె పతి వృత్తాంతము నెఱిఁగి నాథునకుఁ దలనొప్పి యను నెపము వెట్టి శిరమునకు దైలము నంటి గృహాంతరమున నెవ్వరికినిఁ బ్రవేశ మొసఁగకుండు నట్లు బిజ్జుని ద్వార రక్షకునిఁగా నిల్పి వల్లభునిఁ గాపాడుచుండెను.

ఇంతలో రాణి 'సూర్యమతి' తన మౌన సమాధినిఁ జాలించి యచ్చటి యావద్వృత్తాంతమును విని అనంతభూపతి నదలించి కుశలమును గనుగొను మిషతోఁ గుమారుఁడున్న గృహమునకుఁ జెచ్చెర నేగెను. అనంతభూపాలుఁడును దనయుని బంధించుటకై దృఢ యత్నముతో నచ్చటికే పోయెను. కాని, ద్వారరక్షకుఁడై యున్న బిజ్జుఁడు తనప్రభువును గాపాడు తలంపుతో ననంతదేవుని మాత్రము లోనఁ బ్రవేశపెట్టి వాని యనుచరులను లోనికరుగనీక నిరోధించెను. తనయనుయాయులను లోనికి రాకుండ నిషేధించిన సంగతి దెలిసికొన్న తేని దెందమునఁ గ్రోధ కల్లోలము లుప్పతిల్లెను. తోడనే యారాజు ఇఁక నచ్చోట నుండుట పాడి గాదని విరక్తుఁడై విజయక్షేత్రమును జేరఁ బయనమయ్యెను. పత్నియు ననంతభూపాలు ననుగమించెను.

ఆరీతిని వారు ప్రయాణము సేయుచుఁ బద్మపుర ప్రాంతమును జేరిరి. అచ్చోనున్న 'విశ్వావటుఁడు' మొదలగు విప్రులు భూమీశుం గాంచి యిట్లనిరి. "నరేంద్రా! బుద్ధిపూర్వకముగా నీవే యధికారమును వదలుకొంటివి. ఇపుడు పశ్చాత్తాప పడనేల? మంచిపనియో చెడ్డకార్యమో! జరిపి పిమ్మట నూఱక యనుతాప మొందుట సాంప్రతము గాదు. నీవిప్పుడు "ప్రజల నందఱు దుర్మతి యగు తేనిపాలౌనర్చితినిగదా!" యని తలఁచి తలఁచి కుందుచున్నావు. రాష్ట్రపతి యైన నీకొమరున కట్టి వింధ్యప్రవర్తనము గల్గుట కతనిని గర్హించుట సరి గాదు. ప్రజల దురదృష్ట మందుకు హేతువని యనుకొనవలె! ఏలయన?

గీ॥ రాజు రాజ్యాన నొక్క యంత్రంపు బొమ్మ
వాని సౌజన్య దౌర్జన్య పద్ధతులకుఁ
దద్బలాబలములకు నిదాన మిలఁ బ్ర
జాకృత శుభాశుభ క్రియా సంచయంబె.

ఉ॥ అంబర సీమనుండి మధు
రామృతమున్ వనిఁ గ్రుమ్మరించు న
య్యంబుద మాల యొక్కొకపు
డక్కట పిడుగు రువ్వు, నిట్టి చం
దంబుల కేమి హేతు వని
తాల్మిఁ దలంచిన నవ్వనస్పతిం
ద్రంబుల పుణ్య పాప పరి
ణామమె యంచు స్ఫురించుఁగా మదిన్.

ఇదియునుగాక కాపథమును బట్టి నడచు నీకుమారుని విడిచిపెట్టి సుఖముగ నుండఁ గోరి తేవి నిర్ధనుఁడవై బయలుదేరుచున్న నీకు సౌఖ్య మెట్లొనఁగూడును? ఈవిషయమును జక్కఁగా నాలోచింపుము.

మ॥ శుచియై వంశము శ్లాఘ్యమై యెసఁగినన్
శోభిల్లు ధారా ప్రభా
నిచయ ప్రాభవ మబ్బినన్ మఱియు నె
న్నింటన్ విరాజిల్లినన్.
ప్రచుర ఖ్యాతినిఁ గూర్చు కోశ మది లు
ప్తం బైన నస్పృశ్యుఁడౌ
సచివాది ప్రజకెల్ల ఖడ్గమువలెన్
సమ్రాట్టు నిక్కంబుగన్.

ఈవిప్రుల వచనము లాలించి యనంత భూకాంతుఁడు తనప్రయాణము నాపుకొని నగరమునకు మరలిపోఁగోరి కొంత తడ వాలోచించుచుండెను. అట్టితరుణమునకే వానితనయుఁడు కలశ మహీపతి తనపత్నితోఁ గూడ నచ్చటి కరుదెంచి తండ్రిని బహువిధముల వేడుకొని ప్రసన్నచిత్తునిఁ గావించెను. అందువలన నతఁడు మరలఁ గాశ్మీర రాజధానినిఁ బ్రవేశించెను.

అయిననేమి! అతని కోపానలము లోలోన రగుల్కొనుచు వానిడెందమును వివశము సేయుచుండెను. ఆపరితాపమున కాతఁడు నిలుపరింపలేక వెండియు రాజధానిని వీడిపో నిశ్చయించి ప్రాసాదములందుఁ బొంపిరి వోవుచున్న తన యైశ్వర్యలక్ష్మి నంతను సమకూర్చుకొని పయనమయ్యెను.

బయలుదేరునపుడు పలుతెఱంగుల యాయుధములు కవచములు గుఱ్ఱములు మున్నగునవి తనవెంటనే తీసికొని పోవుచు నది యావలిగట్టును జేరి యించుక తడవు దేవేరికై ప్రతీక్షించుచుండెను. అంతట నారాజపత్ను లందఱును బయనము సాగించి నానా ప్రకారము లయిన తమ కోశ రాసులను బ్రాసాదములనుండి తరలించి యోడలందు నింపివేసిరి. చివరకు ఇనుప చీలలైనను మేడలలో మిగులకుండఁజేసి తమనాధుని సన్నిధిం జేరిరి.

మొట్టమొదట నతఁడు ప్రోలిని వీడి పోవు సంగతి ప్రజకుఁ దెలియదు. క్రమముగ నావార్త నెఱుఁగఁగనే ప్రజావాహిని యొక్కుమ్మడిగఁ గలఁత నొంది తీవ్రముగ నాక్రందించెను. పౌర జనము నగరము నెడఁబాసి పోవు రాజదంపతులకు భక్తి భరితముగ బాష్పాంజలుల సమర్పించునపు డెడతెగని కన్నీటి బిందువుల నెపమున నర్ఘ్య జల ధారలు సైతము వదలిపెట్టెను.

మార్గములం దెచ్చట విన్నను "హాతల్లీ! హాతండ్రీ! మమ్ము విడిచి యీరీతి నెందేగుచుంటిరి? మాకేమిగతి?" అను పరిదేవన వాక్యములు దక్క వేఱొండు వినరాదయ్యెను. కాని, వారియందు నడుమ నడుమ వారి యాక్రందనసద్ధ్వని యొకింత విరత మయినపు డచ్చటి సెలయేళ్ళ స్రోఁత వినవచ్చుచుండెను. అయ్యది యందలి శైల నికరము సయితము సంతాపాతిరేకమున విడుచు నిట్టూర్పుల భూత్కార రవమా! యనున ట్లుండెను.

ఆరాజదంపతు లెట్టకేలకుఁ బ్రజా సముద్రమును దరించి పోఁగల్గిరి. కాని పెద్ద తడవు ప్రజాక్రందితమునకు గుఱియై యలవాటు పడిన వారి వీనులకు మాత్రము సారెసారె కాధ్వనియే సోఁకుచున్నట్లు దోఁచెను. పుత్రుఁ డొనర్చిన యపరాధములు సహింపలేక కుందుచు నెడఁబాసి పోవుచున్న యా వృద్ధరాజ దంపతులను గాంచి దారియం దటనట నుండు జన మచ్చటి చెట్ల నాశ్రయించి తమ శాబకములఁ బోషించుచుఁ జాల మమకారమును జూపు విహంగములఁ గనుంగొని "పుత్ర ప్రేమగల యీరాజదంపతుల గతి యేమయినది? యేల యీపిచ్చిపక్షులు తమనిసుఁగుల నీరీతిఁ బోషింపవలయును." అని పెక్కు తెఱఁగుల నిందించెను.

పుత్రుని యన్యాయపు నడత వారి యెడందల గ్రుచ్చుకొని బాధించుచునే యుండెను. అట్లే వారు విజయేశ్వరమును జేరిరి. ఆతావు చాలఁ బవిత్ర మైనది. అందలి విజయేశ్వరస్వామి సందర్శనము వారిపాలిటి యాప్త బంధువువలె నొకింత మనః ప్రసాదమును వారికిఁ గల్గించెను. కోశ నివేశములను హయ భటాదుల తాత్కాలిక నివాసములను సమకూర్చు సంవిధాన సంరంభమునందు వ్యగ్రమనస్కు లగుచు వారానాఁడు గడపిరి.

విజయేశ్వర మంతయు భాండాగారాది పరికరముల బస్తాలలో నిండి పోయెను. ఆప్రోవు బున్న రథ్య లన్నియుఁ బెద్దపెద్ద యింధనపు రాసుల యంగళ్ళుగా దూరమునకుఁ గాన వచ్చుచుండెను. అంత నావృద్ధరాజేంద్రుని జ్ఞాతి పుత్రు లగు రాజకుమారులు 'తన్వంగ, తుంగాదులును' 'సూర్యవర్మ', 'చంద్రా' దులైన డామరులును ననుసరించి యుండిరి.

'క్షీరభూపుఁడు' మొదలగు డామరులకు 'నౌనగరము' మున్నగునవి స్వీయ వాసస్థలము లగుటచే వారి నాప్రదేశముల కధికృతులను గావించి స్వజన రక్షా ధర్మమును బలిష్ఠ మొనర్చుకొని యాపావన క్షేత్రమున విశ్రాంతి గైకొనుచుండిన యానరనాథునకుఁ జిత్తము గొంత స్వస్థత నొందెను. ఆతరుణముననే 'విజయేశ్వరమున' మహోత్సవ దినములు సమారబ్ధము లయ్యెను. ఇంక ననంత మహీధవునకు నానందమునఁ గొఱత యేముండును? ఆశ్వికులు శస్త్రపాణు లగు రాజపుత్రులు డామరులు వేనవేలుగ నావృద్ధరాజు సాన్నిధ్యమును బాయక కంటిని ఱెప్పవలెఁ గాచుచుండిరి. అనంత మహీవల్లభుఁడు రాజధానిని వీడి విజయేశ్వరముఁ బ్రవేశించిన తరుణము 4155 వ శకాబ్దమునందలి జ్యేష్ఠ మాసము. ఆవిధమున నతఁ డందుఁ బ్రవేశించి శాంతి సుధను గ్రోలుచు స్వర్గ దుర్లభ మగు సుఖమును బడయుచుండెను.

రాష్ట్రపతి యైన కలశునకుఁ గోశ శూన్యమైన పుడమి మాత్రము దక్కెను. నిధి రక్షక మగు సర్పరాజు దొలఁగి పోఁగా రత్న శూన్యమై గనుపట్టు నిధి స్థానమువలెఁ గలశున కానేల యేలుకొనఁ దగి యుండెను. అతఁ డీసంగతి గుర్తించి రాజధానికి వాటిల్లిన రిక్త దశ నెట్టులేని తొలఁగించి యద్దానిని సంపద్భాసమానము గావించు తలంపుతో బిజ్జాదులతో నేకతము మంతనములు సాగించెను. వారి సలహాలతో విశ్వాస పాత్రు లగు నధికారులను స్వకీయోద్యమము నెఱవేర్ప నియోగించెను. జయానందుఁడు సర్వాధికారములు గల ముఖ్యమంత్రి యయ్యెను. 'వితస్తాత్ర' పురమున జనించిన 'వరాహదేవుఁడు' ద్వారాధికార పదవి నాక్రమించెను.

పూర్వము సేనాధిపతి పదవిని నిర్వహించు చుండిన 'జిందురాజు' దగ్గఱ సైనికులకు వలసిన యుడుపులను సమకూర్చు పనియందు నియుక్తుఁడై యుండిన 'విజయమిత్రుఁడు' ఇప్పుడు దళవాయుల కధినేత యయ్యెను. ఇట్లే యితరులను వారివారికిఁ దగిన యధికారముల నొసఁగి సమ్మానించి యర్థ చింతాపరుఁడై కలశభూపతి జనకునితోడఁ గయ్య మొనర్చు సంరంభముతో సన్నద్ధుఁడయ్యెను.

పిమ్మట నతఁడు 'బిజ్జుఁడు' మొదలగు రాజ పుత్రుల సముదాయమును బదాతి నికరమును దీసికొని వృద్ధరాజు నెదిరించుటకై 'యవంతిపురమును' జొచ్చెను. కలశుఁడు కారణాంతరమునఁ

గారాగృహమున నుండిన జిందురాజును సమయానుకూలముగ ముందే విడుదల చేయించెను. ఆజిందురాజిప్పుడు 'శిమికా' మార్గమున బయలుదేరి పోయి సమర మొనర్ప సాహసించెను.

అట్లు అనంతభూపతిపై దండెత్తి వచ్చుచున్న వారి దుర్ణయమును వృద్ధభూపాలునియెడ గాఢాభిమానము గల డామరు లెఱింగి క్రోధ మూర్ఛితులై వైళంబ తమతమ సంగర సాధనముల సమకూర్చుకొని యయ్యనంతుని చెంత దాసటగాఁ జేరి భక్తివిశ్వాసములు మెఱయ నటఁ గాపుండిరి. అదిగదా రాజభక్తి! ఆవిజయేశ్వర ప్రాంత భూమి యగు నడవి యెల్లను బలుతెఱంగు లైన శస్త్రాది పరికరములతోడను పురోన్యస్త కందుకములతోఁ గ్రీడించు గుఱ్ఱపు దళములతోడను నిబిడముగ నిండి యుండెను.

తఱువాత 'సూర్యమతీదేవి' యాబెట్టిదపు యుద్ధ సంరంభము దలపోసి తులువ యైనను గుమారునియందు వాత్సల్యము వీడలేక ప్రచండ కోపనుఁడై యున్న పతి కడకుఁ బోయి బహువిధముల నోదార్చెను. ఎట్టకేలకు రెండు దినములు సమర యత్నముఁ జాలింప వేడికొనెను.

అనంతర మాదేవి తన కత్యంత మాప్తులై యున్న 'మయ్యుఁడు' మొదలగు ద్విజ పుంగవుల నానాటి రాత్రియందే సుతునికడకుఁ బోయి తనకు మాఱుగాఁ దనవాక్యముల నీవిధముగ నివేదించి ప్రబోధింపుఁ డని పంపెను. వారును నప్పుడప్పుడే కలశుని సన్నిధి కేగి వాని జనని పంపిన వాత్సల్య పూరిత మగు సందేశము నిట్లు దెల్పిరి.

"కుమార! ఇట్టి దుర్బుద్ధి నీకేల కల్గెను? నీతండ్రి యప్రతిరథుఁడు. అవార్యవీర్యుఁడు. దరద్రాజాదులు నీజనకుని కనుబొమముడి మాత్రమున నిహతులైరి. రణరంగమున హయారూఢుఁడై వీతిహోత్రునివలెఁ బ్రజ్వరిల్లు నీతండ్రి నెవ రెదిరింపఁగలరు? నీకుఁ గల శస్త్రధారు లాదిగాఁ గల బలగ మంతయు నీతండ్రి నెదుర్కొనినచోఁ దృణప్రాయమై మాడి మసియై పోవుట తథ్యము. నీకును శలభముగతి పట్టును. సమగ్రశక్తి సంపన్నులం దగ్రసరుఁడైన నీజనకుని శౌర్యాగ్ని నోర్చుటకు నింధన ప్రాయ మగు నీధన మెంత? నీశౌర్య మెంత? నీసర్వసేనాంగములు నేపాటివి? నీకు దిక్కెవరు? ఇట్టి తండ్రితోడనా నీవు యోద్ధుకాముఁడవై వచ్చుట? ఇట్టి తలంపు వినాశ సూచక మని తెలియకున్నావు. కోశశూన్యుఁడవై యిప్పటికే రిక్తుఁడవై యున్న నీకిపితృవిరోధమున మఱింత రిక్తదశ దక్క వేఱు శుభము గలుగఁబోదు. తండ్రికొమరుల నడుమ భేదమును రగుల్కొల్పి లాభపడఁగోరు ధూర్తుల వాగురలోఁ జిక్కితివి. ఈదారుణ వ్యసనము మానుము. ధర్మదేవత యగు నీపిత నీకేయపకృతి యొనర్చెను? నీకిల్బిషమును జెంగటనుండి సహింపలేక పుత్ర వాత్సల్యమును వీడలేక తీర్థ సంవాసియై మనశ్శాంతిఁ బడయు తలంపున రాజ్యమును విడిచి యీక్షేత్రమును బ్రవేశించి యున్నాఁడు. అఖండ మగు రాజ్యము నీకు దక్కినది. నీతి దప్పక రాజ్య మేలుచు సుఖముల ననుభవింపుము. ఊరక చెడకుము. జనకునివలన నపకారము గలుగు నన్న భీతి విడువుము. నేను జీవించుచుండఁగా నట్టి దెన్నఁడును వాటిల్లదు. కావున నీసేన నంతయు వెంటనే యిటనుండి పంపివేయుము. మఱియు నీయెడ నార్జవమును వాత్సల్యమును జూపుచున్న నీతండ్రిని వినీతుఁడవై మృదు వాక్యముల నోదార్పుము. ఇయ్యదియే నీకుఁ బరమ హితము."

సూర్యమతీదేవి సుతుని క్షేమమును గోరి పంపిన యాసందేశమును విప్రవరులు వివివిం పఁగాఁ 'గలశుఁడు' చక్కఁగా నాలకించెను. అతఁడు వేఱొండు మాటాడక యానిశయందే మఱుక్షణమునందే తనదండును నానాభాగములంబట్టి తిరిగి పో నాజ్ఞాపించెను. రాయబారులగు విప్రు లావిషయము నప్పటి కప్పుడే యనంతదేవున కెఱిఁగించి యతనిని స్వస్థచిత్తునిఁ గావించిరి.

సూర్యమతీదేవి వేఁకువనే లేచి నడచిన వృత్తాంతమును ధవుని ప్రసన్నమనస్కతన దెలిసికొని తననడపిన రాయబారము ఫలించినందుకు డెందమునఁ గర మానంద మొంది తన ప్రాగల్భ్యమును జాటుకొనుటకై నాధునికడ కేతెంచి యొకింత యుపాలంభించెను. ఏది యెట్లయినను రాణియగు 'సూర్యమతి' తండ్రికొమరులకుఁ బ్రేమ బంధము వీడకుండ సవరింపఁగలిగినది. కాని, వారి మానస కమలములు భేదకారులగు తుటువల మాటలచే క్షణక్షణమునను గాలుష్య మొందుచుండెను. డెందమున నాటుకొన్న భావము సులువుగ వీడి పోవునా?

చం॥ హృదయమునన్ విరోధ ముద
యింపనె గూడదు; నాటుకొన్నచో
నది గలిగించు భేదము; వి
యంబును జంపును; బెంపుఁ గాంచుచున్.
వదలదు; సంధిఁ గూర్చినను
వారక సారెకు సారె కార్ద్రిమా
నదుకులు వడ్డ గుడ్డవలె
నప్పటి కప్పుడె ప్రీలి పోయెడిన్.

ఈతీరున వృద్ధ నరపతి కుములుచు వాహ్యాళి పోయినపుడును మఱియు నట్టి యితర వేళలందును దనయుని యుదంతమును బలుమాఱు విని భరింపరాని సంతాపముతో గృహమును బ్రవేశించుచుండెను. అచ్చోట సూర్యమతీదేవి పల్కు ప్రగల్భ భాషితములచే ముగ్ధుఁ డగుచు నూఱడిల్లుచుండెను.

ఈవిధముగఁ బ్రతిదినమును బగలెల్ల సుతుని దుడుకుఁదనమునఁ దపించుచు రేయి రాణి మాటల పొందికచే నాశ్వాసమును బడయుచు స్వచ్ఛాశయుఁ డగుచున్న యాతేని జీవనము శరత్కాలమునందలి యల్ప జలాశయమును విడంబించుచున్నదని యనవచ్చును.

కలశుఁడు తండ్రిపక్షము నాశ్రయించి యున్నవారికిఁ జేయని హాని లేదు. అతఁడు వారి గృహములు మన్నగువానిని ధ్వంసముఁ జేయించెను. కాని, యనంతమహీజాని సూర్యమతీదేవికి వశవర్తియై యుండుటవలన నాత్మజుని యాశ్రితుల కించుకేని యపకార మొనర్పకుండెను. పుత్రవాత్సల్యమున నంధురాలై యుండిన 'సూర్యమతి' వలనను సుతునిచే 'బహంథా' పీడితులై యోర్వలేక వెడలిపోక్తులాడు ననుజీవులవలనను, పాపము! తపించి పోవుచున్న యనంతదేవుఁ డెంతటి దుస్థితి పొందుచుండెనో దేవునకే యెఱుక యగును. కుమారునికిఁ గల బలము విస్సారము [illegible] హీనము నశి

యారాజునకుఁ దెలియును. కావుననే ఉందురాజు పౌరుష మకించిత్కర మని యతఁడు భావించుచుఁ దనూజుని రాజ్యమును బలాత్కారముగ వశపఱచుకొనఁ దలఁచెను. మఱియు నారాజ్యమునకుఁ దన్వంగుని తనయుల నధిపతులనుగా నియోగింపఁ బూనెను. కాని, యత్తరుణమునఁ దన్వంగుని కుమారు లందుకు సుముఖులు గారైరి.

ఇట్లుండ సూర్యమతి నాథుని తలంపుఁ గనిపెట్టెను. అట్టి తలంపువలన స్వీయ వంశజులకు గొప్ప యపకృతి గాఁగలదని యామె శంకించెను. వెంటనే పతినిఁ బలువిధములఁ బ్రేరేచి యారాత్రియందే పౌత్రుఁడగు 'హర్షుని'ఁ జెచ్చెరఁ దోడ్తెచ్చి రాజ్యపట్టమున నలంకరింప సంకల్పించి దూతలను బనిచెను. దూత లావిషయమును గూఢముగఁ బోయి హర్షునకు నివేదించిరి. పితామహప్రేషితులగు దూతలచే నాహూతుఁడైన యాహర్షుఁడును దానావని సేయుట సాహసమని యెఱింగియు నందుకు సుముఖుఁ డయ్యెను.

అంత నతఁడు పితృ నియుక్తులగు రక్షక భటులు సర్వదా సన్నద్ధులై దన్ను వేయికన్నులఁ గనిపెట్టి యున్నను వాహ్యాళి నెపమున బయలుదేరెను. అచ్చో నతఁ డున్నటులుండి తనమదిమయం సమర్పఁబడిన కశతో మెల్లఁగ నశ్వమును బొడిచెను. అతాపుచే నది తనయజమాని సన్న యెఱిఁగి యివుర్క్కొన నెగిరి మనోజవమునఁ గన్నులకు మిఱుమిట్లు గొలుపుచు నొక్క యరక్షణముకోఁ గుంటువడని శక్తితో నైదారామడల దూరము పయనించెను.

అచ్చటి సైనికులు తమతమ యుత్తమాశ్వముల నధిరోహించి హర్షునివెంటఁ బడిరి. కాని, యతని తురంగ రాజము పేరెము నందుకొనలేక దారినడుమ నలసి సొలసి చెమటలు పట్టి విన్నవోయిన మోములతోఁ గదలలేనట్టి తమగుఱ్ఱముల దైన్యమును గనుగొని నిరాశులై చేయునది లేక ఖిన్నులుండిరి.

హర్షుఁ డారీతి వాయువేగమున నరిగి పితామహుల యంతికముఁ జేరి వారి యడుగుఁదమ్ములకు సాష్టాంగ ప్రణామ మొనరించెను. అవ్వయుఁ దాతయు వానినిఁ గౌఁగిట గ్రుచ్చి యెత్తి యానందాశ్రు బిందు సందోహమున నభిషేకించిరి.

ఇట శ్రీనగరియందుఁ గలశభూపతి తనపుత్త్రుఁడు తన్నుఁ బాసి పోవుటకు మిగుల వగచి ఖేదమునఁ గంపించెను. అది మొదల నతఁడు తనతలిదండ్రుల కపకృతిఁ గావించు తలంపు మాని వారితో సంధి గోరువాఁడై యుండెను. మఱియు నతఁడు గొంత తెలివితోఁ దనకుమారునకు లేఖలు వ్రాసి పంపుచుఁ దమకుఁ గలభేదమును రాష్ట్రప్రజలు గుర్తించి విప్లవము ఉత్పత్తిల్లకుండునట్లు మెలఁగ నేర్చెను. కాని, వాని నెమ్మనమున జననీజనకులయెడఁ గల ద్వేష వహ్ని ప్రవర్ధమాన మగుచునే యుండెను.

అవ్వైరము నతఁ డెట్టెట్లో తల్లి చేసిన హితబోధతోఁ గొంత కాలము చల్లార్చుకొనుచుండెను. ఇట్టి తరుణముననే కలశభూపతి 'ఖశాలా' ప్రదేశము నాక్రమింపు మని తన సేనాని కాదేశించెను. సేనాపతియు నందు కియ్యకొని యనంతదేవుని యెదుట నతఁడువ గదురఁ బ్రణమిల్లి సూర్యమతీదేవి

సమక్షమునఁ గుమారుని యానతిని నివేదించెను. ఆదేవి నాథుని బహువిధముల నూరడించి కుమారుని యాదేశమును దళవాయి నెఱవేర్చుటకుఁ దమపురినుండి దారి విడువ ననుమతింపఁజేసెను. ఈసందర్భమున నాదేవికిఁ గల పుత్ర వాత్సల్య మెంతటిది యని చెప్పఁగలము?

ఇది యిట్లుండ నింతలో ద్విజ పరిషత్తు రాష్ట్రాభ్యుదయమునకు గొడ్డఁటి పెట్టువలె నున్న పితాపుత్రుల ద్వేషము నెట్టులేని శమింపఁజేయ సంకల్పించెను. కాని వారి యత్నములు ఫలింపక కతంబునఁ దుదకుఁ బ్రాయోపవేశమే తత్సాధనముగ నిర్ణయించి వారు దీక్షతో నద్దాని నుపక్రమించిరి. విప్రుల సదుద్యమమునకు దైవ మనుకూలించెను. కొంత కాలమునకుఁ గలశుఁడు తనతండ్రితో సంధి కుదుర్చుకొనెను. సంధి బంధము చక్కఁగ నేర్పడిన తర్వాతఁ దదనురోధముగ వృద్ధదంపతులు మరల 'శ్రీనగరి'ఁ బ్రవేశించిరి. రెండున్నర నెలలు మాత్రమే రాజధానియం దనంతదేవుఁడు జాయతో నుండగల్గెను. నిమ్నగామి యగు కలశుని మనస్సు పల్లములు త్రవ్వు భేదకారుల ననుసరించుట సాజమేగదా.

జయానంద ప్రభృతు లట్టివారలువలు. వారి వాగురలో మందమతి యగు కలశుఁడు చిక్కుకొనెను. వారు "నీతల్లిదండ్రులను గారలో నుంచిన నీకుఁ గల యడ్డంకు లన్నియు మాయమై పోవును." అని కలశునకుఁ గఱపి యట్టి దురుద్యోగమునకు నతని సన్నద్ధునిఁ జేసిరి. మేధావి యగు వృద్ధ మహీధవుఁ డావెలఁకువ మెల్లఁగ నెఱిఁగి దోదూయమాన మానసుఁడై మరల నగరమును త్యజించి సతీమణితో విజయక్షేత్రమును జేరెను

పిమ్మట పితృ విరోధి యగు కలశుఁడు మిన్నకుండలేదు. ఒకనాటి రేయి నకస్మాత్తుగ సైనికుల నంపి తండ్రి గుఱ్ఱములకై నిలువఁజేసి యుంచిన యాహారపు రాసులు గల కొట్టములను గాల్పించెను. అందలి కావ్వరను మంటలపాలు చేయించెను. విష శస్త్రములచే నసహాయులై యున్న వారి నందఱను బూర్ణాహుతిఁ గావింపఁజేసెను.

ఇంతటి ఘోర కార్యములు జరిపించి విరోధానలము వేయి మడుంగుల రగులఁజేసిన కలశు ననంతభూజాని ప్రతివిధాన మొనర్చి శిక్షింపఁబూనెను. కాని సూర్యమతికిఁ గల సుతవాత్సల్య మట్టి దేదియు సాగనీయలేదు. వాని దుండగ మంతటితో నాగలేదు. పయఃపానము సర్పముల విష వృద్ధికే హేతు వైనట్లు మాతృవాత్సల్యము కలశుని మౌఢ్యము నినుమడింపఁజేయుచునే యుండెను తల్లి తండ్రి యను సర్వ సాధారణ మగు నభిమానమే వానికి లేక పోయెను. అట్టివాఁ డెంతటి హేయవర్తనుఁడో యొక విషయము తేల్చి వేయఁగలదు.

ఆనగరమున నొక బెస్తయువతి 'లుడ్డ' అనునది గలదు. అది కులట. 'థక్క' డామరుఁ డను నొక ఖర్వాటుఁడు దాని విటకాఁడు. నీచుఁడగు కలశుఁడు తనకుఁ బంగట నున్న వారిచేఁ దన జననీ జనకులను 'లుడ్డాథక్క-డామరులను' నామములతోఁ బేర్కొనఁజేసి లీలాస్మిత మొనర్చుచు వినోదించుచుండెను. కుమారుఁ డీతీరున నున్నను ఆవృద్ధ రాజ దంపతు లిరువురును హేమతులాపురుషభారము లొనర్చియుఁ బెక్కు తెఱంగుల ధర్మకార్యముల నొనర్చియుఁ దమ మానసిక సంతాపమును బాపుకొనుచుండిరి. "వారిట్లు సేయుటకు హేతువు వారు ధనాఢ్యులు గదా!" యని యాలోచించి కలశుఁ డసూయావశుఁడై యొకనాటి రేయి విజయక్షేత్రమును నలువైపులఁ గాల్పించెను. పరమ పాపి యగు

తాపుత్రుఁడు గావించిన యాదుశ్చేష్టచే సర్వ సంపత్సమృద్ధమై దేదీప్యమాన మగుచున్న యావృద్ధ నరపతి పట్టణము 'విజయేశ్వరము' అంతయు భస్మావశేషమై పోయెను.

ఇట్లు సర్వ విధ్వంసము వాటిల్లినందుకు సూర్యమతీదేవి చింతాసాగరమున మునిఁగి బ్రతుకుమీఁది కోరిక దొలఁగి నిజసౌధమునుండి వెడలిరాక యచ్చటి చిచ్చులోననే పడి యాహుతిగా నెంచెను. అట్టితఱి తన్వంగుని కుమారులు బలవంతముగా నాదేవి యత్నమును నిరోధించి యెట్టకేలకు గృహమునుండి యాయమను వెలుపలికిఁ దోడ్కొని వచ్చిరి.

ఆకాలరాత్రియందు గాఢముగ నిద్రించుచుండిన రాజసైన్య మంతయు వెఱుగుపడుచు లేచి కవులున లెక్కడి వక్కడనే పోవిడిచి పడకలనుండి చివాలున వెలికిఁ బరువిడి పోయెను. ఆపట్టణపుఁ బ్రజా సమూహ మంతయు నొక దిగంబర దృశ్యమై దీనాతిదీనముగ నుండెను.

శత్రువులకేని కనికరింపఁదగు నిట్టి దశలో దిక్కు దోఁచక విజయేశ్వరవాసు లెల్లరును తల్లడపాటు నొందుచుండఁ దుష్టుఁడగు గలశుఁడు మహానందము నొందుచుండెను. మీఁదు మిక్కిలి యతఁడు రాజధానియందలి తనయున్నతసౌధము చివరకెక్కి యారాత్రియందు విజయక్షేత్రము నాహుతి గొనుచు గగనలక్ష్మిని జ్వాలా బాహువులఁ గౌఁగలించుచు నుప్పొంగుచున్న జ్వలనునిఁ జూచి తానును నుబ్బిపోయి నృత్య మొనర్చెను.

ఇట్టి మహాతంకమునకు గుఱి యయిన విజయేశ్వరమునందు వృద్ధభూపతి తనసర్వస్వమును గోల్పోయి భార్యతోడ నెట్టులో యచటినదిని తరించి యావలితీరమును జేరఁగల్గెను. కాని, యతఁడు దుస్తర మైన దుఃఖసాగరమున మాత్రము పూర్తిగ మునిఁగి పోయెను. ఆఘోరమైన విపత్తుకు లక్ష్యమై దురపిల్లుచు వారారేయి నెట్లో గడపిరి.

'సూర్యమతీదేవి' మఱునాఁ డుదయముననే విజయేశ్వరాలయములో రత్నలింగము మాత్రము దగ్ధము గాకుండుట కెంతయు సంతసించి సమయోచితమగు ధైర్యప్రతిభలతోఁ దనసమీపమున కరుదెంచిన రత్నాల వర్తకుల కారత్నలింగమును డెబ్బదిలక్షల టంకములకు విక్రయించెను. ఆధనముతో మొట్టమొదటఁ దనభృత్యుల కత్యంతావసరమై యున్న యాహార పదార్థములను వస్త్రములను విలిచి తెప్పించి యందఱకు నొసఁగెను. మఱియు నాదేవి భస్మ సాత్కృతము లైన భవనముల నన్నింటిని బ్రహుబ్రంగులఁ బరిశోధింపఁజేసెను.

అత్తఱి నారాజదంపతులకు నాబూదిరాసులలో దొరకిన పసిఁడి వెండి మున్నగు ధనసంపద యెంత యని చెప్పవచ్చును? ఆకథ యెంతో వింతయై వీనులకుఁ బలుమాఱు వినఁగుతూహలము గలిగించును. రెండవ యమరావతిగ శోభిల్లుచుండిన యావిజయేశ్వర పట్టణ మొకానొక కాలిపోయిన శూన్యాటవిగా నుండెను. అట్టితావునందే యనంత భూకాంతుఁడు కిక్కిరెల్లు మున్నగు కసవుతో నల్లఁబడిన గొడుగులతోఁ గుటీర నివహమును నిర్మింపఁజేసికొని తనయనుచరులతోడ నందే నివసించుచుండెను. అతఁడు తనకప్పటికి దొరకి యున్న యర్థసంపదతోడనే మరల నందే నూతన నగర నిర్మాణ కుతూహలియై ప్రయత్నించెను. కాని, రాజాజ్ఞ చెల్లుచుండిన తరుణమునఁ గాక యిట్టి యదను నవ సంతటి పని నెఱవేఱునా?

ఇఁకఁ గ్రొత్తతేఁ డగు కలశుని దుండగములు మాత్రము సాగుచునే యుండెను. పనికిమాలిన సుత వాత్సల్యమునకుఁ బరవశ యగు వాని మాత యతని కిట్టి శరుణమునందును నూఁతయై యుండెను. కావుననే యతఁడు తండ్రివలన నెట్టి సేగియు నొందక మఱింత దీండ్రించుచు 'పదేపదే' దుష్ట సందేశములఁ బెక్కింటినిఁ బంపుచుఁ దనజనకునకు నెడతెగని పరితాపమును గొల్పుచుండెను. అట్టితఱి నాపితృద్రోహి విజయేశ్వర నగర పునర్నిర్మాణ కుతూహలియై యున్న జనకుని నచ్చోటు నుండి 'పర్ణోత్స' మను తావునకుఁ దరలింపఁ బూనెను. ఎన్నియో మాఱులు దూతలవలన నట్టి దుర్వార్త నంపి యట్టిపని తప్పక జరుపవలసినదిగాఁ బట్టు పట్టి నిర్బంధింపసాగెను. కాని, విజయేశ్వరమున శాంతిసుధఁ గ్రోలుచుఁ దనజీవిత దశా శేషమును గడపఁబూనిన వాఁడును మానధనుఁడును నగు ననంతదేవునకుఁ గుమారుని గుత్సిత సందేశము బల్లెపుఁబో టయ్యెను. అందువలన నతఁ డాచెనటి నిర్బంధమును దృణీకరించెను. సూర్యమతీదేవికిఁ గల వాత్సల్యపుఁ బేర్మిఁజేసి సుతుని దుస్తంత్రమడ్డులేక సాగుచుండెను. ఆమె భర్త నందులకై యియ్యకొలుపఁబూనెను. అందుకు విముఖుఁడై యున్న యనంతుని సాధిక్షేపముగ ననుక్షణము బలవంతపెట్టసాగెను. సుతుని నిర్బంధ మొకవంక భార్యాప్రేరణము మఱొక వైపు విడుగడ లేక వృద్ధరాజన్యుని మనస్సును వికలము గావించెను.

ఇట్లుండ నొకనాఁ డేకాంతముగ నున్న భర్తను సూర్యమతీదేవి సుతుఁ డొనర్చు నిర్బంధము నిరవద్యమగుట నెఱింగియు న"దానినే యమలు జరుపుము." అని యొత్తిడి సేయుచుండెను. అనంతుని క్షమా కవచము బ్రద్దలయ్యెను. అతనియెడంద నొక్కమాఱుగా గోపానలము ప్రజ్వరిల్లెను. అందుచే నెన్నఁడును బల్కుయుండని యతినిష్ఠుర వచనము లాతని వదనసీమనుండి యవిరతముగ నిట్లు వెలువడెను.

"అక్కటా! నేను భార్యా విధేయుఁడనై యెంత కొఱమాలిన వాఁడనైతిని! ఎంతటి దుర్దశ నొందుచుంటిని, నాసర్వస్వము నష్టమైనదిగదా! అభిమాన మణిఁగారి పోయినది. యశము నశించినది. శౌర్యము శూన్యమైనది. రాజ్యరమ రక్తి బాసినది. మతి మాసి పోయినది; ధన మింధనము పాలైనది. ఓజస్సు హుళక్కి యైనది. ఇంతకంటే నేమి కావలయును?

గీ॥ కాంత పురుషున కొక యుపకరణ మనెడి
ప్రజల నానుడి వట్టి దబ్బర తలంప
పరిణత వయస్కుఁడై యున్న తరుణమందుఁ
దరుణికి నరుండె క్రీడోపకరణ మగును.

ఉ॥ కాంత లనర్హ కార్యములఁ
గాంతులఁ బూన్చుచుఁ జేయకున్నచో
స్వాంతము ద్వేష వహ్నికి వ
శం బయి పోవ విరక్త లౌచు గో
రంతలు కొండలంత లగు
న ట్లనయం బనయంబు సూపుచున్

బింతముతోడ నెందఱనొ
భర్తలఁ బంపరె కాలు ద్రోలికిన్.

కం॥ కొందఱు భర్తల రూపము,
కొందఱు పుంస్త్వంబు, బలము గొందఱు, ప్రజ్ఞన్
గొందఱు, ప్రాణంబులనే
కొందఱు హరియించి రవనిఁ గుమతులు పడఁతుల్.

ఉ॥ తుంగ పయోధరోన్నతినిఁ
దూలుచుఁ గాంతలు మత్త చిత్తలై
పొంగి యన్య గోత్రజులఁ
బుత్రులఁ గైకొని వారిచే శిలా
భంగము తోడి నిమ్నగల
భాతి హరింత్రు క్షమా విభూతులన్
గ్రుంగి నశింపఁగాఁ బతులు
గొందఱువోలె నిరస్త సారులై.

గీ॥ "వయసు పరిణామమున జీర్ణ వస్త్ర తుల్య
కాయులౌ పీరిపలన నెక్కడిది జీవ
నంపు సుఖ" మంచు వాములు నందనులనె
సొరిది పోషింత్రు పతులకు "సున్నచుట్టి".

ఇట్టివన్నియు సాధారణ వనితల కుండు దోషములు. ఈదోషము లీతన్వియందును నుండుట చిరకాలమునుండియుఁ దెలిసి యుంటిని. కాని, మిన్నకుంటిని. అందులకుఁ గారణము స్త్రీ మర్యాదను గుల గౌరవమును గాపాడఁ బూనుటయే గాక వేఱు గాదు. నన్ను లెక్కగొని పెద్దతనముఁ జూపుచున్న యీరాణి నాయిహలోక సంపద నెల్ల బూదిపాలొనర్చినది. ఇప్పుడు నా పారలౌకిక సౌఖ్యమును గూడఁ బాడు సేయ బతనములఁ బనిఁ బూని కావించుచున్నయది. నేనేమి సేయుదును? మేను ముది మిచే ముడతలు వడినది. శిరోజములు తెల్లవాఱినవి. మృత్యువు నోరు తెఱచికొని యెదురు చూచు చున్నది. ఇట్టితఱి నీవిజయక్షేత్రమును వీడి నేను గొండొక తావునకుఁ బోవు టుచితమా? ఇదియును గాక పాప తూలమును బటాపంచలు సేయు బాలేందు కలామౌళి ద్వారోపాంతమునందుఁ బరిచర్య సేయవలయు ననెడి నాయుత్కట మగు మనోరథము నెట్లు వమ్ము చేసికొనఁ గలుగుదును?

తీర్థసంవాసినై భవ సాగరమును దరింప వలెనని యాశపడుచున్న నన్ను నీపుణ్య క్షేత్రమునుండి తఱిమి యొకానొక కొఱమాలిన తావునఁ బడవైచి చావు మని శ్లాఘించుచుఁ దీంద్రిం చుచున్నవాఁడు నాపుత్రుఁడు. ఇట్టి యిహపరశ్రేయోవిధాత యగు కొడుకు నాకుంటె మఱియొకని కెవ నికిఁ గలఁడు? వీని నడతనుజూడ "నాసుతుఁడగునా వీఁడు." అని శంకించుచున్నాను. సందేహ మేల?

"ఈరాణి యితరుల పసిబిడ్డను దనపుత్రునిఁగా వెల్లడించుకొనియె" అని లోకమున వెల్లడి యయిన ప్రవాదము మృషగా దనియే యిప్పుడు నానెమ్మనమున స్ఫురించుచున్నది. మాయిరువుర నడవడు లింత విసంవాదము గలవియై యుండుట యిందులకుఁ బ్రబల మైన నిదర్శనముగదా!

గీ॥ జనకు రూపంబు వాని యాచార గుణము
లించుకయు లేక తండ్రిపై నీసుఁ బూని
బంధు వర్గంబునకు నెల్లఁ బగతుఁ డైన
వాని నౌరస సుతుఁడన వలను పడదు.

అనునట్టి పెద్దల మాటలు రిత్తవోవునా? ఈ భావము ననంత భూపతి యెడందలో దట్టముగఁ బెనఁగొని చిరకాలమునుండి యతనినిఁ గలఁత పెట్టుచుండెను. వాని యొత్తిడి కతఁడు తట్టుకొన లేక యొక్కమాఱుగ నంతయు వెడలఁ గ్రక్కెను. అతనికిఁ బ్రాణములు తీపుగాక మిగులఁ జేదయినవి. కావుననే మర్మ భేదకము లగు నిట్టి మాటలతో సూర్యమతీదేవి నిట్లు వేధించెను.

ఇఁక సూర్యమతి కెట్లుండవలయును? పతి ముఖమునుండి యిట్టి యనిష్టపు మాట లెన్నఁడు నామె వినియుండలేదు, అందునను రహస్య మయిన పుత్ర జనన వృత్తాంతమును నీతీరున బయలు పఱచుట, యచ్చోట జ్ఞాతి యగు తన్వంగతక్కనుఁ డుండుటయు, నామె మనసును జీకాకు పఱచెను. ఆరాణి లజ్జా భరమునఁ గ్రుంగిపోయెను. సూర్యమతికిఁ గలిగిన బిడ్డ పుట్టినవుడే చనిపోవఁగాఁ "బూజ్యతముఁ డగు 'ప్రశస్తాఖ్యు'ని యపత్యమును దత్క్షణమునందే దెప్పించి తనసుతుఁ డని యారాజ్ఞి ప్రకటించుకొనియెను" అని కింవదంతి యొకటి గలదు. ఆరహస్యము పతి యతిపరుషముగఁ దనను దూలనాడుచు దాయాదునెదుర వెల్లడించుట మనస్విని యగు సూర్యమతికిఁ జండాలుఁడు కాలితోఁ దలఁ దన్నిన ట్లుండెను.

చం॥ పతులను లోఁగఁదీసికొని
ప్రౌఢినిఁ జూపుచు నుండు మానినుల్
సతతము వారి చైదములె
సాగఁ దలంచెద: రెప్పుడేని య
ప్పతు లలుకన్ గటూక్తులను
బల్కిన వారికి నత్యంబుందు పా
ద తలమునన్ శిరం బదురఁ
దన్నినయ ట్లది దుర్భరం బగున్.

అందువలననే సూర్యమతీదేవి యయ్యవమానాగ్నిని భరింపఁజాలక చండకోపనయై తనకు సహాయమై యున్న ప్రౌఢినిఁ గనుపఱచుచుఁ బామర యువతివలెనే పతి వీరీతిఁ బెక్కు పరుసము లాడెను.

"నీవు దురదృష్ట వశమున సిరినిఁ గోల్పోయి తాపసుఁడవై యిందుంటివి. ముదిమిచే మతి దప్పి మూఢుఁడవై యొక్కఁడ నెట్లు వల్కవలయునో యెఱుఁగక నన్ను వృథా నిందించుచున్నావు.

తొల్లి బిడ్డకు జలకము చేయించి తడి యొత్తిన వెంటనే వలువయేని పైఁగప్పక మున్నే నన్ను డాపి ముద్దుతోఁ గొడుకును నీవు చేతికిఁ దీసికొని యుండుట లోక మంతయు నెఱుఁగదా! అయినను మీవంశపు స్త్రీల గుణములే యందఱ కుండునని తలంచుచు నన్నేదో దూఱితివి. ఇట్టి దురాలాపము లాడినందుకుఁ బ్రాయశ్చిత్త మాచరించుకొనుట నీకిపుడు కర్జము. వయసు చెల్లి క్రియా విహీనుఁడవై తనయుఁడు దేశమునుండి తఱిమివేయఁగా నింటఁ బడియున్న నిన్ను "పత్నియుఁ గనికరము లేక విడిచి పుచ్చెఁగదా" అని లోకులు నిందింతురు. అట్టి భయముచే నేను విడువ జాల కుంటిని."

సూర్యమతి పల్కిన యీ పరుషవాక్కులు, అనంతదేవునకే గాక యతని వంశమున కెల్ల బల్లెపుఁ బోటు లైనవి. అయ్యవి యతని కులమునకే కలంకమును దెచ్చినవి. ఈ నిందావచనము లతని నెంతగా వేధించెనో చెప్పఁ దరముగాదు. కాని, యతఁడు మాత్రము నిర్వికారాకృతియై రవంతేని [illegible] యూరకుండెను. ఇట్లుండఁగ నాతఁ డాసనముననే యాతని గద్దియ కురంగటనుండి యొకానొక రక్త ప్రవాహము గన్నులఁ జెదరునట్లు వెలికిఁ బ్రవహింపఁ బొడఁగెను. ఆ ఘోర మైన దృశ్యముఁ జూచి సూర్యమతి నివ్వెఱపడి యుండ 'ధక్కనుఁడు' చకితుఁడై పెద్ద పెట్టున నేడ్చుచు నరనాథుని గుద (గుహ్య) భాగమునఁ గ్రుచ్చుకొని యున్న బాకు నొకదానిఁ గనుఁగొనెను. ఆరాజునకుఁ గలిగిన పట్టరాని క్రోధ వేగ ఘాతముచే నట్టి ప్రాణాంతకరమును బ్బేదమును నగు సాహస కార్య మొనరింపఁ జేసెను. అతని సాహస మెటిదైనను సత్త్వగుణమున నాతని నిర్వికారతయు, ధైర్య సంపదయు నెంతేని స్తుతి పాత్రమై యుండెను.

అంతట నాధీర వతంసము తనకావించిన పనికిఁ దానే లజ్జపడుచు ధక్కనునిఁ జూచి "నరనాథుఁడు రక్తాతిసార వ్యాధిచేఁ బీడితుఁడయ్యె" నని వెంటనే ప్రజకు వెల్లడింపుము. అని యాదేశించెను.

చం॥ వనితలకున్ విధేయు లయి
వారలు సెప్పిన యట్లు దుష్టులో
తనయులపా లొనర్చి ప్రభు
ధర్మము, వంచకు లైన భృత్యులన్
మనమున నమ్మి, స్వల్పు లగు
మార్తురు గణ్యులు గాఁగఁ బెద్ద యె
త్తున నెదిరించుచుండు నయ
దూరులు రాజులు గాంత్రు దుర్గతిన్.

అనంతభూజానికిఁ దుద కిట్టి దుర్గతియే పట్టినదిగదా! అనంతమహీపతి సుమారము గుఱ్ఱపు స్వారి చేసి శరదాతపముచే సంతాపితుఁడై మిగుల దప్పికొని పిపాసా శాంతికై కొత్తిమిరి నీటిని (కషాయమును) త్రావె ననియుఁ దుదకు రక్తాతిసారమునకు గుఱి యయ్యె ననియు గంభీరాశయులగు రాజాధికారులు మహీపాలు నాకస్మిక మరణ వార్తను వెల్లడించిరి. అత్తఱుణమునఁ బ్రజ లావిషయము నట్లే విశ్వసించిరి.

ఈరీతి విపన్నుఁడై యనంతదేవుఁడు లౌకిక యుగమునందలి 4157 సంవత్సరమున (క్రీ.శ. 1031) కార్తిక పూర్ణిమనాఁడు విజయేశ్వరుని యెదుట నిర్వికార మతియై యసువులఁ బాసెను. సర్వ సుఖముల ననుభవింపఁదగి యుండిన యాతేఁడు తనసతీసుతుల యుద్వేగ చర్యలచేఁ దుద కిట్లు దీర్ఘనిద్ర నొందవలసి వచ్చెఁగదా! అట్టి విపరీత మైన యవసాన దశయం దతఁ డెవరియెడను నించుకేనియు నలుకఁ జూపి యుండలేదు. ఆరాజునెడ నెవ్వఁడును గినుక నొందరైరి. ఇట్టి స్పృహణీయ పరిణామ మెవ్వరికోఁగదా లభించును? అయినను దేశస్వామియు సంగ్రామరాజునకు జ్ఞాతియు నై వన్నెకెక్కిన యమ్మహీనాథుఁ డత్తఱి సంశుకాచ్ఛాదితుఁడై "ఎవ్వరికి నితఁ డిష్టుఁడు గాఁడా?" యన్నట్లు పుడమిపై నచ్చోట ననదవలె దీర్ఘనిద్ర నొంది పడి యుండు టొకటే యెంతయుఁ జింత్యము అట్లయ్యును నాతేఁడు సర్వత్యాగియై యచిరకాలముననే యట్లు దీర్ఘ నిద్రా రసజ్ఞుఁడై పడిపోవుచేఁ దన కడకు వచ్చెడి యాప్తులు పల్కిన దుఃఖాలాపము లాలకించి స్నేహ యుక్తుఁడగుట గాని, తనకు గిట్టనివారాడికొను నప్రియోక్తులు విని యలుక నొందుట గాని తటస్థింప దయ్యెను. తనదేవేరియెడ దాక్షిణ్యము మాని తాను నిష్ఠురోక్తులు పల్కినందులకుఁగా నతఁడు ప్రాణబలి రూప మయిన ప్రాయశ్చిత్తము నాచరించెనా? యన్నట్లాసంఘటన మేర్పడెను.

సూర్యమతీదేవియు దైవ వైపరీత్యమును ధీరహృదయముతో నోర్చి యుండెను. ఆమె కృతజ్ఞురాలు. కావుననే తనపతి యట్లనదయై పడియుండు టెంతమాత్రము సహింపఁజాలదయ్యెను. వెంటనే యాదేవి తనపతిని ఋణ విముక్తునిఁ గావింప నెంచెను. అందుకై స్వస్థచిత్తురాలువోలె నగపడుచు నామె రాజపుత్రులు మొదలు చండాలురవఱకుం గల రాజోద్యోగులకు భృత్య వర్గమునకుఁ బ్రతిదినము నీయందగు జీతము బత్తెము నంతను జెల్లించెను. భృత్యు లెల్లరు తమ తమ వేతనములను సరిగాఁ గైకొనిరి. వారందఱు తృప్తిపడి కృతజ్ఞతాబుద్ధిని వెలువరించిరి. అందు నిదర్శనముగ సూర్యమతి కోరిక మేరకు భృత్యవర్గమెల్ల నాదేవి మనుమఁడైన హర్షదేవుని యోగక్షేమముల ననుక్షణము జాగరూకతతోఁ గనిపెట్టుచుండు నట్లు విజయేశుని యెదురఁబానీయ నియమ యుత మగు ప్రతినల నొనర్చిరి.

తఱువాత ననతికాలమునకే యచ్చోటునకుఁ బౌత్రుఁ డరుదెంచెను. అతఁడు తాతగారి దుర్మరణమునకుఁ బెద్ద పెట్టున విలపించుచు నవ్వ యడుగులపై శిరమును వాల్చెను. అంత సూర్యమతి మిగుల గారాబముతోడ మనుమని శిరము మూర్కొని యోదార్చుచుఁ దాను స్వయముగ నతనిచేఁ గోశ నియతినిఁ బాటింపఁజేసి "నీతండ్రి నెన్నఁడును నమ్మకుసుమా!" యని హెచ్చరికమీఱఁ బలికెను.

అంతట నామె బెత్తమును జేఁబూని నిలువఁబడి దౌవారిక ధర్మమును దానే నిర్వహించుచు నాథుని మృత కళేబరమునకుఁ గడపటి యలంకార విభవము నెల్లఁజేయించెను. మఱియు నచ్చోట శత సంఖ్యాక మగు గుఱ్ఱపుదళము మనుమని రక్షణమునకై సన్నద్ధముచేసి యుంచెను.

అనంతరము ధీర యగు నాసాధ్వి యలంకృత మగు పతి శరీరమును శిబికయందుఁ జేర్చి [illegible] బయనము సాగింప సన్నాహ పఱచెను. అంతఁ దానును బతియే దేవతగా భావించుచు

నారాత్రి యంతయును మఱునాఁడు మధ్యాహ్నము వఱకు నిశ్చల విమల మానసముతో వేచియుండి విజయేశ్వరునికి మ్రొక్కులిడి భర్త ననుగమింపఁ బల్లకి నారోహించి ప్రయాణమయ్యెను.

ప్రేతభూమికి బయలుదేరి పోవుచున్న యాదంపతులను జూచి ప్రజా సమూహము బహు విధముల నాక్రందించెను. ప్రజల యాక్రంద ధ్వని ప్రేత తూర్యరవముతోఁ గలసికొని దెసలు బీఁటలు వాఱునట్లు ఘోషించెను. పైభాగమున మెఱయు పతాకతో వివిధములగు నలంకారములతోఁ దనరారుచున్న విమానములో ననంత భూపతి కళేబర మున్నది. అద్దాని నాత్రముతో జనులు దుఃఖపూరిత హృదయులై చూచుచుండిరి. అవ్విమానపు టలంకారములందుఁ బ్రతిఫలించిన ప్రజాళిని జూడ వారందఱు ప్రేమాతిరేకమున సమ్మహీజానిని విడువలేక యతని ననుగమించుచున్నారో యన నొప్పుచుండిరి.

రాజు లనంతభూపతి విమానమును దమమూపులపై నిడికొని మోసికొని పోవుచుండ వారి కాకపక్షములు గాలికిఁ దిన్నఁగాఁ గదలుచుండెను. ఆకదలిక యన్నరనాథున కొనర్చు వింజామరముల యుపచారమై భాసిల్లెను అత్తఱి సేనా నివహములు నిండి యుండెను. సైనికులు తమయెడందల నాటుకొని యున్న రాజభక్తిని వెల్లడించుచు ననంతభూపతి భౌతిక శరీరమునకుఁ దుది సేవలు పదింబదిగ నొనర్చిరి. పతిభక్తి భరిత యైన 'సూర్యమతి' యావిషయము నంతను గడుంగడు శ్రద్ధతోఁ గనిపెట్టుచుండెను. ప్రొద్దు క్రుంగు తరుణము సమీపించినది. సపరివారముగ భర్త నిట్లనుగమించుచు సూర్యమతి పితృవనమును జేరెను.

ఆక్షణమున సూర్యమతి తనతనయునిఁ జూడ నుత్సుక యయ్యెను. పుత్రుని చెడ్డ నడతయే యింతటి తమదుర్దశకు హేతు వగుట బాగుగ నెఱింగి యుండియు నాదేవి యాతరుణమున నట్టిపుత్రునిఁ జూడ నుత్సుకురా లగుట కేమి హేతువో యెఱుఁగఁజాలము. అది యొక సుత వాత్సల్యము. అది పూర్తిగ విడుచుట కసాధ్యము.

అట్టి సమయమున సైన్య సందోహ సమ్మర్దముచేఁ బుడమినుండి దుమ్ము దట్టముగ రేగినది. ఆయ్యది గాలిచే నల్దెసలఁ గ్రమ్ముకొనినది. సూర్యమతీదేవి యద్దానిం గని తనకుమారుని యాగమన మందుకుఁ గారణముగా భావించుచుఁ జకితయు నుత్కంఠితయు నయ్యెను. ఇంతలోఁ బట్టణపు బాటనుండి కొందఱు జను లక్కడి కేగుదెంచిరి.

ఆదేవేరి వారినిఁ గాంచి "కలశుఁడు వచ్చెనా?" అని స్వయముగఁ బ్రశ్నించెను. కాని, యతఁడు రాలేదని యెఱింగెను, అందుకుఁ గారణము నైత మామె కవగత మయ్యెను. ఆకలశభూపతి యట్టితఱి తల్లిదగ్గఱకుఁ బోఁగోరి సమకట్టెను. కాని యతని యాస్థానమున విశ్వాస పాత్రులై యతనికి దుర్బోధ లొనర్చుచు భేదకారులు ధూర్తులును నై యున్న మంత్రులు లేనిపోని మాట లాతని చెవుల నూరిపోసి భయము గొల్పి యాకలశుని యాగమనమును నిరోధించిరి.

సూర్యమతి దుర్మంత్రుల కుట్రయే కలశుఁడు రాకుండుటకుఁ గారణముగ నూహించెను. సుతునిఁ జూడవలయునని కుతూహలపడుచున్న యామె డెందమున నైరాశ్యము బాదుకొనెను. తోడనే క్రోధ జ్వాల రేగి యామె స్వాంతమును మఱింత చీకాకుపఱచెను. అది కారణముగ నాదేవి పితృస్థానది [illegible] ప్రార్థించుచు నిట్లొక పద్యమును బఠించెను.

గీ॥ ఉదరగత మౌచు నైతత్తమదక మున్న
యపుడ మరణింతు రెవరు వారద్భుతముగ
బ్రహ్మవాదుల పగిది కైవల్య సుఖము
శాశ్వతంబుగఁ గాంత్రు నిస్సంశయముగ.

ఇట్లు పఠించిన పిదప నారాజ్ఞి తనకడకుఁ దీసికొని వచ్చిన యాపవిత్ర పితస్త్రాంబుల నాచమించి తమకు ద్రోహ మొనర్చిన దుష్టుల నుద్దేశించి యిట్లు శపించెను. "వార్ధక్యమునందుఁ బుత్రుని లాలన పాలనముల సుఖింపవలసి యున్న మాయిరువురకు సుతునితో నింతగా వైరమును బుట్టించిన దురాత్ములు కొలఁది దినములలోనే వినాశము నొందుదురుగాక! వారి వంశము సైతము క్షయ మొందునుగాక!"

ఈశాపవాక్కు లమోఘములై యనతికాలములోనే విశితాస్త్రములవలె 'జయానంద' 'జిందురాజా'దుల నాహుతి గొనినవి. సతుల హృదయ తాప మూరకపోవునా? మఱియు నాసాధ్వి తన పాతివ్రత్యపుఁ బవిత్రతను రుజువు చేయుటకును, దొల్లి హలధరుని స్నేహబాంధవ్యమువలనఁ దనకుఁ గల్గిన యపనిందను నిర్మూలించుటకును బరలోకమే పణముగాఁ గల గంభీర శపథము నుచితజ్ఞయై యుక్తితో నొనర్చెను. ఈవిధముగ సూర్యమతి తన పావన శీలమును బ్రతినతో వెల్లడించి నిర్మల మగు చిఱునగ వానన సీమయందుఁ గందళింప వెంటనే తనమేను జాజ్వల్యమానమగు చితాగ్నికి సమర్పించెను.

అంత చితాగ్ని మిన్ను ముట్టెను. వహ్నిజ్వాలా మాలికలచే నావరింపఁబడి యెఱ్ఱనైయున్న గగనము "ఆపుణ్యదంపతులు స్వర్గపురి కరుదెంచు నపు డానందముతో స్వాగతోత్సవము జరుపుటకై దేవత లలంకారముగా వేసిన చెంగావి రంగు పూఁతతో నలరారుచున్నదా!" యను నట్లు భాసిల్లు చుండెను. ప్రజల యాక్రందనముచే దిశలు మార్మ్రోగెను. అగ్నియందుఁ బ్రేలెడు చిటాత్కారములు జన నివహమునుండి వెలువడిన రోదన ధ్వనులలో లీనమై యించుకేని వినరావయ్యెను. ప్రజావ్యూహపు దుఃఖ సంతాపోష్మయందుఁ జితాగ్ని వేడిమి యెట్టిదో గోచరింపక పోయెను. అందువలన నచ్చటి శ్మశాన వహ్ని కీలలు చిత్తరువులోని దృశ్యములువోలె నొప్పారెను.

ఆపుణ్యదంపతుల సహగమన సందర్భమున వారి వియోగమును సహింపలేక వారితోఁ గూడ శరీరములఁ దొఱఁగిన వారును గొందఱు గలరు. 'గంగాధరుఁడు' 'టక్కబుద్ధుఁడు' మేనా మోయుచుండెడి 'దండకుఁడు' అనుపురుషులు 'నోనిక' 'వల్గ' అను పరిచారికలును, ఆ దంపతుల ననుగమించి యిహమును బాసిరి.

మఱియు బప్పటివంశమున జనించిన "సేనటుఁడును" ఉద్భటవంశమున జన్మించిన 'క్షేమటుఁడును, ననంతభూపతి కత్యంతము ప్రేమాస్పదులై యుండిరి. వారిరువురును దమప్రభుని వియోగముచేఁ బరితప్త హృదయులై యైహిక విషయములందు విరక్తి నొంది విజయేశ్వరుని సన్నిధి నాశ్రయించిరి.

ఈవృత్తాంతమును బరిశీలింప "భావములు యంత్రములవలె నశించున వైనను గాజుపాత్ర వలెఁ జిత్తము భంగుర మైన దైనను నందుదయించుఁ జమత్కార కారి యగు సూక్తివలనఁ గలుగు సుగుణము పావన గంగా జలమువలె భ్రంశము నొందక మలినము గాక తరుగు వడక చిరకాలము విరాజిల్లును" అని స్ఫురింపుచున్నది.

మ॥ అరయన్ యంత్ర విసర్గ భంగుర తరం
బౌచుండు భావాళి యీ
ధరఁ జిత్తం బను కాచపాత్రమున; శు
ద్ధంబై స్థిరం బైన భ
వ్య రసోల్లాసి చమత్కృతోక్తి యల గీ
ర్వాణ స్రవంతీ పయ
స్స్ఫురణంబట్లు కొరంత నొందక తన
ర్చున్ దద్గుణాదర్శమై.

అనంతభూపతి యఱువది యొకటి యేండ్లకుఁ బైఁబడ్డ వయస్సునందు జాయతోఁ గూడి యీరీతిఁ బార్వతీ పరమేశ్వరుల సాన్నిధ్యముఁ జేరెను.

తఱువాత నాల్గవ దినమునఁ దన్వంగరాజు కుమారులు. అదంపతుల యస్థికలను దీసికొని గంగానదిలోఁ గలుపుటకై బయలు దేరిరి. 'హర్షుఁడు' పితామహుఁడౌ ననంత భూపతివలన విజయేశ్వరమునందుఁ దనకు సంప్రాప్త మైన పరివారముతోఁ దను గోశముతోఁ దను గూడిన వాఁడై తండ్రియెడ వైరమూనెను తొలుతఁ దనతాతతోఁ దండ్రికి వైరము గలిగినపుడు తండ్రి నగరరాజ మగు 'శ్రీనగరి' యందుండెను. తాత విజయేశ్వరమునఁ గాలముఁ గడపెను. ఇపుడు హర్షుఁడు తండ్రితో విరోధ మూని విజయేశ్వరమును నివాసస్థానము గావించుకొనెను. తండ్రియగు కలశభూపతి శ్రీనగరియందే యుండెను.

పిమ్మటఁ గలశమహీజాని తనపుత్రుఁడు మితి మీఱి ధనమును వ్యయపఱచుట గమనించి తాను ధనహీనుఁ డగుటచే ననర్థము వాటిల్లు నని భీతి చెంది చారులమూలమున సుతుని సంధిచేసికొన నభ్యర్థించెను. సంధి నిబంధనములలోఁ గుమారున కెట్టి హానియుఁ గలుగకుండఁ గాపాడుట ప్రతి దినము స్వీయ జీవనోచిత మగు వేతనము సంప్రాప్త మగునట్లు సేయుట 'హర్షునకు' బితామహుఁ డొసఁగిన ధననిధినిఁ బాలించుట మున్నగు ముఖ్యాంశములు ప్రతిజ్ఞాతములై యుండెను.

ఇట్లు దూతలవలన రాయబారము నడపిన తఱువాతఁ గలశభూపతి తానే కుమారుని 'శ్రీనగరికిఁ' దోడ్కొని వచ్చుటకై విజయేశ్వరమునకు నేతెంచెను. అచ్చటఁ 'బరశురామప్రీతి' గావింపఁబడిన గృహములను జూడఁగనే కలశుని కన్నులు భగ్గున మండెను. అచటి జనులు వానిని బహు విధముల నిందించిరి. ఆనిందావాక్యము లతని చెవులం గొఱవులు గ్రుచ్చిన ట్లయ్యెను. ఏమైన నేమిః అతఁడు కుమారు సంతిముఁ జేరి నచ్చిన గలిగించి పూర్వోక్త విధమునఁ బ్రతిన సల్పి యను నయించుచు నతనిఁ దోడ్కొని శ్రీనగరిం జేరెను. మఱియుఁ గుమారుని ధననిధికిఁ దదీయ నామాంకితము ముద్ర నిడి భద్రపఱచి యుంచెను.

ఇట్టి తరుణమునందుఁ గలశావనీశునకు ధార్మిక మైన బుద్ధి యుదయించెను. అందుకుఁ దగి నట్లు తన దారిద్ర్యమును బోఁగొట్టఁ జాలిన ధనార్జనాభిలాషయు నతనికిఁ గలిగెను. సరిగా నాసమయము ననే 'సేల్యపుర'వాసి 'నయనుఁడు' అనువాఁ డొకఁ డుండెను. ఆతని కొమరుఁడు 'జయ్యకుఁడు' అను వాఁడు మిగుల నేర్పరియై మిక్కుటముగ ధనమును భూమిని సంపాదించి క్రమముగా, డామరత్వమును (జమీన్దారుహోదా) అనుభవించుచుండెను. అతఁడు తనపొలములందుఁ బండిన బహువిధ ధాన్యమును నానా దిగ్దేశ భాగముల కెగుమతులు సేసి వాణిజ్యమును సాగించి యపరిమిత మగు ధనము నార్జించి యుండెను. అంతటితో నాగక యత్యంత ధన లుబ్ధుఁడై యతఁడు కుబేరునితో స్పర్ధ సేయువానివలెఁ గూడఁబెట్టి దీన్నార రాసులను దినదినము మూఁడు మైళ్ళ పరిమిత క్షేత్రమును ద్రవ్వించి యందు నిక్షే పించుచుండెను.

అట్లు దీనార రాసులను భూనిక్షేపము గావించెడి భృత్యులను బెక్కండ్ర నానాటి కానాఁడే రాత్రులందు నిగూఢముగ జంపించుచుండెను, అంత నా'జయ్యకుఁడు' గొంతకాలమునకు 'భాగిలమును' బడయఁగోరి యకస్మాత్తుగ నటకు నొక బలఁగము పేరెము దీయుచుండఁ దానును నశ్వారూఢుఁడై యతివేగమునఁ బఱచుచుండెను. ఆవడిలో నతని గుఱ్ఱ మొక ద్రాక్ష తీవల గుబురులోఁ దగుల్కొని యాగిపోయెను. అచ్చోట నెవ్వఁడో యొక సైనికుఁ డతనినిఁ దెగటార్చెను. విధివిలాస మీరీతి నడు వఁగా వసుమతీతల గతమై యున్న యతని విత్తసంచయమెల్లఁ దుదకుఁ బ్రవువగు కలశునివశ మయ్యెను.

ఈవిధమునఁ గలశమహీపతి దారిద్ర్యమును దఱిమివేసి లక్ష్మీ కటాక్ష విలాస లాలితుఁడై యొప్పారెను. అత్తఱిఁ బుడమిలోపల జయ్యకునిచే నిక్షేపింపఁబడిన దీన్నారములను దీయించుచు వాని నంటియున్న మట్టిని వితస్తానది తోయముల నహర్నిశము కడిగించుటంజేసి నిర్మల మగు వైతస్త వారి పూరము చిరకాలము పంకిలమై యుండెను.

ఆహా! లుబ్ధు లెంతటి మహాశయులోగదా! త్యాగ భోగములు మాని నిరంతర క్లేశమును సహించుచుఁ బరులకై తమ యర్థరాశినిఁ గాపాడు పుణ్యాత్ములు వారలేగదా! వాయు భక్షణము చేతనై నను జీవధారణము సేయుచుఁ జీఁకటి కోన యను బిలమువంటి గుప్త స్థలమున శయనించుచు సంభోగ నగ్నతా త్రపను వారించు కొనుటకై నితరు లొసఁగు వలువకై దేవురించుచుఁ దనకదర్యతా దైన్య మును బహువిధముల జాటుకొనుచు నన్యులకొఱకై నిధినిఁ గాపాడుచు నుండు లుబ్ధునకును సర్పము నకును భేద మించుకయును లేదు. నిక్కముగ నిట్టిపరోపకార చణుఁడైన మహాశయుఁడు లోభిగాక మఱి యెవ్వఁడగును?

గీ॥ త్యాగ భోగంబులే లేక యహరహంబు
బహువిధ క్లేశముల కోర్చి పరుల కొఱకు
నర్థ మార్జించి రక్షింతు రౌర! లుబ్ధు
లెంతటి మహాశయులో దెల్ప నేరి తరము?

తర నిర్వ్యాజ జల పూరముల్ పొంకువఁ ద
త్తచ్ఛుష్క కాసారముల్
వరలున్ నిండుచు; భాగ్య మబ్బఁగ సిరుల్
వర్ధిల్లఁ బల్దారులన్.

ఈవిధముగఁ గలశేశ్వరునకు సంపదలు గలసి వచ్చినవి. అంత మాత్రమె గాక ప్రజల భాగ్యోదయ కారణమునఁ దండ్రి యగు ననంత భూపతికివలె నతనికి నిరంతరము ప్రజా సంరక్షణ దాక్షిణ్యము గల సద్బుద్ధి యుదయించెను. అతఁ డుపస్థితము లయినవిషయఁ గానున్నవియు నగు నాయ వ్యయములను స్వయముగఁ బరిశీలించుచు నియోగివలెఁ దనచెంత నుండిన బుజపత్తిరి, బిలపము, మున్నగు నల్పవస్తువులనేని పోనీక కాపాడుచు, మఱియు వణిజుఁడువోలెఁ బ్రాప్తము లగు నర్థ రాసులను గణించుటయందు మిగుల నేర్పరి యగుచు నుండెను, అయినను తన ధనసంపదను సత్పాత్ర త్యాగమున బహూమానించు వివేకియు నయ్యెను.

రత్నాది విక్రేతలు వచ్చినపుడు స్వయముగఁ గలశభూపతి రత్నవిశేషము నెన్ని కొని వాని సహజ మూల్యమును సరిగాఁ దానే నిర్ణయింపఁగల కౌశలమును నయితము సంతరించెను. విక్రేతలవ్విషయమున నమ్మహీజాని నించుకేనియు వంచింప వలంతులు కారైరి. ఇఁక నాయొడయఁడు ధర్మార్థకామములను సమముగ సేవించుచు మధ్యాహ్నమయిన తఱువాత నుద్యోగుల కేరికిఁ గానరాక సుఖాసక్తుఁడై మెలఁగుచుండెను. కలశమహీధవుఁడు చారులవలనఁ దమవారి పనులను, నితర కృత్యములను మెలఁకువతోఁ గనిపెట్టుచుండుటవలనఁ బ్రజల వృత్తాంత మతని కెఱుకపడని దేదియు లేదయ్యెను. ఒకవేళ నట్టి దేదేని యుండుచో నది కలలోని వార్తగా నుండవచ్చును.

మఱియు నాభూపతి రాష్ట్రము నంతను స్వీయ గృహముగాఁ జూచుచు గేస్తుధర్మమును నిర్వర్తించుటం జేసి యందుండు ప్రజకు దైన్య మెట్టిదో తెలియరాకుండెను. వెండియు నాతఁడు రాష్ట్రమునందలి కంటక ప్రాయులైన క్షుద్రులను బరిశోధించుచున్నను స్వీయ కౌలీనత బయల్పడు నన్న భయమున నట్టి వారినే గాక దొంగలను సైతము ప్రత్యక్షముగ నొకప్పుడును దండింపఁజాలకుండెను. మంత్రులకుఁ గలశేశుని పనుల సవరింపవలసిన యవకాశము దొరకక పోయెను. కాని, మంత్రుల వలనఁ జెడిన పనులను మాత్ర మాతఁడు చక్కఁబెట్టఁగలిగి యుండెను.

ఇఁక నతనిరాష్ట్రము వివాహ యాగ యాత్రా మహోత్సవాదులచే సమాకులమై నిత్యకల్యాణము పచ్చతోరణముల నలరారుచుండ నందలి జనులు నీరంధ్ర నిత్యానందముతో దైన్య మెఱుఁగక సౌఖ్యావధి గనుగొనుచుండిరి.

రాజనీతిజ్ఞుఁడైన కలశభూజాని సమీపవర్తులగు సామంతుల లోఁగొని వారి యాహార వ్యవహారములు సైతము పరిశీలించు స్వీయాధికృతులు లేకున్నను స్వయముగనే పరీక్షించు నైపుణి గలిగియుండెను. అతఁడు తన్వంగుని కుమారులను 'ధక్కనాదులను' 'గంగు'ని కొమరులన 'సుల్లఁడు' మున్నగువారిని విదేశములనుండి రావించి వారలను తెన్నుగఁ బోషించెను.

కలశభూపతి చంద్రునివలెఁ జల్లనివాఁడు. చల్లని వానికడ సంచారము జేయుదురుగదా! దేవతలు పితృదేవతలు సుధాకరుని కళల నాస్వాదించునట్లు బంధుమిత్ర భృత్యాదు లెల్లరు కలశభూపతి నాశ్రయించి రుచి మఱగి పాదుకొనిరి. ఈతఁడు తొలి యౌవనముతోడి బుద్ధి పరిపాకము గూడఁ గలవాఁడు. అయిననేమి? ఇతఁడు శబలిత చరిత్రుఁ డయ్యెను.

ఇందుకుఁ ముఖ్యహేతువు. 'వుల్లియుఁడు' అను పేరుగలవాఁడు తస్కుఁడు (మిగులటక్కులాఁడు) ఒకఁడు గలఁడు. అతఁడు నానాదేశములందు జన్మించిన యందగత్తెలను తురుష్కుల దగ్గఱనుండి విలిచికొనివచ్చి యౌవన హయము నెక్కియున్న కలశుని పజ్జఁ జేర్చెను. ఇంక నతఁడెట్లు కాదనును? పాపము! అతనికి దుష్టు లుపదేష్టలైరి. దురాచారపు వాసన మరల బాగుగ బట్టినది, ఇంకనేమి? దౌశ్శీల్యపుఁ బిశాచము నెత్తికెక్కినది. కావుననే తురుష్కులనుండి లభించిన పూఁబోఁడులతో నతఁడు తనివి నొందలేదు. మనోహారిణులగు పరస్త్రీలపై నైతము గన్నుమెలపెను. అట్టివారి నందఱను దన యంతిపురపు టంగనలనుగా నొనర్చెను. ఇట్లతఁడు డెబ్బది యిర్వు రంతఃపురాంగనలతోఁ గ్రీడింప సాగెను.

కలశభూపతి యిట్లు కామక్రీడాలంపటుఁడై ప్రతిదినము పెక్కండ్ర చారుహాసినులఁ గూడి యనంగ క్రీడా విలాసముల మురియుచుఁ గాలముఁ బుచ్చుచు దన యారోగ్యము చెడకుండుటకై బల వర్ధకములైన 'మత్స్యయూషా'ది వాజీకరణౌషధములను సేవించుచుండెను. మఱియు నతఁడు యాగాది మహాపూజా సమయములందు గురుజనముతోఁగూడి తొందరపాటుతో నీతిమాలి మహాచరువు (యాగీయ పశుమాంసరూపహవిస్సు) మున్ముందుఁ దానే గబళించువాఁడయ్యెను. ఇట్టి విచిత్ర భావశబలతతోఁ దొల్లి కలువేయు నాభూజాని బూది పాలై పోయిన విజయక్షేత్రములఁ బునర్నిర్మాణముతో నవీకరించి విజయేశ్వరు నాలయమును జలువరాలతో నిర్మింపఁజేసెను. అంతియకాదు అద్దాని పసిఁడి శిఖరము తారాపథమును ముద్దిడు కొనున ట్లొనర్చి నేత్రపర్వ మొనరించెను.

తప్పుదారి పట్టిన కలశుని తలలో నిట్టి శుభాశయములు మొలకలెత్తుట యతని భాగధేయ విశేషమూలము గదా! వెండియు, నాతఁడు త్రిపురేశ్వరమునందుఁ 'త్రిపురేశ్వరునకు' నిగ్గులువీను పసిండి యుసిరిక సరములతోఁ దారలఁ బరిహసించునట్టి ప్రాసాదమును గట్టించి యందు జరుపఁదగు కైంకర్యమునకై ధన వినియోగ వ్యవస్థ నొనర్చి సత్కార్మ కుశలుఁడై యుదార యశస్సు నార్జింపఁగల్గెను. అసంఖ్యాకములగు కనక కలశములతో నిండి తనరారు 'కలశేశ్వరుని' యాలయము గూడఁ దన్నిర్మిత దృశ్యములలో నొకటి. ఆకలశేశ్వరునకుఁ గాంచనచ్ఛత్రము నూతన శిల్పవైభవముతో నొప్పారు దానిని సమర్పవలయునని యాకలశమహీధవుఁడు మిగులఁ గుతూహలియై యుండెను. అట్టితఱిఁ దురుష్కదేశమునుండి యొకానొక శిల్పి తేని కడ కరుదెంచెను. అతఁడును తేని తలంపెఱింగి తనకు శిల్పమునందుఁగల నేర్పు నెఱింగించి బంగరు గొడుగు నిర్మింప ననుజ్ఞ వేడుచు "పెక్కు వేల పసిఁడి నాణెముల వెచ్చించినఁగాని దాని నిర్మాణము సమకూరదు" అని నుడివెను.

కలశభూపతి యందులకు నొడఁబడి తురుష్కశిల్పి నందుకై నియమించి వానికి భోజన మజ్జనాది వివిధ సౌఖ్యము బాగుగ నేర్పఱచి పోషించుచుండెను. వాఁడును ధనశిల్ప కళయందలి రహస్య

తంత్రము నెవరును నెఱుఁగకుండఁ గప్పిపుచ్చుచు రాగిపై బంగరు పోఁత నేకాంతమున మెలఁకువతో సాగించుచు విత్తము దోచుకొనసాగెను.

ఇట్లు కొన్నాళ్ళు గడవఁగా రాజ సచివుఁడును సుతీక్ష్ణ కుశాగ్ర బుద్ధియు నగు 'నోణకుఁడు' పలుమా ఱాశిల్పి చెంగటఁ జేరి బహువిధ ప్రసంగ సందర్భ వశమున నాతురుష్కుని శిల్ప మర్మమును గన్గొనెను అంతట నాశిల్పి దిక్కు దోఁచక గుట్టుగ వచ్చిన దారి వట్టి పోయెను.

తఱువాత నలతి జాంబూనదముతోడనే యాతపత్ర నిర్మాణము సంపూర్తి నొందెను. ఈవిధముగనే యన్నరనాథుఁడు 'అనంతేశ' 'బాణలింగా'ది ప్రతిష్ఠల నత్యంత వైభవోపేతముగఁ గావించి తనయైశ్వర్య విలాసమును గొంతవఱకుఁ జరితార్థము నొనర్చెను.

ఇట్టితఱి రాజపురి పరిపాలించు 'సహజపాలుఁడు' కాలధర్మము నొందెను. అతనికుమారుఁడు 'సంగ్రామపాలుఁడు' బాలుఁడు రాజ్యాభిషిక్తుఁడయ్యెను. ఆబాల భూపతి రాజ్యమును హరించు సంకల్పముతోఁ బినతండ్రి యగు మదనపాలుఁడు కుట్ర పన్నుచుండెను. ఆదురుద్దేశమును సంగ్రామపాలుని సోదరి కనిపెట్టి 'తక్కర జస్సరాజు'తో బయలుదేరి కలశభూపాలునికడకు శరణార్థినియై సాహాయ్యమర్థింప నేగుదెంచెను. శరణాగత రక్షణ విచక్షణుఁ డగు నన్నరేంద్రుఁడు వారియెడఁ గనికరించి వారి కార్యముఁ జక్కబెట్టుటకై 'జయానందుని' బిజ్జుఁడు మున్నగు వీరవరులను వారికి బాసటగా నంపెను.

'జయానందుఁడు' బిజ్జాదులతోడఁ బ్రస్థానమొనర్చి సంగ్రామపాలుని పినతండ్రి కుతంత్రము నణఁచి పగతురను బాఱఁదోలెను. కార్యము చక్కఁబెట్టి యుత్సాహముతో నున్న జయానందునియెడ సంగ్రామపాలుని మంత్రి మండలి శంకింప మొదలిడెను. కావుననే జయానందుఁడు మరలిపోవుటకునై యామంత్రులు పెక్కు రీతులఁ బ్రయత్నించుచు నతనికి భీతి గలిగించుటకుఁగూడఁ బ్రయత్నించిరి. ఎంతటి వెఱ్ఱితనము! మహావీరుఁడును మేధావియునగు జయానందుఁ డట్టి యుడుతయూపులకుఁ జలించునా? 'రాజపురి' ప్రజలకుఁ దనయెడ నిట్టి బుద్ధి పుట్టుటకుఁ దనతోవచ్చిన 'బిజ్జుఁడు' హేతువగును.'' అని జయానందుఁ డను మానించి యాతనిపైఁ గినుకఁ బూనెను. తుదకు రాజపురియందలి మంత్రులు తమదురాలోచనము సమంజసము గాదని యెఱింగి జయానందునకు నుడుగరగా బహువిధ ధనరాశి సమర్పించి వినమ్రులై మెలఁగిరి. ప్రతిభావంతుఁ డగు జయానందుఁడు రాజపురి మరల శత్రువుల బారి' పడకుండఁ గాపాడు నెపము వెట్టి సైన్యము నందుంచి యచటనుండి దాను మరలి రాజధానికిఁ బోయెను.

అంతట 'జయానందుఁడు దానొనర్చిన కార్యవిధాన మంతయుఁ గలశేశున కెఱుకపఱచెను. కార్యమర్మజ్ఞుఁడగు నమ్మానవపతి జయానందుఁడు రాజపురినిఁ దమ యదుపు బొదుపులం దుంచి వచ్చినందుకు మిగుల సంతసించెను.

ఇట్లుండఁ గొంత కాలమునకు దురదృష్ట వశమున జయానందుఁడు ప్రాణాపహారి యగు ఘోర వ్యాధికి గుఱి యయ్యెను. బిజ్జుఁడు మున్నగు వారు క్రమముగా స్వయముగ రాజులవలె మెలఁగసాగిరి. ఒకనాఁడు రాజు జయానందుని యారోగ్య విషయమును నడుగుటకై యతని కడ

కేతెంచెను. ఆతనితో బిజ్జుఁడు మున్నగు వారు గూడ నుండిరి. వివిధ విషయముల ప్రసంగ సందర్భమునఁ "జెప్పఁదగు రహస్య మొండు గలదు." అని జయానందుఁడు రాజునకు సూక్ష్మముగ విన్నవించెను. బిజ్జుఁడు తక్కఁ దక్కిన వారెల్లరును వెంటనే వెలుపలికి వెళ్ళిరి. అయినను జయానందుఁ డేమియు మాటాడక మిన్నకుండెను.

అంతట బిజ్జుఁడు బుద్ధిశాలి గావునఁ దమ్ములపు విడెము నుమియు మిషవెట్టి తానును వెలుపలికిఁ బోయెను. అట్టితఱి రాజును మంత్రియు బిజ్జు నుద్దేశించి "నీవేల వెలుపల నుంటివి? లోనికి రమ్మ" అని యనుచున్నను ధీశాలి యగు నతఁడు వెలుపలనే కొంత కాలము గడపుచు నట్లే యుండెను.

అప్పుడు జయానందుఁడు రాజు నుద్దేశించి రాజపురియందు నడచిన కథను వివరించుచు "ఓ రాజా! బిజ్జుఁ డభివృద్ధి నొందినచో నీకు రాజ్యము దక్కదనుట నిక్కము." అని యెఱుంగుము. బిజ్జుఁడు రాష్ట్రి కార్యములను జరుపు నెపమునఁ దాను గూర్చిపెట్టు కొన్న ధన మతని వేతనమున కంటెఁ బెక్కు మడుంగు లెక్కువగ నున్నది. ఇట్టివి యతని చర్యలు." అనుచు రాజునకు నార్థికపు లెక్కల వివరమును విశదపఱచెను.

అంతటఁ గలశుని మనస్సు మిక్కలి గలుషిత మయ్యెను. బిజ్జునియెడ నన్నరేంద్రున కప్పటికప్పుడే యసూయ జనించెను. కుశలమతి యగు బిజ్జుఁడుగూడ తేనికి దనయెడఁ గినుక వొడముట గమనించి "యికఁ దాను నృపతికడఁ గొలువొనర్చుట సమంజసము గాదు" అని యెంచెను. వెంటనే యతఁడు రాజుకడ కేగి తన యాశయ మెఱింగించెను. ఆతేఁడును మొదట దాక్షిణ్యము గొంత గనుపఱచువానివలె బిజ్జుని యత్నమును నివారించెను. కాని బిజ్జుఁడు తనకోర్కెయెడఁ బట్టు పట్టి యుండుట నవకాశమును బురస్కరించుకొని యతఁడు రాజ్యమును విడిచి పోవుటకు లోలోన సంతసపడుచు ననుమతించెను.

అట్లు బిజ్జుఁడు రాజు నానతి నొంది వెంటనే స్వగృహమునకుఁ బోయి యచ్చటనుండిఁ దన సోదరులకు దనకుఁ గల బహువిధములయిన యుపకరణములతోడఁ బయనము సేయించి తనకై తాను మరల రాజును దర్శించి యతనికడఁ గడసారి వీడ్కోలు నొందుటకై నృపాంతికమున కేగుదెంచెను. అప్పటి వారిరువుర వైఖరి యనిర్వచనీయ మైన యచ్చెరువును గల్గించునదిగఁ గన్పట్టెను. ఏమన? రాజగు కలశుఁడు భృత్యుఁడగు బిజ్జుఁడును జిరకాలమునుండి యన్యోన్య ప్రేమతోడ మెలఁగిరి. ఇప్పటి యాకస్మిక సంఘటనమునందు వారిరువురును బరస్పరము వారిలోఁ గలిగిన రాచఱికపుఁ గ్రూర స్వభావము వించుకేని బయల్పడనీక యత్యంత గంభీర హృదయులై మెలఁగిరి. ప్రియభృత్యుఁ డట్లు తాను "రాజ్యమును విడిచి పోవుచున్నాను. సెల వొసంగుము." అని యడిగినప్పు డాలా జొక్క మాత్రైనను 'నట్లు సేయవలద'ని దృఢముగ నివారింపలేదు. పోనీ! పూర్వ మట్లు తనపై బ్రీతి గలిగి యున్న యానృపతి యొక్క క్షణమున నంత చులకనగ విడిచి పుచ్చుచున్నాఁడను కినుకతో లోలోనఁ గుములు బిజ్జుఁ డయ్యెడయని వల్లెత్తి యించుకేని గుర్తింపలేదు. ఇట్టి వీరి మనోవృత్తులను బరిశీలించిన మిక్కలి విచిత్రముగఁ దోఁచునుగదా:

తఱువాత బిజ్జఁడు ముందుకు నడువసాగెను. నృపతియు వానితోడ లేచి నిలువఁబడెను. కొన్ని యడుగులు పెట్టిన తఱువాత బిజ్జఁ డచ్చటనున్న కొందఱు వారాలురగు సీమలతో నేమేమో వదరుచుఁ బెద్దపెట్టున నవ్వుచు నటనుండి వెడలిపోయెను. తొల్లి ముమూర్షువై యుండిన హలధరుఁడు జిందురాజును నిందించుచుఁ బదభ్రష్టునిఁ జేసినట్లు జయానందుఁ డిపుడు బిజ్జునిఁ బదవీచ్యుతునిఁ గావించెను.

ఆనాఁడు కలశమహీకాంతుని రాచఱికపు సిరిని బిజ్జఁడు 'స్వాహా' చేసియుండెను. అతఁడు మిగుల్చుకొని యుండినదే రాష్ట్రసంపదయై యుండెను. అందువలన ధీమంతులగు మంత్రులు "బిజ్జుని యధీనమై యున్న యర్థ సంపదను హరించి యతనిని రిక్తునిగాఁ బంపుట శ్రేయస్కరము." అని తేనికి నివేదించిరి. కాని, యారాజచంద్రుఁడు కలశుఁడు వారిమాట నంగీకరింపక యతని నట్లే స్వేచ్ఛగా విడిచిపుచ్చెను.

బిజ్జఁడు పయనించు తఱిని రాజు, అతని ముఖ్య పరివారము దక్క మిగిలిన ప్రజలందఱు నతని ననుగమించిరి. వారందఱును "నరేంద్రుఁ డెట్టకేలకు బిజ్జుని ప్రయాణమును వారించి యతనిని మరల నతని స్థానమునందుఁ దప్పక నిల్పును" అను దృఢ విశ్వాసము గల్గి యుండిరి.

ఇట్టి సంఘటన మేర్పడిన పిమ్మట నాకాశ్మీరపతి "బిజ్జఁడు తనపై దండయాత్ర సాగించునేమో!" యని శంకించుచు గడ్డిపరక గదలినను గంపించుచు నయిదురాత్రు లట్లే నిద్దుర పట్టక నిర్విణ్ణుఁడై యుండెను.

శూరపురమును విడిచి పోవునపుడు బిజ్జునితో ననుగమించిన వారందఱు మరల వెనుకకుఁ దిరిగి వచ్చిరి. అంతటితోఁ గలశమహీపతి శంకయు నివర్తించెను, తఱువాత నతఁడు తన మంత్రులకుఁ దనయనుమానమును వెల్లడించెను. సచివులు నృపతి పల్కు లాలించి పూర్వము "బిజ్జుని ధనాపహరణము నొనర్పవలయును." అనియు వారు దెలిపిన విషయమును తేఁ డమలు జరుపకయుండుట యతని రాజనీతిజ్ఞతకుఁ దగిన గుర్తుగా భావించిరి. రాజభక్తి గలవాఁడుగాఁ బేరొందిన బిజ్జఁడు నానా జనపదములు సంచరించునపు డతనిని, అచ్చటి ప్రజ లనర్ఘ రత్నముగా భావించిరి. అతఁడు తన తెలివితేటలతోఁ జాల నభివృద్ధి నొందియు రాజభక్తి విశ్వాసముల నెడఁ బాయక కలశభూపతిని దేవుని వలె స్మరించుచునే యుండెను.

ఈరీతి బిజ్జఁడు మున్నగు వారిని రాజ్యమునుండి తఱిమివేసిన జయానందుఁడును తన రాజనీతి వైశారద్యమును మెఱయించుచు నత్యంత విభవోపేతుఁడై యెదురు లేక రాచఱికపుఁ బెత్తనము నెఱపఁగల్గెను.

కాలవాహిని నెదురీదఁ గలవాఁడు లోకమున నెవ్వఁడు గలఁడు? పూర్వము సూర్యమతీదేవి వితస్తాజలమును దోయిలించి శపించెనుగదా! ఆశాప వాక్కుల పరిణామ మందుకు లక్ష్యమయినవారికిఁ గాలపాశమైనది. ఆశాపము గడవరానిదని దెల్పుటకు నిదర్శనముగా ననంతభూపతియెడ స్పర్ధగలిగి యుండిన వారెల్లరును (జయానందుఁడు జిందురాజు, బిజ్జఁడు, వాని యనుజులును, మున్నగువారు) ఆకస్మికముగ మారి మసఁగినట్లు పెక్కురీతుల నసువులఁ గోల్పోయిరి.

వారిలో బిజ్జుని యనుజులు కారాబద్ధులై యందుండి తప్పించుకొని పోయిరే కాని, 'పాణిపుఁడు' బెబ్బులి వాతఁబడఁగా మిగిలినవారు పెక్కడుములఁ గుడిచి వినాశమొందిరి. భేదకాలములో నిర్వురు ముప్పురు మాత్రము (మదనుఁడు మున్నగువారు) మిత్తివాతఁ బడక మిగిలి యుండిరి. వారును సన్నిహిత భవిష్యత్తులో సిద్ధశబ్ద వికాసము నొందఁదగి యట్లు నిలిచియుండిరి.

అనంతరము కలశభూజాని జయానందునకు సహాయభూతుఁడై యతని పుత్రులను గాపాడుచుండిన 'వామనుఁడు' అనువానిని రాష్ట్రప్రధానమంత్రినిఁగా నియమించెను. నీతి విద్యావిశారదుఁడగు నతని వ్యవహారము అద్భుతావహములు పెక్కులు గలవు. ధీమంతులు గోష్ఠి జరుపునపుడు నేఁడును ఆవృత్తాంతములను వయోవృద్ధులు వర్ణించుచునే యున్నారు. ధనలుబ్ధుఁడగు నారాజు 'అవంతిస్వామి' మున్నగు దేవతల కైంకర్యమునకై యుపయోగపడు గ్రామములనుండి లబ్ధమగు ద్రవిణ సంచయమును బ్రోగు చేసి 'కలశగుంజము' అను పేరుగల కర్మస్థానమును నెలకొల్పెను.

'నోనకుఁడు' అనుమంత్రి ధనార్జనమునందు మిగుల నిపుణుఁడు అయినను రాజు ప్రజల యెడ దాక్షిణ్యములేక విత్తార్జనము సేయుట యుక్తము గాదనియు, అది క్రూరస్వభావమనియుఁ దలంచి యానోనకునకు నట్టి విషయమునఁ బెత్తన మొసఁగలేదు. రాజకలశుని పుత్రులు ప్రశస్త కలశాదులు క్ష్మాకాంతునకు నాంతరంగికులైరి. మఱియు నతఁడు తన రాష్ట్రమున నత్యంత స్వాతంత్ర్యకాములై సంఘ సంబంధములను దొంగదారులు దీయు తన యుద్యోగులను నుపాయ ప్రయోగమునఁ బద భ్రష్టులఁజేసి యణఁచివేసెను.

ఇట్లుండ మదనపాలుఁడు మరల రాజపురి నాక్రమించెను. ఆసంగతి దెలిసి వెంటనే తాఁడు తన సేనానియగు 'బప్పటునిఁ' గార్యము చక్కఁబెట్ట నచటికిఁ బంపెను. కలశభూజాని దండయాత్ర సేయక కేవలము బప్పటునిఁ బంపినను రాజభృత్యుని పరాక్రమమునకే తట్టుకొనలేక మదనుఁడు చిక్కుపడెను. 'బప్పటుఁడు' అతని బంధించుకొని కాశ్మీరమునకుఁ దీసికొని వచ్చెను.

పిమ్మటఁ గలశమహీపతి వరాహదేవుని సోదరుఁడు 'కందర్పుఁడు' అనువానిని ద్వారాధిపతినిఁగా నియమించెను. అతఁడు పరాక్రమశాలి కావున డామరులనెల్ల నిర్మూలించెను. ఆకందర్పుఁడు సింహరాజువలన దండనీతి విక్రమ విశేషములందు సుశిక్షితుఁడు. కావున నతఁడు సరిహద్దు ప్రదేశములం బాలించు సామంతరాజు లందఱు తనమాటను శిరసా వహించి నడచు కొనునట్లు నియమింపఁ గల్గెను. మఱియు నతఁడు ప్రతాప కోపాటోప వివశుఁడు. రాజపురి మున్నగు ప్రదేశముల స్వాధీనపఱచి యుండెను. అంకమువలన ద్వారాధికారమును మాటిమాటికి నతఁడు విడువఁబూని యుండినను, అట్టివానినిఁ గలశభూపాలుఁడు సముచిత మగు సనునయ వాక్య సరణితో నెట్లో నిలువవలసి వచ్చెను.

ఇంక మదనుఁడు ప్రధాన సేనాపతిగా నియుక్తుఁ డయ్యెను. అతఁ డాతరుణమున విక్రమ విజృంభణముతో విఱ్ఱవీగుచున్న 'పోపుఁడు' మున్నగు డామరులను జెండాడెను. 'విజయసింహుఁడు' అనువాఁడు రాజ సేనా పరాయణుఁడు. అతఁడు దేగలను జక్కఁగఁ బెంచి పందెములు వేయింపఁగల యభ్యాసముతో నుండు మటికుఁడు. అట్టివాఁడు నగరాధిపతిగా నియోగింపఁబడెను. అతని పాలనా దాక్ష దక్షమున దొంగల వార్తయే యణఁగారి పోయెను.

కందర్పుఁడు, ఉదయసింహుఁడు మున్నగువారు 'లోహరము'పై దండెత్తి భువనరాజును సుదూరముగఁ బలాయితునిఁ గావించిరి. నీలపుర ప్రభు వగు 'కీర్తిరాజు' కలశభూపతికి లొంగిపోయి తన ప్రియకుమారిని 'భువనమతిని' సమర్పించి కలశపతి నల్లునిఁగాఁ జేసికొని సంబంధి యయ్యెను.

తఱువాత తేఁడు రాజధాని యగు శ్రీనగరినిఁ గాపాడు విజయసింహుఁడు దనకర్తవ్యమున మిక్కిలి జాగరూకతఁ జూపకుండుట నెఱిఁగి యాపదవినుండి యతనినిఁ దొలఁగించి 'గుంగుని' తన యుఁడు 'మల్లుఁడు' అనువాని నధికృతునిఁ గావించెను. ప్రభావోపేత మగు నతని యధికారము సామంత రాజులకు శిరోధార్య మగు నలంకార మయ్యెను. పూర్వ కాలమున నుత్తర గోగ్రహణ సందర్భమునఁ బార్థుఁ డేక వీరుఁడై కౌరవ బలము నెదిరించి యాల మందను మరలించి విజయభేరిని మ్రోగించినట్లు 'మల్లుఁడు' తనప్రతాపమును 'ఉరశ'ను ముట్టడించినపుడు గనపఱచెను.

మఱియు నీమల్లుఁడు తనతో నేబండ్రు గుఱ్ఱపు రౌతులను మాత్రమే గైకొని పోయి 'కృష్ణను' దాటి 'అభయుఁడు' అనురాజును జయించి యతని గుఱ్ఱపు దళము నంతను లోఁబఱచుకొని రాజ్యమును గైవసము గావించుకొనెను.

ఈవిధముగ నీతిజ్ఞుఁడైన కలశేంద్రుఁడు శత్రువుల నడంచి వసుంధరను స్వాధీనపఱచికొని రాజ్యతంత్రమును సుష్ఠుగా సాగించుచుండెను. అయ్యదనున 4163 లౌకికాబ్దమున (క్రీ.శ. 1087-88. ఎ.డి) ఒకేమాఱుగ నెనమండ్రు రాజులు శ్రీనగరినిఁ జేరిరి. ఈయెనమండ్రు నీలపురాధీశుఁడు. కీర్తిరాజు చంపావిభుఁడు, ఆసటుఁడు, వల్లాపురనరేశ్వరుఁడు, తుక్కాత్మజుఁడగు కలశుఁడు, రాజపురీవిభుఁడు, సంగ్రామపాలుఁడు, లోహరప్రభువు, ఉత్కర్షుఁడు, ఉరశాపతి సంగతుఁడు (ముంగజుఁడు)ను కాందేశుఁడు గాంభీరసింహుఁడును కాష్టవాట ధరాధిపుఁడు, ఉత్తమరాజును అనువారలు ఎనమండ్రు. వీరందఱును కలశమహీపతినిఁ దమంత తామె దర్శింపవచ్చిరి.

ఇయ్యదనునందలి వైచిత్ర్య మేమన? ఇందఱు రాజు లొక్కమాఱు తమపరివారముతో శ్రీనగరియందు విడిసి నిండియుండ నతివిశాల మగు నారాజధాని వర్షకాలపు వాహినీ సముదాయమును నదీవల్లభుఁడు తనయందు లీనము చేసికొనిన ట్లాప్రజాసందోహమును తాను దనలో ఇముడ్చుకొనెను. అట్టితఱి వితస్తాజల మంతయు గడ్డకట్టి యుండెను. అందువలన నది చలికాల మైనను జలి బాధ లేక యందందఱు సుఖ మనుభవించిరి. ప్రధానమంత్రి వామనుఁడు వచ్చిన రాజ చక్రము తత్పరివారము దెందములందుఁ గోరుకొనున దంతయు మున్ముందే సిద్ధపఱిచి వారి నందఱను సంతృప్తి పఱచి విస్మయ పరవశుల నొనర్చెను. అవామనుని ప్రతిభ వర్ణింప నలవి గానిది. అతఁడు సమకూర్చిన దంతయు నప్రయత్నముగ నలఁతలేక నిత్యకృత్యముగా నెఱవేఱిన ట్లుండెను. అంతటి మేధావి యతఁడు.

ఇట్లు వచ్చిన రాజు లెల్లరు కలశభూపతి యాదరమునకుఁ బాత్రులై యతని యనుజ్ఞ వడసి తమ తమ పట్టణములకు మరలిపోయిరి. ద్వారాధిపతి యగు 'మల్లుఁడు' ఏలకో కార్య పరాఙ్ముఖుఁ డయ్యెను. అకారణమున ద్వారాధికార పదవిని మరల కందర్పునకే యొసఁగవలసి వచ్చెను.

అభిమానధనుఁ డగు నీకందర్పుఁడు స్వీయ మగు ధనమును వెచ్చించి 'స్వాపికము' అను పేరఁ బ్రసిద్ధి గన్న ప్రబల దుర్గము నొకదానిని సాధించి శ్రీనగరి కేతెంచి యేదియో యొకానొక కారణమున ఖిన్న మనస్కుఁడై కలశమహారాజెంత యభ్యర్థించినను నగరాధిపత్య మంత్రిపదవి నొల్లక పోయెను.

అప్పుడు 'ప్రశస్తకలశుఁడు' అను మాత్య నిర్వాహణ చతురుఁడు కందర్పునిఁ బెక్కు విధముల నధికార స్వీకారమునకై ప్రేరేచెను. కాని కందర్పుఁడు వానినిఁ బెక్కు విధముల నధిక్షేపించి పంపెను. పిమ్మట ప్రశస్తకలశుఁడు పట్టుదలతో బహుళ మగు తనసంపదను వినియోగించి పెక్కండ్రను శస్త్రధారులను బాసటగ నేర్పఱచి యా కందర్పుని స్థానమునఁ దనసోదరుని 'రత్నకలశుని' నియమింపఁజేసెను. ఈరత్నకలశుఁడు ధనసంపదచే విఖ్యాతి బిలిచుకొనెనే కాని ప్రతాపౌన్నత్య బంధుర మగు సహజ విఖ్యాతినిఁ గాంచిన కందర్పునకు సాటి వచ్చునా? చిత్తరువునందలి సింగపు రూపమెంత యాకర్షించునదైనను నయ్యది సహజ సింహపు బరాక్రమ క్రియను జూపఁగల్గునా?

పిమ్మటఁ గలశ భూపాలుఁ డెట్లో భృత్య రత్నమగు నాకందర్పునే యాపదవియందు నిల్పెను. అతఁడును నట్టాయధికారమును నిర్వహించుచు నొకప్పు డొక దొంగను బట్టుకొని తీవ్రముగా బ్రహరించెను. అందువలన నాచోరుఁడు పంచత్వము నొందెను. సహజ దయాళువగు కందర్పుఁడు తనచేసిన పనికి వగచుచు వస్త్రాంతరిత మగు రాజుయొక్క కరమును దట్టి తనయధికారమునకు 'స్వస్తి' చెప్పి విరక్తుఁడై గంగాతీరభూమి నాశ్రయించెను. అందులకు గలశమహీపతి మందిపడి యతనిని బలవంతముగ మరల రావించి యతని దర్పము నణఁపఁ బూనెను. కాని, మరణశిక్ష విధింపలేదు.

ఈసందర్భమునుబట్టి కలశభూపతికి రాచఱికపు నీతి కౌశలము సమయోచిత మగు కార్యసంగతియందు మెలఁకువయుఁ జక్కఁగాఁ గలదని వ్యక్త మగుచున్నది. అతఁడు తన కక్కరవడు పురుషసింహముల ప్రౌఢిదార్ఢ్యముల సహించి యారోహావరోహముల పరిపాటిని గుర్తించి మెలఁకువతో మెలఁగఁ గలిగిన గడుసరి యయ్యెను.

మఱియొక విశేషము. ఈకలశభూపతి యుపాంగ గీత వ్యసని (నాటకీయ మగు తేలిక పాటల విని యానందించుటయందు మిగుల నాసక్తి గలవాఁడు) కావుననే స్వదేశీయులగు నట్టువలనే గాక విదేశములనుండియు నాట్య మొనరించు నాయక నాయకీ మణులను బిలిపించి ప్రదర్శనములఁ గావింపఁజేసి యానందించుచు నుండెడి వాఁడు. విదేశ నాట్యాదికములను గాశ్మీరమున నంకురార్పణము గావించిన ఘనుఁ డితఁడే యన వచ్చును.

మఱియు నితఁడు జయవనమునకు సమీపమున మహోన్నత హర్మ్యశ్రేణులతో విలసిల్లు నొక పురవరమును దనపేర విఖ్యాత మగునట్లొనరించెను. అందు వేలకొలఁది మేడలు హర్మ్యములు నేర్పడుటే గాక వానికి ననుబంధముగఁ బెక్కు మఠములు నగ్రహారములును విలసిల్లెను. మఱియు సరస్సులు కోనేళ్ళు గల చిత్ర విచిత్రము లయిన యుద్యాన వనముల సొంపునఁ బెంపు మీఱి చూపఱ డెందముల నువ్వెత్తుగ నాకర్షింపఁ గలిగినదై యానగరము భాసిల్లెను. కలశభూపతి పాలన మీరీతి నడచుచు నుండెను.

ఇట్టికఱి రాజకుమారుఁడు హర్షుఁడు భాసమాన ప్రభావ పౌరుష యుతుఁడై యానాటి పుడమి ఱేండ్ల కేరికిని దుర్లభములగు సుగుణముల పరంపరతో నిండి నిర్మల మూర్తియై తనరారుచుండెను. అతఁ డేక సంధాగ్రహి, యగుటచే నశేష దేశ భాషలయందుఁ బ్రవీణుఁ డగుటయే గాక యన్ని భాషల యందు సత్కవియై సకల విద్యలకు నిధియై స్వదేశమునందే గాక విదేశములందును బేరు మ్రోగిన వాఁడై సాటిలేని కీర్తి జ్యోత్స్నను నిండించెను. తండ్రి యగు కలశభూపతి ధన లుబ్ధుఁడై నానాదిశల నుండి వచ్చిన గుణ గరిష్ఠు లగు నుత్తమ పురుషులను బోషింపక పరిత్యజించు టెఱిఁగి హర్షుఁ డట్టి వారి నందఱ నాదరముతోఁ జేరఁదీసి వారివారికిఁ దగిన వేతనముల నొసఁగి తనకడ నిల్పుకొనెను

## కలశమహీపతి, హర్షుల చరిత్ర

యువరాజగు నీహర్షుఁడు తనకై ప్రత్యేకముగా నియమింపఁబడిన వేతనము దాన ధర్మాది సత్క్రియలకు మిక్కుటముగ నుపయోగించుచు నుండుటవలన నయ్యది తనకుఁ జాలక పోవుటచే రెండు దినముల కొకసారి తాను భోజనాదిక మొనర్చుచుఁ గాలము గడపుచుండెను, అంతమాత్రమే గాదు. తాను గళావేత్త గావున రాజసభయందు గాన మొనర్చుచు నందుకు మెచ్చుకొని తండ్రి తనకు బారి తోషికముగ నిచ్చిన ద్రవ్యాదికమును దనయాశ్రితులకు నొసఁగుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు రాజసభయందు సభ్యులు నిండియుండిరి. హర్షుఁడు తనగాన కలా కౌశలమును నద్భుతముగఁ జూపుచుండెను. సభ్యులెల్లరు పరమానందము నొందుచుఁ జిత్తరువులవలెఁ జలింపక యుండిరి. కలశభూపతి శౌచార్థము సభను వీడిపోయెను. ఱేఁడట్లు సభ నప్పుడు విడిచి పోవుట గానకలా ప్రసంగ భంగహేతువుగ హర్షునకుఁ దోఁచెను. సూక్ష్మబుద్ధి యగు నారాచ కొమరుఁడు మిగుల క్షోభపడుచుఁ గోపవైకల్యములతోఁ దల వంచుకొని పుడమి తలమును జూచుచుఁ గొంత తడ వట్లే యుండెను.

లోకమునఁ బ్రభువు క్షమ లేనివాఁడయినను, స్నేహితుఁడు గుత్సితుఁడైనను, భార్య పరుషభాషిణి యైనను, కుమారుఁడు గురువఁవుబోతైనను, పరిజనము వినయము లేక బదులు పల్కి నను, మఱియుఁ బరివారము హృదయ వేదనాకర మైనను నెట్లో యోర్వవచ్చును. కాని, శ్రోతగా నున్నవాఁడు తనమాటలయందును బాటలయందును దిరస్కార బుద్ధితోఁ దనకనుఁగొనలఁ ద్రిప్పుచుఁ గనుపఱచు ననాదర మెంతమాత్రము మానవంతునకు సహింపరానిదై యుండును.

మ॥ క్షమ లేనట్టి విభున్, శఠుం డగు సఖున్,
గయ్యాళి యౌ స్త్రీని, దు
ర్దమ గర్వున్ దనయున్, బ్రగల్భముగ మా
ర్మాటాడు భృత్యున్, సతం
బు మనం బేర్చెడు నట్టి దౌ పరికరం
బున్ గూడ నోర్వం దగున్;
కుమతిన్ శ్రోతను సావహేళన చల
త్కోణాక్షుఁ గా దోర్వఁగా.

అంతటఁ గలశమహారాజునకు భృత్యుఁడు 'విశ్వావట్టుఁడు' అను విటుఁడు నవ్వుటాలకుఁ బల్కువాఁడువలె "నీతండ్రినిఁ జంపి రాజ్యము నేలుము. నీకెందు కీగొడవ" అని పల్కెను. ఆమాట విని హర్షుఁడు వానినిఁ జీవాట్లు పెట్టుచుండ నాసమీపముననే యున్న 'ధమ్మటుఁడు' అనువాఁడు గూడ నవ్వుచు "ఈవిశ్వావట్టు దేమియు నయుక్త మగు మాట పల్కలేదే"యని వంతు పల్కెను. కపట భావము గల ధూర్తులు సుఖార్థులై యీరీతి మున్ముందే తండ్రి ననుసరించుచు మెలఁగు కుమారులను మిగుల స్నేహవృత్తితో నాకర్షించుచు వేశ్యలు కాముకుల సఖులనువలెఁ దమవంకకు ద్రిప్పుకొందురు.

కొంతసేపునకుఁ గలశభూకాంతుఁడు సభను బ్రవేశించి హర్షునకు హర్షదాయకములగు బహుమతు లొసఁగెను. మాననీయులగు సభ్యులును సాధువాదములతో నతనిని సంతోష పఱచిరి.

హర్షుఁ డెప్పటి వలెనే మఱునాఁడును దండ్రితోఁగూడి భుజించి తన భవనమును జేరి యుండఁగా, నచ్చోటునకు 'విశ్వావట్టుఁ' డేతెంచి యేకాంతముగ ముందు పల్కినట్లే మరల హితోప దేశమును జేసెను. కాని, హర్షుఁడు వాని మాటల కేవగించుకొనుచు నట్లు పల్కుట సముంజసము గాదనుచు నీతి గఱపుచునున్నను బలవంతముగ నతఁ డట్లే యుడుగక చెనటి మాటలు చెప్పుచుండెను. యువరాజు హర్షుఁ డిఁక వాని యధిక ప్రసంగమును సహింపక చేతితో నతని మోదెను. ఆదెబ్బకు విశ్వావట్టునకు ముక్కునుండి నెత్తురు గారసాగెను. ఉన్నత వంశోద్భవుఁ డగు రాజకుమారుఁ డది గాంచి కనికరముతో భృత్యులచే వాని నెత్తుటినిఁ గడిగించి "అవునులే నీవు పలికిన పాపపుఁ బల్కులకు ఫలములే యిది" అని నవ్వుచుఁ బలికి వానికి మంచి వలువలు దెప్పించి యొసఁగెను.

అప్పుడు విశ్వావట్టుఁడు దుశ్శీలుఁడు గావున డెందమున "రాజకుమారుఁడు నాచేసిన యుప దేశము మంచిదిగనే యెంచి యున్నాఁడు. లేకున్నచో నిట్టి వస్త్రముల నాకొసఁగునా" అని భావించెను.

లోకమున దుశ్శీలుఁడు పరకాంత యేకారణముననో చిఱునగ వొనర్చి యుండిన నంత మాత్రముననే నామె తనపై స్పృహ గలిగి యున్నదని భ్రమించి చెడు నడతఁ జూపును గదా! ప్రకృత విషయముగూడ నట్లే యయ్యెను.

గీ॥ పరుని యిల్లాలు కారణాంతరమువలన
చిఱునగ వొనర్పఁ జూచి దుశ్శీలుఁ డామె
తనను బ్రేమించె న"ని చెడ్డతనముఁ జూపుఁ
బాపుల యెడంద లెప్పు డీపాటి వగును.

విశ్వావట్టుఁ డీరీతి మాటిమాటికిఁ దన చెడ్డబోధను మానక చాలకాలము వీలున్నపుడెల్ల రాజకుమారునికడఁ జేరి సాగించుచునే యుండెను. తనపాటకు వంత పాడుటకై 'ధమ్మటుని' దనకుఁ దోడుగ నుంచుకొనెను. ఈవిధముగఁ గొంత కాలమునకు హర్షుని డెందమున విశ్వావట్టుని దుర్బోధ మను పాప బీజ మంకురితావస్థ నొంది నాటుకొని పెద్ద చెట్టయినది. అంత నతఁ డాలోచించి తండ్రిని సంహరింపుటకై ఘటికవారి నంతటను నియోగించెను. కలశభూపతి గూఢఘాతుకులకుఁ గాల పర్యాయ

ములు గానవచ్చెను. కాని, యాహింసానియుక్తులకును హర్షునకును నేదో స్నేహ లేశము కలశభూపతిపై నుండుటంజేసి వా రతనిని హింసింపఁ జాలరైరి. మఱియు హర్షుఁ డట్టి హింసాకృత్యకథను మానినవాఁడును గాఁడయ్యెను.

ఇట్లు హింసా నియుక్తు లగు నాకటికవారికి జేనియెడ నా ప్రస్తావ ముండుట గనిపెట్టి విశ్వావట్టుఁడు "హింసకై యొనర్చిన తనపన్నుగడ బయల్పడి తనకేమి ముప్పు వచ్చునో." యని తాను దప్పించుకొనుటకై యీద్రోహ వార్తను దానే రాజునెదుర వెల్లడించెను. ఈసంగతి రాజకుమారుఁడు హర్షుఁడు దెలిసికొనెను. అందువలన నతఁడు జంకి యెప్పటివలెఁ దండ్రి భవనమునకు రాత్రి భోజనమునకై పోఁడయ్యెను. కలశభూపతి భోజనార్థము కుమారుని రావించుటకై పెక్కు సారులు దూతలను బంపెను. ఐనను నతఁడు రాఁడాయెను. అందువలన విశ్వావట్టుఁడు దెల్పిన విషయమున సంశయము మాని యది యట్టిదే యని నిర్ణయించుకొని డెందమునఁ జాలఁ గుందుచు నుండెను. ఆచింతతో నారేయి రాజునకుఁ గాని పరిజనమునకుఁ గాని యాహారమే లేక పోయెను.

మఱునాఁడు ధక్కనుఁడు సోదర సహితుఁడై రాజుకడకు వచ్చెను. కలశమహీపతి తనకు సంభవించిన మహావ్యసన కారణమును దెలిపి ధక్కనుని తొడపై శిరమును వాల్చి పెద్ద ప్రొద్దు పలువిధముల విలపించెను. మఱియు నాతఁడు మాటల వరుస సందర్భమునుబట్టి 'ధమ్మటుని' యుదంతమును దెల్పి యతనిని బంధించి తనయధీనము చేయవలయు నని కోరెను

అప్పుడు రాజుకడ నున్న తన్వంగ తనయులు 'ధక్కనుఁడును' అతని సోదరుఁడును, "అకటా! ఈసంగతి మాకేమియుఁ దెలియదే! ఇట్లు జరిగినదా!" అని యనుచు 'ధమ్మటుఁడు' తమ సోదరుఁ డగుటచే వాని నీవిధముగ తేనివళ మొనర్చుట కొల్లక కలశభూమీశునితో నిట్లనిరి. "ప్రభూ! మీయనుగ్రహ బలమువలన మేమిరువురమును నాపన్నులను రక్షించుటయందు దీక్షితులమై శరణఁ జొచ్చు వారికై నిశీథములందును ద్వారములు దెఱచియుంచి జాగరూకతతో మెలఁగుచుంటిమి. అట్టి మేము మాతమ్ముఁడు (ధమ్మటుఁడు) దోషియో నిర్దోషియో యెట్టి వాఁడైనను బ్రాణాపాయస్థితి నొందున ట్లొనర్ప నెట్లు సాహసింతుము? అతనిని మేము గాపాడుకొనుటవలన "స్వామి ద్రోహులు వీరు" అను నపవాదము మాకు సంభవించుట తథ్యము. స్వామి ద్రోహులు రాష్ట్రమున నుండఁదగదు. కావున మాకు దేశ త్యాగము సేయుట దక్క వేఱొండు శరణము లేదు." అనుచు నిట్టి మాటలే మఱి కొన్ని పల్కి వారిరువురు రాజు పాదములపైఁ బడి కొంత తడవు విలపించి "దేశమును వీడిపోవుటకు ననుజ్ఞ నొసఁగుము." అని బహువిధముల వేడికొనిరి. ఆనరనాథుఁడును నెట్టకేలకు వారికోర్కె ననుమతించెను.

అంత వారిరువురును దమసోదరుని ధమ్మటుని నిరపాయముగఁ దీసికొని పోవుటకై వానిని వారినడుమ నిడికొని తమతమ వాహనాదుల బలఁగముతోఁ బయనము సాగించి దేశమును వీడిపోయిరి.

రాజ బంధువు లగు తన్వంగ తనయులు మువ్వురును, నిట్లు దేశ త్యాగులై పోఁగా రాజమందిరము జన సమ్మర్దము లేనిదై యుండెను. అంతట నరనాథుఁడు తన కుమారుని హర్షుని రావించి ఈసమయంబున నిటు పలికెను

"కుమారా! ప్రపంచ సంసారమున విఖ్యాత కీర్తియై వెలసిన తండ్రి తనయుని జ్ఞాన సంపన్ను నొనర్చునని సకల జనము గుర్తించుచున్నది. కాని, నాసంగతి యట్లుగాదు. అత్రిసూనుఁడై వెలసిన కళానాథుఁడు విశాలములగు దీవులను దన నిర్మల జ్యోత్స్నచే నింపుచుఁ దండ్రికి పన్నె తెచ్చుచున్నట్లు సుపుత్రుఁడవగు నీవు సర్వలోకము మన్ననతో గుర్తించునట్లు సౌశీల్య సంపదతో నొప్పుచున్నాఁడవు. నీవు గుణవంతులలో నగ్రగణ్యుఁడవు. దిగంగనలకు నిస్తులము లగు యశోవసనముల నిండారఁ గల్పించితివి. ఇట్టి నీవు దుష్టుల మార్గము పట్టుటకు హేతు వెయ్యది? నీపితామహుని ధనకోశమును గాని, నాధనరాశినిఁగాని నీకిప్పుడే యొసఁగ కుండుటచే నీవేమైన నిట్లు భావభేదమును వహించితివేమో! అట్లైన నాయాశయము వినుము. తర్వాత నీవే తెలిసికొందువు.

"లోకమున రాజు ధనహీనుఁడై తనవారివలనను బరులవలనను బరాభవము నొందును." అను రాజనీతి శాస్త్రమును బాటించి కోశ రక్షణమున నేనప్రమత్తుఁడనై మెలఁగుచుంటినే గాని యితరము గాదు. ఇట్టి యుద్దేశముతోఁ బరప్రతిష్ఠ పరిపూర్ణముగ సాధించి రాజ్య భారము నీపై నిడి వారణాసికిఁ గాని నంది క్షేత్రమునకుఁ గాని బోయి శాంతి సుఖ మనుభవింపవలయునని యున్నాను. త్వరలోనే రాజ్య కోశముల కధికారివి నీవే కాఁబోవుచున్నావు. ఇట్టి నాయాశయము నెఱుఁగకయే యేల యనార్య్య మొనరించు కార్యమునకై యత్నించుచుంటివో తెలియకున్నాను. "తులువలు కొందఱు నిన్ను గుఱించి తెలిపిన సంగతి నీయెడ సంభావ్యముగాదని" నేను విశ్వసించుచున్నాను. వారి మాటలయందలి యాథార్థ్య మెంత మాత్రమో దెలిపి నింద్య మగు నాయపవాదమును దొలఁగింపుము." అనుచుఁ గలశమహీపతి యాంతర్యమును దెల్పి కుమారు నడిగెను. ఓర్పు నూనిన తండ్రి కొడుకునిపైఁ బ్రజలు పలుకు చెడు వార్తను నిప్పి పుచ్చ నెంచుట సాజమేగదా! కావుననే కలశ భూకాంతుఁడు కుమారునట్లు ప్రశ్నించెను.

అంతట హర్షుఁడు తండ్రి వాక్యములను సాధు వాదములతో గౌరవించుచుఁ "దత్త్వ మంతయు మీయాప్తుని మూలమున మీకుఁ దెల్పుదును." అని తండ్రితో నుడివి వెలుపలికిఁ బోయెను. తండ్రి పంపిన దూత యప్పుడే వెలుపలికి వచ్చి హర్షుని దగ్గఱ నిలిచెను. అప్పుడు హర్షుఁడు లజ్జితుఁడై "సామాన్య జన ప్రేరణమున నిట్లు జరిగెను." అని మాత్రము దూతతోఁ బలికి తనభవనము నకుఁ బోయెను. దూతయు వాడు వాఁడిన మోముతోఁ గలశ మహీపతి కడకుఁ బోఁగా వాని నతఁడు చూచి చేతులతోఁ దల మోదుకొనుచు హా! పుత్రా! యనుచుఁ బుత్రునిఁ బట్టి బంధింప ననుజ్ఞ నొసఁగెను. "కాని, యతని కెట్టి ప్రమాదముఁ బుట్టఁగూడదు. అతఁడు మీచే హతుఁ డయ్యెనా! నేను ఆత్మహత్య చేసికొందును. కావున జాగరూకతతో నతని బంధింపుఁడు." అని శస్త్రధారులతో నొక్కి చెప్పెను.

రాజాజ్ఞ ననుసరించి కలుకు గుండె గల వారైనను శస్త్రపాణులు పెక్కురు హర్షుని భవన ద్వారములను బంధించి యంతటను జుట్టుకొని చావునకుఁ దెగించినవారై రాజ కుమారుఁ డగు హర్షునితో నతిక్రూరముగ నిట్లు పల్కిరి.

ఓయీ ధూర్తుఁడా! నీసంగతి తెలిసినది. మమ్ము కపటముతో వంచించి లోకవిరుద్ధ మైన యాచెడ్డ పనికిఁ బూనుకొన్న నీవు మాత్రము గుట్టుగాఁ దప్పుకొని నటించుచు మాప్రాణములు బలి పెట్టింప

నెంచితివా? ఎంతటి దురాచారుఁడ వీవు? నీతండ్రిని నీవు కాపాడుచున్నావు. నీతండ్రి నిన్నుఁ గాపాడుచున్నాఁడు. మీయిరువుర నడుమ మేమేగదా నలిగి చావవలయును? మాతోడ యుద్ధ మొనర్పుము. అట్లు గానిచో నిన్ను పుట మార్చెదము. ఎట్లు చూచినను నన్నివిధములఁ నీకుఁ బ్రాణములు దక్కవు,"

ఇట్లు పరుషముగా వారు పల్కుచుండ నింతలోఁ గలశభూపతి యిడిన యాజ్ఞను 'దండకుఁడు' అనువాఁడు (హర్షునకు దగ్గఱ బంధువు) తెలిసికొని వెంటనే హర్షుని యంతికమును జేరెను. శస్త్రపాణులును నతఁడు హర్షుని సంబంధి యగుటచే లోనికిఁ బోవ నతని కనుమతి యొసంగిరి.

అంత నాదండకుఁడు హర్షుని చెంతఁ జేరి యందుఁ జుట్టు ముట్టియున్న శస్త్రధారులు విమోహితు లగునట్లు హర్షు నుద్దేశించి "ఓయీ క్షత్రియపుత్ర! యనేక కల్పముల కాలము జీవించియుఁ దుదకు నేదేని యొక సాకున జీవితమును దొఱఁగ వలయును. విధిని దప్పించు కొనుట సాధ్యమగునా? కావున మరణ మెవ్వరికేని దప్పునది కాదు. ఇప్పుడు నీ కింపు క్షత్రియ తేజమును వెలార్పనవను దొరకినది. ఏకారణమున నీవు శస్త్రమును ధరించితివో యటి కారణమును సఫలము సేయుటకుఁ దరుణ మిప్పుడు నీకుఁ బ్రాప్త మయినది. నీరాచఱికపు టభిమానమును ఫలవంత మొనర్పుము, నీవా! ఎల్ల విద్యలు కరతలామలకము చేసికొన్న విద్వాంసుఁడవు. నీయశము దిగంగనలకు నవ్యదుకూలమైనది. నీవు యువకుఁడవు. సుక్షత్రియుండవు. ఏల భంగన మొనర్ప నాలసింతువు? లెమ్ము. నీకు సహాయపడువారు కనిపెట్టుకొని యున్నారు. నేను నీకు ముందు నడచెదను. శిఖాకేశాదుల సమ్యగ్యోజనమునకై త్వరపడుము. వీరపట్టమును గట్టుము. అద్దాన శత్రువులు స్వర్గ విలాసినుల వరింపఁ బ్రేరింపుము." అని పల్కెను.

ఈవాక్యములను శస్త్ర పాణులు మెచ్చుకొనిరి, అయ్యవకాశమును గనిపెట్టి రాజపుత్రుని నొక నాపితునితో లోపలి గదిలోనికి క్షురక్రియ నెపముతోఁ బ్రవేశపెట్టి యందఱు చూచుచుండఁగనే యొక్క దుముకుతో లోపలఁ బ్రవేశించి ఖడ్గమును నేలపైఁ జి యొక్క చిటుకలో తలుపు వేసి గడియ బ్రాఁకులను దిట్టముగ బిగించి యక్కడ నుండు రాజస్థానీయునితో (కలశరాజు పక్షమున వచ్చిన వానితో) "ఓయీ! రాజ పుత్రుఁడు సురక్షితుఁ డయ్యెను. నీకుఁ దోఁచినదియుఁ దగినదియు నగు పని నీవు జరుపుకొనుము." అని సావహేళనముగఁ బల్కెను.

గ్రహములు భూతబలులు మున్నగు వానివలనఁ గలుగు పీడను దివ్యౌషధములచే వారించుకొన వచ్చును. శత్రువులవలనఁ గలుగు బాధను సైన్య విన్యాసములచే నివారింపవచ్చును. శరముల పోట్లచేఁ గలుగు ప్రమాదములను గవచ ధారణమునఁ దప్పుకొన వీలగును. వీని నన్నిటిని మించినది మేధావులగు వృద్ధుల బుద్ధిబలము. అయ్యది యెల్లయెడల నెల్లపుడును నెల్ల యిడుములను నిర్మూలించి కాపాడునుగదా! ప్రస్తుత మిట్లే జరిగినది.

మ॥ గ్రహ భూతాది భయంబు నోషధులు పోఁ
కార్చున్; రిపు వ్యూహ దు
స్సహ పీడల్ చతురంగ వర్ధిత మహా
సైన్యంబు పోఁగొట్టుఁ, బ్రా

ఆ హరంబున్ శర జాలమున్ గవచ వి
న్యాసంబు వారించు; ని
మ్మహి ప్రజ్ఞా నిధి వృద్ధుఁ డెల్లెడ హరిం
పన్ జాలు సర్వాపదల్.

అంతట నారాజ కుమారుని సౌధము చుట్టును మూగిన జోదు లెల్లరు పెద్ద పెట్టున నఱచుచుఁ గోటలను ప్రాకారమును నెక్కుచు హర్మ్యము లోనికిఁ జొచ్చుకొన యత్నించిరి. కాని ద్వార బంధము మిగుల దృఢమైన దగుటచే వారి కవకాశము దొరకలేదు. అంతట నచ్చట నుభయ పక్షములను సంకులముగఁ బోరాడ సాగెను. కసాయివారు రాజకుమారుని విడిచి తత్పక్షము వారితోఁ బోరుచుఁ జావు దప్పించుకొనఁ గోరి బయలు వెడల మొదలిడిరి.

ఇట్టి సందర్భమున ద్రోహచింత లేని యభిమానులు వీరులు నగు మధ్యవర్తు లిరువురు ముప్పు రాసంకుల సమరమునుండి తప్పుకొని 'సూర్యమతీ గౌరీశభవనమునుండి సదాశివుని యాల యాంతికమునకు వచ్చిరి. మార్గ మధ్యమునఁ దమ్మరికట్టి పోరిన వారినిఁ దెగటార్చిరి. కలశభూపతి తాను పంపిన యోధులతో ''రాజబంధువుల కెవ్వరికినిఁ ప్రమాదము సంభవింపకుండఁ గార్యమును జక్కఁబెట్టుఁడు.'' అని యాజ్ఞాపించి యుండెను. కాని, యాతీవ్రమైన సంకుల సమరమున 'సహజుఁడు' అను రాజ జ్ఞాతియు 'తిన్యుఁడు' అను పేరు గల వాఁడు, పండితుఁడు బ్రాహ్మణ వీరుఁడును నగు 'రామదేవుఁడు' అనువాఁడును, కర్ణాట సంబంధి యగు 'కేశి' యను పోటరియు, నసువులఁ గోల్పోయిరి.

మఱియు నిట్టి దుస్సంఘటనమునందుఁ గొందఱు తమ చేత నున్న యస్త్రములను బాఱవైచిరి. కొందఱు తమవారినిఁ దమ్ము ను బాకులతోఁ బొడిచికొని నేలఁ గూలిరి. ఇట్టి కాపురుషోచితము లైన కార్యము లొనర్చి కొందఱు చెఱసాల పాలయిరి. ఈఘోర సంఘటన మిట్లు పరిణమించినది.

ఈవిధముగఁ దంద్రికొమరుజ ధూర్తు లగు విటుల మాయా వాగురలోఁ జిక్కి 4164 లౌకిక సంవత్సరమున (క్రీ.శ 1088_89 ఏ.డి) పౌష శుద్ధ షష్ఠియందు ఘోర మైన విప్లవ సమర మును సాగించిరి.

లోకమునందు హతములోఁ గూడిన త్యాగబుద్ధి, నవయువతుల ప్రేమ పూరితము లగు ప్రేరణ వాక్యములు, ఖలులతోడి స్నేహము, మున్ను దాఁ గనుపఱచుచుండిన ప్రేమ వితనాదులు, అమాత్యునితోడను సోదరునితోడను పూరుదల్లితోడను గలహించుటయు, అనునవి కూడవు. అట్టివి యెల్లను దంత్రియెడఁ గుమారునకు విపరీత బుద్ధినిఁ బుట్టించునవి యగును.

మ॥ ''విపరీతం బగు త్యాగమందు హతమున్
ప్రేమాస్పద ప్రేయసీ
చపల ప్రేరణ వాక్కుఁ దొంటి పితృ వా
త్సల్యంబు గోల్పోకయున్,

నిపుణామాత్యునితోడ సోదరునితో
నిత్యంబు మార్దల్లితోఁ
గృపణంపున్ దగవున్ గుమారు పితృ భ
క్తిన్ రూపు మాపున్ వెసన్."

ఈవిధముగ సద్బుద్ధి యగు హర్షుఁడు దుష్టబుద్ధులతోఁ గూడి నందునఁ దుదకు లాఘవము పాలై కారాగారమునఁ జేరవలసిన వాఁడయ్యెను. తండ్రి కొమరుల పోరాటమును మాన్పుటకై మాధ్య స్థ్యమును నెఱపి తుదకీరీతి విఫల మనోరథ యైన 'భువనమతి' యనురాణి మానవతియై తనకంఠమును గరవాలమునకు స్వయముగ సమర్పించి కడతేరి పోయెను.

కలశభూపతి జ్యేష్ఠపుత్రు నట్లు కారాబద్ధు నొనర్చినను బుత్ర ప్రేమ దొడ్డది గావున నతనికి రాజపుత్రునకుఁ దగినట్టి యాహారాది సౌకర్యములను గలిగించుచుఁ దగిన వారి నందుకు నియమించెను. అతఁ డిట్లు మెలఁగు చున్నను కామ పర తంత్రుఁడై తుచ్ఛుఁడై సిగ్గు లేక తనకోడం్రడతో శీలము చెడిన వాండ్రతోఁ గలసి మెలఁగ సాగెను. వారికోఁ బ్రముఖురాలు 'సుగల' అను పేరు గలది. కలశ మహీపతి మంత్రులలో మిగుల దుర్జాతుఁడు 'నోనకుఁడు' అనువాఁడు. విద్యానిధి యగు హర్షుఁడు యువ రాజై బాగుగ నున్నచోఁ దమ బింకములు ఆటలును దుడుచుకొని పోవును అని యతఁడు తలంచెను. మఱి కొందఱు తుంటరి మంత్రుల యాశయము నట్టిదై యుండెను. అట్టివారినిఁ జేరఁదీసి వారి కధీనుఁ డైన కలశుని మతి వైకల్య మిఁ కెట్లుండ వలయును? అయినను జన్మాంతర బంధమువలన హర్షు నిపై భూపతికిఁ బ్రేమ మాత్రము కుంటువడుట లేదు. హర్షునకు సర్వ విధముల శ్రేయస్సు గలుగఁ గోరువాఁడు ప్రయాగుఁ డనువాఁ డొకఁ డుండెను. అతఁడు పరీక్షించి పెట్టిన యాహారమే హర్షుఁడు గైకొనుచుండెను.

ఇట్లుండ నోనకుఁడు కలశభూపతికడఁ జేరి పలువిధముల దుర్బోధలు సేయుచు హర్షుని ప్రాణము లైనను గన్నులైనను దీయించుటకు నెంతో ప్రయత్నించెను. కలశభూపతికిఁ గల పుత్ర ప్రేమ యట్టి తుంటరి రాక్షస భావమునకుఁ జోటీయలేదు. ముందుఁ దెల్పిన కలశుని కోడలు తుక్క భూపతి మనుమరాలు నగు సుగలయు, నోనకుఁడును వంటవాండ్రలో నిర్వురతోఁ గలసి మాటాడి రహస్యముగ హర్షునికిఁ బంపు నాహార పానీయములలో విషమును గలిపి పంపునట్లు ప్రయత్నించిరి. అట్టి విషయము ప్రయాగుఁడు కడు జాగరూకతతోఁ గనుగొని రాజకుమారునికి హర్షునకుఁ దెల్పెను. తనకై తెచ్చిన యట్టి యోగిరమును దినక తినినట్లభినయించి యది శునకములకు వేయఁగాఁ గుక్కలు దానినిఁ దిని పంచత్వము నొందెను.

అప్పటినుండియు హర్షుఁడు రాజగృహమున నుండి పంపిన యాహారమును ముట్టక ప్రయా గుఁడు తనకు నేది తెచ్చి యిచ్చునో దానినే భుజించుచుఁ గాలము గడపుచుండెను. "గూఢ దండ ప్రయోగముఁ గావింపఁగోరి తండ్రియే యిట్టిపనిఁ గావించెన"ని హర్షుఁడు భావించుచు తన జీవితముపై విరాగుఁ డయ్యెను.

ఇట్లు ప్రమాద భరితమై కాలము గడుచుచున్నది. కలశభూపతి దుష్ట మంత్రుల ప్రేరణముచే విద్వన్మణి యగు జేష్ఠపుత్రు నిట్లు చెఱలోఁ బెట్టించినందుకు వగచుచు నతని కెట్టి ప్రమాదము జరుగకుండవలయు ననియే భావించుచుండెను. ఇది యిట్లుండ "వినాశకాలే విపరీతబుద్ధిః" అన్నట్లు కలశభూపతి చిత్తము మఱొక విధమున మఱింత కలుషిత మయ్యెను.

అతఁ డున్నటులుండి 'తామ్రస్వామి' యను పేరుతోఁ బ్రఖ్యాతి నొందిన సూర్యభగవానుని తామ్ర ప్రతిమ నూడఁబెఱికించెను. విహారములందలి యిత్తడి ప్రతిమల నపహరించెను. మఱియు నార్య ధర్మ దూరగుఁడై యనపత్యులైన వారి యాస్తినంతయుఁ గ్రూర బుద్ధితో నపహరింప మొదలు పెట్టెను. ఇఁక విచ్చలవిడిగా పగలు రేయనక యతిసంభోగ క్రీడా దుర్వ్యసనియై యాత్మ నాశమునకుఁ బ్రబల మగు పునాది వేసికొనెను.

ఈరీతి నతఁడు దుష్ప్రవర్తనముతోఁ దివురుచుఁ గుములుచు నేమియుఁ దోఁచక యాకస్మికముగ నీశ్వరాలయమందుఁ గుంభ ప్రతిష్ఠఁ గావింపఁ దలఁచి యందుకుఁ దగిన సంభారమును సేకరించి యాకార్యము జరుపఁబూనెను. అప్పుడు సంభవించిన విడ్డూర మగు వింత యేమనః అచ్చటి మహాకాలుని కుంభమునందుఁ గలశమహీపతి నాసా రంధ్రమునుండి రక్తధార దొరలసాగెను. అట్టి యనర్థము నరికట్ట నెన్నియో వైద్య క్రియలు సల్పినను నవి యన్నియు బూదిలోని హోమము లయ్యెను. అరోగము మఱింత తీవ్ర మైనది. ఆకారణమున నతఁడు మంచము పట్టెను. మరణ చిహ్నము లొకటి వెంట నొకటి దాపురించినవి. ఆరాజునకు హర్షుని సంగతి తలపోఁ దాండవించినది. వాని నెట్టులేని పట్టాభిషిక్తుఁ జేయవలయునని యతని మనసు కొట్టుకొనెను. కాని, తులువలు నోనకుఁడు మున్నగువారు సాగనిత్తురాః లాభము లేక పోయెను.

అంత నతఁ డాధూర్త మంత్రుల మాటలకు లోఁబడి 'లోహరాచలమునుండి' హర్షుని తమ్ముఁ డగు నుత్కర్షునిఁ బిలిపించి యతనికి రాజ్యపట్టము గట్టఁబూనెను. ఇట్టి సమయమున నతఁ డాసన్న మరణుఁడై యుండెను. ధనాదికముయొక్క సంవిభాగము పెద్దచిన్నలకుఁ దగిన ట్లేర్పఱచెను. కాని, యీర్ష్యా విధేయుఁడై యతఁడు శుద్ధాంత వధూజనమునకు మాత్ర మట్టిది కావింపలేదు. మరల నతఁడు హర్షునిఁ దలంచుకొని "యతని ధన మిచ్చియైనను దేశమునుండి పంపివేసెదను. నాయాశయమును నెఱవేర్పుఁడు" అని మనస్సు నిబ్బకొనలేక మంత్రులతో దీనుఁడై ప్రస్తావించెను. దుష్టులగు మంత్రులు కలశమహీపతి మాటను గర్హములఁ జొరనీక యిదివరలో హర్షునిఁ జెఱయందుఁ గనిపెట్టి యున్న రక్షక భటులను దొలఁగించి లోహరమునందలి యుత్కర్షుని భటులను నియమించి యుత్కర్షుని రావించిరి.

హర్షుఁ డిదివరలో నాట్యశాలయం దుంపఁబడెను. అతఁ డచ్చట నాహారము సరిగా లేక ప్రయాగుఁడు తెచ్చి యిచ్చు నట్టిది యేదో జీవధారణమునకు భుజించుచు మిగులఁ గృశించి యుండెను. కాని, యతఁ డతనిఁ జూచి "యయ్యో పాపముః అను వారి కన్నులకు దూరము కాలేదు. ఇప్పుడు తులువ లగు నీమంత్రు లతని కెవ్వరితోడ సంబంధము లేకుండు నట్లతనిని జతుస్తంభ నిర్మిత మగు పెద్ద చెఱయం దుంచిరి.

తరువాతఁ గలశభూపతి తా నసువులఁ బాయఁ దరుణ మాసన్న మైనట్లు గమనించి "పుణ్య క్షేత్రమునఁ బ్రాణములు గోల్పోవుట మంచిద"ని యెంచి యిదివరలోఁ దాను 'తామ్రసామి' రాగి ప్రతిమను అపహరించి పాపము నొడిఁ గట్టుకొన్న సంగతినిఁ దలంచుచుఁ దనప్రాణముల నెట్లేని దక్కించుకొనుటకై యాతామ్రస్వామిని (సూర్యుని) శరణుఁ జొచ్చుటకై యాత్రపడెను. అతఁడట్టి భయోద్వేగముతో మోక్షప్రద మగు విజయక్షేత్రమును విడిచిపెట్టి తామ్రస్వామి యంతికమును జేరఁ బయన మయ్యెను.

ప్రజల కాదర్శప్రాయ మగు నట్లు తనయానతినిఁ జెల్లించుకొనఁదగిన కలశమహీపతి నీచ బుసు దులువలును నగు నుద్యోగుల చేతిలోని కీలుబొమ్మయై మతి భ్రంశము నొంది చెడ్డ చేష్ట లొన రించి కడకుఁ జన్నబిడ్డ చేష్టలతోఁ గుములుచు నిట్టి ప్రాణాపాయ స్థితి నొందవలసి వచ్చెను.

మ॥ ఘనుఁ డుద్యోగి జగంబు నెంచుఁ దృణమున్
గా స్వాధికారాంధుఁడై.
తన దాసీ ప్రజకేని మ్రొక్కు లిడు బా
ధం జెందుచో ఖిన్నుఁడై.
విను ధూర్తోక్తులు దెల్వి గల్గియును. శ
బ్దించున్ యహో మూర్ఖుఁడై.
తనువున్ బాయుచు బిడ్డవోలె వికృతుల్
తాఁ జూపఁ దేమే మికన్?

ఈవిధముగ హాస్యము పాలయిన భూపతి కింకేమిగతి? అతఁడు మార్గశీర్ష శుక్ల పక్షపుఁ దదియనాఁడు ప్రదోష కాలమున దాను బరుండి యున్న తల్పమునుండి యట్లే లేచి పల్లకియో బండియో యాశ్రయించి తాఁ దలఁచికొన్నట్లు 'తామ్రస్వామి' నికటమునకుఁ బోవఁ బయన మయ్యెను. ఆరాజు ననుసరించి యమాత్యులు పరిజనము, యంతిపురపు వెలఁదులు మున్నగువారు బయలు దేరిరి. వారం దఱు నదులకాల్వలయందు నోడలలోఁ బయనించిరి. ఒకప్రక్కఁ దూర్య ఘోషములు జరుగుచుండఁగ నొకవంక నేడ్పు పెడబొబ్బలు వినవచ్చుచుండెను.

ఈరీతిఁ బయనించి మఱునాఁడు పగటియందు మూఁడు గంటల ప్రొద్దుండు సమయము నందుఁ 'దామ్రస్వామి' యంతికముఁ జేరి యెట్లేని యాస్వామి యనుగ్రహమున బ్రతుకఁగోరిన వాఁడై యట్టి యాశతోడనే మార్తాండునికి (తామ్రస్వామికి) బంగరు ప్రతిమ నచ్చట సమర్పించెను. అట్టి సమయమున హర్షుఁడు తలంపునకు వచ్చెను. అంత నతఁడు తనజ్యేష్ఠపుత్రునిఁ గుఱించి బహు విధ ముల విలపించెను. కాని, ఆరాజు మాట వినువా రెవరు? అందువలనఁ గుందుచు నేమియుఁ దోఁచక వెంగతనముతో విస్తేజస్కుఁడై పలవించుచుండెను. ఇంతలో వెలుపల నున్న గాయకులు తనజ్యేష్ఠ పుత్రుఁడు సర్వ విద్యా విశారదుఁడు హర్షుఁడు మున్ను రచించి యుండిన గేయమును బాడుచుండఁగాఁ దెలుపఁబడి యున్న యయ్యాలయ మార్గమునఁ జెవి యొగ్గి వినుచు నిట్టూర్పు పుచ్చెను. అకటా! ఎంతటి దుస్థితి!

చం॥ సతతము నిర్నిరోధముగ
సాగు నృపాజ్ఞ తదీయ జీవిత
చ్యుతి యగు వేళఁ గుంటువడుఁ
జోద్యముగాఁ గలలోఁ బొసంగు సం
గతివలె; నద్ది తన్మరణ
కాలపు యాతన వేయి రెట్లుగా
వితత మొనర్చి మర్మ పరి
పీడన మెంతగఁ జేయునో గదా!

అత్తఱి నట్టి ప్రమాదస్థితి యందియుఁ దనజ్యేష్ఠపుత్రునియందలి కనికరముతో నారాజు మంత్రుల దురాలోచనముచే రాజుగాఁబోవు రెండవ కుమారుఁడగు నుత్కర్షునకు హితముఁ దెల్పి "పెద్దవానియెడఁ జూపఁదగు మర్యాదయు ధనాదివ్యవస్థయు మున్నగునవి చక్కఁబఱుపవలయు నని యెంతో ప్రయత్నించెను. కాని నోరు కదల్పలేక పోయెను. నాలుక యాడలేదు. ఏదో యుండియుండి 'హర్ష, హర్ష' అను మాట మాటిమాటికి నవ్యక్తముగా నోట వెడలుచుండెను. ఆరాజు "హర్షునిఁ దీసికొని రండు. హర్షుఁ డేడీ?" అను భావము వెల్లడించుటకై పలుకలేక యట్లు పలుకుచుండఁ దుంటరి యగు నోనకుఁ డతని భావమును గప్పి పుచ్చుటకై "రాజు ఆదర్శమును దెమ్మని యనుచున్నాఁ డ"న్నట్లు వెల్లడించుచు నొక యాదర్శమును దెచ్చి యిచ్చెను.

కలశభూపతి నోనకుని కపట నటనమును గినుకతో నివారించి పెదవి కొఱుకుచుఁ దల యూపుచు వికృతముగ నవ్వుచు, నేవో రెండు మూఁడు మాటలు లో[illegible]న గొణఁగికొనుచు నంతలో ననే వాగ్బంధము గలవాఁడై పలుకు లేక ప్రాణములు వోవు తరుణ మాసన్న మగుటచే మంత్రులను సంజ్ఞతోఁ జేరఁబిలిచెను. చెంగటఁ జేరిన యాసచివులకు నతఁడు తనను "మార్తాండస్వామి యెదుటికిఁ గొని పొండు" అని తిన్నఁగా సంజ్ఞ చేసెను. వారును నట్లొనర్చిరి.

కలశభూపాలుఁ డచ్చోట 4165 వ లౌకిక వత్సరమున (క్రీ. శ. 1089 ఎ. డి.) మార్గశీర్ష శుక్ల షష్ఠినాఁ డసువులఁ బాసెను. అతఁడు నలువది తొమ్మిది వత్సరములు రాజ్యమేలి శబలిత చిత్ర విపరీత చరిత్రుఁడై విపరీత భోగముల ననుభవించి కడకీరీతి భౌతిక దశను బాసెను. ఈ రాజు దేవేరులు 'మమ్మనిక' మొదలగు వారేడ్వురును. అవరోధకాంతయగు 'జయమతి' అను నామెయు సహగమన మొనర్చి తమపాతివ్రత్యమును నిరూపించిరి.

ఇఁక రాజున కత్యంత వల్లభయై యుండిన 'కయ్య' అనునవరోధకాంతను స్మరింపఁ గూడదు. అత్యంత నీచమైన నడతతో వినువారి వీనుల సూదులఁ బొడిచినట్లు దుష్ప్రవర్తనయై చిప్ప రథు నొక గ్రామోద్యోగిని మోహించి కాలము గడపినది. నీచకులోద్భవయగు నాపాపీయసి చేష్టలు దలఁపరాదు.

## ఉత్కర్షుఁడు

పిమ్మట దుర్మంత్రులు నోనకుఁడు మొదలగువా రొక ప్రక్క నుత్కర్షునకుఁ బట్టాభిషేక మొనర్పఁ బ్రబల సన్నాహముతోఁ ద్వరపడుచుండఁగా, కృతజ్ఞుఁ డగు వామనుఁడు (ముఖ్యమంత్రి) గతించిన రాజున కంత్యక్రియలు జరిపింపఁ బూనెను. ఈరీతి నొక వంకఁ బట్టాభిషేక మహోత్సవమునకు నేర్పడినట్టి బహువిధ తూర్యనాదములు పిక్కటిల్లుచుండఁగా నొక వైపున పెద్ద యాక్రందములతోఁ గూడిన ప్రేతతూర్య ఘోషము దిక్కుల నలముకొనెను. ఈలక్షణములతో రెండును జరిగి పోయినవి.

ఇట్టి సందర్భమునఁ గలశభూభుజునకు 'పద్మశ్రీ' దేవియందుఁ గలిగిన కొమరుఁడు 'విజయమల్లుఁడు' అనువాఁ డుత్కర్షుని యెడ వై మత్వమును బూనెను. క్రొత్త ప్రభువగు నుత్కర్షుఁడు "కలశభూపతి తన యన్నయగు హర్షునకు నేది దినవేతనముగా నిచ్చుచుండెనో యట్టిది తానును నిచ్చెదన"ని వెల్లడించెను. ముందుఁ దెల్పిన దుశ్శీలయగు 'కయ్య' యనునామెకు నొకకొమరుఁడు గలఁడు. వానిపేరు జయరాజు. వాని నూరడించుటకై యుత్కర్షుఁడు వానికిని వేతనము నొసంగునట్లు స్పష్టముగ నుడివెను. ఇందులకై మంత్రులను సామంతులను మాధ్యస్థ్యము వహించున ట్లేర్పాటు కావించెను.

కాలగతి చిత్రము - దైవవిలాసము విచిత్రము. లోకమున మానవుఁడు భౌతిక దేహమును బాసినప్పుడు భార్యయుఁ బుత్రులును మున్నగువా రేడ్చుచుందురు. అట్టి యేడ్పులోననే యతని పత్ని "నాగతి మఱి యెట్లు? నాకెట్టి యేర్పాటు జరుగును?" అని తలఁచుచుండును. కొడుకులు భూమి ధనము వగయిరాల పంపకము లెట్లున్నవి? ఏతీరునఁ బరిష్కరింపఁబడినవో యను మాటలు నడుమ నడుమ గుసగుసలతో సాగింతురు. ఇట్టి సంఘటనము లెన్నో తన కనుల యెదుటఁ గనుగొనుచునే మనుజుఁడు పుత్రదారాదులకై పెక్కు తీరుల నకార్యము లొనర్చి ధన సంచయము నార్జించుచుఁ బాపపుఁ బంటను దండిగాఁ బండించుకొనుచున్నాఁడు. ఇది యెంతటి యవివేక మూలమో వర్ణింప సాధ్యమా?

మ॥ పతికై యేడ్చుచునే వెలంది లటటన్
 భావించు వేతేదియో
గతి; పుత్రుల్ తలపోయుచుంద్రు తమ యో
 గక్షేమ వార్తల్ చితా
క్షితిలోనే: ఇటువంటి వెన్నిటికొ సా
 క్షీ భూతుఁడయ్యున్ సదా
సుత దారాదులకై కువృత్తుల గడిం
 చున్ మూఢుఁ డర్థౌఘమున్,

అటుపిమ్మటఁ గ్రొత్తగా రాజైన యుత్కర్షుఁడు రాజధానియందుఁ బ్రవేశించెను. కాని, హర్షుని యభ్యుదయమును గోరుచుండిన పౌరుల డెందములు మాత్రము నగరమునందుఁ జొరవయ్యెను. ప్రజాదరము వడయలేని యుత్కర్షునికి జరిపిన యారాజ్య లాభదినోత్సవము రోగార్తునికి జరిపిన షేతుకళంటి దయ్యెను. ఈసంగతి యిట్లుండెను.

ఇఁక, హర్షదేవుఁడు తనతండ్రి మార్తాండస్వామి చెంగట ప్రాణములు వీడవలయునని పోయిన సంగతి తెలిసికొనెను. అతఁడు చతుస్స్తంభ నిర్మితమై మనుష్య సంచారమునకు వెలియయిన పెద్దదగు క్రొత్త చెఱసాలయందుఁ జేర్పఁబడి యుండెనుగదా! పాపము! అతఁడట్టి తరుణమున నేమి చేయఁగలఁడు? ఆదినము పూర్తిగ నుపవాసముతోఁ గడపెను. అతఁడు బాటసారుల సంఘమునుండి దప్పిపోయిన యొకానొక దయనీయుఁ డగు తెఱువరివలెఁ గన్పట్టెను. దుఃఖోపహత చేతస్కుఁడై చెఱయందున్నట్టి యాహర్షుని 'ఠక్కురులు' ఎట్లో బ్రతిమాలి మఱునటి దినమున నాహారమును దిని పించిరి. ఆఠక్కురులు "ఒక్కఁడు రెండురాజ్యములను బరిపాలించుట కూడదు. ఈరాజ్యమునకు నిన్నె ట్లైన ప్రభువును గావింతుము. ఇది మానిర్ణయము." అని హర్షుని యెదుటఁ బ్రతిజ్ఞాపూర్వకముగ నుడివిరి.

హర్షుఁ డీరీతి వారితో మనసు గలిపినవాఁడై వారు వినిపించిన తండ్రి మరణవార్తను విని మిగుల దురపిల్లి కన్నీళ్ళతో నివాపాంజలుల నొసంగెను. ఇట్టితఱి తమ్ముఁడగు నుత్కర్షుఁడు పితృ క్రియలను నిర్వర్తించుటకై స్నానాదివిధులకు రమ్మని దూతల ముఖమునఁ దన ప్రార్థనము దెలుపు కొనెను.

హర్షుఁడు స్నానము చేయుచుండఁగా, నుత్కర్షుని రాజ్యాభిషిక్తునిఁ జేయుటకై యేర్పాటు చేసిన తూర్యఘోషమతనికి వినవచ్చెను. తాను స్నానము సేయు తఱి నట్టి మంగళతూర్య ఘోషము వినవచ్చుట తనకు రాజ్యప్రాప్తి సూచకమగు శుభ శకునముగా, నతఁడు గుర్తించెను. అతఁడు సకల శాస్త్రవేది కావున నట్లు గ్రహింపఁ గల్గెను. మెఱుపు వెంట నుఱుము మ్రోఁత తప్పనట్లు తనకా శుభ శకునముచే నచిరకాలముననే రాజ్యలాభముగలుగునన్న మర్మమా శాస్త్రవేత్తకు గోచరించెను, అంత మాత్రమెకాదు, అది మొదలు కొన్ని కొన్ని శుభశకునములు భృత్యులవలె నప్పుడపు డతనికిఁ దోఁచు చుండుటయు సంభవించెను. అందుచే రాజ్యప్రాప్తి త్వరలోనే గలుగునన్న తలంపు మఱింత దిట్ట పడినదయ్యెను.

ఉత్కర్షుఁడు భోజనము మానియున్న యన్నయగు హర్షుని భుజింపఁగోరుచుఁ దనయను చరులను వానికడకుఁ బంపెను. హర్షుఁడు వారితో "నన్నుఁ జెఱనుండి విడిపించినచో రాజునకుఁ బ్రతికూలవర్తినిగాక యతని యాశయము ననుసరించి మెలఁగుదును. నన్ను చెఱనుండి విడుదల సేయనిచో నిట్లే నిరాహార దీక్షతో నసువులఁ బాసెదను" అని ప్రతివచించి పంపెను. ఉత్కర్షుఁడా సంగతి విని మరలఁ దన యగ్రజుఁడు కోరినట్లే యతనిఁగారా విముక్తునిఁ దప్పక చేయుదునని ప్రమాణబద్ధముగ బూటకపుఁ బ్రతిజ్ఞ చేసి హర్షుఁడు భోజనము సేయు నట్లొనరించెను. అది మొదలు కొని యుత్కర్షుఁడు "ఇదిగో! రేపు: ఎల్లుండి. లో నిన్ను చెఱనుండి విముక్తునిఁ గావించెదను," అనుచుఁ గల్లమాటలతోఁ గాలయాపనము సేయుచుండెనేగాని, యట్టి కార్యము జరుపఁడయ్యెను.

ఇట్లు దినములు గడచుచునుండెను. హర్షునకు నుత్కర్షుని ప్రమాణ వచనమునందు సందియా ముదయించెను, ఆకారణమున నొకదినమునందు హర్షుఁడు తన యాంతరంగికుఁడుగా నున్న ప్రయా గునికిఁ దనకర్ణాభరణమును ఆనవాలుగా నిచ్చి యునదాళై యున్న [illegible] దనవంశీశుఁ

నీరీతి నంపెను. "విజయమల్లా! నీవు యువరాజవై యుండఁగా, నేను చెఱయం దీరీతి దురవస్థపాలై యుంటిని." అని హర్షుఁడు ప్రయాగునిద్వారా పంపిన సందేశమును విని విజయమల్లుఁడు మిగుల ఖేదపడెను. అతఁ డక్లే చాలతడ వాలోచించెను. పిమ్మటఁ బ్రయాగకునితో "రాచఱికపుఁ గూట నీతితో మెలఁగెడు రాజు నామాట వినునా? అయినను నాశక్తి కొలఁది బంధన విముక్తికై ప్రయత్నింతును. నీవు నీజీవిత రక్షణమునందు మిగుల జాగరూకత గలిగియుండుము." అని తన రహస్య సందేశమును దెల్పి ప్రయాగకునిఁ బంపెను. హర్షుని కారా విముక్తికై విజయమల్లుఁ డుపాయము నెమకుచుండెను.

ఇంక, ఉత్కర్షుఁడు గాశ్మీరపతి యయ్యెను గదా! అతఁడు దైవ వైపరీత్య మోహితుఁ డయ్యెనా! యనునట్లు అవశ్య కర్తవ్యము లగు రాచఱికపుఁ గార్యములం దించుకేని పాల్గొనకుండెను. మంత్రులగు కందర్పాదులకు నధికారము సమర్పించెనే గాని వారేమి చేయుచున్నారో యని గమనించువాఁడే గాక పోయెను. తానైనను స్వయముగఁ బరీక్షింపఁ డాయెను. అతనికి నిద్దుర లేచినది మొదలు కోశరాశినిఁ బలుమాఱు లెక్కించుకొనుట యొకటే దినకృత్య మయ్యెను. కార్యములు నిర్వహించుటకై ధనము వినియోగించు మాట యతనికిఁ గర్ణ కఠోర మయ్యెను. ప్రజానికర మతని పిసినారితనము క్రమముగ నెఱిఁగి యతఁడు "లుబ్ధాగ్రేసరచక్రవర్తి" అని గుర్తించెను. ఈలోభి తనవారికిఁ బలగమును మాత్రమె భుక్తికై యొసఁగుచుండెను. ఇతని లోభ గుణమును గలశభూపతి గతించినను స్వైరిణులై యున్న యతని యంతిపురపు టంగనలు లోకమున వెల్లడి యగునట్లు కావించిరి.

మఱియు నీక్రొత్త ప్రభువు వ్యావహారిక విషయపరిశీలనమున నేర్పు లేనివాఁడై శ్రోత్రియుని వలెఁ బ్రతివిషయమునను బిడియపడుచు నదురుకొనుచు నుండెను. అందువలన మహోదార స్వభావుల కడ నుండఁదగిన వైజ్ఞానికులకు నితనికడఁ గౌరవ లేక పోయెను.

ఇట్టి స్థితియందు యువరాజగు 'విజయమల్లుఁడు' ఉత్కర్షుని పిసినిగొట్టుఁ దనమునకుఁ గినిసి యతఁ డేర్పఱచిన పరిమిత వృత్తి కిష్టపడక తాను మధ్యస్థ సైన్యమును రక్షకముగఁ దీసికొని లవణోత్సమునకుఁబోయెను. అచట నారాత్రి గడపి యచ్చటనుండి యతఁడు ప్రయాణ మగుచుండఁగా, ఆమధ్యస్థ సైనికు లతని పక్షము నాశ్రయించిరి. ఆమధ్యస్థ సైనికులు విజయ మల్లునితో "ఆర్యా, నీవు హర్ష దేవునిఁ జెఱనుండి విడిపింపకయె యిట్లు పోయినచో నీవు సాధింపవలసినది యట్లే నిలిచిపోవును. రాష్ట్రము దైన్య దశకు మఱింత గుఱి యగును. కావున గర్తవ్యము నాలోచింపుము." అని పురికొల్పుచుఁ బల్కిరి.

అంతట రాజకుమారుఁ డగు విజయమల్లుఁడు తనజతనమును మానుకొని రాజధానికి సమ్ముఖుఁడై బయలుదేరెను. డామరులు కొంద ఱాతని తలం పెఱింగి తాము నతని కర్తవ్యమున సాయ పడఁ బూనుకొనిరి.

ఈ సందర్భమున గుఱ్ఱపు దళవాయి యగు 'మధురావట్టుఁడు' అనువాఁడు విజయమల్లుఁడు శ్రీనగరిని వీడి బయలుదేరునపుడు మధ్యస్థ సైనికులతోఁ గలసి తోడుగా వచ్చెను. అతని కుమారుఁడు

'నాగుఁడు' విజయమల్లుఁడు రాజగు నుత్కర్షు నెదిరింపఁ బూని ప్రస్థానము సేయఁబూనగా నట్లు సేయుట కియ్యకొనక యవ్వార్త యుత్కర్షుని కెఱిగింపఁ బద్మపుర మార్గమును బట్టి కొంతమంది యాశ్వికులఁ దీసికొనిపోయెను. కాని యతనికి మార్గమధ్యమునఁ గొన్ని యపశకునములు పొడకట్టినవి. అందువలన నతని కుత్సాహ ముడిగి పోవుటచే రాజధానిఁ జేరుటకుఁ గొంత యాలస్య మైనది.

ఈలోపల విజయమల్లుఁడు వేగిరమ రాజధానినిఁ జేరెను. దారి నడుమ నతనికిఁ బెక్కు సుశకునములు పొడకట్టెను. అందువలన నతఁడు ద్విగుణీకృతోత్సాహుఁడై పిట్టపిడుగువలె నగరముపైఁ బడి యగ్ని జ్వాలల నల్గడల రగుల్కొల్పెను.

రాజగు నుత్కర్షుఁడు పుర దాహమును విని సమర సన్నాహముతోడ బయలు దేరెను. అప్పుడు యువరాజగు జయరాజుగూడ నుత్కర్షుని విడిచి వచ్చి విజయమల్లుని పక్షమును జేరెను. విజయమల్లుఁడు జయరాజును రాజకుమారులు, యువరాజ పదవికిఁ దగినవారు. ఈ తరుణమున వీరి భావములు హర్షుని యాంతరంగిక మగు నార్జవము నందుకొన్నవి. సుప్రసిద్ధుఁ డగు మహాకవియొక్క యుదార భావములను నన్యకవు లనుసరించిన చందమున వీరి యనుసరణము శ్లాఘ్యతరమైనది యన వలెను.

అంతట విజయమల్లుఁడు "హర్షదేవునిఁ జెఱసాలనుండి విడిపించినయెడల మేము వెడలి పోయెదము." అని వినాదము సేయించుచుఁ దనసైనికులచే గుఱ్ఱములు, ఏనుఁగులు, మహిషములు మున్నగువాని శాలలను 'బరశురామప్రీతి' గావించుచుండెను.

ఇట్లుండఁ బౌర జనము తండోపతండములుగఁ జేరి "ఎడతెగని దాన ధారా ప్రవాహముల భూతధాత్రినిఁ బూరించు ఘనాఘన సన్నిభుఁ డగు హర్షదేవుఁ డీపుడమికి సార్వభౌముఁడు గావలయును. పగలంతయుఁ బైసలు లెక్కవెట్టుకొనుచుఁ బిసినారియై ప్రజల కష్టములఁ జూచి పాలింపని కటిక కోమటి యీ యుత్కర్షుఁడు. ఈతఁడు రాజుగ నెంతమాత్ర ముంతఁదగిన వాఁడు గాఁడు." అనిపలుమా ఱుచ్చైర్నినాదములతో హర్షు నుంచిన చెఱసాలకడఁ జేరి పూలదండలు గవాక్ష రంధ్రములనుండి హర్షునిపై వర్షించిరి.

ఇట్టి తరుణమున రాజగు నుత్కర్షుని సైన్యము దెబ్బతిని విచ్ఛిన్నమైనది. ఆసంగతి చెఱ యందున్న హర్షునకు దెలిసినది. అట్టితఱి నతని యౌదార్య మేమని చెప్పవలయును? తనవంక నభి మానులై యున్న తక్కురులను బిలిచి తాను చెఱయందుండియే వారితో "రాజు సైన్యము దెబ్బతిని చెదరినట్లు దెలిసినది. మనవారి సైన్యము పాఱిపోవు వారిపైఁ బడకుండునట్లు నామాటగాఁ దెల్పుఁడు. అని చెప్పి పంపి యట్లు కావించెను. ఇట్టిదిగదా వీరోచిత లక్షణము!

ఇంతటి యోర్పు వహించియున్న హర్షుఁడు తన విషయమున దుష్టమతు లగు శత్రువు లెప్పు డెట్టి పాప వికృయమును వహింతురో! యను ననుమానము నొందక పోలేదు. కావుననే యతఁడు వేపమానంగుఁడై తనవా రగు 'తక్కురులను నుద్దేశించి "నేనిప్పుడు మహాఘోరమగు

సంకటమునఁ బడియున్నాను. నాస్థితి యెప్పు డెట్లగునో! యూహింప వీలుగాదిది. నన్నీచెఱనుండి వెంటనే విడిపింపుఁడు." అని ముక్తకంఠుఁడై పల్కెను. హర్షదేవుని యీమాటలను తక్కురు లించుక యాలోచించుచుండఁగనే యాకారాగారపు బహిర్ద్వారమునందుఁ గాళ్ళ తన్నుల శబ్దము మాటిమాటికి వినవచ్చెను. అప్పుడు తనతో నున్న తక్కురుల నుద్దేశించి "నేననుకొనిన ట్లేదో మహాపద తటస్థించినది. మహాక్రూరులు హింసా కృత్యమును జరుపుటకై రాజాజ్ఞచే వచ్చి యిట్లు క్రౌర్యమును వెల్లడించుచున్నారు. ద్వారము దెఱవుఁడు. అయ్యెడునది కానిండు అని హర్షుఁడు బిగ్గఱగాఁ బలుమాఱు పలుకసాగెను. తక్కురులు భయ కంపితులై మిన్నకుండిరి. ఆవచ్చిన దుష్ట కింకరులు ద్వారమును బాదములతోఁ దన్నుచునే యుండిరి.

అంత హర్షుఁడు తెగించి తానే ద్వారమును దెఱచెను. హర్షదేవుని దుస్థితిఁ జూచిన నెంతటి కటిక వానికైనను గుండె నీరగున ట్లుండెను. అతని ప్రాణము లతని కన్నులలో మాత్రము మినమిన లాడుచున్నవి. అట్టి దీన స్థితిలో నున్న యాకవిరాజ వరేణ్యుఁడు తనను జంప వచ్చిన వారిని శస్త్రధారులను లోహర రాజ్యపు యోధులను బదునార్వురను బ్రత్యక్షము చేసికొనెను. వారిని రాజగు నుత్కర్షుఁడు పంపియుండెను. "హర్షుని శిరము ఛేదించి వెలుపలఁ బడవైచినచో బ్రజలు నిర్విణ్ణులై పోదురు. విజయమల్లాదులు నిర్వేదము నొందుచుఁ దమ విప్లవ చర్యను మానుకొని తమ దారి చూచుకొందురు. అని తొలుతనుండి యతిక్రూరుఁడై హర్షున కపకృతి సేయించుచుండిన 'నోణకుఁడు' అను మంత్రియుత్కర్షుని వెంబడించినట్లు పలుమాఱు పురికొల్పఁగా నుత్కర్షుఁ డిట్లు హర్షుని సంహారమునకై చెఱసాల లోనికి యోధుల నంపి యుండెను.

ఉత్కర్షుఁ డట్లాజ్ఞ నొసఁగి జోదులఁ బంపుచు మరల నొకింత తనలో నిట్లాలోచించెను. తొందరపడి వెంటనే హర్షుని తల దీయించు టంత మేలు గాదు. ఇతనినిఁ బ్రాణములతో నుంచిన నొకప్పుడుపకారి కావచ్చును.'' అని యిట్లు తలపోసి తనవద్ద నున్న రెండుంగరముల నాయోధులకుఁ జూపుచు "ఇదిగో! ఈ యుంగరమును మీకుఁ బంపినపుడు హర్షునితో నున్న 'తక్కురులను' విడిపించి యతని శిరమును ఛేదింపుఁడు. మఱియు నిదిగో! ఈ యుంగరమును బంపినపుడు హర్షదేవునిఁ జెఱనుండి విడిచి పెట్టుఁడు." అని యాలోహరభటుల కానతి యిచ్చి పంపి యుండెను.

ఆరీతిని వారు చెఱసాలలోనికిఁ బ్రవేశించి తక్కురులను వెలికి బంపివేసిరి. రాజాజ్ఞ ననుసరించి హర్షు నేమియుఁ జేయరైరి.

హర్షదేవుఁడు లోనికి వచ్చిన యాయోధుల నొక్కొకరిని వారి వారి నామములఁ బేర్కొనుచు వారికిఁ దాంబూలముల నొసఁగి తన యెదురుగఁ గూర్చుండునట్లు సాదరముగఁ బల్కెను. ఆసాధు హృదయుని చారు చర్యకుఁ గఱకు గుండెలు గల యాయోధులును దాము వచ్చిన పనిఁ దలంచి యతఁ డొసఁగు తాంబూలములను సిగ్గుపడుచుఁ గైకొని తమ చేతి ఖడ్గములను గ్రిందఁ బాఱవైచిరి. తమ మనసులనుండి హర్షునిఁ బ్రహరింపవలెనను భావమును దూరముగఁ దఱిమివేసిరి. మాటలనేర్పు మానవుని సర్వవిధముల రక్షించును.

మ॥ సిరిఁ బెంచున్, యశమున్ సృజించు, నఘమున్
భేదించి వేయున్; రిపూ
త్కరమున్ సైతము మిత్రబృందముగ వే
గావించు. సన్మార్గ త
త్పర తత్త్వ త్సుమనోనుకూల పద సం
దర్పంబుఁ జూపున్. ప్రియం
కర వాణీమయ కామధేను వొనఁగం
గా లేని దేదీ యిలన్''.

వాగ్విదాంవరుఁ డగు నారాజపుత్రుఁడు హర్షుఁడు తనయెదుర నట్టి తలంపుతోఁ గూర్చుండిన యాజోదులను గనుంగొని యేల మీరు సిగ్గుపడిన వారువోలె నున్నారు? రాజసేవకులు రాజాజ్ఞ నిర్వర్తించువారై యుందురు. వారెల్ల విధముల నిర్దోషులు. ఐనను మీరు మీకర్తవ్యమును నెఱవేర్చుట యందు వించుక తడవు విలంబించుట యుక్తమని తోఁచుచున్నది. లోకమునఁ గాల గతుల మార్పు లనుక్షణము గలుగుచునే యుండును. ఏదేని దృశ్యమగు మహాద్భుతము పుట్టునేమో! ఏమన్నచో

మ॥ పులు లేనుంగులు పన్నగంబులు హయం
బుల్ రక్కసుల్ మున్నుగాఁ
గల రూపంబుల భ్రాంతి గొల్పుచును మే
ఘంబుల్ నభోవీధి మా
ర్పుల నొందున్; నరు లట్లె వైకృతపు టూ
ర్పుల్ సౌమ్యతా క్రూర తా
దులు హృన్నీరధిలో క్షణ క్షణము నం
దున్ గాంత్రు చిత్రంబుగన్.

ఇట్లే యీలోకమున నుండు మనుజులు మాటిమాటికి మానసికపు సంకల్ప వికల్పముల మార్పుల నొందుచున్నారనుట యూహాతీత మగు విషయము గాదు. మనము నట్లే యిపు డుంటిమి. కావున మీరును నించుక తడవులో నెట్టి చిత్రమగు మార్పు గలుగునో చూడ నాసక్తి గలవారై యుండఁ గలరని విశ్వసించుచున్నాను. మఱియు రాజ్య ప్రాప్తి సమీపించు తఱి నిట్టి ప్రాణ సంశయావస్థలు జీవులకుఁ గలుగుచుండుటయు నవి పర్యవసానమున రసాంతర పరిణామము నొందుటయు లోక దృష్టము లగుచుండుట యొప్పుదగు విషయమేగదా! ఇటు గమనింపుఁడు.

మ॥ వెనువెంటన్ బెనువాన లేర్పడుటకై
వేసంగి వేంద్రంబుఁ జెం
దును. దోడ్తో నుదయ ప్రభల్ వెలయ రా
త్రుల్ నిండుఁ జీకట్లతో.
జనుఁ దీక్ష్ణ ప్రసభంబుగా విభవ వి
స్తారంబు నొక్కుమ్మడిన్,
గనుటన్ వెన్క విప త్పరంపరల క
గ్గంబై చెడున్ బూర్తిగా.

అని హర్షుఁడు వారి హృదయము నాకర్షింపుచుఁ బల్కెను. ఆరాజకుమారునకు నతని ప్రాణమే యిట్లు చార రూపమునఁ దగిన యత్నమునందు సహకరించెనా యన్నట్లు భావింపఁదగిన దైయచ్చటి సన్నివేశము గన్పట్టెను.

మఱియు నతఁడు వాగ్మియగుటచేఁ దనవలె శోచనీయావస్థలను అనుభవించి కడపటఁ జిర కీర్తిఁ గన్న హరిశ్చంద్రాదుల సాధువృత్తములను వారికి వినిపించి వారి డెందములు కథా రసానుభవ తన్మయతను గాంచునట్లొనర్చెను. గంభీర హృదయుఁ డగు నాహర్షుఁడు వారి నట్లు కథా రసాస్వాద పరవశ మనస్కులఁ గావించుచుఁ దన్ను గాపాడు కొనుచుండేనే గాని చెఱసాలకు వెలుపల నేమి జరుగు చున్నదియు నీసందర్భమున గమనింపక పోయెను.

ఇట్టి తరుణములో హర్షుని గుఱించిన రాజ్యశ్రీ వార్తలు, కాశీవార్తలు (యమపురి వార్తలు) అప్పుడప్పుడు నుప్పతిల్లుచు వెలుపలి భాగమున నూర్ల కొలఁది పర్యాయములు క్రొంగ్రొత్తలుగా సాగు చునే యుండెను. ఇందులకుఁ గారణము రాజగు సుత్కృష్టుఁడు పలుమాఱు తన యగ్రజుని హర్షునిఁ గారా విముక్తునిఁ గావింపుఁడని చెప్పుటయు, మఱియు వెంటనే యతనిని వధింపుఁ డని యానతిచ్చుటయునై యుండెను. అతఁ డీరీతి నానతి నొసఁగుచుండెనేగాని తాను మున్ను యోధులతోఁ జెప్పినట్లు గుర్తుగాఁ దగినట్టి యంగుళీయకము నిచ్చుటకు మఱచిపోయెను. ఆకారణమున వారును నతఁడు దూతల ద్వారా తెల్పిన యానతి నమలు జరుపరైరి.

అంత సుత్కృష్టుఁడు తనయోధులు దూతల ముఖమునఁ దెల్పిన హర్షవధ రూపమగు నాజ్ఞను నిర్వర్తింపకుండుటకుఁ గారణము నాలోచించి యెట్టకేలకుఁ దాను వారికి మున్నుఁ జెప్పినట్లు, అభిజ్ఞానము నంపకుండుట కారణముగా జ్ఞప్తికిఁ దెచ్చుకొని 'సత్త్వని' కొమరుఁడు 'శూరుఁడు' అనురాజపుత్రునిఁ దన యాజ్ఞ జరిపించుటకై నియోగించెను. అతనిఁ బంపునపుడు మతి భ్రంశముచే వధకొఱకుఁ జూపఁదగు నంగుళీయకమును గాక చెఱనుండి విడుదల సేయుటకుఁ జూపఁదగిన యభిజ్ఞానాంగుళీయకమును నొసఁగి యతని నంపెను. అతని కట్టి మతిభ్రంశము కలుగుటకు నతని ప్రతికూల దైవమే కారణ మనవలయును, "తా నొకటి దలఁచిన దైవ మొండు దలఁచె" నన్నట్లు, ఈ సంఘటన మేర్పడినది. ఈ సందర్భము పూర్వ గాథ నిట్లు స్మరింపఁ జేయుచున్నది.

మ॥ ధరణీశున్ మునుసూరి శీర్షమున్ దునుమ 'నృ
ద్ధక్షత్రుఁడన్' సింధు తీ
ర్థ రహిన్ బొందె వరంబు: దాన సతఁడే
ప్రమందెన్. విజాంచద్గదా
పర శక్త్యాహంతిగా శ్రుతాయుధుఁడు చి
వ్వన్ దానె సీల్గెన్. స్గటా!
మరదృష్టంబునఁ బ్రాణదం బగునదే
భ్రంగించుఁగా జీవముల్.

ఈ విధమున నుత్కర్ష భూపతి పనుపు నెఱవేర్చుటకై 'శూరుఁడు అను రాజపుత్రుఁడు వేగిరముగఁ గారాగారమునకు ఖడ్గహస్తుఁడై వచ్చెను. ఉత్కర్షునికి దైవ వైపరీత్యమునఁ గలిగిన మతి భ్రంశ మతని నాశనమునకే హేతువైనది. కారాగారమునం దుండిన యోధు లందఱు హర్షుని యద్భుత ప్రసంగముచే విస్మితులై యతని దాసులైరి. యుత్కర్షుని యాజ్ఞను ధిక్కరించిన వారైయుండిరి. రాజాజ్ఞను గైకొని వచ్చిన శూరుఁడు చెఱసాల ద్వారము కడకు వచ్చెను.

చెఱలోపలి యోధులు ఖడ్గపాణులై "హర్షుని వధించుట కీతఁడు వచ్చియుండె"నని తలంచి యతని సంహరించుటకై పిద్దపడి కవాట ద్వారమును దెఱచిరి. శూరుఁడు రాజాజ్ఞను నిర్వర్తించుటకు దాను దెచ్చిన యభిజ్ఞానమును జూపెను. అయ్యది హర్షుని విడుదలకై యుపయోగించు నంగుళీయక మగుట నెఱింగి వారలు మహానందముతో నృత్యము సేయుచు నాశూరునితోడనే హర్షదేవుని దగ్గఱ కేగి యతని యడుగుఁదమ్ములపైఁ దమ యుత్తమాంగముల వాల్చి కారనుండి వెలువడు మని ప్రార్థించిరి. ఇదియొక యద్భుత సంఘటనముగదా!

కాని, యారాజకుమారుఁడు హర్షుఁడు వెంటనే యట్టి విడుదల తనకు జరుగుటను నమ్మలేక సంకోచించుచు నించుక యాలసించెను. అట్టి తరుణమున నేమి చెప్పవలెను?

సంగర రంగమున నున్న విజయమల్లుఁడు వీరావేశముతో "హర్షదేవుని వధించిరి." అని భావించుచుఁ బట్టరాని పౌరుషముతో రాజధానిని బూడిదపాలు సేయఁ బూనెను. అతని యావేశము నాపుటకు నెవరికిఁ దరము గాక పోయెను. అప్పుడు రాజోద్యోగులు హర్షుఁడు జీవించి యున్నాఁడని పలుమాఱు వెల్లడించిరి. కాని యతనికి విశ్వాసము గలుగలేదు. అంత నతనికి "హర్షుఁడు సజీవుఁడై యున్నాఁడు." అను నమ్మకము గలుగుటకై హర్షుని దేవేరి యగు సుగలాదేవి తనపతి కర్ణకుండలము గైకొని విజయమల్లుని యెదుటఁ గాన్పించునట్లు ఆమెను బ్రతిమాలి తోడ్కొని వచ్చి యతనికి గాన్పించిరి.

రాజపుత్రుఁ డగు విజయమల్లుఁ డాయమ్మను జూచి రాజధానినిఁ బగులఁబెట్టు నుద్యమమును మానెను. రాజగు నుత్కర్షుఁడు "రాజధానికి సంభవించు ముప్పు హర్షునిఁ జెఱసాలనుండి విడుదల చేసినఁ గాని తప్ప"దని యెంచి తన ధూర్త మంత్రులను రావించి వారితో మంతన మొనర్చె-

వారలును వేఱు విధి లేక రాజాజ్ఞ ననుసరించి యట్లు సేయుట కొప్పుకొనిరి. ఆదుర్మంత్రులు "నోనక" "ప్రశస్తకలకాదులు." స్వయముగాఁ జెఱసాలకు వెంటనే పోయి హర్షుని సంకెలను దీయించి కారాగారమునుండి యతనిని విడుదల సేయించిరి.

హర్షదేవు నంత మోందించుటకై మొదటి నుండియుఁ బన్నుగడలఁ పన్నుచుండిన యా చెఱుగఱపు మంత్రులు నోనకాదులు. వారికిఁ గలిగిన దైవ దుర్విపాకమునుబట్టి హర్షునిఁ జెఱనుండి విడిపించు రాజు నాజ్ఞా వచనము శోక పూరిత మైన వారి వక్త్రబిలములనుండి రాలేక రాలేక వచ్చుచు లోనికిఁ బోవుచు నెట్టులో వెలికి వచ్చిన దాయెను. అయ్యది ప్రాణాపాయ సమయమున శ్వాసము బొందినుండి పైకి వెడలుచు లోనికిఁ బోవుచుఁ దుదకుఁ దటాలున వెలికి వచ్చు విధమున నుండె నని యుపమింపఁదగి యుండెను.

అంతట హర్షుఁడు చెఱసాలనుండి వెలువడఁగనే యమందానంద తుందిలము లగు డెంద ములతో నున్న యపార మగు పౌర ప్రజా నికరము పూల జల్లులతో నతని ముంచి వేసెను. వారికి విష్కళంక శర ద్రాకా సుధాకరుఁడు ప్రత్యక్ష మయినట్లు దోఁచెను. హర్షుఁ డొక యుత్తమాశ్వము నారోహించి తనవెంట నాతులవ సచివులు రాఁగా, రణభూమియం దుండిన రాజుకడకుఁ బోయెను. రాజగు నుత్కర్షుఁడు, అన్న యగు హర్షు నభినందించి "సోదరుఁ డగు విజయమల్లుని యుద్ధ యత్నము నుండి విరమింపఁజేసి రమ్ము. అప్పుడు మనకర్తవ్యావసరములను సమాలోచింతము." అని పల్కెను. అందుకు నతఁడు 'వల్లె' యని విజయమల్లుని కడకుఁ బోయెను. ఉత్కర్షుఁడును బంగారము వెండి మున్నగు విలువగల వస్తుజాతము నిండి యుండు ధనాగారమునకుఁ దనమంత్రులతో వెడలి పోయెను.

అంతట గొప్ప యాప త్సముద్రమును దరించి తనచెంగటకు వచ్చిన హర్ష దేవుని విజయ మల్లుఁడు చూచి యుప్పొంగుచున్న హర్షముతో నొక్క క్షణ కాలము దన్నుఁ దా మఱచి పోయి యట్లే నిలువఁబడెను. తఱువాత నతని పాదములకు వందన మాచరించెను. హర్షుఁడు విజయమల్లుని లేవనెత్తి గాఢాలింగనముఁ జేసికొనెను. ఉపకర్త యగు విజయమల్లునికి నుపకారము నొందిన హర్షునకును బహు విధము లయిన వృత్తాంతములను గుఱించి సల్లాపము జరిగెను.

ఇది యిట్లుండ విజయమల్లుని యాప్తుఁ డొకఁ డతని చెంతఁ జేరి తిన్నగా "నీవు మొదట నీహర్షునిఁ దుద ముట్టింపుము. తఱువాత నుత్కర్షుని రూపు మాపుము. రాజ్య మంతయు నిష్కంటక ముగ నీకరగత మగును. నీ కీ వృథా ప్రయాస మేలః" అని యేమేమో వదరెను. ద్రోహ బుద్ధి లేని విజయమల్లుని కావాక్యములు రుచింపలేదు. కావున నతఁడు వాని జల్పితమును బెడచెవిం బెట్టెను. హర్షుఁ డింగితజ్ఞుఁడు కావున నారహస్య జల్పితమును గుర్తించి యొక క్షణ కాలము చకితుఁడై రెండు డేగల నడుమఁ జిక్కి పోయిన యొక పిట్ట చందమునఁ దానున్నట్లు దలపోయుచుఁ దన్నుఁ గాపాడు కొనుటకై మిషతోఁ దా నెక్కి యున్న గుఱ్ఱము నటు నిటు గదలించుచుఁ గొంత తడవు గడపెను. పెక్కు సంకటములఁ జిక్కి ప్రాణ భీతి నొంది యుండు వారి కట్టి తలంపులు గలుగుట సాజమే గదా.

మ॥ ఘన వృష్టిన్ బెను కారుచిచ్చు ణగినన్
గంపించు వృక్షాళి పి
ద్దను భావించి. నరుండు నక్ర ముఖ ము
క్తుం డయ్యు వార్ధిం మునుం
గు నడల్ మానఁడు. భోగ్య మౌ శుభము సే
కూరంగ నాలోఁ దటు
క్కునఁ దద్భంగ భయంబు గొల్పి విధి గ
గ్గోలొందఁ జేయున్ నరున్.

ఇప్పటి హర్షుని స్థితి యిట్టిదే యయ్యెను. అందువలన నతఁడు దన్నుఁ గాపాడు కొనుటకై గుఱ్ఱపు స్వారి నెపముతో భ్రమించు చుండెను. హర్ష పక్ష పాతులు గొంద ఱాసన్న మెఱిఁగి యతనికి బాసటగా నతని చెంతకుఁ బోయిరి. నిజము పరిశీలించినచో విజయమల్లుని కట్టి తలంపు లేదుగదా!

హర్షుఁడు కొంత తడ వట్టి మిషతోఁ గడపి మరల విజయమల్లునిఁ జేరి కర్తవ్యమును గుఱించి సమాలోచనము నెఱపి విప్లవ సమాప్తి నిర్ణయించుకొని విజయమల్లుని వీడ్కొని యా సంగతి యుత్కర్ష మహారాజునకుఁ దెల్ప రాజభవనమున కేతెంచెను. భవన ప్రాంగణమును జేరి నపుడు విజయసింహుఁ డచ్చోట నుండి లోనికిఁ బోనీక యడ్డుపడి ప్రేమగర్భ మగు కోపముతో "ఏమయ్యా! చచ్చి బ్రతికితివి. మరల లోనికిఁ బోయి చావఁ గోరితివా? నీకింత వెఱ్ఱితనము పట్టినదే! వెంటనే పోయి రాజాసనమునందు నిశ్శంకముగఁ గూర్చుండుము." అని పల్కి సత్వరముగ నక్కడనున్న తన భృత్యులచేఁ గోశాగారమునుండి నృపాసనమును దెప్పించి యందుఁ గూర్చుండు మని యనెను.

అంత హర్షుఁడు మఱేమియు నాలోచింపక తోడనే యాసింహాసనమున నాసీనుఁ డయ్యెను. అంతట హర్షుని దేవేరి సుగలాదేవి యచ్చటికి రావింపఁబడినది. ఆయమ నెమ్మదియందలి దిట్టతనము ప్రశంసనీయము. ఎన్నియో కష్టముల కోర్చి పతి ప్రాణరక్షకై పాతివ్రత్య తప మాచరించినది. అట్టి తఱి ఆమె తనభర్త యంతికమునఁ గూర్చుండెను. ఆ సన్నివేశము సుగలాదేవి పట్టపు దేవేరి యగుటను బ్రస్ఫుట మొనర్చెను.

అట్టి తరుణమే వారి రాజ్య పట్టాభిషేక మహోత్సవ శుభ సమయ మయ్యెను. బహువిధ తూర్య ధ్వనులు వెనువెంటనే మిన్ను ముట్టినవి. సచివు లందఱు బిరబిర చేరిరి. హర్షుని రాజ్య పట్టముచే నలంకరించిరి. ప్రజల యానందమునకు మేర లేక పోయెను. నగరిలో నున్న యుత్కర్షుఁడు తల మోదుకొనుచుఁ బిలపించు చుండెను. దుడుకుఁదనము గల విజయసింహుఁడు పట్టాభిషేక సమయమున వాని గొడవ యెందు కని యాలోచించి యుత్కర్షుని బందీకృతునిఁ గావించి వేఱు గృహమునఁ బ్రవేశపెట్టి యచ్చటఁ దన పరివారమును గాపుదలగా నుంచి యాసంగతి క్రొత్త రాజునకుఁ దెల్పెను. హర్షుఁడు మహారాజై తన సింహాసనమునఁ గూర్చుండి యుండ నుత్కర్షుఁడు రాజ్యశ్రీ గోల్పోయి వానిఁ [illegible] దలవంచుకొని మిత పరివారముతో గృహాంతరముఁ బ్రవేశించెను. ఇట్టి సంఘటనము హృదయ విదారకము. సంపదలు సుస్థిరము లెట్లగును? చేసి కొన్నది యనుభవింపవలదా!

హర్షుఁడు చెఱసాలయం దున్నపు డతని పక్షము నాశ్రయించి చెఱయం దుండిన శక్కుఁడ లను విజయసింహుఁడు రావించి వారిని రాజసైన్యమున మొదట నిల్పి విజయమల్లుని వలని భీతిని వారించెను. అట్టి తరుణమున విజయమల్లుఁడు హర్షుని వద్దకుఁ బోవలయు నని తన సైన్యముతోడఁ బోవుచుఁ దనయగ్రజుఁడు హర్షుఁడు నృపాసన మలంకరించిన సంగతి విని తనసైన్యమును మాత్ర మాతని గౌరవమునకై పంపి తాను దన భవనమునకు వెళ్ళెను.

హర్షుఁడు తనకడకు విజయమల్లుని సైన్యము వచ్చి యుండుట గమనించి సంభవే విజయ మల్లునిఁ దనకడకు రావించుకొనెను. హర్షుఁడు నీతివేత్త కావున విజయమల్లునితో "నీవు నాకుఁ బ్రాణ దాతవు. రాజ్యదాతవునై యున్నావు" అని ప్రాంజలియై పల్కెను. అట్టి నీతిచతురమైన హర్షుని తియ్యని మాటచే విజయమల్లుఁడు తనపొందిన శ్రమకు సాఫల్యము నొంది తాను గృతార్థుఁడైనట్లు భావించెను.

గొప్ప చదువరి యగు హర్షుఁడు పెను గండమును గడచి దైవానుకూల్యమును బూర్తిగ నొంది యుండెను. అందుకుఁ దో డతని నీతి చతురిమ మఱింత మెఱుఁగు వెట్టినది. ప్రాణాపాయ స్థితి యం దుండిన యతఁడు రాజ సింహాసనము నొక్క క్షణములో నధిష్ఠించుట మహాశ్చర్యముగదా! అతఁడు కారా గృహమందు ధరించి యున్న మలిన వసనములతోడనే పట్టాభిషిక్తుఁడై రాజాసన మెక్కుట మఱియుఁ గ్రొత్త వింత. అయిన నేమి! అతఁడు రాజ్యశ్రీ సాన్నిధ్యమున నెంతో ప్రకాశించెను.

అంత సాయంకాల మైనది. అట్టి సాహస సంరంభముతోఁ బరిశ్రాంతుఁ డైన యా హర్షుఁడు మనోజ్ఞ మగు శయనాగారమును జేరి శయ్యపైఁ బరుండి తలపై నిడికొన్న మోయరాని బరువును గ్రింద వేసిన వాఁడు వోలె విశ్రాంతిఁ గొన యత్నించెను. కాని, యనుక్షణము నతఁ డంత టను బూర్వానుభూత మగు నాఘోరతర ఘాతుకత్వ చర్యలనే యవలోకించు చున్నవాఁడు వోలె భావించుచుండెను. ఆకతమున నతఁడు కన్నుల మూసికొని యెంత ప్రయత్నించినను నలిగి పోయిన కాంతనువలె నిద్రను బడయ లేక పోయెను.

ఇఁక నుత్కర్షుఁడు బందీకృతుఁ డైనను నొక ప్రత్యేక గృహమునఁ దనయంతిపురపుఁ బరిమిత పరివారముతో నుండెను. రాజుగారి రక్షక భటులు వానినిఁ గనిపెట్టి యుండిరి. అతని పూర్వ మంత్రులు నోనకాదు లతని కడకు వచ్చుచుఁ బోవుచుండిరి. ఇట్లు జరుగుచుండఁగా నుత్కర్షుఁడు నోన కాదులతో నిపుడేమి సేయవలయునో సమాలోచింపుఁడని పలికెను.

అంత నోనకుఁడను దుర్మంత్రి యుత్కర్షుని మాట నాక్షేపించుచు రూక్షముగ నిట్లు పల్కెను. "ఏమయ్యా! ఉదయముననేఁ దెల్పిన మాటను దుంగలోఁ ద్రొక్కి మిన్నకుండి యీగతి తెచ్చికొంటివి. హర్షుని బంధించి నీవు నీచ సేవకులకు నధీనునిగాఁ జేసితివి. ఇప్పు డింక నతఁడు నిన్నుఁ గుక్క మాంసము భుజించెడు క్రూరులకు నొప్పగింపఁగలఁడు. ఇప్పుడు నీకు మరణ మొక్కటి దక్క వేఱు దిక్కు లేదు. యుద్ధ రంగము దురదృష్టమునఁ దప్పి పోయినందున మాకును సంహారము సంభవింప దయ్యెను. ఇంతయు నెందుకులే! దుర్దశ ననుభవించు కాల మాసన్నమయి యుండు నీతరుణమున నిందాలాపములు మర్మ భేదకములుగా నుండును. అట్టివి శత్రువుల విషయమునను గూడదు. నీవు కొలఁది సంకటమును దీర్చుటకై రానున్న యుపాయమును గనిపెట్టక యేయుపాయము నవలంబించి తివో! అట్టి యుపాయమే యొక్క క్షణములో సర్వమును దలక్రిందుఁజేసి నాశ మొనర్చినది.

గీ॥ కష్ట మల్పంబె యైన నికృష్ట నీతి
పొలగుచుఁ బూర్తి చెడు నది. ప్రాఁత వలువ
చీఁకినది సూదితో నొక ఛిద్ర మట్టె
కుట్టఁ జిల్లులు శతముల కొలఁది పుట్టు.

అప్పటి గతి యీవిధ మైనది." అని యతఁడు తనచెప్పిన మాట వినలేదని తనలో ర శొక్కన్న యుక్కాసు నంతను నీరీతిఁ గ్లిష్ట సమయమున వెడలఁగ్రక్కెను.

ఉత్కర్షుఁ డిట్టి కఠోరము లగు మాటలు విని యాదుర్మంత్రులను విడిచిపెట్టి యత్యంతః పురములోనికిఁ దనయంతిపురవు టంగన 'సహజ' యను నామెతోడఁ బోయెను. పిమ్మట నతఁడు సంధ్యా సమాధి క్షణ కాల మనుష్ఠింపవలయునని పల్కి యవనికాంతరితుఁడై యేకాకియై యుండెను అట్లుండి యతఁ డపుడు శస్త్ర రహితుఁడుగా నుండినను గుడ్డలను గత్తిరించి పదను గల కత్తెరను గంతమునందుఁ జేర్చి ప్రాణాధారము లగు నట్టి కంఠగత నాడులను గత్తిరించెను. వాని దెంత బాధ గుండెయో! అతని కంఠ నాళములు తెగి నెత్తుటి ధారలు వరద లైనవి. అతని చేతినుండి కత్తెర ఝణాత్కారముతోఁ గ్రిందఁ బడెను. ఆశబ్దము విని 'సహజ' శంకించినదై యచ్చటఁ గనుగొనఁగా, తెర లోపలి నుండి రక్తము వెలికిఁ బ్రవహించుచుండెను. ఆతెరఁ దీసి యామె చూడఁగా వజ్ర హత మైన గిరి శృంగమునుండి ధాతు రసము ధారలునట్లు గళ నాడికలు తెగి వ్రేలుచున్న శిరమునుండి రుధిర ధారలు ప్రవహించుచుండెను. ఆమె గుండె నీరయ్యెను. కదలిక లేక బ్రొమ్మదై కొంత తడ వట్లే నిలిచి పోయెను. ఇంకేమున్నది! ఉత్కర్షుని జీవిత జ్యోతి యారి పోయినది.

అట్టి తరుణమున 'నాసహజ' గుణ శీలముల యౌచితి పతిదేవత లైన స్త్రీల కెల్లరకు శిరోధార్య మగునదిగా నుండెను. కులాచారము పతిప్రేమ యనునవి స్త్రీలకు వెలలేని సొమ్ములు. సహజ, జయ్య అనునా రిరువురును నుత్కర్షుని యంతఃపురాంగనలే గదా! వారి నడతలు యథాక్రమముగా వంద్యము, నింద్యము నయినవని యీసందర్భమునఁ జెప్పవలయును. లోకమున రెండు తరగతుల వారును నుందురు. ఎట్లన్నచోఁ బ్రకృతినిఁ దిలకింతము.

మ॥ రవి యస్తంగతుఁడైనఁ దత్పదముఁ జే
రంబోవు నా సంధ్య. రే
యి విధున్ క్షీణ నిశాకరున్ విడిచి తా
నే స్వేచ్ఛమై యుండు. ని
ట్లువిడల్ కాలవయో విపాకమునఁ దా
రుద్భావచప్రీతి నుం
ట విశేషజ్ఞుల కెందు నీమముగ వం
ద్యల్ నింద్యలుం గాతలన్.

ఈ సహజ మొదట దేవాలయమునందు నర్తకిగా నుండెను. ఈమెను జూచి కామించి యుత్కర్షుఁడు తన యవరోధ కాంతనుగా స్వీకరించెను. ఎవరైన నేమి? ఆమె యట్టి క్లిష్ట సమయమునఁ దన ప్రియుని యాక్రొన్నెత్తు రోద లంతయుఁ జక్కగా నలఁదికొని ప్రియునితోఁ జితిపై సహగమించి తనదు మేలిమి బంగరు ప్రేముడిని వెల్లడించుకొనెను. మఱియొక విశేష మేమన? ఈమె హర్షదేవుని ప్రేయసియై తొలుత నొకప్పు డుండినది. ఆకారణమున హర్షుఁ డామె సహగమనము సేయకుండు నట్లు యత్నించెను. కాని యామె తన మనో దార్ఢ్యమును విడువక యుత్కర్షుని మార్గము పట్టెను. లోహరమునం దున్న మఱి కొందఱు ఉత్కర్షుని యవరోధ కాంతలును బతి మార్గము ననుసరించిరి. ఉత్కర్షుఁడు కొంచెము తక్కువగ నిరువది నాల్గేండ్లు మాత్రము జీవించెను. ఇరువది రెండు దినములు మాత్రమే రాజుగా నుండెను. మరణించిన నాఁ డొక్క రాత్రి యంతయు శవరూపమున నుండి మఱునాఁడు చితాగ్ని పాలాయెను.

తఱువాత హర్షుఁడు శస్త్రధరు లగు తనయోధులను రావించి యుత్కర్షుని కడ మంత్రులై యుండి తనకు ముప్పు దెచ్చిన నోణకాదులను శస్త్రములను విసర్జించి రిక్త హస్తములతోఁ దనకడకు నమ్రులై రావలసిన ట్లాజ్ఞాపించెను. నోనకుఁడు దక్క మిగిలినవా రందఱును రాజాజ్ఞ శిరసా వహించిరి. నోనకుఁడు మాత్రము శస్త్రమును విడువక కొంత బింకముతోఁ జావ సిద్ధపడినవాఁడై యుండియు మరల నిట్లు తనలో నాలోచించుకొనెను. "మాకంటెఁ తెలివిగల మంత్రు లీరాజునకు నెవరు దొరకుదురు? కొన్ని దినముల గడచిన తఱువాత తేఁడు మంత్రులనుగా మమ్మే స్వీకరింపఁ గలఁడులే" అని యిట్లు తలపోసి ప్రాణ త్యాగము సేయ మానుకొని తానును నితర మంత్రులవలె తేని యానతిని శిరసావహించి కరవాలము ను విడిచి హర్షమహీపతి యెదుర నమ్రతతో నిలచెను. వారి కరవాలము లన్నియు రాజుకడఁ జేరినవి,

అప్పుడు హర్షభూజాని నోనక, పిల్హార, భట్టార, ప్రశస్త కలశాదులను జెఱసాలయందుఁ బ్రవేశపెట్టించెను. ఈరీతి నొకదినములో మహాద్భుతము వర్ణింపఁదరముగానిదియు నగు రాజ విపర్యయమును దైవమే హర్షుని రూపముదాల్చి కావించెనా! యన నాసంఘటనము ప్రజల భావనా ప్రపంచమునఁ బాదుకొనెను.

హర్షుఁడు మహావిద్వాంసుఁడు. మహాకవి యనేకములగు భాషలయందమును డెందమున నింపుకొన్నవాఁడు, రాజనీతిశాస్త్ర పారంగతుఁడును నై క్రొత్తగా రాజ్యపీఠము నధిష్ఠించి యున్నాఁడు. అతని తొలిపరిపాలనము గూర్చి విచిత్రమగు వైషమ్యమును వివిధములయిన తరగతులలో నున్న ప్రజలు వాకొనఁ జొచ్చిరి. ఆకాలమునఁ గాశ్మీరరాష్ట్రము ప్రజలకు నుత్సాహ క్షేత్రముగానుండియు, సర్వమైన యనుల్లాసమునకుఁ దావలమైనది. సమస్త సద్వ్యవస్థలకు జన్మభూమియయ్యు లేని పోని నీతులకు నిలువనీడయైనది. ఉద్రేకించిన శాసన స్ఫురణముతోఁ గూడినదిగా నుండియు సుద్రిక్తాజ్ఞల విరామముగలదై యుండెను. గొప్ప త్యాగము అధికమైన హరణమును గలిగియుండెను, కారుణ్యాతిరేకముచే మిగుల సుభగమై హింసాతిశయమును గుఱించిన భయముతోడను మిశితమై యుండెను. మఱియు సత్కర్మనిరంతరాభి వృద్ధితోఁ గూడియుఁ బాపపుఁ బొంగచటఁ బరవళ్ళు ద్రొక్కిన దయ్యెను.

నిండియుండుటఁ జూడ సర్వదేశ సంపదలును వచ్చి యీ సింహద్వారమున విడిసి విశ్రాంతి తీసికొను చుండినవా యనునట్లు భావింపఁ దగియుండెను. హర్షమహీపాలుని మందిరమున మంత్రులు ప్రతీహారులు మున్నగువారు బంగరుదండలు స్వర్ణమణిమయ కంకణములు గలవారై సంఖ్యాతీతులై సంచరించుచుండెడివారు.

ఈ తీరున సర్వాంగసుందరమై హర్షమహీపాలుని నవసామ్రాజ్య వైభవము ప్రకాశించినది. అతఁ డిట్టి వాఁడయ్యెను నుపకర్తయగు విజయమల్లుని మాటను గురు నానతిని వలె గౌరవించి నెఱవేర్చుచుండెను. కృతజ్ఞుఁడగు హర్షభూపతి విజయమల్లుని సలహా ననుసరించుచుండుటచే విజయమల్లుని కచ్చేరియు రెండవ రాజసభవలె భటాది పరివారముతో నిండి విరాజిల్లఁ దొడఁగెను.

మఱియొక విశేషముగలదు. హర్షుఁడు రాజ్యతంత్రజ్ఞుఁడు కావున రాష్ట్రమునందు వ్యతిరేక భావము లుత్పన్నములు గాకుండుటకై తన సేవకులకు ముఖ్యపదవు లొసఁగకుండఁ దండ్రియగు కలశమహీపతికడ నున్నతాధికారముల నొందియున్నవారినే స్వీకరించి యా యా స్థానముల నిల్పెను. అందు, కందర్పుని ద్వారాధిపతిగను, మదనుని సర్వసేనాధిపతిగను నియోగించెను. మఱియు విజయసింహుఁడు మున్నగు వారిని వారి వారి ఉచిత ములగు పదవులందు నియమించెను. ఇంత మాత్రమె కాదు. కొంత కాలము గడచిన తఱువాత. కారాబద్ధు లగు ప్రశస్తకలశాదులపై కోపము నడలించుకొని వారినిఁ గారావిముక్తులను గావించి తొల్లిటివలెనే వారి పదవులందు వారిని నిల్పెను. ఈపద్ధతి హర్షభూపతి యౌదార్యమునే గాక యతని రాజనీతి చతురతను సూక్ష్మ దృష్టిని వెల్లడించుచున్న దనవలెను.

ఈ సందర్భమున నోనకుఁడు, అనువాని విషయమై హర్షునకు భావ పరివర్తనము గలుగ లేదు. కారణము విస్పష్టమే. అతఁడు కొలుతనుండియు హర్షుని సంహారక్రియకే యత్నించిన వాఁడు. అందువలన హర్షమహీకాంతుఁడు వానిపైఁ గల యీసు నెడఁబాయలేక యతనిని నతని ధాత్రేయుఁ డగు సోదరునిఁ గొఱత వేయించి పొలియించెను. ఇట్లొనర్చియు నాతఁడు పెక్కు సంకట సమయము లందు మేధావి యగు నోనకుఁడు తనస్వామిభక్తినిఁ గనఁబఱచి యుండిన సంగతులను స్మరించుచుఁ గొంత పశ్చాత్తాపమును బొందిన వాఁడయ్యెను. అట్టి స్వామిభక్తి పరాయణుఁడు తన కపకర్తయై యుండినను జీవించి యున్నయెడల నెప్పుడేని యుపకారియై యుండఁగలఁడు గదా యని యారాజేంద్రు నికి గలిగిన పశ్చాత్తాపము నందలి రహస్యము.

గీ॥ యోగ్యుఁ డొకవేళ నపకార మొనరించియును
మరల నుపకార కారియై వరలుచుండు;
అగ్ని యింటినిఁ గాల్చియు నగునుగాదె
శాక పాకాన్నముల కేక సాధనంబు,

తఱువాత విశ్వావట్టుఁ డనువాఁడు హర్షుని దురవస్థలకు మూలమై యుండెనుగదా; రాజు వాని ముక్కు చెవులు గోయించి యతనిపత్నికి నాతని దుర్ముఖమును జూపించి యానీచునిఁగూడఁ గొఱత వేయించెను. ఇంకను గారాగార బద్ధులగు వారిని విడుదల సేయించి వెంటనే వారికిఁ దగిన స్థానముల

నొసఁగి వారి నందఱ లోఁగొనెను. వారును మధుమాసమునందు వికసించిన పువ్వులతో నిండిన వృక్షము నుదయముననే భూరంధ్రములనుండి పైకి లేచి యాక్రమించు భృంగములట్లు రాజనిర్దిష్టములగు వాయా స్థానముల నాశ్రయించి భక్తితో మెలఁగుచుండిరి.

మఱియు 'క్షేముని' మనుమఁడును 'వజ్రుని' యొక్క కొడుకుఁడును నగు 'సున్నుఁడు' తమ్ముఁడువలె హర్షమహీపతి ననుసరించి యుండెను. అట్టివానికిఁ బ్రధానామాత్య పదవి యొసఁగిన వాఁ డయ్యెను. సున్నుని తమ్ముని జయరాజును సర్వ ప్రతిహార సమాజమునకు నధిపతినిగా నియోగించెను. అతనిని హర్షుఁడు తన ప్రాణములకంటె నధికునిగా నెంచెను. ఆ హర్షమహీపతి యాత్రాది మహోత్సవ సమయములందుఁ బ్రజావాహిని దన్ను దర్శింపవచ్చినప్పు డడుగడుగునను నిల్చి యుండెడి సచివులలో నొక్కొక్కరు నొక్కొక మహారాజుగా నొప్పుచుండెడివారు.

హర్షభూపతి యొకప్పుడు గంగానదీ తీర్థ యాత్ర సాగింపఁగా ధమ్మటుఁ డా రాష్ట్రపతి ననుసరించెను. ఇతఁడు పూర్వము హర్షునకుఁ గొంత వఱకుఁ గృతాపరాధుఁడై యుండుట తెలిసిన విషయమే గదా! తన్వంగుని కుమారులలో నితఁ డొకఁడు. అతని నిమిత్తము నితని పోషించుటకై యితని సోదరు లిర్వురు కలశమహీపతి యనుమతితో ధమ్మటుని దీసికొని గంగాతీరమును జేరి యుండిరి. ఆ సోదరు లిర్వురు గంగా పరిసరమునఁ గాలగతి నొందిరి. ఇప్పుడు హర్షమహీపతి ధమ్మటుఁడు తన కడకుఁ దన సోదర పుత్రులతో రాఁగా, వానిని నతని సోదర పుత్రులను సాదరముగఁ జేరఁదీసి వారికి సమస్త సౌకర్యములు చక్కఁగ జరుగున ట్లేర్పాటు గావించెను. అపకారి తనాశ్రయించినపుడు నేర మెన్నక మేలు సేయునట్టి యౌదార్యము హర్షనరేంద్రుని గుణములలో నొకటి.

ఈరీతి హర్షనరేంద్రుఁడు, రాజ్య సంపదను బ్రజలకు రాజాధికారులకు భోగ్యముగా జక్కని పథకముతో సమీకరించి విజయమల్లుని రాజనిర్విశేష మర్యాదతోఁ జూచుచు తన రాజనీతి చతురతను న్యాయదృష్టిని లోకము గనుగొని ప్రశంసించుచుండ రాజ్యము నత్యంత సుందరముగ నేలుచుండెను.

“పంది బురద మెచ్చు; పన్నీరు మెచ్చునా?” అన్నట్లు దుష్టులు కొందఱు విజయమల్లుని కడఁ జేరి “నీవు శత్రువుల జయించి రాజ్యము సంపాదించితివి. అట్టి నీవు మహారాజవై రాజ్యమేలక యన్యుని రాజుగాఁ జేయు టెంత పిచ్చితనము? రాజ్యము పరభోగ్యము హర్షుని దెగటార్చి నీవే రాష్ట్రపతివి కమ్ము” అని చెవి గఱచిరి. ఆ దుర్బోధతో విజయమల్లుని మనస్సు తిరిగి పోయినది. అతనికి రాజ్య తృష్ణ పుట్టినది. ఇఁక నన్న యగు హర్షుని జంపు నుపాయ మెట్లు? అని యతని తలఁపులో భావములు పొర్లికలు వేసినవి.

అంతట విజయమల్లుఁడు హర్షమహీధవుని విజన మగు మందిరమునకుఁ దిన్నఁగఁ జేరఁదీసి సంహరింపవలయు నని యెంచెను. అందుల కనుగుణముగ నొక యాగమును జేయు నేర్పాటు కపటముతోఁ గావించి హర్షు నాహ్వానించెను. కాని, యతఁడు తలపెట్టిన ద్రోహ మెట్లో వేఱి చెవి కందినది.

అదియే యాతని భాగధేయ బలము. అందువలన నతఁడు తన సైన్యమును సమరమునకు సత్వర ముగ సమాయత్తపఱచెను. విజయమల్లుఁ డాసంగతి గనిపెట్టి వెంటనే యశ్వశాలయందలి గుఱ్ఱముల నపహరించి తనపైకి నురవడించి వచ్చు రాజసైన్యమును మేటి మగటిమితో డీకొని యతిఘోరముగ పోరు సాగించి నగరము వెలువడి పోవ యత్నించెను.

అట్టి తరుణమున విజయమల్లుని పరాక్రమము వర్ణనాతీతముగ నుండెను. అతఁ డొక యుత్తమాశ్వము నారోహించి యుండ నతని పత్నియు నతని వెనుకఁ గూర్చుండి యుండెను. అట్టి స్థితిలో నతఁడు శత్రుసేనా వ్యూహమును శరపరంపరతో ముంచి వేయుచుఁ దాను వారు ప్రయోగించు నంపజడినిఁ దన్నుఁ దాక నీకుండఁ బడఁగొట్టుచుఁ బోవుచుండెను. ఆసమరమున జడివాన వంటి బాణ పాతముచే భూమి నిమ్నోన్నత మయ్యెను భూరి భేరీ భాంకృతులు భూ నభో భాగంబుల నిండి పోయినవి.

అట్టితఱి విజయమల్లుని పరిమిత సైన్యము పటాపంచ లగుచుండెను. అందువలన విజయ మల్లుఁడు రణావనినుండి తప్పుకొనుచుఁ దనయశ్వమును సత్వరముగఁ బేరెము దీయించుచుండెను. కాని, రాజ సైన్యమునందలి చండక సుతులు విజయమల్లుని తొలిబాముల కర్మసంచయము విడిచి పోని చందమున వెన్నంటిరి.

అంతట విజయమల్లుఁడు వితస్తా సింధునదుల సంగమము చెంత గుఱ్ఱమునుండి జాయతోఁ గూడ దిగెను. అయినను నతఁ డతిసాహసముతోఁ బత్ని తనభుజములఁ బట్టికొని యుండ నామెతోఁ బ్రవాహమునందు దుమికి యీఁదుకొనుచు నావలదరి చేరఁగలిగెను. ఇదిగదా విచిత్రమగు సాహసచర్య! అతని గుఱ్ఱము సైత మట్లే ప్రవాహమునఁబడి యావలి యొడ్డు చేరినది. మానవేతర జాతియందు స్వామిభక్తి మిక్కుటముగ నుండునని తెలిసికొనుట కీదృశ్యము చాలును.

పిమ్మట విజయమల్లుఁడు జాయతోడ గుఱ్ఱము నెక్కి దరద్దేశమునకుఁ బెక్కు కొండ కనుమల నుండి తప్పించుకొని తనయెడ స్నేహమును జూపు దారదులచెంతఁ జేరెను. అచ్చట నతఁడు క్రమ ముగఁ బరివారమును హితులను జేర్చుకొని హర్షునిపై దండయాత్ర సాగింప సన్నాహము జరుపు చుండెను.

అంత హర్షభూపతి చకితుఁడై దారదుల సాహాయ్య మతనికి లేకుండఁ జేయుటకై యత్నించెను. కాని యాతని జతనములు ఫలవంతములు కావయ్యెను. విజయమల్లుఁడు హర్షభూజాని పన్నుగడలు వ్యర్థము లౌట యెఱిఁగి సంతోషించి శీతకాలము దరద్దేశమునఁ గడపి డామరులను గూడఁ గట్టుకొని చైత్రమాసమున దండయాత్ర సాగించెను. అతఁడు దారి నడుమ పెక్కు సంకట ములఁ గడచి యొక్కచో పటగృహములను వేయించి యందుండ, దైవ దుర్విపాకమున పెద్ద పెట్టున హిమ పాతము వాటిల్లెను. అందతఁడు విగతజీవుఁ డయ్యెను. దైవగతి వేఱు తీరున నున్నపుడు మానవుని యత్నములు ఫలవంతము లగునా? కాక పోవుటే గాదు. వైపరీత్యము సంభవించు ననుట యీ సందర్భము చాటుచున్నది

గీ॥ ధీరు లేయర్థములను సాధింపఁ గోరి
తీవ్రతర మైన సంరంభ దీక్ష నుండ్రు
దైవ మాకార్యములను నత్యల్ప మైన
కారణంబునఁ జెడగొట్టుఁ గద విధాన॥

ఉ॥ ఈయవనిన్ సుదూరముగ
హీన జడస్థితి నుండు తమ్ముఁలన్
వేయి కరంబు లూఁత విడి
వేడి వెలుంగు వికాస మొందఁగాఁ
జేయు. గజంబు వాని పసఁ
జెందును నేక కరంబుతోడ దు
ర్జ్ఞేయ విధి ప్రకోప పరి
చేష్టితముల్ పురికొల్పు చుండఁగన్.

తరువాత హర్షుఁడు రాష్ట్రమునందు విప్లవోపద్రవము జరుగు నేమో యను శంకచేఁ గొంతకాలము సంకోచము నొందుచు రాచఱికమును భీతితోడ సాగింపకుండెను. కాని, యట్టి దేదియు జరుగదని యతఁడు గుర్తించి తిరిగి రాజ్యశ్రీ ప్రభలు నల్గడలఁ దేజరిల్లునట్లు తనపాలన క్రమమును సాగించెను. ఆకాలమున నతఁడు భాస్వంతుఁడై విరాజిల్లుటయు నితర నరపతు లతని కడ దివటీ క్రింది దివ్వె లగుటయుఁ దటస్థించెను. అందువలన రాజ శబ్దమున కింకెందును స్థానము దొరకదయ్యెను. కాని, హర్షదేవుఁడు మాత్సర్య రహితుఁడు. అతఁడు తనరాష్ట్రమున సుశోభాదాయకము లగు పలు తెఱంగుల సద్గతులను బ్రవేశపెట్టి వసంతుఁ డుద్యానవనమును బల్లవ సుమ ఫలాదులచే శోభిల్లఁ జేయు కరణిఁ బ్రజల నానందమయ జీవనులఁ గావించెను.

మఱియొక సంగతి గలదు. పూర్వము కాశ్మీర మండలమునఁ బ్రజలు వెంట్రుకలు విరియఁ బోసికొని కవచాదులు లేక సొమ్ములు ధరింపక కళాహీనులై యుండెడివారు. అప్పటి రాజాజ్ఞ లట్టివి. రాజొక్కఁడే సకల విధము లైన యలంకార సుఖాదులకు భాజనమై యుండెను. వేయి మాట లేల? మదనుఁడు సేనాధ్యక్షుఁడుగదా! అతఁ డొకప్పుడు శిరోజములను జిక్కఁజేసికొనెను. అట్లే జయానందుఁడు ప్రధానామాత్యుఁడుగ నుండి చిత్ర వర్ణములు గల యరచొక్కా మాత్రమే ధరించెను. అంత మాత్రమునకు నట్టి వా రిరువురు నప్పటిరాజు కినుకకుఁ బాత్రు లైరి. ఇంక నితరుల విషయమును జెప్ప నేల?

హర్షభూజాని పూర్వపు విద్దూరపు నడతలను దుడిచి వైచి నాగరికతోచిత మగు వేషమును రాజ్యమునం దంతటను నిర్విశేషముగఁ బ్రవర్తింపఁజేసెను. తన మంత్రులలో స్ఫురద్రూపు లగు వారు పలు తెఱంగుల భూషణములచే భూషితులై యుండు నపుడు వారి రమణీయాకృతి విశేషమును మెచ్చుకొనుచు మత్సరము లేని వాఁడై తన పరిచారికలచే వారికి హారతి పట్టించెడువాఁడు. కలా విలాస

మర్మజ్ఞుఁ డగు నతఁడు దాక్షిణాత్యుల పద్ధతులఁ గొన్నిటి ననువర్తించెను. అందుఁ గర్ణాటాంధ్రగణ మయిన నాణెముల నిర్మాణమును దనదేశమునఁ బ్రవర్తింపఁజేయుటయు నొక ముఖ్యమైన విషయము.

హర్షుని కొలువుకూటమున నాకాలపుఁ బ్రజలు దట్టముగ మంచిగంధపుఁ బూఁతలు గలవారై యందమగు తాటియాకుల విసనకఱ్ఱల నటునిటు ద్రిప్పుకొనుచు సుదీర్ఘము లగు కరవాలములఁ గేలఁ గీలించి యుండుటయు నొక విచిత్ర మగు దృశ్యముగ నుండెను. ఇదియు దాక్షిణాత్య పద్ధతియే.

ఇంకను నొక విశేషము గలదు. ఆకాలమున విలాసినులు గొందఱు బంగరు మొగలి రేకులతోఁగూడి నిడుదలై యుండెడు తమ జడలయందుఁ బూలదండలు వ్రేలుచుండ, నొసటి తిలకముల నంటుచు నొక విధ మైన లలాటికలు నగలు మెఱయుచు నుండ, బంగరు చెఱఁగుల రంగు రంగుల కట్టు పుట్టములు భూమి తలమును దాకుచుండఁ గణ్ఠనాళ నుండి పిక్కలవరకుఁ దీరి యున్న కాటుక రేఖలతోడను సగము కైదండలఁ గప్పి చనుదోయి చందమును దృశ్యాదృశ్య మొనరించు కంచుక ములతోడను, గమ్మని కప్పురపుఁ బరాగమునకు సాటి యగు చిఱునగవుల విలాసముతోడను, వాలుంగనుగవను మెఱయించుచు నిటు నటు దిరుగుచుఁ జూపఱకు మిగులఁ జోద్యమును బుట్టించుచుండెడి వారు. వారి వేషములు పురుషాకృతిని సైతము దలపించుచు నుండుట వలనచే మన్మథుఁ డాతీరునఁ గపటవేషములు ధరించి యుండెనా యన వారు భాసిల్లుచు నుండిరి.

హర్షుని దాతృత్వము సాటిలేనిది. అతని నర్థించి ధనికులయిన యాచకులు సైతము సాగరమునకడ వారి పూరమును బడసిన మేఘుఁడు లోకమునకు జీవనీయము నొసఁగునట్లు తమ్మాశ్రయించిన వారికి వలయు నర్థముల నొసఁగుచుఁ దాము దాతలనఁ బరఁగిరి. ఇఁక వాగ్గేయ కారుఁ డగు నాతఁడు సంగీత శాస్త్ర నిపుణులను దన వదాన్యతా గుణముచేఁ బార్థివ సదృశులనుగా నొనర్చెను. హర్ష నరేంద్రుఁడు విద్వచ్చూడామణి కావున విద్వాంసులను దీనారములతోడను సత్కరించి వారికిఁ బల్లకీ గుఱ్ఱములు ఛత్రములు మున్నగు రాజోచిత పరికరముల నొసఁగి సంభావించు చుండెను.

ఈసందర్భమున మఱియొక విశేషము స్తుతి పాత్ర మగునది యున్నది. హర్షుని తండ్రి కలశభూపతి లుబ్ధుఁడై విద్వాంసులను గవీశ్వరులను సత్కరింపక పోయెను. అట్టి తరుణమున నెందఱో విద్యాధికులు కాశ్మీరమును విడిచిపెట్టి పోయి యితర రాజుల నాశ్రయించిరి. వారిలో సుప్రసిద్ధ మహాకవి బిల్హణుఁ డొకఁడు. ఆకవిచంద్రుని కర్ణాట పతి యగు 'పర్మాడి' అనునతఁడు తనయాస్థానమునఁ జేర్చుకొని యతనిని విద్యాపతినిగా నిల్పుకొనెను. అంతియె కాదు. ఆ 'పర్మాడి' భూపతి తన రాజధానియందు సేనాది పరివారముతో బయలుదేర నపుడు బిల్హణ కవీంద్రునిఁ దమకు ముందు నేనుఁగు నంబారీపై నునిచి మహారంజక మగు నొక ఛత్రము నాకవికి మాత్రమే పట్టించి తనతో ఛత్రపతినిగాఁ గొనిపోవుచు నత్యంత గౌరవమునఁ జూచుచుండెను. బిల్హణుఁడు హర్ష మహీకాంతుని వదాన్యతను, అతఁడు కవి పండిత బాంధవు డగుటను విని తాను గర్ణాటపతి వద్ద నొందుచున్న సత్కార మంత దొడ్డదిగా భావింపక పోయెను.

హర్షమహీధవుని రాజధానియందలి బంగరు మేడ లాకసమును ముద్దిడుకొనుచుఁ బ్రేక్షకుల మనస్సుల నన్యదృష్టి లేకుండఁ జేయఁగలిగి యుండెను. ఆ రాజేంద్రుఁడు నిర్మింపఁజేసిన యుద్యాన

వనమును నందనారామ మనవలెను. అందుఁ గల్పవృక్షము లేల లేవన్నచో నందుకుఁ గారణ మానరేంద్రుని త్యాగమహిమకు నవి సిగ్గుపడి యచ్చోట నిలువలేక పోవుటయే యని చెప్పవలయును. ఆప్రభువు పంపాసరస్సు నొక దాని నత్యంత మనోహరముగ నిర్మింపఁజేసెను. మిక్కిలి పొడవు మిగుల వెడల్పు గలిగి కమ్మని పానీయముతోడను గమల కల్హారాదుల నాశ్రయించి యొయారపు నడలతో మెలఁగు రాయంచలు మున్నగు జల విహంగమములతోడను దరులఁ మెలఁగు జింక వదుపు తోడను గన్నుల విందై యాకొలను గానవచ్చున దయ్యెను.

ఇఁక మఱియొక మాఱు మనము మనసునందు భావింపఁదగినది యతని విజ్ఞాన విశేషము. అతఁ డెన్ని విద్యలు నేర్చెనో వాని నామములను సైతము స్పష్టముగాఁ బేర్కొనుటకు వాచస్పతికినిఁ దరముగా దని యనవలసి యున్నది. వాగ్గేయకారుఁ డగు హర్షుఁడు రచించిన గేయము లీనాఁడును వీనుల విందగుచు వినఁబడుచునే యున్నవి. అయ్యవి యాలకించినచో శత్రువులకును నానంద బాష్పములు కనుఱెప్పలనుండి చిందుననుట యత్యుక్తి గాదు. ఆరాజు పగటిపూట రెండు జాములు నిద్రించును. మిగిలిన కాల మంతయు విద్యా వినోద విలాసియై గడపుచుండెడు వాఁడు. అమ్మహారాజు నాస్థాన మండపమున రాత్రులందు దీప సహస్రములు ప్రజ్వరిల్లుచుండఁగ నవి పగళ్ళుగా మాఱియుండెడివి. అం తతఁడు కొలువుదీరి విద్వద్గోష్ఠులతోడను నృత్త గీతాదులతోడను రేయి యంతయుఁ గడపుచుండెడివాఁడు. కథా సందర్భ విశేషముల సారస్యము నత్యంత కుతూహలముతో ననుభవించునపు డాయాస్థానము పవిత్ర స్థానమువలెఁ దోఁచెడిది. ఇఁకఁ గథాంతమునందుఁ బండు తమల పాకులను సేవించునపు డించుక యయ్యాకు మడుపుల సద్దు గల్గుచుండును. మఱియు నచ్చటి యంగనా మణుల దమ్మిల్లములందలి శేఫాలికా కుసుమములు (వల్లవావిలిపువ్వులు) రాలుచుండుటఁ వలనఁ గల్గు మర్మర ధ్వనియు నించుక తడవు వినవచ్చుచుండును.

హర్షుని యాస్థానిని గుఱించి పెక్కు వచింపనేల? అందుఁ గట్టి యుండెడి మేల్కట్లు రాదంటినీ కళలతో నొప్పారుచుండును. అచ్చట వేలకొలఁదిగ వెలుఁగుచుండు దివ్వెలు కోట గట్టినట్లు మెఱయుచుండును. భటులు కరములం గీలించిన బాకులు ధూమ స్తోమములవలెఁ గన్పట్టుచుండును అందుదార వేషములతో సభ నలంకరించి యుండు సచివ సముదాయము నక్షత్ర గణమువలె నయనానందమును గలుగఁజేయు చుండును. అచ్చటి గాయక బృందము గంధర్వుల చందమును దెల్పుచుండును. ఆయాస్థాని మహిమ వాకొన నలవి గాదు. అది ధర్మ దేవతకును త్యాగ లక్ష్మికిని విహారోద్యానము. ధనపతి ధర్మరాజులకు నది నిత్యావాసమై దానమునకును దండమునకు నిలయమై వెలసి యుండె నని శ్లాఘింపవలయును.

ఇట్టి మహావైభవముతో నింద్రుని కొలువు చందమును గ్రిందు సేయఁగల యాభూతలేంద్రుని యాస్థాని రాత్రులందు జరుగు పెక్కు తీరుల వేడుకలతోఁ గనుల పండువై వర్ణనాతీతమై యొప్పెను. ఆవైభవమును సంపూర్ణముగ వర్ణింప వాచస్పతియు నలంతి గాఁ డనవలయును.

ఆతరుణమున నారాష్ట్రమునందు బంగరు నాణెములు వెండి నాణెములును మాత్రమే విరివిగఁ బ్రచారమున నుండినవి. రాగి నాణెము లెక్కడనో యరుఁదుగ క్వాచిత్కముగ నుండెడివట.

ఇట్టి తరుణమున 'సున్నుఁడు' అనువాఁడు దండాధికారియై సర్వోన్నతి నొంది యుండియు ముష్టింపచుఁ డనఁదగినంత లోభియై నీచభావమును వెల్లడించుకొనెను. అతఁడు 'జయవనమునందును' 'సూర్యామల కమునందును' 'విజయేశ్వరమునందును' దాను వ్యవస్థాపించిన మఠముల సంగతి నేమియుఁ బట్టించుకొనక యూరక విడిచి పెట్టుటచే నవి పాడువడి పోయెను. అతని లుబ్ధత్వము వెల్లడించుట కీసంగతి యొకటి చాలును.

ఎవఁ డెట్లున్న నేమి? కల్ప పాదపము ఘనతను గడకు నెట్టిన హర్షమహీపతి తనరాష్ట్రమున నాకొన్నవారు వ్యాధిగ్రస్తులు ననాథు లనిపించుకొను వారును దీనులు మున్నగు వారెవ్వరును లేకుండునట్లు సుస్పష్టముగఁ దన రాజ్యలక్ష్మీ పట్టమును సార్వత్రికముగ వెలయించె ననుట సువ్యక్త మగు విషయమై యొప్పెను.

రాజ సచివులలో 'చంప్పకుఁడు' అను నతఁడు 'నందిక్షేత్రమునందు' ప్రతిసంవత్సరమునందును నేఁడు వారములు తా నార్జించిన సార్వకాలిక ధన సంచయమును వినియోగించి సత్కార్య సాఫల్యమును సముపార్జించినవాఁ డయ్యెను. హర్షుని రాజ్యసంపద యిట్టిదని యెవరు వర్ణింపఁగలరు? అతడు సద్బ్రాహ్మణ బృందమునకుఁ గృష్ణాజినములను లేఁగలతోఁగూడిన క్షీరధారలు వర్షించు గోవులను భూరి దక్షిణలతో సంఖ్యాతీతముగ దాన మొనర్చిన తత్త్వాన్వేషి. ప్రజల కష్టములను నిశ్శేషముగఁ దుడిచి వేసిన ధర్మవేది.

రాణి యగు వసంతలేఖ శాహి వంశమున జనించినది. ఈయమ శ్రీనగరి యందును బావనమైన త్రిపురేశ్వరమునందును మఠములను నెలకొల్పి యగ్రహారములఁ బెక్కింటి నొసంగి యుండెను.

హర్షమహీజాని రాజ్యశ్రీ యీవిధముగఁ జెన్నారెను. అది యొకానొక మాహేశ్వరీ జ్వాలవోలె శోభిల్లి యుండె ననవలయును. అట్టి భక్తి పారమ్యమహిమతో నతని తేజస్సు వెలిఁగినది. ప్రజలు విచ్చలవిడిగ నడచుకొను నవకాశ మతని కాలమున సంభవింపలేదనియే చెప్పవలయును. ఇట్లు కొంత కాలము జరిగినది.

తఱువాత హర్షమహీధవుని యాస్థానమునఁ గొంత కాలమునకుఁ గ్రొత్త మంత్రులు కొందఱు తిన్నగాఁ బ్రవేశము సంపాదించుకొని ప్రాబల్యమును బొందసాగిరి. వారి ప్రేరణము వలన హర్షునకుఁ దొల్లిటి యమాత్యులయందు బుద్ధి మోహము వాటిల్లెను. సర్వ భాషావేత్తయు మహావిద్వాంసుఁడును సకల కలా విదుఁడును నగు నీమహారాజు క్రొత్త మంత్రుల మాటలకుఁ జెవి యొగ్గి ప్రాఁతవారి యెడ మతిభేదము నొందుట విచిత్ర మగు విషయముగదా! అంతయు దైవ దుర్విపాకము.

సీ॥ కుష్ఠ రోగార్తిచేఁ గుంటెడు పాదాల
జంటతోడనె కేకి వెంటఁ బడుచుఁ
బర్వెత్తి బహు పాద బల జవ యుక్త మౌ
సర్పంబుఁ దెగటార్పఁ జాలి యుండు.
పాద సహస్ర సంపదతోడ భాసిల్లు
భాస్కరుం డాకాశ పథమునందుఁ
బ్రతిపదంబు ననూరు కృత సారథిత్వంపు
సాహాయ్య మది లేక సాగకుండు.

గీ॥ ఈరయ నీరీతి బల యుతు లల్ప బలుల
చేతఁ జిక్కుట శక్తులచేతఁ బూర్ణ
శక్తి యుతులు భ్రమించి యుత్సాహు లగు
సర్వ మిది దైవ కృత విలాసంబుగాదె.

వివిధ శాస్త్ర విజ్ఞానమున విలసిల్లి యుండిన యీపృథ్వీపతి దుర్నీతులగు సచివుల కుతంత్రములకు లొంగుట శోచనీయ మగు సంగతి. అట్టివాఁ డగుటంజేసి గతించిన తనతండ్రి కలశ భూపతితోడ నేర్పడిన పూర్వ వైరమును స్మరించి చనిపోయిన తండ్రిగదా! యని యనుకొనక యతనిపైఁ బగ దీర్చుకొనుటకై యాకలశుని నామముచే నంకితములై యుండిన మఠాదులను వానికై వినియోగింపఁ దగిన వస్తుసముదాయమును వాని పెంపునకయి యేర్పఱచిన కోశమును దోఁచుకొని యాధనమును "వీఁడని వాఁడని" యెంచక యిచ్చ వచ్చినట్లు త్యాగమొనర్చి తనతండ్రి కేవలము పిసినిగొట్టు వాఁ డను పేరు లోకమునందుఁ జాటించెను.

మఱియు సమ్మోహిత మతి యగు నితఁడు తనపవిత్రమైన యంతిపురమునందుఁ బావన చరిత్రలగు మూఁడు పందల యఱువది సంఖ్యలో నుండు నన్నుమిన్నలను జేర్చెను. వారిలో నొక డోంబ (చండాలజాతి) వారు దక్క నన్నికులముల వారును నుండిరి.

ఒకసంగతి యిట్లుండెను. ఇట్టి తరుణమున భువనరాజు కోట పదాతి సైన్యముతో లోహరమును స్వాధీనము చేసికొనుటకు మరలఁ బేరాసతోఁ బ్రయత్నించెను. ఆరీతి నతఁడు 'దర్పిత'పురమునకు వచ్చి మహాపరాక్రమ శాలి యగు కందర్పుఁడు పోరు సల్ప సిద్ధముగ నున్నాఁ డన్న సంగతి గూఢముగ నెఱిఁగి యంతులేకుండ వెనుకకుఁ దిరిగి పలాయన మంత్రమును బఠించుచు నదృశ్యుఁ డయ్యెను.

అట్టి సమయమునందే 'రాజపురి' యేలుచున్న 'సంగ్రామపాలుఁ'డును గర్వించినవాఁడై యేదో యొక కారణమున హర్షునియెడ వైమత్యము వెల్లడించుచు నుండెను. పరాక్రమ శాలి యగు కందర్పుఁడు కోటయందు నదివరకు చెదరి పోయి యుండిన బలఁగమును మరలఁ గూర్చు కొనుచుండెను.

హర్షభూపతి తనయెడ విరుద్ధ వర్తనముతో మెలఁగు చుండిన సంగ్రామపాలునిపై గినిసి 'రాజపురి' ముట్టడించుటకై దండనాయకున కాజ్ఞ యొసఁగెను. అతఁడు మహా చమూ నివహముతో 'లోహర' మార్గమును బట్టి పోవుచు ధైర్య హీనుఁడై కోట సరిహద్దు భాగమునందు నొకటిన్నర నెలల కాల మాలసించెను. ఇట్లుండ నాషాఢమాస తీవ్రతతోఁ బాటు శాత్రవుల పరాక్రమ తీక్ష్ణతయుఁ బెంపొందెను. అయ్యది కనుగొని యాదండనాథుఁడు మఱింత భీతి నొందుటచే నతని దండయాత్ర యందలి సంకల్ప మించుకయు రాణింపలేదు, ఇట్టి సందర్భమున రాజుగారి యాశయము కందర్పునకేమియుఁ దెలియనందున నతఁడు మిన్నకుండెను. అందువలన నతఁడు వృథాగా రాజోపాలంభమునకు గుఱి కావలసి వచ్చెను.

ఇనసేమిఁ బ్రతాపోజ్వలుఁ డగు నతఁడు తనకు వాటిల్లిన యా రాజోపాలంభమును దుద ముట్టఁ దుడిచి వేయుటకై రాజపురినిఁ దాను నిరాహార దీక్షతోడనే ప్రభువు సైన్యము లేకయే తగిన వస్తు సామగ్రినిఁ గొనకయే పట్టుకొనఁ బ్రతిన చేసి బయలు దేరెను. ఇది యొక యద్భుత వీరచర్య యనఁదగి యున్నది.

అతఁ డట్లు కొండ గహ్వరమున నిరాహారుఁడై బయలుదేరి యాఱవదినమునాటి మధ్యాహ్న సమయమునకు రాజపురికి నొక యామడకంటె నించుక యెక్కువ యగు మేరయందుఁ జేరఁ గల్గెను.

అంత నావీరవసంతము పగతురు ప్రయోగించు నారసములకు దొరకకయే వారి బాణ పరంపరలను దన శస్త్ర ప్రయోగమునఁ బడఁగొట్టుచు వనములోని యరఁటి యాకులను నులుముచు బయలుదేరు సింహమువలె నేకధాటిగ శత్రు సైన్యపు మొగ్గరమును జీల్చుకొనుచు రణరంగమునఁ బ్రవేశించెను. అట్టి తరుణమున బగతుర నెదిరించుటకై బింకము లేక జంకి యుండిన దండనాథుని సైన్యమునందలి సేనాని యొక్కఁడు మాత్రమే కందర్పునికిఁ దోడ్పడెను. అతఁడు బుద్ధరాజు కులమునఁ బుట్టినవాఁడు. అతని పేరు 'కులరాజు.' అతఁడు శత్రు సైన్యమును జీకాకు పఱచి పెక్కండ్రను యమసదనమున కనిపెను. కాని, అతఁడు కొంత తడవునకుఁ బగతుర సేనకుఁ జిక్కి యసువులఁ బాసెను. ఆ "కులరాజు" రణ హతుఁడగుటచే సంగ్రామపాలుని సైన్యము విజృంభించుచు "నింక శ్వేతచ్ఛత్రాంకుఁడగు కందర్పుఁడు గూడ హతుఁడైనట్లే" అని యుల్లాసముతోఁ బొంగుచుండెను.

ఇట్లుండఁ 'గందర్పుఁడు' సరిగాఁ బగలు రెండు జాముల సమయమున రాజపురియొక్క రాజధానిని నిరువది, లేక ముప్పది సంఖ్యతోఁ బరిమిత మైన భట సంఘమును జేర్చుకొని ముట్టడించెను. అట్టి రణభూమిని విడువక నిలువరించి యుండఁగల శత్రు సైన్యము ముప్పది వేలవఱకు నుండినది. అందు మూఁడు వందల పదాతి సైనికులు రాజపురి యగ్రభాగమున నిలిచి శత్రువుల నెదిరించిరి. అట్టి తఱి నిరుతెగలవారికిని జరిగిన పోరాటమునందు రెండు వందల కాశ్మీరిక భటులు రణమున నీల్గిరి. ఖశుల సైనికులు నాలుగువందల మంది యసువులఁ బాసిరి. రణభూమికి దూరమున శ్మశానమునందు సమరమునఁ గూలిన యావీరుల కళేబరములను జితులందు దహింపఁ జేయుచుండ నాస్థలము మృత్యుదేవత యేర్పఱచుకొన్న యొకానొక గొప్ప వంటసాలగాఁ గన్పట్టెను. మహావీరుఁడగు కందర్పుఁడు హర్షమహారాజు తొందర పాటునఁ దనపైఁ బ్రయోగించిన నింద యనెడు బేతాళుని రణభూమి యనెడు నాశ్మశానమున శత్రువుల రక్తమాంసములతో నిట్లు తృప్తి నొందింపఁగల్గెను. ఇట్టిది గదా వీరాగ్రేసరుఁడు చూపు స్వామిభక్తి!

ఇఁక నీయుద్ధ జ్వాల లీతీరున నుండు నప్పటికిఁ బ్రొద్దు గ్రుంకుట కింకను మూఁడు గంటల కాల మున్నది. అట్టితఱి శత్రువులు తమకు జరిగిన పరాభవమును భరింపలేక మరల నందఱు కలసి కొని యుద్ధమునకు నాయత్తపడి కందర్పు నెదిరించిరి.

అంత నాప్రగల్భ విక్రముఁ డగు కందర్పుఁడు విద్యుద్దీప్తి నిచ్చు నౌషధ తైలము పెక్కు బాణములకుఁ బూసి యొక్కుమ్మడిగా వానిని నల్దిశలకుఁ బ్రయోగించెను. అవియు నొక్క యెడుపున

అంతఁ గందర్పుఁడు రాజధానిలోఁ బ్రవేశించి తనప్రతాపాగ్నిని రగుల్కొల్పి శత్రువుల దర్పము నణఁగించెను. సంగ్రామపాలుఁడు గాశ్మీరపతికి లోఁబడి కప్పము గానుకలు గొప్పగాఁ జెల్లించి కందర్పునికి సన్మానము జరిపెను. ఈసంఘటనమున నొక విషయము మనసు నాకర్షించునది గలదు. రాజపురికిఁ గోశసంపద బాగుగాఁ గలదు. ప్రజ లందఱును రాజభక్తి గలవారై యుండిరి. సైనిక బలమును జాలినంత యుండెను. మంత్రులు మున్నగు నుద్యోగులు భేదాభిప్రాయము లేక కలసి మెలసి యుండిరి. ఇట్టి శక్తిసంపన్నమైన దేశమునఁ గందర్పుఁ డొక్కఁడై పోరి విజయము గాంచుట నెట్లు స్తుతింప వలయునో గదా! అతఁ డసహాయ శూరుఁడు. అట్టి ధీరులు దేశమున నెందఱో యుందరు.

ఆవిధమునఁ గందర్పుఁడు ప్రణతుఁడైన సంగ్రామపాలునివలనఁ గప్పమును బడసి యొక నెలరోజులకు శ్రీనగరినిఁ జేరెను. హర్షమహీపాలుఁడును గందర్పున కెదురు వోయి సమ్మోద సత్కారములతో నతనిని గారవించెను. అట్లు రాజు కందర్పుని గారవించుటచే దండనాథుఁడు మున్నగువారు దుస్సహ మగు తలనొప్పి బాధ పడువారి చందాన నెంతో వెతతోఁ గుమిలి పోయిరి.

తర్వాత రాజకీయ పదవుల నొందియున్న వారినిఁ గొందఱను వేఱు స్థానమ్ములకు మార్చుట జరిగెను. అందుకుఁ గారణము దుర్మంత్రుల ప్రోత్సాహమే. అని వేఱుగాఁ జెప్ప నక్కఱలేదు. వామనుఁడు తొల్లి క్షేమగుప్తుఁ డేర్పాటొనర్చిన 'పాదాగ్రము' అను పదవియం దుండెను. అట్టి వానినిఁ దొలఁగించి యాస్థానమునఁ గఠోర హృదయుఁడును 'పరిహాసపురము' నందుఁ బరిషత్తుచే 'వాతగండఁడు. అను ఖ్యాత బిరుదమును గైకొన్న వాఁడునునై యచ్చటఁ బరిపాలనము సాగించుచుండిన 'యానందుఁడు' అను నతఁడు నియోగింపఁబడి యుండెను. ఆయానందుఁడు తాను ద్వారాధిపతి కావలయు నని యుల్లాసపడుచుండఁ గుటిలచిత్తులగు క్రొత్త సచివుల మాటలు విని హర్షదేవుఁడు మహావీరుఁ డగు కందర్పుఁడు నిర్వహించుచున్న ద్వారాధిపత్య పదవిని ఆనందుని కొసఁగెను. ఇకఁ గందర్పునిఁ బొగడుచు నట్టి శూరునిఁ జెంత నుంచుకొనక దూరస్థ మగు లోహర రాజ్యమును బాలింప నీవే తగుదు వని యతని నచ్చోటి కనిపెను, ఇట్టి తంత్రములు రాష్ట్రమునందు జరుపుచు దుష్ట సచివులు రాష్ట్రపతులను వంచించుచుందురు. ఇందువలనఁ బెక్కు చిక్కులు వాటిల్లును.

సీ॥ సర్వజ్ఞుఁ డయ్యును సమ్రాట్టు దుష్టులౌ
సచివులఁ జేర్చుచో సరణిఁ దప్పు.
'వాదించు నితఁ' డని వాగ్మిని మిషవెట్టి
దూరభూమికి నంపు దూత్యమునకు.
తనమాట కడ్డంబు దగులు నీతఁ' డటంచు
సూరిని ధర్మజ్ఞు జార విడుచు.
'రణవీరుఁ డీతఁడు రాజ్యంబు ను హరించు'
నని శూరు దవ్వుల నంపి యుంచు.

నాశలను జీల్చునట్లు రివ్వున నగ్నిశలల నంటి ప్రజ్వలింపసాగెను. అట్టి దృశ్యమును వైరి సైనికులు గన్గొని యాశ్చర్య భయములు పెనఁగొనఁ దమలోఁ దాము "ఔరా! ఈతఁ డాగ్నేయాస్త్రమును బ్రయోగించినాఁడు. మన కింకేమి గతి? బుద్ధి పొరపాటున మరల రణము సేయ వచ్చితిమే! యని తమ్ము దాము నిందించుకొనుచు నట నుండ నోడి దవ్వులకుఁ బాఱిపోయిరి. ప్రతిభావంతుఁడును బరాక్రమశోభితుఁడును నగు కందర్పుని సమయ స్ఫూర్తి యెంత పని చేసినదో! చూడుఁడు.

మ॥ సమయ స్ఫూర్తి, ప్రగల్భ భావము, విశి
ష్టం బైన యోజస్సు, కా
ర్యములం దీర్పు ప్రయోగ చాతురియు, ధీ
రత్వంబుఁ దా రెట్టి క
ష్టములం బాయఁగ మహాశయులు! వి
శ్వ శ్లాఘ్య మౌ వారి భ
వ్య మనో వీథుల నావరింపవు జడ
త్వ క్షుద్రతా భీరుతల్.

ఆరీతిఁ గందర్పుఁడు ప్రొద్దు గ్రుంకు తరుణమునకు సంగ్రామపాలుని రాజధానిలోఁ బ్రవేశించెను. కాని యతఁ డచ్చటి బాహ్య ప్రదేశమందు బహుళ సైనిక బలము కేంద్రీకరించి యుండుట గనుగొనెను. వారితో నతఁడు పోరు సల్పుటకుఁ బోఁగోరిన వాఁడై హర్షుఁడు పంపిన దండనాథుఁడు భయంకర మైనట్టి యాసంగరారణ్యమును జూచి యదలి పోయి వెనుకంజ వేసినట్లు తెలిసికొనెను. వా రట్టి వారని కందర్పుని కిప్పుడు దెలిసెను. సామాన్యముగ నితరులయందలి ధైర్య భీరుత్వములు మొదట దెలియరాకుండుట సహజముగదా! అట్టి వెల్లఁ గార్య నిర్వాహ సమయమున విస్పష్టమగు చుండును.

చం॥ సమరమునందుఁ గొంద ఱరి
శాత శర క్షత గాత్ర మౌ న్వ సై
న్యము గని యుగ్ర మూర్తు లయి
యాహవ రంగమునన్ జరింతు రు
త్తమగతి. కొంద ఱన్యుల వి
విదారిత కాయులఁ జూచి భీతిసం
భ్రమములఁ గాంతు. రేరికగుఁ
బ్రాణి హృదంతర మర్మ మారయన్.

కందర్పుఁ డట్టి తరుణమున వెలుపలికిఁ బోయి పిరికిపందయై యున్న దండనాథునిఁ దనతోడఁ గొనివచ్చి వీఁపుఁ దట్టి మున్ను మచ్చరించి తనతోఁ బందెము వేసికొని కడలిలోఁ బడి మునకలు వైచుచు శరణన్న కాకిని రాజహంసము రక్షించినట్లు వాని భీతి నుడిపి తనవద్ద నిలుపుకొనెను. ఇది మహావీరుల యుదాత్త చర్య యగును.

అంతఁ గందర్పుఁడు రాజధానిలోఁ బ్రవేశించి తనప్రతాపాగ్నిని దగుల్కొల్పి శత్రువుల దర్పము నణఁగించెను. సంగ్రామపాలుఁడు గాశ్మీరపతికి లోఁబడి కప్పము గానుకలు గొప్పగాఁ జెల్లించి కందర్పునికి సన్మానము జరిపెను. ఈసంఘటనమున నొక విషయము మనసు నాకర్షించునది గలదు. రాజపురికిఁ గోశసంపద బాగుగాఁ గలదు. ప్రజ లందఱును రాజభక్తి గలవారై యుండిరి. సైనిక బలమును జాలినంత యుండెను. మంత్రులు మున్నగు నుద్యోగులు భేదాభిప్రాయము లేక కలసి మెలసి యుండిరి. ఇట్టి శక్తి సంపన్న మైన దేశమునఁ గందర్పుఁ డొక్కఁడై పోరి విజయము గాంచుట నెట్లు స్తుతింప వలయునో గదా! అతఁ డసహాయ శూరుఁడు. అట్టి ధీరులు దేశమున నెందఱో యుండరు.

ఆవిధమునఁ గందర్పుఁడు ప్రఖ్యాతుఁ డైన సంగ్రామపాలునివలనఁ గప్పమును బడసి యొక నెలరోజులకు శ్రీనగరినిఁ జేరెను. హర్షమహీపాలుఁడును గందర్పున కెదురు వోయి సమ్మోద సత్కారములతో నతనిని గారవించెను. అట్లు రాజు కందర్పుని గారవించుటచే దండనాథుఁడు మున్నగువారు దుస్సహ మగు తలనొప్పి బాధ పడువారి చందాన నెంతో వెతతోఁ గుమిలి పోయిరి.

తర్వాత రాజకీయ పదవుల నొంది యున్న వారినిఁ గొందఱను వేఱు స్థానములకు మార్పుట జరిగెను. అందుకుఁ గారణము దుర్మంత్రుల ప్రోత్సాహమే. అని వేఱుగాఁ జెప్ప నక్కఱ లేదు. వామనుఁడు తొల్లి క్షేమగుప్తుఁ డేర్పాటొనర్చిన 'పాదాగ్రము' అను పదవియం దుండెను. అట్టి వానినిఁ దొలఁగించి యాస్థానమున, గఠోర హృదయుఁడును 'పరిహాసపురము' నందుఁ బరిషత్తునే 'వాతగండఁడు' అను ఖ్యాత బిరుదమును గైకొన్న వాఁడునునై యచ్చటఁ బరిపాలనము సాగించు చుండిన 'యానందుఁడు' అను నతఁడు నియోగింపఁబడి యుండెను. ఆయానందుఁడు తాను ద్వారాధిపతి కావలయు నని యుల్లాసపడుచుండఁ గుటిలచిత్తు లగు క్రొత్త సచివుల మాటలు విని హర్షదేవుఁడు మహావీరుఁ డగు కందర్పుఁడు నిర్వహించుచున్న ద్వారాధిపత్య పదవిని ఆనందుని కొసఁగెను. ఇకఁ గందర్పునిఁ బొగడుచు నట్టి శూరునిఁ జెంత నుంచుకొనక దూరస్థ మగు లోహర రాజ్యమును బాలింప నీవే తగుదు వని యతని నచ్చోటి కనిపెను, ఇట్టి తంత్రములు రాష్ట్రమునందు జరుపుచు దుష్ట సచివులు రాష్ట్రపతులను వంచించుచుందురు. ఇందువలనఁ బెక్కు చిక్కులు వాటిల్లును.

సీ॥ సర్వజ్ఞుఁ డయ్యును సమ్రాట్టు దుష్టు లౌ
సచివులఁ జేర్చుచో సరణిఁ దప్పు.
'వాదించు నితఁ' డని వాగ్మిని మిషవెట్టి
దూరభూమికి నంపు దూత్యమునకు.
తనమాట కడ్డంబు దగులు నితఁ' డటంచు
సూరిని ధర్మజ్ఞు జార విడుచు.
'రణవీరుఁ డితఁడు రాజ్యంబు ను హరించు'
నని శూరు దవ్వుల నంపి యుంచు.

గీ॥ రాష్ట్ర సంపద లిట్లు దుర్మతుల పాలు
గాఁగఁ బ్రజ కష్టముల పాలు గాఁగఁ గడకు
"మొదటికే మోస" మన తేఁడు ముప్పు నొంది
తనదు పదవినె గోల్పోవు దారి దప్పి.

హర్షునకుఁ గందర్పునిపై నెంతో ప్రీతి యుండెడిది. అది యతఁడు దూరమై పోవుట వలనను దుష్ట సచివుల దుర్బోధవలనను గ్రమముగ మాటు పడినది.

గీ॥ దూర దేశాల వేఱుగాఁ జేరి యున్న
వారి ప్రేమ యదెంత సుబద్ధ మైన
శ్రుంఖమై పోవుఁ బిడికిటఁ బట్టి నట్టి
యిసుము చందానఁ గ్రమముగ హీన మగుచు.

పిమ్మట, భ్రష్టు లగు సచివు లూరకుండ లేదు. ఎట్టులేని కందర్పునిఁ బదవిచ్యుతునిఁ జేసినఁ గాని తమ మాటలు సాగిరా వని యాలోచించి హర్షమహీధవునకు "కందర్పుఁ డిప్పుడు లోహర రాజ్యమును ఉత్కర్షుని కుమారులకుఁ గట్టి పెట్టఁ దలఁచి యున్నాఁడు." అని చల్లగఁ జెవిలో నూఁదిరి. వారి మాటలు యథార్థములుగా స్వీకరించి వెంటనే యారాజు "కందర్పునిఁ బట్టి బంధించుటో లేక చంపుటో జరుపుఁ" డని యాజ్ఞ నొసఁగి యసిధరుఁ డను మంత్రిని, పట్టుఁడు, అను వానిని సేనతోఁ గూడ లోహరమున కంపెను.

కందర్పుఁడు తనకడ కరుదెంచిన వారి నిరువురను జూచి తన కందిన లేఖా వ్యత్యయమును బట్టి వారి భావములను గ్రహించి చకితాత్ముఁడై కొలఁది కాలము నతముఖుఁడై చింతతో నుండెను.

పిదప నసిధరుఁడు ద్యూత క్రీడ జరుగు తరుణమునఁ గందర్పుని బంధించుటకై యతని యెదురఁ బేవకునివలె నిలువఁబడి యతని హస్తము నదిమి పెట్టి తన హస్తము లాగికొని తన బొట్టన వ్రేలితో నతని హస్తము నదిమిపెట్టి గట్టిగా రుద్దెను. అప్పుడు చిత్రముగా నాయసిధరుని కరము నందలి చర్మము వ్రీలి పోయినది. అతని చేయి యాఁకెలు చర్మమును దీయఁగాఁ దడిసి యుండు పక్షి యొరలికి వీడుగా నుండెను. అంతటితో నసిధరుని యుద్యమ మస్తమించెను.

అప్పుడు కందర్పుఁడు చాల ఖిన్నుఁడై తేఁ డీరీతి నాంతర్య మెఱుఁగని వాఁడయ్యెనని గ్రహించుచు నసిధరునితోఁడ వచ్చిన 'పట్టుఁడు' అనువానితో నిట్లనెను. "ఓయీ రాజు గొప్ప చదువరి యయ్యు దుష్టు లగు వారి మాట లాలించి వారు నడపినట్లు వ్యవహరించు చున్నాఁడు. ఆనరత యెట్లైని యుండ నిమ్ము. నాకుటుంబము నిక్కడికి నుచిత రీతినిఁ బంపి వేసినచో నీలోహరమును విడచిపెట్టి నేను దేశాంతరమునకుఁ బోవుదును. ఈవిషయమును వెంటనే తెలిపి కార్య క్రమమును జరపింపుము." అని పల్కెను.

ఇట్టి సందేశమును 'పట్టుఁడు' వెంటనే పోయి రాజునకుఁ దెల్పఁగా నతఁడు కందర్పుని కుటుంబమును లోహరమునకు సగౌరవముగ నంపి వేసెను. కందర్పుఁడును తన సంబంధులను

దీపికొని లోభారమును విడిచి పెట్టి రాజు నెడ ద్రోహము దలపెట్టని వాఁడై తన యధికారమునెల్ల నీళ్ళు వదలిపెట్టి పయనము సాగించి వారణాసినిఁ జేరెను.

అంత కందర్పుఁడు 'గయ'యం దుండిన సామంత రాజు కాశ్మీర ప్రజలకును గయా శ్రాద్ధము పెట్టు నపుడు సుంకము విధించి యుండు టెఱింగి యతఁడు తనమాటను ధిక్కరించుటచే వానిని వధించి మఱి యొక సామంతుని నచ్చట నిలిపి కాశ్మీరికులకు శ్రాద్ధ శుల్కము లేకుండు నట్లు చేసెను.

మఱియును గందర్పుఁడు తూర్పు దిక్కున నుండు మహాపథమున బాటసారులు దుండగీండ్రగు దొంగల బారి పడి బహు విధము లగు బాధలు చెందుచుండుట తెలిసికొని సుదీర్ఘ మగు నాపెను దారియందలి దొంగల గుంపును బుట మార్చి పథికులు రాత్రులయందును బయనము సాగించు సౌకర్యము గలిగించెను. ఇంతమాత్రమె గాక వజ్రకాయుఁ డగు నతఁడు వారాణసి ప్రాంతమున భయంకర మగు నొక బెబ్బులినిఁ బట్టి వధించెను, అది యంతకు ముం దెందఱనో మానవులఁ బొట్టఁ బెట్టుకొనెను. కందర్పునిచేఁ బూర్వదిశ యాకాలమున భూషితయై యొప్పారినది. సుకర్మలయందు దీక్షితు లగు వారికి నాదిక్కు దిక్కై సర్వ విధముల రాణించినది. అందుఁ బెక్కు మఠము లేర్పడి నవి. కందర్పుని చరిత్ర యీ విధముగ శ్లాఘ్య మయ్యెను.

ఇఁక శ్రీనగరియందు హర్షభూపతినిఁ దమ జేబులో వేసికొనిన దుష్ట సచివులు కందర్పుని రాజ్యమునుండి నిర్వాసితునిఁ జేయఁ గలుగుటచే మఱింత దుస్తంత్రములకు మొనగాండ్రైరి. కాని వారు ముందువలె లేక యొకరిపై నొకరు లోలోన నీర్ష్య వహించి మెలఁగ సాగిరి. అందువలన రాజ కార్యములకు భంగము వాటిల్లు చుండెను. రాజు స్థితి గూడఁ బొట్టేళ్ళ పోరాటము నడుమఁ జిక్కిన నక్క గతికి నెన యయ్యెను.

చం॥ తెగఁ దిని యిచ్చ వచ్చి నటు
తిండ్రలు తీటలు వోవ గొమ్ములన్
దగులుచు నొండొరున్ గనలి
తద్దయు నీల్గెడు దుష్ట మంత్రులన్
దగరు లటుండఁగా నడుమ
స్థాణువులై సకలాంగముల్ ధరన్
దెగి పడ నల్ప కాలమున
దీనులు వోలె నశింత్రు భూపతుల్.

ఈ విషయ మిట్లు కొంత కాలము గడచిన తర్వాతఁ దన్వంగుని కుమారుఁడు ధమ్మటుఁడు రాజ్య లోభముతో ద్రోహ బుద్ధి గలవాఁడై హర్షమహీపతినిఁ గుట్రతోఁ బరిమార్ప గూఢముగఁ బన్నుఁగడ సాగించెను. ద్రోహి యగు ధమ్మటుఁడు దా ననుకొన్న హింసా కృత్యమునందు జయరాజు అను నతనిని ముఖ్య సహాయునిగా నెన్నుకొనెను. ఆ జయరాజు రాజ వంశమునకుఁ జెందిన వాఁడై నను

వేశ్యాపుత్రుఁడు గావున హర్షుని రాజవంశపు జ్ఞాతులలోఁ దానే ముఖ్యుఁ డనియు రాజుగాఁ దగిన యోగ్యత తనకే కలదనియు నాలోచించి హర్షుని సంహరించిన నింద మాత్రము జయరాజునకు నంటఁ గట్టు దురుద్దేశముతో నిట్లు ధమ్మటుఁ డెత్తు వేసెను. ఈ పన్నుగడతో మూఢుఁడగు జయరాజును ధమ్మటుఁడు ప్రలోభపెట్టి హర్షుని హత్య గావించుటకుఁ బురికొల్పెను. ఆ జయరాజునకు 'బిలావ' గ్రామ వాసులను హత్యా కాండయం దారితేరిన వారిని సహాయులనుగా సమకూర్చుటయే గాక యా ధమ్మటుఁ డెట్లో యంతిపురపు కాంతలను గూడ నిరువుర నో ముగ్గురనో యందుకుఁ దోడ్పడునట్లు చేయఁ గల్గెను.

కొంత కాలమునకు ధమ్మటుని చెడ్డ తలంపు ఫలవంతము కాఁదగిన స్థితికి వచ్చెను. అట్టితరి హర్షనరేంద్రుఁడు రాజపురియందలి రాచరికపుఁ గార్యమున నేదో విసంవాది విషయ ముండినందున ధమ్మటుని గౌరవించి యచ్చోటికి దూత్యమును జరుప రాయబారిగాఁ బోవలయు నని నియోగించెను. ఆ ధమ్మటుఁడు 'సహస్రమంగళము' అను గృహమునందు సుదినము నపేక్షించి వేచి యుండెను. అప్పుడు జయరాజు తాము దలంచిన కార్యసిద్ధికి భంగము గలుగు నన్న భయముతో గూఢముగాఁ దాము దలపెట్టిన క్రూర కార్యమును జరుపు సమయమును గుఱించి సంభాషించుటయు జరుగఁగా నచ్చోట గోడ చాటున నున్న ప్రయాగుని యనుచరుఁడు ధమ్మట జయరాజు లొనర్చు రహస్య సంభాషణము లోని సారాంశమును విని తన యజమాని యగు ప్రయాగునికిఁ దెల్పెను. ప్రయాగుఁడు తొలుత నుండియు హర్షునకుఁ బరమాప్తుఁడై పెక్కు ప్రాణాపాయ కరము లగు సంకటములందు హర్షునిఁ గాపాడిన వాఁడని పాఠకులకు విదిత చరము గదా!

ఆ ప్రయాగుని వలన హర్షుఁడు ధమ్మటాదులు దనయెడ జరుప నున్న ద్రోహ చర్యను గ్రహించి రాజపురి కతఁడు రాయబారిగాఁ బోవు పని నాపి వేసెను. హర్షుఁ డారీతిఁ దన నాపుదల చేయుటచే మనసునందుఁ గినుక నొందియు ధమ్మటుఁడు దన కుటుంబమున కెట్టి కీడు గలుగకుండుటకై మరల హర్షుని చర్యకు నెదిరింపలేదు. తనకెట్టి యుపద్రవము రాకుండునట్లు జాగరూకుఁడై మెలఁగుచుండెను. హర్ష భూవిభుఁడు ధమ్మటుఁడు గూఢముగా నెటకేని రాత్రియందుఁ బోనున్నట్లు తనగూఢ చారులవలనఁ దెలిసికొని వాఁ డట్లు తప్పించుకొని పోకుండ నన్ని దిక్కులందును రక్షక భటులను గనిపెట్టి యుండునట్లు కట్టడ చేసి యుంచెను.

ఇది యిట్లుండ ధమ్మటుఁడు మఱి యొక పన్నాగము గనిపెట్టెను. అతఁడు జయరాజుతో "రాజకుటుంబమువా రుదయముననే భట్టుశాలా భవన మండపమునం దాచరించు ప్రార్థనకై పోయి యచ్చట నవకాశము గనిపెట్టి తమకోర్కెను నెఱవేర్చు కొనునట్లు చెప్పి కపట పద్ధతితో నాప్రార్థనా భవన మండపమునకు జయరాజుతోఁ గూడఁ బోయెను. ఆ భవనపు లోపలి భాగపుఁ దలుపు గడియ వేసి యుండెను. అందు హర్షభూపతి ముందుగనే చేరి యుండెను. హర్ష మహీధవుఁడు తన కత్యంతాప్త భృత్యుఁ డగు ప్రయాగుని రక్షక భట సముదాయముతో నాప్రదేశమున నిలిపి యుంచెను.

అట్టి సమయమున హర్షుని యానతి ననుసరించి ప్రయాగుఁడు ధమ్మటునితో నెమ్మదిగా "జయరాజును బంధించి ముందు శస్త్రహీనునిఁ గావింపుము." అని పల్కెను. ఇట్టి యాజ్ఞ యొసఁగుట

యందు హర్షదేవుని మేధా పటిమ యెంతేని పొగడఁ దగినది. అతని యదృష్టమున నతని బాలిక యందు దైవము సన్నిహితమై యుండె ననవచ్చును. కారణ మేమన? జయరాజును బంధింపు [illegible] ధమ్మటునితోఁ జెప్పి నపుడు జయరాజు ధమ్మటునిపైఁ గల విశ్వాసమున నట్లు చేయఁగలఁడనియు హర్షుని భావమై యుండెను. మఱియు నాధమ్మట జయరాజులలో నొకరు గాని లేక యిద్దఱును గాని రాజద్రోహం లని వెల్లడియై నపుడు తగినట్లు శిక్షింప వచ్చు ననియు, అందువలన లోకము తనపై నెట్టి చెడ్డ భావన గలిగి యుండ దనియుఁ బ్రతిభాశాలి యగు హర్షుఁ డూహించి యారీతిఁ దనయానతినిఁ బ్రయాగుని మూలమునఁ దొలుత ధమ్మటుని చెంత రహస్యముగా వినిపింపఁ జేసెను.

అంతట హర్షుఁడు దలఁచినట్లు ప్రయాగుఁడు తిన్నఁగా రాజు నాజ్ఞ ధమ్మటుని చెవిలో వినిపించిన తఱువాత ధమ్మటుఁడు హర్షునకుఁ దనపై నెట్టి యనుమానము లేదని భావించి జయరాజు దగ్గఱకు వచ్చి పైపైకిఁ బ్రగల్భ భావమును గనఁబఱచుచు "నీయెడ రాజునకుఁ బ్రసన్న భావము లేకున్నది. నిజముగ నీ వెట్టి ద్రోహచింత లేనివాఁ డవగుదువేని నీయాత్మశుద్ధి సూచకముగ నీకర వాలము రాజ సన్నిధియందు శీఘ్రముగా సమర్పింపుము." అని పల్కెను,

జయరాజు, అసహాయ శూరుఁడు. అస్త్ర విద్యయం దారితేరిన దిట్ట, రణకోవిదుఁ డునునై యుండెను. అట్టివాఁడయ్యును ధమ్మటునియెడఁ గల విశ్వాసముచేతను దైవ సమ్మోహితుఁ డగుటవలనను దన కృపాణమును సామాన్య జనునిరీతి విసర్జించి రాజసన్నిధిఁ జేర్చెను. వీరికథ యీస్థితికి వచ్చినది.

అట్టి తరుణమున నా ప్రార్థనా మందిరమునఁ దన్వంగుని పౌత్రుఁడు జయ్యకుని పుత్త్రుఁ డును నగు 'ష్టల్లకుఁడు' అనువాఁడు నుండెను. అతఁడు జయరాజునకుఁ గలిగిన భంగపాటును అతని యెడ నప్పుడు చూపట్టెడు వైక్లబ్యమును జూచి "నీవు కలశభూపతివలనఁ గయ్యాభిధాన యగు నామెకుఁ గలిగిన వాఁడవు గావు. ఓ దౌర్బల్య దూషితుఁడా! నీ తండ్రి నిక్కముగ నెవఁడో యొక నపుంస కుఁడుగా నుండ నోపును." అని ధైర్య చర్యలయొక్క నిష్ఠ యెట్టిదో యెఱుఁగకయే పలికెను. అతని పరుష వాక్యములచే జయరాజు చల్లని నీటిచేఁ దడిసి నిద్రించిన వారితో సాటిగా జడుఁడై మఱింత స్తబ్ధత నొందెను,

అటుపిమ్మట రాజ ద్రోహ చర్యకై జయరాజు పూని యుండిన విషయమును గుఱించి బహు విధములఁ బ్రశ్నించుచు నతని దీవ్ర యాతనల పాలు సేయుచున్నను ధీరుఁ డగు నాజయరాజు ధమ్మటుని విషయ మించుకేని దెల్పక యంతయుఁ దనమీఁదనె యా రాజద్రోహమును వేసికొనెను.

జయతా జీరీతి రాజద్రోహిగా నిర్ణయింపఁబడుటచే రాజాధికారులతనికి మొదట విష మిశ్రిత మగు నన్నముఁ బెట్టించి యతని నున్మూలింప యత్నించిరి. కాని, యతఁడు విషఘ్న మంత్రము నెఱిఁగినవాఁ డగుటచే నట్టి మంత్ర జపమువలన విషమును సైతము హరించు కొనెను. తఱువాత రాజ సేవకు లొక రాత్రియందు నతని నురిత్రాటఁ గట్టి విగత జీవితు నొనర్చిరి. 'జయ్యకుఁడు' అను ప్రతీహారి జయరాజు శిరమును ఛేదించి యతని కళేబరమును 'భట్టారనద్వలము' అను మడుఁగున మత్స్యముల కాహార మగునట్లు పడవేసెను

పిమ్మట నతని మృత కళేబరమును గూటియందున్న పక్షిని వ్యాధుఁడు పడఁగొట్టునట్లు భవనమునుండి క్రిందికిఁ బడవైచిరి. అంతమాత్రమె గాక దానిని రాజాజ్ఞచే శ్వపాకులు తుక్కలపా లొనర్చిరి. ధమ్మటుని గతి యీవిధ మైనది.

ఇఁకఁ దన్వంగుని పౌత్రులు రల్హణుఁడు, మల్హణుఁడు, అనువారు స్వయముగనే తమ కృపాణములను రాజు సవిధమున సమర్పించి విధేయు లయిరి. రాజగు హర్షుఁడు వారిని జేరఁదీసి రక్షించెను. 'టుల్లటుఁడు, మొదలగు వారు మఱి నల్వురు తన్వంగుని మనుమలును రాజు నెదిరించి సంగర మొనర్ప సంసిద్ధులై యుండిరి. వారు వీరులు.

అట్టి తఱి నుదయసింహుఁడు తనదాంభికత్వ మెఱయ మాయోపాయమున వారిని మోస పుచ్చుటకై "ఓ నాప్రియకుమారులారా! మీరేల తొందరపడెదరు? ఈవైరము రాజుతో మీకేల? తేని నాశ్రయించి సుఖజీవనులరై యుండుఁడు." అని కపట ప్రేమ నటించుచుఁ బల్కెను. ఆ వాగ్జాలమున వారు మెత్తవడి చిక్కి యల్లే తమ శస్త్రములను రాజు సన్నిధి నుంచి సుఖజీవను లగుటకు సిద్ధపడిరి. అంతట వారు వానిమాటల యందలి విశ్వాసముతో రాజ గృహమునకుఁ బోయి తమ శస్త్రముల నట నర్పించిరి.

అప్పుడు ఛత్రము పట్టువాఁ డగు నాయుదయసింహుఁ డొక్క కపటపు నవ్వొనర్చి టుల్లునితో 'ఓయీ! తన్వంగపౌత్రుండా! నేను బాల్యమునుండియు తన్వంగజుఁ డగు ధమ్మటుని యింట నెంగిలి కూడు గుడిచి వృద్ధి నొందితిని నీవింతకు మునుపు జయరాజు రాజు సన్నిధినిఁ దనశస్త్ర మర్పించి విధేయుఁ డయినప్పుడు వానితో "ఓరీ! బలహీనుఁడా! పిరికిపందా! యీ హీనమైన పని యొనర్చితి వేల? వీరుఁ డగు మీతండ్రివలన నిన్ను మీయమ్మ కనలేదు. ఇంతకంటె వీరశయన మొందఁ గూడదా? అని పల్కి యుంటివి. నీవు పల్కిన యా వాక్యములనుమఱచి పోతివా? వాని గతియే నీకిపుడు పట్టినదిగదా! మూఢుఁడా ధైర్య మవలంబింప వలసిన తరుణమున నిట్టి పిరికితనముఁ జూపు చుంటివేల? ఈకారణమును బట్టి యెంగిలి యన్నముతోఁ గాలము గడపిన వా తండ్రికి నీవు గలిగితివి. నేను కీర్తి పాత్రుఁడును వీరుఁడును నగు నీతండ్రికి సుఁతుడ. అని యతికఠోరముగఁ బల్కెను.

ఇమ్మాటలకు, 'టుల్లుఁడు' ఉల్కిపడి తళతళ, మను తన ఖడ్గ ధారా కాంతి జల పూరమున మునిఁగి తనదు జన్మయొక్క మాలిన్యమును గడిగి వేయ యత్నించెనో! యన్నట్లు గన్పట్టెను. అంత నతఁడు తనకు సహాయులుగా నున్న విజయరాజాదులతో "రాజాంతికమునకుఁ బోవుదము రండు, వీనితోడి మాటలు మన కేల?" అని మిట్టిపడుచు బయలుదేర నుంకించు చుండఁగా నచ్చట సిద్ధముగ నున్న రాజపురుషులు వారిని వెంటనే బంధించి కారాగారమున నుంచిరి.

టుల్లటుఁడు మొదలగు వారు యౌవన మదోన్మత్తులు మొదటినుండియుఁ గష్ట మెఱుఁగక వసంత శోభిత మైన యుద్యాన వనమునందలి తరు కాండములవలె సుఖ భోజనములతోఁ బ్రోది నొంది ప్రకాశించుచుండిరి. అట్టివారి కీగతి పట్టినది. అయినను గారయందు వారికి హర్షవల్లభుఁడు కనికరించి తగినట్లు భోజనాదుల సమకూర్పు ననుజ యొసఁగి యుండెను.

ఇట్లు కొంత కాలము జరిగినది. టుల్లాదుల డెందములందు మార్పు గలుగలేదు.

బింబియుఁడు, అనువాఁడు కారాగృహాధికారి. అతఁడు మహాక్రూరుఁడు, రాజు నెట్లో సమ్మతింపఁజేసి చెఱయందున్న యా రాజ ద్రోహాలను టుల్లటుఁడు, విజయరాజు. బుల్లుఁడు, గుల్లుఁడు అనువారిని నల్వురను నడిరేయి కంఠములందు నురి త్రాళ్ళు బిగించి విగత జీవుల నొనర్చి వధ్య స్థలమునఁ బాఱవేయించెను.

ఈ టుల్లటాదులు చాల నందగాండ్రు. ఆ వధ్య స్థలమునందుఁ బడి యుండిన వారి శవముల రూప విశేషముల నీఁనాడును వయోవృద్ధు లగు ప్రజలు వర్ణింపుచుందురు. ఎల్లపుడు నెడతెగని తాంబూల చర్వణములతో నెఱ్ఱ వాఱి యున్న వారి మొలక దంతములు వధ్య భూతలమున దుల్లిపడి యుండఁగా నవి పద్మరాగ రత్నాంకురములవలె నుండినవట? పాపము! ఏమనందగును?

ఇంక నింతమాత్రముతో హర్షుఁ డూరకుండలేదు. మిగిలిన దాయాదులను గూడ దయ లేక యమ సదనమున కనిపెను. ఈరాజు మొదటినుండియు నుత్కర్షుని యిరువురు సుతులను బాలురను దయతోఁ బోషింపుచునుండెను. ఇట్టి తరుణమున నిజ వంశ వృద్ధి బీజములగు నా చిన్న వాండ్రలోఁ బెద్దవానిని 'డోంబుఁడు' అను వానిని గూఢ దండములచేఁ గూలఁ జేయించెను. అట్లే విజయమల్లుని కొమరుని జయమల్లుని దనపాలిటి స్ఫులింగముగ దైవ దుర్విపాకమునఁ గలిగిన దుర్బుద్ధిచే భావించి మిత్తివాతఁ గొట్టించెను. అంతటి విద్యా వివేక సంపన్నునకు నెంతటి బుద్ధి జాడ్యము సంభవించినది! అని చదువరులకు నాశ్చర్యోద్వేగములు గలుగక మానవు. అంతయు విధి విలాస మనవలయును. ఈ సందర్భమునఁ బ్రకృతి పరిశీలన మొనర్చి యిట్లు కనుగొన వచ్చును.

సీ॥ అశ్వత్థ భూమీరుహం బొనర్చెడు నట్టి
  యన్యాయ్య మెంతటి? దకట! తనదు
గుబురు కొమ్మలలోన గుప్తంబుగాఁ దేంట్లు
  పెట్టిన యా తేనె తెట్టె బిట్టు
తన చల దళములఁ దాడించి మధుపాలఁ
  దద్రక్షకంబులఁ దఱిమి కొట్టి
భాగధేయము గల పరునకు నెవనికో
  యయ్యాప్తి దక్కించు; నట్లె నృపులు

గీ॥ వంశ గోప్తలు జ్ఞాతులౌ వారి నెల్లఁ
గూల్చి ధనరాసు లెన్నియో కూర్చి వానిఁ
బరుఁ డెవండో యొకానొక భాగ్యశాలి
పడయఁ జూతురు దుర్విధి ప్రామికొనఁగ,
హర్షుని చరిత్రకుఁ బై సందర్భము సరిపడి యున్నది.

అనంతర మారాజు మంచి చెడ్డ యనక దాయాదుల నెల్ల మృత్యువు లొనర్చుటవలనఁ గలిగిన పాపమునకు గుఱియై విటుల చేతిలోని కీలు బొమ్మ యయ్యెను. కేవలము పసి బిడ్డలును నారీతి నన్యాధీనత నొంద రనవలెను. ఇతఁడు తనతండ్రి యగు కలశుని ద్వేషించి యున్నవాఁడని వామనుని కొమరుఁడు క్షేముఁ డనువాఁడు గ్రహించి పురికొల్పఁగాఁ గలిశభూపతి గట్టించిన దేవాలయ శిఖర భాగమున నుండు బంగారము నంతను దోచుకొనఁ బూనెను. కాని హర్షునకు నాప్తుఁడును భక్తుఁడును నగు ప్రయాగుఁడు యుక్తితో నతని నాపని యొనర్పకుండున ట్లొనర్చెను. ప్రయాగుఁ డాసమయమునఁ బెనుగోతిలోఁ బడనున్న మదపు టేనుఁగును మావటివాఁడు వోలె నరనాథు నట్టి కార్యము నొనర్పకుండఁ జేయఁ గల్గెను.

ఇట్లుండ హలధరుని మనుమఁడు 'లోష్టధరుఁడు' అను విటుఁడు నష్ట చేష్టలు గల శవము లను బేతాళుఁడు పట్టుకొను నట్లు బుద్ధి బలమును గోల్పోయిన రాజులను సులభముగా లోఁబఱచుకొను చుండువాఁడు. ఆ లోష్టధరుఁడను బేతాళుఁ డిప్పు డీహర్షునిఁ బట్టుకొనెను. "కలశేశ్వరుని బంగారమును, ఆదేవునికి సమర్పించిన గ్రామములను స్వాధీన పఱచుకొనుము. ఆ దేవాలయపుఁ బెద్ద ఱాతి బండలతో వితస్తానదియందు సేతు నిర్మాణ మొనర్ప వచ్చును." అనుచు నతఁడు నరపతి చెంతఁ జేరి యెల్ల పుడును దనప్రావీణ్యమును స్తుతించు కొనుచుండెను. హర్షుఁ డెంతటి మేధావియై యుండెనో! యంతటి హీనమతిగా నిప్పుడు గానవచ్చుటకు నతని దౌర్భాగ్య దోషమే కారణముగదా! అంతటి విద్యావంతుని దగ్గఱ నా యిట్టి తులువలగు విటులు చేరి పదరుచుండుట! విటుల ప్రగల్భముల నొకింత యీ సందర్భమున సమీక్షింపఁ దగును.

సీ॥ వివిధ చిత్రంబుల విను పీధు లందెల్ల
  రచియింతుఁ జిత్ర చిత్రంబు గాఁగ.
చేతంబు లూరించు చేలంబులను బిస
  సూత్రాల సృష్టింతుఁ జోద్యముగను.
హిమ ఖండములతోడ హిమరశ్మి నంచెడు
  వజ్రముల్ నిర్మింతు దీప్రముగను.
కలలోఁ గన్నట్టి కనకంపు లిబ్బులఁ
  గనిపెట్టి సమకూర్తు ననుచు విటుల

గీ॥ వదురు విటు లొడ్డు మాటలన్ వలలఁ జిక్కి
బుద్ధి జాడ్యానఁ గొందఱు పుడమి పతులు
పక్షులై పడి యుంద్రు త్రవను దొఱంగి
తల పయికి నెక్కి దుర్విధి తాండవింప.

ఈ విధముగ లోష్టధరుఁడు హర్షుని వలలో వేసికొనఁ జూచి యెంతో ప్రయత్నించియు విఫలుఁ డయ్యెను. అందుకు నాప్తుఁ డగు ప్రయాగుఁడు తన బుద్ధి బలముతో వడ్డు తగిలి పవిత్ర హృదయుఁడగు మహాభిషజ్మణి యపథ్య భోజనమునకై యాశించు రోగిని బలవంతముగ భద్రాలు విధో

పాతకముల నట్టి కాంక్షనుండి తప్పించి రక్షించు చందమునఁ తన ప్రభువు నట్టి దుష్ట చర్యనుండి తప్పించెను. అప్పటి కాప్రమాద మెట్లో దైవికముగఁ దప్పి పోయినది. హర్షునిఁ బట్టుకొన్న 'లోష్ట ధర' గ్రహ మతని నంత సులువుగా విడిచి పెట్టునా?

అనంతరము లోష్టధరుఁ డొకప్పుడు రాజు చెంతఁ జేరి హాస్యపు మాటల ప్రసంగము సాగించుచు "దేవుఁడు బంధింపఁబడి యున్నాఁడు. పాపము. ఆయనను విముక్తునిఁ జేయఁ గూడదా!" యని యడిగెను. అందుకు రాజు చిఱునగ వొనర్చి యే మిట్లంటివి? ఆసంగతి యేమి? అని యడిగెను.

అంత లోష్టధరుఁడు వినుము. రాజా! చెప్పెదను" ఉదభాండ పురమునకుఁ బూర్వము భీమశాహి పాలకుఁడుగా నుండెను, అప్పుడు రాష్ట్ర పాలకుఁడు కలశమహారాజు. ఉదభాండపురము నందు 'భీమకేశవస్వామి' యాలయ మున్నది. ఆనాఁ డాదేవాలయ పరిషత్తు వారికిని, భీమశాహికిని వివాద మేర్పడుటచే నాదేవునకు దీపారాధన పూజాదులు ముగిసి పోయినవి, దేవాలయపుఁ గవాటము చిరకాలము బంధింపఁబడి యుండెను, కొంత కాలము జరిగిన తఱువాత భీమశాహికి పారిషద్యులతో విరోధము తీరి పోయెను. అప్పుడు దేవాలయపుఁ దలుపులు తెఱచి చూఁడగా, నందలి భీమకేశవ స్వామికిఁ దొడిగిన వెండి కవచము కాన్పింపలేదు, అద్దాని నెవరో దొంగ లపహరించిరి.

అప్పు డాపరిషత్తువారు దాని యధికారులు దొంగల యలజడికి జంకి యందలి ధనాదికము గూడ నపహృత మగు నని భయపడి యా దేవాలయపు ద్వారమును మరల మఱింత దిట్టముగా బంధించిరి. అప్పటినుండి యిప్పటివఱకు నాదేవాలయ మట్లే బంధింపఁబడి యున్నది. చోర భయమున కాస్పద మైన యా దేవాలయమునందలి కోశ రాశిని దీసికొనఁగూడదా? అట్లు చేసిన నాదేవునికిఁ జిరకాలమునుండి యేర్పడి యున్న బంధము త్రొలఁగి పోవును. దీపారాధనము నైవేద్యము మున్నగు నవి లేక చిరకాలమునుండి చివుకుచున్న యాదేవునకుఁ గొంత యుపకారము చేసినట్లును నగునుగదా! ఆపుణ్యము గట్టుకొనుము." అని యతఁడు కథ చెప్పెను. విటుల వలలో నీరీతిఁ దగులుకొనిన హర్షునకు లోష్టధరుని మాటలు కమ్మని యమృతంపు గుటకలై వీనుల విందైనవి.

అంత నా భూవిభుఁడు ఆలయ ద్వారమును దెఱచి యందలి మణి సువర్ణాది రూప మగు కోశము నంతను గైకొనెను. తఱువాత నతఁడు తనలో "ఈ శూన్య మయి మూతపడి యుండిన దేవాలయమునందే యింతటి కోశ రాశి దొరకినదే! ఇఁక ధనాఢ్యములై కళకళలాడు దేవాగారములందలి ధనరాసు లెట్టి ప్రమాణముతో నుండునోగదా! వాని నన్నిటిని స్వాధీనము చేసికొనినచో నా ఖజానాలు ధన సమృద్ధములై యొప్పారఁగలవుగదా!" అని యాలోచించెను. హర్షుఁ డింతగా దిగజారి పోయెను. ఇంకమ వితని దుండగ మెట్లుండునో! కనుగొందము.

హర్షుఁ డా భీమకేశవస్వామి కోశమును స్వాధీనము చేసికొను నప్పు డచ్చటి పారిషద్యు లడ్డుపడి ప్రాయోపవేశ మొనర్చిరి. హర్షుఁడు వారిని సమాధానపఱుచుటకై 'దూత ఖారోడి' (కాశ్మీర మునం దాకాలమున నుండిన ధాన్యము వస్తు సముదాయము మున్నగు బరువులపై విధించు పన్ను.) అనుదానిని వారించి వారివలనఁ గలుగు వాటంకము నప్పుడు మాన్పి వేసెను.

అంతట హర్షుఁడు క్రమముగా రాజ్య సంబంధ మైన సైన్యము మున్నగు సంగములను బలపఱుచుటకై పూర్వ రాజన్యులు పోషించిన యా యా పట్టణములు పల్లెలు మున్నగు వానియందలి వివిధ దేవాలయములలోని యద్భుతావహము లగు కోశ రాసు లన్నిటినిఁ గొల్లగొట్టించెను. ఆ యన్యాయ మింతటిదని చెప్పఁదరము గాదు.

దేవాలయములలోని కోశరాసులు కొల్లగొట్టుట పూర్తి యయినది. అంతటితో నతఁ డూర కుండలేదు. దేవతా ప్రతిమలను, అపహరించి తెచ్చుటకుఁ దగిన సమర్థుఁ డగు 'నుదయరాజు' అను నతనిని దేవతా విగ్రహోత్పాటన నాయకునిగా నియోగించెను. ఇంకేమి చెప్పవలయును? అనర్థ పరంపరకు నంతు లేకున్నది. విటులకు 'దాసోఁహ' మ్మనిన యాకుటిల బుద్ధి విపరీత చర్య లింకను నున్నవి.

హర్షుఁడు దేవాలయముల కోశాగారములలోని ధనరాశి నంతయు నారీతిఁ గొల్లగొట్టియు నంతటితోఁ దృప్తి నొంది యుండలేదు. దేవతా ప్రతిమలు స్వర్ణమయములు రజతమయములు తామ్ర నిర్మితములు నగు వాని నన్నిటినిఁ బెఱికించి స్వాధీనము చేసికొనఁ దలఁచి యట్టి పనికి మొనగాఁడగు 'నుదయరాజు' అను తుంటరి నాయకుని నియోగించెను. ఆ కటికగుండె గల తులువ ముక్కు చేతులు కాళ్ళు లేక దిగంబరులై తిరుగు క్షుద్ర భిక్షుకులను రావించి మొదట వారిచే దేవతా ప్రతిమల యాకృతి సౌభాగ్యమును బాడు చేయుటకై వానిపై నీచాతినీచముగ మల మూత్రాదుల వేయించెను.

ఆ క్రూర కృత్యమును జరిపిన తఱువాత నాకిరాతుఁ డుదయరాజు బంగరు వెండి లోహములతో నిర్మింపఁబడిన యా దేవతా ప్రతిమల నన్నిటినిఁ గొల్లఁగొట్టించి కసవు కట్టెలు దీసికొని పోవు నట్లు వానిని బండ్ల మీఁద వేయించి కోశాగారములకుఁ జేర్పించెను. ఆ ప్రతిమల నూడఁ బెఱికించుటకై ముందుఁ దెల్పిన వికలాంగులు తుచ్ఛులు నగు దిగంబర భిక్షుకులను గూర్చి వారిచే నాపని గావించెను. ఆపాపిష్ఠులు దేవతా ప్రతిమల కాళ్ళ చీలమండెలకుఁ ద్రాళ్ళు కట్టి వానినిఁ బడఁద్రోసి థూత్కార కుసుములచే (ఉమ్మెత్తపూలచే) వానినిఁ గప్పిరి.

ఈరీతినిఁ బ్రతిగ్రామమునందును బురమునందును దేవతా మూర్తులఁ గూలఁద్రోయించి కొల్లగొట్టిన యాహర్షుఁడు ఎంతటి నికృష్టుఁ డని యనవలెనో తెలియదు. అంతటి విద్యావంతుఁ డింతటి నీచతమ ప్రవర్తనముతో వర్ణింపరాని పచ్చి తురుష్కుఁడుగాఁ గ్రూర రాక్షసుఁడుగా నగుటకు నతనిఁ బట్టుకొన్న దౌర్భాగ్య దేవతయే కారణ మనవలయును.

ఇట్లు దేవతా ప్రతిమా నిర్మూలన క్రియ జరిపించినపుడు, ఎట్లో ఏ దైవ ప్రేరణమువనో శ్రీనగరియందలి మహాప్రభావోపేతుఁ డగు రణస్వామి ప్రతిమ యొకటి మఱియొక పట్టణమున మార్తాండస్వామి ప్రతికృతి యొకటియుఁ గాపాడఁబడినవి.

మఱియు హర్షుని జన్మభూమి యగు పరిహాసపురమునందలి మహాప్రతిమల మంధ్యము నందున్న బౌద్ధ ప్రతిమలు రెండు మాత్రము సురక్షితము లయ్యెను. హర్షుఁడు దైవికముగ నొకప్పుడు త్యాగ ధర్మమునఁ బొల్గొని యుంధఁగా గాయకుఁ డగు 'కనకుఁడు' మఱియొక శ్రమణుఁడును హర్షునిఁ

గీ॥ సారసాక్షుల కోప ప్రసాదములను
హయ గజాదుల వృత్తాంత మారయుటను
అనుచరులతోడి మృగయా విహారములను
నృపులు కాలంబు శిశువుల ట్లపనయింత్రు

గీ॥ ఆసన విలాస హాసాదులందు, దాన
యానపానాదులందు ఛాయవలెఁ గుపతు
లనుసరింతురు పరుల నన్యాయ వృత్తి.
ధర్మము నధర్మమును సుంత దలఁప రకట.

చం॥ తన నెడఁ బాయనట్టి విట
తండము "నీవమరేశ్వరుండ వం"
చనిశము సంస్తుతింప నిజ
మంచును నమ్మి "తృతీయ నేత్రమున్
ఘనములు నాల్గు బాహువులు
గల్గెడు నా" కని యుబ్బుచుండుఁ గా
ని నృపుఁడు పైఁ బయిన్ గవియు
నిత్యపు మృత్యువు నెంచఁ డక్కటా!

ఆ. వె. రాత్రులందు నెల్ల రాణులు దినమందు
సచివవరులు రాష్ట్రి సంపదలకు
నధికృతులు గ నుండ నౌ రౌర! 'ప్రభువుల'
మంచు నృపులు భ్రాంతు లౌచునుంద్రు.

గీ॥ "స్వాదు విది" యన్న భక్షించు 'స్వాదు వనుచు;
'ధూ' "ఇదేమిట్టి" దన్నఁ దా ధూత్కరించు.
భీతి గల్గింప వెంటనే బెంగపడును.
బాలునకు సాటి యిట్టి భూపాలుఁ డుర్వి.

హర్షుఁ డింతటి వాఁడయ్యె నన నింకఁ జెప్పవలసిన దేమున్నది? ఎంతటి చదువరి! ఎంతటి మేధావి! ఎన్నిభాషల యందుఁ బండితుఁడు! ఔరా! అట్టి వానికిట్టి గతి పట్టుట దలంచినచో వాని యెడ దైవమెంత పెడమోము పెట్టిన దనవలెను? సామాన్య నరపతులకుఁ బైఁ దెల్పిన దుర్లక్షణము లుండును. ఇప్పుడు వారి యందటి జాడ్యమొక్క మాఱుగా మూర్తీభవించి హర్షునిపై నావేశించిన దనవలసి వచ్చెను. మఱియు నతనికిఁ గామదేవత పూనినది. ఆ పూనికచే నతఁడు పిచ్చివాఁడన నుండెను.

ఈ సందర్భమునఁ జెప్పదగినదున్నది. గర్ణాటదేశపు రాజు 'పార్మండి' అను వాని భార్య చందల యనునామె అమె మిగుల నందగత్తె. విటులామె చిత్తరువును రచించి హర్షునకుఁ జూపి యామె సౌందర్యము వర్ణించిరి. యా సుందరాంగిపై నతనికి మరులు పుట్టించిరి. అందువలనఁ జందల నెట్టులేనియు స్వాయత్తపఱచు కొనవలయుననియు, అందుకు 'పార్మండి' యొప్పుకొనకున్నచో నతనిని రాజ్యభ్రష్టునిఁ జేయవలయుననియు హర్షుని డెందమున దుర్ణయము పొడుకొన్నది. ఆ దుర్మోహముచేఁ బిచ్చివానివలె నతఁడు సభయందును నట్టి కలవరింతలతో విటుల ప్రోత్సాహముతో సిగ్గుమాలినమాటలు ప్రేలుచు వినువారికి రోఁత పుట్టింపఁ దొడఁగెను. వానికిఁ దగినట్లు విటులు తాళమువేయుచు జడమతియైపోయిన యా వేని శ్వానము నుసికొల్పినట్లు ప్రేరించుచు దుర్ణయపాశమునఁ బడి తన్నుకొనునట్లు కావించిరి.

సభయందును హర్షుఁడు విటప్రే[illegible]డై అపత్రపారహితుఁడై "చందలను బొందవలెను. అందుకు విముఖుఁడైనచో 'పార్మండిని' రాజ్యభ్రష్టునిఁ గావించెదను. ఇదే నా ప్రతిజ్ఞ. అపరిపక్వమైన కర్పూరమును వెలిగించి యానందించువాఁడనుగాను." అనుచుఁ బిచ్చి పిచ్చి ప్రతినలు సభయందొనర్చెను. ఆ ప్రతినలను గవి చారణులు పార్మండి నుద్దేశించి స్తుతించుమిషతో సహేళనముగ నర్మ గర్భవచనముల హర్షుని పై విసరుచు నిట్లు చమత్కరించిరి.

"ఓపార్మండీ! మారాజ పక్త్రిమమగు కర్పూరము నొల్లఁడు. నీవు భాషావేషవిశేషములచే దాక్షిణాత్య పాంథుఁడవు గదా! నీ హస్తగతమైయున్న కర్పూర కోలము వాసనను బట్టియే నిర్ణయముగ జ్ఞాత మయినది. అది నిజముగఁ బక్వమైన దైననే మారాజునకు సమర్పింపుము. లేకున్నచో నీ నారికేళ పహారమునందే నిలుపుకొనుము. మఱియు వినుము. మా హర్షదేవుఁడు కర్ణాట వసుంధరాధిపు వధ సేయక, కళ్యాణ పురప్రవేశ మొనర్పక, పిప్పలాదేవి దర్శనము గావింపక, చందనాలింగన సౌఖ్య మనుభవింపక, కర్ణాటరాజ పాలిత మైన యావద్భూభాగము నాక్రమింపక "పోకాన" చర్వణము గావింప నని పూర్ణ ప్రతిజ్ఞఁ బూని యున్నాఁడు. అని కవిచారణులు 'పారమండి' ప్రభువునకు వెల్లడించి హర్షుని నొడలు దెలియని మోహ వార్ధిలో ముంచివేసిరి.

ఇట్టి తరుణమున 'మదనుఁడు' అను ధూర్త విటుఁడు రాజునకు మరుల మందుఁ బెట్టి పిచ్చి వానినిగాఁ దయారుచేసిన మొనగాఁడై యుండెను. అతఁడు కంపనాపతి యయినను నిపుడు చిత్రార్పితాకృతి[illegible]గు నాచందలను జూపించుటచే నంతఃపురాధికారి పదవినిఁ బొందెను. అతఁ డాపదవి నొంది యుపరోధ కాంతల వస్త్రాలంకరణాదులకై వారి యీర్ష్యాపనోదనమునకై లెక్కలేనంత ద్రవ్యమును గైకొనుచుఁ దన యిచ్చ వచ్చినట్లు మెలఁగఁ జొచ్చెను. మదనుఁడు సిగ్గులేని విటుఁడు వాని కథ యిట్టిది. వాని చర్య రాజుయొక్క మౌర్ఖ్యమునకుఁ జెడ్డతనమునకు గీటు టాయి యయినది.

మఱియొక విచిత్రము గలదు. ఆ మదనుఁడు తనకు సహాయపడు నట్టి విటుల మూలమున నొక వృద్ధాంగనను నెటనుండియో దెప్పించి హర్షుని కామెను జూపి "ఇదిగో యీయమ్మ మీతల్లిగారు. స్వర్గమునుండి నిన్నుఁ జూడవచ్చినది." అని చెప్పి మఱి కొందఱను వృద్ధాంగనలను జూపించి వీరు మీ తల్లిగారి దాసీజనము." అనుచుఁ జెప్పఁగా అ మతి చెడ్డ హర్షుడు వారి మాటలను నమ్మి యాతల్లికి

నమస్కారముల నొనర్చెను. తన యున్నతినిఁ గోల్పోయి యట్టి వెల్ల నమ్మి వారాడించిన ట్లాడుచు వారిచేతి కీలుబొమ్మగా మెలఁగుచున్న యతని జీవిత మట్లు పరిహాస పాత్రమై పోయెను. మఱియు నతఁ డాదాసీ జనము వలపులోఁ బడి మెలఁగుచుఁ జిరకాలము బ్రతుకఁ గోరి "అనేక శతాబ్దులు నీవు జీవింతువు" అనుచు వారు పల్కు మాటలను సత్యాశీస్సులుగాఁ దలపోసెను.

ఇది యిట్లుండ 'డోంబుడుఁ' ఒక్కఁడు "పిండసిద్ధి కారి యగు పేయ" మిది యని పల్కుచుఁ గొండొక పేయమును రసాయనముగా నొసఁగుటయు నద్దాని నతఁడు సేవించి నేనిఁక జరా మరణ వర్జితుఁడ నగుదు నన్న మూఢ విశ్వాసమును బొందుటయుఁ దటస్థించెను. ఇట్టి చేష్ట లెన్నెన్నో విటుల యుపదేశములవలన నతఁడు వినష్ట బుద్ధియై యొనర్చుచు ధనము నిట్లు నీచ క్రియలకై వ్యయపఱచుచుఁ దన యాయువునుగూడ లోపింపఁజేసికొన సాగెను.

హర్షమహీపతి యి ట్లంధ తామిస్రమున మునిఁగి గ్రుడ్డివాని తెఱంగున దిక్కు గానక యెల్లప్పుడు రాత్రులందు స్వయముగా మేల్కొని నర్తకీ జనమునకు నభినయము గఱపుచు రాచఱికపుఁ గార్యములందుఁ బాల్గొన కుండెను. శత్రువు "లెప్పుడెప్పుడు వీనినిఁ దెగటార్తుమా" అని కనిపెట్టుకొని యుండిరి. ఒకనాటి రాత్రి యతఁడు నాట్య శిక్ష స్త్రీలకుఁ గఱపుచుండఁగా దివ్వెల వెలుఁగు దేదీప్యమానముగ నుండెను. ఈ హర్షుని తన్మయత్వమును గమనించి శత్రువులు కొంద ఱితనిపై మాటు వెట్టుకొని దూరమునుండి శరములను వర్షించిరి. కాని యితని యాయుశ్శేషము మిక్కిలి గట్టిది. కావుననే పగతుర యంప గమి వీనిని సంహరింపలేదుగదా! ఇతని శరీరమును సుంతేని వ్రణితము గావింపనులేదు. అట్లగుటకుఁ గారణ మానాటి ప్రజల పాపమే గానోపునేమో!

తఱువాత నితని శుద్ధాంత మందిరములందు రాజ్యతంత్రము నడపుచున్న ధూర్తులకుఁ బెక్కండ్రకుఁ జొరవ దొరకినది. వారు శుద్ధాంత కాంతలతో రమింప సాగిరి. ఆ విషయము వెలిఁగి హర్షుఁడు వారిని శిక్షించెను. కాని కొందఱు ధూర్తులు కులటలగు నంతఃపురాంగనల నపహరించికొని దేశాంతరముల కేగిరి.

ఇంక హర్షుఁడును గేవల మున్మాదియై త్రపా భయములను దవ్వులకుఁ బాఱఁదోలి వరుసగాని యాత్మ బంధువు లగు నంగనలను గూడి కామ తంత్రము నడుపఁ గడఁగెను. తుద కింత నీచుఁ డుఁగా నితఁడు మాఱె నని చెప్పవలసినందుకుఁ జింతిల్లవలసి యున్నది. ఇంతటి హీనమగు పశు ధర్మ చరిత్రము భవిష్యత్కాలపుఁ బ్రజ నమ్మక పోవచ్చును. మేఘవాహనాదుల మానవాతీతము లగు మహోదార పవిత్ర కార్యములను సైతము ప్రజలు శంకించునట్లు హర్షుని రాక్షస దురాచార దుర్గతులను విశ్వసింపరేమో యని భావింపవలెను. ఏమైన నేమి? జరిగిన మంచి చెడ్డలను బయలు పఱుప కుండుట చరిత్ర రచయితల ధర్మము గాదు. హర్షుఁడు నీచ కృత్యములందుఁ దండ్రియగు కలశునకుఁ దగిన కొమరుఁ డయ్యెను. ప్రజలు "వీని యున్మూలన మెప్పు డౌనా!" యని యెదురు చూచుచుండిరి. చివర కితఁడు తురుష్కులను లెస్సగాఁ బోషించుచు బలసిన యూరఁబందుల మాంసమును బ్రతికినంత కాలమును దినువాఁ డయ్యెనని చెప్పవలసినందుకు డెందము కుందుచున్నది.

ఇట్లుండ మందబుద్ధి యయి పోయిన యీరాజు సేవా సంబంధమును నెపముఁ జేసికొని రాజపురినిఁ బాలించు రాజుపై దండెత్తెను. ఈ దండయాత్రయందుఁ బాల్గొనిన సైన్యము మహా ప్రవాహము తీరున నుండెను. "ముల్లోకములను జయించుట కైన సన్నాహమా యిది" యని యితర రాజులు భావింపఁ దొడఁగిరి. ఇట్లు బయలుదేరి మొదట పృథ్వీగిరి దుర్గమును జూచి రాజపురినిఁ బ్రవేశించుట మాని యాగిరి దుర్గమును స్వాయత్తము చేసికొన నభిలషించిన వాఁడై యపరిమిత మగు తన వాహిని ముందు దుర్గమును ముట్టడించున ట్లానతి యొసఁగెను. సేనా వాహిని దుర్గము చుట్టును ముట్టడించి నెలదినములకుఁ బైగా నట్లే దుర్గములోని వారినిఁ గదల నీయక చెఱయం దుంచిన ట్లొనర్చెను. దుర్గ రక్షకు లాహార పానీయముల కొఱంతచే నల్లాడుచుండిరి అంతట దుర్గాధిపతి యగు సంగ్రామపాలుఁడు భీతిల్లి దుర్గ రక్షకులను గాపాడఁ దలంచి హర్షభూపతి కోరినట్టి విధాన మేదైనను నంగీకరించి కప్పము మున్నగు నది చెల్లించి యతనిని సంతోషపెట్టుటకుఁ బ్రయత్నించెను. కాని, బలసంపన్నుఁడై యున్న హర్షుఁడు సంగ్రామపాలుని విన్నపము నెంతమాత్ర మంగీకరింపక తనపట్టును వీడకయుండెను.

ఇట్టి స్థితిలో సంగ్రామపాలుఁడు హర్షభూపతియొక్క దండనాయకుఁడు ధనలుబ్ధుఁ డని గుర్తించి యతనికి నధికముగ లంచము నొసఁగెను. అంతటితో నాయకుఁ డొక పన్నుగడ నాలోచించి రహస్యముగ శస్త్రధరులతో "మీరు ప్రవాసమున బడి యెన్నాళ్ళింకను నిట్లు గాసి నొందెదరు? తుదకుఁ బ్రవాసమునకుఁ దగినట్టి వేతనమైనను నీతఁ డిచ్చుటలేదు. అధికమైన ప్రవాసపు బత్తెము నిమ్మని రాష్ట్రపతి నర్థింపుఁడు." అని వారినిఁ బురికొల్పెను. వారును నట్లే హర్షమహీపతినిఁ బట్టుదలతో నర్థించిరి. అంతమాత్రమే కాదు. ఆ శస్త్రధరు లెల్లరు నందుకై నిరాహార దీక్షఁ బూని హర్షునుపాలంభ మొనర్ప సాగిరి. హర్షుఁడు లోలోన విసుగు నొంది తాను వారి కోర్కెఁ దీర్పనెంచెను. కాని ధనాగార మచ్చటికి సుదూరమున నుండెను. అట్లయ్యును నాతఁ డెట్లో వలసిన ధనరాశినిఁ దెప్పించి వారి కాంక్ష దీర్ప సంసిద్ధుఁ డయ్యెను.

అంత దండనాయకుఁడు తన లంచగొండితనము బయల్పడు నేమో యని యెంచి మఱియొక కపటోపాయ మాలోచించి రాజుతో "దేవా! తురుష్కుల దండు సమయము గనిపెట్టి మనపై నిప్పుడు కవియనున్నది." అని యనుచు నేవేవో బిభీషికలు కొన్ని పలికెను. అందువలన హర్షుఁ డించుక లోనఁ గలఁత నొంది యిప్పు డదను గాదని యెంచుచుఁ దన సైన్య సమూహము నంతను బ్రధాననగరికి మరలింప ననుజ్ఞ నొసఁగెను. తాను దెప్పించిన ధనరాశి యంతయు మార్గ మధ్యమునఁ బెక్కు రీతుల వ్యర్థముగ వ్యయపఱుపవలసి వచ్చెను. లంచగొండి యగువానికి దండనాయక పదవి నిచ్చుటవలన నింత పుట్టెను.

కం॥ అపరీక్షితుఁ డగు భృత్యుని
నృపుండు తన కొలువునందు నిల్పం దగ. ద
య్యపరీక్షితుం డజాత్యము
కృపాణమ ట్లాహవమునఁ గీ డొనరించున్.

గీ॥ అశ్వ శాలను నీచ హయంబు చేరి
శ్రేష్ఠముల వారువంబులఁ జెఱచురీతిఁ
దులువ యధికారి యైనచో దుండగములఁ
జేయు చితరుల సుజనులఁ జెఱచి వేయు.

ప్రకృతమున దండనాయకుఁ డట్టివాఁడై సైనికుల చిత్తములను జెఱచి రాజ ద్రోహ మొన ర్చెను. అది మొదలుకొని ప్రతాప చక్రవర్తి యని పేర్వడసిన హర్షుని కీర్తి నల్లకప్పు వేసి నాణెమును గోల్పోయినది. ఇట్లుండఁ గందర్పుఁడు అను శూరశిఖామణి, రాజును అతని మహావాహినియు సాధింప లేక తిరుగుడుపడి మరలి వచ్చుటచే నపకీర్తి కరముగ నిలిచి పోయిన యావీర కృత్యమును దా నొక్కఁడే సాధించి విజయమును బొంది యుండెను. అట్టి సంగతి విని హర్షుఁడు కందర్పుని మనంబున మిగుల బహుమానించుచు నతనినిఁ దనకడకుఁ బిలిపింపఁ దలఁచెను. కాని, తులువ యగు దండనాయ కుఁడు కందర్పుఁడు రాజు కడకు వచ్చినచోఁ దనబ్రతుకు బహిర్గత మగు నని యెంచి మతి చెడి యున్న హర్షునకు నేవేవో మాయ మాటలు సెప్పి యతనిని రావింప కుండునట్లు ప్రబోధించెను. హర్షుఁడు మొదట వాని వలలోఁ బడినను నెట్లో కొంత తెలివి తెచ్చుకొని దండనాయకుఁడు రాజద్రోహము మొనర్చె నని నిశ్చయించి యతనిని న్యాయ శాస్త్రానుసారముగ బంధించి తగినట్లు శిక్షించెను. కాని తీవ్ర మైన కోపము నతనిపైఁ బ్రయోగింపలేదు. ఇట్టి నిర్బంధ స్థితియం దుండియుఁ దననైజగుణ మగు లుబ్ధత్వమును విడువలేదు. అతఁడు దుర్గమునందు సందిగ్ధ జీవుఁడై పూర్వ పరిచయము విడువ లేని భృత్యులు బంధువులును దనకుఁబంపెడు వస్త్రములు తాంబూలములు మున్నగు వానిని సంగ్ర హించుకొను చుండెను.

ఇట్లుండ దైవోపహతుఁడు హర్షనరేంద్రుఁడు తన సర్వస్వ నాశమునకుఁ గారకుఁడై వధార్హుఁడై యుండిన యాదండనాధుని బంధవిముక్తునిఁ జేయుటే గాక మరల వాని నాతని స్థానమున నిల్పెను. ఇంతకంటె బుద్ధి లోప మునునది యుండునా?

ఇఁక విట శిఖామణులు రాజును గనిపెట్టుకొని యున్నారుగదా! వారు చాటు వచో ధోరణితోఁ బూర్వము ఘోష యాత్ర వెడలి పరాభవము నొందిన దుర్యోధనునిఁ గర్ణుఁడు మున్నగువా రూరడించిన విధముగ స్తుతించి కొంచె ముల్లాస మొందఁజేసిరి. విద్యాసాగరుఁ డగు హర్షుఁడు విటుల చేతిలోని కీలుబొమ్మగా నిట్లగుట దైవ దుర్విపాక మూలముగదా!

ధూర్తు లయిన వారు తమకు లోఁబడిన వారిని మఱింత మాటలతోడనే బెదరించి తమ కోర్కెలను దీర్చుకొందురు. హర్షుఁ డట్టివాఁడై ధూర్తులకుఁ జిక్కి పోయెను.

గీ॥ వాదమున నోడి పోయిన వదరుఁబోతు
ప్రతిభటునిఁ దిట్టి తన ప్రగల్భతను జూపు.
కులట తన దుశ్చరిత్రను గుప్తపఱుపఁ
బతినిఁ దీంద్రలు పల్కుచుఁ బ్రతిఘటించు.

కం॥ కాయస్థులు రాష్ట్రి ప్రజ
లాయం బొసఁగన్ హరించి యటుపై మాయో
పాయము లెన్నియొ పన్ని య
పాయము దెచ్చెదరు రాష్ట్రపతికిన్ గడకున్.

స్వార్థపండితుఁడగు 'సహేలమహత్తముఁ'డిట్టివాఁడు. ఇతఁడు ప్రజ లొసఁగిన ధనమును నిష్టమువచ్చిన ట్లనుభవించి యది మరల రాజు కోశాగారమునకుఁ జెల్లించుటకుఁ జేతగాక భీతిల్లుచు రాజును దనమాటల చాతుర్యముతో లోఁబఱచుకొని దుర్వ్యసనమునఁ బ్రవేశపెట్టెను. అది యేమన:- "దారదులు గర్వించి యున్నారనియు వారు నిర్మించుకొన్న 'దుర్గఘాతము' అనెడు గొప్ప దుర్గమును వశముచేసి కొనక పోయినచో నుత్తర కాలమున మనకు ముప్పు వచ్చుననియు, అందుకు మన లోహర దుర్గ వాసులు లవన్యులు మనకు సాయపడుదు" రనియు నతఁడు హర్షునికి నచ్చఁబలికి దారదులపై దండయాత్ర సల్పుటకుఁ బురికొల్పెను. ఈ 'దుర్గఘాతము' అను దుర్గము దారదుల వశమై యుండుటకుఁ గల కారణ మిట్లున్నది. పూర్వ మాదుర్గ పాలకుఁ డగు 'లక్కనచంద్రుఁడు' డామరుఁడై యుండెను. వానిని జనకుఁ డనువాఁ డేదో కారణమున సంహరించెను. అప్పుడు లక్కనచంద్రుని సతి యనంతదేవుని భవన ప్రాంగణమునఁ బ్రాయోపవేశ మొనర్చెను. ఆమె ననునయించుచు నాభూపతి యాదుర్గమును దారదుల వశ మొనర్చెను. తఱువాత ననంతభూపతి కొమరుఁడు కలశభూపతి యాదుర్గమునెడ 'మనకెందుకిది' యని యుపేక్షించెను. అందువలన దారదులు దానిని దిట్టపఱచుకొని తమ్మూలమున బలపడి పెక్కు గ్రామములను దమ యధీనములుగాఁ జేసికొని విక్రమించినవారైరి. 'సహేలమహత్తముఁడు అది యాలోచించి హర్షమహీకాంతుని దారదులపై దండయాత్ర సల్పుటకుఁ బురికొల్పెను, అట్టి యాత్రను బ్రధాన మంత్రియు బలపఱచెను.

ఆ దుర్గఘాత మను దుర్గము శత్రువులకుఁ జొరరానిదై యుండెను. అందుఁ గోనేళ్ళు గాని నీటి మడుఁగులు గాని లేకుండెను. అక్కడి దుర్గరక్షకులకు మంచునీరు గొప్ప ఖండములందు నింపి యుండుటయు వారద్దానితో జీవనము గడపుచుండుటయు జరుగుచుండెడిది. ఇట్లుండ నామంచు నీరు గూడ ననావృష్టి దోషముచే దొరకక దుర్గవాసులు మిగులఁ జిక్కు పడుచుండిరి. ఈ రహస్యము గూఢ చారులవలన నెఱిఁగి సహేలకుఁడు ఆదుర్గముపై దండయాత్ర సేయుటకై హర్షపతిని మఱింత ప్రేరేపించెను. అందుకు నృపతియు సమ్మతించి నానావిధ సైన్య సన్నాహముతోడఁ బయలుదేరెను.

ప్రధానమంత్రి చమూపతియు నగు చణ్పకుఁడు రాజు నానతిచేఁ బ్రస్థానమును సాగించుచుండ 'వాతగండుఁడు' అను ద్వారపతి యడ్డగించెను. వానిని రా జాపదవినుండి తొలఁగించి మండలాధిపునిగా నియోగించెను. ఆ వాతగండుఁడు, అచ్చటి యధికారుల కెవరికిని గిట్టనివాఁడు. అంతట సర్వసేనాపతి చణ్పకుఁడు మధుమతి యను నదినిఁ దరించి తన సైన్యముతోడ దుర్గఘాతమునకు నలువైపుల సైన్యమును గేంద్రీకరింపఁజేసి దాని నరికట్టివేసెను. హర్షమహీధవుఁడు తన సామంతరాజుల నందఱు నన్నివైపులఁ గోటను ముట్టడించి యుండఁ బనిచి తాను నొక్క ప్రయాణముచే నాకోటను జేరఁగల దూరమునఁ గొంత పరివారముతో నివసించి యుండెను.

అంతట దుర్గమునం దున్న దరదసైనికులు దుర్జయులై గండశిలలను గాశ్మీరికు లగు సైనికులపై దొర్లించుచుండిరి. అట్టి వారితో నతిసంకటముగఁ గాశ్మీర సేన పోరు సల్పవలసి వచ్చెను. అట్టితఱి 'గుంగుని కొమరుఁడు 'మల్లుఁడు' అనువాఁడు తనయిర్వురు పుత్రులతోడ 'భ్రాజిమతిక' యను క్షేమకర మైన ప్రదేశమున నుండి యీ జరుగుచున్న దుస్సహ మైన పోరాటమును జూచి మిగుల సంభ్రమము నొంద సాగెను. ఆ మల్లుని కుమారులు మహావీరులు. 'ఉచ్చలుఁడు' 'సుస్సలుఁడు' అనఁ బరఁగు వారు. వారి కొకప్పుడు దైవజ్ఞుఁ డొకఁడు "మీకు రాజ్య ప్రాప్తి యోగ మున్నది." అని చెప్పి యుండెను. అట్టి కోర్కె డెందమున నిల్పుకొని యుండి నందున వారు తమ యభిమానమును లెస్సగా నభివృద్ధి పఱచుకొను చుండిరి. వారిరువురియందును బెద్దవాఁడగు నుచ్చలుఁడు ప్రచండుఁడు. అతఁడు నృపాసన మన్న ద్వేషించుచుండెడివాఁడు. అయినను భవిష్యదర్థ మాహాత్మ్యమువలనఁ బ్రస్తుతపు యుద్ధ యాత్రయందుఁ బాల్గొనినవాఁ డయ్యెను.

దారద యోధు లవగ్రహ దోషముచేతను భూపాలుని ప్రతాపాగ్ని చేతను మిక్కిలి శోషితులై యుండియు నెట్టెట్టులో మిక్కిలి కష్టముతో దుర్గమును గాపాడుకొనుచుండిరి. అట్టితఱి నాశ్చర్యకరముగ విధి విధాన మహిమచేఁ గుండపోఁతగ మహావృష్టి పొసఁగినది. జలప్రవాహము నేల మిట్ట పల్లము లనునది గాన్పింప కుండున ట్లంతటను నిండి పోయెను. ఇట్టి జడివాన హర్షుని ప్రతాపాగ్నినిఁ జల్లార్చి దారదుల భాగ్య రేఖను బెంచుట కేర్పడిన ట్లుండెను. నీటి కొఱంతతోఁ గొట్టుకొని చీకుచున్న దరదసైన్య మిప్పుడు సురక్షితమై యుప్పొంగ సాగెను. దారదుల యనుకూల దైవము వారికి నంతగాఁ దోడ్పడి దుర్గ శృంగము నంతను దుర్భేద్యమగు హిమముతో నింపివేసెను.

గీ॥ క్రిందఁ బడు వారి నున్నతి నొందఁ జేసి
యున్నతిం బొందు వారికి మన్నుఁ జూపి
కందుక క్రీడ సల్పు చమందముగను
దన విలాసంబుఁ జూపును దైవ మౌరః

హర్షుని సైన్యమునకు వాన దెబ్బవలన మహా సంకట స్థితి సంభవించినది. దుష్టు లగు మంత్రులు తమతమ గృహములను దలఁచుకొనుచు స్కంధావారమునందు మున్నొకసారి జరిపించి నట్టులే మరల భేదభావమును బుట్టించిరి. అంతట హర్షుఁడును జేయునది లేక విజయ పరాఙ్ముఖుఁడై ప్రవాహమున కెదురీఁదు తిమి కొండయందలి శిలా ఘాతముచే వెనుదిరిగి పోవునట్లు తిరుగు మొగము పెట్టి పయనము సాగించెను. అచ్చోటఁ గేంద్రీకరింపఁజేసిన సైనికు లందఱు నెక్కడివా రక్కడ సంగళ్ళు విడిచిపెట్టి ధనాగారములను లెక్క సేయక తమ సర్వస్వమును విడిచి పుచ్చి యాయుధము లను బాఱవైచి పిక్కబలముఁ జూపుచుఁ బలాయనమును సాగించిరి. అట్లు వా రాక్రందము నొనర్చుచుఁ బరువు గోల్పోయి పరు వెత్తుచుండఁగా శత్రు సైనికులు యమ దూతలవలె వారిని వెన్నంటిరి. ఆ కారణమున హర్షుని సేనా వాహిని కూలంకషముగాఁ బ్రవహించుచున్న మధుమతి యను మహానది పాలయ్యెను. ఆ నది లో నసంఖ్యాకులుఁగా బడిపోయిన సైనికుల వస్త్రములు హంస సమూహమువలె

నొప్పారెను. నదియందుఁ గొట్టుకొనుచున్న శవములు పద్మపుంజమువలె నలరారెను. ఖడ్గములు శైవాలమువలె విలసిల్లెను. కొట్టుకొని పోయెడు గుఱ్ఱములు గండశిలలుగాఁ గన్పట్టెను. బంగారు పాత్రలు రథాంగముల తీరున నుండెను. వెండిపాత్రలు డిండీర పిండములుగా భాసిల్లెను. మధుమతీ నది యింత వింతగా విభ్రాంతినిఁ గొల్పుచు భయానక దృశ్యమై యత్తఱిఁ గానవచ్చెను.

అమ్మహోత్పాతమున దారదులచేఁ బట్టు వడిన వారును నదిలోఁ గొట్టుకొని పోయినవారును రణ నిహతులైన వారును నెందఱో! తెలిసికొన నలవి కాదయ్యెను. అంత సంఖ్యాతీత మయిన సైన్యముతో దండయాత్ర సల్పి యిట్టి హీనమైన స్థితి నొందిన హర్షుని దుర్దైవము నేమనవలయునో గదా!

హర్షుని సైన్య మంతయు నట్టి యనాథస్థితి నొంది వికావికలై పోవుచుండ నా సమయమున మల్లుని కొమరుఁడు ఉచ్చలుఁ డొక్కరుఁడు మాత్రము తమ్ముఁడొక్కఁడే సహాయుఁడై యుండ ధీరుఁడై దారదుల నెదుర్కొనుచు నిలువరించి యుండెను. ఆ సమయమున దారదుల సైన్య మనెడు సాగరము ప్రపంచము నాక్రమింప నుప్పొంగిన దో యన్నట్లుండెను. ఉచ్చల సుస్సలు లిర్వురు నా సేనా సముద్రపు టుప్పొంగును స్తంభింపఁ జేయు వేలా శైలేంద్రములవలె నరికట్టి నిలిచి యుండిరి. ఆ మహా సంకట సమయమున వారిర్వురును దమ బలమును గాపాడి సాటిలేని ప్రఖ్యాతి గడించిరి. వారియెడఁ జూపట్టు తేజమును మెచ్చుకొనుచు రాజ్యశ్రీ పతింవరవలె వారియెడ ననురక్తిఁ జూపుచు వారియందు స్థానము సంపాదించుకొన్నదివోలెఁ గన్పట్టెను. వారట లేకున్నచో నప్పుడు హర్షుని గతి యేమై యుండెడిదో!

ఇంక, నదిమొదలుకొని సమస్త ప్రజకును "దేశాభిమాన విరాజమాను లగు నీవీరులే రాజ్యార్హులు. హర్షుఁడు వట్టి నపుంసకుఁడు భూపతిగా నెంత మాత్ర ముండఁదగిన వాఁడు గాఁడు" అని లోక వాద మొకటి విజృంభించెను. ఉచ్చల సుస్సలులు సోదరు లిర్వురును నంతటి క్లిష్ట స్థితినిఁ దప్పించి శౌర్య రమ నుద్దీపింపఁజేసి విజయమును సాధించిన వారయ్యును హర్షుని కడకుఁ బోవుట గాని యతనిచే విజయబహుమతులను బడయుటగాని యొల్లక గంభీర హృదయులై యుపేక్షించి యుండిరి. ప్రజా సముదయముయొక్క యంతరంగములయందు మాత్రము వారి సముచిత చర్య సుప్రతిష్ఠితమై రాణించినది.

అనంతరము హర్షభూపతి శత్రువులవలనఁ గలిగిన మహాసంకట మారీతినిఁ దొలఁగి పోఁగాఁ దిన్నగా రాజధాని యగు శ్రీనగరియందుఁ బ్రవేశించెను. మల్లరాజు పుత్రు లగు నుచ్చల సుస్సలుల ప్రతాప భానుని వెలుఁగు దిశలెల్ల నిండుకొనెను. ప్రజ లందఱును ముక్తకంఠముగ "నీరాజపుత్రులు రామలక్ష్మణులనియు రాజగు హర్షుఁడు రావణుఁడనియుఁ బదింబదిగ వాకొనసాగిరి. ఈ జనవాదము భావ్యర్థమునకు ననుగుణ మగు సూచక మనఁదగి యుండెను. హర్షుఁడు మాత్రము తనచేఁతగానితనమునకు నించుక సిగ్గైన నొందక ప్రజాపీడనము నిత్య కృత్యముగాఁ బాటించుచు జడునిచందమున వ్యవహరింపసాగెను.

ఉ॥ చెంత వసించు నల్పు రిపుఁ
  జెండును దుర్మతి. దవ్వునందు నెం
తెంతొ మహోపకార మొన
  రించెడు వైరి నుపేక్ష సేయుఁ. దా
నంతికమందుఁ బద్ధ శిల
  నట్టె పటుక్కనఁ బంట నొక్కుచున్
గంతులు వేసి మొగ్గు భష
  కం; బది రువ్విన వాని దాఁకునే?

హర్షు చర్య లీతీరున నుండెను. అటుపిమ్మట మున్ను సేవా విశేషముచేఁ బేరు సంపాదించి హర్షుని మది నాకర్షించి కంపనాధిపతియై యుండిన మదనుఁడు, అనువాఁడు దారదులతో జరిగిన యిప్పటి మహాసంగరమునందు నిలువలేక భంగపాటుతోఁ బలాయితుఁడై చమూ నివహము లదవదలై పోవుటకుఁ గారకుఁ డగుట దెలిసికొని హర్షుఁడు తనపరువు గాపాడు కొనుటకై వానిపైఁ దీవ్ర మైన కినుకఁ బూనెను. అందుకుఁ దోడుగా నతఁడు రాణిగారు విధించిన యాజ్ఞ నొకదానిని నిర్వర్తింపక పోయె నన్న రెండవ నేరమును సైతము ముడిపెట్టుకొని యతనికి మరణశిక్ష విధింపబూని యుండెను.

ఇట్లుండ మదనుఁడు మడవ రాజ్యమునుండి వచ్చి హర్షుని దర్శించి యతని యాశయమును ముఖమునం దావేశించిన క్రోధ చిహ్నములతోఁ గనిపెట్టి భయ భ్రాంతుఁడై 'లక్ష్మీధరుఁ'డను మఱొక యమాత్యుని చెంతఁ జేరి తనసంగతి చెప్పుకొనెను. అతఁడును రాజును బ్రసన్నునిఁ జేయఁదగిన రీతిని బెక్కు తెఱఁగులఁ బ్రయత్నించెను. కాని, యాతఁడు చిఱునగవుఁ జూపుచునే బదు లేమియుఁ బల్కక మదనుని నతని కొమరునిఁ గఱకుదెండముతో నురిఁ దీయించెను. క్రూరుఁ డగు వాని కోప స్మితమువలనఁ గల్గు ఫలము హానియే యని తెలియుచున్నది.

గీ॥ కోప గర్భిత మైనట్టి కుత్సిత స్మి
తం, బకాలంబునన్ భూరుహంబునందుఁ
బుట్టు పూవులు, బేతాళు నట్టహాస
మును ఫలం బీక కష్టములను ఘటించు.

చం॥ చన వది యెంత యున్న నృపు
  సన్నిధి నేమఱి యుండ నొవ్వ. దా
చన వొక వేళ మృత్యు వయి
  చంపు. నదెట్లన? మాంత్రికుండు పా
మును మెడయందుఁ జుట్టుకొని
  ముచ్చటఁ జూపును. మంత్రశక్తి ద
ప్పిన నది వాని బ్రాణములు
  పీల్చుఁగదా! పవనాశి కావుటన్.

ఈ సందర్భమును బట్టి పూర్వము సూర్యమతీదేవి వితస్తాంబువును దోయిలించి విడుచుచు నతిరూక్షముగఁ బల్కిన శాప వాక్కు కర్ణేజపు లైన (కొండెములు పల్కువారైన) మదనావధిక లగు దండగింద్ర నందఅను దుడిచిపెట్టె నని యెఱుకపడుచున్నది.

పిమ్మట రాష్ట్రపతి హర్షుఁడు మహాపాపియై కావించిన రాక్షస కృత్యము లెన్నో గలవు. అందుఁ గొన్ని సంగ్రహించి యతని క్రౌర్య గుణ మిట్టి దని విచారింపవలసి యున్నవి. 'కలశరాజు' అను నతఁడు మహా పరాక్రమ శాలి తేజో విరాజమానుఁడు. అతఁడు తనకు ననుకూలుఁ డైన యోధుఁడు. అయినను నసూయా గ్రస్తుఁ డగు హర్షుఁడు వానిని లక్ష్మీధర మంత్రి భవనమున నేదో నెపము పెట్టి బంధించి యుంచెను. ఆ కమూర్తమె కాక యతని యెడ విరోధ భావమున మెలఁగు 'సుదయనుఁడు' అనువానిని "ఆ కలశరాజు నేరమును జక్కఁగాఁ బరిశీలించి యతని యున్నతి నణఁచి వేయుము." అని పరహాస్యముగఁ జెవి నూఁది పంపెను. అయ్యుదయనుఁడును నధికాటోపముతో వచ్చి లక్ష్మీధరు నింట సహజ మూర్తిమత్త్వముతో భాసమానుఁ డగు చున్న కలశరాజును జూచి యోర్వలేక మండిపడి తటాలున నొకనిచేత నున్న ఖడ్గమును దీసికొని యతనిపై విసరికొట్టి యతని యసువులఁ బాపెను. పిమ్మట నతని భృత్యులును, నాకలశరాజుపైఁ బడి కత్తులతోఁ బొడిచి యన్యాయముగ నతని ప్రాణములు దీసిరి. హర్షుఁ డీరీతిఁ జూపోపమితోఁ దనయెడ రాజభక్తితో మెలఁగుచు యోగ్యు లయి యుండిన వీరులను జంపించిన మహాక్రూరుఁ డయ్యెను.

ఈ విధముగ ఘోరమగు రాజదండము పాలయియున్న కాశ్మీరమండలమున గాయము నందు సుప్పు కారములను జల్లిన విధమున నితరము లగు పెక్కు ముప్పు లుప్పతిల్లి ప్రజానికరమును దుఃఖ సాగరమున ముంచివేసెను. వానిలో బందిపోటు దొంగల పోటొకటి. ఆ మొనగాండ్రగు చోరులు పగటియందే రాజ ప్రసాదమునందలి స్వర్ణపాత్రముల హరింపజాలి యుండి రన నింక నా క్రూరులు ప్రజల నెట్టి కష్టములఁ పా లొనర్చి యుందురోః యేమని యా విషయమును వర్ణింపనగునో తెలియదు. ఇట్టి సంకట సమయమున భయంకరమగు 'మరకము' (ప్లేగు) అను నంటు వ్యాధి వ్యాపించి మారి మసఁగినట్లు ప్రజల జీవితము నాహుతి గొని నదయ్యెను. అప్పటి ప్రజల యాక్రంద ధ్వనులును ప్రేత వాద్యముల మ్రోఁతయు రేల్పవళ్ళు నెడతెగక నల్గడ నిండిపోయెను

మఱియు 4175. లౌకిక యుగ సంవత్సరమున (క్రీ. శ. 1099 - 1100) గ్రామము లన్నియు నీటి వరదలలోఁ దేలి యాడినవి. అందువలనఁ బంటలన్నియు బూర్తిగఁ బాడయి పోయినవి. క్షామము ప్రబలముగ విజృంభించినది. ఒకపుట్టి ధాన్యపు వెల యయిదు వందల దీన్నారము లయ్యెను. ద్రాక్ష పంటకు నెలవయిన యీ కాశ్మీరమండలమున రెండు పలముల ద్రాక్ష రసము వెల యొక దీనారముగాఁ బెఱిగెను. ఆఱు దీనారముల కొక పలము 'ఉన్ని' తూచి యిచ్చుట సంభవించెను. మఱియు నుప్పు మిరియములు నింగువయు మున్నగు సంభారపుఁ బేర్లు గూడ వినరావయ్యెను. ఇంకేమి చెప్పవలయునుః నదీ జలమునందు నాని యుబ్బిపోయి కొట్టుకొని పోవుచుండెడి పీనుఁగులు కొండలనుండి కూలిపడి నీట సగము మునిఁగి పోయి కొట్టుకొని పోయెడి మ్రాఁకులవలెఁ గనవయ్యెను.

ఇట్టి సంకట కాలమున మండగపుఁ బిచ్చి తలకెక్కి తాఱుమా అగుచుండిన హర్షుఁడు "తన రాజధాని, వనములందుఁ బెంపొంది యాకసము నంటుచుండిన వృక్ష సముదాయమువలన దూరమునకుఁ గానవచ్చుట లేదు." అని వనరాజి నంతయు నేలపాలగునట్లు నఱికి వేయించెను. పూచి కన్నుల పండుగగా నుండిన యా లతా వృక్ష రాజము లన్నియు నేలఁ గూలిన గేస్తుల సముదాయమువలెఁ గానవచ్చెను. వానియందలి పూల మకరందము నాసించి భ్రమించుచు ఝంకారముల నల్పుచుండిన తుమ్మెద కుటుంబముల ధ్వని యేడ్పు పెడబొబ్బలుగా మాటిమాటికి వినవయ్యెను,

ఇంతటి విషాదస్థితియం దున్న ప్రజానీకముపై "గోరుచుట్టుపై రోఁకటిపో" టన్నట్లుగా హర్షుఁడు ప్రాణాపహారి యగు మహాదండము (ఎక్కువపన్ను) విధించెను. నాఁగేటి భారమునే మోయ లేకున్నట్టి ముదుసలియెద్దుపైఁ బెనుబండ నొకదాని నుంచినట్లయ్యెను. అందువలనఁ గాయస్థులు గొప్ప యుత్సాహముతోఁ బ్రభునాజ్ఞను నూటికి నూఱు పాళ్ళకంటె నధికముగాఁ బ్రజలపై నమలు జరుపుచుఁ బీడించి పీల్చి తుదకు రాష్ట్రమునందు మృత్తిక గూడ లేనట్లు ప్రజా ద్రవ్యమును గొల్లగొట్టిరి.

ఇట్టితఱి డామరులు కొంత పెంపొంది దిట్టపడి హర్షుని నెదిరించువారై యుండిరి. అందువలన రాజగు హర్షుని కను వారి ప్రక్కకు మఱలెను. వారిపెంపు సహింపలేక క్రూరుఁ డగు హర్షుఁ డా డామరుల నెల్ల హతమార్పఁ బూని మండలేశ్వరునకు (గవర్నరునకు) నానతి యొసఁగెను. అతఁడు దండధరున కెనయై మొట్టమొదట మడవరాజ్యమునందలి 'హోలడము' అను ప్రదేశము నందలి డామరుల నెదుర్కొని కులాయమునందలి పక్షులను వేటకాఁడు పడఁద్రోసి నేలపాలు చేసినట్లు వారి నందఱిని నిర్మూలించెను. ఆ క్రూరుఁ డటనుండు 'లవన్యుల' నెల్ల మృత్యు దేవతకు బలి సేయుచుఁ దుదకు జడదారియై భైక్షమునఁ గాలము గడపు విప్రుని సైతము విడువక పోయెను. మఱియు నా మండలాధిపతి యా మడవ రాజ్యమునందు బాటసారులై సాగిపోవు వారిని సైతము లవన్యు లనియే తలపోసి వారి నెల్లరను శూలారోపితులను గావించెను. ఆరీతిని మృత్యుదేవత విహార భూమిగా నేర్పడి యాప్రదేశ మంతయు నతిభయంకరమై భైరవుని వంటయిల్లుగాఁ గానవచ్చెను.

తఱువాతఁ గ్రూరుఁ డగు నయ్యధికారి లవన్యుల తలపుఱ్ఱెలను హర్షునకుఁ గానుకలుగాఁ బంపఁగా వాని నతఁడు ప్రాసాద ద్వారములందుఁ దోరణములుగఁ గట్టించెను. అట్టితఱి నక్కడ నేర్పడిన దుర్గంధము వానికడ మూగిన కాకులు గ్రద్దలు పెద్దకక్కెరలు నక్కలు మున్నగు వాని ధ్వనులు క్రూర రాక్షసుఁ డగు నాహర్షున కెంతో యాహ్లాదమును గల్గించె నని తఱువాత నేర్పడిన జనశ్రుతి యీనాటికిని కర్ణపథమును సోఁకుచుండుట గమనింపఁదగిన విషయము. మడవరాజ్య మండలము రుద్రభూమి యయ్యెను. హతశేషులైన లవణ్యులు కొందఱు మృత్యువు తాండవించిన యా మడవరాజ్యమును విడిచి 'బ్రతుకు జీవుఁడా' యనుచు నానా దిక్కులం బట్టి పోయిరి. కొందఱు మ్లేచ్ఛ దేశముల కేగి యచ్చటి వారితో గోమాంసమును భుజించి ప్రొద్దులు పుచ్చుకొనవలసిన వారైరి. ప్రచండ రాక్షసుఁ డగు హర్షుఁడు నియోగించిన యామండలాధికారి 'కలేరకప్రప' ప్రాంతమునుండి 'లోకపుణ్యము' అనుప్రదేశమువఱకు శూలారోపితు లగు డామరుల యతిదీర్ఘమైన శ్రేణి యేర్పడునట్లొనర్చెను. అప్పటి యా ప్రాంతమును గనినచో నెంతటి కటిక గుండె గలవాఁడైనను హృదయమున

మహాక్షోభము నొంది కన్నీరుం గార్పక మానఁడు. ఇక నా క్రూర కార్యము నొనరించిన మండలాధి కారి యెట్టి పాషాణ హృదయుఁడో బ్రహ్మకే దెలియవలయును.

ఈవిధముగ మడవరాజ్యమునందలి డామరులను బలిపూర్ణముగ మృత్యువునకు నుడుగర నొనర్చి 'క్రమరాజ్యమును' సైతము మట్లే దుర్గతి పాలు సేయఁ బ్రయత్నించి యచ్చోటున కాదండ ధరుఁడు మండలేశ్వరుఁడు శీఘ్రముగఁ బయనించి యాతావుఁ జేరెను. అట్టి దారుణ సమయమున నచ్చటి డామరు లెల్లరు 'నింక మనకు మృత్యువే శరణ్యము. ఊరక చచ్చుటేల?' అని నిర్ణయించు కొని 'లోలాహామునందు' సైన్యమును సమాయత్తపఱచుకొని యుండిరి. వారితో నా మండలేశ్వ రుఁడు తనసైన్యమును బురికొల్పి పోరు సాగించెను. డామర సైన్యము శత్రుసేనను రణమున డీకొని ప్రరాక్రమముతోడ నెదురించి యుండెను. అందువలన నా మండలేశ్వరుఁడు చాలకాల మక్కడ నడ్డగింపఁబడినవాఁడై ముందుకుఁ బోలేక యచ్చోటనే నిలువవలసివచ్చెను.

ఈ సందర్భమున నచ్చోట నుండు ప్రాజ్ఞులగు కొందఱు "ఏమి యీ యన్యాయము? సుర తీర్థములతోడను మహర్షుల సమాజముతోడను నత్యంతము పవిత్రమై యున్న యీమండలమును ధ్వంసము చేయుటకై యొకానొక క్రూర రాక్షసుఁడు హర్షుఁడను నెపముతో నిందుఁ బ్రవేశించెనా? పగటియందు నిద్రించుట రాత్రులం దుల్లాసియై చెలరేగుటయుఁ బ్రజల నన్యాయముగ మహాఘోరముగ మృత్యువునకు బలివేయుటయు వాకొనరాని సంగతిగ నున్నది. విలయ కాలపుఁ గాలుని కృత్యమీ పరమ దుష్ప్రవృత్తి జరిపించుచున్నాఁడే" అని వాపోవఁ దొడంగిరి.

ఈ సంగతి యిట్లుండ నీలోపల మల్లనృపతి రెండవ కుమారుఁడు యువకుఁడై యౌవనో న్మాదమునఁ బొంగుచుండెను. లక్ష్మీధరుఁ డను మంత్రియొక్క కాంతకు నతనిపై మరులు పుట్టెను. అతఁడు లక్ష్మీధరుని భవనమునకు నిరుగుపొరుగైన భవనమున నుండెను. కోఁతి ముఖముగల లక్ష్మీ ధరుఁ డామె మనసు నాకర్షింప లేకపోయెను.

అంతట నా లక్ష్మీధరుఁడు మల్లుని సుతులఁ జంపింపఁ గోరి హర్షునితో "రాజా! నీవు నీజ్ఞాతుల నెందఱినో చంపించితివి. కాని, ఈమల్లుని సుతుల నేల విడిచి పుచ్చితివి? వీరు ప్రబలులై యున్నారు. వీరినిఁ గూడఁ ద్వరలోనఁ గాలుని ప్రోలికిఁ బంపిన మొదల నీకిఁక జ్ఞాతి భయ మనునది యుండదు," అని పురికొల్పెను. కాని, హర్షుఁడు తా నిదివఱకుఁ గావించిన జ్ఞాతి వధఁ దలఁచుకొనుచుఁ బశ్చాత్తప్తుఁడై మఱియు నట్టి పనిఁ గావింపలేక యున్నవాఁడుండెను. ఈకారణమున లక్ష్మీధరుని ప్రేరణము హర్షునకు మల్లరాజు సుతులపైఁ గినుకఁ బుట్టింపలేక పోయెను. లక్ష్మీధరుఁడును నంతటితో నా విషయ మును విడువక యప్పుడపుడు తాను మల్లుని సుతులను జంపించుటకు రాజును బురికొల్పుచునే యుండెను. తానే గాక యితరులచేతను గూడఁ బలుమా ఱట్టి దుర్బోధ తేని తల వట్టునట్లు చేయించెను. అంత మల్లుని సుతు లుద్ధతులై తనరాజ్యమును హరింతురేమో యను భీతి హర్షుని డెందమునఁ బాదు కొనెను. ఆకారణమునఁ దనకుఁ బూర్వము గలిగి యున్న జ్ఞాతి వధ పశ్చాత్తాపము నమసి పోయినది. పిమ్మట నతఁడు మంత్రులతో నాలోచించి మల్లభూపతి సుతుల నుచ్చల సున్సలులను వధించుటకు నిశ్చయించుకొనెను.

ఇట్లుండ నాప్రాంతమునం దుండిన 'ధక్కన' యను వేశ్య రాజగు హర్షుని యభిప్రాయము నెట్లో గుర్తించి మల్లుని కొమరులకు మెల్లఁగాఁ దెలియఁబఱచెను. అంతట నుచ్చల సుస్సలులు తమ చెలికాఁ డగు 'దర్శనపాలుని'వలన మున్ను వేశ్యాంగనవలనఁ దాము విన్నవార్త యథార్థముగా నెఱిఁగి యిఁక నావిషయమై సంశయమును విడిచి యానాటి నడిరేయి నిర్వురు ముప్పురు ననుచరులఁ దమ తోడఁ దీసికొని రాజధానినుండి గూఢముగ వెడలిపోయిరి. వారిర్వు రారీతిని 1476 లౌకిక వత్సరమున (క్రీ. శ. 1100) మార్గశీర్షమాసమున శ్రీనగరినుండి వెడలిపోయి 'ఉత్రాసము' అనుచోట నివసించి యున్న డామరుని నివేశమును జేరిరి. పిదప లవన్యుఁ డగు 'ప్రశస్తరాజు' తనతమ్ముఁడగు 'పిల్లరాజు' యొక్క తోడ్పాటుతో నుచ్చలసుస్సలులను వేఱొక మండలమును జేర్పించెను. ఉచ్చలుఁడు కల్లభూభర్త యేలుచున్నట్టి రాజపురిఁ జేరెను. అతని తమ్ముఁడు 'కలింజరభూపతి' కడకుఁ బోయి యుండెను.

ఇది యిట్లుండ హర్షుఁడు మల్లరాజు పెద్దకుమారు 'నుచ్చలుని' దునుమాడుటకై తన సచివుఁ డగు లక్ష్మీధరుని మూలముగ నధిక మగు ధనమును సంగ్రామపాలునికి నొసఁగి వానిచే నా యుచ్చలునిఁ దుదముట్టింప గూఢముగఁ బ్రయత్నము సాగించెను. పరాక్రమశాలి యగు నుచ్చలుఁ డును దాను జేరిన చోట నున్న సంగ్రామరాజు కడకుఁ దనసహజ మైన ఠీవితోడనే పోయి యుంచుక మర్యాదను మాత్రమే వెల్లడించెను. సంగ్రామపాలుఁడు తనయందలి కుట్ర తెలియరాకుండుటకై యతనియెడ నధిక గౌరవమును జూపి నటించెను

కం॥ ఆసన్నాభ్యుదయంబున
భాసిల్లెడు వైరి యెడలఁ బగతుఁడు విధిచేఁ
ద్రాసము నొందుచుఁ బైకు
ల్లాసాధిక గౌరవంబుల వెలార్చుఁదగన్.

హర్షభూపతివలన లంచమును గైకొన్న సంగ్రామపాలుని నడత యుచ్చలుని విషయమై పైరీతినిఁ బరిఢవిల్లినది. రాజపురియందలి రాజకీయములను బట్టి యచ్చటి ప్రజలు సహజముగఁ గాశ్మీరమును ద్వేషించువారై యుండిరి. అందుకుఁ దోడుగా బల సంపన్నుఁ డగు వాఁ డందుఁ జేరి యున్నపు డిఁక వారి మచ్చర మెట్లుండునో యూహింపవలసి యుండును.

ఇఁక డామరు లందఱును నుచ్చలుని పంక వారుగా నుండి రనుట విదితచర మేగదా! వారలలో వంచనాచణు లగు వారు రాజపురికి రాక పోకలు సాగించుచు సంగతులను గూఢముగఁ దెలిసికొనుచు నుచ్చలుని నుత్సాహ పఱచుచు నుండిరి. మఱియును 'సూర్యవర్మచంద్రుని' కుమారుఁడు 'జనకుఁడు' అనునతఁడు కపట తంత్రజ్ఞు లగు గూఢచారుల మూలమున నుచ్చలుని స్వీయ కార్యము నందు మఱింత యుత్సాహ పూరితునిగ నొనర్చువాఁ డయ్యెను.

ఇట్టితఱి సంగ్రామపాలుఁ డుచ్చలునియెడ డామరాదులు చూపు గౌరవామోదములు గనిపెట్టి యిఁక హర్షభూపతివలనఁ దనకెట్టి ప్రమాదము సంభవింపదని లోలోనఁ దలపోసి తనకు బహుళ మగు ధన మొసఁగి "యుచ్చలుని బంధించి మట్టు పెట్టు" మని లక్ష్మీధరుని ద్వారముగఁ గోరి యట్టి

గూఢ తంత్రమునందు ధింపిన హర్షుని పక్షమును విడిచిపెట్టి బహిరంగముగ నుచ్చలునికి సాయ పడుచు నతని పరాక్రమము నినుమడింపఁ జేయసాగెను. మఱియు నతఁడు తన మండలమునకు సంబంధించిన రాచరికపు గౌరవ చిహ్నముగ నుచ్చలుని యుత్తమాంగమునందుఁ గప్పురపుఁ జూర్ణము నుంచి యతనికి నిరాటంకమగు శ్రేయస్సు గలుగుఁగావుత మని తన శుభాశయమును వెల్లడించి యత నికి వీడ్కోలు సన్నాహము జరుపుచుండెను. సరిగా నయ్యదనునందే 'కలశరాజు' అను 'ఠక్కురుఁడు' అచ్ఛోటునకు నేతెంచెను. అతఁ డామండలమునం దుండు వారిలోఁ జాల ముఖ్యుఁడు. హర్షభూజాని గూఢ చారులవలన సంగ్రామపాలుని సంగతి గ్రహించి నిగూఢ మంత్రము జరిపి యీకలశరాజునకు నెక్కువ లంచ మొసఁగి "సంగ్రామపాలునిఁ జిక్కఁబఱచి కర్తవ్యము సాగించునట్లు ప్రయత్నింపుము." అని పంపి యుండెను. కలశరాజును నట్టి సమయముననే రాజపురి కేతెంచి సంగ్రామపాలునితో నేకాంతమున నిట్లు సంభాషించెను.

"ఆర్యా, యిది యేమి? నీవు చక్రవర్తి యగు హర్షదేవునికి హితము సల్పక యీ దిక్కు లేని దీనునికిఁ దోడ్పడుచున్నావు. ఈతనివలన నీ కేయుపయోగ ముందును? హర్షభూపాలుని పక్షము నాశ్రయించినచో భయ విరహిత మయిన ప్రాభవమును బడసి యుందువుగదా!

గీ॥ కామధేనువు నర్థింపఁ గా సుధా ర
సంబునకు సాటి యైన దుగ్ధంబుఁ బడయఁ
దగు నటులఁ గా కజా గళ స్తనము లందె
పట్టి పిదికినఁ గ్లేశంబె ప్రాప్త మగును.

కావున నుచ్చలుని పక్షము నీవవలంబించుట శ్రేయస్కరము గాదు, వీనిని వెంటనే రాజగిరి దుర్గమునందు బంధించి వేయుము. పిమ్మట హర్షచక్రవర్తి మీ కాంక్షితములను దీర్చి యెవరివలనను మీ కెట్టి భయము గలుగకుండునట్లు మిమ్ము గాపాడుచుండును."

కలశరాజు పలికిన వాక్యము లివ్వి. ఖశాధిపుఁ డగు సంగ్రామపాలుఁడు కలశరాజు మాటల నాలకించి పరిమితాశయుఁ డగుటచే నేమియుఁ దోఁచక భీతి నొంది స్వార్థపరుఁ డగుచు నా కలశరాజుతో "సరే యట్లే యగుఁగాక. కాని నేను మాత్రము పరాక్రమ శాలి యగు నుచ్చలుని బంధించుటకు శక్తుఁడను గాను. ఏదో మిష వెట్టి నీయొద్దకు నతనినిఁ బంపెదను. నీవే యతనిని బంధించి వేయ వలయును." అని పల్కి యాకలశరాజు నతని విడిది భవనమున కంపెను.

పిమ్మట సంగ్రామపాలుఁడు మఱునాఁ డుదయముననే యుచ్చలుని రావించి యతనితో "నీవు కలశరాజు కడకుఁ బోయి వానితో సంభాషింపుము. అతఁడు నీయత్నమునకుఁ దగినట్లు నదుపాయ మును గలుగఁజేయఁగలఁడు. కారణ మేమనఁ? అతఁ డిచ్చటఁ బ్రధానామాత్యుఁడై యున్నాఁడు. వానినిఁ గలసికొని యన్ని విషయములు మాటాడిన తఱువాత నీవు నీశత్రువుల దీకొనుటకు సర్వ సన్నాహము జరిపి విచ్చిచటనుండి సపరివార సహాయునిఁగా నీకర్తవ్యమును గొనసాగించుటకై యనిపెదను." అని నచ్చఁబలికి యతని నంపెను.

అనంతరము మఱునాఁ డుదయముననే యుచ్చలుఁడు కలశరాజు కడకుఁ బోవ బయలు దేరెను. మొట్టమొదటనే యతనికి దుశ్శకునము లేర్పడి యతని నచ్చోటునకుఁ బోవలదని నివారించినవి. అందుకుఁ దోడుగా నతనికి శ్రేయస్సుఁ గోరు నాప్తులును నతని గమనమును నివారించిరి. ఈవిధముగఁ గలశరాజు పన్నిన పన్నుగడ భగ్న మయినది. ఉచ్చలుఁడు ఖశాధీశుని కడకుఁ బోయి నట్లు తెలిసి కొని కలశుఁడు మండిపడుచు సైన్యము నాయత్త పఱచుకొని యుచ్చలుని బంధింప నచ్చోటున కేతెంచెను. వీరాగ్రేసరుఁ డగు నుచ్చలుఁడు కలశరాజు తనపై దాడి సల్ప నేతెంచుట గాంచి క్రోధ తామ్రాక్షుఁడై తన భృత్యులతోడ నతని మార్కొన సిద్ధపడి యుండెను. అట్టి తఱి ఖశనరేంద్రుఁడు కష్టము వాటిల్లినదని తలపోయుచు నుచ్చలుని సాంత్వన వాక్యములతోఁ గొంతకుఁ గొంత ప్రశాంతునిఁ గావించి కలశరాజుతోఁ గూడఁ గొలువుకూటముఁ జేరి యచ్చోటునకు నుచ్చలుని రాఁగోరెను.

ఇంత జరిగినను నుచ్చలునికి డెందమునఁ గోప వహ్ని ప్రజ్వరిల్లుచునే యుండెను. ఆకారణమున ఖశాధిపతి కొల్వులోనికి నుచ్చలుఁడు పోవునపుడు పార్శ్వచరులను, ఎదుట నుండు రాజసేవకులను లెక్క సేయక చురచుర చూచుచు మృగముల లెక్కసేయని మృగాధిపునిమాడ్కి త్రోసికొని కినుకచే నదరెడు పల్లవాధరముతో నొక్క యొదువున నాస్థానినిఁ బ్రవేశించెను. అట్టితఱిఁ గోపవహ్నితో జాజ్వల్యమాన మగు నతని తేజమును ఖశరాజు గాని కలశరాజుగానీ తేరి చూడఁజాలక పోయిరి. ఇఁక నితరుల సంగతి యేమనవలెను? ఖశభూపతి యెట్టకేలకు తాను తనమంత్రులతోఁ గొలువును గొంత జక్కఁబఱచి యుచ్చలుని సాంత్వన వాక్యములతో శాంతచిత్తునిఁ జేయఁ బ్రయత్నించినను నతఁడు తనమనస్సునందలి కినుక నాపుకొనలేక యా సభలో నిట్లు తీవ్రముగాఁ బ్రసంగించెను.

"మీరు నావాక్యమును శ్రద్ధతో వినుఁడు. పూర్వము 'ద్వారాభిసారము' నందు భారద్వాజ గోత్రజుఁడు 'నరుఁడు' అను నృపుఁ డుండెను. ఆనరుని కొమరుఁడు నరవాహనుఁడనువాఁడు అతనికి 'ఫుల్లుఁ' డనువాఁడు గలిగెను. అతని కుమారుఁడు 'సాతవాహనుఁడు' ఆసాతవాహనునికి 'చందురాజు' ఉదయించెను. చందురాజునకు 'గోపాలరాజు, సింహరాజు' అను నిరువురు సుతులు గలిగిరి. సింహ రాజునకుఁ బెక్కండ్రు కుమారులు నొక్క కుమారియు నుద్భవించిరి. కుమారి పేరు 'దిద్ద' అనునది. సింహరాజు తనకుమారిని 'క్షేమగుప్తుఁడు' అనురాజున కొసఁగెను. ఆమె రాణియై యుండి చివరకుఁ దనసోదరుఁడైన 'యుదయరాజుయొక్క' కుమారుని సంగ్రామరాజును రాజ్యమున నభిషిక్తునిఁ గావించెను. దిద్దాదేవియొక్క మఱియొక సోదరుఁ డైన కాంతిరాజు అనువానికి 'జస్సరాజు' అను తనూజుఁ డుండెను. సంగ్రామరాజు తనయుఁ 'డనంతభూపతి' 'జస్సరాజు' యొక్క సుతులు 'తన్వంగుఁడు' 'గుంగుఁడు' అనువారు. అనంతభూపతి కొమరుఁడు కలశభూపతి, గుంగుని కుమారుఁడు. 'మల్లభూపతి' యునై యుండిరిగదా! అట్టి కలశ మహీపతి తనయులు 'హర్షుఁడు' మున్నగు వారు. మేము మల్ల భూపతి కుమారులమై యుంటిమి. ఇట్టి రాజ వంశక్రమమున నతిసన్నిహితులమై మేముండఁగా, "వీఁడెవఁడు?" అని నన్నుద్దేశించి పల్కెడు వా రల్పబుద్ధులు. జడమతులును గాక మఱి యెట్టివా రగుదురు? ఇంత యెందుకు?

గీ॥ వీర భోగ్యంబు రాజ్యంబు. విశద మిద్ది.
రాజ వంశ క్రమం బను రద్ది యేల?
స్వీయ బాహా ద్వయైక సహాయుఁ డైన
వీరుఁడే రాష్ట్రపతి యౌట విశ్వ హితము.

కావున వీరపద్ధతినే నే ననుసరించుచున్నాను. దైవము నన్ననుగ్రహించి యట్టి రాజ వంశ క్రమమునందుండు వారిలోఁ జేర్చి నాశిరముపై హస్తము నుంచి నన్నను కంపనీయునిగాఁ జేయ లేదని సంతసించుచున్నాను. అందువలన నిప్పుడే మీరు నాశక్తి యెట్టిదోః కనుగొనఁగలరు. అని యీవిధ ముగ విక్రమ స్ఫురిత వాగారంభ మొనర్చి యా కొలువును వీడిపోయెను. అతనివెంట నూర్వురు పదాతి సైనికులు మాత్రము వెడలిపోయిరి.

ఉచ్చలుఁ డట్లు పోవునపు డతని కెదురుగా నెవరో మరణించిన కుండేటినిఁ బట్టుకొని వచ్చెను. అట్లెదురుపడుట శుభ శకునము గావున నతఁడు శత్రువులఁ బరిమార్చి సిరినిఁ దాను నిశ్శంక ముగఁ బడయఁగలుగుదు నన్న విశ్వాసమును బొందెను. అట్టి యుత్సాహముతో నున్న యతనికి సహా యులుగా నరఘట్ట ఘరట్టాది వృత్తులతో జీవనమును గడపుచు నుండిన 'వాట్టదేవుఁడు' మున్నగు వారలు చేరిరి.

ఉచ్చలుఁడు కటరస్థుఁడై యున్న సంగ్రామపాలుని యంతికమును విడిచి యావేశముతోడను విసుఁగుతోడను రాజపురిఁ బ్రవేశించెను. రాజపురియందలి దేవేయులు వాని దెందమునందలి శ్రమ నుపశ మింపఁ జేసిరి. అతఁ డచ్చోట నాహార పానీయములను స్వీకరించి సాయంతన సమయమునకుఁ దన విడిది గృహంబునకుఁ బోవ బయలుదేరఁగా, కలశరాజు సైన్యముతో ద్వారబహి ర్భాగమున యుద్ధ సన్నద్ధుఁడై యుండెను. ఉచ్చలుఁ డుగ్రుఁడై వారిపై కుఱుక సిద్ధపడెను. కాని, అచ్చటి రాణులు వానిని నిర్బంధించి ద్వారమును బంధించి పోవీయరైరి. ఉచ్చలునకుఁ గల కొలఁది సైనికులు మాత్ర మాకలశరాజు వాహినీ సముదాయముతోఁ బోరాటము సల్పిరి. ఆ కదనమం దుచ్చలుని సైనికుల లోని 'ప్రోష్ఠావట్టుఁడు మొదలగు యోధులు నిహతులైరి. ఈరీతిగ నాయోధనము జరుగుచుండఁగ నంతలో సంగ్రామపాలుని మంత్రు లచ్చటికి వచ్చి యిరువాఁగులవారికిఁ జెప్పఁదగు రీతినిఁ బల్కి సమరము నాపివేసిరి. ఉచ్చలుని కున్న సైన్యమే చాలఁ బరిమిత మైనదై, అనుకొనని యట్టి సంగర మున నతని సైనికులు పెక్కండ్రు హతు లగుటచే నతని సైనిక బల మత్యంతము స్వల్పమయ్యెను.

ఉచ్చలుఁ డీరీతినిఁ జైత్రపూర్ణిమ వఱకు దైవ వైపరీత్యమున వాటిల్లిన సంకటములకు లోనై యుండియుఁ దన యంతస్సారమును గోల్పోనివాఁడై వైశాఖమాస కృష్ణ పక్షపుఁ బంచమి నాఁడు దండయాత్రను సాగించెను. అట్టి తరుణమున నుచ్చలుఁడు దనకు బాసటగా నున్న 'వాట్టదేవుఁడు' మున్నగు దాయదులను వారివారికిఁ దగిన విప్లవ చర్యలతో రాజపురి ప్రాంతములం దంతటను శత్రు పక్షమును బ్రతిఘటించుచు నుండునట్లు వియోగించి తానే స్వయముగాఁ 'గ్రమరాజ్యము'నుండి కాశ్మీర మును బ్రవేశింపఁదలఁచి యారీతినిఁ బదిఁ బూనెను.

ఇట్టితఱి హర్షమహీపతి 'యుదయసింహునికి,' దఱువాత క్షేమగుప్తుని కుమారుఁ డగు 'కపిలుని' లోహర దుర్గమునకుఁ బాలకునిగా నియమించి యుండెను. ఆ కపిలుఁడు లోహర దుర్గమును బ్రవేశించుచున్న యుచ్చలుని నూరక విడిచిపెట్టి యతని యిచ్చ వచ్చినట్లు ప్రవేశ మొసఁగి మిన్న కుండెను. ఇదియే దైవ పరిపాకము. ఇంకేమి చెప్పవలె? ఉచ్చలుఁడు ఖడ్గమును గేలఁ గీలించి ఖడ్గ చర్మరూప మగు డాలువారును ధరించి తన్ననుసరించు వారియం దగ్రేసరుఁడై 'పర్ణోత్సమున'ఁ ద న్నెదిరింపవచ్చిన రాజ యోధులను దఱిమి తఱిమి వారినిఁ బలాయన మంత్రము పఠించు వారిలోఁ బ్రథమ గణ్యులనుగా నొనర్చెను.

అంతట నతఁ డటఁ బ్రవేశించు చుండఁగా నిశ్శంకముగఁ గూర్చుండి యుండిన 'సుజ్జకుఁడు' అను పేరు గల ద్వారాధిపతిని బంధించి యెదిరింప భయపడెడు కాశ్మీర యోధ బృంద ముపై విహాగములను వేటాడు సాల్వడేగవలె నుగ్రుఁడై దుమికెను. అట్టితఱిఁ బర్వత ప్రాంతములం దుండు నట్టి రాఖాశికులు డామరులును నుచ్చలుని రాక వినిన వెంటనే పరుగులతో వచ్చి యతనికి సాయపడిరి. వారందఱును హర్షమహీపాలునియెడ ద్వేషము నూని యున్నవారు కావున నట్లు తోడ్పడిరి.

హర్ష మహీజాని యతర్కిత మైనట్టి యుచ్చలుని సన్నాహమునకుఁ జకితుఁడై తనడెంద మునఁ బలువిధములనిట్లు దలపోసెను. "ఇతఁ డాకాశమునుండి యాకస్మికముగ నూడి పడి వచ్చెనా! ఇతఁడు బాగుగ బద్ధ మూలబలుఁ డయ్యు నుండలేదు. క్రమరాజ్యాధికారి యగు మండలేశ్వరుని వధించి నట్టును లేదు, ఇట్లు హఠాత్తుగాఁ బైకొని వచ్చుటకు వీలెట్లు గల్గెను?" ఈవిధము హర్షుని తలలోని తలంపులు కలవరింతలై పొర్లినవి. ఈతఁ డిట్లుండ దండనాయకుఁడు సన్నద్ధ సైనికుఁడై యుచ్చలు నెదిరింపవలసిన వాఁడయ్యును నాలసించెను. అట్టి సమయమున రాజు సంఖ్యాతీత మైన సైన్యముతో శత్రువు నెదుర్కొనుటకై 'పట్టము' నొసఁగి మఱియొకని నంపఁగా, పట్టమును గైకొన్న యా సైన్యాధ్యక్షుఁడు ద్రోహ చింతవలననో, దైవోపహత పరాక్రమము గలవాఁ డగుటవలననో, (ఏ కారణ మున నైననేమి?) శత్రువును వెంటనే యెదుర్కొనక మార్గమునఁ గొంత కాలము వ్యర్థముగఁ గడపి విలంబించెను. అది గమనించి యా కాశ్మీరపతి తిలకరాజు మున్నగు వారిని మఱి కొందఱను పట్ట మొసఁగి పంపినవాఁ డయ్యెను. వారును ధైర్య హీనులై ముందుకు నడచిన వారు కారైరి. ఈతీరునఁ దనచే ననుపఁబడిన వారు బడుగులై కార్య క్రమమునఁ బాల్గొనక యాలసించుటంజేసి యుచ్చలునికి నచ్చోట బాగుగఁ బట్టు దొరకినది.

అంతట నతఁడు 'వరాహమూలమును' జొచ్చెను, అచ్చోటునకు శత్రు సైన్యమునుండి శుభ లక్షణములుగల యొకానొక యుత్తమాశ్వ మాకస్మికముగ నేతెంచెను. తనకడ కేతెంచిన యా హయరాజము నతఁడు తనను జేరు రాజ్య లక్ష్మినిఁగాఁ బరమాదరముతో స్వీకరించెను. ఇఁక నచ్చోట సంభవించిన వింత యేమన? అందుండు వరాహస్వామి విగ్రహమునకు వేసియున్న పూల దండ యుచ్చలుని యుత్తమాంగమునఁ దిన్నఁగా వచ్చిపడెను. ఆ దృశ్య ముచ్చలుని భుజ పీఠమున నుండఁ గోరిన భూదేవి యతనిపై వైచిన స్వయంవరపుఁబూల మాలయో యనునట్లు భావింపఁ దగి యుండెను.

అటుపిమ్మట సుచ్చలుఁడు పురోగమించుచుండ 'విద్యావిషయజ్ఞ కాంతా' దియోధు లతని కడ్డు పడి ముందుకు రాకుండ నరికట్టిరి. అందువలన సుచ్చలుఁడు సమయోచితముగ 'హుష్కపురము' నాక్రమించుట మాని క్రమరాజ్యోన్ముఖుఁడై పోయెను. డామరు లుచ్చలుఁ డచ్ఛోటికి వచ్చుచున్నాఁ డని విని యినుమడించిన యుత్సాహముతోడ నా క్రమరాజ్యాధినేత నెదుర్కొని పెక్కు విధములఁ బీడించి యందుండు యశోరాజు మొదలగు మహాయోధులను దొలుతనే పరాజితులను గావించిరి. అందువలన నామండలేశ్వరుఁడు పరాక్రమ ముడిగి మెలమెల్లఁగా వెనుకకు మరలి తారమూలమును బ్రవేశించెను. అయినను డామరులు వానిని విడువక యుచ్చలుని నాయకత్వమున నుప్పొంగుచు వెన్నంటిరి.

అచ్చోట నా మండలేశ్వరుఁడు నాల్గు మూలలందున్న బలమును గేంద్రీకరింపఁజేసి యుచ్చలుని సైన్యోద్రిక్తతను బ్రతిఘటించుచుఁ గొంత కాలము నిలువరించెను. ఉచ్చలుఁ డను ప్రలయ జీమూతము నచ్చటి మండలేశ్వరుని సైన్య మనెడు ప్రభంజన భ్రమణము ముందుకు సాగనీయ దయ్యెను. పరస్పర మీసుతో నచ్చటఁ బోరాడు నట్టి యా యిరు సైన్యములను మత్తేభములకు జయశ్రీ కరిణీ కరగ్రహణ విషయమై సమాన మైన సంఘర్షము చాల కాలము జరిగెను.

ఇది యిట్లుండ మడవరాజ్యమునందున్న యుచ్చలుని మేనమామ యానందుఁ డనువాఁడు డామరుల నందఱను గూడఁగట్టుకొని యచ్చోట గొప్ప తిరుగుబాటు నుప్పతిల్లఁ జేసెను. అతఁడు పురి కొల్పిన విప్లవమునందు నానా దిగ్దేశములనుండి తుమ్మెద గుటుములు 'ఝుమ్, ఝుమ్' అనుచు భూమిపై నిండినట్లు సిబిడముగ నిండిరి. అట్టితఱి మందభాగ్యుఁ డగు హర్షభూజానికి నొక సామాన్యోద్యోగి కాయస్థుఁడు ద్వారాధ్యక్షుఁడుగను మహాసేనానిగను నుండుట సంభవించెను. అయినను నతఁడు, ఉచ్చలుని మేనమామ యానందుఁ డట్లు తన్ను ముట్టడింపఁగాఁ దనశక్తి నంతయు వినియోగించి పెక్కు రీతుల నతనితోఁ బోరుచు మడవరాజ్యమును విడిచి వెనుకకు జరుగని వాఁడై యుండుట మెచ్చఁదగు విషయము.

అంతట మహావీరుఁ డగు సుచ్చలుఁడు తనప్రతాపాగ్నిని నలు వంకల నిండించుచు మహావాహినితో నేతెంచి యామండలేశ్వరుని నతనిసేనతోడ నాయోధన రంగమునందు బందీకృతుఁ గావించెను. అట్టితరుణమున నాతని బందీకరణము విచిత్రముగ జరిగెను. ఆ యోధులు కవచఖడ్గాదుల ధరించియే యుండిరి. వారిని బంధించునట్లు వారికిఁ దెలియనట్లే యొక క్షణములో జరిగినది. ఆ మండలేశ్వరుఁ డట్లు బంధింపఁబడిన వాఁడయ్యును బ్రభుభక్తి పరాయణుఁడై తన ప్రభువునకు హితము నాచరింపఁ గోరెను. మానవంతు లగు యోధులకు గల ప్రభుభక్తి యంత్యావస్థయందును వారిని వీడి పోదు. అంతట నామండలేశ్వరుఁడు, ఉచ్చలునికి వినమ్రుఁడై యతనికి విశ్వాసము గలుగునట్లు "ఓవీరాగ్రేసరా! నీవంటి వాఁడే రాజ్యార్హుఁ డన్న విషయము నిప్పుడు నిక్కముగా నెఱింగితిని. శౌర్య హీనునికి రాజ్య మేల? వెంటనే యాలసింపక పుర ప్రవేశ మొనర్పుము. ఇంతకంటె వేఱొక మంచి సమయము దొరకదు." అనుచు సుచ్చలునికి నతనియందు విశ్వాసము గలుగునట్లు నక్కవినయముతోఁ బల్కెను.

అంత సుచ్చలుఁడు వాని ప్రేరణమును విశ్వసించి పుర ప్రవేశము చేయఁ బూనెను. అతని సైనికులు పట్టణమును బల్లెలను గొల్లఁగొట్ట నారంభించిరి. అట్టి పని యానందునివలనఁ జరిగెను. అట్టి

యంతగపుఁ జేష్ట లుచ్చలుని హీనబుద్ధిని వెల్లడించుననియుఁ బ్రజానురాగమునకు నతఁడు పాత్రుఁడు గాకుండఁ బోవుననియు బంది యగు నామండలాధిపతి లోలోన భావించెను. అంతట నా మండలాధిపతి యుచ్చలునిఁ బరిహాస పురమునఁ బ్రవేశింపఁ బురికొల్పెను. పరిహాసపురము లోతైన గుంటలతో దను మిగుల నెత్తైన మెట్ట ప్రదేశములతోడను నుండునది. అక్కడనుండి త్వరితముగఁ దప్పించుకొని వచ్చుటకుఁ జాల శ్రమపడవలసి యుండును. కావుననే యాపురమునందు రాజభక్తి పరుఁడగు నామండలాధిపుఁడు నక్క వినయముతో నుచ్చలునిఁ బ్రేరేపించి యందుఁ బ్రవేశపెట్టి యచ్చట నొక చతుశ్శాలమునందు విడిది సేయించి బంది యగు తానును నచ్చోటనే యుండెను.

అతఁ డట్లుండి గూఢముగఁ దనవారితో "నర్ధరాత్రమున నుచ్చలుఁడును దానును నున్నపుడు, ఆ చతుశ్శాలమును 'బరశురామప్రీతి' యగునట్లు సేయుఁడని" నిబ్బరముగ నిశ్శంకముగఁ బల్కెను. అందువలనఁ దనప్రాణములు పోయినను నుచ్చలుఁడు నిహతుఁ డౌను గావునఁ దన రాజభక్తి ఫలవంత మగునని యాతని కాంక్ష. కాని, యతని యనుయాయులు వాని హితము గోరువారు కావున నట్టి పని సేయరైరి. ఇంతటి యాత్మ హననోపాయమును దెల్పువాఁడు మహాసాహసికుఁడుగదా!

గీ॥ చిత్తమున సాహసం బెంత హత్తుకొనునొ,
గాత్రమున సాహసం బంత గలుగునేని
యాత్మ నిరపేక్ష మైన కార్యం బొనర్చు
వాని కడ్డంబు లేదుగా వసుధలోన.

ఇదిగాక, విధి విలాస గతుల వింత వినోదము లొక్కొక తరుణమున భేద మోదాశ్చర్యములఁ గల్గించు చుండును. ఈ విషయమును బరిశీలింతము.

మ॥ అడవిన్ బ్రోచు మృగాధినేత యగు హ
ర్యక్షంబు నిర్వర్మమై
బెడిదం బైన మృగావశిం దునుము. తాఁ
బేలన్ననో క్లీబతన్
జడ తత్త్వంబున నిల్చి వజ్ర కవచ
చ్ఛన్నాంగమై పొల్చు. నీ
పుడమిన్ దుర్విధి యల్పు నోముచునె ము
ప్పున్ దెచ్చు శూరాళికిన్

ఇట్లు దైవ వైపరీత్యము వీరుఁ డగు నుచ్చలుని పరాక్రమ విజృంభణమునకు నడ్డు దగిలినది. కావుననే యుచ్చలునిచే బందీకృతుఁడై యుండిన మండలేశ్వరుఁడు తన తలంపు నెగ్గకుండుటచే హర్షభూమీశునకు రహస్యముగ గూఢ చారుని మూలమున సందేశ మంపెను. అందు "మహారాజా! నే నీయుచ్చలుని మాయోపాయమున నిరికించి నీముందు నొక సృగాలముగా నుండున ట్లొనర్చితిని. ఇదే వీనిని బంధించి వేయుటకుఁ దగిన యవకాశము. వెంటనే యేగుదెంచి వీనిఁ జెఱయందుంచుము." అని యుండెను.

అంత హర్షుఁడు సమస్త సామంత సైన్యవ్యూహ సందోహ సమేతుఁడై "నేఁడు నాకు మృత్యువో జయమో గలుగవలెను." అను దృఢమైన తలంపుతో బయలుదేరెను. అతఁడట్లు బయలుదేరుటకు ముందు "తాను ప్రాణ సంశయావస్థలో నుంటి ననియు నందఱును నైకమత్యముతో నాదోష మేదేని యున్న నద్దాని మఱచి నాకుఁ దోడ్పడవలయు ననియు క్షమాపణ తుల్యమగు నొక ప్రకటనము 'దండూరా' మూలమునఁ బ్రజానీకమునకు నెల్ల వెల్లడించెను. ఆకారణమునఁ బురవాసులు జానపదులు మొదలగు వారందఱును నా కాశ్మీరపతి వెంట బయలు దేరిరి.

అనంతరము రాజభటుల సమూహము శ్రేష్ఠము లగు జవనాశ్వముల నారోహించి సంక్షోభితో ఘూర్ణిల్లు సాగరమువలె నురవడించి వచ్చి శత్రు సైన్యమును జుట్టుముట్టెను. అట్టి తఱి నామండలేశ్వరుఁడు స్వయముగా నృప సేనా మధ్యమున నిల్చి రిపు సైన్యము నంతను నూఁచముట్టుగఁ జెండాడెను. ఈవిధముగ నుచ్చలుని సేన యాకస్మికముగ భగ్నము గాఁగా కొంద ఱందు నిలువలేక పిక్కబలముఁ జూపుచు దిక్కులేక దిక్కులు పట్టిరి. వారిలోఁ గొందఱు మిగుల శ్రాంతులై రాజ విహారము నందుఁ దల దాఁచుకొనఁ గోరి యందుఁ బ్రవేశించిరి. వారిలోఁ 'త్రిల్లసేనుఁడు' అను డామరుఁ డావిహారమునఁ బ్రవేశించుట చూచి యతఁ డుచ్చలుఁ డని భ్రమించి రాజభటు లా విహారము నగ్నిపాలొనర్చిరి.

ఇంతఁ బరాక్రమశాలి యగు నుచ్చలుఁడు హయారోహుఁడై యుండిన శాత్రవుల నడుమ 'దర్శనపాలుని యొక్క పితృవ్యుఁ డగు' సోమపాలునితోఁ జాల కాలము పోరు సల్పుచు వీరవిహార మొనర్చెను. కాని, శాత్రవ సేన పెల్లుగ నుండెను. అతఁ డొక్కఁడే యతిమానవుండై సంగర క్రీడ గావింపసాగెను. ఉచ్చలుని పక్షమున నున్న 'జనకరాజు' మున్నగు వారు పెక్కువిధముల నుచ్చలునిఁ బ్రబోధించి యెట్టకేలకు నా రణభూమిని వీడి పోఁజేసిరి. అతఁ డట్లు రణస్థలిని వీడి మృత్యుముఖమునుండి తప్పించుకొనినట్లు 'పరిహాసపురమును' విడిచిపెట్టి యొక యుత్తమాశ్వము నారోహించి 'గౌరికాలాల' గ్రామ ప్రాంతమునందలి వితస్తానది తీరమును బట్టి యానదిని దాఁటి సహచరు లగు డామరులతో మరలఁ దారమూలకమును' జేరెను.

ఇంక హర్షభూపతి యొకానొక యల్పుఁడు కితవుఁడును నగు వాఁడు స్వల్ప లాభమునఁ దృప్తి నొంది యుప్పొంగి పోవు విధమునఁ దావన్మాత్ర జయమున నుబ్బి పోవుచుఁ దన్నుఁ దాఁ బ్రశంసించుకొనుచు హర్ష పారవశ్యము నొందుచు రాజధానికి మరలిపోయెను. ఆ కాశ్మీరపతి తనశత్రువు జీవించి యున్నాఁడని తెలిసియు వానిఁ దఱిమి మట్టుపెట్టక యుపేక్షించి యూరక యుండుటచే నుచ్చలుని పక్షమున నున్న డామరులు బెంగపాటు నొందిన వారైనను నొకింత యూపిరిఁ దీల్చుకొని విశ్రాంతి నొంది యుండఁగల్గిరి.

ఉచ్చలుఁడును దన యనుయాయు లగు డామరులను సంగ్రామరంగమును వీడి నల్దిక్కులఁ బట్టి పలాయితులై యుండిన వారిని మరలఁ దోడ్కొని వచ్చి శత్రువుల నెదుర్కొన నుద్యోగించుచుండెను. అయ్యది జ్యేష్ఠమాసము. ఉచ్చలుఁ డభిమానధనుఁడు. వీరాగ్రణి యగు వానికి స్వీయ బాహా దర్పమునే సాయపడి విజయమును సంపాదింపవలయు నన్న కుతూహల ముండెను. కాని,

యీతరుణమున డామరాదుల సేకరింపవలసినట్లు తటస్థించుట యతని మనసునకు బాధ గల్గించె ననుట శ్లాఘ్యతరమేగదా! ఏమయినను నట్టి యత్నము తప్పదయ్యెను. అట్టి బెట్టిదపు జ్యేష్ఠ మాసమున బట్టతలపైఁ దాటిపండు పడినట్లు క్షామదేవత పదము పెట్టినది. అయినను నాధీరవతంసము తన యను యాయుల నతికష్టముతో రక్షించుకొనుచుండెను. "ఇట్టి కఠోర మగు కాటకపువేళ హర్షమహారాజు పరిహాసకేశవుని సౌవర్ణ విగ్రహము నూడఁదీయించి తన్ను పోషించుకొనఁ బ్రయత్నించె" నన్న సంగతి యెవ్వరికేని కర్ణ శూలమై పోఁకునుగదా! ఉచ్చలుఁడు తన యన్వీక్షణమున నుండినపు డెట్టి యార్థిక దుర్దినములందును నాకేశవుని విగ్రహమును వేయి కన్నులఁ గనిపెట్టి కాపాడుచుండెడివాఁడు. హర్షుఁ డీసమయమున నింతటి ఘోర మగు పని కావించుట యెంత మాత్రము క్షంతవ్యము గాదని వేఱుగాఁ జెప్ప నక్కఱ లేదు.

హర్షపతి యట్లావిగ్రహమును బాదు గదలించిన వెంటనే గలిగిన వింత మనసునందు మఱువరానిది. ఆ విగ్రహమును బెకలించిన వెంటనే పావురముల ఱెక్కల రంగు గల బ్రహ్మాండమైన ధూళి యొకటి భూనభోంతరాళము నంతను నావరించి మహోత్పాత భయమును గల్గించునదై విజృంభించెను. పగలు గూడ నంధకార బంధుర మైనట్లుండెను. ఈ మహోత్పాతము హర్షుని శిరచ్ఛేదము పర్యంతము నిల్చి యుండినది. ఈ విషయమున నొక పరీక్షయు జరిగినది. అది యేమన? నిబిడ మైన ధూమ స్తోమమువంటి యా ధూళి పరిహాస కేశవుని విగ్రహము నున్నచోటఁ బాదు కొల్పఁగా మాయమై పోయినది. మరల నా విగ్రహము నటనుండి కదలింపఁగా నా విపరీత పరాగ చ్ఛట లంతటను నలముకొనియెను. ఇట్టి పరీక్షయు జరిగెను. ఏమైననేమి? "వినాశ కాలే విపరీత బుద్ధిః" అను వచనము హర్షునియెడ బాగుగ సమన్వయించిన దనవలెను. "ఈ విధముగ నొకటిన్నర నెల యంధ కారావృతమై యా మండల ముండె" నని జనశ్రుతివలనఁ దెలియుచున్నది.

అంతట హర్షనృపతి తనశత్రు వగు నుచ్చలుఁడు కొంత తడవు మంద మైన పరాక్ర మాగ్నితో మసలుచుండఁ దాను గొంత యూరటతో నూపిరి పీల్చుకొనుచుండెను. ఇట్టి తరుణమున నుచ్చలుని తమ్ముఁడు సుస్సలుఁడు శూరపుర ప్రాంతమునుండి బయలుదేరి హర్షునెదిరింప సమకట్టెను. ఆ యన్నదమ్ముల తండ్రి యగు 'మల్లరాజు' అన్న యగు నుచ్చలునికిఁ దోడ్పడకుండ 'నవనాహము' నందుఁ గాలముఁ గడపుచుండిన సుస్సలుని నిందా గర్భ మగు సందేశముతో బ్రబోధించి యతని యౌదాసీన్యమును బోఁగొట్టెను.

సుస్సలుఁడు తానున్న దేశమునందలి కల్హానృపతి తనకుఁ గొన్ని యుత్తమాశ్వముల నొసఁగఁగా వానినిఁ గైకొనెను. అతని ననుసరించుటచే రాజ దాక్షిణ్యము నెట్టకేలకుఁ బోఁగొట్టుకొనుటకు గొంత యత్నము చేయవలసినవాఁ డయ్యెను. హర్షుఁడు మొదటినుండి తుదివరకుఁ బగ లోలోన నణఁచికొనుచుఁ బైపైకిఁ దనమన్నన యనెడు మాయా వాగురను బ్రయోగించి పగతురను లోఁగదీసి కొనుచు సమయము చూచి నిశ్శంకముగ శత్రువును బుటమార్చు స్వభావము గలవాఁడు. అట్టి లక్షణ మిప్పుడు వానికిఁ గలసి రాక పోయెను. హర్షుని పనుపున దండెత్తి వచ్చిన 'మాణిక్యుఁడు' అను సేనాపతిని శూర పుర రణరంగమునందు జయించి సుస్సలుఁడు జయశ్రీతో నధిక సిరినిఁగూడఁ బడసి యుత్సాహితుఁడై యొప్పారెను.

ఈవిధముగ సుస్సలునకు విజయ ప్రాప్తమయిన సిరి క్రమముగ నభ్యుదయ హేతువై విరాజిల్లెను. అట్టి తఱి నుచ్చలుని సంగతి నట్లుండ నిచ్చి సుస్సలునిఁ బ్రస్తుత మణఁచి వేయవలసినట్లు హర్షునకుఁ దోఁచెను. అట్లే యతఁడు తనమండలేశ్వర పట్టాదులను మహోద్ధతితోఁ జెలరేగు సుస్సలునిఁ బడఁగొట్టుటకై యాజ్ఞాపించెను. ఆరీతి వారు దండెత్తి పోయిరే గాని ధీర పతంగ మగునా సుస్సలుని ఢాక తాగలేక పోయిరి. అంతియే కాదు. వారిలోఁ బెక్కండ్రు శూరపురమునందు సమసి పోయిరి. మఱియు ననేక యోధులు 'వైతరణీనదీ' జలమునందుఁ బడి యంతులేకుండఁ బోయిరి. వారిలో 'దర్శనపాలుఁడు' అనువాఁడు స్వామిద్రోహి అందువలన నతఁ డెంతగా సమరమునం దిపుడు తనశక్తినిఁ జూపినను విజయశ్రీ యతని నంటరాని వానిగా నెంచెను. ఆరీతి సుస్సలునిచే రాజసైన్యము పడిపోఁగా నందు శేషించిన వారు పలాయనము సాగించి 'లోకపుణ్యము' అను ప్రదేశమున నున్న సహేలకుని మఱుఁగుఁ జొచ్చిరి. ఆ సహేలకుఁడు సుస్సలుని పరాక్రమమునకుఁ దట్టుకొని యెదిరించుటకు భయపడి తనకడకు వచ్చిన యాసైన్యముతోఁ గూడ శ్రీ నగరికి (రాజధానికి) వచ్చి తనచేతగాని తనమును వెల్లడించెను.

ఈరీతిగ సుస్సలుఁడు తనపరాక్రమమును దీపింపఁజేసి హర్షభూపతి వాహినినిఁ బెక్కుపాయలు పట్టించి పరుగులు దీయున ట్లొనర్చి జేని యంతస్సారమును గదలింపఁగా నక్కడ తార మూలమునం దుండిన యుచ్చలుఁడు మరల ప్రాబల్యమును బడసి హర్షునిపై కుఱుకుటకు సన్నాహపరుఁడై యుండెను. ఉచ్చలుని సైనికులగు డామరులు చాలవఱకుఁ బదాతిసేనకుఁ జెందినవారు. అందుచే నాశ్వికులగు రాజయోధులవలన వారికిఁ గొంత భీతి యుండుట సహజము. అయినను వారు నిబ్బరముతో లోహర ప్రాంతపుఁ గొండ కనుమలనుండి దండిగాఁ జేరి యుచ్చలునికి నండగా నిండియుండిరి.

ఇట్టి తఱి మరల హర్ష మహీజాని యుచ్చలు నెదుర్కొనవలసి వచ్చెను. అందుచే నతఁడు 'ఉదయరాజు' అనువానిని ద్వారపతినిఁ గావించి మరల నుచ్చలుని లోహరమునందలి మండలేశ్వరుని నెదుర్కొనుటకై పంపెను. ఇది యిట్లుండ నుచ్చల సుస్సలుల మేనమామ పద్మపురమున జేరి యుండెను. అతఁడు మహాపరాక్రమశాలి. అందువలన నాతని నెదిరింప హర్షుని సచివు లందఱును జంకిరి. ఒక్క మంత్రియు సేనాధిపత్యమును వహింపఁడాయెను.

ఇట్టి సంకటపువేళ హర్షుఁ డప్పటి దుస్థితి నాలోచించి "నన్నాదుకొనువారు లేరా? ఎవరు నాకిప్పుడు దిక్కు" అని పర్యాకుల మానసుఁడై యుండ 'చంద్రరాజు' అను నతఁడు సేనాధిపత్య రూప మగు నధికారము గ్రహించి తచ్చిహ్నమును బుష్ప మాలను స్వీకరించెను. ఈతని రాజభక్తి యెట్టి తఱి శ్లాఘింపఁదగినది. ఈ చంద్రరాజు పడకయందుండి మృత్యు దేవతకుఁ బ్రీతితో స్వాగత మిచ్చి తనువు నర్పించిన యా యిందురాజు మున్నగు వారి ధీరతను నౌచితిని బరిపాలింపఁగల మేటి యని చెప్పనొప్పును.

హర్షుని కడపటి దశలోఁ 'చంద్రరాజు' ఇట్లు సర్వ సేనాధిపత్యము వహించెను. తొల్లి కౌరవ పాండవుల సంగ్రామమునఁ గౌరవ పక్షమునందలి యశ్వత్థామయు దుర్యోధనుని యంతిమ దశయందు సేనాధిపతియై కొంత విజృంభించి యుండె నన్న సంగతినిఁ బ్రస్తుత మగు నీ చంద్రరాజు వృత్తాంతము

స్మృతికిఁ దేఁజాలి యున్నది. చంద్రరాజు తన చమూ సమూహముతో యాత్ర సాగించి పద్మపురమునఁ గేంద్రీకరింపఁబడియున్న శాత్రవ సైన్యము నుచ్చలుని చెంతనుండి చెదరఁగొట్టి వేసెను. అంత మాత్ర మె గాదు. క్రమముగ నతఁడు ముందుకుఁ జొచ్చుకొనుచుఁ బగతుర దళవాయిని నవంతిపురము నందు శ్రావణ శుద్ధ నవమినాఁడు గూల్చి వేసెను. అందుకొక కారణము గలదు. ఆదళవాయి గోవర్ధన ధరమునకు సమీపమున స్వీయ సైన్యము రణ మొనర్చుచుండఁ దాను పరిమిత పరివారముతో నొక చోటఁ జేరి సంగీత శ్రవణ కుతూహలమునఁ బారవశ్యము నొందుచుండెను. అట్టి తఱి నాకస్మికముగ వితస్తానదీ తీర మార్గమునుండి శత్రువుల గుఱ్ఱపు దళ మొకటి యాదళవాయి యుండు చోటు నాక్ర మించి యతని విగత జీవితునిఁ గావించెను. అది యట్లు జరిగెను.

ఇఁకఁ 'జంద్రరాజు' తాను బొందిన ఘన విజయమును హర్షునకుఁ దెల్పు కొనుచుఁ దెగ టార్పఁబడిన యా శత్రుసేనాధిపతి శిరమును గానుకగా నతని కంపెను. హర్షుఁ డాకానుకను జూచి హర్షభరితుఁడై తనకు విధి యానుకూల్యము గలుగుచున్నది యని యెంచుచు మరలఁ దనడెందమున విజయాశ నంకురింపఁ జేసికొనెను. విధి విలాస గతులలోని భ్రమ లిట్లుండును.

కం॥ విముఖం బగుచునె దైవము
సుముఖం బగు నడుమ నడుమఁ జోద్యంబుగ సిం
హము వోవుచునే ప్రత్యా
గమ భ్రమము వెన్క దిరిగి కావించు గతిన్.

తఱువాతఁ జంద్రరాజునకు సైనిక బలము పెల్లుగాఁ గూడినది. అతని యుత్సాహ శక్తి ముందుకుఁ బరుగు లెత్తసాగినది. ఆదీక్షతో నతఁడు పదునెనిమిది సైన్య పటలములఁ దోడు చేసికొని 'విజయక్షేత్రమును' బ్రవేశించెను. దీనితోఁ బోల్చినచో నుచ్చలుని బలము తేలిపోవును. కాని విధి తన చిత్ర చరిత్రను బ్రదర్శింపకుండునా?

గీ॥ మొగ్గు లేకుండ విరు పార్శ్వముల బలంబు
తుల్యముగఁ గూర్చి యొకతఱిఁ దూచి చూడఁ
గోరుచుండును దైవంబు గొనరు మాని;
యొక్కతఱి ముంచుఁ దేల్చు నింకొక్క వేళ.

పై సందర్భమున కనుగుణ మగు సంగతి నిందుఁగానం దగును. లోహారమునందు హర్ష సంబంధి యగు మండలాధిపతి యపారమైన సేనా నివహముతో శత్రువుల నున్మూలింప నుద్యుక్తుఁడై యుండెను. ఉచ్చలునివంక నుండిన పదాతి సేన పరిమితముగానే యుండినది. అయిన నేమి? ఆమండ లాధిపతి యంతటి సన్నివేశముతో నచటఁ జేరెనే గాని చేరిన మూఁడవ నాఁడు విధి కృత మతని యత్నమునకు నడ్డము దిరిగినది. ఏమన? ఉన్నటులుండి కుండలతో ముంచిపోసినట్లు బ్రహ్మాండముగ మింటికి మంటికి నేక ధారగా మహావృష్టి యేర్పడెను ఆ వర్ష పాతపు దెబ్బతో నెక్కడి సైన్య మక్కడనుండి చెల్లచెదరైనది. సైనికులు వరిమళ్ళ బురదలోఁ బడి ఘోయిరి. ఘానతోడ రివ్వున వీచిన

కర్కశపుఁ జలి గాలి సైనికుల కాయములను గత్తిరించినది. వారు తమ ప్రాణములను గత్తులను గటారులను గుఱ్ఱములను నెట్లు విడిచి పెట్టిరో వారికిఁ దెలియదు. అంతటి దెబ్బ తిని ప్రాణము లెట్టులేని గాపాడుకొనుటకై పశ్చ్యాదులకు నీడై పలాయితులై యొకరితో నొకరికి సంబధము లేనట్లు వీడిపోయిరి.

అట్టితఱి నుచ్చలుని సంబంధులు 'జనకచంద్రుఁడు' మున్నగు వారు లోహరమున దండయాత్ర జరిపి శత్రువులను నురుమాడ వచ్చిన మండలాధిపతినిఁ బట్టికొని కడతేర్చిరి. ఉచ్చలుఁడు మాత్రము చేఁజిక్కిన వానినిఁ జంపవలదని నివారించెను. కాని కడ కతఁడు మృత్యువు పాలు కాకుండఁ దప్పలేదు. 'హర్షభూపాలుని భృత్య వర్గమునందు దేవశర్మ మున్నగు వారును, ప్రకృత మీ మండలాధిపతియు రాజభక్తి పరులై రణరంగమునఁ దమ శరీరములను లెక్క గొనక వీరశయన మంది ప్రతిష్ఠ నొందిరి'' యని యానాటి ప్రజా వాహిని బహు భంగుల వినుతించి పేర్కొన్నది. అట్లు గాకున్నచో స్వార్థపరులై రాజ ద్రోహులై పేరు లేకుండఁ బోయిన వారెందఱో సంఖ్యాతీతముగ నుండిరిగదా! వారిని గుఱించి యెవ రేమి యనుకొనుచున్నారు? నిజము విచారించినచోఁ గడపటికిఁ దేలునది దైవ బల మొక్కటే కార్య నిర్వహణమునందుఁ గార్య విఘటనమునందును బ్రసాద నిగ్రహములను జూపి యిచ్చ వచ్చినట్లు విచిత్ర రీతులతో విహార మొనరించుచుండు నమట నిక్కమైన తీర్పు. లవన్యుల నున్మూలించుట గాని శత్రువుల వ్యామోహపెట్టి తఱుమగొట్టుట గాని విధి వశ మని భావించి నపుడు విజేతల నెవరు స్తుతింతురు? ప్రకృతినిఁ బరిశీలించుచో నీ వాస్తవము మనకు బాగుగా గోచరించును.

ఉ॥ అంబుధి నెల్లఁ గ్రోలు ముని
నందలి హాలహలంబు చంపెనే?
యంబుజ వైరి య య్యతల
మందలి చీఁకటినిన్ హరించెనే?
యంబుధిఁ బుట్టు వెజ్జు బడ
బానలం మార్పెడు నేర్పు గాంచెనే?
యంబుధి నింద్య మౌనే? జడ
మయ్యది. యన్నిట దైవమే దగున్.

అట్టి దైవ వైపరీత్యమున రాజభక్తి పరుఁడై ప్రాణము లర్పించిన యా మండలాధిపతిని గన్నతల్లి 'గజ్జా' అను నామమునఁ బ్రశంసనీయ చరిత్ర యయినది. తనకొమరుఁ డట్లు శత్రు విహతుఁడు కాఁగా దాను చితాగ్నికి స్వీయ గాత్రము నాహుతిగా నొనర్చెను. అంతకు ముందు హర్షభూపతి సంగ్రామ రంగములందు నామె కొమరుని నియోగించు చుండినపుడు పుత్ర ప్రేమ ననుసరించి రాజుతో ''ప్రభూ! నాకు వీఁ డొక్కఁడే కొమరుఁడు. వీనిని సాహసముతోఁ గూడిన రణ రంగములందు నియోగింపకుఁడు' అని దైన్యముతో వేడుకొనుచుండెడిది. అట్టి మాటలకు హర్షుఁడు ''అమ్మా! నీకుమారుఁడు నీకేకైకపుత్రుఁడు సరే, యనన్య భృత్యుఁ డనగు నాకును నీకొమరుఁడు ముఖ్యమైన యవలంబనముగ నున్నాఁడు. అని పల్కి యుండెను. అంతటి రాజాదరణమునకుఁ బాత్రుఁడైన తన కొమరునిఁ గోల్పోయి యాతల్లి విలువున నీరై చితాగ్నియం దనువులఁ బాసినది.

ఈ సంగతి యిట్లుండఁ దఱువాత నచ్చట నుచ్చలుఁడు హిరణ్య పురమును బ్రవేశించెను. అచ్చట నున్న బ్రాహ్మణు లందఱు నేక మయి యుచ్చలుని రాజ్యాభిషిక్తుఁ గావించిరి. ఆ సంగతి హర్షుఁడు దెలిసికొని మనసున మహాసంక్షోభము నొందుచుండెను. మంత్రు లతని నోదార్చుచు "రాజా! నీపక్షము నవలంబించి యుండు వారు పెక్కండ్రు గలరు. వారితోఁ గూడి యాలోహరాద్రి కడ కేగుము. అచ్చటి ప్రజలందఱు కొలఁది కాలమునకే క్రొత్త నృపతి యెడ ననురాగమును సడలించుకొని నిన్నే తప్పక సేవించి నీకు విజయమును గూర్చి నిన్ను తీసికొని రాఁగలరు, లేక నీవే కొలఁది కాలములో దిరిగి రాఁగలవు. అనుచుఁ బల్కిరి. కాని హర్షుఁడు వారితో మరల "మీరు దెల్పు పద్ధతి నాకు రుచింప లేదు. నాకుండు కోశము, అంతిపురపు టంగనలు, సింహాసనము మున్నగు నసామాన్య పరికరము నిక్కడ విడిచి పుచ్చి యక్కడికి నేగుట మంచిది కాదని నాకుఁ దోఁచుచున్నది. అని వచించెను.

అంతట నా సచివులు మరల రాజుతో "మహారాజా! నీతోఁ బెక్కండ్రు హయారోహులు బయలు దేరి వత్తురు. కోశము, అంతఃపురాంగనాది పరివారము సైతము వారువములయందు నీతోడనే గదలి రాఁగలదు. ఇందుకై చింత యేల? మఱియు నొక సింహాసనమును దన యర్హత యెఱుంగక యొకానొక శ్వపాకీ కాముకుఁడో మఱి యింకొక నీచుఁడో యెక్కెనుబో! అంతమాత్రమున నేమగును? అందువలనఁ గలుగు నభిమాన క్షతి యేమున్నది? ప్రభూ! దైన్యము నొందవలసిన పనిలేదు. కర్తవ్యమును జరుపుము." అని తమ యాశయమును వెల్లడించిరి.

హర్షనృపతి వారి యోదార్పు మాటలు విని "ఈమాట లటుండుఁడు. ఇంతకంటె శ్రేష్ఠ మయిన యుద్యమమును ఆలోచించి పరిశీలించి తెల్పుఁడు." అని పల్కెను అంత మంత్రు లుద్రేక పూరితులై సంరంభముతో విషయము తేటపడ నేకముఖమునఁ గర్తవ్యము నిట్లు విశదపఱచిరి.

## రాజ్యతంత్ర రహస్యములు

గీ॥ క్షత్ర ధర్మానుసారియై క్ష్మాతలంబు
నేలు భూపాలునకు దైన్య మేల గల్గు?
రణమునందు జయంబొ! వీర శయనంబొ!
హితముగా నెంచు నట్టి భూపతి యెడంద.

గీ॥ బిడియము భయంబు సచివుల భేద భావ
మును ననుద్యోగమును భూభుజునకుఁ దగవు.
అవియె వానికి శత్రువు లవుచుఁ జెఱచు.
గోత్రజులు శాత్రవు లటన్న గోల యేల?

చం॥ అలసత స్వీయ కార్యముల
నన్యుల పై నిడి యుండు వానికిన్
ఫల మది సున్న. వాఁ డిడుమ
పా లగుచుండును. గ్రుడ్డివాఁడు దా
నలఘువు దండమున్ గరముఁ
నందు వహించి చరింప గుంట మి
ట్టల నడుగడ్గునన్ దడబ
డన్ బడు పాటులె గా ఫలం బగున్.

చం॥ "అతుల పరాక్రమ [illegible]ఁడ మ
హాయుధుఁడన్ గదఁ నేను లెక్కయే
యితఁ డొక క్షుద్ర శాత్రవుఁడు
శ్రీఁ జయించెదు వీని మార్కొనన్
హేతుఁ డగులే తనంతటనె"
యంచుఁ దలంచు జడుండు మృత్యు సం
గతిఁ గను నట్టి యల్పుఁడె ప్ర
గల్భపు విక్రమ మొంది పైఁబడన్.

చం॥ ఒక తఱి నింద్రుఁ డౌ ను గ్రిమి,
యొక్క తఱిన్ గ్రిమి యింద్రుఁడౌ. నిదే
వికటపు లోక వృత్త. మిది
వింటనె యెప్పటి కప్పుడే. యితం
డొక మహనీయుఁ డితఁ డొక
యుక్కువుఁ డంచును గంట గొట్టుచున్
బ్రకటన సేయు వాఁడు గదఁ
బాలిశుఁ డాతఁడెఱుంగు నే విధిన్?

గీ॥ అలఁతి పగతునిఁ దలఁచుమఁ గలఁత నొంది
పిరికితనమునఁ గుందు నంతేద మెంత
సైనిక బలంబు వివిధ శస్త్ర సంపదలును
గలిగినన్ జిట్ట చివరకు ఫలము సున్న.

చం॥ సచివుల భేద భావమున
సాగునె కార్యము? సాగెనేని సం
కుచిత ఫలంబె యౌచుఁ దుద
కుం జెడుఁ. గవ్వపుఁ ద్రాటి నిర్వు రెం
త చతుర భంగిఁ బట్టికొని
త్రచ్చినఁ దక్రము వెన్నయున్ దగన్
బ్రచరిత మౌనె? భాండము వి
పద్దశకున్ గుఱి గాక తప్పునే?

గీ॥ ఎచ్చ పెచ్చుట వైరి కాలిడినొ? యచ్చ
టచ్చటికి దండుఁ దరలించి యణఁగఁ ద్రొక్క
వానిఁ, దన విజయంబు సార్వత్రికముగ
వెలయు నట్టు ప్రయత్నింప వలయు తేఁడు.

ఉ॥ దైవ మొకప్పు డా విధుర
తన్ బెడ మోమును బెట్టుఁగాక! మే
ధా విభవోన్నతిం సుచరి
తంబును పీడవి చక్రవర్తి నా
నా విధ వైరి సైన్యము న
ణంచుచు సంగర రంగమందు భూ
దేవిని గౌఁగలించియును
దివ్య యశ స్స్ఫురితాంగుఁ డౌఁ గదా!

మ॥ కరుణాశ్చర్య రసంబు లొక్క తఱిఁ గ
ల్గన్ జేయు నృత్యత్కబం
ధ రుచుల్ నిండఁగ, జ్యా గుణ ధ్వనులె వీ
ణా క్వాణమై మ్రోఁగ, సం
గర రంగస్థ శివా ముఖ జ్వలన రే
ఖల్ దివ్వెలై యొప్ప బం
ధుర భాగ్యోన్నతి వీర శయ్యఁ గను యో
ధుల్ స్తోత్ర పాత్రుల్ గదా!

కం॥ "పవరపు టుదాత్త కృత్యము
చివరది" యను చేదొ పల్కు చిత్తంబున కై
తవము నిడి రాజ్య తృష్ణన్
దవిలెడు వారికి యశస్సు దక్కునె జగతిన్?

గీ|| అనుచు సచివులు పల్కిరి. హర్షనృపతి
మదికి రుచియింప దయ్యె నియ్యదియు నంత
నతఁడు మంత్రాంతరముఁ దెల్పఁ దనుచు నడిగె.
వారు నిట్టూర్చి విధి లేక పల్కి రిట్లు.

గీ|| ఓ ప్రభూ! తమ్ముఁ దుత్కర్షుఁ దుదిలగొనుచు
నిహముఁ బాపిన చందాన, నీవు నిట్టి
సంకటమునఁ దను త్యాగ సరణి గనుట
తగు ననిరి వారు పరుసంపుఁ దనము గదుర.

కం|| అప్పలుకులు విని హర్షుం
డిప్పటి కి య్యదియె నాకు హిత మగునే స్మి
రిప్పుడె ననుఁ గెడపుడు, నే
నప్పని స్వయముగ నొనర్ప నసమర్థుండన్.

మ|| అనుచున్ గాపురుషోచితం బయిన దై
న్య క్లైబ్యముల్ రూపు గాం
చిన చందాన నృపుండు పల్క సచివుల్
చింతాకుల స్వాంతులై
ఘన బాష్పోద్గతి గద్గద స్వరములన్
గారుణ్య మేపారఁ గా
జననాథుం గని దెల్పి రిట్లు హృదయ
స్వచ్ఛంద భావంబులన్.

గీ|| దేవ! దైవోపహతిఁ జేసి దేవురించు
చున్న మావంటి వారు నీ కున్న నేమి?
పోయినను గల్గు లోటేమి? భూరి దుఃఖ
మందు చుంటిమి నీమాట లాలకించి.

కం|| దీనుఁ దగు ప్రభునిఁ గని త
ద్దీనత మానుపఁగ లేని దేబెలు భృత్యుల్
మానవులె? పసులకంటెను
హీనులు వా రనుచుఁ బల్క నెంతయుఁ దగదే!

కం|| యుగముల కొలఁదిగఁ బ్రతికియు
నెగురును జీవితపు హంస యెప్పుడొ! త్యా
గ గరిమ సాధ్యార్థమునకుఁ
దగనట్టి మనుష్య జీవితం బది యేలా?

కం॥ పతిఁ బాయ లేక తామును
చితి నసువులఁ బాయు నట్టి స్త్రీలు గదా ధ
న్యతమలుః బ్రభు దుర్గతి గని
వెత నొందుచుఁ దోడ్పడని కుభృత్యులు విధవుల్.

ఆ. వె॥ భటులు నటుల రీతి భయ శోక దైన్యాది
కము నటించి భృతులఁ గొందు రెందు.
నట్టి దేశ మగు వియ న్నదీ తీర్థ పా
వనమె యయ్యె దురిత పంకిలముగ.

సీ॥ ఆఁకట నల్లాడు చదవద యోచను
బసిబిడ్డ లంతంత బడలుచుంట
స్నేహితుం డాపద చెందుట, భార్యయుఁ
బరునింట దాసియై బ్రతుకుచుంట
గడ్డియు గాదంబుఁ గానక పాడి యా
వంభా రవంబున నలయుచుంట
తల్లి దండ్రులు జీవితముఁ బాయు దశలో వి
తాకు నొందుటయును ధరణిపతియు

గీ॥ బగతునికిఁ జిక్కి భంగంబు పడుట యెల్లఁ
గాంచుచున్ గుండె బ్రద్దలై కరగి పోవు
పురుషునకు లెక్కయే యమ పురమునందుఁ
గలుగు నరకంబు లోని దుఃఖంబు లెల్లః

గీ॥ అనుచు మానవ పశువులై యలమటించు
తన సచివులకు హర్షం బుదాత్త చిత్తుఁ
డయ్యె దయ్యంబు పట్టిన వాఁడు వోలె
విహ్వలుం డౌచుఁ బల్కెఁ దబ్బిబ్బు గాఁగ.

గీ॥ జరిగి పోయిన కాలాన జరుగుచున్న
యీ తతిని రాజ్య భోగము లెల్లఁ బుడమి
నన్యుఁ డెవ్వండు నావలె ననుభవించెః
నాకుఁ గలిలో సమానుఁ డున్నాఁడెః చెపుడ.

చం॥ ప్రమ గలుగన్ వచించెద "ధ
రన్ నరనాథుని యోష్ఠ భాగ ము
య్యమునకు నా కుబేరునకు
నాసన మయ్యెడు" నన్న యట్టి వా
క్యమునకు నేనె కా కలియు
గంబున దిక్కుః మ తెవ్వరుందు రం
త మహిమ గన్న వారలు? వి
తాకును బొందక యాత్మఁ గాంచుఁడీ

గీ॥ జగతి నింద్రుం డుపేంద్రుండు శంకరుండు
మొదలు గాఁగల వారికిన్ ముప్పు దప్ప
దయ్యెఁ గదః ధర్మ పథమున నడుగునట్టి
మర్త్యునకు నేల నియతి సంభవము భయము.

గీ॥ కాని, నా కొందు గలిగె దుఃఖంబు. వసుధ
సుమతి సతి వలె నుండియుఁ జొప్పు దప్పి
వాదు దోషాన విడనాడి నన్ను హట్ట
చేటివలె నమ్ముచేఁ జిక్కి చెడునో యనుచు.

గీ॥ శౌర్య గరిమను జూపి యశస్వి యగుచు
రాజ పాలించుచేగద రాజ్యకము
కుట్రలు కుతంత్రములు పన్ని కువలయంబు
నేలఁ జూచెదు బిడుఁడు గగ్గోలు పడఁడె

గీ॥ అమ్య లొనరించినట్టి కార్యం బలౌకి
కంబు వల వంద్య మౌటను గాంచలేని
అల్ప సత్త్వులు ప్రాప్తోదయాతిశయులు
పరిహసింతురు దమదు దర్పంబు పొంగ.

కం॥ ప్రజ తలచుగఁ గార్యము వల
విజయంబును గాంచి మెచ్చు. విగుణిత యొద్దే
వి జనించినచో దావన్
గజము విదంబున నిమీలికన్ గాంచుఁ గదా

చం॥ సురపతి 'పర్వతారి' కడు
చోద్యముః సంద్రముఁ ద్రచ్చు వేళ మం
దర గిరి మంథ దండముగఁ
ద్రాడుగ వాసుకిఁ జేసి కొంచుఁ జి
ల్కిరి కడలిన్ సురాసురులు.
క్లేశపడన్ సుధ గల్గె దాన. నా
గరళము పుట్టు కారణము
గన్గొనఁ డా గిరి వైరి నెమ్మదిన్.

గీ॥ శాస్త్రముల యంతు గనుగొనఁ జాలి ప్రజల
బాగుకై నేను 'శ్రీగర్భ' భావ మొంది
యుండ నా యత్న మిపు డిట్టు లెండి పోయె.
జడుఁడ నై యుంటి నీ పెద్ద సమయమందు.

గీ॥ ఉచ్ఛలుం డన నెంత? ఆ యుక్కివునకుఁ
గల తెలివి తేట లెంత? నా కర నఖాగ్ర
ముల గణన కేని దగనట్టి మూర్ఖుఁ డిపుడు
నన్నుఁ గను శ్యామ దశన విన్యాస దృష్టి.

కం॥ కావున నవమానంబున
కే వెఱచుచు దుర్బలుండ నైతిని. సం
భావించు చుంటి మరణము
నీవిధముగ. నిదియె నాకు హిత మియ్యెడలన్.

కం॥ మనవారు రాష్ట్ర సంర
క్షణమున జాగృతిని నొందక యుపేక్షను జూ
పిన కారణమున నా తను
వును దొరఁగుచు లబ్ధ యశముఁ బోషింపఁ దగున్.

సీ॥ వినుఁడు చెప్పెదఁ బూర్వ వృత్తాంత మొక్కటి
నా చరిత్రకు సమాన మగు దాని
క్ష్మాపాల వరుఁడు 'ముక్తాపీడ' నాముఁడు
సర్వ సర్వంసహా చక్ర మెల్ల
తన ధర్మ పాలన దక్షత మెఱయించి
వర్ధిల్లఁజేసెడి వాంఛ గలిగి
ది గ్జైత్ర యాత్రకై తెగువతో సైన్య వి
న్యాసముల్ నలుగడ సందడింప

గీ॥ నొనరిచియు నుత్తరాపథంబున నలంతి
పరిజనముతోడ యాత్రను జరుపుచుండ
మచ్చరులు కొంద ఱేకమై మార్గ మెఱిఁగి
ముట్టడించిరి వానిని ముమ్మరముగ.

కం॥ అని సేయఁ దగిన సైన్యం
బును గానక తత్తరించు ముక్తాపీడున్
గని యెనిమిది లక్షల సే
నను గొని యెదిరించె శల్య నరపతి యచటన్.

కం॥ అంతట శల్యుఁడు క్రోధా
క్రాంత స్వాంతుఁ డయి ప్రతిన కావించెను "దు
ర్దాంతుని ముక్తాపీడుని
వింత పశువు గాఁగఁ బట్టి వేసెద నిచటన్".

మ॥ అనుచున్ బల్కిన శల్య పల్కు లవి క
ర్ణాభ్యంతరంబందు గ్రు
చ్చిన శూలంబులు గాఁగఁ జిత్తమునఁ గా
ర్చి చ్చేర్పడన్ దీవ్ర యా
తనతోఁ గుందుచు ముఖ్యమంత్రిఁ గని ము
క్తాపీడుఁ "డింకేమి చే
యు నగున్ దెల్పు" మటంచుఁ బల్కెఁ గడు దై
న్యావిష్ట చేతస్కుఁడై.

గీ॥ సచివ శేఖరుఁ డా 'భవస్వామి' స్వామి
భక్తి పరుఁ డౌట నప్పు డేర్పడిన యట్టి
యాపదను బాప నెంతేని యాత్మవరసి
దిక్కు దోఁచక తనకుఁ దా దెప్పరిల్లి.

గీ॥ "దైవ మనెడు ప్రవాహంబు దారి నెఱిఁగి
దాఁటవలెఁ గాని, యెదు రీఁదఁ దరము గా"ద
టంచుఁ గర్తవ్య ధర్మం బనల్ప దృష్టి
నాత్మఁ దలపోసి నృపతితో సచివు డిట్లు.

ఉ॥ ఆపదఁ బాపు యుక్తి హృద
యంబునఁ దోఁచక యుండినన్ జగ
ద్వ్యాపి యశోభిమాను లగు
వారికి, లోభము నెంత మాత్రమున్
దాపునఁ జేర నీయని యు
దార చరిత్రుల కాత్మయందు సం
తాపము సంభ్రమంబును వి
తాకును నేర్పడ వించు కేనియున్.

గీ॥ "కృతక్య విదునకు లబ్ధ మౌ కీర్తి మొదట
రక్షణీయంబు. విపుల సామ్రాజ్య మొంద
జరుపు వ్యాపార మది యానుషంగికం" బ
టంచు నెఱుఁగంగఁ దగు మానవాధినేత.

మ॥ అనవద్యం బగు కీర్తి వెన్నెల భువిన్
వ్యాపింపఁగాఁ జేయఁ గ
ల్గిన ధన్యాత్ముని మేను భస్మ మయినన్
గేయంబె యౌ చుండు. నా
ఘనసారంబు జ్వలించి బూఁది యయినన్
గానీ తదీయంబు క
మ్మని సౌరభ్య మ దట్లె యుండుట తలం
పం బోలు నీసంగతిన్.

గీ॥ జీవితముఁ బాసి కీర్తి శేషింపఁ దనరు
వానికి, ననంగునకును జీవ ప్రతిష్ఠఁ
జేయునవి రెండు వందుల జిహ్వ. లంగ
నల యపాంగంబు లద్భుతములు గ్రమముగ.

గీ॥ ఖ్యాతిఁ గాపాడు కొను వాని కాయ మర్వి
వరలుఁ గల్పాంతర స్థితి వన్నె తోడ
నిభృతముగఁ గీర్తి కాయంబు నిల్చి యుండఁ
గలవు సంపూర్ణ పరమాణువులు ధరిత్రి.

గీ॥ ఉన్నతి ధ్వంసమును జేయు చుండు నట్టి
దైవము విరోధు లం దవధాన గరిమ
జూపు చుండుట ధీరులు సూక్ష్మ దృష్టిఁ
గనుగొనుచుఁ జేయవలెఁ దమ కర్జములను.

ఉ॥ తాను సరోజ సంభవుఁడు
ధాత, సరోజ కులంబు మోడ్పు దూ
రాన జరించు నట్టి ద్విజ
రాజుఁ గళంకివిఁ బూన్చియున్ "బవల్
వాని కదెట్లు సాధ్యం." మని
వారక యక్కటా! యమ్మద ద్విపో
ద్భూన కర ప్రహారముల
సొంపు చెడ న్పడగొట్టుఁ దమ్ములన్.

గీ॥ ఖ్యాతిఁ జెడఁ గొట్టు హతయముతోఁ గవియు విధిని
ధీర హృద[illegible] నెదిరింప దిటవు లేని
వార లుర్వఁ జిరము జీవముల నిల్పి
యేమి గాపాడఁగలరో! యింకేల బ్రతుకు?

ఉ॥ ఆ రుచిరాల్ప వేత్రములు
స్వాశ్రయమున్ ధరణీశు ముద్భవో
దారము వంశ వర్గమును
దావమునం బడి ప్రోచు చుండఁగా
ధీరత లేక పౌరుషపుఁ
దేజముఁ గోల్పడి ద్వార భూ మిని
కాన వికార జీవనముఁ
గాంచు నరుల్ మన నేల యీ ధరన్.

గీ॥ అని 'భవస్వామి' తన హృదయమును దెలిచి
మరల నిట్లనె, దేవ! కామ్యములు దీరె.
రక్షణీయం బిఁకొక్కటె చిరంబు వెలుఁగు
దివ్య తర మైన కీర్తి చంద్రిక పవిత్రి.

గీ॥ కావునన్ చార ముఖమున 'భూవిభుండు
'దండకాలనకం' బను దారుణాము
యంబు దగులుటఁ బడియుండె" ననుచు దెలివి
యందు కనువుగ నటియింప నగును నేఁడు.

కం॥ ఈదిన మిట్టులఁ గడచిన
నో దేవా! ఱేపు నూతనోద్యమ మేదో
యా దైవ యోగ ఘటనము
మూదలగా నొనరఁ గార్యమును సాధింతున్.

కం॥ అని యిట్లు సచివ ముఖ్యుఁడు
తన వసతిం జేరె. నంతఁ దా ముక్తాపీ
డ నరపతి యమ్మహాగద
మును బడపిన యటు నటింప మొదలిడెఁ బిదపన్.

కం॥ మిడి గ్రుడ్లతోడఁ గన్నులు
సుడి షుడి గొన వెఱ్ఱి చూపుఁ జూచుచుఁ బుడమిన్
బడి చెమ్మటలును వాంతులు
గడలుకొనన్ భీకరంబుగాఁ గేక లిడెన్.

ఉ॥ ఆ నరనాథు దుస్థ్సితిఁ బ్ర
జావళి గాంచుచు "నింక నిట్టి భూ
జానికి జీవముల్ నిలుచు
సంగతి లే" దని పల్కఁ. రంతలో
నా నినదంబు పెద్ద దయి
యంతట నిండెను. ముఖ్యమంత్రి యం
ద్దాన నెఱుంగు భూవిభుఁడు
తత్క్షణ కృత్య మటంచు నెంచుచున్.

గీ॥ వహ్ని దరి కొల్పి యా భవస్వామి యందుఁ
బడుచు "మా ప్రభునకు నింకఁ బ్రదుకు లేదు.
నాదు జీవన మేల? యనాథు లగుచుఁ
బ్రజలు బ్రతుకంగ నేల పరాభవమున?

కం॥ అని, యందుఁ దనువుఁ బాసెను
'జననాథుని 'దండకాలసక రోగం' బం
టునఁ గల్గు"ననుచు వైరులు
చని రచ్చటు వాసి భయము సంధిల్ల వెసన్.

కం॥ అంతట ముక్తాపీడుఁడు
మంతనమునఁ జెప్ప కిదియె మంచి దటంచున్
వింతగ ముఖ్యామాత్యుఁడు
సంతసమునఁజేసి నేను సలుపఁగఁ జూపెన్.

కం॥ అని నెమ్మనమునఁ గార్యం
బును నిబ్బరముగఁ దలంచి 'భుగభుగ' మను వ
హ్నినిఁ బడి పార్థివ దేహం
బును వీడి యొక శ్శరీరమును గాంచె వడిన్.

గీ॥ ఇటుల దైవోపహతులు మహీపతులును
మంత్రులును గొందఱుం బ్రధిమాన ధనులు.
వారు తమ మేను దృణమునువలెఁ ద్యజింత్రు.
గణ్య మగు కీర్తి కాయంబుఁ గాచికొంద్రు.

కం॥ ముక్తాపీడుని చరితము
వ్యక్తావ్యక్తముగ సచివ వర్గమునకు రా
ద్భక్తి గలిగింప హర్షుఁడు
యుక్తి నిటులఁ దెల్పి మిన్నకుండెను. పిదపన్.

గీ॥ హర్షభూపతి కావించినట్టి యీ ప్ర
సంగమును విని సచివులు సంభ్రమించి
యట్టి విషయంబు మాని దేవా! త్వదేక
పుత్రు వంశాంకురము భోజుఁ బ్రోవవలయు.

కం॥ అనుటయు నట్టే యగుఁ గా
కని రక్షణ దక్ష దుర్గమందుఁ దనయు భో
జుని నునుపఁ దగిన యట్లు ప
యనమున్ సాగించుచున్న హర్షనరేంద్రున్.

గీ॥ దండనాథుఁడు భీతుఁడై తత్క్షణమున
"సమర రంగస్థలంబున సాయపడఁగఁ
ద్వరితముగ భోజ యువరాజ దండుతోడఁ
బంపు" మని కోరె. నతఁ డట్లె పంపె సుతుని.

ఉ॥ ఆపదలందు విహ్వలత
నందక కార్య ధురంబు దీర్పఁగా
నోపిన ధైర్య సాహస మ
హోన్నతి గాంచిన ధీవిశాలురున్
పాపము! నాశ కాల మటు
ప్రాప్తము గాఁగ సమస్త శక్తియున్
రూపఱి పోయి విక్షత గ
రు ద్విహగంబులవోలె నుంద్రుగా!

గీ॥ లక్ష్మి యనెడి చల త్తటి ల్లత. యశో బ
లాక. శౌర్యం బనెడి ప్రబల స్తనితము.
దీపిత మహా ప్రతాపేంద్రచాప. మనున
వనుసరించును భాగధేయాంబుదమును.

మ॥ అపురూపం బగు దైవ యోగమున ల
భ్యం బైన భాగ్యంబుతో
నృపుఁ డున్నన్ బ్రజ లబ్బురంపడుచు "మ
న్నీఁ డీతఁ డింకేల యిం
ద్ర పదంబున్ గైకోఁ" డటం; ద్రతఁడె దు
ర్దైవంబు పాలై మహా
కృపణత్వాంధ్య జడత్వముల్ పడయుచో
కే ల్బాపి గర్హింం త్రెదన్.

చివరకు హర్షభూపతి గతి యీచంద మయ్యెను. అంత నా మేదినీశ్వరుఁడు శత్రుసైన్యము నెదిరించుటకై శ్రీనగరియం దుండు తంత్రి సైన్యమునుగూడఁ బ్రవాసపుఁ బసదన మొసఁగి పంపెను. రాజభృత్యు లెల్లరు హర్షుని విడిచిపెట్టి దాయాదుల వంకఁ జేరి పోయిరి. ఎవ రైనఁ గొందఱు తేనిఁ గనిపెట్టికొని యున్నను నట్టి వారందఱు నప్రయోజకులు తండుల ధ్వంసకులుగను నుండిరి. వారికిఁ బరుల ప్రక్కఁ జేరు సంకల్పమే లేదు. అంతమాత్రమున వారివలన నేమి ప్రయోజన ముండును? స్త్రీలవలె వా రాత్మ హత్యఁ జేసికొనిరి.

మఱియొక విశేష మేమన? నర్తకీ వంశమునఁ బుట్టిన 'కాణశ్రావతి' అను నర్తకి తన కెక్కడనో దొరకిన 'జయమతి' యను కన్నెను దగ్గఱ దీసి గారాబముతోఁ బెంచెను. ఆ కన్నె తన నూతన తారుణ్య దశయందే యుచ్చలునిఁ బ్రేమించెను. కొంత కాల మైన తఱువాత నా 'జయమతి' ధన లుబ్ధయై మండరేశ్వరుని యవరోధ కాంత యయ్యెను. ఆ మండలాధిపతి రణ నిహతుఁడు కాఁగా, మరల నుచ్చలుని వలచి యతని ప్రేయసిగా నయ్యెను. అమెయే యిఁకఁ బట్టపు దేవేరి కాఁగలదు. ఈ రహస్య మిట్టిది.

ఇట్టి సంకట తరుణమున నగరమునందలి రాజ సేవకులు వరుసలై చదురు దీరి తేనిఁ గనుగొన్నను భయ భక్తులు లేసి వారై యుచ్చలుని పరాక్రమ శక్తి మెచ్చుచుఁ జర్చలు సేయ సాగిరి.

మఱియు వేతనము గైకొను భృత్యు లందఱును నొక నాయకు నెన్నుకొనిరి. వాఁడు వారి కందఱకును నాహారాదు లమర్చుచు రాజున కెదురు దిరుగు సంగతులను నర్మగర్భముగ నేర్పుతో నూఱి పోయుచు నెదురు పల్కు వారి నెక్కి రానీక రాజభక్తి విముఖతను బ్రబలఁజేసి యోధులను సమర పరాఙ్ముఖులను గా నొనర్చుచుండెను. ఇట్టి సైన్య విసూత్రణము మహానర్థకారి యయ్యెను.

ఇట్టి సమయమున శ్రీలేఖ యొక్క సోదరుని మనుమఁడు 'వ్యడ్డమంగళుఁడు' అనువాఁ డొకఁ డుండెను. అతఁడు మల్లుని జ్ఞాతి బంధువు. అందువలన తేఁడు వానిపైఁ గినుక నూని యతనినిఁ గడతేర్చెను. అతఁడు మల్లుని కొమరు లగు నుచ్చల సుస్సలుల యొక్క మేనమామ కుమార్తెకు భర్త. ఆ మంగళుని భార్య పతి పతనమును విని దుఃఖ వివశయై తన గేహమునందే యగ్నిని రగుల్కొల్పి తనయుత్త గారితోడ నందఱికి యసువులఁ బాసెను.

ఇట్లు మల్లరాజు పరమ దాంభికుడై శ్రీనగరియందు మౌన వ్రతమును బూని తనలో తగుల్కొనుచున్న కినుకను బైకిబ్బనీక బహువిధములయిన మంత్రము పన్నుచు నెక్కుడు చిక్కులను గల్పించుచుండెను. అట్టి సమయమున శాహిరాజు కుమారు హర్షమహీపతితో "ఈ మల్లరాజు తన పుత్రులకు రాజ్యము కట్టి పెట్టవలయు నన్న తలంపుతో, నెక్కుడు పన్నాగములను బన్నుచున్నాడు. వీని నిప్పుడు నిర్భయముగ సంహరింపుము." అని పురికొల్పిరి. వారి మాట విని హర్షుడు స్వయముగా మల్లుని గృహ ద్వారమును జేరి యతని బరిమార్పనెంచెను. అంతట మల్లరాజు తనప్రాణములను బలి గొననున్న హర్షునికడ దన యాశయము నిట్లు వెల్లడించెను. "నా కుమారులు నీయెడ ప్రతి భటత్వము జూపి తమకడకు నన్ను రా గోరగా ముని వ్రతుడనై సదాచారమును బాటించు నన్ను విడువక యుండే నిత్యాగ్నిహోత్ర సపర్యలతో గాలము గడపుచుంటిని. అంతియ కాని విశేష మెఱుగను. నీ విశ్వాసమునకై యుచ్చల సుస్సలుల మాఱుదల్లి గోమునులను నల్లానాములను సైతము విడిచి పుచ్చితిని." మల్లరాజు పల్కిన యీ మాటలు హర్షునకు నచ్చలేదు. మీదు మిక్కిలి ముని వ్రతుడును నిత్యాగ్ని హోత్రియునై యున్న మల్లునిపై హర్షుడు కినిసి యతని సంహరింప యత్నించెను. ఇంతకును హర్షు డానన్న మరణుడై యుండుట కారణ మనవలసి యున్నది.

పిమ్మట మల్లరాజు దనను చదముట్టింప నుద్యుక్తుడై సేనతో గృహ ద్వారమున నిలిచి వెలుపలికి నెట్టింప సిద్ధపడి యున్న హర్షునికి జంకక యప్డే దేవతాపూజ గావించి ఆ వేషముతోడనే బయలుదేరెను. అపు డా మల్లుని జందెము వెలికి దృశ్య మగుచుండెను. చేతియం దుంచుకొన్న జప మాల దర్భలు నట్లే యుండెను. లలాటము భస్మ త్రిపుండ్రములతో దీరియుండెను. స్నాన జలముచే దడిపి యింకను నాఱక యుండిన సగము తెల్లవాఱిన వెండ్రుకల ముడితో దేహ త్యాగమునం దతడు ప్రయాగ గంగను దలయందు ధరించెనో యన్నట్లుండెను. మఱియు నతడు ఖేటకము నుష్ణీషము గను, ఖడ్గమును దండముగను ధరించి వీరపట్టమును గట్టి అసిధారా తీర్థ పాంథునివలె బ్రకాశించుచు వెలికి వచ్చెను.

అప్పుడు హర్షుని యగ్రసరులైన భృత్యులు కొందఱు మల్లరాజు నెదిరింప వచ్చిరి. వార లిహమందు భార్యాపుత్రాదులతో సుఖముగా జీవింపఁగోరిన వారుగా నుండిరి. అయినను అప్పు డచ్చోట మల్లరాజుతో బోరి యతని తేజమున మాడి యమర్త్య భోగముల ననుభవింపఁబోయిరి. మల్లరా జప్పుడు ద్వారమునందు నిబిడముగా నిండి యున్న యోధవారమును గాంచి యించుకేని జంకక యా వీరంద్ర భట సందోహమం దొక్కడుమును వేసెను. అంతట నాతోడ దందఱును పలురకము లయిన యాయుధములతో వానిని ముట్టడించి ప్రహరింప సాగినను మల్లరాజు తన తీరమును గోల్పోవక శైవాలమును బోలిన యా భటుల ఖడ్గముల నడుమ బద్మముల కైన యైన వారి తలపాగల మధ్యమునందును ముదిమిచే దెల్లవారి యున్న యతడు రాజ హంసము వోలె విరాజిల్లెను. ఆ క్షణమునందే యతడు నూర్లకొలది శరములచే వేధింపబడి వీరశయనము గాంచి రెండవ భీష్ముడో యన నొప్పారెను.

ఇట్టి తరుణమున హర్షుఁ డొనర్చిన చెడ్డ పని మిగుల నిందార్హము. శోచనీయము. ఏమనిన? వీరశయనము నొంది యున్న మల్లరాజు మస్తకమును గోసి హర్షుఁ డతని వీఁపుపైఁ దన తురంగమును బలుమాఱు నాట్య మాడించుచు వినోదించెను. ఇట్టి దురహంకార మెంత నీచమైన దనవలయు?

అట్టి తఱి మల్లుని రాణి 'కుముదలేఖ' ఆమె చెల్లెలు 'వల్లభయుఁ' దమ గృహమందే యగ్నినిఁ బ్రజ్వరిల్లఁజేసి యందుఁ దమ శరీరముల నర్పించిరి. మఱియు సల్హణ రల్హణుల సతులు మల్లుని కోడండ్రు రాజావకల్యుల పుత్రికలును దమ దేహముల వహ్నిసాత్కృతములఁ గావించిరి. ఇంకను సర్వ భోగముల ననుభవింపఁ దగిన కన్య లార్వురు సైతము తమ ప్రాణముల నగ్నియందాహుతి యొనర్చిరి. వీరంద ఱిట్లు తమ దుఃఖ పూరిత బాష్ప జలము నింపుటవలనను వహ్ని రగుల్కొల్పుటచే మండి పోయెడు భవనపంక్తి వేడిమి వలనను వితస్తానదియందలి నీటికిఁ దాప ముదయించెను. ఆ వితస్తానది యెడమ భాగమున నిట్లు జరుగఁగా దక్షిణ తీర భాగమునఁ దమకొమరుల యుద్యమమును గనిపెట్టుచున్న మల్లరాజుయొక్క రాణి, ఉన్నత కులోద్భవ 'నంద' యను నామె తనను జిన్నతనమునుండియుఁ బాలొసఁగి పెంచిన చాంద్రి యను నామెతోడ నతఃపురమున నుండి యందే వహ్నిని రగుల్కొల్పి తన యసువుల నందు వేల్చెను. ఆ రాత్రి నందాదేవిని విడువలేక తానును హవ్యవాహనుని పా లయ్యెను.

మఱియును, ఆ నందాదేవి తానున్న హర్మ్యమును రగుల్కొల్పినప్పు డా వెలుఁగు మూలమున దక్షిణోత్తరభాగములందు వాహినులతో విడిసి యున్న తనకొమరుల నుచ్చల, సుస్సలులను గనుగొని నిట్టూర్పు పుచ్చి యాట వెలఁదులవలెఁ దనపార్శ్వములందు నటించుచుఁ బ్రజ్వరిల్లు నగ్ని జ్వాలలందుఁ దనదాది యగు 'చాంద్రి'తోడ నుఱుకుచు దుఃఖ భారమున నీరీతి శత్రువును శపించెను. "ఇఁక గొన్ని దినములలోపలనే తండ్రిని ద్వేషించి పాపియై యున్న శత్రువుపై (హర్షునిపై) తన పుత్రుల పరాక్రమ హేతి జమదగ్ని పుత్రుఁడైన పరశురాముని తేజమును స్ఫురింపఁ జేయుచు విజయమును సాధించుఁగాక." ఇట్లు శత్రువును శపించుచు నాపతివ్రత వీతిహోత్రునకు హవి స్సయ్యెను.

ఇఁక హర్షుఁడు పూర్వము స్వామి ద్రోహియై రణమునఁ బరాజితుఁడై యుండిన దర్శనపాలుఁడు పలుమాఱు తన కగపడుచున్నను హర్షుఁ డతని నిర్మూలింపలేదు. అందుకుఁ గారణ మతనికిఁ గల యాయు శ్శేషమో, మఱి కొంతకాల మతఁడు జీవధారియై యా యమ బాధ ననుభవించుచు గతింప వలసి యుండుటో కారణము కావచ్చును.

తఱువాత నుచ్చల సుస్సలులు భాద్రపద కృష్ణ పక్ష నవమినాఁడు తమతండ్రి నారీతి శత్రువు తుదముట్టించె నన్న సంగతి తెలిసికొని మిగుల దుఃఖించిరి, కాని యా దుఃఖమును వారి డెందముల రగుల్కొన్న ప్రచండ క్రోధాగ్ని జ్వాలలు పీల్చివేసినవి.

అంత సుస్సలుఁడు మఱునాఁడు ప్రస్థాన మొనర్చుచు 'వహ్నిపురక' గ్రామము మొదలువెట్టి తన క్రోధవహ్నిచే హర్షుని ముఖ్యస్థానములను రూపు మాపుచు విజయక్షేత్రమును సత్వరముగఁ

జేరెను. యుద్ధ మొనరింప నుత్సాహియై యున్న యాసుస్సలుని 'చంద్రరాజు' పట్టదర్శనపాలుఁడు మొదలగు వారు చమూ సమూహములతో రాఁగా, మిగుల నుత్సాహముతో నెదిరించెను. ఆతరుణమున సుస్సలుఁడు పరిమిత సైన్యుఁడు. అట్టివాఁడు బహువిధ బహుళ సైన్యము గల వైరితోఁ బోరవలసి వచ్చెను. తనపరివార మక్కడఁ దట్టుకొనలేక కొంత యుపేక్ష చూపినను నతఁ డా మహాసంగ్రామ రంగమునందుఁ దనశౌర్యమును నినుమడింపఁజేసికొని చాల తడవు దుష్కర మగు వీర విహారము సల్పెను.

ఆ సమరమునందు రాజగృహమున మండు 'అష్టోటమల్లుఁడు' 'చాచరిమల్లుఁడు' అను వారిర్వురును బుడమిఁ బాసి సుర నారీమణులవలన సుఖ మనుభవింపనేగిరి. ఆ రణభూమియందు రేగిన ధూళి యంతటను నిబిడముగ నలముకొని యుండుటచే నా ప్రదేశ మంతయు నంధకార బంధుర మయ్యెను. అయినను నచ్చటి శ్వేతచ్ఛత్రముల కాంతి పుంజము లేఁత వెన్నెలయై యొప్పారెను. ఈ తీరుననే మఱి కొంత తడవు బెట్టిదపు పోరాటము జరిగెను. అంతలో నా 'చంద్రరాజు' అతని సహ చరుఁ డగు జిందురాజును నేలఁగూలి దివ్య సుఖము నొందఁ బోయిరి.

ఇఁక నేమున్నది? వీరుఁ డగు చంద్రరాజుపై నాధారపడి యున్న హర్షవసుమతీశుని యాశ యనెడు కమలినీ కందమును దైవ మనెడి మత్తకరి నిర్మూలించిన దని చెప్పవచ్చును. అంతట 'పట్టదర్శనపాలురు' మున్నగువారు భీరువులై పాఱి వచ్చి విజయేశ్వరుని ప్రాంగణమును బ్రవేశించిరి. సుస్సలుఁడు స్వేచ్ఛగా విజయక్షేత్రమును బ్రవేశించెను. అతఁ డట్లు ప్రవేశింపఁగనే యా క్షేత్ర ద్వార మును పట్టాదులు బంధించిరి. అట్లు చేసినచో సుస్సలుని బంధింపవచ్చు నని వారి పిచ్చి భ్రమ. పద్మ నాభుఁ డనువాఁడు సుస్సలుఁడు లోనికి రాకుండఁ జేయుటకై యెదిరించెను. కాని, యతఁడు త్వరలోనే యమసదనమునకుఁ బయనమై పోయెను. సుస్సలుని ప్రక్కవారు దామరులు లక్ష్మీధరునిఁ బట్టి బందిగా నొనర్చిరి.

తరువాత సుస్సలుఁడు విజయేశ్వర కోశ సౌధోపరి భాగమును జేరెను. అం దతఁడు దిగువ భయ కంపితులై పశువులవలె నేమియుఁ దోఁచక యున్న కోశాగార రక్షకులను గాంచి దూర్త పద్ధతితో మధ్యస్థ భావము నొందిన వానివలె నటించుచు నవ్వుచు వారిలో పట్టుఁడు, దర్శనపాలుఁడు, అను వారి నిరువురను మొదటఁ దనచెంతకు రావించెను. అచ్చట నిచ్చెన లేనందున వారు పైభాగమున నున్న సుస్సలుని కడకు రాఁజాలక పోయిరి. అంత సుస్సలుని యనుచరులు వారిరువుర చేతులకుఁ ద్రాళ్ళ గట్టి పీనుఁగులనుగా భావించుచుఁ ద్రాటిపైఁ జేర్చి లాగి సుస్సలుని కడ నుంచిరి. అచ్చట వారిరువురు సిగ్గుచే నగమై పోయిరి. "మేము విదేశములకుఁ బోయి జీవింతుము" అని తిన్నగా వేడుకొనిరి. సుస్స లుఁడు, అట్లే చేయుదురుగాక. అని తనసమ్మతిఁ దెల్పి, అభయ మొసఁగి వారికిఁ గలిగిన పిరికితనపు టలజడినిఁ దగ్గించెను. సుస్సలుని స్నిగ్ధోక్తిచే వా రచ్చట బహువిధ మాంసాహారములచే నుదరములఁ బూరించి విదేశ గమనమును సైతము మఱచి పోయిరి.

ఇట్లుండ సుస్సలుఁ డున్నటు లుండి చివాలున విజయేశాంగనమును జొచ్చెను. అప్పటి యతని యాకస్మిక యత్నము బ్రహ్మకు సైతము విస్మయము గలిగించునది యని భువనవలయము.

ఆవిజయేశుని ద్వారమున హర్షభూపతి మేనమామ కొమరుఁడు 'జాసట' నృపతి' ఉమాధరుఁడు' మున్నగు రాజులు మువ్వురు. హయారోహు లగు రాజపుత్రులు తంత్రి సామంత సైన్యములును, మఱియు ('నివియని'యననేల?) పదునెనిమిది చమూ నివహములు తీరి యున్నవి. అవి లెక్కకు మించినవి. అట్టి చోటున సుస్సలుఁ డొక్కఁడే తన నిశిత కరవాలమును ఝళిపించుచు రివ్వునఁ బోయి ద్వారము నుద్ఘాటించి యతితీవ్రముగ వారిని గద్దించుచు నిలిచెను. అంతటి సైన్యముతో నున్న వారందఱును గంపించి ప్రణతులైరి. సుస్సలుఁ డట్టి వారికి విజయేశ సాక్షిక మగు నభయ మొసఁగి క్షమాపంతుఁడై మరలి పోయెను.

తఱువాత సుస్సలుఁ డంతటితో నూరకుండ లేదు. మరల నతఁడు సౌధాగ్రముఁ జేరి తన వలన భయము నొందిన వారి నందఱను బరిత్యక్తాయుధుల నొనర్చి వారి హస్తములను ద్రాళ్ళతో బిట్టుగా బెట్టుగాఁ గట్టి తనకడకుఁ దీసికొని వచ్చునట్లు తన యనుచరుల కాజ్ఞాపించెను. వారును నట్లొనర్చిరి. అట్టి తఱి నా సుస్సలుఁ డున్న యాప్రదేశ మంతయు బంగరు ఖడ్గముష్టులతోడను వెండి బాకుల పిడులతోడను నిండి యుండుటచేఁ జిత్రవర్ణము లగు కుసుమ జాతులతో నలంకృతమై యున్నట్లు కానవచ్చెను. సుస్సలుఁడు వారి నట్లొనర్చి తనపరివార మగు డామరులను నటనుండి వారు కదలకుండు నట్లు మూఁడు దినములు కాపుంచెను. వారును దమ నాయకుని యానతి చొప్పునఁ బసుల కాపరులు పశువుల మందనువలె వారి నాచోటునుండి కదలనీక కనిపెట్టి యుండిరి.

పిమ్మట సుస్సలుఁడు 'సువర్ణసానూరగ్రామము'ను జేరి యచ్చట నున్న పట్ట, దర్శనపాలురను, వారు కోరినట్లు విదేశమునకుఁ దరలి పో ననుజ్ఞ నొసఁగెను. వారలాతీరునఁ బోయిరి. అంతట సుస్సలుఁడు తనయన్న యగు నుచ్చలునికంటెను ముందు శ్రీనగరి కైవసముఁ జేసికొని తానే రాష్ట్రపతిగా నెంచి సత్వరముగ నాప్రాంతము నంతను దన పరాక్రమాగ్ని కాహుతి యొనర్చుచు శ్రీనగరిఁ జేరెను. ఉచ్చల సుస్సలు లిర్వురు కొంచె మించుమించు సమ వయస్కులు. కావున సుస్సలుఁ డుచ్చలుని జ్యేష్ఠత్వము నెప్పుడు నంతగా సరకుసేయకుండెను మఱియు రాజ్య పాలన కాంక్ష గలవాఁడై యట్టి కార్యక్రమమునందుఁ ద్వరపడసాగెను.

ఆరీతి నతఁడు శ్రీనగరియందలి రాజ ప్రాసాద శిఖరమున నున్న కలశమును ధ్వంసము గావింపఁ బూనుకొని విజృంభింపసాగెను. అట్టి తఱి 'బుప్పాపరనామధేయుఁడు' 'భోజదేవుఁడు' సుస్సలు నెదుర్కొనఁ బూనెను. భోజుఁడు సహజముగఁ బరాక్రమ శోభితుఁడే. అయిన నేమి ప్రయోజనము? తండ్రి యగు హర్షుఁ డెల్లప్పుడు శంకాకుల స్వాంతుఁడై సమర రంగములందుఁ గుమారు నడుగుఁ బెట్టనీక తనవంటి 'దద్దమ్మ'నుగా నొనర్చెను. అట్లు గాక భోజుఁడు తన ముత్తాత యగు ననంతదేవుని కడ శిక్షితుఁడై యుండినచో సహజ పరాక్రమ శాలి యగు నారాకుమారుఁ డెట్టి వీరాగ్రేసరుఁడై యుండెడి వాఁడో! తండ్రి యౌదాసీన్యము పిరికితనమును వాని నట్లు చెడఁగొట్టెను. ఇంతకును భవిష్య ద్విధి విధానమును బట్టిగదా కార్యములు జరుగుచుండును. లేకున్న హర్షభూపతివంటి నీతివేత్త విద్యావంతుఁడు నాకాలమున నెవఁ డుండెను? కాని, యతఁడు కార్యశూరుఁడు గాకుండెను.

చం॥ బిరుదులు నీతి శాస్త్రములఁ
బెక్కు గడించిన నేమి యౌఁ; దదా
చరణ పరుల్ గణింపఁగను
జాలరు ప్రేక్షకునేన్. ధను శ్శ్రుతిన్
విరివిగ నేర్చు యోధు లిల
వేలను లక్షల మీఱి యున్న, సం
గరమునఁ దత్ప్రయోగపుఁ బ్ర
గల్భతఁ జూపెడు వారు దుర్లభుల్.

అయినను హర్షమహీధవుని కుమారుఁడు భోజుఁడు సహజ పరాక్రమోపేతుఁడు. కావుననే ప్రచండ విక్రముఁ డగు సుస్సలుని తిమి [illegible] పెద్దచేఁపను తిమింగిలమువలె నుద్దామ తర పరాక్రముఁడై యెదుర్కొనెను. తండ్రికిఁ గల వి[illegible]న మీఁదాకుమారునియందు సంక్రమింపక పోవుట మెచ్చఁదగ్గ విషయము.

గీ॥ తండ్రియెడఁ గల్గు దోషంబుఁ దలఁచి వాని
తనయు నూరక నిందింపఁ దగవు గాదు.
పూల వాసనలో నున్న తైల మందుఁ
గల్కు మున్న సువాసన గ్రమ్మ కొనదె?

భోజుఁ డట్లు సుస్సలు నెదుర్కొనినప్పుడు దేవేశ్వరుని కుమారుఁడు 'సిద్ధుఁడు' హర్షుని యాదరణను బడసినవాఁ డయ్యును బ్రతిపక్షమునందుఁ జేరెను. అంతట నతని కుమారుఁడు 'మిల్లుఁడు' అను నతఁడు తనతండ్రి యొనర్చిన తప్పును సహింపక సుస్సలుని రణమున నెదుర్కొన నడుము గట్టి యాశ్వికుఁడై పోవుటకు నెంచి యొక తురంగమును బడయఁగోరి హర్షు నర్థించెను. కాని హర్షభూపతి మిల్లుని తండ్రి యొనర్చిన యపరాధమును బట్టి యతని కుమారుఁడు నట్టి తులువయే యని భావించి మిల్లుని తిరస్కరించి పొమ్మనెను. అంతట మిల్లుఁడు ఱేఁడు తనయెడఁ జూపిన తిరస్కారమునకు మిగుల వగచుచు హర్షు నుద్దేశించి "రాజా! నా హృదయగత మగు నిర్మల భావమును గ్రహించెదవులే" అని పల్కి సమర తలమునఁ బ్రవేశించి ఖడ్గ ధారా జలముచేఁ దండ్రి దోసఁగునఁ దనకుఁ గలిగిన నృప తిరస్కార మాలిన్యమును గడిగి వేసెను.

అంతట హర్షుఁడు మిల్లుఁడు చూపిన నిష్కళంక రాజభక్తినిఁ దలంచి యతని నన్యాయముగఁ దిరస్కరించినందుకు డెందమునందు మిగులఁ బరితపించెను. అప్పు డాభూపాలుఁడు పగతురు తనకుఁ బలు తెఱంగుల గలిగించు నపార నష్టమున కంత చింతింపలేదు. కాని మిల్లుని యంతరంగమును నెఱుఁగలేక పోతినిగదా! యని పలుతెఱంగులఁ బలవించెను. మిల్లుఁ డావిధముగఁ దన నిష్కళంకతను వెల్లడించుకొనెను. హర్షుఁడు మిల్లుని యంతరంగ శుద్ధినిఁ దెలిసికొని తన దురభిప్రాయమును గూర్చి చింతించెను అది యంతమాత్రమే. అతని తలంపు ఫల రహిత మగుటచే శూన్యాశయ మన వలసి యున్నది.

కం॥ అవిరళ భోగ పరాయణు
లవు వారల మానసముల యందలి భావం
బెవరు గ్రహించెద? రది య
ట్లవు నేని, ప్రలాప మాత్ర మై మాయ మగున్.

భోజుఁ డారీతి నవక్ర విక్రముఁడై సుస్సలు నెదుర్కొని యతని సైన్యమును బటాపంచ లొనర్చెను. అంత మాత్రమె గాదు. అప్పటి యా భోజుని పరాక్రమము నెదుర్కొనఁ జాలక వీరుఁడైన సుస్సలుఁడును రెండు సారులు రాకపోక లొనర్చి మిన్నకుండెను.

భోజుఁ డీరీతి శాత్రవుల నోడించి యెండ దెబ్బకు డిల్లవోయి యుద్యాన వనముఁ బ్రవేశించి తండ్రి యగు హర్షునిఁ జేరి తల్పమునఁ బలుమాఱు పొరలుచు విశ్రాంతినిఁ బడయుచుండెను.

ఇట్టి తరుణమునఁ బాపాత్ముఁడగు హర్షుని దండనాయకుఁడు "సుస్సలుఁడు నీకంటె ముందు రాజధాని నాక్రమించి రాజ్యమును హరించును. కావున రాజ్యాక్రమణమునం దాలస్యము చేయవల"దని యుచ్చలుని బ్రోత్సహించుచుఁ బల్కెను. ఆ మాటలు విని మల్లరాజు పెద్ద కుమారుఁ డుచ్చలుఁ డించుకేని యాలసింపక శ్రీనగరిని ముట్టడించెను. అతఁ డట్లాకస్మికముగ రాజ భవనమునకు నుత్తరమునం దుండు నదీ తీరమునఁ దనదండు విడియించి "వంతెన పడఁగొట్టఁబడుఁగాక" అను నినాదము నలుదెస లావరించునట్లు కావించెను.

అప్పు డిరుప్రక్కల సైనికులకు ఘోర మగు సమరము ప్రారంభ మయ్యెను. ఆ సంగ్రామమునందు మొట్టమొదట నరేంద్రేశ్వర దేవాలయము ముందర నున్న 'దేవనాయకుఁడు' అనువాని నుచ్చలుఁడు యమపురి కనిపెను. అట్టి తఱి నగరపాలకుఁ డగు 'నాగుఁడు' నిబిడ సైన్య నివహముతో సంసిద్ధుఁడై యుచ్చలు నెదుర్కొనెను. ఈ నాగుని నాయకత్వమున నడచిన యా ప్రబల సేనా వాహిని యుచ్చలుని బమ్మెరవోఁ జేసినది. కావుననే హర్షుఁడు తనకే విజయము గల్గునని నమ్మియుండెను. ఉచ్చలుఁడును "తనదు స్వల్ప మైన సైన్యముతో నతని నెదుర్కొను టెట్లా" యని యించుక సంశయించుచునే యుండెను. కాని, యింతలోనే యా నాగుఁడు తన తలపాగ తీసి యుచ్చలునకు వినయముతో నమస్కరించెను. అతఁ డట్లొనర్చిను నాగుఁడు హర్షుని పక్షమున మండలేశ్వరుఁడుగ నున్నవాఁ డగుటచేఁ గపట నటనము గావించుచున్నాఁ డేమో యని భావించుచు నుచ్చలుఁడు నాగు నుద్దేశించి "నీవింటికిఁ బొమ్ము' అని ముదల నిడినట్లు పల్కెను. నాగుఁడు మాఱు పల్కక యట్లే మరలి యింటికిఁ బోయి రాజద్రోహి యయ్యెను. ఇఁక నాయక రహిత మైన య య్యఖండ సేన యుచ్చలుని నెదిరింపఁగలదా? అనాగుఁడు తా నొనర్చిన రాజద్రోహమునకు ఫలముగా నామండలమందే భిక్షాటన మొనర్చుచుఁ దుదకు జీవితమును బాసెను.

అంతట హర్షనరేంద్రుఁడు నదీతీరమునకు వచ్చి శత్రు సైన్యమును వీక్షించెను. ఆ సేన యందలి డామరు లందఱు వంతెనపై నుండిరి. వారి శరీరములు కార్చిచ్చుచేఁ గాలి పోయిన యడవి

యందలి పెను మ్రాఁకులవలె భీకరములై యుండెను. వారిని నడపు నాయకుఁడు 'జనకచంద్రుఁడు' మాత్రము తెల్లని కవచమును ధరించి యంధకారమునందు మెఱయు శుక్ర గ్రహమువలెఁ బ్రకాశించుచుండెను. హర్షుఁడు తన కార్యసిద్ధికై యట్టి మహాసేతువు నిర్మించియుండెను. అది యిప్పుడు దైవవశమునఁ బగవారికి మేలు సేయునదిగాఁ బరిణమించెను.

ఇట్టి తరుణమున హర్షుని దేవేరులు శాహిరాజు తనూజలు మున్నగు వారు సంభవింపనున్న మహాప్రమాదమునకు భీతిల్లి మృత్యువునకుఁ దమ దేహముల నర్పింపఁ దెంపుచేసి తమతో నగ్నినిఁ గైకొని నూఱు ద్వారములు గల రాజ ప్రాసాదమునందలి చతుశ్శాలావరణమును బ్రవేశించిరి.

ఇది యిట్లుండ నింక నక్కడ హర్షుఁడు తనదేవేరులు విజయ మింకను సావశేషమై యుండఁగనే తమ దేహముల నగ్ని పాలు సేయనుండుట నెఱింగి వారి నారీతి 'సాహసింపవల' దని పలుమాఱు వారించి దాయాదులతోఁ బోరాడ నమకట్టి నదీ సేతువు కడఁ గట్టాయితమై యున్న తన ప్రబల సైన్యముతో నిలిచి యుండెను. ఇరుతెగల వారికి సంగ్రామ మారంభ మయ్యెను. అట్టి రణదృశ్యమును బ్రజానీకము గనుగొనుచు తేని యెడ విరక్తి గనఁబఱచుచు నుండెను. ఆ ప్రజ కాదృశ్య మొక 'యాశ్వయుజలాగి' గాఁ గనుపట్టెను.

అట్టితఱి తేని సైన్యమున నగ్రగామి యయి దృఢతర మగు కవచముతోఁ గూడి యున్న మత్తేభము పగతుర సేనను జెండాడుటకై సైనికులచేఁ బురికొల్పఁబడెను. అప్పుడు 'జనకచంద్రుఁడు' మున్నగు వారు శరములచేతను, బరిసెలు బల్లెములు మున్నగు నాయుధములతోడను నా మదపుటేనుఁగును మద మణఁగు నట్లు బిట్టుగ వేధించిరి. ఆ దెబ్బల కది తట్టుకొని యచ్చట నిలువలేక వెనుకకు మరలి తనవైపునఁ దన నదలించుచున్న సైన్యమునందలి యోధులను గుఱ్ఱములనుండి పుడమిపైఁ గూలునట్లు తొండముతో విసరి కొట్టుచుఁ, బదాతి సైనికులఁ బద ఘాతములచే మట్టగించుచు నా రణరంగమును వీడి పోయెను. అచ్చటి సైన్య మంతయు నాయలజడిచే చెల్లచెదరై తిరుగు ముఖము పెట్టెను. అంతట విరోధి యోధ వారము విజృంభించి తనపై కుఱుకఁగా హర్షుఁడు తనకు సహజమైన పిరికితనము మొదలట్టి త్రోయుచుండ నచోట్టునుండి తప్పించుకొని 'బ్రతుకు జీవుఁడా' అన్న విధమున భరితపించుచు నట్లో శత ద్వార భాసుర మగు రాజ ప్రాసాదమును గుఱ్ఱపురౌతై ప్రవేశించెను.

అప్పటి హర్షుని యయోమయ స్థితి యసహ్యము దయనీయము జుగుప్సాకరమునై యుండెను. అతఁ డేకాంత వాసియై యుండు నప్పుడును నుదాత్త వేషముతో నుండెడి వాఁడు భోజన సమయమునందు సైతము పెదవు లెడఁ బాయనియ ట్లాస్య ముద్రతో నొప్పారుచుండెడివి. ఈ తరుణమున నతఁ డెండ వెట్టచేతను వైరి వీర వారములవలనఁ గలిగిన భీతి వలనను నేర్పడిన స్వేద జలముచే నిండిన గాత్రము కంపించుచుండ మాటిమాటికి జారి పోవు చుండిన కవచమును బరిజనము మూపుల పైకి నెట్టి సవరించుచు నున్నట్టి దశతో ననవస్థిత చిత్తుఁడై పయనము సాగించి యుండెను. అంత మాత్రమె కాదు, అట్టి మతిదీన దశతోఁ జంచల చిత్తుఁడై యుండిన యా హర్షుఁడు తనకుఁ దెలియ

కయే గుఱ్ఱమును మడిమలతో నొనుపుటచే నని మహావేగమునఁ బరువెత్త దొడఁగెను. దాని వేగమును దగ్గించుట కతఁడు కళ్ళెపుఁ బగ్గములను వెనుకకు నీల్గుచు లాగి బిగియఁ బట్టినవాఁ డయ్యెను. మఱియు నట్టి సంకట సమయము నం దతఁడు తన బట్టతల యందలి పార్శ్వ భాగముల వ్రేలుచుండిన పొడవులైన శిరోజములను దనచేత నున్న కరవాల మొక వంక జారుచున్నను నట్టి హస్తముతోడనే సవరించుకొనువాఁడై పయనించెను. పార్శ్వ గతము లగు నా కేశములు కర్ణ భూషణములతీరునను గాల సర్పములు కంఠమును జుట్టుకొని యున్నట్లును గానవచ్చుచుండెను. ఆతని మొగ మంతయు దుమ్ముతో నిండి ధూసరితమై పోయెను. అందువలన నతని కనీనికలు విప్పు నొందక సంకుచితములై యుండెను. ఆరీతి హర్షుఁడు మూఁత వడుచున్న కనుఱెప్పలను బలవంతముగఁ దెఱచి తన ప్రియురాండ్రను దీనాతిదీన మైన యాననముతోఁ గనుగొనుచు నగ్ని ప్రవేశమున నసువులఁ బాయ సిద్ధపడి యున్న యా తలిరుబోండ్లను హస్త సంజ్ఞచే వారించుచు నెల్లెల్లో తిన్నగా రాణివాసపుఁ జతుశ్శాల భవనమునఁ జేరి పిచ్చివాఁడువోలె నూరక సంభ్రమించుచు నుండెను. ప్రజలు గుమి గూడి యింతటి నికృష్ట దశలో నున్న హర్షమహీపతినిఁ జిత్రాకృతులతో నిశ్చేష్టులై చూడసాగిరి.

అట్టి తరుణమున జనకచంద్రుఁడు వితస్తానదిని దాఁటి రాజధాని చెంతనే యున్న మల్లరాజు భవనము నగ్నిపాలు గావించెను. ఆమంటలు రాజధాని నానుకొనుచుండఁగా యువరాజగు భోజుఁడు రాజధాని శత్రువులకు హస్తగతమైనట్లు నిర్ణయించుకొని యటనుండి పలాయనము సాగించుటకై యొక యుత్తమాశ్వము నధిష్ఠించి బెడిదము లగు శూలములతో దట్టముగ నరికట్టి యున్న పగతుర నొక్క-యూపుతో నెట్టుకొని పురద్వారమునుండి తప్పించుకొని యూడనిబాడెను.

ఆరీతిని భోజుఁడు పలాయన మొనర్చుచుఁ దనతోడ వేవురను గుఱ్ఱపు రౌతులను సహాయులనుగాఁ గొనిపోయెను. అతఁడు తనవెంట సహాయులుగా వచ్చు నాశ్వికులతోడ లోహరమును జేరఁ గోరి సింహరాజు మఠమునకు నగ్రభాగమున నున్న సేతువు దాఁటి కడు శీఘ్రముగఁ బయనము సాగించెను.

ఇఁక హర్షమహీపతి తన ప్రియ సుతుఁ డట్లు పలాయితుఁడై పోవుచుండ ననదవలెఁ గన్నీరు నించుచు దృష్టి కందువఱకుఁ దన్మార్గమును ఱెప్ప వాల్పక నిర్విణ్ణుఁడై కనుగొనుచు బాహ్య ప్రదేశమందు నూరక పిచ్చివానివలె నటు నిటు కొంత తడవు పర్యటింపసాగెను. ఇది యిట్లుండ నింతలోపల రాణివాసపుఁ జతుశ్శాలయందు రాజపత్నులు గొందఱగ్ని ప్రవేశమునకై యత్నించుచుండు టెఱింగి వారి పరివారము వారిని రక్షింప వేగిరపడుచు నా చతుశ్శాలపు ద్వారమును తాళ్ళతోడను గునపములతోడను బిగులఁగొట్టి వేసిరి. శాహిరాజు కుమార్తె లగు నా రాజపత్నులు తమ పరివార మాపని యొనర్చు చుండు టెఱుంగక ''శత్రువులు ద్వారమును భేదించి లోపలికి దుముక నున్నా''రను నుద్దేశముతో మిగుల భీతిల్లి ప్రాణములపై నాశ వీడి యా చతుష్కి-కా గృహ శిరోభాగమున నగ్నినిఁ బ్రజ్వరిల్లఁజేసి యందుఁ బూర్ణాహుతి యైరి.

ఈ ఘోర దృశ్య మిట్లుండ శ్రీనగరిలో నివసించి యుండు మూఁఢు లగు డామరులు మండుచున్న యారాజభవనములోని యమూల్య ధన సంచయమును దోఁచుకొన నుద్యోగించుచు నొక రితో నొకరు మచ్చరమున నాయుధములతోఁ బెనఁగుచు భాండాగారాదులను దోఁపిడి సేయసాగిరి. ఇట్టి సంఘర్షణమునందు వారిలోఁ గొందఱు ప్రాణములఁ గోల్పోయిరి. కొందఱు మొఱకులు రాజభవనము నందుఁ దమకు దొరకిన యమూల్య వస్తుచయమును జూచి తా మెప్పుడు నట్టి యనర్ఘ వస్తువుల నెఱుఁగకుండుటవలన వికట హాస్యముతోఁ బ్రలాపించిరి.

అచ్చోట నా మొఱకు డామరులలోఁ గొందఱు కప్పురపు భాండమును జూచి "ఎంత మంచి చక్కెర దొరకినది రా" అని యుప్పొంగుచు గుప్పెడు గుప్పెడుగ నోళ్ళఁ బోసికొనిరి. అంత వారు తమనోళ్ళు పొక్కి మంట లెత్తుచుండ 'ఛీ ఇదేమి' అనుచు నా కప్పురపు భాండమును నదీ గర్భమునఁ బాఱవైచిరి. మఱి కొందఱు పామరులు బంగరు వన్నెతోఁ జిత్రింపఁబడి యున్న విలువగల వస్త్రము లను జూచి యది యంతయుఁ బసిఁడి యని భ్రమించి వానినెల్ల నగ్నిహోత్రము పాలొనర్చి యాశతో వాని భస్మమును బ్రోగు చేసికొనిరి. ఇంకను మఱికొందరు పామర స్త్రీలు మౌక్తికములను జూచి యుబ్బి పోవుచు నెంత మంచి తెల్ల బియ్యము రా యివి." అని మెచ్చుకొనుచుఁ దిరుగళ్ళ విసరి పిండిచేసి రొట్టెలకు వినియోగింత మని యట్లొనర్చి నిర్విణ్ణత నొందిరి. ఇట్టివే మఱియు నెన్నియో వింత వింత లగు సంగతు లాతరుణమున జరిగినవి.

ఇట్టి సందర్భమున మఱవరాని దేమన? భాగ్య లక్ష్మి యానాఁడు కాశ్మీరమున నట్లు కఠోర చర్యలకు మూలమై మానవ మర్యాదలనే మంటఁ గలిపిన ఘోర కిరాతులకు దక్కి విపరీత విడంబ నావస్థ నొంది యుండుట యెంతేని శోచనీయము. అట్టి యానాటి సిరిగాని, ఆరీతి నమానుష చర్యల యుద్ధతివి గాని మఱి యెచ్చోటను బ్రజ కని విని యెఱుఁగ దని చెప్పవలసి యున్నది.

ఆ సమయమున విద్యాధరాంగనల సోయగమున సొంపారు రాజాంగనలను గ్రూరు లగు డామర కిరాతు లడుగడుగునను బట్టి బాధించి బలాత్కారముగఁ గొనిపోయిరి. ఆ రాజ పత్నులలో 'వసంతలేఖ' మున్నగు వారు పదునేఁడుగురు మాత్రము తమ కోదండ్రశోద నెట్లో డామరుల బారి నుండి తప్పించుకొని తమ పావన శరీరములను వీతిహోత్రున కర్పింపఁగల్గిరి. మఱియు ననివార్యమై యతిఘోరమై యమానుషమై యుప్పొంగిన యానాటి విపద్దశయందు దహింపఁబడెడు గృహముల 'ఛటచ్ఛట' శబ్దము లుప్పరంబు నప్పళించినవై యత్యంత ముష్ణోగ్రతతో నుప్పొంగుచు "శ్వ్యధమాన మగు నాకాశగంగనుండి పుట్టిన మహాఘోషమా యిది "యన మిగుల భయానకమై ప్రజను గలగుండు పఱచెను. అట్టి తరుణమున హర్షపతి 'శ్రీపద్మశ్రీ' ప్రప దగ్గఱనుండి యా ఘోర సంఘటనమును గనుగొనుచు మనసు పట్టలేక ఋషిప్రోక్త మగు నొక శ్లోకము నిట్లు పఠించెను.

శ్లో॥ ప్రజా పీడన సంతాపా, త్సముద్భూతో హుంతాశనః
రాజ్ఞః కులం శ్రియం ప్రాణాన్, నాదగ్ధ్వా వినివర్తతే.

గీ॥ ప్రజల పీడనమునఁ బుట్టు ప్రబల మైన
తాపమునఁ గల్గు నగ్నిహోత్రంబు తద్ధ
రాపతినిఁ దక్కులము వారి ప్రాణములను
సిరిని సర్వంబును దహించుఁ దిరుగు లేక.

ఇట్టి పశ్చాత్తాపముతో హర్షుఁ డలమటించుచు నుండెను. ఇఁక నుచ్చలుఁ డారీతిని రాజధానిని హానము పాలు చేసి తన శత్రు వింకను సైన్య వ్యూహములను విడువక యుండుట గమనించి తస్తానది యావలి తీరమున సేనల సమాయత్తపఱచుకొని కయ్యమునకుఁ గాల్ద్రువ్వుచు నుత్సాహ రితుఁడై యుండెను.

హర్షమహీపతి యెట్టకేలకు సంగర మొనర్చి తుద కందుఁ జావఁ గోరినవాఁడై యుండెను. ాని పదాతి బలము పల్కు నుచ్చావచ వాక్యములచేఁ గలఁత నొందిన వాఁడయ్యెను. అట్టి స్థితిలో పన్న యారాజును, అనంత పాలుఁడు మున్నగు రాజ పుత్రులు "యుద్ధ మొనర్చుటే మనకు గర్తవ్య" పని పురికొల్పఁగా సమర సన్నాహముతోఁ బయలుదేరెను. అట్టి తఱి తనవెంట వచ్చుచున్న దండ నాయకుఁ డడుగడుగునను "మన కిపుడు పోరు సల్పుటకుఁ దగిన సమయము గా" దని యపశకున సంగి తోఁచునట్లు పల్కి నిరుత్సాహ పఱచెను. తేని స్థితి "మొదలే ముక్కిడి పై పెచ్చు పడిసెము." అన్నట్లైనది.

అప్పుడు 'చణ్పకుఁడు' హర్షునితో "మహారాజా! నీవు రణ మొనర్పుము, లేదేని లోహార మునకుఁ బొమ్ము. ఏదియు సేయక యిట్లున్న మాన ప్రాణములు రెండును దక్కవు. అని పల్కెను. అప్పుడు ప్రయాగుఁ డనువాఁడు రాజును మొదటినుండియు మహాసంకటములందుఁ గంటిని ఱెప్పవలెఁ గాపాడు చుండిన వాఁడు గావునఁ జణ్పకుఁడు దెల్పిన రెండు పద్ధతులలో రెండవదే యిప్పు డవశ్య కర్తవ్య మగు నది యని నిర్ణయించెను.

హర్షపతి వారి మాటల నంత శ్రద్ధతో వినలేదు. తనకుమారుఁడు భోజుఁ డెందుఁ బోయెనో! అను చింత యతని చిత్తమును బీడించుచుండెను. అందువలన నతఁడు చణ్పకునితో 'నీవు భోజ కుమారుఁ డెందుండునో యన్వేషించి వానినిఁ గాపాడుము. వెంటనే పొమ్ము.' అని పలుమాఱు చెప్పఁ దొడఁగెను. అందుకు చణ్పకుఁడు "రాజా! నీవు ప్రయాగ మాత్రానుచరుఁడవై త్వరలోనే నీ యనుఁగు కొమరునిఁ గనుగొనఁగలవు. కావున నీ క్లిష్ట తరుణమున నన్నుఁగూడ నెడఁబాయకుము." అని నిడుద నిట్టూర్పు పుచ్చుచుఁ బలికెను.

హర్షునకుఁ జణ్పకుని హిత వాక్యము సరిపడలేదు. అతఁడు డెందమున నిండిన దుఃఖ వేగము నాపుకొనలేక బాష్ప రుద్ధ గద్గదికతో నిట్లు పల్కెను. "నీవును నిట్లు పల్కుచుంటివా!" నీవు ద్రోహ బుద్ధి లేనివాఁ డ వని విశ్వసించి యుంటిని. ఈ సంకట సమయమున నీవును నాయానతి నుల్లంఘింపఁ దలఁచి యిట్లు ప్రతివచించుచుంటివి. కారణము తెలియకున్నది. పుత్రునిఁ గనఁజాలని యీ కన్నులతో నే నీ భౌతిక ప్రపంచమును గాంచలేను. నా కొమరుని బాల్యమునందు నీవు నీ తొడల

యందు నిడికొని యెంతో ప్రేమతో లాలించి యుంటివిగదా! ఈ తరుణమున వానిని వెదకుటకై యుపేక్ష నీకేల గలుగుచున్నదో! తెలియకున్నది. ఓ! స్ఫురించినది. ఒకప్పుడు నీతో భోజునకు నొక యశ్వ విషయమై యించుక భావ భేద మేర్పడి యుండెను. అయ్యది మనియందుంచుకొని నీవు సాధింపకుము. నామాట పాలింపుము." అని ఖిన్నుఁడై పలికెను.

ఈరీతిఁ బ్రభువు పల్కిన మాటలు నిందా గర్భితములై తన రాజభక్తిని శంకింపఁజేయు నవిగా నున్నవని చంపకుఁడు భావించుచు నతఁ డమలీమస మనస్కుఁడు గావున లజ్జితుఁడై మఱేమియుఁ బల్కక తేని కోర్కెను దీర్చుటకై వెంటనే భోజుఁడు పోయిన మార్గమును బట్టి యతని వెదకుటకై పయనించెను. ఆ మంత్రితోడ నేఁబదిమంది గుఱ్ఱపు రౌతులును బోయిరి. అతఁడు సోదరులతోడను భృత్యులతోడను రాకుమారుని వెదకుటకై పోయి వితస్తానది యావలి తీరమును జేరెను. అచ్చోటఁ జేరి తన యనుయాయులను బరికింపఁగాఁ దనతోఁ గూడ నన్వేషకు లయిదుగురు మాత్రమే మిగిలి యుండిరి, తక్కిన వారు తిన్నగా వెనుకకు మరలుకొని పోయి యుందురని వేఱుగాఁ జెప్పవలయునా?

ఇదియును గాక తన సోదరు లిరువురును, ఆశ్రితుఁడును శేషరాజకుమారుఁడును నగు మఱి యొకఁడును శత్రువుల బారిఁ బడి హతాశులై నేలఁ గూలిరి. అట్టి తఱి చంపకునకు సహాయుఁడై యనుసరించుచు నుండినవాఁడు 'ధనికుఁడు' అనువాఁ డొక్కఁడే యయ్యెను. అట్టి చిక్కుతోడఁ జంపకుఁడు ధనికమాత్ర సహాయుఁ డయ్యును రాజభక్తిని బురస్కరించుకొని భోజుని జాడ నరయుచుఁ బర్యటించెను. కాని రాజపుత్రుని పోకను గుఱించి యెట్టి విషయమును దెలిసికొనఁజాలక పోయెను. అతఁ డట్లు తిరిగి తిరిగి సాయంతన సమయమునకు వితస్తా సింధు సంగమ ప్రదేశమును జేరెను.

హర్షుఁడు దన పుత్రుని వెదకుటకు విశ్వాస పాత్రుఁ డగు చంపకునిఁ బంపియు నంతటితో నూరకుండక మఱి కొందఱను ఆప్తులని భావించిన వారిని కుమార గవేషణమునకై యంపెను. వారలు హర్షుని వీడ్కొని యిదే మంచి సమయ మని తలంచుచు నట్టి మిషతోడనే యతని పక్షమును వీడి తమ యిచ్చ వచ్చిన యెడకుఁ దిన్నగఁ దప్పుకొనిరి.

హర్షభూపతి యిట్టి ప్రమాద స్థితి నొందుటకు నత్యంత కుటిలుఁడై రాజభక్తి శూన్యుఁ డయిన దండనాయకుఁడే మూల కారణ మని వేఱుగఁ జెప్పఁ బనిలేదు. ఇతఁడు మొదటినుండియుఁ బెక్కు చిక్కులు దేనికిఁ దెచ్చి పెట్టిన వాఁడగుట పూర్వ చరిత్ర నం దెఱిఁగి యున్న విషయమే గదా! ఈతని విషయమై యించుక సింహావలోకనము సేయుట మంచిది.

ఈ దండనాథుఁడు రాజపురి మున్నగు ప్రదేశములందు జరిగిన సమరములందు శత్రు పక్షమునుండి లంచమును గైకొని పగతురకు సాయపడు చుండెను. సేనలోని వీరు లగు కొందఱు యోధులు వీని చర్య నీనరించుకొని గర్హించిరి. తాను దండనాయకుఁడు గావున వారిని లెక్క సేయక యచ్చటి సైనిక సన్నివేశమును బలహీన మొనర్చెను. ఈ విధముగ వైరి పక్షము విజయము సాధించు నట్లు కుత్సిత వర్తనుఁడై మెలఁగి యుద్ధమునుండి పందతోడ వెనుకకు బాఱియున మొనర్చినట్టి కులువ యితఁడు. మఱియు నీ దండనాథుఁడు, రాజపుత్రుఁ డగు భోజుఁడు తండ్రి యగు హర్షుని మాట

ననుసరించి సంకటావస్థనుండి తప్పుకొనుటకై 'లోహరము'ను జేరఁ బయనము సాగించుచున్నపుడు "నీవు నాకు సంగర రంగమున సాయపడవలయును. ఇపుడు నీవు లోహరమునకుఁ బోయినచో రాజధాని శత్రువులకుఁ జిక్కి పోవును." అని యా రాజపుత్రుని ప్రయాణమును నిరోధించెను. ఇంకను నితఁ డొనర్చిన రాజ ద్రోహములుపెక్కులు గలవు. అందులో హర్షభూపతి వేతొక సమరాంగణమున శత్రువు నెదిరించుచు నుండ నీ రాజద్రోహి శత్రువు రాజధానియందుఁ బ్రవేశించుటకు సైతము సాయపడెను. కావున నీ దండనాయకుఁడు సర్వస్వ ధ్వంసి యగు రాజద్రోహి యని చెప్పఁదగిన వాఁడు. మఱియు రాజ భక్తి శూన్యులై కుట్రలఁ బన్ను చుండిన పెక్కురు మంత్రులు హర్షునకు మంత్రాంగములను బోధించుటయు వారు దెల్పు పద్ధతులను దా ననుసరించుటయు జరిగెను. ఆకారణమున సర్వస్వమును గోల్పోయి యీ దుస్థితివేళ నెవరు హితము దెల్పినను అందు విశ్వాసము లేక యధీరుఁడై బుద్ధి నిలుకడ లేనివాఁ డయ్యెను. ఇట్టి హర్షునకు మరల నా దండనాధుఁడే దుర్బోధ యొనర్చి రాజ్యము శత్రువు పా లగునట్లు చేయఁ బూనె నని యీ వృత్తాంతము విశదపఱచుచున్నది. ఎవ రేదీ చెప్పిన నది వినుచు నెవరి మాటయందును విశ్వాసము లేక యధీరుఁడై యుండు వాని గతి యింతకంటె మఱి యెట్టిది కాఁగలదు.

కం॥ పెక్కు రొక వేణువును గొని
ఒక్కొ తఱిఁ బట్టి యూఁద నొదవునె స్వరముల్?
పెక్కండ్రు భిన్న మతు లటు
చక్కఁగ మంత్రంబు జరుపఁ జాలరు సచివుల్.

మఱియు నింకొకటి గలదు.

గీ॥ అడుగకున్నను బామరుం డడ్డు దగిలి
కరము గడుసరి తనమునఁ "గార్య మిట్లు
చేయవలె" నంచుఁ జెప్పుట చెడ్డ లక్ష
ణంబు భాగ్య క్షయవుఁ గారణ మది యగును.

పై విషయమున కనుగుణముగ నా సంకట సమయమునందు రణోన్ముఖుఁడై యున్న రాజుతోఁ ద్రైలోక్యుఁ డను సారథి దండుతోఁ గదలుచున్న దండనాయకు నాపి "ప్రభూ! పూర్వము మీ తాతగారు (అనంతభూపతి) ఆశ్వికు లగు నేకాంగ సైనికులను బరిమిత సంఖ్యాకులను దీసికొని పోయి శత్రువుల నోడించి విజయము గాంచి యుండెను. అట్లే మన మిపుడు, అక్షపటల ప్రాంతమును జేరి యేకాంగ సైనికులను దీసికొని వైరి వారమును వెన్నంటి ముట్టడించి మట్టు పెట్టుదము. అచ్చటి మన వాహినియందలి యేకాంగ సైనిక వీరులు కేవల పదాతు లగు పగతుర యోధులను సాల్వడేగలు పక్షులను వేఁటాడు నట్లు పైఁబడి సులువుగ నురుమాడి విజయమును సాధింపఁగలుగుదురు." అని యదురు బెదురు లేక నిలువరించి పల్కెను.

అంతట హర్షమహీజాని "త్రైలోక్యుని మాట లెస్స" యని తలఁచి వెంటనే యచ్చోటు నకుఁ గదలఁ గోరెను. అప్పటి యిట్టి సంఘటనము హర్షుని రాజ్యశ్రీ యధోగతికి మఱింత హేతు

వయ్యె నని చెప్పఁదగును. ఆ కాశ్మీర నాథుఁ డట్లు దండయాత్ర సేయఁగోరి తరలుటయే తడవుగా నా తేని నిబిడ సేనా సన్నివేశమునందలి యోధు లెక్కడి వా రక్కడ నొక్క మాఱుగా జడివాన దెబ్బచే రంగస్థల మందలి ప్రేక్షక జన సమూహము వికావికలుగా చెల్లచెదరై నానావిధ ప్రాంతములకు సురిగి పోయిన ట్లచ్ఛోటు వాసి పోయిరి.

అప్పుడు హర్షుఁడు తన సుతుని సంగతిఁ గనుగొనుటకై వితస్తానది యావలి తీరము నందున్న శేయరాజుయొక్క కుమారునకు దారి బత్తెమునకై తన రత్నహారముల నొసఁగెను. ఆ శేయరాజు కుమారు లాగామికులు (తోఁటమాలులు) రాజ చిహ్నము లైన యట్టి హారము లొక్క క్షణములో సంపాదించుకొనిరి. తేజో విశేషముతో నొప్పారుచుండిన యా హర్షుఁ డూర్జితము లగు నట్టి యాభరణములను గోల్పోయి నిస్తేజస్కుఁడై యొకానొక సామాన్య వ్యక్తివలెఁ బ్రజా సముదయమునకుఁ గానవచ్చెను.

అంతట నారీతి దుర్వినీతుఁ డైన యాదండనాయకుని దుర్బోధచే నక్షపటలమునకుఁ బయనించిన సేనా వ్యూహ మడుగడుగునను క్షణక్షణమునను లుప్తమై యదృశ్యస్థితి నొందెను. సైనికులలో నొకఁడును హర్షు ననుసరింపఁ డయ్యెను. హర్షదేవునకు గడు కంతటి దుర్గతి పట్టినది. అతఁ డారీతి తగిన పరిజనము లేక తిరుగుచు సాయంసమయమున కెందేని తల దాఁచు కొనుటకు నాశ్రయ స్థానమును వెదక నారంభించెను. అంతటి మహారాజున కాతఁడే యొక గృహస్థుఁడు గాని తన గృహములోనికిఁ బ్రవేశ మొసఁగ డయ్యెను. ఇఁకఁ గృత్రిమ ప్రామోపవేశ చణులగు బ్రాహ్మణబ్రువులను గొందఱ నీతఁడు నమ్మి యుండెను. అట్టి వా రీతనికిఁ గ్లిష్ట సమయమున నదృశ్యులై పోయిరి. ఇట్లారేయి తల దాఁచుకొనుటకు దిరుగుచుండ నతనికిఁ 'గపిలుఁడు' అను మంత్రియొక్క గృహము గానవచ్చెను. అట్టితఁడే నామంత్రి 'లోహర' కోటయందుండెను. అతని పత్ని హర్షునకు "అచ్ఛోటనుండి నౌకా సాహాయ్యమున 'లోహర' కోటను జేరవలయును. అని సవినయముగఁ దెల్పెను. కాని, హర్షభూపతి దైవ మోహితుఁడై యామె దెల్పిన రీతి ననుసరింపకపోయెను.

నిజము పరిశీలింపఁగా, నా కపిలుఁడు రాజద్రోహి. అతని కొమరులు నైత మట్టివారే. కావుననే వారు, అట్టి సంకట సమయమునందు బుద్ధిపూర్వకముగ చెల్లింపవలసినవారు ద్రవ్యమును గుప్తముగ నుంచుకొని తమవద్ద ధనము లేనట్లు నటించుచు సుప్తముద్రితమై దండించు నవసరమున హర్షునకుఁ గానరాకుండ మఱుఁగు పడి తప్పుకొనిరి. ఇట్లే హర్షునకు "మున్ను దుర్మంత్రులు రాజకార్య రహస్యములను దెలుపక మఱుఁగు పఱచి యిట్టి విపన్నత దెచ్చిపెట్టిరి. హర్షుఁ డిప్పుడీ సంగతి గుర్తించి తెలివిగోల్పోయి యట్టి వారి వలలోఁ జిక్కిన తానే యా దోషములకు గర్తమైనట్లు" తలంచెను. కావున నిప్పుడు సర్వ విషయములందును నైరాశ్యమే యతనికి మిగిలి యుండెను. అందువలన నిప్పుడు తనకడ మిగిలియున్న కొంకలయెడను విశ్వాసమతనికి లుప్తమయినది.

ఇట్టి స్థితిలో హర్షమహీపాలుఁడు చిక్కగా 'ప్రద్యుమ్నము' అను ప్రదేశము దాఁటు నప్పటికి నతని ననుసరించు వా రత్యంత స్వల్ప సంఖ్యతో నుండిరి. అంతకు ముందు "మేము ముప్పది యాఱు క్షత్రవంశములలోఁ బ్రసిద్ధి గన్నవారము. మా తేజస్సు భాస్కరుని సాటిగాఁ గొనదు."

అని యేమేమో డంబములు పల్కిన 'అనంతపాలుఁడు' మున్నగు రాకొమరు లెల్లరు గాఢ ప్రదోష సమయ మయి క్రమముగఁ జీఁకటు లలముకొనుచుండఁగా నొక్కొకరే యడుగడుగునను దప్పుకొని యదృశ్యులయిరి.

అంతట హర్షుఁడు 'జోహిలమఠము'నకుఁ జెంత నుండు ప్రదేశమును జేరి యచ్చోట దన వారువమునుండి దిగెను. అప్పటివఱకును దండనాయకుఁడు తన తమ్మునితోడ హర్షపతి ననుసరించి వచ్చెను. ఇంకఁ దిన్నఁగాఁ దానును తేని విడిచి పోఁదలఁచి పన్నుగడ గనిపెట్టి రాజుతో "దేవా! ఇచ్చటి కనతిదూరమున నామామగారి గృహ మున్నది. అక్కడ నీరేయి నీవు సుఖముగ నుండుటకై వసతి యేర్పఱచి నిన్నుఁ దోడ్కొని పోవుటకు మఱల నిప్పుడే వచ్చెదను." అని తన తమ్మునితోడ బయలుదేరెను. అప్పుడు ప్రయాగకుఁ డాదండనాయకునితో "నీయనుజుని జేనికిఁ బాఫే యమునకై (మార్గహితునిగా) నుంచుము." అని యడిగెను. అందుల కాదండనాయకుఁడు కొంత సక్తువు పాథేయముగ నొసఁగెను. కాని యతని యనుజు నందు నిలుపక తనతోడనే తీసికొనిపోయెను. ఇది యెంత ద్రోహ పూరిత మైన కృత్రిమ చర్య యనవలెను?

ఈ తరుణమున హర్ష భూభర్తకు నొక్క వలువ మాత్రమె మిగిలి యుండెను. ప్రయాగుఁ డొక్కఁడే యనుచరుఁ డయ్యెను. ఇట్టి కష్ట సమయమునఁ జణ్పకామాత్యునకు భృత్యుఁ డైన 'జేయ కుఁడు' అను వానికి వంటవాఁడుగా నున్న 'ముక్తుఁడు' అనువాఁడు హర్షుని కడ కరుదెంచి యాతేని కాపుఁ డయ్యెను. హర్షుని కిప్పు డీరీతి ప్రయాగకుఁడు, ముక్తుఁడు, అనువా రిరువురు ననుచరు లైరి. చీఁకటి క్రమ్మి దిక్కు దెలియక యచ్చోటఁ బరిభ్రమించుచున్న వారినిఁ గాంచి యొకానొక స్త్రీ యొక గుహనుండి "నదీ జల ప్రవాహ పూరితము లయిన పల్లపుఁ బ్రదేశములతోఁ గూడి యున్న యీ ప్రాంతము రాత్రులందు సంచార యోగ్యము గాదు." అని పల్కెను. హర్షనరపతి మెల్లగా వితస్తా నదీ తీరమును తన యనుచరులతోడఁ జేరి యచ్చోటఁ గూర్చుండెను.

అంతటఁ బ్రయాగకుఁడు జయపురపుఁ గోటఁ జేర్చుటకై యా ప్రాంతమందలి నావికులను బిలిచెను. మఱియు నతఁడు ముందుగ నచ్చట నున్న రక్షక భటులతో హర్షమహీపతిని నదిని దాటించి శ్రేయాశ్రయ మగు భీమదేవుని భవనమును జేర్చునట్లు మాటాడి యుండెను.

అట్టితఱి భీమదేవుఁ డుచ్చలు నాశ్రయించి యున్నవాఁ డైనను "ఇందు హర్షభూభర్త ప్రవేశించినచో నేను దదనుయాయి నయ్యెదను, అని తెల్పెను. ఈ సందర్భ మిట్లుండ నింతలో నావికులు నౌకను యానమున కనువుగ సిద్ధపఱచి యుండిరి. కాని హర్షుఁడు తన కంతకు ముందు పొడకట్టి యున్న దుర్నిమిత్తముల నెంచి భీతిఁ జెందిన వాఁడై కలవరపడుచు నౌక నెక్కుట కియ్యకొనఁ డయ్యెను. ఇందువలన నీ రాజు వినాశోన్ముఖుఁ డగుట తెలియవచ్చుచున్నది.

కం॥ కాలుని పురమున బుస లిడు
కాల భుజంగంబుఁ జూచి కంపిచెడు నా
కాలమున నారి పోవును
బాలిశు డీ దీపకళిక ప్రారబ్ధ గతిన్.

ప్రాణముల హరించు విద్రోహ చర్యకు గుఱియగుచున్న హర్షుఁ డెట్టులేని తప్పించుకొనుటకై యన్యాపేక్ష గల వాఁడు కాక పోయెను. ఈ సందర్భమున నతని మనోవృత్తి కులవధూ వ్రతాను కారిగ నుండె నని భావింపవచ్చును. నీలాశ్వుని కొమరుఁడు 'బింబుఁడు' అను' డామరుఁడు విద్రోహ కారులతో జేరకుండెను. అతఁడు హర్షు ననుసరింప వేచియుండెను. అట్టి వానిని సైతమింతటి క్లిష్ట సమయమునను హర్షుఁ డుపేక్షించి యుండుట యన్యులఁ గనుగొనసి కులవధూ వ్రతమునకు సాటిగ నున్న దనుట యుక్తమే గదా!

అంతట నంబర తలమున నంతటను దట్టముగ నావరించి యుండిన కాల జీమూతము ద్రోహకారుల విపరీత పాపకర్మలచే నంటువడిన క్ష్మాతలమును బావన జల క్షాళనమునఁ బవిత్రీకరింపఁ బూనెనో యన్నట్లు వారి ధారలను గ్రుమ్మరింపసాగెను. అక్కటా! యట్టితఱి హర్షమహీపతి యయో మయస్థితి యెట్టి దనవలెను? అది బెడిదంపు టుఱుములతోఁ, గన్నులఁ మిఱుమిట్లు గొల్పు తీఁగమెఱుపు లతోఁ గూడిన కాలజీమూతముచే నిబిడముగ నిండి యున్న కాలరాత్రి; అందునను ధారావర్షము. అంతే కాక పై పెచ్చు శత్రుభయము. ఇంకేమి కావలయును? జగ మంతయు హర్షునకు దుఃఖప్రాయ మయినది. ఇంకను బాప భూయిష్ఠ మైన చరిత్ర చెప్పవలసి యున్నది. 'పాపుల స్మరింపరాదు గదా!' అని యూర కుండుటయు భావ్యము గాదు. జరిగిన విషయము జరిగినట్లు దెలుపక పోవుటయు నుత్తమ చరిత్ర కారుల కంగీకార్యము గాదు.

గీ॥ పాపుల చరిత్ర వినుటయుఁ బల్కుటయు స్మ
రించుటయుఁ గూడ; దైనఁ జరిత్రకారు
లైన రవు లున్నదున్నట్టు లనుసరింతు
రదియు నీతి ప్రబోధమై యలరుచుండు.

ప్రకృతమున నట్టి భయంకర కాలరాత్రియందు ముక్తుఁ డనువాఁడు ముందు నడచుచుం డఁగా నతని నవలంబించి హర్షుఁడు తిన్నఁగాఁ బోవుచుండెను. అతని వెనుక ననుచరుఁడై ప్రయాగ కుఁడు పోవుచుండెను. అట్లు వారు పయనించుచు నొక పితృవనము (శ్మశానము) దాఁపుఁ జేరిరి. అచ్చోటు సోమనాథుఁ డను నొక సిద్ధునకుఁ బూజ్యమై 'సోమేశ్వరా'ఖ్యతోఁ బ్రసిద్ధిఁ గాంచిన దేవత లకు నిలయము. అట్టి చిన్నెలు గల యాప్రదేశమునం దొకచోట సమున్నత మైన తరు నికరముచే నాచ్ఛాదితంబును 'గుణుఁడు' అను పేరు గల యొకానొక క్షుద్ర తపస్వికి నునికిపట్టును నగు నొక కుటీ రమున్నది. అది యచ్చటనున్న ప్రతాప గౌరీశ దేవాలయము చెంత నున్నది. ధూర్తుఁ డగు నాక్షుద్ర తపస్వి 'విరహభుజంగి' అని ప్రసిద్ధి గాంచి 'బిశ్చ' అను పేరుతో నుండు నొక వేశ్యను గూడి జార చేష్టితముతో మెలఁగు చుండెను.

ముందు దెలిపిన విధమున ముందు నడచు ముక్తుఁడు తన్నవలంబించి వచ్చు హర్షుని మెల్లఁగా విద్యుల్లతల వెలుంగు సాయమున నాక్షుద్రతపస్వి యొక్క యల్ప కుటీరమును జేర్చి యం దారాత్రిఁ గడపఁగోరెను. అకటా! ఎంతటి దుర్దశ! హర్షచక్రవర్తికి తలదాఁపఁ దావు లేదు. ధారా వర్షము నకుఁ దడిసి శరీరమునందు బిట్టుగ నంటి యున్న కట్టుపుట్టముతోఁ గదల లేక యడుగడుగునను

గంపించు తమ యొడయనిఁ బ్రియాగుఁడు ముక్తుఁడును, అనువా రిర్వురు నతికష్టముగ నా ధూర్త తపస్వి కుటినిఁ జేర్చిరి. అట్టి సమయమున హర్షుఁడు మున్ను తనకుఁ గలిగిన యాపదల వారింప సమర్థుఁడై యుండినట్టి కందర్పుని స్మరించుచు ఖేదపడెను. ఆ కందర్పుని దుష్టు లగు తనమంత్రులు చూపోవమిచే మిషపెట్టి తఱిమి వేయించిరి. తొల్లి రుద్ర దైత్యుని యెడ నుత్పలుఁడును నిట్లే పొర పడి చింతించెను.

అంతట ముక్తుఁడు కుటీర ప్రాంగణములోనికిఁ బ్రవేశించుటకుఁ బ్రాకార మడ్డుపడి యుండు టచే దాని నారోహించి ద్వార బంధపులోపలి గడె చీలల నూడఁ బెఱికి ద్వారముఁ దెఱచెను. హర్షుఁడు మెల్లఁగాఁ దడవుకొనుచు నయ్యావరణములోపలఁ బ్రవేశించెను. అందు ముందు దెలిపిన ధూర్తతపస్వి లేఁడు. హర్షుఁ డందుఁ బ్రవేశింపఁగనే యతని కుడి పాదమునకు నొక ఱాతి మొన గాటముగఁ దగులు టచే నందు గాయ మేర్పడి నెత్తురు గారఁ దొడఁగెను. అతఁ డా దుర్నిమిత్తమును దలపోసి తనకు మృత్యు వాసన్న మగుచున్న ట్లూహించెను. ఇఁక నా యావరణములోని కుటీర ద్వారము బంధింపఁ బడి యున్నందున నందుఁ బ్రవేశించుటకు వలను పడక యాప్రాకారావరణములోపలనే యొక చోట గూర్చుండెను. కనులు మిరుమిట్లు గొల్పు కాటుక రంగు గల దట్ట మగు కారుమబ్బు తుటుములు మెఱుపులతో బెడిదంపు టుఱుములతో సలిలధారలఁ గ్రుమ్మరించుచుండ నత్యంత భయానకమై యున్న యా కాలరాత్రియందుఁ జక్రవర్తి యగు హర్షుఁడు బురదనేలపైఁ గూర్చుండి కూర్చుండి మరల లేచి లేచి యటు నిటు తడవుకొని తిరిగి తిరిగి వెఱ్ఱివానివలె దెందములోని కుందు కొంతకుఁ గొంత విస్మ రించెను. మఱియు నల్ప సేవకులు గప్పుకొను నట్టి యొక పంక సంకీర్ణ మగు తడిసిన కంబడిని నాధారముగఁ జేసికొని పడరాని యవస్థ ననుభవించుచు నారాత్రి నెట్లో గడపెను.

మఱియుఁ జక్రవర్తి యయిన యా హర్షుఁ డట్టి మహా విపద్దశయందు దిక్కుఁ దోఁచక తానేదో యొక పెను గోతియందు జారి పడిపోవు చున్నట్లు మిగులఁ గలఁత నొందుచు నిద్దుర లేక తనలోఁ దాను "నేనెవఁడను? ఎవనిచే నిట్టి దుర్గతి నాకుఁ గల్గెను? ఇప్పుడు నేనెక్కడ నున్నాను? నాకిష్ట దనుచరుఁ డెవఁడు? ఇప్పుడు నాకుఁ గర్తవ్య మెద్ది? నారాజ్యము శత్రువులు హరించిరా? నాప్రియు రాండ్రు హవ్యవాహనున కాహుతియై పోయిరే! నాప్రియ కుమారుఁడు భోజుఁ డెందుఁ బోయి యేమ య్యెనో! నేను బంధు హీనుఁడ నైతిని. ఈరీతి నే నసహాయుఁడనై యింతటి దుస్థితి నొంది చివర కొక బిచ్చ మెత్తుకొను వాని గుడిసె ముందు నేలపై యనదవలెఁ బొరలుచుంటిని గదా!" అని యీ తీరునఁ దనకుఁ గలిగిన కటిక దుర్దశయందలి ఘోర సంకటముల నెల్ల మాటిమాటికిఁ బిచ్చివానివలె నొక్కొక్కటి తలఁచి తలఁచి నావలె నింతటి దౌర్భాగ్య గతి పట్టి పోవు వాఁడు మఱెవ్వఁడును గతల యందును నుండఁబోఁ డని యనుచుఁ బలవించెను.

ఈ సంగతి యిట్లుండ నిఁక భోజుఁ డారీతి నితరుల ప్రేరణమునఁ దన్నుఁ గాపాడుకొను టకై శ్రీనగరినుండి తగిన పరివారముతో నెటకో పలాయితుఁ డయ్యెఁ గదా! వాని సంగతి యిట్లున్నది.

ఆ భోజుఁ డట్లు పెక్కండ్రు యోధులతోఁ గదలి పోయెనే గాని. యతనితో వెడలిన యను చరులు నడుమ నడుమ చెప్పకయే పోయిన వారును బగరకుఁ జిక్కిన వారును భంగపడి పరుగులిడిన వారును నైరి. ఈరీతి నతఁడు మిగిలియున్న యిద్దఱు ముగ్గురు నాశ్వికులతోఁ బయనించుచు "ఇఁక నే నయిదాఱు దినములలో దేవేంద్రుఁ డెదిరించి యడ్డు పడినను జయించి నా రాజ్యమును మరలఁ బడయఁ గల్గుదును." అని తనలో నాకాశ హర్మ్య నిర్మాణ మొనరించు నాశలతో 'హస్తికర్ణాంత రమును' ప్రవేశించెను.

ఉ॥ మనుజుఁడు గర్భ వాసమున
మ్రగ్గుచుఁ "బౌరుష దీక్షఁ గార్యములీ
ఘనముగఁ దీర్తు నింక" నని
గాఢముగాఁ దలపోసి కర్మ వా
యు నిబిడ పాత మొందుచు ము
హూర్తమునందె యదెల్ల విస్మరిం
చిన యవివేకి యౌ, నివె వి
చిత్రత నొందిన వాని సంగతుల్.

ప్రకృతమున భోజుని సంగతియు నిట్లే యైనదని చెప్పవచ్చును. భోజుఁ డారీతి 'రంగ వాటాంతరము' నందుఁ జేరి యచ్చటికిఁ దనతల్లి నాగేశ్వరుఁ డను భృత్యునిచే పాథేయమును బంపు నని తెలిసికొని ప్రతీక్షించుచు నుండెను. భోజుఁ డట్లుండి నారంగవాటము నందలి యొక శూన్య దేవాలయము నొద్దకు నాగేశ్వరుఁడు భోజ్య పదార్థమును దెచ్చినట్లు విని యాచోటును జేరఁగా నంతయు విపరీత మయ్యెను. ఆ వచ్చిన వాఁడు భోజుని బిట్టుగఁ గొట్టెను. ఈ కుత్సిత చేష్ట భోజున కర్థ మైనది. వెంటనే భోజుఁడు ధైర్యమును వీడక పిట్టపిడుగై క్రమముగ నచ్చోట ముట్టడించిన వారితోఁ బోరి పెక్కండ్రను గాలుని ప్రోలి కంపి తుదకు రక్త సిక్తాంగుఁడై వీర శయ్య నలంకరించెను. ఈ పోరాటము నందు భోజుని మేనమామ కుమారుఁడు 'పద్మకుఁడు' అతని సోదరుఁడు 'శేలుఁడు' అను వాఁడును దమ మగటిమి మెఱయించి పగతురను బరిమార్చి రణభూమిని శయనించిరి.

ఈవిషయ మిట్లుండ నాటి రాత్రి 'సూర్యమతీ' దేవి మఠమునందు, ఉచ్చలుఁడు ప్రవేశించెను. అతని తమ్ముఁడు సుస్సలుఁడు సమరమునఁ బోరి విజయమును సాధించి లవణోత్సమునుండి యన్న చేరిన తావునకే పరిశ్రాంతుఁడై చేరెను. అచ్చోట నా యన్నదమ్ములు భోజుఁడు రణ విహతుఁ డైన సంగతియు హర్షఁ డింకను సజీవుఁడై యున్నట్లును దెలిసికొనిరి. ఆ కారణమున వారికి డెందము లందు నాటియున్న శూలము వెలికిఁ దీసి వేయఁబడినను దానిమొన మాత్రము లోన విరిగికొని యున్న ట్లింకను బాధా జనక మగుచునే యుండెను. అందువలన వారు రాజ్యము ప్రాప్తమై యున్నను అప్రాప్త మైనట్లే భావించిరి. అట్టి రాజ్య ప్రాప్తి ప్రవాసమునందు లబ్ధ మగు రాజ్య సుఖమును బోలి "అస్తి, నాస్తి" (కలదులేదు) అను రీతితో వారి డెందముల గోచరించెను.

తఱువాత నచ్చటఁ బ్రాతః కాలమున ముక్తుఁ డాయాయి చోట్లు పరీక్షించి యొక చోట నున్న యా ధూర్త తాపసుని హర్షుని కడకుఁ దీసికొని వచ్చెను. ఆ దొంగ తపస్వి హర్షునిఁ జూచి నమస్కరించి తన కుటీరపు ద్వారముయొక్క గడెను దీసి తలుపు తెఱచెను. ఆ నరపతి లోనఁ బ్రవేశించెను. అందు గడ్డిచే నిర్మింపఁబడిన చాప లున్నవి. వానిపై దోమలు మున్నగునవి ముసరి 'ఝుమ్మ'ని ధ్వనించుచుండెను. ఆ యాసనములును బంక సంకీర్ణములై నీటిచేఁ దడిసి యుండెను. కడ కిట్టి కుటీర మమ్మహారాజునకు శరణ మయ్యెను. సార్వభౌముఁ డగు హర్షుఁడు సర్వ భాషా కవితా విశారదుఁడై సకల కలా నిపుణుఁడై యుండినందున నతని పలుకు సామంతరాజులకుఁ గర్ణ రసాయనమ ట్లభిమాన పాత్రమై యుండెను. అట్టివాని యెదుట నీనాఁడు బిచ్చ మెత్తుకొను వాఁడును క్షుద్ర తపస్వియు నగు నొకానొకఁడు సిగ్గు పడఁదగు గ్రామ్యపు మోటు మాట లాడుచుఁ దిండి విషయమును గుఱించి యేదో చెప్పుట యేమనఁదగును? దైవ వైపరీత్యమున సార్వభౌమున కిట్టి గతి పట్టిన దనవలెను. ఆ భిక్షుకుని ముఖప్రీతి వచనముల నాలకించు నాతేనికి భీతియు వ్యథయును జనించెను.

తఱువాతఁ బ్రయాగకుఁ డాహారమును గైకొని వచ్చుటకై తనవస్త్రము నాభిక్షుకున కొసఁగి యంగడి కంపెను. అభిక్షుకుని కుత్సితపు మాటల తీరు పరుష వచనముల నడతయు నతఁడు పరోక్షమునం దపకారి యగు నేమో యను భీతి హర్షునకుఁ గలిగించుచుండెను. అంత మాత్రమె కాక యాకుత్సిత తాపసుఁడు తన దుస్థితి హేతు వగు వైరియే కావచ్చుననియు నతని యంతరంగమునకుఁ బొడకట్టెను.

ఇట్టి స్థితియందు హర్షుఁడుండ మధ్యాహ్నకాల మైనది. అప్పు డా క్షుద్ర తాపసునిఁ గొల్చి యుండు నొక వెలఁది యాహార పాత్రమును దన మూపుపైఁ బెట్టుకొని యాభిక్షుకుని ముందు నడచుచుఁ దా నున్న కుటీరమునకు వచ్చుచుండుట యా మహీధవుఁడు గనుఁగొని యిదివఱకొక మాఱు తా నశ్లే యొక భృత్యుని బిచ్చపు జోగినిఁ గాంచి యుండుట తలఁచి "ఇది యేదో నాకు మృత్యు వాసన్న మైన ట్లున్నదే!" అని పరితపించెను.

అంతట నా వెలఁది తెచ్చిన భోజ్య పదార్థమును బ్రయాగుఁడు రాజుకడ నుంచెను. హర్షుఁడు కుందు డెందముతో ప్రయాగు ననురోధించి యా భోజ్య పదార్థమును స్పృశించెనే గాని యించుకేని భుజింపఁ డయ్యెను. అప్పుడు ప్రాంగణమునం దుండు ప్రయాగుఁడు మిథ్యా తాపసునితో వచ్చిన యా వెలఁదుకను "ఏమైన వార్తలు గలవా?" అని ప్రశ్నించెను. అందులకు నా యనాగరిక యగు పొలఁతి "భోజుఁడు హతుఁ డయ్యెను." అని బిగ్గరగా స్పష్టముగా బదులు పల్కెను ఆ కఱకు పలుకు హర్షుని కలఁతఁ జెందిన డెందమున వజ్ర ప్రహార మయ్యెను. ప్రయాగుఁ డప్పుడు "ప్రభూ! ఈ కంటకురాలు పల్కిన మాట బూటకము. విశ్వసింపకుము." అని యెంత యోదార్చినను దనకుఁ దోఁచిన దుర్నిమిత్తములఁ దలపోయుచు దుఃఖ సాగరమున మునుఁగుచు నిట్లు పలవరించెను. "కుమారా! నీతిఁ గఱపుటకై బాల్య మాదిగ యెంతో నియంత్రణతో నిన్నుఁ జూచితిని. అట్టి నా ప్రయత్న మిపుడు నాకు మిగుల సహింపరాని దుఃఖమునకు హేతు వైనది. అకటా! వీరాగ్రేసరులు గోరఁదగిన విక్రమ

ప్రవర్తనముతో సమర రంగమున నీవు దీర్ఘ నిద్ర నొందితివా! ఇట్టి నిన్ను భాగధేయ పరిభావితుఁ డగు నీ మొండి జీవియే కలంక దూషిత మైన తన యంకతలమునం దుంచి మృత్యు దేవతకుఁ గానుకగా నర్పించెఁగదా! యని మదికిఁ దోఁచుచున్నది.'' ఇట్లతఁడు పెక్కు రీతుల విలపించెను.

మఱియు హర్షుఁడు నవ యౌవనోద్భాసమాన మగు విశాల వక్షమున రత్న హారములు ధరించి యుండునప్పటి సుతుని మనోహరాకృతిని నెమ్మనమునఁ జిత్రించుకొని విహ్వల హృదయుఁడై యేవేవో యాశీర్వాదము లట్టి తఱిఁ జేయుచు నంతలోనఁ దెలివొంది ''అక్కటా! నేనెంత వెఱ్ఱిని! రక్షణీయుఁడైన నా కొమరుఁడు పుడమిఁ బాసి పోయెను. వృద్ధుఁడ నగు నే నీవిధముగ జీవితము నందలి యాశతో నాత్మ రక్షణమునఁ గాలము గడపుచున్నాను. నే నవలంబించిన యీ చెడ్డ నడత యెంతో హేయ మని భావింపకున్నట్టి మూర్ఖుఁడ నైతినే! ఎందుకు నా బ్రతుకు?'' అని పలుమారు మిగులఁ బలవరించెను.

హర్షుఁ డిట్లు పుత్రశోక కారణమున వాకొనఁ దరము గాని వెత నొందుచు నా టక్కరి తాపసుని కుటీరమున రెండవ నాటి రాత్రిని సైతము గడపెను. ఆరాత్రి లంబమాన మగు నిందు బింబ మనెడు తనమోమునుండి వెలువడెడు నీహార వారి పూర మనెడు కన్నీటినిఁ బెల్లుగ విడుచు చున్న ట్లుండెను. అంతియఁ దోడుగ బక్కపల యాక్రంద ధ్వనియుఁ బ్రబల మగు పుత్ర శోకార్తిఁ గుందు హర్షునిఁ గని బ్రహ్మతి దానును సంతాపము దెల్పెనో యని భావింపఁదగి యుండెను. ఈరీతి హర్షున కా రెండవ రాత్రి గడచినది.

అంత ప్రయాగుఁడు హర్షునిఁ గాంచి దేవా! మనము భగవన్మఠమునకుఁ బోవుదము. ఇచ్చోటు వాన యోగ్యము గా దని మనవి యొనర్చెను. కాని యతఁడు రేయెల్లఁ బుత్రశోకమునఁ గ్రాగిలి పోవుటంజేసి యవ్విషయమునే తలపెట్టలేదు. ఇంతఁ బ్రాతః కాలమున నాకట నకనక లాడుచున్న యాతేని వీక్షించి ప్రయాగుఁడు కపట తాపసునితో ''ఆర్యా! యీ తేఁడు క్షుద్బాధచేఁ గృశించి యున్నవాఁడు. కొంత యాహార ముదయ కాల భోజనమునకై కొనిరమ్ము.'' అని ప్రార్థించెను. అందుల కతఁడు 'సరె' అని పోయి యనతి కాలములోననే యన్నము కూర మున్నగు వ్యంజనములు గల రెండు పాత్రలను దెచ్చి వారి యెదుట నుంచెను. మఱియు నా క్షుద్ర తపస్వి వారితో ''నే నాహారమును గొని రాఁబోవుచున్నపు డొక్క చోట నొకానొక గేస్తు యాగోత్సవము జరుపుచుండెను. అచ్చోట పవిత్రంబగు మీకు నీ యాహారమును బడసి యుండుటచే నింత త్వరితముగ రాఁగల్గితిని''. అని పల్కెను.

ప్రయాగుఁడు బూటకపుఁ దాపసుఁడు పల్కిన యీ మాటలు విని ''మహారాజా! వింటిరి గదా! ప్రజలు తమ యొడయనికి సంభవించిన యత్యంత సంకట స్థితి నెఱింగియు నిట్టుల్లాసముతోడ నుత్సవములను జరుపుకొనుచున్నారు. ఎంతటి వైపరీత్య మిది! ఎంతటి కృతఘ్నత!'' అని నిట్టూర్పు పుచ్చుచుఁ బల్కెను. అందులకు హర్షమహీజాని వికటముగ నవ్వుచు ''ఏమి వెకిలిచ్చి! నీవు మూర్ఖుఁడవై పల్కుచున్నావు. వినుము.

కం॥ మరణించిన వానికి నై
మరణింపఁగఁ గోరు నట్టి మందుఁడు గలఁడే?
కరము సుఖింపఁగఁ గోరును
నరుఁ; డరయఁగ నెపుడు తన్మన స్తత్త్వ మిటొ.

కం॥ "నే మరంణిచిన లోకం
బేమౌనో! ప్రజకు దుఃఖ మెంతో యౌ" నం
చేమానవుఁడు దలంచునొ!
యా మానిసి వట్టి వెఱ్ఱి, యది యెట్లన్నన్.

గీ॥ లోకమున కెల్ల నేకైక లోచన మగు
లోకబాంధవుఁ డటు పరలోక మొంద
లోకము సుషుప్తి సౌఖ్యాబ్ధిలో మునుంగుఁ
గర్మసాక్షినిఁ దలఁచునే కలలనైన?

లోకము తీ రిట్లున్నది. కావునఁ బ్రయాగకా! పుత్రుఁడు జీవించి యుండు తఱిఁ బుత్ర స్నేహము నాకు డెందమునఁ బట్టరానిదై యుండె ననుట నిజము. కాని కుమారుని మరణ వార్త విన్న వెంటనే యది దుఃఖపుఁ బొంగులోఁ బొర్లి పోయినది. ఇఁక నట్టి స్నేహ మెట్లుండును? నా ప్రాణ మునకుఁ బ్రాణ మైన సుతునిఁ గోల్పోయి నేనింకను నిట్లు మొండి జీవముతో నుంటిని గదా! ఇతరుల కీసందర్భమున ఖేద ముండు నని మన మెట్లు భావింపఁ దగును?" అని పల్కి హర్షుఁడు మిన్నకుండెను.

అంతటఁ బ్రయాగకుఁ డచ్చట నున్న తాపసుని భోజ్య పదార్థమును సిద్ధపఱచుటకై గూఢముగాఁ బ్రేరేపించి ముందు దెచ్చినట్టి యల్పాహారపుఁ బాత్రల రెంటిని నతని కొసఁగెను. ఆ క్షుద్ర తపస్వి యా పాత్రలఁ గైకొని "నిన్నటి దినమున నాహారమును దెచ్చుటకై నా కొసఁగిన విత్తమునందుఁ గొంత మిగిలి యున్నది. అది యిప్పుడు భోజ్యము సిద్ధపఱచుటకుఁ జాలదు కాఁబోలుఁ. అయిన నెట్లో సమకూర్పఁ బ్రయత్నించెదను." అనుచు నతఁ డాకింత మదిలోఁ గష్టపడిన వాఁడువోలెఁ బల్కుచు నచ్చోటు వాసి పోయెను. ఆహారమును గొని వచ్చుటకుఁ బోయిన యీ కుటిల తాపసుఁడు బ్రాహ్మణుఁడు. ఈతని కులమునందే పుట్టిన వాఁ డింకొకఁడు గలఁడు. వాని పేరు మనోరథుఁడు. వాఁ డీక్షుద్ర తాపసునికి స్నేహితుఁడై యుండెను. అందువలన గోప్య మగు హర్షుని కథ యంతయు నతనికిఁ దెలిసెను.

అట్టితఱి తుచ్ఛుఁ డగు మనోరథుఁ డీటక్కరి తాపసునితో "మన మీరాజుయొక్క రహస్య మును నతని దాయాదులకుఁ దెలిపినచో విరివిగ ధనమును సేకరింపవచ్చును. కావున నట్లు సేయుదము" అని వీనిని సమ్మతింపఁ జేసియుండెను. ఇట్టి దుష్ట కార్యమున కొడిగట్టి వంచకుఁ డగు నీసన్యాసి హర్షుని యెడ రాజ భక్తి గలవాఁడువోలె నటించుచు సహకార మొనర్చుచుండెను. క్షుద్రులు రహస్య మును డెందములో నిలుపుకొనఁ గలరా?

కం॥ అమృత మగు పాద రస మ
ట్లిమడక స్వల్పు లగు వారి హృదయంబుల గో
ప్యము గాఁదగినట్టి రహ
స్య మజీర్ణం బగుచు నప్పు డపుడె వెలువడున్.

ప్రకృతమున గుప్తముగ నుండఁదగిన హర్షుని వృత్తాంతము క్షుద్ర తాపసునివలన శత్రువుల చెవుల కందున దయ్యెను. ద్రోహ కారి యగు నీక్షుద్రుఁ డెవఁడో యొక శ్వపాకునివలన జనించి యుండును. ఈ యొనర్చిన స్వామి ద్రోహము వాని జన్మ కర్మలను వ్యక్తము చేయఁజాలినదై యున్న దను టెంతేని సమంజసముగదా! ఏమైన..., ఆ తాపసబ్రువుఁడు వాని ...తుఁ డగు మనోరథుఁడును నుచ్చలుని పక్షము వాఁ డగు 'ఇల్లరాజు' అను వాని చెవి కీహర్షుని సంగతి యందఁజేసిరి. ఆ 'ఇల్లరాజు' ఉచ్చలుని కావిషయము దెలియఁజేసెను. ఉచ్చలుఁడు తర్వాత జరుపఁదగు కర్తవ్యము నందు 'ఇల్లరాజును' నియోగించెను.

కొంద ఱీవిషయమున, ఆ క్షుద్ర తాపసు లిర్వురును ఇల్లరాజునకు రహస్య వృత్తాంతముఁ దెలుపుటయందు 'భూతిభిక్షుఁడు' అను కాయస్థుఁడు కారణ మనియు. తర్వాత నావదంతి దహాంజన శ్రుతమై యా కాయస్థుఁడే రాజద్రోహిగా నిర్ణయింపఁబడె ననియు నుడువుచున్నారు. ఏది ఎట్లున్నను హర్షుని యునికి విషయమైన రహస్యము శత్రువు చెవికి సోఁకినది. అందుకు ధూర్తులగు నీ బ్రాహ్మణబ్రువు లిర్వురే మూల మనవలయును. ఈసంగతి యిట్లున్నది.

అంత హర్షునకు నాఁకటి మంట యెక్కు వైనది. పుత్ర శోకము క్రొత్త తీరులోనే యున్నది. ప్రయాగకుఁడు హర్షుని నాహారము భుజింపఁ బ్రార్థించెను. హర్షుఁడు ఆఁకటి బాధకుఁ దట్టుకొనలేక "యాహారమును గైకొని యాతాపసుఁడు వచ్చుచు నుండును," అని తలఁచుచు విహంగ శాబకము గూటినుండి పేద చూపులతోఁ జూచు చందమున నా కుటీరములోని గవాక్షమునుండి కాంచు చుండెను. అప్పుడు వింతగ నొక్క మాఱు కుటీర ప్రాంగణ మంతటను శస్త్రధారు లగు యోధులు నిండి యుండిరి. కుటీరపు బహిర్ద్వారపు గడియ మ్రాఁకులను విఱుగఁగొట్టు బెట్టిదపు శబ్దము వినవచ్చెను.

ఈ సందర్భమునుబట్టి తటస్థించిన ద్రోహమును హర్షుఁడు గమనించుచున్నవాఁడై ముక్తుని "వెలుపలికి రమ్ము" అని పిలుచుచు శస్త్ర ధారియై యున్న యా తావసాధముని జూచెను. కొడనే యతఁడు ధైర్యము వహించి 'ముక్తుని' వెలికిఁ బంపి కుటీర ద్వారమును దెఱచి తన చెంగట నున్న యొక చిన్న బాకును గేలఁ గీలించ నిర్భీకుండై నిలిచి యుండెను.

అట్టి తఱి మైమఱువు గల యొక భటుఁడు ఖడ్గమును ధరించి సాహసాహంకారములకు లొంగి మత్తిల్లిన వాఁడై యా హర్షుని యెదుట నిలువఁబడెను. హర్షమహారాజు ఖడ్గధారి యగు నా యోధుని, ఆ చిన్న కుటియందల్లే నేలఁ బడఁగొట్టి తన వ్యాయామ కౌశల్యము గనఁబఱచెను. కాని, కరుణ కలవాఁడై యతని ప్రాణములు దీయఁ డయ్యెను. మఱియు "నీ యల్ప సత్త్వునిఁ జంపుటవలన నాకుఁ గలుగఁ బోవు ప్రయోజన మేముండును?" అని ప్రమాద స్థితియందుఁ దా నుండియుఁ సగర్వముగ భావించెను.

పిమ్మట కుటీరపుఁ జూరు కొఱగ కప్పు నూడఁ దీసి యొక యోధుఁడును వాని వెంట నల్లే మఱి యొకఁడును ఖడ్గము ధరించి యున్న హర్షుని యెదుటఁ బడి యతని మూర్తిమత్త్వమును గన్గొని విహ్వెల పడి వణఁకుచు నేలఁ గూలిరి. అప్పుడు మొదటఁ గుటీరమును బొచ్చినవాని వెనుక మఱి యొకఁడు హర్షు నెదుర్కొను యత్నముతో దండాకృతితో నిట్టనిలువుగ నిల్చెను. అట్టి సమయమున రురువు నెదుర (రురువు = చారలమప్పి లేక, ఆ పేరు గల యొకానొక రాక్షసుఁడు.) చాముండాదేవి వోలెఁ గనుపట్టెను. అచ్చోట హర్షునకు శత్రువులతోడ జరిగిన పోరు సింహానాదములు గాని భేరీ తూర్య ఘోషములు గాని వివిధము లగు నాయుధముల మ్రోఁతలు గాని లేక నిశ్శబ్దముగ సాగినది.

అప్పు డాకస్మికముగ శస్త్ర ధారు లగు డామరుల సమూహము కుటీరమునం దున్న హర్షుని నలువంకలఁ జుట్టుకొనిరి. ఆ దృశ్యము భాండమునం దుండు నెలుకకై మార్జాలముల గుంపు మూఁగిన ట్లుండెను. అది యట్లుండ నీధ్ర భాగము (చూరుకొఱగ)నుండి యొక యోధుఁడు చివాలునఁ గుటీరములోనికి దుమికి ప్రయాగుని బాహువులందును శిరమునందును దీవ్రముగఁ బ్రహరించి హర్షుని మీఁది కుఱికెను. హర్షుఁడు శస్త్ర ప్రహారమున వానినిఁ బడఁగొట్టఁబోవ వాఁడద్దానినిఁ దప్పించుకొని బిర బిర యా చక్రవర్తిని వక్ర మార్గమున వక్షమునందుఁ దీవ్రముగ రెండు మార్లు కరవాలముతోఁ బ్రహరించెను. ఆ వ్రేటులతో హర్షుఁడు 'మహేశ్వర, మహేశ్వర' అని రెండుమాఱు లుచ్చరించి వేళ్ళు నఱికిన మహావృక్షమువలె నిలాతలమునఁ గూలి యసువులఁ బాసెను.

ఈ హర్షుఁడు చక్రవర్తి. యభ్రంకషము లైన మహాహర్మ్యములం దుండిన వాఁడు. అట్టి వానికి సొమ్ములు దోఁచికొని పరుగిడి పోయి దాఁగి యున్న దొంగను బట్టి యధికృతులు వధించిన చందమున నొక చిన్న కుటియం దీఘోర మైన మరణము వాటిల్లుట యెంతేని జాలి గొలుపుచున్నది. ఏకాలమునందును నెక్కడను నిట్టి విరుద్ధము విస్మయకరము నగు ఘోర మారణ కర్మ జరిగి యుండదు.

ఈహర్షుఁ డున్నతాత్ముఁడు, గొప్ప చదువరి, మహాకవి. సకల కలాభిజ్ఞుడు. పెక్కు భాష లందుఁ గూలంకష ప్రజ్ఞ గలవాఁడు. ఐననేమి? సంగర రంగమునకు నెప్పుడును వైముఖ్యముఁ జూపుచు నుండెను. అట్లు "సమర మనినఁ బెడమోము పెట్టువాఁ" డను నొక్క కారణమే యెల్లరీతుల

నెంతో మెచ్చుకొనఁ దగి యుండిన యీతని యోగ్యతామహిమ లోకమున రాణింపక యణఁగి పోయి నది. మఱియు నితఁడు కార్యములు జరుపునెడ మిక్కిలి పదను గల తన సూక్ష్మ బుద్ధిని వినియోగిం పక యెవరేది చెప్పిన నద్దాని ననుసరించి తనఘనతను జెఱచుకొనెను. అందుకుఁ గారకు లీతని సచి వులే యనవలయును. ఆనాటి యీతని యమాత్యులు పెక్కండ్రు స్వార్థ పరులు రాజద్రోహులునై యెల్ల యిడుములకుఁ బునాదులై రాజ్య లక్ష్మిఁ గొల్లగొట్టుచుఁ జివర కీతని నిట్టి గతి పట్టించి రని విమ ర్శించి తెలిపికొనుటయే యుక్త మగుచున్నది.

హర్షమహీజాని నలువదిరెండు సంవత్సరములు. ఎనిమిదినెలలు (12సం 8నెలలు) జీవ యాత్ర గడపి 4177,వలౌకికయుగ సంవత్సరమున (1101 ఏ.సి.) యట్టి దుర్మరణము నొందెను. ఈతని జాతకమును బరిశీలించినచో దుర్యోధనుని వలె నితఁడును స్వ వంశోచ్ఛేదకుఁడై యుండుటకుఁ దగిన హేతువు లుండుట యీతని జాతకచక్రమును బట్టి తెలిపికొనవచ్చును.

హర్షుఁడు కర్కాట లగ్నమునందు జన్మించెను. దానికి సరిగా వరుసగా 5-6-7-10 (పంచమ, షష్ఠ, సప్తమ, దశమ) స్థానములందును, కుజ శనులును, బుధగురులును, రవిశుక్రులును, చంద్రుడును నుండిరి. ఈవిధముగనే కొలఁది మార్పుతో దుర్యోధనాదుల జన్మలగ్నమునందలి గ్రహ స్థితియు నుండెను.

దుర్యోధనాదుల జన్మలగ్నము గూడఁ గర్కాట రాశియే యై యుండవలయును. దానికి పుత్ర జామిత్ర దశమ స్థానములందు (5-7-10) వరుసగా శని, శుక్రుఁడు, చంద్రుఁడు, అను గ్రహము లుండఁగా దుర్యోధనాదులు జన్మించి స్వకుల వినాశకులై నశించిరి. "ఎవరైనను, ఆ లగ్నమునఁ బుట్టినప్పుడు పైఁ దెలుపఁబడిన విధమున గ్రహస్థితు లుండినచో వారలుగూడఁ దమ కులముయొక్క వినాశమునకుఁ గారకు లగుదురు" అని బృహజ్జాతకర కర్త 'వరాహమిహిరుఁడు' మున్నగు సంహితా కారుల యాశయముగా, కల్హణ కవి సార్వభౌముఁడీసందర్భమున నిరూపించెను. హర్షమహీపతి జాతకమును నిరూపించు కల్హణకవి చెప్పిన శ్లోక మిట్లున్నది.

శ్లో॥ తస్యాసన్ ష్మర్కటా, జీవ
బుధౌ, శుక్రోష్ణగూ, శశీ
తనయా,మిత్ర, జామిత్ర,
శేషు, కర్కట జన్మనః.

గీ॥ హర్షుఁడు కుళీర లగ్నజుం, డవనిజార్కి
జులును, సురగురుబుధులును, శుక్రకరవులు,
శశియు, సుత, శత్రు, జామిత్ర, దశమ, వసతు
లందుఁ, గ్రమముగ సంస్థితి నొంది యుండు.

ఇఁక సుయోధనాదులు గూడ హర్షునివలె స్వవంశోన్మూలన కరులు. వారిని గుఱించి వరాహమిహిరాది సంహితాకారుల యాశయమును జాతక చక్ర నిరూపణ పూర్వకముగఁ గల్హణకవి యిట్లు దెల్పెను.

శ్లో॥ చంద్ర, దైత్యేజ్య. పాపేషు
ఖ మందా త్మజ గేషు యత్।
ఆహు స్సుసంహితా కారాః
కౌరవాదీన్ కులాంతకాన్॥

గీ॥ దశమ, సప్తమ, పంచమ స్థానములను
వరుస శశి, శుక్ర, శను లుండు తరుణమందు
కౌరవాది కులాంతకుల్ గలిగి రనుచు
దెలిపి రాసంహితాకర్త లలఘు యశులు.

# హర్షమహీపతి జాతక చక్రము

| | | | |
|---|---|---|---|
| మీన. | మేష. చంద్ర | వృష | మిధు |
| కుంభ | రాశి చక్రము | | కర్కాట. లగ్న |
| మకర. శుక్ర. రవి. | | | సింహ. |
| ధను. బుధ. గురు. | వృశ్చిక. అంగా. శని. | తుల. | కన్య. |

హర్షుఁ డారీతిఁ గుటీరమునం దనహాయుఁడై నేలఁ గూలి యసువులు వాసిన తఱువాత నతని ప్రతిపక్ష యోధులు నిష్కారుణులై యా శవ శీర్షమును ఖండించి యుచ్చలుని కడకుఁ దీసికొని

పోయిరి. అంతమాత్రమే గాదు. ఖండిత మగు నా హర్షుని యుత్తమాంగము నొక కఱ్ఱకు వ్రేలఁ గట్టి యాడించిరి. వారట్లు చేయు నపుడు సాగరముతోడ వసుంధర కంపించెను. మేఘము లేకయే యాకసమునుండి ధారా వర్షము గురిసెను. అట్టి చెడ్డ చేష్టవలనఁ గాశ్మీరమునఁ జిరకాల ముత్పాతము లేర్పడెను. క్రూరు లగు నా యోధు లాత్రిరున హర్షుని శీర్షము నుచ్చలుని చెంతకుఁ దీసికొని రాఁగా నతఁ డౌచిత్యమును బాటించి యద్దానినిఁ జూడనే లేదు. మఱియుఁ జాల తడవు గన్నీరుఁ గార్చి యగ్నియం దాశిరమును దహనము గావింపఁ జేసెను.

చక్రవర్తి యైన హర్షుని యా నగ్న శవము చివరకు జ్ఞాతి బంధు రహితముగ నుచ్చలుని యాజ్ఞ చొప్పున 'గౌరకుఁడు' అను కాష్ఠాగారికునిచే దహనము గావింపఁబడెను. ఇది యెంతటి దుర్గతి యనవలెను? ఈ తీరున హర్షుని యుదంతము రామాయణ భారతములవలె నతిదీర్ఘమై యద్భుతావహ మగుచున్నది. సార్వభౌముఁడై యిచ్ఛ వచ్చినట్లు రాగియై దుర్మరణము నొందిన హర్షుని విషయమై యతని యంతిపురపు టంగనలలోఁ దుదకు నొక్కరేని కన్నీరుఁ గార్చినవా రతని యవసాన దశ యందు లేరైరి. అంతటి పరిజనములో నొక్కరైన శ్మశానము వరకు రాక పోయిరి. చక్రవర్తికిఁ జివర కింతటి దుర్గతి పట్టినదిగదా!

ఇట్టి సంగర్భమును బట్టి స్వీయ సుఖాభిలాషియై లోభ మోహ హతుఁడైన మానవుని గతి యిట్టి దని యెఱిఁగియుఁ బాపు మనస్సు నిర్వేదమును జెంది వన నివాసమునకుఁ బ్రయత్నింపదే! తుచ్ఛ మగు నిట్టి మనస్సు నెంతేని నిందింపవలెను. ఈ సందర్భమున నింక కొంత పరమార్థ పరిశీలనము చేసి కొనవలసి యున్నది.

గీ॥ భాగ్య మను నంబుదంబునఁ బ్రబలు సిరులు
చంచలతె యౌను. తుద విరసంబు జలద
మకట! మోహాంధకారోపహతుఁడు జనుఁడు
వంప దున్నతివే గోరు శాంతి గనఁడు.

ఉ॥ ఆది నొకండు లేదు. తుది
యందును లే దొకఁడేని. యంతలో
నేదియొ పుణ్య పాపముల
నేర్పడఁగన్ నడుమంతరంబువన్
బాదములన్ శిరంబు నెఱఁ
బాపిన నట్టువ యై నటించి యం
భేదగ జీవి పోవు నెటొ!
చెప్పెవి యన్ దెరవాటు చేరుఘున్.

రాజ్యశ్రీ యీ తీరున రాజవంశ పరంపరలో నడుగుల నిడుచు వచ్చినది. ప్రకృతమున నిట్టి సంఘటనమునుబట్టి దినలక్ష్మి సుర విరహిత మైన హిమగిరి శిఖరమును వీడి సురాలయ మగు మేరు గిరి శృంగమును జేరు తీరున భాగ్య లక్ష్మియు రాజ వంశ పరంపరలోని 'యుదయరాజ' వంశమును విడనాడి 'శాతవాహన' వంశజుం డైన కాంతిరాజు నన్వయమందుం బ్రవేశించి ప్రతిష్ఠం గాంచిన దయ్యెను.

శ్రీ శ్రీ శ్రీ

ఇది కాశ్మీరికమహామాత్యశ్రీ చణ్పకప్రభు సూను 'కల్హణమహాకవి' ప్రణీతమగు 'రాజతరంగిణీ' యను సంస్కృత మహాకావ్యమునకు, అనువాదరూపమును స్వయంపాకాన్వయ భారద్వాజగోత్రజ శ్రీ. వేంకటలక్ష్మ్యంబావేంకటప్పార్యతనూజ, పరదేవతానుగ్రహసముపార్జితోభయకవితా సాహితీవికాస, వ్యాకరణవిద్యాప్రవీణ, విద్వత్కవిశేఖర, మహాకవి, ఆయుర్వేద విశారద, జరుగుమల్ల్యభిజన, సింహపురనివాసి, వేంకటరమణశర్మచే విరచితమును నగు, ఆంధ్రరాజతరంగిణీ, అను చంపూ మహాప్రబంధమునందు సర్వంబును

సప్తమ తరంగము.

ఓం తత్, సత్



# అనుబంధము 1

## రాజతరంగిణియందుఁ బేర్కొనఁబడిన
## కవులు విద్వాంసులు మున్నగువారు. (కొందఱు మాత్రము)

| | కవి | గ్రంథము | కాలము మున్నగునది |
|---|---|---|---|
| 1) | నీలముని | నీలమతపురాణము | కాశ్మీర మేర్పడినపుడు మొదటి పాలకుఁడు అతి ప్రాచీనుఁడు. |
| 2) | సువ్రతుఁడు | కాశ్మీర చరిత్రము | కల్హణ కవికిఁ బూర్వులు (2–4) |
| 3) | శ్రీఛవిల్లాకరుఁడు | ,, | |
| 4) | హేలరాజు | ,, | |
| 5) | వసునందుఁడు | — | కాశ్మీరపతి 544. బి. సి. |
| 6) | చందకుఁడు | — | కాశ్మీరపతి యైన తుంజీనుని కాలమువాఁడు. 105. బి. సి. |
| 7) | మాతృగుప్తుఁడు | — | కాశ్మీరపతి బి. సి. |
| 8) | భర్తృమేంఠుఁడు | హయగ్రీవవధ | బి. సి. |
| 9) | పాణిని | సంస్కృత వ్యాకరణ సూత్రములు అష్టాధ్యాయి మొదలగునది | 1500, బి. సి. (సుమారు) (9–11) |
| 10) | కాత్యాయనుఁడు — | వార్తికములు | |
| 11) | పతంజలి భగవానుఁడు - | మహాభాష్యము, యోగ సూత్రములు, చరకసంహిత, | |
| 12) | బప్పటాచార్యుఁడు గొప్ప విద్వాంసుఁడు | — | లలితాదిత్యుని కాలమువాఁడు 695. (ఎ. డి.) |
| 13) | భవభూతి | ఉత్తరరామచరిత్రము మున్నగునవి. | యశోవర్మ యాస్థానమున నుండినవారు |
| 14) | వాక్పతిరాజు | — | కాశ్మీరపతియగు లలితాదిత్యుని కాలము 695 ఎ. డి. |
| 15) | మనోరథుఁడు | — | వీరు, తొమ్మండుగురు మహావీరుఁడు, గొప్ప విద్వాంసుఁడు నగు కాశ్మీరపతి జయాపీడుని యాస్థానమున నుండిన వారు. వీరిలో గొందఱు మంత్రులు గను నుండిరి. కాలము 751 - 800 ,, ,, ఎ. డి. (15–23) |
| 16) | శంఖదంతుఁడు | — | |
| 17) | చటకుఁడు | — | |
| 18) | సంధిమంతుఁడు | — | |
| 19) | క్షీరస్వామి | వ్యాకరణశాస్త్రము | |
| 20) | థక్కియుఁడు | ధనుర్విద్య | |
| 21) | దామోదరగుప్తుఁడు | కుట్టినీమతము | |
| 22) | వామనుఁడు | కావ్యాలంకార సూత్రములు | |
| 23) | ఉద్భటుఁడు | ఉద్భటాలంకారము | |

| | | | |
|---|---|---|---|
| 24) | ఆనంద వర్ధనుఁడు, | ధ్వన్యాలోకము | కాశ్మీరపతియగు అవంతివర్మ యాస్థానమునం దున్నవారు. క్రీ. శ. 857 ఎ. డి. |
| 25) | రత్నాకరుఁడు | — | |
| 26) | భట్టకల్లటుఁడు | — | |
| 27) | శంకుకుఁడు | — | కాశ్మీరమున సుప్రసిద్ధకవియగు మమ్మట భట్టు రచించిన కావ్య ప్రకాశమునందుఁ బేర్కొనఁబడిన వాఁడు. అజితాపీడుని కాలమున నున్నవాఁడు 816 ఎ. డి. |
| 28) | క్షేమేంద్రుఁడు | సేవ్యసేవకోపదేశము. ఔచిత్య విచార చర్చ. కవికంఠాభరణము మున్నగు 50 గ్రంథములను వ్రాసిన మహాకవి. | కాశ్మీరపతి, అనంతభూపతి కాలమువాఁడు 990 - 1060 ఎ. డి. |
| 29) | మమ్మ గొప్పగాయకురాలు | గానకళ | కలశ భూపతికాలము 1068 - 1089 ఎ. డి. |
| 30) | అభినవగుప్తచార్యుఁడు | ధ్వన్యాలోకలోచనాది సుప్రసిద్ధ గ్రంథములను 25 రచించిన మహాకవి. | 10 - 11 ఎ. డి. కాలము. |
| 31) | మమ్మటభట్టు | సుప్రసిద్ధమగు కావ్య ప్రకాశిక దీనికి సుమారు 70 వ్యాఖ్యానములు గలవు | 1070 - 1140 ఎ. డి. |
| 32) | సోమదేవ భట్టు | కథాసరిత్సాగరము | అనంతభూపతికాలము 1060 ఎ. డి. |
| 33) | రుద్రటుఁడు | రుద్రటాలంకారము | 8 వ శతాబ్దము ఎ. డి. |
| 34) | మహిమభట్టు | వ్యక్తివివేకము | క్రీ. శ. 1021 1060 ఎ. డి. |
| 35) | రాజాన కరుయ్యకుఁడు | వ్యక్తివివేకమునకు వ్యాఖ్యాత. | క్రీ. శ. 11 - 12 ఎ. డి. |
| 36) | మంఖుఁడు | — | క్రీ. శ. 12 వ శతాబ్దము విజయసింహుని కాలము |
| 37) | శివరథుడు | గొప్ప విద్వాంసుఁడు | 1102 ఎ. డి. |
| 38) | నాయకుఁడు | నాల్గు వేదములు, ఆఱుశాస్త్రములు, అధ్యయన మొనర్చిన విద్వాంసుఁడు. | |
| 39) | బిల్హణుఁడు | | 11 - 12 శతాబ్దము ఎ. డి. |

ఈ తెలుపఁబడిన విద్వత్కవులలో, భవభూతి, వాక్పతిరాజు. అనుకవులు దక్క మిగిలిన వారందఱును, గాశ్మీరదేశమువారు.

కాశ్మీర పతులలో మాతృగుప్తుఁడు మహాకవి. జయాపీడుఁడు. మహావరాక్రమశాలి గొప్ప విద్వాంసుఁడునై యుండెను. హర్షుఁడు (1090 - 1101 ఎ. డి. వఱకు రాజుగ నున్నవాఁడు) అన్ని కళలయందుఁ బెక్కు భాషలందు శాస్త్రములందును బేరు గాంచినవాఁడు. మఱియును గొందఱు కాశ్మీర పతులు విద్వాంసులుగను కవులుగను నుండిరి.

S. V. R. Sarma.

## అనుబంధము - 2

# శోధనపత్రము

| పుట సంఖ్య | పంక్తి | ఉన్నది | ఉండఁదగినది |
|---|---|---|---|
| 6 | 19 | కవికాలము | కలికాలము |
| 10 | 11 | నువకఠంకమున | ఉపకంఠమువ |
| 12 | 10 | సామావ్య | సామాన్య |
| 15 | 17 | విత్తస్తా | వితస్తా |
| 16 | 6 | తుష్క రాజుల | తురుష్క రాజుల |
| 16 | 17 | యుద్ధానిని | యుద్ధానివి |
| 16 | 21 | కలామును | కలాపమును |
| 19 | 31 | మీృయాకతు | మీయాకృతు |
| 20 | 32 | జీరించునటు | జీర్ణించునటు |
| 20 | 32 | జీరింవనేని | జీర్ణింపవేని |
| 23 | 21 | గారాంధులకు | కామాంధులకు |
| 24 | 18 | చెల్నొందు | చెన్నొందు |
| 24 | 32 | విదివలు వ్వరికిని | విదివలుకెవ్వరికిని |
| 36 | 14 | వర్తఁనుడగుచు | వర్తనుఁడగుచు |
| 37 | 23 | విశ్వక్షయాద్యుక్తుఁడు | విశ్వక్షయోద్యుక్తుఁడు |
| 43 | 25 | సంపిక్కృతిన్ | సంస్కృతిన్ |
| 43 | 16 | ముప్పదియేండ్లు | ముప్పదియేఁడేండ్లు |
| 44 | 22 | మహాత్మ్యము | మాహాత్మ్యము |
| 50 | 29 | వనపాలురచే | వనపాలుర |
| 51 | 7 | మదపుటేనుఁగులఁ | మదపుటేనుఁగుల |
| 58 | 30 | రేహమునే | దేహమునే |
| 60 | 21 | తమనంగమున | తమ సంఘమున |
| 60 | 31 | డగ్గిరి | డగ్గరి |
| 61 | 25 | యుజ్జయిని | యుజ్జయిని |
| 61 | 27 | యొద్ధనే | యొద్దనే |
| 67 | 15 | రంగు | రంగు |
| 68 | 24 | పోగద | పోదుగద |
| 74 | 32 | సుఖోపవిశిష్టుఁడై | సుఖోపవిష్టుఁడై |
| 75 | 11 | నేనువెంటనే | వెంటనే |
| 85 | 8 | పవరసేన | ప్రవరసేన |

| పుట సంఖ్య | పంక్తి | ఉన్నది | ఉండఁదగినది |
|---|---|---|---|
| 90 | 17 | తు_త్తనియలు | తుత్తునియలు |
| 90 | 21 | థేవి | దేవి |
| 91 | 1 | హీనుఁడయై | హీనుఁడై |
| 94 | 21 | మా_ర్తండుని | మా_ర్తాండుని |
| 94 | 28 | గోరిన | గోరినదై |
| 104 | 15 | శీలతా | దుశ్శీలతా |
| 105 | 28 | ధ్వనుని | ధన్వుని |
| 107 | 5 | గొపీనము | గొలీనము |
| 110 | 3 | ధుర్త్యత | ధుర్యత |
| 117 | 3 | విశిధ | విశలం |
| 117 | 4 | ములఁబొలయునెధ | బొలయునె సద్ధ |
| 121 | 6 | పూర్య | పూర్వ |
| 121 | 8 | మామటివాండ్రు | మావటివాండ్రు |
| 121 | 9 | తిర్వగ్జంతువుల | తిర్యగ్జంతువుల |
| 121 | 29 | దోర్థండ | దోర్దండ |
| 123 | 12 | తదస్థ | తటస్థ |
| 123 | 28 | ఆకారమున | ఆకారణమున |
| 124 | 21 | నుపాయముగ | నుపాయనముగ |
| 124 | 31 | వా_స్తవుఁడు | వాసవుఁడు |
| 125 | 26 | ప్రతిష్టింప | ప్రతిష్ఠింప |
| 126 | 16 | షభిజ్మణి | భిషజ్మణి |
| 127 | 20 | నొనంపలదు | నొనంగవలదు |
| 129 | 18 | రనసిద్ధు | రసపిద్ధు |
| 130 | 11 | దర్పవిష్య | దద్పవిష్య |
| 131 | 19 | గొల్పుట | గొల్చుట |
| 134 | 8 | బొడువ | బొడువ |
| 134 | 11 | నబేద్యమై | నభేద్యమై |
| 141 | 24 | చెరుఁన్ | చెదును |
| 146 | 21 | వాంట | వంట |
| 154 | 20 | జూద | ద్యూత |
| 157 | 26 | మీహా | మహా |
| 162 | 10 | నర్చిన | అల్లొనర్చిన |
| 163 | 20 | వేగితముగ | వేగిరముగ |

| పుట సంఖ్య | పంక్తి | ఉన్నది | ఉండఁదగినది |
|---|---|---|---|
| 165 | 21 | పిదవయశంబు | పిమ్మటయశము |
| 168 | 12 | వాఁడె | నతఁడె |
| 174 | 3 | వారాగ | వారాంగ |
| 175 | 19 | విష్ణుఁడై | విష్ణుఁడై |
| 178 | 10 | రాదిగ | దాదిగ |
| 178 | 9 | (క్రి. శ. 813-844) | (క్రి. శ. 813-814) |
| 185 | 29 | ద్విజాన్ముఁడు | ద్విజన్ముఁడు |
| 189 | 21 | యధీము | యధీనము |
| 191 | 13 | నలఁతి | నలఁతి |
| 194 | 29 | యుదఖాండ | యుదభాండ |
| 199 | 10 | ప్రత్యుపశృతి | ప్రత్యుపకృతి |
| 203 | 25 | పేర | పేరు |
| 204 | 19 | జనుఁలబీడింప | జనులఁబీడింప |
| 205 | 28 | రాజాశనము | రాజాసనము |
| 222 | 23 | పెద్దతడవు | పెద్దతడవు |
| 224 | 28 | కిచ్చి | కిచ్చ |
| 243 | 2 | నర్పింపఁ | నర్పింప |
| 249 | 7 | నేకిభవించి | నేకీభవించి |
| 249 | 12 | మక్షేగుప్తుని | క్షేమగుప్తుని |
| 251 | 19 | లెదిరించినగో | లెదిరించినచో |
| 252 | 18 | గైకొన | గైకొని |
| 257 | 25 | యదార్థమని | యథార్థమని |
| 265 | 18 | పైనఁగు | పెనఁగు |
| 266 | 27 | భాద్రవద | భాద్రపద |
| 269 | 27 | కడగి | కడఁగి |
| 273 | 10 | తత్త్వఁజ్ఞుడు | తత్త్వజ్ఞుఁడు |
| 278 | 31 | శుక్షపక్ష | శుక్లపక్ష |
| 281 | 1 | ధేవుఁడు | దేవుఁడు |
| 291 | 1 | టోమచున్న | టోవుచున్న |
| 292 | 10 | నెనవేర్చును | నెఱవేర్చుచు |
| 304 | 11 | ల్లడపాటు | తల్లడపాటు |
| 308 | 11 | ప్రవాహ | ప్రవాహము |
| 308 | 15 | మెటిదైనను | మెట్టిదైనను |

విద్వత్కవిశేఖర మహాకవి

# శ్రీ స్వయంపాకుల వేంకటరమణశర్మ రచనలు

1. సేవ్యసేవకోపదేశము (మహాకవి క్షేమేంద్రకృతికనువాదము) (ముద్రితము)
2. 'రత్నాఞ్జలిః' (సంస్కృతకావ్యము, స్వతంత్రము) ,,
3. పతంజలి చరితము (మహాకవి రామభద్రదీక్షిత కృతికనువాదము) ,,
4. ప్రశ్నోత్తర రత్నమాల (శ్రీ శ్రీ జగద్గురు శ్రీ శంకరభగవత్పాదులకృతికనువాదము) ,,
4 శ్రీ రాజతరంగిణి (మహాకవి కల్హణుని సుప్రసిద్ధ చారిత్రక కృతిరత్నమునకు ,,
5 అనువాదము చంపూ ప్రబంధము, మొదటిభాగము (ఏడుతరంగముల కూర్పు) ,,

6. సూక్తిరత్న మహోదధి (అముద్రితము)
7. ఉపదేశ శతకము (మణిమంజూష) ,,
8. హేమలత (ఖండకావ్యము స్వతంత్రము) ,,
9. రాజ్యశ్రీ ,, ,, ,,
10 పసిడి పంట ,, ,, ,,
11 పూలగుత్తులు ,, ,, ,,

— సమాప్తము —

జవహర్ ప్రెస్, పొగతోట – నెల్లూరు.